# బుచ్చిబాబు

# సాహిత్య వ్యాసాలు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్ 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Buchibabu Sahitya Vyasalu - by Buchibabu

ప్రథమ ముద్రణ ఏప్రిల్, 1997



ముఖచిత్రం ఉమ

వెల : రు. 100-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి

ముద్రణ

# అంతరంగ మథనం

— శివరాజు సుబ్బలక్ష్మి (శ్రీమతి బుచ్చిబాబు)

మిమ్మల్ని గురించి వినాలనీ, మిమ్మల్ని గురించి ఎవరైనా, ఏమైనా వ్రాస్తారేమోననీ చూడటంతో చాలా కాలం శూన్యంలో కాలం కదలి తనతో నన్నూ దొర్లిస్తూంటే అక్కడ, అక్కడ, అప్పుడు, అప్పుడు మిమ్మల్ని గురించిన రచనలు ఆకాశంలో చుక్కల్లా కొన్ని మాటలు ఆప్యాయంగా వుంటే, వాగులోని తేటనీరులాగా నిర్మానుష్యంగావున్న గుబురు చెట్ల మధ్య సంధ్యకాంతిలాగా ఎడ్లబండిలో సంధ్యచీకటిలో వూరిపొలిమేర చేరితే కనపడీ కనపడని మసకతో దూరంగా గుడిసెల్లోని వంటచెరుకు ఇంటికి వెలుగునిస్తూ వూరిపైకి పొగని ఆకారంలేని ఆకారాల్లా ఎదురవుతుంటే – అటుచూడు ఆపొగలు పిలుస్తూన్నట్లు వున్నాయి నాకు. నీకు ఏమనిపిస్తోంది,– అంటూ గట్టిగా హో! హో! హో! అంటూ నవ్వే ఆకంఠం మూగపోయింది అంటుంది లోకం

కానీ నేను అప్పటి వరకే కాదు ఇప్పటిదాకా అవే రోజులు అవే జ్ఞాపకాలు ఆ ఊహల్లోనే జీవిస్తున్నా కాలం వయస్సుని వెక్కిరిస్తూ ఇంక విశ్రాంతి తీసుకోమనే రోజులు దగ్గరవుతున్నా ఈ శరీరం మూలిగినా అందుకు దిగులు లేదు గతంలోని మధురమైన క్షణాలు, అవే మీరు రచనలు చేస్తూ సందేహంగా నాకేసి చూస్తూ ఇక్కడ ఇది నాకు నచ్చలేదు నీకు ఏమి అనిపిస్తోందోచూడు, అంటూ చూపే ఆ ఆప్యాయత, అమాయకంగా చూసే ఆకళ్ళు చిత్రించుకున్న బొమ్మలా భద్రపరచుకున్నట్లు మనస్సులో మేలుకొని జ్ఞాపకాల పుటల్ని తెరచి చూసుకోవటం మీరులేని ఈ కాలంలో అలవరచుకున్న నేస్తం అప్పుడు మనం మెద్రాసులో ఎగ్మూర్ లో గంగురెడ్డి రోడ్డులో వుండేవాళ్లం యుద్ధం ముగిసినా, ఆ ఛాయలు ఇంకా పూర్తిగా వీడలేదు మీరు "చివరికి మిగిలే" నవల వ్రాయటం పూర్తి కాలేదు ఆరోజు పేపర్లో టి ఎస్ ఇలియట్ పుస్తకాల సెట్టు ఆరు– బాక్సులో అమర్చినట్లు ఫోటోలేశారు అది చూసి నాకుకొనుక్కోవాలనివుంది కానీ, బడ్జెట్ ఈ నెల్లో మాటపూర్తి చెయ్యకుండానే పెదిమ విరవటం పోనీ ఓ పనిచేస్తా దేవుడి హుండీనించి అప్పతీసుకుందాం, తరువాత మరికొంచెం ఎక్కువ వేస్తానని దణ్ణంపెట్టుకుంటే సరి, పిచ్చిసుబ్బులూ, దేముడికి మనం ఇవ్వటమేమిటి అంతా ఆయన ఇచ్చిందే అని నువ్వే అంటావుగా నీమాటమీద నీకే నమ్మకం లేదు కదూ అలా అనవద్దు ఆడబ్బు మాత్రం దేముడిదే ఇప్పుడు మీరు తీసుకునే వందకీ మరో పదిచేర్చి ఇవ్వాలి తెలిసిందా? సరే ఏంచేస్తాం దేవుడు కూడా వడ్డీ పెంచేశాడు అంటూ పట్టుకెళ్లిన డబ్బుతో ఆపుస్తకాలు తెచ్చుకున్నారు ఆ పుస్తకానికి కవరు వేసేందుకు పోలతీను పేపరు తెచ్చుకు కత్తిరించి కవర్లు వేసుకు చూసుకుంటూ మురిసిపోవటం మరపురాని మరో అనుభూతి ఆపుస్తకంలోని సారాంశం మన రచయితని గురించి ఇంత బాగా వ్రాశాడంటే ఆ రచయితని తనలో బ్రతికించుకు అతనిచేత చెప్పించినంత స్ఫూర్తి ఆ ఘనత ఇలియట్ కే దక్కుతుంది ఆమాటలు జానకిరామ్ గారికి చెప్పటం ఆయన కూడ

ఆ పుస్తకాలు కొన్నా వీరి అంతశ్రద్ధగా చదవలేదని జానకి రామ్‌గారే అనేవారు

1946, 47వ సంవత్సరంలోనే మామ్ వ్రాయని కథ నేనూ మీరు, మామ్ వ్రాయటం, తరవాత రస్సెల్ పైన ఓ వ్యాసం వ్రాశారు అది భారతిలో పడింది బెర్ట్రాండ్ రస్సెల్ రచనల పూర్వాపరాల పరామర్శ అన్నది అప్పుడు నిలిపివేసిన తరువాత విజయవాడలో వుండగా మరో వ్యాసంవ్రాశారు అది కూడా భారతిలో పడింది బెర్నార్డ్‌షా రచనలు వుపన్యాసాలు చదవటం వాటి ప్రభావం తనపైన ఎంత వుందో, అని ఒక వ్యాసంగా వ్రాశారు అది చదివి పాటిబండ సుందరరావుగారు వీరిని చూడటానికి పున్నమ్మతోటలోని (విజయవాడ) మేము ఉండే ఇంటికి రావటం నేను సరీగ్గా అనుకొనేభావాలని నువ్వు వ్రాశావు ఏమిటి? – అని ఆయన అంటూ సారీ, నాకు నువ్వు అని సంభోధిస్తేనే సన్నిహితంగా అనిపిస్తుంది మీకు అభ్యంతరంవుండదు అనుకుంటాననడం విని హో! హో! హో! అని మీరు గట్టిగా నవ్వటం తరువాత వాళ్ళు తరచు కలుస్తూ ఇంగ్లీషు సాహిత్యం పైనే చర్చించుకోవటం జరిగేది అప్పుడప్పుడు ఎండమూరి సత్యనారాయణగారు రావటం వీరు సోమర్‌సెట్ మామ్‌ని గురించి ఇతరులతో చెప్పేటప్పుడు విన్నమాటల్ని ఇంగ్లీషులో వూహించి తెలుగులో వ్రాస్తారన్న అపోహ కలుగుతోందంటే గట్టిగా నవ్వి, మీరు ఏమి అనుకుంటే ఏం నేను వ్రాసేటప్పుడు నా పాత్రలతో కలిసిపోవటం, వాళ్లకి వక విశిష్టత కలిగించటం, రచయితగా కథనడపడం కంటే, పాత్రలచేత నడిపించటమే నాకు నచ్చుతుంది అంతేకాదు సిద్ధాంతాలని చదివేవాళ్లపైన రుద్దకూడదు అనిపిస్తుంది

నావల్ వ్రాయటం, కథలు వ్రాయటం వ్యాసాలు వ్రాయటం, విమర్శలు వ్రాయటం వీటిలో మీకు ఎక్కువ ఇష్టం ఏది? – అన్న ప్రశ్నకి గట్టిగా నవ్వి అలా అడిగితే ఎలా చెప్పగలను అబ్బాయి వేటికి అవే అనాలి నాకు నాటకాలు రాయడంలో ఆనందం అంతే కాదు, నేను వ్రాశేవన్నీ మా సుబ్బులుచేత చదివిస్తా ఆవిడ అందులోలీనమై ఆపకుండా చదివేస్తే వాటిని చూసి నేను అనుకున్నది చెప్పేశాను అనుకుంటా పక్కన పెట్టి మళ్ళీవస్తానన్నవి చూసి నేను నవ్వుతూ నాకు ఇందులో నచ్చనిది నాకు అర్థమయింది ఎవరో ముక్కూ మొహం తెలియని ఓ అమ్మాయికి వో ఆకారం ఇచ్చి ఘనగంచూపెడుతున్నానంటావు ఆ అమ్మాయే నిజంగా నాకు సన్నిహితం అయిందనుకో ఇంక వ్రాశేందుకు ఏం మిగలదు వక రూపాన్నికాని,వక భావాన్నికానీ వూహల్లో అతి లేకుండా సన్నిహితంగా చూడకలిగిందే – వ్రాయకలిగిందే మంచి కథ అదే ప్రకృతిని వూహించి ప్రవేశించే చిత్రలేఖనం అవిరెండూ వక ఫ్రేములో చూపకలిగితే వో మంచి నవల అనిపించుకుంటుంది ఇంకవెళ్లి మంచి కాఫీ తెస్తావా? అజ్ఞాపకం అభిమానం, అమాయకత్వం నిర్మలమైన ఆ నవ్వే ఆకారందిద్దుకుని వారి రచనలలో నిరంతరం కదిలే చిత్రాలు వారిని అయితే కలర్సులో చిత్రాల్ని వెయ్యమని ప్రోత్సహించిన మొక్కపాటి క్రిష్ణమూర్తి గారిని ఆయనకినచ్చిన పెయింటింగు చూసు కుంటూ ఈ బొమ్మని ఇప్పుడు చూస్తే ఆయన ఎంత ఆనందపడేవారో నా బొమ్మల్ని ఎప్పుడైనా పుస్తకరూపంలో తేకలిగితే ఆ పుస్తకాన్ని క్రిష్ణమూర్తిగారికే అంకితమిస్తా, నీ బొమ్మలు, అచ్చు అవుతే నాకే ఇస్తానంటావు అంతేనా? అలా జరిగే ఆసంభాషణలు ఆగిపోయి మూడు పదులు గడిచినా అంతకు ముందుకాలం కూడ మరపురాదు

సరీగ్గా, అది డిసెంబరు నెల మార్గశిరమాసం 1937లో మాకు వివాహం జరిగింది అప్పుడు నాకు పన్నెండు ఏళ్ళు ఆకట్టుబాట్లువేరు అప్పటికి ఆయనకీ పెద్దవయస్సు లేకపోయినా, పెళ్ళి అయిన కొత్తలోనే సుభాసుచంద్రబోసుగారు రామచంద్రపురం వచ్చారు వీరు నన్నుతీసుకువెళ్లి పూలదండ వేయించి దణ్ణం పెట్టించటం, అలాగే క్రిష్ణశాస్త్రిగారి దగ్గరకి వాళ్లింటికి తీసుకువెళ్లి పళ్లూపువ్వులూ ఇప్పించటం, రవీంద్రనాధ్ ఠాగోరు– నలభై, నలభై వకటో – సరీగ్గా గుర్తు లేదు ఆ ట్రయినులో వస్తున్నారని తెలిసి సామర్లకోట తీసుకువెళ్లి తనుపరిచయం చేసుకుని నన్ను పరిచయం చెయ్యటం, అంతకంటే నాకు గొప్పగా తోచేది 46వ సంవత్సరంలో రమణాశ్రమానికి తీసుకు వెళ్లటం ఆ మహనీయుని సన్నిహితంగా చూపించిన ఆకాలం వేసిన ముద్రలు మరపురావు ఆ ప్రాంతంలో మహా త్ముడు మెద్రాసులో నెలరోజులు వున్నారు చేమకూర సత్యన్నారాయణగారు గాంధీగారి బొమ్మని వేశారు ఆ బొమ్మని గాంధీగారికి నాచేత ఇప్పించారు జనం ఎక్కువ మంది లేరు ఆ బొమ్మ వేలంవేస్తే మూడు వందలకి ఎవరో కొన్నారు ఆ రోజు డయాసు మీదనించి గాంధీజీ కిందకి దిగుతూ నాభుజం మీద చెయ్యి వేసుకు దిగటం, కొంత దూరం దాకా నడవటం, "చూశారా, సత్యన్నారాయణగారూ బొమ్మవేసింది మీరు ఈవిడని తీసుకువచ్చింది నేను మన ఇద్దర్నీ వదిలి ఈవిడ భుజంమ్మీద చెయ్యి వేసి నడవటం అన్యాయం కాదా" అంటూ అనవ్విన క్షణాలు మరపుకురావు

అప్పట్లో ఇప్పట్లా మనుషుల్ని డబ్బుతో విలవకట్టేవారు కాదు వాళ్ల ఘనతని మరచి సామాన్యులని కూడా అప్యాయతతో ఆదరించే మంచి మనసుగల మనుష్యులు బతికిన కాలం అది అందరి, ఆదర్శాలని మననం చేసుకున్న వక మహావృక్షం అంత విజ్ఞాని, వేదాంత మనస్తత్వం కల అమాయక చక్రవర్తినీడని పచ్చటి గడ్డిపోచలా కాలంతో ఎండిపోయిన ఈ జీవితం గతంలోని జ్ఞాపకాలకోసం ఇంకాకొంతకాలం ఈ శూన్యంలో జీవించాలన్న తపన మరోజన్మలో కలవలేవేమోనన్న భయం అందుకే శరీరానికి జబ్బు చేస్తే భరించవచ్చు మనస్సు నిర్మలంగా ఉండాలి మీనవ్వునీ, మీరు వర్ణించిన సూర్యోదయ సూర్యాస్తమ యాలనీ తలచుకుంటూ కాలంతో కలిసి పోవాలి అదే ఈ సుబ్బులు కోరిక వారు పెద్దలు అనుకునే వారికి ఇచ్చే ఆ గౌరవభావాన్ని, ఎలా గౌరవించాలో నేర్పిన అవ్యక్తిని గౌరవిస్తూ ఆరాధించటమే నా కర్తవ్యంగా అలవరచుకున్నా వీరు వ్రాసిన షేక్స్పియరు జీవిత, పరామర్శకి అకాడమీ ప్రయిజ్ ఇచ్చింది కానీ అది వారు అందుకోలేదు అందుకే బాధేసింది నిజానికి అంత అర్థమయ్యేటట్టూ, ఏదీవదిలివేయకుండా తెలుగులో వచ్చిన మొదటి పుస్తకం అది అని నా అభిప్రాయం నాతో మీలో చాలా మంది సహకరిస్తారు నిజానికి ఆయనకి ఆధ్యాత్మికంగా ఎన్నో వ్యాసాలు వ్రాయాలన్న కోరిక కోరికగానే మిగిలి పోయింది మెహర్‌బాబా, అరవిందోల రచనలు చివరలో వారికి కొన్ని మనస్సుపై ముద్ర వేస్తున్నాయి – అనేవారు ఏమైనా కొన్ని జ్ఞాపకాలని చెప్పుకునే అవకాశం కలిగించినందుకు మీకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నా "నన్ను మార్చిన పుస్తకం" సంకలనంలోనివీ, తదితర వ్యాసాలనూ ఇలా ఓ సంకలనంగా తెస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి మరీ మరీ కృతజ్ఞతలు

# వ్యాస పథం



★ ★ ★

# కథా - దాని కమామీషు

కథలు ఎల్లా వ్రాయాలో* చెప్పడం నేను కథలు ఎల్లా వ్రాస్తానో చెప్పడమే అవుతుంది. ప్రతి రచయితా తాను వ్రాసే పద్ధతిని సమర్థిస్తూ, అందులోంచి కొన్ని సూత్రాలను ప్రతిపాదించి వొక వీలునామా దిగవిడిచే ప్రమాదం వుంది. గనక, కథలు ఎల్లా వ్రాయాలో చెప్పడంకంటె, నే నెల్లా వ్రాస్తానో చెప్పటం సముచితం అనుకుంటా. అల్లా చెప్పడం వల్ల పాఠకుడు పొందే ప్రయోజనమేమిటో స్పష్టంగా చెప్పలేం. కాస్తో కూస్తో తోటి రచయితలకు ఉపకరిస్తుందేమో. కథ జోలికి పోకుండా, విమర్శతో, ఆస్వాదనతో తృప్తిపడే వారిని మినహాయిస్తే తోటి రచయితల కథానికలు శ్రద్ధగాచదివే సమకాలిక రచయితలు ఎందరున్నారో చెప్పడం కూడా కష్టమే. మొత్తం మీద, కథకుడు, ఎల్లా వ్రాయాలో తాను చెప్పడంకంటే, ఇతరులకు వొదిలెయ్యడమే మంచిదనుకుంటా.

కాదు కూడదు, "మీరు కథలు ఎల్లా వ్రాస్తారో తెలుసుకోవాలని కుతూహలపడే పాఠకులు బోలెడుమంది ఉన్నారు గనుకనే, చెప్పమని అడుగుతున్నాం" అనడంలో నిగూఢమై వున్న ముఖస్తుతికి కరిగిపోయి, అవకాశం దొరికింది కదా అనుకొని, స్వీయ గొడవతో పాఠకుణ్ణి విసిగించడం మంచి కథ వ్రాయడంకంటె ఎంతో సుళువు. మంచి కథతో కూడా పాఠకుడు విసుగుచెందే అభిరుచి వ్యాపిస్తోందన్న భయం నాలో లేకపోలేదు. ప్రతి రచయితా, తను వ్రాసే కథానికల పద్ధతిపట్ల అభిరుచి కూడా తనే సృష్టించుకోవాలేమో. అందుకైనా యీ వ్యాసం తోడ్పడితే, ఇది మరో వృథా రచన అనుకుని దిగులుపడను.

ఇంతకు ముందే మంచి కథ పట్ల పాఠకుడి అభిరుచిని గూర్చి వ్యాఖ్యానించాను. ఇక్కడ "మంచి కథ" అన్నదానికి అర్థం ఏమిటి? నేను వ్రాసే కథ అనేగా? తన రచనకి తనే విలువ కట్టడం అయింది. "నా కథలే మంచి కథలు, వీటిపట్ల ఆదరణ చూపలేకపోతే, మీ అభిరుచి [illegible] వాక్యంలో

* 'కథలు వ్రాయడం ఎల్లా?' అనే వ్యాస సంపుటి కోసం ప్రత్యేకంగా వ్రాసిన వ్యాసం యిది.

ధ్వని. లోలోన తను వ్రాసిన కథ మంచిదో కాదో, ప్రతి రచయితకీ తెలుస్తూనే వుంటుంది, నిజమే. కాని తనకి నచ్చిన కథ విడిచేసి, తను అంత బాగులేదనుకున్న కథని పాఠకులూ విమర్శకులూ, మెచ్చుకున్ననాడు, రచయిత తన అభిప్రాయం మార్చుకుని, తను అంతగా బాగులేదనుకున్న కథ ధోరణిలోనే మరికొన్ని కథలు — వ్రాసుకుపోవడమూ జరుగుతుంది చెకోవ్ కులాసాకి, వినోదం కోసం, మొదట్లో హాస్య ధోరణిలో కొన్ని కథలు వ్రాశాడు. నిజానికి వాటి రచన అతనికి తృప్తి నివ్వలేదు. కాని ఆ హాస్య ధోరణి కథలవల్ల అతనికి ఖ్యాతి గడిచింది. జనం అవి బాగున్నాయన్నారు దానిఫలితంగా, అతను ఎంత కాలమో అట్లాంటి కథలు వ్రాస్తూ గడపాల్సి వచ్చింది అందువల్ల ఏది మంచి కథో పాఠకుడి నిశ్చయానికే విడిచెయ్యడం మంచిది. తనకు నచ్చిన కథే, విమర్శకుడికి కూడా నచ్చి, అది ఎందుకు మంచిదో తేల్చే సూత్రాల ప్రస్తావన జరిగినప్పుడు, కథకుడి అభిరుచుల పట్ల ఆదరణ చూపే అవసరం వుండదు.

తన కథలను వితర్కించి, విలువ కట్టే హక్కు కథకుడు జారవిడుచుకునేస్థితి ఏర్పడినా, ఆ కథకుడికి ఇతర కథకుల రచనల్లో కొన్ని నచ్చుతాయి; అవే ఎందుకు నచ్చాలి? తనూ అలాగే వ్రాస్తున్నాడుగనక తను అల్లా వ్రాయడం సాగించాడా? ఈ విషయాన్ని విడమరచి చెప్పడం కష్టం. రచయితల రచయితని గూర్చి పాఠకుడు పట్టించుకోడు గనక అది విడిచేస్తాను.

ప్రతి వ్యక్తి జీవితంలోనూ, ఒక నవలకి తగ్గ వొస్తు వుంటుందంటారు. దీని మాట ఎల్లా వున్నా ప్రతి వ్యక్తి జీవితంలోనూ ఒక కథకి తగ్గ వొస్తువు ఉండితీరుతుందనడంలో సందేహం లేదు. రీడర్స్ డైజెస్టు పత్రికవారు, మన పత్రికలు కొన్ని "జీవితం ఇట్లాంటిది" అన్న శీర్షికను, వ్యక్తులకు జరిగిన యదార్థ సంఘటనలను నెల నెలా ప్రచురించి, వాటిల్లో బాగున్నవాటికి బహుమతులు కూడా యిస్తున్నారు. ఎల్లప్పుడూ కొనసాగే శీర్షిక ఇది. ఒక్కొక్క జీవితంలో, ఇట్లాంటి సంఘటనలు కొన్ని వందలు జరిగివుండొచ్చు. ఒక సంఘటన నాకూ తెలుసు. ఒక లావాటావిడ, సన్నటి మరొకామె ఎక్కి రిక్షాలో కొంత దూరం వెళ్ళాక, సన్నటామె దిగిపోయింది. కాస్త దూరం వెళ్ళాక, రిక్షావాడు పట్టు వదిలేశాడు, రిక్షా వెనక్కి తిరిగి, లావాటావిడ కింద పడిపోయింది గాయాలు తగల్లేదు. ఐనా జనం పోగై అల్లా రిక్షా విడిచేసినందుకు, రిక్షావాణ్ణి గదమాయించగా "ఒకర్ని లాగడంకంటె, ఇద్దర్ని లాగడం సుళువు" అన్నాడు ఈ సమాధానానికి జనం విస్తుపోయి, వాణ్ణి పోలీసులకు వొప్పగించారు వాణ్ణి కూర్చోబెట్టి విషయం విశదపరచమనగా వా డిచ్చిన వ్యాఖ్యానం ఇది. –"రిక్షాలో

ఇద్దరున్నప్పుడు, ఊగిసలాడక కదలక కూర్చుంటారు. అంచేత సులువుగా లాగేస్తాను. ఇంక, ఆ లావాటావిడ వొక్కర్తీ వుండగా, కాళ్లు వూపడం, అటూ ఇటూ జరగడంతో నా పట్టు తప్పిపోయింది."

దీనికి ముందు వెనుక కొంత అల్లి, "వాడిన పుష్పం - ఊడిన చక్రం" అన్న కథను వ్రాశాను. ఇది మంచి కథేమో నే చెప్పలేను. కాని, నేను స్వంతంగా కల్పించి, కూర్చి రచన సాగుతున్నప్పుడు ఎదురయ్యే మార్పులను స్వీకరించడమో, విడిచెయ్యడమో జరిగిన సందర్భంలోవున్న తృప్తి, సంతోషం యీ కథ రచనలో నాకు కలగలేదు. బాహ్య జగత్తులో వొస్తువు ఎంత అద్భుత మైనదైనా, అది కథకుడి అంతరంగ జగత్తులో ఆవిర్భవించే వొక కళాదృష్టితో సమన్వయం కుదిరి తనదైనప్పుడు గాని, రచయిత ఆ వొస్తువుని స్వీకరించడం మూర్ఖత్వం అనుకుంటాను. కథంతా వ్రాసి, చివరలో "ఇది నిజంగా జరిగిన వృత్తాంతం" అని వ్రాసుకున్నా, పాఠకుడి ఆనందం, తృప్తి పెరుగుతాయను కోను. కొందరు పాఠకులు యీవగించుకోవచ్చు కూడ ఆ మధ్య ఉత్తరహిందూ దేశంలో దిగ్భ్రమ గొలిపే ఉదంతం వొకటి పత్రికలో చూశాను. ఒక బ్యాంక్ ఉద్యోగి, చెక్కు అపచారంచేసి, కొంత సొమ్ము అపహరించాడుట. అది బైట పడే పరిస్థితి ఏర్పడిందిట ఆ డబ్బుని నోట్లుగా మార్చి ఆ నోట్లని చితిగా పేర్చి, నిప్పంటించి, ఆ చితిలో పడి ఆత్మహత్య చేసుకున్నాడట ఒక ఉత్తరం వ్రాశాడట. అందులో ఇల్లా వుంది. "నాకు దర్జాగా, గొప్పగా, మజాగా చని పోవాలనుంది."

నేటి సమాజంలో చాలామంది జీవితాలలో మజా, దర్జా లేకపోవడం ప్రపంచంలో అశాంతికి వొక కారణమని, సమాజాల చరిత్ర పరిశీలించిన మేధావులు చెపుతున్నారు.

కొద్దిమంది రాజకీయ వేత్తలకు, ఫిలిం తారలకు, ఆటగాండ్రకు తప్ప మిగతావారి దైనందిన జీవితాలలో "మజా" లేదు—అల్లాంటి 'మజా' ప్రకటించే అవకాశాలు ప్రభుత్వాలు కల్పించాలి ప్రజలకి అని సాంఘిక శాస్త్రజ్ఞులు మొరెట్టు కుంటున్నారు. నా కిది సమంజసమైన సిద్ధాంతంగా తోస్తోంది, బ్యాంకు గుమస్తా 'మజా' ఆత్మహత్య, సంసిద్ధంగావున్న కథా వొస్తువుతో కథ వ్రాస్తే, పాఠకుడు దాన్ని ఎంతవరకూ స్వీకరించి, హర్షిస్తాడో చెప్పలేను నమ్మడనుకుంటా. జీవితంలో ఎదుర్కొన్న యథార్థాన్ని సాహిత్యంలో ఎదుర్కొంటే హర్షించడు పాఠకుడు అతనికి కావల్సింది కళానుగుణమైన సత్యం. నగ్న సత్యం కాదు. చిత్రకారుడు మాటిస్ గీచిన వొక నగ్న స్త్రీ చిత్రాన్ని చూసి వొకామె "ఆడదల్లా

ఉంటుందా?" అని ఆక్షేపిస్తూ అడిగిందిట చిత్రకారుణ్ణి. "ఇది ఆడది కాదు, బొమ్మ" అన్నాడుట మాటిస్. నిత్య జీవితంలో సంఘటనకి, కథలో సంఘటనకి ఇట్లాంటి తేడా ఉండితీరాలని శాసించే పాఠకుణ్ణి నేను గౌరవిస్తాను.

బాహ్య జగత్తులో కొన్ని సంఘటనలు అపూర్వమైనవిగా కనబడి, ఆశ్చర్యం కలిగించొచ్చు, కాని రచయితకి, ఆ సంఘటనపట్ల సహజమైన అనురక్తి ఏర్పడితే కాని, దాని జోలికి పోకూడదు ఒక అమాయకుణ్ని నేరస్థుడిగా తీర్పు చేసి శిక్ష విధించడం, అసలు నేరస్థుణ్ని విడిచెయ్యడం; ప్రజల సొమ్ము ముట్టక, విషయంలో నిజాయతీతో వ్యవహరించే వొక ఉద్యోగి పట్ల, మిగతావారు ద్వేషం పూని, ఏవో ఇతరమైన స్వల్పస్థాయి అపవాదులువేసి హింసించడం, స్త్రీకికూడా ఆస్తిలో భాగం ఏర్పడ్డాక, చెల్లెలు అన్నపట్ల కనబరిచే వైఖరీ — దాని ఫలితంగా జరిగిన హత్యాకాండ, ఆత్మహత్యాకాండ, ఇవి సమాజంలో మనం అప్పుడప్పుడు చూస్తూన్నవే. వీటిని అరికట్టాలని, ఆదర్శజీవియైన రచయిత ఉబలాట పడొచ్చు, కథ ద్వారా ఇందుకు పూనుకోవచ్చు. ఆశయం మంచిదే. కాని అంతమాత్రంచేత కథ మంచిదనుకోకూడదు. ఈ ఉదంతాల పుట్టు పూర్వోత్తరాలు బాగా చదివి తెలుసుకోవాలి. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ క్షుణ్ణంగా చదవాలి. ఆస్తిచట్టం వల్లెవెయ్యాలి. ప్లీడర్లతోను, పోలీసు అధికార్లతోను చర్చించి, పద్ధతులు తెలుసుకోవాలి. తరవాత, వీటి చుట్టూ ఏ వొక వ్యక్తినీ, సంస్థనీ ఉద్దేశించకుండా, కథ అల్లాలి తను వొక ఆదర్శాన్ని, నైతిక విలువనీ పాఠకుడి నెత్తిన రుద్దుతున్నట్లు కనిపించకుండా రచన సాగాలి. వినోదం, కాలక్షేపం — కాస్త వికాసంతో కూడుకున్న సంతృప్తి — ఇవి సమకూర్చగల రచయిత ధన్యుడు సంఘ సంస్కారం అతని పని కాదు. వ్రాసెయ్యడంతో కార్యరంగంలో రచయిత పని పూర్తయినట్లే. 'అడవి కాచిన వెన్నెల' అన్న — కథ పదేళ్ళ క్రితం వ్రాశాను. అందులో ఒకామె చాలామార్లు ఆత్మహత్యకి ఒడిగడుతుంది, భర్తతో జీవితం ఇష్టం లేక. కథ వ్రాత ప్రతిని చూసిన ఒక మిత్రుడు ఇంటికి వెళ్ళి ఒక ఉత్తరం వ్రాశాడు. అట్లాంటి ఆమె ఒకావిడ వుందిట తన చుట్టాలలో. భర్త చేస్తున్న ఉద్యోగంకూడా అదేట. ఆ కథ అచ్చు వెయ్యక పోవడం మంచిదని వ్రాశాడు అప్పటికప్పుడే ఆ కథ ఒక భాగం పత్రిక ద్వారా ప్రచురణైంది. రెండో భాగం భర్తని అటవీశాఖలో ఉద్యోగిగా మార్పు చేశాను. అటవీశాఖ గురించిన భోగట్టా సేకరించాల్సొచ్చింది. దానికోసం పులివేట'షికార్'- చరిత్ర బోలెడు తెలుసుకోవాల్సొచ్చింది. ఎన్నో షికార్ పుస్తకాలు చదివాను — అప్పుడే జిమ్ కార్బెట్ గ్రంథాలంటే అభిరుచి ఏర్పడింది. ఆఖరుకి ఆ కథలో

నాయిక ఆత్మహత్య చేసుకున్నట్లుగా చిత్రించాను - వ్రాసిన స్నేహితుడి చుట్టా లలో ఆమె జీవించే వుంది గనక, ఆత్మహత్యని సమర్థించాలంటే కథని చాలా మార్చాల్సొచ్చింది. ఆ కథని మళ్ళా ఇప్పుడు చదవడం అంటే నాకు భయం గానే ఉంటుంది. నిజానికి బాహ్య జగత్తులో సంఘముగాని వ్యక్తులుగాని నా ఊహలో లేరు. సంసార జీవితంలో ఒత్తిడికి తట్టుకోలేక ఆత్మహత్య కొడిగట్టిన స్త్రీలు ఎందరో ఉన్నారు. ఊహలో లేనప్పుడే, ఆ కథా రచనలో ఇంత గొడవ జరిగినప్పుడు, నిజంగా వుంటే రచయిత ఎంతటి శ్రద్ధ తీసుకోవాలో వేరే చెప్ప నక్కర్లేదు.

"నిరంతరత్రయం" అన్న కథలో ప్రధాన వ్యక్తి క్షయవ్యాధికి గురవు తుంది. బి. సి. జి. డి. ఉద్యమం కొనసాగుతున్న రోజులవి క్షయవ్యాధిని గురించి చదివాను; డాక్టర్లతో ముచ్చటించాను.

ఈ రకం వైజ్ఞానిక విషయాల సమీకరణ, పాండిత్యం నవలకి అవసరం గాని కథానికకి అక్కర్లేదు - ఈయన హడావుడి చేస్తున్నాడు - అనుకోవచ్చు కొందరు. అక్కర్లేదు, నిజమే. నేను తెలుసుకున్నవాటిని ఒకటి రెండు తప్ప యీ కథలో వాడనేలేదు.

ఏమీ తెలుసుకోకుండా వ్యాధితో బాధపడినవారిని చూస్తే సరిపోవచ్చు. కాని నా కట్లా గనిపించదు ఆ వ్యాధి భోగట్టా అంతా తెలుసుకున్నాక మనసులో వస్తువుకి అనువైన మానసిక స్థితి ఏర్పడుతుంది, ఒక వాతావరణం ప్రబలుతుంది. దానికి సరిహద్దు లేర్పడతాయి. అందులోంచి ఒక తీక్షణమైన పరిశీలనా శక్తి దీక్షతో, అకళింపు చేసుకుని, ఆ చేసుకున్నదాన్ని సూటిగా, శక్తివంతంగా పాఠకుడితో పంచుకోవాలన్న ఒక కళాతృష్ణ ప్రత్యక్షమవుతాయి. "మేడంబొవారి" వ్రాసిన ఫ్లాబె చివరి ఘడియల్లో తను పుస్తకంలో పాత్రగా చిత్రించిన డాక్టర్ని తీసుకురమ్మన్నాడుట. అసలు ఈ రకం కథ వ్రాసేటప్పుడు కథకుడికి ఏదో జ్వరం వచ్చి తేరుకుంటున్నట్లయితే, ఆ రచనలో పాఠకుడిమాట ఎట్లా వున్నా, రచయిత కొంత ప్రయోజనాన్ని సాధించినవాడవుతాడు.

చాలామంది రచయితలు బాహ్య జగత్తులో తమ దృష్టిలో పడిన అపూర్వ సంఘటనలను, వ్యక్తులను, విషయాలను నోటుబుక్కులో వ్రాసుకుంటారు. కొంతకాలమయ్యాక వాటిలో కొన్నిటిని కథలుగా రూపొందిస్తారు. రష్యన్ కథకుడు చెకోవ్ అల్లా వ్రాసుకున్నవాటిల్లో కొన్ని ఉదహరిస్తాను.

"ప్రమాదం జరిగి ఒక వ్యక్తి కాలు విరిగిపోయింది. ఆ పోయిన కాలు పాదం జోడులో దాచిన నోట్లకట్టలు కనిపించనందుకు బెంగెట్టుకున్నాడు "

"ఇళ్ళ కంట్రాక్టరు వొకాయన బాగా ఆరోగ్యంగా కనపడిన ఆమెను పెళ్ళి చేసుకుంటాడు – ఆమెను 'రిపేర్' చేసేటందుకు ఖర్చుపెట్టనక్కరలేదు కదా అనుకుని "

చెకోవ్ వ్రాసిన కథలన్నీ ఇట్లా బాహ్యజగత్తులో జరిగినవాటిని ఆధారంగా తీసుకుని కూర్చినవే ఏదీ కల్పించడు. కల్పన లేకుండా మంచికథ వ్రాయచ్చు– కాని అది గొప్పకథ అవుతుందా అని నా అనుమానం. చెకోవ్ కథలలో మొదలు తుది ప్రధానంగా కనబడవు. నాకా రెండూ కావాలి. ఏదో ఒక గాలిబుడగని ఆకాశంలోకి వొదిలి చూడమంటాడు. దానికి కట్టిన దారం, దాన్ని పట్టుకున్న కుర్రాడు కనబడరు. పెద్దగాలికి అది పగిలిపోతుంది కూడ. ఆ బుడగని దారంతో కిందికిదించి పరిశీలిస్తేగాని నేను ఆ ఆట పూర్తయిందనుకోను. చెకోవ్ పద్ధతి కథ, ఇసుకమీద కెరటం దిగవిడిచిన చారలాంటిది. నాకది తృప్తి నివ్వదు. ఆ కథ, కెరటంగా కనబడాలి. ఆ కెరటం వెనక సముద్రం హోరు వినబడాలి.

నేను మొదట్లో నోటుబుక్కులో వ్రాసుకున్న కొన్ని విషయాలను కథలుగా వ్రాశాను. అవి వొస్తువువేట అవసరం లేకుండా చేసినా, వ్రాసేటప్పుడు వాటి నిజస్వరూపం పోయి, కొత్త అవతారం దాల్చేవి. వ్రాతలో ఆవేశానికి, ఉద్రేకానికి లొంగిపోవటం నాకిష్టమే అయినా, పూర్తిగా అందులో మమేకం అయి, జిజ్ఞాస పోగొట్టుకొని తందనాన్లాడటం నాకిష్టంలేదు. కథలో వ్యక్తులు ఎంతేనా ఉద్రేకం చూపొచ్చు – వస్తు వ్యాప్తికో ఎంతేనా రసం పుటకొచ్చు – కాని రచయిత నిబ్బరంగా వుండి, పైనుంచి వాటి మార్గం, చిక్కదనం, సంచలనం శాసించే అధికారం పోగొట్టుకోకూడదు.

బాహ్యజగత్తులో సంఘటనలేగాక, కొందరు వ్యక్తులు కూడా కథలని ప్రేరేపిస్తారు. ఒక్కచూపు, వొక్కమాట, కంఠంలో ధ్వని, నడిచిన విధం - వీటిల్లో ఏదన్నా ఆకర్షించి, కుతూహలాన్ని రేకెత్తించి, కథకి పురికొల్పటం చాలా మందికి అనుభవమే. ఇక్కడకూడా అట్లాంటి వ్యక్తులతో రచయితకి పరిచయం వుండకూడదు. వారిని గురించి పూర్తిగా తెలుసుకోకూడదు మానసిక శాస్త్ర పరిశోధనలని పురస్కరించుకొని కొందరు రచయితలు, తమ పాత్రల మనస్తత్వాలను పూర్తిగా పరామర్శించి, వితర్కించి, ప్రతిదీ బైటపెట్టడం ఒక ఫ్యాషన్‌గా పరిగణిస్తున్నారుగాని, ఇది పొరబాటనుకుంటాను. ఎవరూ ఎవరికి పూర్తిగా అర్థమవరు అర్థం అవకపోవడంలో, ఒక వైచిత్రివుంది. ఈ వైచిత్రిని ప్రదర్శించాలన్న లక్ష్యాన్ని రచయిత వొదులుకోకూడదు. ఒక వ్యక్తిని గురించి

పూర్తిగా మనకంతా తెలిసిపోతే, ఆ వ్యక్తిపట్ల కుతూహలం సన్నగిల్లుతుంది. జీవితంలోనూ అంతే, కళలోనూ అంతే. "దిగజారిన మాలిన్యం" "టీ" "అరకు లోయలో కూలిన శిఖరం" – ఈ కథల వెనక ఇట్లాంటి వ్యక్తి ప్రేరణవుంది– వాళ్ళని గురించి నాకేమీ తెలియని వ్యక్తుల ప్రేరణ. ఒక పెళ్ళిలో లైట్ల వెలుగులో వొకామె నీడ గోడమీద పడింది. ఆ నీడని చూస్తూ కూర్చున్నా. కాసేపయ్యాక, ఆ నీడ తాలూకు వ్యక్తిని చూద్దామని వెనక్కి తిరిగా; ఆమె అక్కడలేదు. దీని నాధారంగా "ఆమె నీడ" అన్న కథ వ్రాసాను. ఇది జరిగిన ఆరేళ్ళకి. ఈ కథలో నాయకుడు, ఆ నీడ తాలూకు వ్యక్తిని కనుక్కోవాలని బైలుదేరతాడు. చివరకి ఆమె తన భార్యే అవుతుంది

బాహ్యజగత్తులో సంఘటనలూ, వ్యక్తులూ విడిచేస్తే ఒక భావాన్ని ఆధారంగా కథలు కల్పించడం మామూలు. భావాన్ని వ్యక్తం చెయ్యడంకోసం సంఘటననీ, వ్యక్తులనీ కల్పించాలి. అవి అపూర్వం కానక్కర్లేదు; వ్యక్తులు అసాధారణులు అవనక్కర్లేదు. ఇటీవల నేను చదివిన ఒక తమిళ కథ దానికి ఉదాహరణ. ఆ దంపతులకి బోలెడు సంతానం వుంటారు. వారిని పోషించలేరు. తండ్రికి ఉద్యోగం దొరకదు. చిక్కుల్లో వుండగా, మరో బిడ్డ కలుగుతుంది. ఆ బిడ్డవల్ల తన ఇబ్బందులు ఎక్కువవుతున్నాయనుకుంటాడు. చంపేద్దామన్నంత కోపం వస్తుంది. ఇంతలో ఆ బిడ్డ సినిమా కథకి అవసరంవొస్తుంది. ఆ చిత్రంలో బిడ్డ నటించినందుకు దంపతులకు బోలెడు డబ్బు ఎడ్వాన్సుగా ఇస్తారు. చిత్రం పూర్తయ్యాక, మిగతా డబ్బుకి చెక్కు పంపుతారు. ఆ చెక్కు పుచ్చుకొని తండ్రి సంతోషంతో ఇంటికి రాగానే, ఆ బిడ్డ చనిపోతుంది. ఇది ఒక భావాన్ని వ్యక్తం చెయ్యడంకోసం అల్లిన కథ. అట్లా జరగడం అసంభవం అని కాదు, సంభవమే. అయినా దాని ప్రసక్తి ముఖ్యంకాదు. లోతుగా కెలికి చూస్తే ఆ కథ నిలబడదు అదొక సినిమాలో సెట్టులాంటిది, మనస్సుకి ఇంద్రజాలం – మనం సంతోషంగా స్వీకరించే ఒక గారడీ అయినా ఒక భావాన్ని వ్యక్తంచేసి సంతృప్తి కలిగిస్తుంది. ఇట్లాంటి కథలోకూడా రచయిత శ్రమపడి, పునాదులు కట్టుదిట్టం చేసుకోవాలంటాను దాని వెనక మనం ఎరుగున్న సమాజం, మనుషులు, పోకడలు, సంప్రదాయం వుండాలి. భావం కోసం వీటిని త్యాగం చెయ్యనక్కర్లేదేమో! ఈ ధోరణిలోనే వ్రాసిన "మూడు కోతులు" అన్నకథ అట్లాంటిది. పునాదులు మరీ కట్టుదిట్టంచేస్తే మధ్య హాల్లో వ్రేలాడదీసిన భావం కనబడక పోవచ్చును – అనొచ్చు కొందరు. నిజమే "ఇందులో ఎక్కడో, ఏదో వుంది. వెదుకుదాం పట్టండి," అని రచయిత వెనకాలే పాఠకులనుకూడా అన్వేషణకు

పంపడం ఎంతవరకూ సమంజసమో నే చెప్పలేను. నాకిష్టమైన ఒక పిట్టకథలో, ఏ భావమూ ప్రస్ఫుటంగా కనబడదు. అయినా చాలా గొప్పకథలలో ఒకటిగా దాన్ని ఎంచుతాను ఇదీ ఆ కథ ఒక ముస్లిమ్ చక్రవర్తి ప్రేయసి చనిపోతుంది. స్మారకచిహ్నంగా ఎంతో డబ్బు వ్యయంచేసి, ఎందరినో నియోగించి, ఒక పెద్ద భవనంనిర్మించి, దాని మధ్యలో ప్రేయసి అస్థికలుగల నల్లకర్ర పెట్టెని వుంచమని పురమాయిస్తాడు. అట్లాగే చేస్తారు. చక్రవర్తిని వచ్చి చూడమంటారు ఆయన నిదానంగా అన్నీ పరీక్షించి ఆహ్లాదాన్ని వెలిబుచ్చి "అంతా బాగుంది. మధ్యలో ఆ నల్లపెట్టె బాగాలేదు తీసెయ్యండి" అన్నాడట. ఇందులో భావం ఏమిటో ఇప్పటికీ నాకు స్ఫురించడంలేదు. ఏదో మాయ "మిస్టరీ" వుంది — పరమాత్మని కనుక్కోలేక మతిపోయిన యోగి పొందే అనుభూతికి స్వరూపంలేదు – దానికి కారణభూతమైన కథలో భావానికి స్వరూపంలేదు. అది వచ్చిపోతుంది — మనస్సులో ఏదో మార్పు జరిగి, నిలిచిపోతుంది, అందుకనే అది గొప్పకథ.

ఇంక రెండోరకం కథని ఆంతరంగిక జగత్తులో కథగా వ్యవహరించవచ్చు. అంతరంగ జగత్తంటే, స్వానుభవాన్ని ఇతివృత్తంగా తీసుకొని మలచిన కథ అని కాదు, నేను మొదట్లో చెప్పినట్లు, నిజంగా జరిగిన విషయం ఎంత అపూర్వమైనదైనా కొంత వడబోత, చిత్రిక జరిగితేగాని కళాజగత్తులో దానికి ప్రాముఖ్యంలేదు. ఏ ఒకరిద్దరు అసాధారణ వ్యక్తులకోతప్ప అంతటి అపూర్వమైన అనుభవం సమకూరదు. ఓ వేళ సమకూరినా దాన్ని వున్నదున్నట్లుగా చెప్పెయ్యడానికి కావల్సినంత నిజాయితీ, ధైర్యమూ ఆ వ్యక్తులకు లేకపోవచ్చు. నిజానికి ఏ రచయితా తనని గురించిన నిజాన్ని ఎదుర్కొని, స్వీకరించి, బైట పెట్టడం సంభవంకాదు కాస్తో కూస్తో దగా చేస్తాడు; తాను అల్లా చెయ్యడానికి కారణాలు వెదుకుతాడు; తన్నుతాను సమర్థించుకుంటాడు.

కొందరు స్నేహితులొచ్చి "నాకు జరిగింది చెబుతాను విను చాలా అద్భుతంలే — నువ్వు కథ వ్రాయాలి" అని మొదలుపెట్టి తమ అపూర్వ అనుభవం యాకరువు పెడతారు. స్నేహితుడుకదా మన దగ్గర దాపరికం లేకుండా యదార్థం చెప్పేస్తున్నాడు — దీన్ని మనం వాడుకుందాం అని లొంగిపోయి ఆ కథ యితివృత్తంగా అప్పుడే స్వీకరించకూడదు. కాలం జరగాలి. మనమూ, ఆ చెప్పిన స్నేహితుడూ పెరగాలి. ఆ వృత్తాంతం మనమీద వొత్తిడి చెయ్యాలి: అందులో ఒక విశేషం వుంది — కాలం, స్థలం పీటికతీతమై మానవత్వాన్ని ఋజువుచేసే లక్షణంవుంది. దానికి కళా రంగంలో స్థానం వుంది అని గట్టిగా నమ్మినప్పుడే ఆ కథకి పూనుకోవాలి. రచయిత ప్రతిదీ జాగ్రత్తగా

వినాలి, చూడాలి, తెలుసుకోవాలి – కాని ఉద్రేకంతో దానికి లొంగిపోకూడదు. ఆ విషయాన్ని మనస్సులో ఒక మూలపడేసి వుంచాలి. ఎప్పుడో దాని అవసరం రావొచ్చు. అదొక మంచికథ అవొచ్చు. బాగా చిన్నప్పుడు ఒకమ్మాయి "నన్ను గురించి కథ వ్రాయవూ?" అని అడిగింది. తర్వాత ఆ అమ్మాయి ఏమైందీ నే నెరగను పదిహేను సంవత్సరాల తర్వాత ఆ ప్రశ్న ఒక కథకి పేరు, వస్తువుకూడా అయింది.

ఒక స్నేహితుడితో పట్టిన పంతం ఫలితం ఆ కథ. ప్రేమ అన్నపదం వాడకుండా ప్రేమ కథ వ్రాయాలి. అందులో వ్యక్తులు సాధారణ మనుషులు అవాలి. ఏమీ జరక్కూడదు: వీటిని ఆధారంగా కథ వ్రాయగలవా? ఆ కథలో నాయిక చాలా సామాన్యమైన ఇల్లాలు. పెండ్లవుతుంది, సంతానం కలుగుతుంది, పెద్దదవుతుంది. వ్యాధికి గురై చనిపోతుంది. కథ చెప్పే వ్యక్తి "ఆమె చాలా సాధారణమైన మనిషే" అంటూ వుంటాడు పదే పదే అతను సామాన్యమైన వ్యక్తులను గురించి పట్టించుకోడు. వ్యాధిగ్రస్తురాలై హాస్పిటల్లో వుండగా చూడ్డానికి వెడతాడు.

"ఇంతటి జబ్బు చేసిందని నాకు చెప్పలేదేం?" అంటాడు. ఇది మామూలు జబ్బే అంటుంది. దుప్పటిపైన వున్న ఆమె చేతిని సానుభూతితో తాకబోతాడు. చెయ్యి లాగేసి దుప్పటిలో పెట్టుకుంటుంది. ఇది తప్ప ఇంకేమీ జరగదు ఆ కథలో.

"నువ్వు నా కోసం పెండ్లి చేసుకోలేదు, అవునా?" అని కన్ను మూస్తుంది.

మూడు నిబంధనలతో కథ నడిపినా, కథ చివరి కొచ్చాక ఒక భావం స్ఫురించడం, ఆ కథని చించివేసి, తిరిగి మరొక కథ వ్రాయడం జరిగింది. ఆ రెండవ యత్నం ఫలితమే "నన్ను గురించి కథ వ్రాయవూ?" అన్న కథ. చాలా మంది పాఠకులు ఇది మంచి కథ అన్నారు. కథ అంతమైన తర్వాత నాలుగైదు వాక్యాలు వ్యాఖ్యానంగా యివ్వబడ్డాయి. కొందరు ఇది అనవసరం, తీసెయ్యాలి అన్నారు. నే నెక్కువగా గౌరవించే ఒక విమర్శకుడు, అవి వుండి తీరాలన్నాడు. ఇతివృత్తం ఊహలో కొంత కాలం తిప్పుకుంటే గాని, కథకి స్వరూపం ఏర్పడదు. ఆ స్వరూపమే స్థిరమైందని వ్రాసేసి వూరుకోకూడదు. వస్తువు స్వీకరించడం, ఊహలో వ్యక్తుల రూపకల్పన చెయ్యడం ఒకెత్తూ, వ్రాసేటప్పుడు కళానుగుణమైన ఆవేశానికి లొంగిపోయి కళానుగుణమైన సత్యాన్ని ప్రదర్శించడం ఒకెత్తూ. ఆ సత్యం కథకుణ్ణి చకితుణ్ణి చేస్తుంది. తనలోపల చీకటి తెరలు తొలగి నట్లవుతుంది. ఒక్కక్షణం వూపిరి బిగపెట్టి ఒక వెలుగును చూస్తాడు. ఆ క్షణం

ఆధ్యాత్మికానుభూతి పొందుతాడు. అట్లా పొంది, అందులో కాస్తోకూస్తో పాఠకుడితో వంచుకోగలిగితే అతని కథ గొప్ప కథ అవుతుందనుకుంటాను.

చదువు పూర్తి చేశాక, ఏడెనిమిది సంవత్సరాల వరకూ నన్ను కలుసుకున్నవారిలో చాలామంది, రెండు ప్రశ్నలు అడుగుతూ వొచ్చారు. "ఇప్పుడేం చేస్తున్నావు?" "మీకేమిస్తాను?" అని. ఈ ప్రశ్నల నాధారంగా "దేశం నాకిచ్చిన సందేశం" అన్న కథ ఐదారేళ్ళ తర్వాత వ్రాశాను అందులో ఒకడు ఈప్రశ్నలకు తట్టుకోలేక మనుషులు ఆరాధించే విలువలపట్ల విముఖ చెంది, ఆత్మశాంతికోసం ఆశ్రమం చేరతాడు దానిని నిర్వహిస్తున్న స్వామీజీకూడ ఆ ప్రశ్న వెయ్యడంతో కథ ముగుస్తుంది. అంతరంగిక జగత్తులో అనుభవం కథకి ఎంతవరకూ వుపకరిస్తుందో సూచించడం కోసం యీ రెండూ ఉదహరించాను. వీటిల్లో గాఢమైన, వ్యక్తిగతమైన అనుభవం లేదు. బాహ్య జగత్తులోని విషయాలు అంతరంగంలోకి ప్రవేశించి, వొక్క మూల నక్కివుండి, ఎప్పుడో ఒకసారి బైటపెట్టమని ఒత్తిడి జరిగినప్పుడే అవి కథగా అవతరిస్తాయన్నమాట. ఏ రకం విషయాలు అట్లా అంతరంగంలో ప్రవేశించేదీ రచయిత సంస్కారంబట్టీ, ఊహా వైశాల్యం బట్టీ నిర్ణీతమవుతుంది అట్లా ఒత్తిడిచేసే వాటిని గురించే రచయిత వ్రాయాలి గాని, తనలో తృష్ణని రేకెత్తించని విషయాల జోలికి పోనక్కరలేదు. థామస్ హార్డీ మంచి కథకుడు. ఆయనకి ధనికుల జీవితం గురించి వ్రాయాలని సరదా. కాని దాన్ని గురించి ఆయనకేమీ తెలియదు. ఆ సరదా తీర్చుకోడంకోసం, వ్రాసిన కథలేవీ బాగుండలేదు. వ్రాసే ప్రతి విషయం గురించీ రచయితకి ప్రత్యక్షానుభవం వుండితీరాలనడంలేదు నేను. హత్య చేసినవాడి మనస్సు చిత్రించడానికి, రచయిత హత్య చెయ్యనక్కర్లేదు తన స్వానుభవానికి అందుబాటులో వున్న, వొస్తువుని తీసుకోవాలంటున్నాను. సంస్కృతి, బాల్యజీవితం, స్నేహితులు, గృహ జీవితం, సాంఘిక అభిరుచిని నిర్ణయిస్తాయి ఈ అభిరుచిపైన స్వానుభవం ముద్ర పడుతుంది ఆ ముద్రని అనుసరించి వున్న బాహ్య జగత్తు సంఘటనని అంతరంగంలోకి లాక్కుపోయి, ఊహాలో తిప్పుతూండడం ముఖ్యం. కాలం గడిచాక, దానిలో ప్రయోజనం వున్నట్లయితే, అదెల్లానూ కథగా బైటపడుతుంది.

అనుభవాల సంఖ్య ముఖ్యం కాదు. అనుభవం తీవ్రత, వొత్తిడి, పదును-ఇవి ముఖ్యం తాను ఎన్నెన్నో కొత్త రకం కథలు వ్రాస్తున్నాను అనుకున్నా, ప్రతి కథకుడి ధోరణులలోనూ, ఏవో రెండు మూడు రీతులే కనబడుతూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు ఒక రకం కథలు పాఠకులకు ఎక్కువగా

రుచిస్తున్నవనుకుని, ఆ రకం కథలు వ్రాయడానికి పూనుకుంటే, ఆ కథకుడిలో నిజాయితీ లోపించిందన్న మాటే.

కళాకారులను గురించిన కథలు కొంతకాలం, జానపదులను గురించిన కథలు కొంతకాలం, కార్మికులను గురించిన కథలు కొంతకాలం, ఫిలింరంగం, కళాశాల, నేరస్థులు, సంస్కర్తలు - వీటిని గురించిన కథలు కొంతకాలం ఈ ఈ విధంగా ప్రజల అభిరుచులు మారుతూంటాయి కాబట్టి తాను వ్రాసే సమయంలో, ఏ వాస్తువు ఎక్కువగా చలామణీ అవుతుందో దాన్ని గురించి వ్రాయడం పొరపాటు. తన అంతరంగం ఏమిటో తెలుసుకొని, దానికి అవధులు ఏర్పరుచుకుని, అందులోనే సంచరించడం మంచిది. అవి దాటి కొత్త వస్తువుని చేబట్టి విజయం సాధించినా అదేదో ప్రమాదంవల్ల జరిగిందిగాని, ఆశయంవల్ల కాదని స్పష్టమవుతుంది సోమర్ సెట్ మామ్ ఇట్లాంటి విజయం ఒకటి, రెండు కథలలో సాధించాడు. ఆయన కథలన్నీ, తన అంతరంగ జగత్తులో నిర్మాణమైనవిగా తోస్తాయి. ప్రపంచం అంతా తిరిగి బోలెడు వస్తువు సేకరించినా. దాన్ని తన దృక్పథం ద్వారా చిత్రికపట్టి. తన జీవిత తత్వాన్ని ఋజువుచేసేంత కృత్రిమంగా కల్పన చేస్తాడు కథలో. ఆ కథలలో పాత్రలు, వారికి సహజమైన ప్రకృతిలో పెరగవు అడ్డంగొట్టి ఏ సిద్ధాంతాన్నో, నైతిక విలువనో ఋజువు చేసేందుకు, వారిని సాగేసి, కొత్త దోవలో పొమ్మంటాడాయన. ఆ కథలలో ఆదర్శ జీవులు, ఆదర్శ తత్వం కనబడవు. ఈ ధోరణికి విరుద్ధంగా నడిచిన కథ "వెర్జర్," అనేది. ఒక పూజారి వుంటాడు అతనికి చదువు రాదు; వ్రాయడం రాదు. సంతకం పెట్టలేడు. రోజులు మారి, ఆ ఉద్యోగం చేసేవారు వ్రాత నేర్చినవారై వుండాలన్న వొక నిబంధన రావడంవల్ల అతని ఉద్యోగం పోతుంది. అతను వేరే చిన్న వ్యాపారం పెట్టుకొని కొద్ది కాలంలో చాలా ధనం ఆర్జించి, సంఘంలో ప్రముఖుడవుతాడు అతని బ్యాంక్ వ్యవహారాలు చూడ్డానికి, ప్లీడరిని నియోగిస్తాడు. "వ్రాయడం రాకుండానే ఇంతటి మహావ్యక్తి అయ్యారు. వచ్చివుంటే మీరేమైవుందురో!" అంటాడు ప్లీడరు. "ఆ ప్రశ్నకి తప్పకుండా సమాధానం చెప్పగలను, పూజారిగా వుండివుందును" అంటాడు.

మామ్ చాలా కథలు వ్రాసినా రెండు మూడింటినే విమర్శకులు గొప్ప కథలుగా పేర్కొంటున్నారు. ఊహాబలం, కవితాశక్తి, జీవితంపట్ల వుండవల్సిన గౌరవ భావం, మామ్ కథలలో లోపించడంవల్లనే, అవి అంత సంతృప్తికరంగా వుండవు. రచనా విధానంలో గొప్ప శిల్పం వుంది. అది వేరే విషయం. అందరూ ఆ కథ లన్నింటినీ చదువుతారు. పెదవి చప్పరిస్తారు.

నిజాయితీతోపాటు, కథకుడిలో జీవితంపట్ల గౌరవం, కాస్తంత అమాయకత్వం కూడా వుండాలనుకుంటా డి. హెచ్. లారెన్సులో ఆ గౌరవ భావం లేదు. శరత్‌లో వుంది ఈ గౌరవ భావం, అంతరంగంలో వుంటుంది. సమాజంలో రచయితకి ఒక పరిస్థితిలో అన్యాయం జరుగుతుంది. కొన్ని ఇబ్బందులు ఏర్పడతాయి. అతన్ని కష్టపెడతాయి. అతని కష్టాలకి కారణాలైన వాటిని ద్వేషించకపోవడమే జీవితం పట్ల "గౌరవం" అంటే, ఇతను బీదవాడైతే, భాగ్యవంతుడు తన కూతుర్నిచ్చి వివాహం చెయ్యడు. ఆ పరిస్థితిలో ఇతనికి భాగ్యవంతులపట్ల ద్వేషం ఏర్పడకపోవడం అన్నమాట, దురాచారాన్ని, మూఢవిశ్వాసాన్ని ఎదుర్కోవచ్చు నిర్మూలింప ప్రయత్నించవచ్చు — కాని వాటికి కారకులైన వ్యక్తులను గౌరవించి, ప్రేమించగలగడం అన్నమాట — ఆ రకం సానుభూతి రచయితకి చాలా అవసరం అది లేనప్పుడూ, బాహ్య జగత్తులో వస్తువులకి, వ్యక్తులకి, తన అంతరంగ జగత్తులో స్థానం దొరకదు. ప్రపంచ పోటీలో బహుమతి పొందిన పద్మరాజు "గాలివాన" కథలో ఇతివృత్తం చూడండి. గాలివానవల్ల పద్మరాజు కాపురం వుంటున్న ఇల్లు కూలింది. అతని భార్యకి తీవ్రమైన గాయాలు తగిలాయి. చాలాకాలం హాస్పిటల్‌లో చికిత్స పొందింది. ఆ రోజుల్లో అతను చాలా కష్టపడ్డాడు. తట్టుకున్నాడు. తమాయించుకున్నాడు. ఆ అనుభవాన్ని జీవితంలో ఒక భాగంగా స్వీకరించాడు ఆ సానుభూతి ఫలించి, కొద్ది రోజులలో "గాలివాన" కథగా అవతరించింది. అందులో ఇతివృత్తం ఇది కాదు నిజమే. కాని ఆ సానుభూతితో కూడుకున్న అనుభవం నుండే యీ కథ జనించింది అనుకుంటాను.

ఇంక, ఇతర కథకుల ప్రభావం గురించి; రెండుమార్లు పరీక్ష ఫేలయ్యి ఇంట్లో వుండడంవల్ల, "భారతి" పత్రికలో పాత కథలు చదివే అవకాశం కలిగింది నాకు. ఆ రోజుల్లో మునిమాణిక్యం నరశింహారావు, చలం, కొన్నాళ్ళ తర్వాత కుటుంబరావు, భమిడిపాటి కామేశ్వరరావు వీరి కథలు చదివాను. ఆ సమయంలో రాగూర్, హార్డీ రచనలు కూడా చదివే అవకాశం చిక్కింది. ఈ రచయితలంటే నాకు చాలా ఇష్టం నన్ను ఆనాడు ఎక్కువగా ఆకర్షించింది, వీరిలో ఒక "అమాయకత్వం". అది ఎట్లాంటిది అంటే, ఇప్పుడు పరామర్శించలేను. నా బాల్యానికి సంబంధించిన అమాయకత్వంతో ముడిపడి వుందేమో తెలవదు. "బాల్యంలోని అనుభవాలని కావల్సినప్పుడు స్మరించగలగడమే ప్రతిభ" అన్నారు బాడిలేర్. మన శాస్త్రజ్ఞులు కూడా యీ సిద్ధాంతాన్ని బలపరుస్తున్నారు. వీరు కల్పించిన జగత్తులో కృత్రిమం, దగా, మోసం లేవు. చెయ్యి పట్టుకుని,

ముళ్ళ మీద కాళ్ళు వెయ్యకుండా, తమతో తమ ప్రపంచంలోకి తీసుకెడతారు. వారి అంతరంగ ప్రపంచం నాకిష్టం. కుటుంబరావుది తెలివైనవాడి అమాయకత్వం వీరి "నీకేం కావాలి" అన్న కథ ద్వారా ప్రేమికుల ఇబ్బందులెట్లాంటివో తెలుసుకున్నాను. ఆ ఇబ్బందుల ప్రశంస మార్క్సు సిద్ధాంతాల ద్వారా తర్వాత తెలుసుకున్నాను. ఈయనతో మనం నిర్భయంగా వెళ్ళొచ్చు, ఈయనకి చాలా తెలుసు, నన్ను మోసం చెయ్యడు అనుకునే వాడిని. నా తోటి వాళ్ళు ఆరోజుల్లో చలం పుస్తకాలు దిండ్ల కింద దాచుకొని రహస్యంగా చదివేవారు; నేనల్లా భయపడేవాడిని కాను.

నాకు ఆయన పాత్రలతో నిమిత్తం వుండేది కాదు. వారు తిరిగే స్థలాలు, పొలాలు, బయళ్ళు, చెరువులు, చూసిన సంధ్యలు, గడిపిన వెన్నెల రాత్రుళ్ళు— ఇవన్నీ కావాలి నాకు. వాళ్ళు భోజనం చేస్తారో, లేదో నాకు తెలియదు, అక్కర లేదు కూడా.

ఈ రచయిత ప్రభావం, ఫలితంగా, నాలో ఒక అభిప్రాయం ఏర్పడింది. కథలో హాస్యం, విషాదం, శృంగారం, కొంటెతనం, పరమార్థ చింతన, కోపం, అమాయకత్వం, వర్ణణ, ఛలోక్తి, జీవితాన్ని గురించి నిర్వచనాలు చెయ్యడం, వ్యక్తిత్వ ప్రకర్ష — శైలి, కవిత, ఏడుపు, నవ్వు, ప్రకృతి, మనుషులు — ఇవన్నీ కథలో వుండాలన్న అభిప్రాయం ఇట్లాంటి ప్రభావం మంచిదో, చెడ్డదో పాఠకుడికే విడిచేస్తున్నా - కాని, ఆ ప్రభావాన్ని సంతోషంతో స్వీకరిస్తాను.

ఇంక శైలి, శిల్పం గురించి; ఒకరిద్దర్ని మినహాయిస్తే యీనాడు కథలు, నవలలు వ్రాసేవారందర్నీ గురించీ ఒక రకం అభిప్రాయం, విమర్శ ప్రచారం అవుతున్నాయి. వీరి రచనంతా ఇంగ్లీషు ధోరణిలో సాగుతుందనీ, వీరందరిపైనా ఆంగ్ల రచయితల ప్రభావం పడిందనీ — వీరి ఆలోచన, పద్ధతీ, రీతి అంతా పాశ్చాత్యుల ధోరణిలో వుంటుందనీ, ఇది మంచిది కాదనీ, దీన్ని అరికట్టాలనీ అప్పుడప్పుడు పెద్దలు విమర్శించి మందలిస్తూ వుంటారు. ఇల్లా విమర్శించే వారందరిపైనకూడా ఆంగ్ల సాహిత్య ప్రభావం పడిందనొచ్చు; ఇది విడిచేద్దాం. ఒకప్పుడు సంస్కృతానికున్న ప్రభావం ఈనాడు ఇంగ్లీషుకుంది. ఈ సంప్రదాయం మన జాతి జీవనానికి చాలా దూరంగనక హర్షించదగింది కాదు అని వీరి వాదం. అందులో నిమగ్నమైన ప్రధాన సూత్రాన్ని ఆమోదిస్తాను ఇతర దేశాల సాహిత్యం ఎంత గొప్పదైనా, మన నాగరికతని, సంస్కృతిని మనకి నచ్చేటట్లుగా పరామర్శించలేదు అనువాదం ఎంత శ్రద్ధగా చేసినా తృప్తికరంగా వుండదు. పై ప్రాంతాల కథలలో ఇతివృత్తాన్ని దొంగిలించి తన స్వంతం

చేసుకున్న రచయిత, ఏ ఆనందమూ పొందలేదు. మనిషికి భాష ప్రాణంతో సమానం. మతం మార్చుకోవచ్చు, రాజకీయాలు మార్చుకోవచ్చు, వేషధారణ మార్చుకోవచ్చు ఏదన్నా చెయ్యొచ్చు - కాని మాతృభాషని మార్చుకోలేదు. ఆరంభంలో కొన్ని రచనలు నేను ఇంగ్లీషులో చేసినా, నా కవి తృప్తినివ్వలేదు. వాటిల్లో నా వ్యక్తిత్వం లేదు. వాటిద్వారా నాకూ పాఠకులకి బాంధవ్యం ఏర్పడదు. నా కా భాషపై వున్న అధికారాన్ని ప్రకటించి, వొక దర్పం చూపడానికి తప్ప, నా అంతరంగ జగత్తులో ఆ రచన పట్ల ఆపేక్ష లేదు.

కథ, నవల పాశ్చాత్య ప్రక్రియలంటే, నా మీద విరుచుకు పడతారేమో! "నీకు తెలీదు పూర్వం 17వ శతాబ్దిలో అదుంది, 19వ శతాబ్దిలో ఇది వుంది" అని ఏవో నవలలు, కథలు ఉదహరిస్తే ఆ పాండిత్య ప్రకర్ష కింద అణగారి పోతాను. తెనుగులో వచనం వున్నట్లు కనబడదు గద్యరచన అనేది సాహిత్యంలో ఒక విభాగంగా ఇదివరలో ఉందనుకోను. భారతంలోనూ, భాగవతంలోనూ అక్కడక్కడా పద్యానికి పద్యానికి మధ్య తెగిపోయిన వంతెనలాగా గద్యభాగాలున్నాయి.

గీర్వాణ వాఙ్మయంలో ఎట్లాంటి వచనం వుందో నే నెరగను వచన రచన సాగించి పేరు పడ్డవారు వీరేశలింగం, చిలకమర్తి, గురజాడ. పానుగంటి వీరందరిపైనా ఇంగ్లీషు ప్రభావం వుంది గనకనే ఆ విధమైన వచన రచన సాగించారు ఇంగ్లీషు సంపర్కం లేని కొందరు పెద్దలు వారి రచనలు, చర్యలనూ, విమర్శిస్తూ వొచ్చినా ఇంగ్లీషు చదువు చదివి, ఆ సాహిత్యంతో పరిచయం వున్నవారు, పెద్దలైనాక, ఈ రచయితల కృషిని హర్షిస్తూ ప్రచారం లోకి తెచ్చారు. ఆంగ్ల సాహిత్యంలో పరిచయం లేకపోతే వారావిధంగా వచన రీతులలో కృషి చేసి వుండరు. ప్రముఖ వ్యక్తులుగా పరిగణింపబడి వుండరు. ఇప్పటికి వీరిలో ఎవరో వొకర్ని యుగకర్త ఎన్నికలలో అభ్యర్థిగా నిలబెడుతూనే వున్నాము పానుగంటి వారి జోలికి పోవడంలేదు - వారి రచనలు చదవక, "డిపాజిట్" పోతుందనా? రచయితలూ, పాఠకులూ ఆంగ్ల సాహిత్య ప్రభావానికి గురైనప్పుడు వొ:రు చెప్పేది వొకరికి అర్థం కావాలంటే ఆ రకం వచనంలో వ్రాయడం తప్పదనుకుంటాను. గాంధిగారిపైన థోరో, రస్కిన్, టాల్‌స్టాయిల ప్రభావం వుంది. వారి రచనలన్నీ ఇంగ్లీషువారి ధోరణిలో వున్నవని చదవడం మానుకోలేదుగా. "చెప్పదల్చుకున్న విషయం వున్నవాడు శైలిని గురించి పట్టించుకోడు" అన్న ఒక అభిప్రాయం ఉంది. నేను పూర్తిగా అంగీకరించను. కేవలం ఒక యజ్ఞంగా శైలిని గురించి పట్టించుకోనక్కరలేదు నిజమే. కాని శైలంటూ ఒకటుంది - రచయిత వ్యక్తిత్వం అంటూ ఒకటుంది. విషయం

చెప్పడంలో కూడా మెళకువలు, చమత్కృతి, వయ్యారం, నాజూకు శక్తి వున్నాయి. పాఠకుణ్ణి తన వైపుకు లాక్కుని లొంగదీసుకొని రచయిత అంతరంగ జగత్తులోకి ప్రవేశింప చెయ్యడం శైలి లక్ష్యం. ఆ నడక, ఆ ధోరణి, ఆ పోకడ పాఠకుడికి నచ్చితే అసలు ఆ అంతరంగ జగత్తులోంచి పొమ్మన్నా పోడు. ఇంత శ్రమపడి అక్కడికెళ్ళి చూస్తే పాఠకుడికి ఏమీ కనబడక పోవచ్చు. అప్పుడు పెదవి చప్పరించి- "ఏదో వచ్చాం, మరొకసారి రాకూడదురా బాబూ" అనుకుంటాడు పాఠకుడు. గై డిమపాసా అనే ఫ్రెంచి కథకుడిలో యీ మాదిరి ఆర్భాటం - శిల్ప గారడీలు, బాణాసంచా ప్రేల్పుడు వుంటాయంటారు విమర్శకులు. అంటే వస్తువుకి మించిన ఆర్భాటం హడావుడి కల్పించి నాటకీయతని ప్రేరేపించడం అన్న మాట అందువల్లనే గై డిమపాసా కొన్ని మంచి కథలు వ్రాసినా గొప్ప రచయితగా అతనితో మనకి పొత్తు కుదరదేమో. శైలి శిల్పం వీటిని గురించి పట్టించుకోని అమెరికన్ కథకుడు ఓ హెన్రీ. ఈయన చాలా కథలు వ్రాశాడు. ఇంచుమించు అన్నీ మంచి కథలే ఏ ఒక్క కథకుడూ ఆయన వ్రాసినన్ని మంచి కథలు వ్రాశాడనుకోను కథ చెప్పివేస్తాడు -తలంటు పోసి, కొత్త బట్టలు కట్టడం, పేరంటానికి పంపడం, ఏవో వాయినాలు ఇప్పించడం వారికోసం కొత్త రోడ్డు వేయించడం - ఇవేమీ వుండవు ఆయన కథల్లో. అందుచేతనే అన్ని మంచి కథలు వ్రాసినా రావలసినంత ఖ్యాతి ఆయనకు రాలేదనుకుంటా. కథ ఒకసారి చదివి ఆ క్షణం ఒక గొప్ప అనుభూతి పొందుతాం కాని మళ్ళా మళ్ళా ఆ కథ చదవాలనిపించదు

మళ్ళా మళ్ళా చదివించే ఖండ కావ్యంలా కొనసాగాలంటాను కథానిక. పూర్వ కవులూ పాశ్చాత్య కవులు కూడా కథలు కావ్యాలుగా వ్రాసేవారు ఆ సంప్రదాయం ఇప్పటికీ వుంది. ఎటొచ్చి సమకాలీక సామాజిక జీవితాన్ని ఇతి వృత్తంగా తీసుకోరు యీ కావ్యాలలో. మనం రోజూ ఎరుగున్న వ్యక్తుల్ని మనం గౌరవించం, గమనించం; మనమధ్య ఒక ప్రతిభావంతుడున్నా వాడి బుష్‌కోటు, కండ్లజోడు చూశాక వాడిని నాయకుడుగా కావ్యంలో రూపొందించడానికి మనస్సు పీకదు. ఈ మనుషుల్ని మనం రోజూ ఎరుగుదుం. వాళ్ళలో లోపాలు, దోషాలు చెప్పుకోడంతో వారితో చెలిమి అంతమైంది ఊహాలోకంలోకి లాక్కుపోయేటందుకు ఏమీ మిగలదు. అందుకే ఈ పెద్దలంతా కావ్య వస్తువుని కల్పించడం చరిత్రలోనూ, పురాణాల్లోనూ వున్న వ్యక్తుల చుట్టూ కథలు అల్లడం జరిగింది. వారి పాత్రలు దైవాంశ సంభూతులు, చక్రవర్తులు, రాణులు, గంధర్వులు, ఇంద్రలోక వాసులు - మనలో ఎవ్వరూ నోరెత్తడానికి లేదు.

మనుచరిత్రలో కథకి మరో పేరెట్టి లక్ష్మయ్య మేరీలాంటి పేర్లు పెట్టి-వచనంగా వ్యవహారిక భాషలో వ్రాస్తే, ఏ ఫ్రెంచి, గ్రీకు సాహిత్యంలోంచో కొట్టేశా నంటారు విమర్శకులు. దాన్నిండా విలియమ్ మారిన్, వర్డ్సువర్తు, జార్జి మెరిడిత్ రచనలలో వర్ణనలుంటాయి.

కథలో ఇతివృత్తానికి అనువైన శైలిని అలవరచుకోవాలి కథకుడు. కృషిచేసి దాన్ని సాధించాలి. అల్లా ఏర్పడ్డ శైలి, రచయిత వ్యక్తిత్వంపైన ఆధారపడుతుంది. అతను చదివిన రచయితల శైలిపైనకూడా కొంతవరకూ ఆధారపడుతుంది. అతని వెనకవున్న సమాజం, నాగరికత, వాటిశైలి, ప్రతి ధ్వనులు వినబడుతుంటాయి. నాకు రెండు కావాలి. నేను చెప్పేది నాకు నచ్చాలి—అందంగా, శక్తివంతంగా స్పష్టంగా కనబడాలి ఈ అందాన్నీ, శక్తినీ, స్పష్టతనీ పాఠకుడు పంచుకోవాలి. ఆ అనుభూతి పొందడంకోసం, తిరిగి ఆ కథను చదివేటట్లు చెయ్యాలి. డికెన్స్ వ్రాసిన "పిక్‌విక్ పేపర్స్" అనే గ్రంథాన్ని ప్రతి సంవత్సరం వొక్కసారేనా చదివితేకాని నాకు గడిచిందికాదు-" అన్నా రొకసారి, బళ్ళారి రాఘవాచారిగారు. కేవలం కథ కోసమే దాన్ని చదివేవారా ఆయన? అందులో ఏదో వుంది — రచయిత వ్యక్తిత్వమో, శైలో. అంతమాత్రం చేత కొట్టొచ్చేటట్లుండగూడదు శైలి. అది వస్తువులో కలిసిపోయి, విడదీయ డానికి వీల్లేకుండా అల్లిక జరగాలి. "ఆయన చాలా గడుసువాడుస్మండీ" అని నలుగురు పైకి చెప్పుకుంటే ఆయన గడుసువాడేకాడు. మొదట్లో వొకటి రెండు తప్పటడుగులు వేశాను యీ శైలి విషయంలో. "నన్ను గురించి కథ వ్రాయవూ," అనే కథలో యీ వాక్యం వ్రాశాను. "కొన్ని ఉపమానాలు మన సాంప్రదాయానికి విరుద్ధమని జంకుతున్నాగాని లేకపోతే ఆమె శరీరాన్ని గుర్రం పిల్ల కదలికలోని లావణ్యంతో పోల్చొచ్చు. . ...గుర్రంపిల్ల అలిగిననాడు చేసిన నాట్యంతో."

ఐదారేళ్ళ తర్వాత ఈ గుర్రంపిల్ల ఉపమానం వాల్మీకి రామాయణంలో చూశాను. మరొకచోట "ఆమె వల్చటి మనిషి — గడ్డిలో కూర్చునిలేస్తే, వొంగిన గడ్డి త్వరితంగా పైకి లేచి నిలబడుతుంది" ఇది ఎవరో పాశ్చాత్య రచయిత నుండి కొట్టేసిందికాదు, చిత్రం, ఇదీ వుంది వాల్మీకి రామాయణంలో.

పౌర్ణమి వెళ్ళిన నాలుగోరాత్రి చందమామని, "ఎద్దుకొమ్ముల మధ్యనుండి కనబడే మోపు" అని వర్ణిద్దామనుకుని, వాల్మీకి రామాయణంలో వుందని తెలుసు కొని, అది విడిచేసి "క్రాపింగ్ చేసుకున్నవాడిలాగున్నాడు చంద్రుడు" అని వ్రాయాల్సొచ్చింది యిటీవల నే వ్రాసిన ఒక కథలో,

కథకుడిపై ఇతర రచయితల ప్రభావం పడడం తన శక్తిసామర్థ్యాలూ, లోటుపాట్లు తెలుసుకోనంతవరకే. తెలుసుకున్నాక ఏ ప్రభావానికీ లొంగడు.

ఇంక వాక్యాల నిర్మాణం, పారాగ్రాఫ్‌ల విభజన, కథా ప్రారంభం. ఎక్కడ సంభాషణ కావాలి, ఎంతవరకూ వర్ణన? - శిల్పానికి సంబంధించిన యీ విషయాలను గురించి కచ్చితంగా చెప్పలేను కథకి ఒక వాతావరణం – గాలి, వెలుగు, నీడలు – కల్పించడానికి యత్నిస్తాను. అందులో వ్యక్తులు ఇద్దరైనా, ఒక్కరైనా వారివెనక ఒక సమాజం, సంప్రదాయం, నాగరికత వున్నాయన్న ధ్వని - ఒక నాదం, హోరు-కథ వెనక శైలిద్వారా శ్రుతిలా మోగుతూ వుండాలి.

ఒడ్డున పడిన నత్తగుల్లని చెవిదగ్గర పెట్టి వింటే, సముద్రం హోరు వినబడుతుందంటారు పర్ద్నువర్తు. కథా ప్రారంభంతో యీ లయ, నాదం పాఠకుడికి వ్యక్తమవాలి. కథ కొనసాగాలి - అందులో కాస్త హాస్యం, వినోదం వీలైతే ఒక ఆహ్లాదం సహజంగా ప్రత్యక్షం అవుతూ కొనసాగింతర్వాత - ఆశ్చర్యాన్ని రేకెత్తించే ముగింపువుండాలి. కొన్ని కథలలో ముగింపు పాఠకుడికి ప్రారంభం లోనే తెలిసిపోయినా కథలోబిగి పట్టుసన్నగిల్లకూడదు. ఇదెంతవరకూ సాధ్యమో చూద్దామనే "ముగింపు మీకు తెలుసు" అనేకథ వ్రాశాను.

ఖండకావ్యానికి అవసరమైన దీక్ష, నిశ్చల మనస్తత్వమూ కథానికారచన కుండాలి. నిత్యవ్యవహారంలో ప్రయోగించే ఉత్తమాటలు పోగుచేసి వ్రాసెయ్యడం సులభమే. కాని అందులో సరియైన పదాలని వెదకి కూర్చడం, పొదగడం, చెప్పదలుచుకున్నదాన్ని తీక్షణంగా చెప్పడం – ఇదే శిల్పం. దీని వెనక ఊహా బలం, ఆలోచన, పరిశీలన, అంతరంగ జగత్తులో తపస్సు – ఇన్ని జరిగితేగాని ఆ శిల్పానికి ప్రాణం రాదు. ఉద్రేకంతో, ఆవేశం అంతరంగ జగత్తులో కల్లోలం జరగాలి. ఆ కల్లోలం నిలిచిపోవాలి. అందులో మునిగి గుటకలువేస్తూ, మధ్య వూపిరి తీసుకోడానికి పైకి లేచి, బాహ్యజగత్తులోకి తొంగిచూడాలి. రచన ఒక తపస్సు. శరీరానికి వ్యాయామం అవసరమైనట్లుగా ఊహకు యీ ఏకాంతయజ్ఞం అవసరం. కొత్తగా ప్రారంభించిన రచయిత ఉత్తేజంకోసం, తన్మయతకోసం వేచివుంటాడు. ఆరితేరిన రచయిత తను కోరినప్పుడు యీ రెంటినీ తెచ్చుకో గలడు. అంతే తేడా.

ఇంతా శ్రమపడి కథ వ్రాస్తే సింహావలోకనంచేసే విమర్శకుడు దానికేదో పేరెట్టి ఒక్క వాక్యంలో విలువ కట్టేసి దూరంగా తోసేస్తాడు. థామస్ హార్డీ

గొప్ప కథకుడు నవలా రచయిత. ఆయన వ్రాసిన "జూడ్ ది అబ్‌స్క్యూర్" అనే నవలను, ఇదొక బూతుకథ అని ఆనాటి విమర్శకుడు తీర్పుచేశాడు. హార్డీ హడలిపోయి "యింక నే నెప్పుడూ నవల వ్రాయను" అని తీర్మానించుకుని ఈ నవలా రచన విరమించాడు ఆ ఒక్క మాటతో ఒక గొప్ప రచయితని హత్య చేసి, తాను అనామకుడయ్యాడు ఆ విమర్శకుడు. హార్డీకి ధైర్యసాహసాలు లేవు. సుకుమార హృదయుడు ఆ విమర్శనని కాతరు చెయ్యకుండా తన దోవను తను పొయ్యే మనోనిబ్బరము, శీలము ఆయనకులేవు. యిది ఆయనలో లోపమే అనుకుంటూ నా చిన్నప్పుడు కొందరు పెద్దలు చలంగారి కథల్ని "కొంపతీసే కథలు"గా తీర్పుచేసినట్లు జ్ఞాపకం ఒక కథ వ్రాసి ఒక దంపతుల కొంపతీశాడంటే, చలంగారి ప్రజ్ఞని కొనియాడాల్సిందే ఒకర్ని ఒకరు నిత్యమూ ద్వేషించుకొంటూ భార్యాభర్తలు ఒకే కొంపలో వుండడం బదులు విడిపోయి, వారికిష్టమైనవారిని ఏరుకొని, విడివిడీ కాపరాలు పెట్టుకోడం మంచిదని ఆ కథ సారాంశం. అంటే ఒక కొంపపోయి దాని స్థానే రెండు కొంపలు లేచాయన్న మాట, కొంపతీసిన భాగం చెప్తారుకాని, రెండు కొంపలు కట్టించాడని చెప్పరేం ఈ పెద్దలు? రెండు కొంపలవల్ల ఇళ్ళ సమస్య ఎదురవచ్చు — అది వేరే విషయం ఈ సలహాయే ఇచ్చిన బెర్నార్డ్‌షాకి నోబిల్ బహుమానం లభించింది. ఏ బహుమానమూ ఎరగని చలంగారు వ్రాస్తే విరుచుకుపడతారు మన పెద్దలు. చలంగారికే నోబిల్ బహుమానం దొరికితే వారంతా సమావేశాలు చేసి, స్తోత్ర పారాలు చేస్తారు — ఆయన పీకేసిన పాత కొంపల జాబితా తయారుచేసి.

ఈ విషయం ప్రస్తావించడానికి కారణం మన సమాజంలో కథకుడికి, నవలా రచయితకి, గద్య రచయితకి గౌరవం లేదని చెప్పాలన్నదే కథలు వ్రాసేవారిని నేరస్థులుగా పరిగణించడం నే నెరుగుదును. వీరి కథలు బాగుంటాయియా, వుండవూ అన్న ప్రస్తావన లేదు వీళ్ళు పెద్దమనుషులు కారని నింద. ఏదో చెడిపోయినవాళ్ళు, శీలంలేనివాళ్ళు వాళ్ళని దూరంగా వుంచాలి, చెడిపోవడం వీ రొక్కరికే చెల్లినట్లు! విమర్శకుల ధోరణి కూడా దానికి తోడ్పడింది. ఒకాయన తపస్సుచేసి, జీవితంలో తను తెలుసుకొన్న రహస్యాన్ని కథ ద్వారా చెప్పేస్తే "ఇది సెక్స్ కథ" అని తీర్పు చేసేస్తాడు విమర్శకుడు— ఆ "సెక్స్" అన్న పదానికి తెనుగుపదం వెదకడానికి వోపిక లేకుండా. ఇది "సెక్స్ కథ" లాగెయ్యండి. కథలుగా చూస్తే షేక్స్‌పియర్ "ఒథెల్లో", కాళిదాసు "శాకుంతల" తప్పకుండా సెక్స్ కథలే కాని వాటిని వ్రాసినవాళ్ళు చనిపోయి చాలా కాలమైంది అవి గంభీరమైన, ఆంగ్ల, గీర్వాణ భాషలలో

వ్రాయబడ్డాయి. అవి ఉత్తమ సాహిత్య ఖండాలు. కాళిదాసు శాకుంతలంలో నైతిక ప్రస్తావనకి తావే లేదు. ఒకామెతో గడిపి, కొంతకాలానికి "నేను నిన్ను ఎరగను పో" అని యీనాడు ఎవరన్నా అంటే, ఏమంటాం? పాపం దుష్యంతుడు ఏం చేస్తాడు! శాపంవల్ల ఆయనకి పూర్వ స్మృతులు పోయాయి అంటారు. అంటే తన ప్రవర్తనకి దుష్యంతుడు బాధ్యుడు కాడన్నమాట. బాధ్యుడు కానప్పుడు నైతిక విలువల పరామర్శకి తావులేదు. మతిలేనివాణ్ణి వురి తియ్యరు. నైతిక విలువల పరామర్శ సాహిత్యానికి ఆయువుపట్టు అయినా కూడా కాళిదాసు వర్ధంతి, కామేశ్వరరావు 'సెక్స్' కథ సమాధి — ఈ రెండు ఒక వాక్యంలో కానిచ్చెయ్యడానికి విమర్శకుడు సిద్ధం.

ఈ తీర్పుకు బెదిరిపోయి కథకుడు తన దృక్పధాన్ని వొదులుకో కూడదు. జీవితంలో తనేం తెలుసుకున్నాడో, తనకేం తెలుసునో దాన్ని గురించి వ్రాయాలి. అదే నిజాయితీ. రక్తం, శవాలు, హత్యలు, కలిమిలేములు వీటిని గురించి వ్రాసినా విమర్శకుడు, ఆ కథకి ఏదో పేరెట్టి — "చీము రక్తం కథ" లాంటిదని తీర్పుచేస్తాడు. ధనికవర్గం గురించి వ్రాస్తే "స్నాబ్" అంటాడు. కళాకారులని గురించి వ్రాస్తే "గాజుమేడవాసి" అంటాడు. మిల్లులు, యంత్రాలు గురించి వ్రాస్తే వెల్సుగారి వైజ్ఞానిక సంప్రదాయం అంటాడు. బీదలూ, ఆకల్ని గురించి వ్రాస్తే, ఆ వాదం పట్ల సానుభూతిలేని విమర్శకుడు 'మార్క్సిస్టు' కథని నిరసిస్తాడు ఇవన్నీ ఒక కథలో యిమడ్చడం చేతగాక, కథకుడు, కథానికని విడిచేసి, నవలా రచనకి పూనుకుంటున్నాడేమోనని నా అనుమానం. కొందరు ఈ విషయాలనే కావ్యంగా వ్రాసేసి కవులుగా చలామణి అవుతున్నారు. ఎందుకంటే మన సంఘంలో కవులకున్న ఆదరణ; గౌరవం గద్య రచయితలకి లేదు. ఈనాడు పాశ్చాత్య దేశాలలో గద్య రచయితలపట్ల ఆదరణ వుంది. ఐదారు సంవత్సరాలుగా నవలా రచయితకే నోబెల్ బహుమానం లభిస్తోందన్న విషయం గమనించతగింది.

వొస్తువుకి అవసరమైనవీ, అప్రస్తుతమైనవీ కథలో వుండకూడదు. వ్రాశాక ఇట్లా కనబడిన వాక్యాలను తొలిగించాలి అని చాలామంది అంటారు. "ఆ గదిలో తుపాకి వుందని వర్ణిస్తే కథ ముగిసేలోగా ఆ తుపాకి ప్రేలితీరాలి" అని చకోవ్ అన్నాడు. నేను అంగీకరించలేను కథలో ప్రధాన వ్యక్తి పోలీసు శాఖలోనో, అటవీశాఖలోనో పనిచేసే మామగారింటికి వెళ్ళినప్పుడు, వారి గదిలో తుపాకి వుండొచ్చు అది ప్రేలితీరాలని లేదు. దాన్ని వర్ణిస్తేగాని ఆ వర్ణనకి పరిపూర్ణత సనుకూడదు ఇటీవల నేను వ్రాసిన కథలో పల్లెటూరు పట్నవాసంగా

మారిందని తెలుపుతూ వర్ణన సాగించాను. కాలవలమీద వంతెనలు, చెరువుగట్టున ఫ్యాక్టరీలు, కాఫీ హోటళ్ళు, సినిమాహాలు, ఐస్ పార్లర్; ఇవన్నీ చెప్పినా ఆ వూరు బస్తీ అయిందని నమ్మకం కుదరలేదు ప్రభుత్వ కార్యాలయాలు, దవాలి బంట్రోతులు, జీప్‌లు, హాండ్‌బాగ్ స్త్రీలు ఇవేవీ సరిపడలేదు పేవ్‌మెంట్ మీద పాత పుస్తకాల దుకాణం వెలిసిందన్న వర్ణనతో నా వర్ణన పూర్తయినట్లు తోచింది. ఆ కథంతా పాత పుస్తకాల దుకాణం గురించే అయినా నాకు చాలా కాలానికిగాని అది స్ఫురించలేదు. పాతపుస్తకాల కొట్టు మహానగరాల సంస్కృతీ చిహ్నాలుగా ఎట్లా చలామణి అవుతున్నాయో కొంత ప్రస్తావన చేశాను. సినిమాలో ఒక వీధి సెట్టింగులో జనం అటూ ఇటూ పోతుంటారు. వీరు ప్రధాన వ్యక్తులు. ఆ వీధిలో సల్పుతున్న చర్యను గురించి పట్టించుకోరు. అట్లాగే కథలో ఒకటి రెండు అప్రస్తుతంగా, అనవసరంగా కనబడ్డ వాటిని మోతాదుగా ఇరికిస్తేనే, ఆ కథ వెపక ఒక సమాజం, నాగరికత వున్నాయన్న ధ్వని, సహజత్వం వ్యక్తమవుతాయి. చెకోవ్ ధోరణిలో కొట్టివెయ్యడం జరిగితే "కట్టె, కొట్టె. తెచ్చె"లా తయారవుతుంది కథ.

కొన్ని కథలు 'నేను' చెప్పినట్లుగా కొనసాగుతాయి. ఈ "నేను" కథలు నడపడంలో మామ్ అద్వితీయుడు నేను అనే వ్యక్తి కథకుడు కాడు. ఒక ఆదర్శప్రాయుడైన కథకుడు; అతనిలో రచయిత వ్యక్తిత్వం కొంత వుంటుంది. అతనికి తెలిసిన వాటినే చెప్పడంతో కథకి ఒక పరిమితి ఏర్పడుతుంది. మళ్ళా పూర్తిగా తటస్థంగానూ వుండడు. అతని మాటల వల్లనో, చేష్టలవల్లనో కథలో వ్యక్తులకు గమనం ఏర్పడుతుంది అతను పాఠకుడికంటె తెలివైనవాడుగా కనబడకూడదు. తెలివితక్కువ వాడుగానూ కనబడకూడదు. ఈ "నేను" కథల నిర్వహణలో మెళుకువలు మామ్ కథలు చదవకపోతే నాకు అబ్బేవికావేమో.

ఆయనలో వూహాప్రకర్ష, కవిత్వం లేవు. నా కవి కావాలి. వర్ణనలో బిగి కవితారీతి వుండాలి.

కొన్నింటిని ఉదహరిస్తాను.

"మిట్టమధ్యాహ్నపు ఎండలో రైల్వేస్టేషన్ మూర్ఛపోయింది" అది పద్మరాజు వర్ణన; నాకు నచ్చింది మా ఊరు స్టేషన్ అల్లాగే వుంటుంది-అటూ, ఇటూ ఎక్కడా చెట్లుండవు, నీడకి కప్పుండదు.

నోరి నరసింహశాస్త్రిగారి కథ ప్రారంభంలో ఈ వర్ణన చూడండి, "అడవిలో చల్లని వెన్నెల కాయుచున్నది. శూన్యపీదుల్లో పాదము లేని గాడిద మబ్బులు విచ్చలవిడిగా తిరుగుచున్నవి." "గాడిద మబ్బులు" గొప్పగా వుంది.

పాఠకుడికి తెలిసిపోయింది మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథ మొదటి వాక్యాలు ఇవి. "ముందు ముందు ఎప్పుడో భారతం పదిహేను పర్వాలూ తెలుగులోకి వ్రాయబోయే తిక్కన సోమయాజుల్ని కనబోయే గుంటూరి కొమ్మన్నగారు - నిండు యౌవనం వచ్చి రావడంతోనే తండ్రితో పోట్లాట పెట్టుకున్నారు!" పాఠకుడు లేచి కూర్చుంటాడు. మరొక్కసారి ఆ వాక్యం చదవండి "నిండు యౌవ్వనం వచ్చి రావడంతోనే" అన్నది చాలా ముఖ్యం అది రాకుంటే ఆయన తిక్కన సోమయాజుల్ని కనలేడు.

ప్రకృతిలోనే కొంత జీవుడు వుంటుంది. నిశ్చలంగా, కదలిక లేకుండా వుండదు. ఈ కదలికని కవిత్వంలో బంధించక తప్పదు. నా "ఎల్లోరాలో ఏకాంత సేవ" అన్న కథ మధ్యలో యీ వర్ణన చూడండి. "చెట్ల వెనకనుంచి సంధ్య వెలుగులో అతిశయోక్తిగా పరిభ్రమిస్తూ వున్న పొడుగాటి నీడలు వల్చబడి, రాళ్ళ రంగుల్ని వెలిగించి, ఆకృతుల్ని మార్చి దిగజారుతున్నాయి. ఆకుల మధ్య కిరణాలు వనదేవత కుట్టుపనిలో సూదులలా వెనక్కీ ముందుకి కదుల్తున్నాయి. గాలి జోరు తగ్గిం తర్వాత అగ్నిదేవుడు వేసిన గాలిపటం కిందకి పడిపోతున్నట్లు నీడలు వెనక్కి వెనక్కి నడుస్తున్నాయి. ఆ దూరపు కొండ ముసుగు తీసినట్లయింది. కొండ మళుపులో పచ్చిక బయళ్ళు - వూస్తూ వున్న జుట్టులా కనిపిస్తున్నాయి. కన్ను మెదిపినట్లు సూర్య బింబం గుహల వెనక జారుకుంది. చివరి కిరణాలు, అలిసిపరున్న ప్రకృతిని, జలపాతం నీటిని, మేఘాలని, రాళ్ళ సమూహాలనీ, వొక్కసారి వెన్ను మీద చరిచి లేపినట్లు, బంగారం కరిగి, ఎర్ర రాళ్ళ మొహాన జారిన కుంకుమ బొట్టులా మారి, మందారం మధ్యలో ముదిరిన ఎరుపులో నలుపులో, ఇంద్రజాలికుడు వరికరాల్ని బుట్టలో వేసుకుని వెళ్ళిపోతూంటే పీడ్కోలివ్వటం ఇష్టంలేక సంధ్యా కాంత ముసుగు బిగతన్ని పడుకున్నట్లనిపించింది." ఇది కొంచెం పెద్ద కథ యీ వర్ణన సుదీర్ఘంగా వుండడం దోషం కాదనుకుంటాను. జీవితంపై ఛలోక్తులు కూడా అక్కడక్కడా వుంచడం నా కిష్టం బస్తీలో వారిని గురించి యీ నిర్వచనం చూడండి "బస్తీలో వారు చంద్రుడికేసి చూడరు. గ్రహణంనాడు తప్ప, ఆ నాడు చంద్రుడు ఎల్లానూ కనబడడు."

వీటివల్ల కథ ఒక కొత్త ప్రయోజనాన్ని సాధిస్తుంది. నేవర్ణించేది తెలుగు నాట ఒక భాగమే. నే నెరుగున్న తెలుగువారే. అయినా, ఏదో విధంగా ప్రపంచానికి, మానవ ప్రకృతికి దానితో సమన్వయం కుదర్చాలి జీవితాన్ని మరింత తీక్షణంగా సందర్శించాలి కథ ద్వారా. బాహ్య జగత్తు, అంతరంగ జగత్తు -

వీటిల్లో ఒక కొత్త వెలుగు కనబడాలి. ఆ అనుభవం మన వ్యక్తిత్వం వైశాల్యాన్నీ, లోతునీ పెంచాలి. సెక్స్ కథ ద్వారా, సుళువుగా యీ అనుభవం లభిస్తుందనుకుని లారెన్సు మొదలైన రచయితలు సెక్స్ ప్రధానంగా రచన చేశారు. మానసిక శాస్త్రం దీనికి తోడ్పడింది సెక్స్ ప్రధానమైందే - సృష్టికి మూలం. కాని, ఇదొక్కటే ముఖ్యం, ఇంకేమీలేదని అనుకోను నేను జీవితంలో అదొక భాగం ఇంకా చాలా వుంది జీవిత రహస్యం. నేను దీన్ని పూర్తిగా పరిశోధించాను - అని ఏ రచయితా అనలేడు. జీవిత వైచిత్రిని, బాహ్య, అంతరంగ జగత్తుల సమన్వయం ద్వారా శోధించిన హెచ్. ఇ. బేట్సు లాంటి కథకులున్నారు. మానవ ప్రకృతి మారకపోయినా, సృష్టి సాగినంతవరకూ ఆశ్చర్యం గొలిపే సంఘటనలు, వింతలు సాగుతూనే వుంటాయి. జీవిత రహస్యం శోధించడంలో నాలుగో పరిమాణం, సాహిత్యం.

నా కథలన్నీ నే ఎరిగున్న మనుషులు, స్థలాలు, అనుభవాలు — వీటిని గురించినవే. నా కలవాటైన ధోరణిలో, శైలిలో వుంటాయి. ఈ అభిరుచీ, యీ ధోరణీ పాఠకుడికి నచ్చడం నా అదృష్టం, మొదట్లో నచ్చకపోయినా, నచ్చేలాగు, మెల్లమెల్లగా ఆ అభిరుచి కలగజేసే యత్నం చేస్తాను. ప్రతి రచయితా తన రచనపట్ల అభిరుచి తనే ప్రయత్నపూర్వకంగా కలగచెయ్యాలి. నిత్యజీవితంలో రచయిత సంఘర్షణకి గురవుతాడు తాను కోరిన ఉద్యోగం దొరకదు, ప్రేయసి దొరకదు, స్నేహితులుండరు. తాను ఆరాధించిన ఆదర్శ శిఖరాలు కూలిపోతూ వుంటే చూస్తూ ముక్కు మీద వేలేసుకుని కూర్చుంటాడు. బాల్యంలో తన కేవో పేచీలు, బాధలు ఏర్పడతాయి. ఒక సంఘర్షణ ప్రబలి, ద్వంద్వ వ్యక్తిత్వం ఏర్పడి యీ బాధని ఇతరులతో చెప్పుకుని విముక్తుడవుతాడు. ఆ సంఘర్షణ నిలిచి, ద్వంద్వ వ్యక్తిత్వానికి సమన్వయం కుదిరి, ఏకత్వం సాధించిననాడు అతను యోగి - ఇంక వాయడు. ఈ గొడవ విని, యీ బాధని పంచుకోడానికి సిద్ధపడే పాఠకులు ఏ ఒకరిద్దరో వుంటారేమో. ఒక్కడు వున్నా ఆ కథకుడు ప్రయోజనం సాధించి చరితార్థుడైనట్లే భావిస్తాను.

"ఏమయ్యా, నువ్వేదో కొండల్లోకి వెళ్ళి ఒక్కడవూ తపస్సు చేస్తే ప్రపంచానికి ఏమిటి ప్రయోజనం?" అని రామకృష్ణ పరమహంసని అడిగారుట, "నాలో ఒక భావతరంగం లేచి ప్రపంచం అంతటా వ్యాపించింది" అన్నాడుట. కథకుడు పొంద కథలలో, వొక్క కథ అట్లాంటి అనుభూతి తరంగమై విశ్వమంతా వ్యాప్తి చెందుతుందని నా విశ్వాసం. ఎవరో అన్నట్లు సాహిత్యం ఆత్మని రక్షించలేదు - రక్షించ తగిందిగా చేస్తుంది

నే నొక కుక్కని పెంచాను. ఐదారు సంవత్సరాలు గడిచాక దానికి జబ్బు చేసింది. మందులిస్తే తగ్గలేదు. అదింక జీవించదని తెలిసిపోయింది. రోజూ పదింటికి ఆఫీసు నుంచి వొచ్చేవాడిని. ఆ రోజు, ఆ కుక్క ఎట్లా వుందో చూద్దామని మూడింటికే వొచ్చేశాను. అదొక కుర్చీలో పడుకునుంది. లేవలేదు. అరఫర్లాంగు దూరంలోనే నా నడక చప్పుడు పసిగట్టి, కుర్చీలోంచి అతి కష్టం మీద లేచి కుంటుకుంటూ నే వున్న చోటుకి వొచ్చింది జోళ్ళు తీసివేశాను. పాదమూ, చెయ్యి నాకింది. తీక్షణంగా నా కళ్ళలోకి చూసింది. ప్రాణం విడిచేసింది. షేక్స్పియర్ విషాదాంత నాటకాలు, రాయప్రోలు 'మధు కలశమ్' చదవగా నాలో ఏర్పడ్డ అనుభూతి వొకెత్తూ; కుక్కపిల్ల ఆ చర్యతో నాలో ఏర్పడ్డ అనుభూతి వొకెత్తూ, అవి చదవక ముందు నేను వేరే మనిషిని-చదివిం తర్వాత వేరే మనిషిని. కుక్కపిల్ల ఉదంతానికి ముందు నే నొక మనిషిని, తర్వాత మరొక మనిషిని. అది చదవకపోతే, ఆ కుక్కపిల్ల చివరి ఘడియలు నాలో కల్పించిన అనుభూతి. దాని స్మృతీ సాధ్యమయ్యేవి కావు. కథకుడు సాధించే ప్రయోజనం ఇదే అనుకుంటాను. కథానిక కమామీషు కూడా ఇదే.

# కథకుడి ఆంతరంగికం

ఒకరికి ఏదో జరుగుతుంది ఆ వ్యక్తి కలవరపడతాడు. ఆశ్చర్యపడతాడు. దాన్ని గురించి ఆలోచించి బాధపడతాడు; తనలో నిలుపుకోలేడు— సన్నిహితులకు చెప్పివేస్తాడు విన్నవారు పెదవి చప్పరించవొచ్చు ఆశ్చర్యపడి సానుభూతి చూపవచ్చు. అది అందరికీ జరిగేదేనని నవ్వి పారెయ్యవొచ్చు. చెప్పివెయ్యడంతో తాత్కాలికంగా ఆవ్యక్తి కాస్త మనశ్శాంతి పొందినా, పదేపదే ఆ వెనకటి అనుభవం స్మృతిపథంలో తిరుగాడుతూ, తపనగా పరిణమించి మనో నిబ్బరాన్ని సడలించి, 'నేనింక క్షేమంగా ఉండలేనేమో' అనే వొక భయాన్ని కలుగజేస్తుంది. ఎందుకు తనకి బాధ? అందరికీ జరిగేదే, అందరూ తనలాగ పట్టించుకుంటున్నారా? ఆలోచనకి తెగింపు లేదు అదంతా ఎంత చిత్రంగా జరిగింది : తాను అట్లాంటివాడా? అతనిలో మంచితనం, చెడుగు, అతనికే ఆశ్చర్యం కలగచేస్తాయి. కాలం జరిగినకొద్దీ ఆ అనుభవానికి వొక ఆకృతి ఏర్పడుతుంది తాను చదివి తెలిసికున్న వాటికి, ఇతరులు చెప్పగా విన్న వాటికి, తన అనుభవానికి, సామ్యాలు, సూత్రాలు వెదుకుతాడు. ఇదేదో తేల్చి పారెయ్యాలని, అదికాస్తా వ్రాస్తాడు.

ఒక కథానిక తయారవుతుంది 'అమ్మయ్య' అని నిట్టూరుస్తాడు. తపన తగ్గుతుంది తానింక క్షేమంగా వుండగలనన్న ధైర్యం ఏర్పడుతుంది. మళ్ళా నిత్యవ్యవహారాలలో పడిపోతాడు. మళ్ళా అట్లాంటి అనుభవం అతనికి జరగక పోవచ్చు జరిగినా పట్టించుకోక పోవచ్చు. ఆ వొక్క కథే: మళ్ళా కథ వ్రాయడు, అతను వ్రాసింది మంచి కథే కావచ్చు, గొప్ప కథ అని కూడా కొందరు స్నేహితులు ప్రశంసించి ఇంకా వ్రాయమని కోరవచ్చు. కాని అతనింక వ్రాయడు. అతను కథకుడు కాడు ఒక సంఘటన జరగగానే భౌతిక జగత్తులో తాను క్షేమంగా వుండడం కాంక్షించి నలుగురికీ చెప్పుకోవడం జరిగింది. ఆశించిన ఫలితం వెంటనే అతనికి లభ్యం కాలేదు. కొందరు నవ్విపారేశారు. కొందరు 'అల్లాగా పాపం!' అని సానుభూతి ప్రకటించారు - అంటే ఆ విన్నవారి అభిప్రాయాలు భిన్నంగా వుంటూ వచ్చాయి. పైగా వారంతా తనని

ఎరుగున్నవారు. అతను చెప్పింది నమ్ముతున్నారా లేదా అన్న సంశయం వుంటూనేవుంది- అతను కోరిన మనోశాంతి దొరకలేదు. అందుకనే వ్రాసేశాడు. క్షేమంగా ఉన్నాడు. ఎవరిని ఉద్దేశించి వ్రాసినట్లు? వ్యక్తిత్వం లేని పాఠక లోకాన్ని సంబోధిస్తూనా? తనకి తానే చెప్పుకోడమా? ఎరుగున్న స్నేహితులు నమ్మని సంగతులను పాఠకలోకం నమ్ముతుందనా? ఊరికే విషయం వ్రాస్తే పాఠకలోకం పట్టించుకోదు. వారి కుతూహలాన్ని రెచ్చగొట్టి, చదివేటట్లు, నమ్మే టట్లూ వ్రాయాలి. చమత్కారం కావాలి లాలన, శైలి, ఉద్వేగము ఎన్నో కావాలి. అతనికివేవీ తెలియవు; అతనిలో లేవేమో కూడా. అయినా, ఆ కథా నిక తనకి తృప్తినిచ్చింది. మనశ్శాంతి నిచ్చింది. తననుండి తాను విముక్తు డయ్యాడు. మళ్లా కథలజోలికి పోడు, అంటే అతను కథకుడు కాదు.

ప్రతివ్యక్తి జీవితంలోనూ వొక మంచికథకి కావల్సిన 'అనుభవం', సంఘటన, వొస్తువు వుండి తీరతాయి. వ్యక్తి సంస్కారాన్నిబట్టి, ఆ అనుభవం వొత్తిడి వైశాల్యం నిర్ణీతమౌతాయి. ఆ రెంటికీ సమన్వయం కుదిరినప్పుడు ఒక కథ వూడిపడొచ్చు గొప్పకథ కాకపోయినా, ఆకథ మంచి కథ కావచ్చు కాని అది రచించిన వ్యక్తిని కథకుడు అనలేము.

మరి ఎవరు కథకుడు?

జీవితంలో తాను తెలుసుకున్న విషయాలను కుదించి కథగా సమ కూర్చడంతో తాను పొందిన అనుభూతిని కళగా మార్చి యితరులతో పంచు కునేటందుకు కృషిచేసేవాడు కథకుడు. కుదించడం, సంక్షిప్తం చెయ్యడం ముఖ్యం; అది లేకుంటే అతను నవలా రచయిత అవగలడు నవలాకారుడికి కుదించడం, అవసరం లేదనికాదు. నవలకి స్వరూపం అంతం వుంటాయి. కథకి మల్లేనే నవలాకారుడి అభిమాన పాత్రలు 'కాలం', 'స్థలం' అనేవి. ఈ రెంటి సమన్వయం సాధించిన పరిణామంతో నిమిత్తం వున్నవాడు నవలా కారుడు. అతని జగత్తు సముద్రం అయితే కథకుడి జగత్తు అందులో ఒక కెరటం, ఎక్కడో మధ్యలో ఎప్పుడో లేస్తుంది — కదుల్తుంది — చుట్టూవున్న మరికొన్ని తుంపరలని, పిల్ల కెరటాలని తనతో లాక్కుపోతుంది — వెళ్ళినకొద్దీ ఆకృతి పెంచుకుంటుంది. దానికొక శిఖరం ఏర్పడుతుంది — మనం చూస్తూ వుండగానే తుంపరలకిందవిడి, అవతారం చాలించుకుంటుంది. ఆ క్షణికమైన దృశ్యం చూసేవారిలో ఒక అనుభూతిగా నిలిచిపోతుంది కెరటాన్ని లేవదీసే వాడు కథకుడు.

'తాను తెలుసుకున్నవాటిని కుదించి, కథగా సమకూర్చడం' లక్ష్యంగా

గలవాడు కథకుడన్నాను. తెలుసుకోవడం రెండుమూడువిధాలుగా వుంటుంది ఒకవిషయాన్ని స్వానుభవంద్వారా తెలుసుకోడం; ఇతరులకు జరిగినవాటిని — విన్నవీ; చదివినవీ, చూసినవీ — పరోక్షంగా తెలుసుకోడం, మూడోది ఊహ ద్వారా తెలుసుకోడం, మొదటి రెండు సాధ్యమైన తర్వాతగాని ఇది సాధ్య పడదు.

తెలుసుకోడం అంటే, బుద్ధిద్వారా విజ్ఞాన సేకరణ అనికాదు. కొంత వరకూ అట్లాంటి విజ్ఞాన సేకరణ కథకుడికి అవసరం అయినప్పటికీ, ఆ సేకర ణని ప్రేరేపించేది, సర్వేంద్రియాలూఏకమై మొత్తం వ్యక్తిమీద బుజాపుచేసు కున్న అనుభూతుల సారాంశమే. 'సారాంశం అనగానే' అందులో ఏదో లోటు పల్చదనం వున్నట్లుగా తోస్తుంది నిజమే ఒక గొప్ప అనుభూతికి లోనైన వ్యక్తి అసలు రచనకే పూనుకోడు కాలం గడిచి అది ఆకృతి తెచ్చుకుని రక్తంలో కలిసి, ఎముకలకు పట్టి తలో జీర్ణమైపోయి, మళ్ళా తాను కోరినప్పుడు, ఆ మొదట పొందిన తీవ్రత, ఉద్వేగం, యింద్రియాలను రెచ్చగొట్టే ఉద్రేకము — యివన్నీ కోరగానే ఒక కెరటంగా పైకి లేచి, శిఖరాన్ని తెచ్చుకుని తుంపర లగా విడిపోగల శక్తి స్వరూపాలు కలిగిన విషయమే కథకుడు తెలుసుకున్న విషయం అంటే.

అంతటి శక్తి, స్వరూపంగల అనుభూతి అందరికీ రోజూ దొరుకుతుందా? అది చాలా అసాధారణమైన అపూర్వమైన అనుభవం అయివుండాలి — అట్లాంటి అపూర్వమైన అనుభవం దొరికిన కథకుడు, ఆ ఒక్క మంచి కథా వ్రాసి ఊరుకుంటాడు — అని మనం అనుకోవచ్చు. దాన్ని అంత సుళువుగా తోసెయ్య కూడదు. అపూర్వమైన అనుభవాన్ని అన్వేషించే వాడే కథకుడు అనడంలేదు నేను మామూలుగా అందరికి జరిగేవే అతనికీ జరుగుతాయి వాటి సంఖ్యకూడా అతను మహావ్యక్తి అవుతేతప్ప — అందరికీ సాధ్యపడేదే కథకుడు పొంది, సృష్టించగల అనుభవం తీక్షణమైంది — అని మాత్రం అంటాను. అనుభవాన్ని, తీక్షణంగా అనుభవించగలగడమే కాకుండా, తాను అనుభవిస్తున్నాను అనే జిజ్ఞాస కలిగి వుండడం, ఆ అనుభవానికి విలువకట్టడానికి ఉబలాటపడటం — ఇదికూడా కథకుడి స్వభావమే.

విలువలు కట్టడం అంటే ఏమిటో చూద్దాం. తనకి జరిగిన అనుభవం, తనలో ఎట్లాంటి మార్పు తెచ్చింది? అని ప్రశ్నించుకుంటాడు. అతని మనస్తత్వం పైనా, దృక్పథంపైనా, శీలంపైనా, ప్రవర్తనపైనా దాని ప్రభావం ఎట్లాంటిది? అందులో సౌందర్యం ఉందా? జ్ఞప్తికి తెచ్చుకోవడంలో మానసిక వికాసం,

ఆనందం ఉన్నాయా? ఇంద్రియాల ప్రేరణతో నిలిచిపోతుందా, లేక యింకా ఆంతరంగికాన్ని తరచి చూచే శక్తి ఉన్నదా? - అనుభవం యొక్క విలువ ఈ ప్రశ్నల సమాధానాల ననుసరించి ఉంటుంది.

అనుభవాలన్నీ అతనికే సంభవం కానక్కరలేదు. సజీవమైన ఇంద్రియాలతో ప్రతిదాన్ని పరిశీలించడం నేర్చుకున్న కథకుడు యితరుల అనుభవాన్ని తనదిగా చేసుకోగలడు తనని యితరులవిగా భావించగలగడం, యితరులవి తనవిగా చేసుకోగలగడం - కథకుడి ప్రధాన నైజం ఇందుకు సానుభూతి గాంది - మంచివారి పట్లా, చెడ్డవారి పట్లా అందరి పట్లా సానుభూతి కావల్సినంత మంచి చెడ్డలు ప్రతి వ్యక్తిలోనూ కలిసే వుంటాయనీ, వాటిని మరింత సుళువుగా విడదీయలేమనీ, మనుషుల నైజం, చేష్టలనిబట్టి నిర్ణయించడం అజ్ఞానమనీ కథకుడికి తెలుసు పరిస్థితులను అనుసరించి, ఒక్కొక్క క్షణం నైజం బాహ్య జగత్తులో వ్యక్తమవుతూంటుంది. మంచివి వ్యక్తమయ్యే పరిస్థితులను కల్పించడం, ఆదర్శ వ్యక్తులను సృష్టించడం ఒతని పని కాదు, మనుషులు చిత్రంగా వుంటారు. వారిని చూసి జాలి పడాలి. తీర్పు చేసి శిక్షించకూడదు - వారట్లా వుండేందుకు ఎన్నో కారణాలున్నాయి. తల్లిదండ్రుల నుండి అతనికి సంక్రమించినవి, చిన్ననాటి స్నేహితులు, విద్య, అతనున్న సమాజం, ఆర్థిక అంతస్థు - పరిసరాలు-ఇట్లాంటి వెన్నో కారణాలుంటాయి వాటిని మినహాయిస్తే అతనిలో మానవత్వం - అంటే సకల మానవులకూ సమానమైన కొన్ని లక్షణాలు-వుంది. ఆ మానవత్వంతో నాకు నిమిత్తం ఉంది. 'దాన్ని తెలుసుకుని చిత్రిస్తా' అనుకునేవారు కథకుడు, నవలాకారుడు. కథకుడు ఆ మానవత్వాన్ని, ఒక సంఘటనలో, ఒక వ్యక్తిలో ఒక సందర్భంలో వెదుకుతాడు నవలాకారుడు కొంత కాలంలో, కొందరి వ్యక్తులలో, కొన్ని సందర్భాలలో చూడగలుగుతాడు. ఒడ్డున విడిన కెరటం తుంపర చవిచూసి, సముద్రంలో ఉప్పదనం సాంద్రత తెలుసుకుంటాడు

మనుషులంటే ఇష్టం కథకుడికి, వారి వింత ప్రవర్తనని హర్షిస్తాడు — త్రాసులో తూచి తూకంగల వారిని మాత్రం తనలో చూసుకోడు. అందరినీ తనలో చూసుకుంటాడు. అందులో ఆనందం పొందుతాడు ఎవరు ఎప్పుడు ఎందుకు అతన్ని ప్రత్యేకంగా ఆకర్షిస్తారో తెలియదు - ఒక కోల చూపు, వేళ్లు బిగించిన భంగిమ, చీర మడతలో వొంకర, జుట్టు రేగి నుదుటిమీదికి జారడం, నిద్ర నుండి లేచి ఆవులించడం, ముక్కు చీదుకోవడం - ఏదన్నా కావొచ్చు. వారూ, అతనూ, జీవించి వుండటమే అతని కొక వింత

అల్లాగే ప్రకృతి, మనుషులు - మారతారు, ఎదుగుతారు, నీరసించి మరణిస్తారు. ప్రకృతిలో ఈ మార్పు అంత స్పష్టంగా కనబడకపోయినా, దానికీ మనిషి పోకడకీ ఏదో సంబంధం, లంకె వున్నది. దాని స్వరూపం ఏమిటో తెలుసుకో కుతూహల పడేవాడు కథకుడు వర్షం వెలిశాక మేకపిల్ల అరుపు, నీళ్ళల్లో ప్రతిబింబించిన మేఘం, గాలికి కదిలే పువ్వు, పాలికాపు పాదం కింద ఎండు గడ్డి పూచ, సంధ్యలో ఇంటి చూరు, వెన్నెట్లో చెట్టుమీద ప్రకృతి, మనిషితోపాటు సజీవమై వుంటుంది. ఆ లయని చిత్రించాలి. అర్థ శూన్యంగా కన్పించే స్థితులు, గతులు, కదలికలు, సాగిపోవడాలు, జనన మరణాలు జీవితం కోసం పెనగులాట, విరామం - ఈ నిరంతర జీవిత పరిణామంపైన కథకుడు ఒక ఆకృతిని వదేసి, శైలి గాలంతో తన గుప్పెట్లోకి లాక్కుని, దాన్ని నిలిపి చూసి నవ్వుకుని, మళ్ళా విడిచేస్తాడు - అది నవ్వు కావొచ్చు, కన్నీరవొచ్చు, ఆ క్షణం అతను ప్రాపంచిక శక్తులకు అతీతుడై, జీవితాన్ని లొంగదీసుకుని, స్పృశించి - మళ్ళా ఊపిరి తీసి, అందరిలాగే శూన్యంలో కలిసిపోతాడు. ఆ స్పర్శ ఆ స్పందన పాఠకుడితో పంచుకుంటే కాని అతను నిలవలేడు. అది అతని నైజం

సత్యాన్ని అన్వేషిస్తాడు కథకుడు. మనిషికి సమాజ చరిత్ర, ముసుగులు తగిలిస్తాయి డబ్బు, మతం. కులం, కుటుంబ సంప్రదాయం. పరిసరాలు, విద్య, వృత్తి, సంఘ కట్టుబాట్లు - అన్నీ తలో ముసుగూ కప్పుతాయి. ఒక్కొక్క దాన్నే లాగి లోపల వున్న దృశ్యాన్ని చూడాలంటాడు కథకుడు సిద్ధాంతాలు, మతాలు, రాజకీయాలు, శాస్త్రాలు - యివన్నీ తెలుసుకుంటాడు. కాని దేన్నీ ఆమోదించి దాని ప్రచారానికి పూనుకోడు సమాజ వ్యవస్థలో మార్పులు తేవాలని, దురాచారాలు మాపాలనీ, స్థూల ప్రపంచాన్ని ఉద్ధరించాలనీ పూనుకోడు కథకుడు. తన కథలవల్ల అదీ జరిగితే అదృష్టవంతుడే కాని అది తాను ఆశించిన ఫలితం కాదు. తనకి జీవితంపట్లవున్న దృక్పథం ఇతరులు అలవరుచు కోవాలన్న కాంక్ష రహస్యంగా వుంటుంది అతనిలో. ఆ కాంక్షతో కథా రచనకి పూనుకోడు. చివరికి అది జరుగుతుందని యేదో నమ్మకం. యింత ఆశతో అతను ఏ వొక్క గొప్ప కథా వ్రాయకపోయినా, నిరాశ చెందడు. తాను వ్రాసిన కథలన్నీ చూస్తే - వాటిలో వొక క్రమం, పద్ధతి, పాటుపోట్లు పరిణామం, అల్లిక గోచరమవుతుంది. దాన్ని తిలకించి పొందిన ఆనందమే, అతను సాధించిన జీవిత సాఫల్యం. అందుకనే కథకుడు తన కథలన్నీ చదవాలని కోరుతాడు. కాని పాఠకుడికి కథకుడు విముక్తి పొందేడో లేదో అక్కర్లేదు.

ఏదో వొక కథ నచ్చుతుంది అది గొప్ప కథ అని కూర్చుంటాడు. చెకోవ్, మామ్, గైడీ మొపాసా వొందలాదిగా కథలు వ్రాసినా, వీ ఒకటి రెండో మాత్రం ఉత్తమమైన వాటిగా విమర్శకలోకం విలువలు కడుతుంది. జనం మిగత కథలు చదవరు. ఇది కథకుడు ఎదుర్కోవలసిన విషాద పరిస్థితి. మంచి కథకుడి కథలన్నీ చదవాలి — అందులో ఏ వొక్కటీ గొప్ప కథ కాకపోయినా ....మొత్తం చదివిన తర్వాత, పాఠకుడిలో ఒక తృష్ణ, జిజ్ఞాస రేకెత్తుతాయి. అట్లా జరిగితే ఆ కథకుడు తన జీవితం వృధా అనుకోడు.

కథకుడి అంతరంగికం చూశాము. మంచి కథకు దేమిటి? గొప్ప కథ ఒకటి కూడా వ్రాయని మంచి కథకుడుంటాడా! ఇదంతా గంద్రగోళంగా ఉందనిపించొచ్చు మనం పేర్కొన్న మన స్తత్వం, లక్షణాలు, దృక్పథం — ఇవన్నీ కథకుడిలో వుండి కూడా అతను గొప్ప కథ వ్రాయకపోవడం అంత ఆశ్చర్యపడవలసిన సంగతి కాదు.

జన్మతహ కథకుడు కావడం ఒకటి; రచనా విధానంలో ప్రతిభ, విశిష్టత, ప్రత్యేకత, నైపుణ్యం కలిగి వుండడం మరొకటి

దీన్ని స్థూలంగా శైలి అందాము. ఈ శైలి, శిక్షణవల్ల నేర్చుకోవడం వల్ల, ప్రయత్న పూర్వకంగా లభ్యమయ్యేదా? అదికూడా పుట్టుకలో అలవడేదా? ఎవరూ ఇదమిద్ధం అని చెప్పలేరు. శైలి వ్యక్తి అంతర్యానికి సంబంధించినది — అయినా, శిక్షణ, కృషి వుంటేనేగాని రాణించదు. భాషలో ఆ రకం గారడీ వుంది. ఆకారం లేనిదానికి ఒక స్వరూపం కల్పిస్తుంది మాట మళ్ళా ఆ మాటే రచయితకీ, పాఠకుడికీ మధ్య రాయల్లె, అర్థం చేసుకోడానికి అంతరాయమై కూర్చుంటుంది. కథ చెప్పగలగాలి. పాత్రల్ని సృష్టించగలగాలి. సన్నివేశాలు కల్పించాలి. ఇంకా నిజాయితీ, ఉద్వేగమూ — ఇవన్నీ వుంటే, ఎల్లా వ్రాసిందీ, ఎవ్వరకీ అక్కర్లేదు. ఇవన్నీ ప్రతి కథలోనూ, వ్యక్తమవుతాయా? దేనిలో అన్నీ వ్యక్తమౌతాయో, అది గొప్పకథవుతుంది. కొన్ని కథలలో కొన్ని లోపించవచ్చు.

కథకుడి ఇబ్బందులు ఎల్లాంటివో చూద్దాం.

నిజంగా జరిగిన ఉదంతము, ఎంత దిగ్భ్రమ కలిగించేదైనా, దాన్ని కథకుడు స్వీకరించడు. నిజంగా జరిగింది తన కథకి ఆధారం కావచ్చు. కథకుడు చూసినవీ, అనుభవించినవీ, హృదయంలో తెలుసుకున్నవీ, అతనిలో కలిసిపోయి, దృక్పథం ద్వారా మార్పులకుగురై, కొత్త స్వరూపంతో కొంత కాలానికి కథగా ఆకృతి తెచ్చుకుంటుంది. ఆ ఇతివృత్తానికి మొదట్లోవున్న

స్వరూపమే పోయి కొత్త అవతారం కూడా రావచ్చు. పద్మరాజు 1949 లో విజృంభించిన గాలివాన — తుఫాన్‌కు గురైనాడు. అతను కాపురం వున్న ఇల్లు కూలింది. అతని భార్యకి ప్రమాదకరమైన గాయాలు తగిలాయి. ఆమె తేరుకునేందుకు చాలా కాలం పట్టింది. అతను చాలా బాధలు పడ్డాడు. ప్రపంచ కథానికల పోటీలో బహుమతి నందుకున్న 'గాలివాన' అనే కథానికగా ఆ అనుభవం తర్వాత రూపొందింది అనుకుంటాను. ఉన్నదాన్ని స్వీకరించి కొత్త స్వరూపం కల్పిస్తేగాని కథకుడు ఆనందం పొందడు.

పాత్రల్ని అల్లాగే సృష్టిస్తాడు. ఏ వ్యక్తి ఏ చేష్ట, ఏ మాట, ఏ చూపు, అతని కుతూహలాన్ని పురిగొల్పేదీ అతని వ్యక్తిత్వం పైన ఆధార పడుతుంది. రకరకాల మనుషులు జీవితంలో తటస్థపడినా, వారిని అల్లాగే రచనలలోకి దింపడు. ఒక్కమాటతో, ఒక్కచూపులో వారిజీవిత విధానాన్ని అంతటినీ సమన్వయపరచే మన సత్వం కథకుడిది. "అతను పదేపదే కళ్ళు చిట్లించడం చూస్తే, అతనికి జీవితం పట్లగురివున్నట్లు లేదు " అనడంతో మనకాపాత్ర అర్థమైంది. మనుషుల్ని పరిపూర్ణంగా, సమగ్రంగా చిత్రించడానికి పూనుకోడు కథకుడు. అట్లాంటి మనుషులు జీవితంలో విసుగు పుట్టిస్తారు కళలోనూ అంతే. మనస్తత్వ శాస్త్రం బాగా తెలుసుకొని, పాత్రలను పరామర్శించాలనుకోవడం వెర్రి. పూర్తిగా అర్థమైపోయిన పాత్ర కళలో ఆకర్షించదు కొంత 'మిస్టరీ', — అర్థంకాని, బహిర్గతం కాని 'గొడవ' వుండాలి పాత్రలో. కథకుడికి అర్థంకాని పరిస్థితిలో — అద్భుతమైన విలువల్ని సాధించగలడు కథకుడు. వారిని గురించే వ్రాసేస్తే గాని వారి వైఖరి బైటపడదు. ఆ వైఖరిలో వొక భాగంతోనే కథకుడికి నిమిత్తం ఉంటుంది. మూడవది సన్నివేశాలు కల్పించడం. ఇది వొస్తువుని బట్టి వుంటుంది. ఆకలి దప్పులు, బాల్యం, యవ్వనం, వార్థక్యం, సెక్స్, ఇల్లు, సంతానం, ఆరోగ్యం, వృత్తి వ్యాపకం. వినోద వికాసం, చివరలో ఆధ్యాత్మిక చింతన, కీర్తి, మృత్యువు — ఇవి మానవులందరిలోనూ కనబడే జీవిత విశేషాలు. ఒకొ్కక్క కథకుడికి వొకొ్కక్కటి అభిమాన వొస్తువుగా తోస్తుంది. ప్రేమ, సెక్స్, వీటిల్లో సులువుగా ఫలితం దొరుకుతుంది కావున, చాలా మంది. కథకులకు ఇది ప్రధాన వొస్తువుగా వుంటోంది. మిగతావన్నీ వీటిమీదనే ఆధారపడతాయి గావున, నైతిక భవనానికి ఇది పునాదంటున్నారు చాలా మంది. దీని ద్వారా పాఠకుణ్ణి చటుక్కున లొంగదీసుకోవచ్చు. కథకుడి నైతిక ప్రవర్తనతో, మతంతో, రాజకీయాలతో, నమ్మకాలతో, పాఠకుడికి నిమిత్తం లేదు. "సమాజంలో వున్నవారికంటె కూడా నీతిపరుడుగా మంచిగా వుండటానికి

యత్నించడం ఒకరకం దుర్నీతే" అని ఒక తత్వజ్ఞుడన్నట్లు, కథకుడు తనతరం వారికి అతీతమైన నైతిక జీవనాన్ని అలవరచుకున్నా, ఇదంతా కథలో పాత్రలకి ఆపాదిస్తే పాఠకుడు ఊరుకోడు. వింతప్రవర్తననీ, నమ్మ డానికి వీలుకానంతటి విచిత్ర వ్యక్తులనీ జీవితంలో హర్షించగలడేమో కాని. పాఠకుడు కథలో ఒప్పుకోడు దగా, మోసం, వీటిని పాఠకుడు ఇట్టే పసికట్టే స్తాడు కాబట్టి కళానుగుణంగా ఔచితిని, సంభవంగా తోచే వాటినీ కూర్చేవాడు కథకుడు. సౌందర్యాన్ని, శక్తినికూడా సాధించేవాడు, ఉత్తమ కథకుడు. వీటి చిత్రణ ఆశయంగా పెట్టుకోడు కథకుడు. అవి అతనికి సిద్ధిస్తాయి, నాకూ అవి కొంత దొరకుతాయి - అన్న నమ్మకం పాఠకుడిలో కలిగిననాడు, కథకుడికి లొంగిపోయి, అతనితో, అంత ఎత్తుకి వెళ్ళి - అంతవాడై పోతాడు. ఒక్క పాఠకుడికి అట్లాగైతే తన జీవితం వృధా అనుకోడు కథకుడు.

నిజాయితీ, ఉద్వేగమూ — ఈ రెండూ కథకుడి ఆయువుపట్లు. ఒకటి గుండె, రెండోది నాడి ఈ రెండూ ప్రతి రచయితకీ ఆయువు పట్లే. ఒక్క కథకుడికి మాత్రమే కాదు. "కథ — ఏదో ఐదారు పేజీలుంటుంది — అది అల్లడానికి నిజాయితీ కావాలా?" అంటారేమోనని, దాన్ని ప్రత్యేకంగా కథకుడి విషయంలో పేర్కొంటున్నాను ఏదున్నా ఏది లేకపోయినా, నిజాయితీ లేకుంటే మాత్రం అతను కథకుడు కాడు నిజాయితీ అంటే అతను నమ్మినదానికీ, రచనలో చూపిన దానికి పరిపూర్ణమైన పొత్తు కుదరడం అనుకంటాను ఫేషన్ కోసం కొన్ని విషయాలను గురించి- అతనికి అందులో గురిలేకపోయినా— కథని కూర్చడు. అతను తన శరీరంపై ఋజువు చేసుకొన్న సత్యం, సమాజానికి రుచించదని తెలుసుకొన్నప్పుడు, ఆ సత్యాన్ని విసర్జించడు థామస్ హార్డీ వ్రాసిన ఒక నవల అవినీతి ప్రబోధిస్తోందని ఒక విమర్శకుడన్నాడు. అందుకు హడలి పోయి, "నే నింక ఎప్పుడూ నవల వ్రాయను" అని తీర్మానించుకున్నాడు హార్డీ. ఆ ఒక్క విమర్శతో ఒక గొప్ప నవలాకారుడు అస్తమించాడంటే, రచయితకి నిజాయితీ ఎంత అవసరమో తెలిసొస్తుంది ఈ తీవ్రమైన నిరసనకి - విమర్శకి తట్టుకున్న వెంకటచలం నిజాయితీ గల కథకుడు.

రచన చేసేటప్పుడు, కథకుడు ప్రదర్శించేద ఉద్వేగం నిత్యజీవితంలో ఒక బాధకి, అనుభవానికి గురైనప్పుడు, ఉద్రేకానికి లొంగిపోయి, ఉద్వేగ స్థితిలో లీనమై జిజ్ఞాస, చైతన్యం కోల్పోతాడు మిగతా మనుషులకిమల్లె, కథకుడు కూడా - కాని దాన్ని మళ్ళీ స్మరించగలడు - ఆ స్మరణప్పుడు, అంతటి ఉద్రేకం, ఉద్వేగం తిరిగి తెచ్చుకోగలవాడే కథకుడు అన్యాయం జరిగినప్పుడు

కథకుడికి కోపం వొస్తుంది, మూర్ఖత్వం పట్ల అసహనం వుంటుంది, కొందరి వైఖరిని నిర్మూలం చెయ్యాలన్న 'కసి' వుంటుంది — వాటి అన్నింటి వెనక, శ్రుతి లాగా, జాలి, సానుభూతి, ప్రేమ ఉంటాయి. ఇవన్నీ కలిసి అతని రక్తాన్ని వడిగా ప్రవహింప చేస్తాయి. నరాలకి కీ యిచ్చి బిగిస్తాయి — అదే అతనుచేసే ఆఖరు కార్యం, చెప్పే చివరి మాట అనిపించేటంతటి శక్తి, మనో ప్రకర్ష అంతర్యాల పర్యవేక్షణ రేకెత్తుతాయి. వీటి సమన్వయమే, ఉద్రేకం. ఒక్క నిట్టూర్పుతో ఆ కథని సమాప్తం చేసి, ఇంక మరణానికి సిద్ధపడేవాడు గొప్ప కథకుడు. నీతి, న్యాయం, చట్టం, గొప్ప, పిన్న .. వీటి పరామర్శ, సంఘర్షణ, అంతటితో సమాప్తం. అవి లేవని కాదు. వాటిని ముంచెత్తివేసే, మానవత్వం, కెరటాల తుంపరలో ఐక్యమై 'ప్రశాంతం' అనే వొడ్డున, వొళ్ళు విరుచుకుని, పరమార్థ చింతనలో పవ్వళించటం నేర్చిన వ్యక్తి కథకుడు.

పక్షి గూడు కట్టాలనుకుంటుంది. దానికోసం కావల్సిన, ఆకు అలము, గడ్డి, పుల్ల - ఎన్నెన్నో పోగు చేసుకొచ్చి గూడు కడుతుంది. అందులో గ్రుడ్లు పెడుతుంది. అనుక్షణమూ ఏదో సేకరిస్తూ, సోధిస్తూ, పోగు చేస్తూనే వుంటాడు కథకుడు. ఆ కృషికి విరామం లేదు. బోలెడు పోగవుతాయి. అతనిలో ఏదో జరుగుతుంది - బాహ్య జగత్తు అనే గూడులోకి పారిపోయి కూర్చుంటాడు అతనూ గ్రుడ్లు పెడతాడు. పెద్ద గాలికి గూడు పడి గ్రుడ్లు పగులుతుంది. మళ్ళా మరో కథ వ్రాస్తాడు. అంతె. అది అతని నైజం. తుఫానుకి ఆ చెట్టు కూలుతుంది. మరో చోటుకి పోతాడు. మనుష్యుల్ని కూలని చెట్లుగా భ్రమించి, వారి హృదయాలలోకి చొరబడి వారి ఆనందానికి కృషి చేసే జీవి కథకుడు.

# నన్ను మార్చిన పుస్తకం

వయోవృద్ధులై, జీవితంలో పెనుగులాట విరమించి స్థిరపడిన ఖ్యాతిని పురస్కరించుకొని, యితరులు కోరినప్పుడు తమని మార్చివేసిన గ్రంథాన్ని గురించి ప్రస్తావించడం పెద్దలకు పరిపాటి యాభై అరవై దాటిన వారికే ఈ విధంగా తమని కదల్చిన పుస్తకాలని ఆప్యాయతతో యితరులకి పరిచయంచేసే అర్హత వుండటం కూడా ఒక సంప్రదాయమే. ఇందుకు కారణం లేకపోలేదు. పుస్తకాల ప్రభావం చిన్నతనంలోనే వుంటుంది. అసలు ఏమన్నా ప్రభావం వున్నదో లేదో, వుంటే ఎంతవరకూ వుందో, కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత, వెనక్కి చూసుకుని గతంలో తమ అనుభవాలను సింహావలోకనం చేసుకున్న తర్వాతగాని నిర్ణయించడం సాధ్యపడదు. ఆ వయస్సుగాని, అంతటి అనుభవంగాని నాకులేనందున నన్ను మార్చిన పుస్తకం గూర్చి యితరులకి నచ్చజెప్పే అర్హతలేదని నాకు తెలుసు అయినా వున్న ఇరవైయేండ్ల అనుభవం తోనూ, నాపై ప్రభావంగల పుస్తకంగూర్చి వ్రాయబూనుకోడానికి రెండు కారణాలున్నాయి ఒక మేధావికి నాపై ప్రభావం వుండడం మొదటిది చాలా మంది తమ స్వీయచరిత్రలో రసవత్తరమైన ఘట్టాలని స్మరించుకుంటూ, ఇల్లాంటి పుస్తకం చిన్నతనంలో నా చేతుల్లో పడివుంటే ఎంతో బాగుండును!' — అని వాపోతూంటారు. వారి స్వీయచరిత్రే యిల్లాంటి పుస్తకమైనప్పుడు మరీ దిగులుగా వుంటుంది నా చిన్నప్పుడు, నా చేతుల్లోపడిన ఒక పుస్తకం నాకు ఎంతో ఉపకరించింది ఈ పుస్తకం మరి కొందరికి కూడా వుపయోగపడుతుందనే ఆపేక్ష రెండో కారణం. ఆంగ్లంలో వ్రాయబడిన ఒక రచనగూర్చి తెలుగులో చెప్పడం ఎబ్బెట్టుగా తోచినా, భాషకంటె విషయం ప్రధానమైందన్న తృప్తితో ఈ ప్రస్తావనకి పూనుకున్నాను.

ఒక వ్యక్తిపై పుస్తకానికి, ప్రభావం వుండట మంటే నేనేమనుకుంటున్నానో తెలియజెప్పడం అవసరం పుస్తక పఠనానికి అభ్యాసపడినవారు కొన్ని దశ లనుభవిస్తారు ఈ దశలన్నీ ఇరవై ఇరవైనాలుగు సంవత్సరాల వయ

స్కూల్లో చదివిన పుస్తకాల విషయంలోనే వర్తిస్తయి. అప్పైన చదివిన పుస్తకా లకి మనపై అంత ప్రబలమైన ప్రభావం వుండదని నా అనుభవం. తరువాత చదివిన పుస్తకాలను ఒళ్ళు దగ్గర పెట్టుకు చదవడం, ఇందుకు కారణం; వీటిని విమర్శిస్తాం; మిగతావాటితో పోల్చి విలువకడతాం. మనకేవిధంగా వుపకరిస్తాయో తేల్చుకొని, ప్రయోజనాన్ని సాధించిన భాగాలని రహస్యంగా స్వంతం చేసు కుంటాం. ఇంకా కాలక్షేపానికో విజ్ఞానసముపార్జనకో; 'నేను వెనకపడలేదు - ఇంకా ఆధునికంగా వున్నాను' అని చెప్పుకోగలగడానికో; ఆధ్యాత్మికానుభూతి పొందడం కొరకో చదవవచ్చు — ఈ వరసలో ఏదో వో రకమైన స్వార్థం వుంది.

నిజంగా ప్రభావంగల గ్రంథం ఈ విధంగా స్పష్టమైన ప్రయోజనాన్ని సాధించదు. బళ్ళారి రాఘవాచారిగారు డికెన్సు వ్రాసిన 'పిక్‌విక్ పేపర్స్' ఏడాదికోసారైనా చదువుతూండేవారట. వర్డ్స్‌వర్తు కవి చెప్పినట్లు 'స్వర్గాన్నుండి అప్పుడే కొత్తగారావడం మూలాన ఆ లోకం ఛాయలు, వెలుగు, బాల్యంలో మనచుట్టూ ప్రసరిస్తూ వుంటాయి' కాబోలు. బాల్యంలో మనం చదివిన రచనలు ఒక అందమైన స్వప్నజగత్తుని నిర్మించియివ్వడం, అదే యదార్థ జగత్తుగా అందులో మనం విహరించడం జరుగుతాయి టాగూర్‌గారి 'ది రెక్', హార్డీ రచించిన 'టెస్' (Tess of the D'yrbervilles), 'అనామకుడు జూడ్', (Jude the obscure) అనే నవలలు ఇట్లాంటి స్వర్గాన్ని నా వూహలో రచించాయి. 'పిక్‌విక్ పేపర్స్' చదువుతూ బిగ్గరగా నవ్వితే, మా ఇంట్లోవాళ్ళు నన్ను పిచ్చివాడిననుకునేవారు. భమిడిపాటి వారి రచనలు, కాంతం కథలు చదివి ఆనాడు నే పొందిన ఆనందం, తిరిగి పొందడం జరగదు.

శృంగార రచనలు, వాటి మూలంగా పొందే విషాదం రెండోదశకు చెందిన అనుభవాలు. శృంగారం వస్తువుగా గల రచనలకి యవ్వనంపైవున్న ప్రభావం చిరకాలం నిలచిపోతుందనిపిస్తుంది. ఈ దశలో నన్నాకర్షించినవి కృష్ణశాస్త్రిగారి గేయాలు - ముఖ్యంగా కన్నీటి కెరటాలు; ఎంకిపాటలు, షెల్లీ, కీట్స్, టెన్నిసన్‌ల ఖండకావ్యాలు, చలంగారి కథలు, టాల్‌స్టాయి వ్రాసిన 'క్రూయిడ్‌జర్ సొనాట' (Kruetzer sonata) అనేవి. వీరందరూ కేవలం నాకోసం వ్రాసినట్లనిపించేది. ఒక్కొక్క సమయంలో ఇవన్నీ నేనే వ్రాసినట్లుగా కూడా వుండేవి. వాటిల్లో విషయాలు నాకెప్పుడో తెలిసిపోయినట్లూ, ఇంకెవ్వరికీ అర్థంకావు, కాగూడదు అన్నట్లు లోలోన ఆనందించేవాడిని. ఈ రచనలు కన్నీటిని తత్వజ్ఞానంగా బోధిస్తాయి. విషాదం, జీవితలక్ష్యం. ఆ దశలో శృంగారం సుఖాంతమవగూడదు. పేరుచూసి మోసపోయి ఒకసారి P. G.

**Wodehouse** వ్రాసిన 'A damsel in distress' 'చిక్కులో వున్న చక్కటి చుక్క' - అనే నవల చదివి ఏడవడానికి సిద్ధపడిన విషయం తల్చుకుంటే ఇప్పటికీ నవ్వుగానే వుంటుంది.

ఈ రెండు దశలలోనూ చదివిన పుస్తకాలు మనలో సందేహాలను రేకెత్తించవు, ఆలోచించేటట్లు చెయ్యవు, ఇరవై ఇరవై ఒకటి దాటగానే - మూడో దశ ప్రారంభంలో మన గాజుమేడ తలుపులు యెవరో తడుతూవుండడం వినబడుతూంది. కొత్త మొహాలు పలకరించి ఏవో ప్రశ్నలు అడుగుతాయి. వీటికి సమాధానం చెబుతూండాలి కర్మ .. మనం చెప్పేది యెవరికీ అర్థంకాదు. అదేమిటో మనకే తెలియదు. ఇతరులు చెప్పేది మనం వినిపించుకోము. వాళ్ళకేమీ తెలియదు. మనకేదో రహస్యం దొరికింది వాళ్ళదంతా పాత పురాణం. ఒకరకంగా మనస్సు విప్లవానికి సిద్ధపడుతుంది కాని దేనికోసం ఎవరిపై తిరుగుబాటు చెయ్యాలో మాత్రం తెలియదు. ఇది కొంతవరకు ఇంట్లో స్థితిగతులనుబట్టి వుంటుంది. కొందరు మతం పైనా, దేవుడిపైనా, మరికొందరు మూఢ నమ్మకాలపైనా, సంప్రదాయకమైన నీతిపైనా, ఇంకా కొందరు రాజకీయాలపైననో - ఆ రోజులలో పర ప్రభుత్వం - లేక పూర్వపు సాహిత్యం-కళలపైననో, దేనిపైననో ఒక దానిపైన విరుచుకుపడతారు. ఈ రకం తిరుగుబాటుకి తోడ్పడే రచయిత బెర్నార్డ్ షా. నా బుర్రమీద మొట్టికాయలు వేశాడుగాని నా అరచేతిని తన హృదయం మీద వుంచుకొని నాకేమీ చెప్పలేదు షా. ఇది వేరే విషయం. సమస్యా పరిష్కారం. సంభాషణా చమత్కృతి. ఛలోక్తి నిర్వచనం షా నాటకాల నుండి అలవరచుకున్నాను.

రచయితగా నాకు తోడ్పడిన మూడు గ్రంథాలను కూడ ఈ సమయంలోనే చదవడం జరిగింది. షేక్స్పియర్ రచించిన హామ్లెట్ నాటకం చదవడం వల్ల సారస్వతం విలాసం కొరకుకాదనీ, జీవిత విధానం నిర్ణయించడంలో దానికొక ప్రధాన స్థానంవున్నదని గ్రహించాను. రెండోది ఆస్కార్ వైల్డు రచించిన **De Profoundis** 'దుఃఖసాగరం' అనే స్వీయగాథ. నైతికంగా అరాచకత్వాన్ని అలవరచుకున్న వ్యక్తి యెట్లా అంతమొందుతాడో ఈ గ్రంథం భయంకరంగా చిత్రిస్తుంది ఇది పాపుల పాలిటి గీతావాక్యం. నాలో మానసిక వ్యథ, అస్పష్టమైన తపన వుండేవి ఆ రోజుల్లో. రచయితనై వ్రాసేస్తేగాని వీటి నుండి నాకు విముక్తిలేదని సోమర్‌సెట్ మామ్ వ్రాసిన సింహావలోకనం (**The Summing Up**) అనే స్వీయచరిత్ర చదివింతర్వాత విశదమైంది రచయితకి

వుపకరించే మెళకువలు, పరికరాల పరిశీలన, సాధ్యపడే లక్ష్యాలు మొదలైన వెన్నో దీనినుండి నేర్చుకున్నాను.

వ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా వికసింపచేసి, మనస్తత్వ నిర్మాణానికి సహాయపడి జీవితంపట్ల ఒక దృక్పథం అలవరచుకునేటట్లుచేస్తేనే, ఆ పుస్తకం మనల్ని మార్చివేసిందనగలము. ఈ విధంగా నన్ను మార్చివేసింది ఒక పుస్తకం కూడా కాదు; నన్ను మార్చింది బెర్‌ట్రండ్ రసెల్ వ్రాసిన (A Free Man's Worship) 'స్వేచ్ఛాజీవుల ఆరాధన' అనే ఐదారుపుటల వ్యాసం.

అది 1940 వ సంవత్సరం. కాలేజీలో చదువుకొంటూన్న రోజులు. షా రభసలూ, వ్యక్తిగతమైన కొన్ని అనుభవాలూ, జీవితానికి అర్థంవుందా? దేవుడున్నాడా? కర్మ సిద్ధాంతం నిజమైతే వ్యక్తిగతమైన కృషికి, నైతిక విలువలకూ తావుందా? అమరత్వం వుందా? మానవుడు తెలుసుకోలేని సత్యం అంటూ వుందా? సృష్టంతా యెందుకు? మొదలైన ప్రశ్నలను అడిగించాయి దేవుడు నా విషయం పట్టించుకున్నట్లులేదు మార్క్స్ సిద్ధాంతాలు, ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనలు, వీటి ఫలితంగా దైవంపై గురితప్పి మతంపట్ల అసంతృప్తి ప్రబలింది. "దేవుడున్నాడో లేడో మాకు తెలీదు - అసలు మాకా ప్రసక్తి అక్కర్లేదు. అతని ఆరాధనలో వృధా చెయ్యడం బదులు, ఆ కాలాన్ని కొత్త ప్రపంచం నిర్మించడంకోసం వినియోగపరుస్తాం" అని, ఇంగ్లీషు విద్య నభ్యసించిన అనేకమంది యువకులతోపాటే, నేనూ పాట సాగించాను కాని లోలోపల దృఢ నిశ్చయం లేనందున అశాంతి రగులుతూనేవుంది. ఏం చెయ్యడం! మరొక సిద్ధాంతం - ఏ మానవతావాదాన్నో (Humanism) లేకపోతే ప్రకృతినో, కళనో ఆరాధించాలి. ఈ నిర్ణయం జరుగబొయ్యే సమయంలో అదృష్టవశాత్తు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గార 'ఆదర్శ తత్వం', (An Idealist View of Life) అనే గ్రంథరూపంగా వెలువడిన 'హిబ్బర్టు' వుపన్యాసాలూ చదవడం జరిగింది. ఇది నా భావ ప్రపంచాన్ని తారుమారు చేసిన మహాగ్రంథం. మతంపైనా, దైవంపైనా గురితప్పినవారు ఆరాధించే సిద్ధాంతాలన్నిటినీ ఒక్కొక్కదాన్నే విమర్శించి, అవి యెందుకు తృప్తికరంగాలేవో ఈ గ్రంథం చూపెడుతుంది పాశ్చాత్యులు, ప్రాచ్యులుఅన్న వ్యత్యాసాలు ముఖ్యంకావనీ, ప్రపంచంలో మానవులందరి సమస్యలూ వొకటేననీ, ఇది చదివింతర్వాత తెలుసుకున్నాను. ఇందులో రెండోభాగంలో, ఆదర్శతత్వం పునాదులపై బ్రహ్మాండమైన భవనం నిర్మింపబడుతుంది దీనిలో కంతలు, బీటలూలేవు. ఏ శంకచెప్పినా, దానికో ప్రత్యుత్తరం వుంటుంది ఇందులో లోపాలు వెదకలేను, ఈ తర్కాన్ని

ఖండించలేను. ఈ అందమైన భవనాన్ని మెచ్చుకుంటూ చుట్టూ తిరగాల్సిందే కాని, యిందులో ప్రవేశించే అర్హత నాకులేదు. తర్కంతో నిమిత్తంలేని, అతీంద్రియజ్ఞానం వల్లనే, సత్యాన్వేషణ, పరమాత్మదర్శనం సాధ్యపడతాయని యిది చెబుతుంది. అతీంద్రియజ్ఞానం లేనివారికి శిక్షణవల్ల అలవరుచుకోమని చెప్పడంతప్ప యెవ్వరూ ఏమీ చెయ్యలేరు. 'అన్ని సిద్ధాంతాలూ లోపభూయిష్ట మైనవే గనక మనం దేన్నీ అంగీకరించొద్దు, దూరంగా వుందాం' అన్న హక్స్లీ నిర్వచనంలో చమత్కారంవుందికాని వౌదార్యంలేదు ఈ గ్రంథంవల్ల రెండు విషయాలు తెలిసొచ్చాయి. కళ, సంస్కృతి, ఆరాధన, తత్వశాస్త్రం ఇవన్నీ ప్రవర్తనలోనూ, శీలంలోనూ ప్రతిఫలించినప్పుడు తప్ప వీట్లకేమీ ప్రయోజనం లేదన్నది ముఖ్యవిషయం. రెండోది, అతీంద్రియజ్ఞానం నాకు లేదనీ, ఇందువల్ల ఆధ్యాత్మిక తృష్ణ లోపించిందనీ బెంగపడింది. సత్ చిత్ ఆనందాలు నాకు సాధ్యంకావు వెనక జన్మలో నేనేదో పాపం చేసివుండాలి సరకం తప్పదు. ఈ ఆలోచనలు నాలో క్షోభ కలిగించాయి ఈ మనోవ్యధ ఒక ప్రశ్న స్వరూపం దాల్చింది. నైతిక విలువలు, విజ్ఞానశాస్త్రం, కళ, ప్రకృతి, మానవసేవ, నాగరికత - వీటన్నిటినీ ఆమోదించికూడా మతంపైనా, దైవంపైనా గురి కుదరనివారికి ఆధ్యాత్మికానుభూతి సాధ్యంకాదా? అదీ ప్రశ్న.

దీనికి సమాధానంకోసం పుస్తక పఠన సాగించాను. ఒకమారు పుస్తకాల షాపులో ఆత్మానుభవము-తర్కము (Mysticism and Logic) అనే రసెల్ గ్రంథం చూశాను. నాకు తర్కించడం చేతకాదు. ఎవరు ఏదిచెప్పినా నాకది సబబుగానే కనపడసాగేది. నాకు లౌకికజ్ఞానంలేదనీ, అప్రయోజకుడననీ బంధువులు, స్నేహితులు తేల్చివేశారు. జీవితంలో పనికిరానని - అంటే పెద్ద హోదా సంపాదించి, డబ్బు గడించలేనని - వారి సూచన. దొంగని పట్టుకుని దండిస్తే వాడావని ఎందుకు చేశాడో కనుక్కొని ఆ చేష్టపై సానుభూతి చూపబుద్ధి వేసేది. అది తర్కానికి అతీతమైన తర్కం నే ఎరిగున్న వోరిక్షావాడి తర్కం ఆ రిక్షావాడు ఒక స్థూలకాయుణ్ణి పనికుర్రాణ్ణి కూర్చోబెట్టుకుని సునాయాసంగా రిక్షా లాగగలిగాడు; పనికుర్రాడు దిగగానే, స్థూలకాయుణ్ణి లాగలేక రిక్షా వదిలేశాడు. ఆయన పడ్డాడు నలుగురూ రిక్షావాణ్ణి రోకాయించారు. యిద్దర్నీ లాగడం సులువు - ఆవొకాయన్నీ లాగడం కష్టం అంటాడువాడు. ఇది అసంభవం. తర్కశాస్త్రం పునాదుల్ని కూకటివేళ్ళతో పెల్లగిస్తాడా వీడు? వాడు తరవాత విపులీకరించాడు. "ఆయన వొక్కాయనా కూకున్నప్పుడు, వెనక్కీ ముందుకీ వూగిసలాడటం, కాళ్ళు కదిలించడం ఎక్కువయ్యేతలికి తట్టుకోలేక

పొయ్యాను. ఇద్దరూ కూకున్నప్పుడు యివన్నీ సేస్తానికి చోటులేదుగా!" అన్నాడు రిక్షావాడు. మూడు × సున్నా, సున్నా ఎందుకనాలి? ఎందుకు మూడవకూడదు? ఈరకం తర్కం నాది. అందుకని ఈ గ్రంథం పుటలు తిప్పాను. అందులోవుంది 'స్వేచ్ఛాజీవుల ఆరాధన' అన్న ఆరుపుటల వ్యాసం.

బుద్ధివల్ల, విజ్ఞానశాస్త్ర పరిశోధలవల్ల, మానవుడు తెలుసుకున్న యదార్థం లోని విలువ ప్రధానమైనదనీ, ఋజువు దొరికి, ప్రబలమైన కారణాలు వుంటేకాని యే సిద్ధాంతాన్నీ మనం ఆమోదించనక్కరలేదనీ ఋజువయ్యేవరకూ దానిని ఖండించడంకూడా అవివేకమనీ నమ్మినవారికి ఈ వ్యాసం ప్రబోధం కలిగిస్తుంది. ఇందలి నిర్వచనాలలో యిమిడివున్న తత్వశాస్త్రాన్ని పరిశీలించే వుద్దేశం నాకు లేదు అతీంద్రియ జ్ఞానము (Intution) ఆత్మానుభవము (Mysticism) వీట్ల వల్ల కొందరు మహాపురుషులు, పరమార్థాన్ని పొందినా, యీ జ్ఞానం యితరులకి - అంటే అట్లాంటి ఆత్మానుభవం లేనివారికి - బోధపడదని, రసెల్ విశ్వాసం. అయినా ఆత్మానుభవం ఊహాసృష్టికీ, కళాసృష్టికి వుపకరిస్తుందని వొప్పుకుంటున్నాడు. వెలుగుని సందర్శించి, కవిత్వంలోని చైతన్యాన్ని పొందిన సమయంలో రచించబడిన వ్యాసంయిది. వ్యాఖ్యానం లేకుండా యిందులో కొన్ని భాగాలను పొందుపరుస్తాను. క్లుప్తీకరణకోసం, స్వేచ్ఛానువాదం చేయబడిన భాగాలు.

వ్యాసం ఆరంభంలో విజ్ఞానపరిశోధనల ననుసరించి సృష్టి పుట్టుపూర్వోత్తరాల చిత్రణ జరుగుతుంది. తరవాత జీవరాసులుద్భవించాయి - వీటినుండి మంచి చెడ్డల జిజ్ఞాస, ఆరాధనా తృష్ణగల మానవుడు ప్రత్యక్షమయ్యాడు. అన్నీ మృత్యువులో అంతమొందడంచూసి ఆదిమానవుడు భయపడ్డాడు. దీనికంతా ఏదో అర్థం, ఏదో కారణం వుండాలనుకున్నాడు - అదేదో మంచిదవాలి, కనుక దాన్ని ఆరాధించాలి. కాని తన చుట్టూవున్న స్థూలజగత్తులో ఆరాధించతగ్గ వొస్తువు కనబడలేదు. ఈ మహా గంద్రగోళంనుండి, మానవ కృషి ఫలితంగా ఒక అల్లికనీ, లయనీ మధురమైన కూర్పుని సాధించడమే భగవంతుని ఆదేశం అని నిర్ణయించుకున్నాడు తన పూర్వులైన జంతుకోటినుండి తెచ్చుకున్న యింద్రియ సుఖాలకు లొంగిపోయినప్పుడు తను పాపిననుకుని, క్షమించమని దైవాన్ని ప్రార్థించాడు. భగవంతునిచే పరీక్షింపబడి, శిక్షింపబడినప్పుడు గాని, మానవుడికి క్షమలేదు. భవిష్యత్తులో సౌఖ్యంకోసం వికృతమైన ప్రస్తుతాన్ని మరింత ఘోరంగా చేసుకున్నాడు. దైవం చిరునవ్వు సాగించాడు. వైరాగ్యం వల్ల, ఆరాధనవల్ల మానవుడు మోక్షాన్ని సాధించడంచూసి, ఇంక నాటకం

చాలు అనుకుని, ఆకాశంలోకి మరో సూర్యుణ్ని పంపి, సర్వనాశనం చేశాడు. ఇదీ జీవిత నాటకం.

దైవంలోని శక్తినా, మానవునిలోని మంచితనాన్నా, దేన్ని మనం ఆరాధించాలి! దైవం వుండి క్రూరుడవాలా? లేక అతన్ని మనం సృష్టించుకున్న భ్రాంతిగా పరిగణిద్దామా? ఈ ప్రశ్నకు సమాధానంపై మన నైతిక జీవితం ఆధారపడుతుందంటూ, రసెల్ యిలా వ్రాస్తున్నాడు.

"శక్తి చెడ్డదైతే, శక్తిపై మమకారాన్ని మన హృదయంలో నుండి తొలిగిద్దాము. ఇందులో వుంది మానవుడి స్వేచ్ఛ. మనలో సౌందర్య తృష్ణ, నైతిక జిజ్ఞాస సమకూర్చిన దైవాన్ని ఆరాధిద్దాము. ఆహ్లాదకరమైన జీవితాను భూతులనే స్వర్గంగా అంగీకరిద్దాము. కృషిలో, వాంఛలో ప్రతిక్షణమూ, బాహ్య శక్తుల దౌర్జన్యానికి మనం గురవుతున్నాము. కాని, ఊహాలో, ఆదర్శంలో మనం స్వేచ్ఛా జీవులం — జీవించి వున్న కాసేపు, మృత్యువుని కూడా ధిక్కరించే స్వేచ్ఛా జీవులం.

స్థూల జగత్తుకీ ఆదర్శానికీ పరస్పర వైరం వుందని గుర్తించినప్పుడు, దేవుడిపై ద్వేషం బైలుదేరుతుంది, మన స్వాతంత్ర్య ప్రకర్షకి, దైవంపై ఈ తిరుగుబాటు అవసరం. మన మేలుకోరని యీ దృష్టికి లొంగిపోము. సృష్టిలో చెడుగుని మరచిపోము. మనపై అరిష్టాలను కురిపించే అతీతశక్తుల్ని ధిఃకరిద్దాము. కాని ఆవేశం మంచిది కాదు. కోపం కూడా ఒక రకం దాస్యమే. కోపం వల్ల మనం, బుద్ధిని విసర్జిస్తున్నాము కాని కోర్కెలను కాదు. కోర్కెల విసర్జన నుండి వైరాగ్యం జనిస్తుంది. భావ స్వాతంత్ర్యం నుండి, కళ, తత్వజ్ఞానం, సత్ చిత్ ఆనందాలు జనిస్తాయి. వాంఛకి దాస్యం చెయ్యని ఊహకే ఆనందం లభ్యమవుతుంది. స్వార్థరహితులకి, విరాగులకి ఈ స్వేచ్ఛ సాధ్యం.

ఎప్పుడో అప్పుడు ప్రతివారికి జీవితంతో సమాధానపడి, వైరాగ్యంపొందే పరిస్థితి వస్తుంది. యవ్వనానికి అసాధ్యమైంది లేదు కాని మృత్యువు వల్లనో, వ్యాధి వల్లనో, బీదతనం వల్లనో యీ ప్రపంచం మనకోసం కాదని ప్రతివారూ గ్రహించే అవసరం వస్తుంది. స్వప్నాలు భగ్నమై ఆదర్శాలు కూలినప్పుడు, మనో వ్యథ వదలి, సమాధానపడి, జీవిత శక్తిని అంగీకరించి వైరాగ్యం అలవరుచుకోడం జ్ఞానం. అహం ని చంపి, చీకటిని ఛేదించి, మనతో నిమిత్తం లేని దైవాన్ని విడిచిపెట్టి, వైరాగ్యంతో వెలుగులోనించి కొత్త జగత్తుని నిర్మించడం మన కర్తవ్యం.

మనం నెగ్గము, ఓడిపోతాము. ఈ విషాదాంత వ్యవస్థ జీవితానికి కొత్త

శోభ నిస్తుంది. భరింపరాని బాధ, మృత్యు దర్శనము, తిరిగిరాని అనుభవము— వీటిల్లో పవిత్రత వుంది, అంతు లేని జీవిత వైచిత్రి వుంది ఈ విషాదాన్ని వలచి మానవుడు కన్నీటిపై నిర్మించబడిన సామ్రాజ్యానికి రాజవుతాడు. ఈ చైతన్యం క్షణికం – కాని యీ వొక్క క్షణంలోను, అన్నీ వదులుకొని తనను మరచి మానవుడు దైవమవుతున్నాడు. ఈ భయంకర ఏకాంతంలో అతనొక్కడే నిలబడాలి ఈ చైతన్యం నుండి దయ, దాక్షిణ్యం వుద్భవిస్తాయి. దైవానికి మనం ఆపాదించిన ప్రేమ, కారుణ్యం మనమే సాధించి భగ్నమైన స్వప్నాన్నీ మృత్యువునీ అర్థ శూన్యమైన గోళ పరిభ్రమణాన్నీ గ్రహించి, తెలుసుకోగలిగితే వీటిని జయించినట్లే.

కాలాన్ని, కర్మని, మృత్యువుని, ఆరాధించేవాడు బానిస. వీటి ముందు మానవుడు అల్పుడైనప్పటికీ, వీటినిగురించి మహోన్నతంగా ఆలోచించి, ఉద్రేక రహితంగా వీటి తీక్షణాన్ని స్పృశించడంలో, అతని ఘనత బుజువవుతోంది. ఈ రకం ఊహలే, మనల్ని స్వేచ్ఛా జీవులుగా చేస్తవి. స్వార్థమైన వ్యక్తి రహితమైన ఆనందాన్వేషణ విసర్జించడం, తాత్కాలికమైన వాంఛలపై మమకారాన్ని విడిచిపెట్టడం, శాశ్వతమైన విలువల్నే వుద్రేకంతో కాంక్షించడం యిది స్వేచ్ఛ, స్వేచ్ఛా జీవుల ఆరాధనా దైవం."

ఈ వ్యాసం ముగింపు ఒక ఖండ కావ్యంలా వుంటుంది. "చుట్టూ చీకటి, నీరసం, బాధ, వేధించుకు తింటూంటే గమనించక మానవుడు యాత్రసాగిస్తాడు గమ్య స్థానం చేరుకునేవారు కొద్ది; వారిలో ఎవ్వరు కూడా అక్కడ స్థిరంగా వుండే వీలు లేదు. ఒక్కొక్కరే మన స్నేహితులు, తోటియాత్రికులు మార్గంలో రాలిపోతారు. వారికి సహాయం చేసే వ్యవధి ఎంతో లేదు. వారి మార్గంలో వెలుగు చూపడానికి, సానుభూతితో వారి బాధని వుపశమింప చెయ్యడానికి, బుజంమీద చెయ్యితట్టి ధైర్యం చెప్పడానికి మనకు కాసేపు అవకాశం వుంది. వారి మంచి చెడ్డలని త్రాసులో తూస్తూ కూర్చోవద్దు వారి అవసరాలు, బాధలు వారి అంధత్వము — గమనించి, యీ విషాదాంత నాటకంలో వారు పాత్రలేనని, ప్రేమ చూపెడదాము. వారు విఫలులై పతనం పొందినప్పుడు, దానికి కారణం మనం అవద్దు. వారి హృదయాల్లో ఆధ్యాత్మిక కిరణం ప్రసరించినప్పుడు, ప్రేమతో, ఆహ్లాదం చూపుదాం. జీవితం క్షణికం, అల్పం, మృత్యువు ద్వారం ముయ్యకముందే స్వహస్తంతో నిర్మించుకున్న భవంతిలో ఆరాధన జరుపుదాము. బాహ్య జగత్తు కల్పించిన నియమాలకు లొంగక, భావ స్వాతంత్ర్యం కాపాడు కుందాము. గుడ్డి శక్తులు కాళ్ళ కింద మనల్ని నలిపివేస్తూన్నా, మనం కలగన్న ఆదర్శం కోసం ఉజ్వలంగా జీవిద్దాము."

ఈ వ్యాసంలో బోధించబడిన దయ, ప్రేమ, సహనం, వైరాగ్యం, నిస్సంగత్వము - Non-attachment - మొదలైన ఆధ్యాత్మిక విలువలు కొత్తవి కావు అన్ని మతాలు, అన్ని దేశాల ప్రవక్తలు చెబుతున్నవే. నిష్కామ కర్మ, గీతా రహస్యం, దైవంతో ముడిపెట్టకుండా, ఆమోదకరమైన ఒక జీవిత దృక్పథంగా వీటిని - ఆత్మానుభవంతో చర్చించడమే యిందలి విశేషం.

నేను పాపిని ఏదో తప్పు చేశాను నరకం అనుభవిస్తాను - అనే భయాన్నుండి ఈ వ్యాసం నాకు విముక్తి నిచ్చింది ఈ దృక్పథం యీనాటి వరకూ ఆచరణ యోగ్యంగానే కనబడింది ఇది నన్ను మార్చివేసింది అనుకోడంలో, నన్ను నేను మోసగించుకోడం వుందనుకోను

ఈ వ్యాసం వ్రాసినప్పుడు రసెల్ వయస్సు ముప్పై ఒకటి. ఈ వ్యాసంలో చిత్రింపబడ్డ దృక్పథం గలవారికి సమాజంలో పేచీలు తప్పవు. యీయనకి నోబెల్ బహుమానం రావాల్సి వుంది. కాని రాదు, వొస్తే ప్రపంచం పురోగమించిందనుకోడానికో నిదర్శనం అని ఆ రోజుల్లో అనుకునేవాడిని. రసెల్‌కి యీ బహుమానం రావడం, నేను లోలోన ఆనందపడే విశేషాల్లో వొకటి. తత్వజ్ఞుడుగా పేరు పడ్డా సాహితీ వేత్తగానే యీ బహుమానం లభించింది రసెల్‌కి. నలభై ఏండ్ల తర్వాత యీ పుస్తకం పునర్ముద్రితమైంది. దాని ఉపోద్ఘాతంలో యీ వ్యాసం గూర్చి రసెల్ యిల్లా వ్రాశాడు. 'యీనాడు మంచి చెడ్డలు స్థూల జగత్తులోని యదార్థాలని తీవ్రంగా నమ్మలేను, మొత్తం మీద యీ వ్యాసం సూచించిన దృక్పథం స్థిరపడిన మతావేశం లేనివారందరికీ, కష్ట సమయంలో అక్కరకొస్తుందనే విశ్వసిస్తున్నాను '

రసెల్ గ్రంథాలు అనువాదాల ద్వారా ప్రచారంలోకి రావల్సిన వెన్నో వున్నాయి. వీటిల్లోకి - అపనమ్మక సిద్ధాంతాలు - Sceptical Essays -, సోమరితనం స్తోత్రం - In praise of Idleness - ; వివాహము, నీతి - Marriage and Morals, భావ స్వాతంత్ర్యము, ప్రభుత్వాల ప్రచారము - Fare thought and official Propaganda - అధికారము సాంఘిక పరిశీలన"-(Power); చలామణి అవని వ్యాసాలు (Unpopular Essays,) వ్యక్తి - అతన్ని లొంగదీసే అధికారము (Authority and the Individual), శాస్త్రీయ దృక్పథం (Scientific Out look) అనే గ్రంథాలు ప్రధానంగా తోచినవి

నా రచనపై యీ వ్యాసానికున్న ప్రభావం ప్రస్తావనతో ఈ వ్యాసం ముగిస్తాను ఈ వ్యాసం చదివిన ఎనిమిది సంవత్సరాలకు 'చివరికి మిగిలేది'

నవల పూర్తయింది. ఈలోగా రసెల్ రచనలు, ఇతర తత్వశాస్త్ర గ్రంథాలు చదవడం మూలాన కాబోలు రసెల్‌ని గురువుగా అంగీకరించడం గురించి శంకలు రాసాగాయి ఈ శంకలని గూర్చి సోమర్‌సెట్ మామ్ 'సింహావలోకనము' అన్న గ్రంథంలో ఇలా వ్రాశాడు.

"రసెల్ అన్ని విధాల గురువు కాదగ్గ రచయిత. కాని అతని మనస్సు, ప్రతిభ చంచలమైనవి. అతను నిత్యమూ ముందుకి సాగిపోతూంటాడు నేనో ఇల్లు కడదామని సలహా అడిగితే, ముందు ఇటికలతో కట్టమని సలహా ఇస్తాడు. ఇవి సిద్ధంచేసుకుని నిర్మాణానికి పూనుకుంటే, సున్నంతో కట్టడంవల్ల లాభాలని గురించి మొదలెడతాడు సరే, సున్నంతో మొదలెడదామనుకుంటుంటే, సిమెంట్ కాంక్రీట్‌ని మించింది లేదంటాడు. ఇంతకీ వుండేటందుకు నాకు కొంప లేదు."

నేటి సమాజంలో ఎవరికివారు, వారి వారి సంస్కృతినిబట్టీ, అనుభవాన్ని బట్టి ఒక సిద్ధాంతాన్ని అలవరచుకోడం తప్ప గత్యంతరం లేనట్లుంది. తుదకు మన జీవిత విధానాన్ని సమర్థించే సిద్ధాంతమే మనం అన్వయించుకోడం జరుగుతుందేమో. ఈ దృష్ట్యా 'చివరికి మిగిలేది' లో ప్రధానంగా తోచిన కొన్ని వాక్యాలను, పొందుపరుస్తాను ఎంతవరకూ యీ వ్యాసం ప్రభావం వున్నదీ పాఠకులే నిర్ణయించగలుగుతారు. ఇది వ్రాసినప్పుడు రసెల్ గాని, 'స్వేచ్ఛా జీవుల ఆరాధన' అన్న వ్యాసం గాని నా దృష్టిలో లేదని గుర్తించాలి

"సంఘాన్ని మార్చలేడు, మనుష్యుల్ని మార్చలేడు మారిస్తే బాధ, పగ, యుద్ధం, తనతో తాను సమాధాన పడాలి. అది యీనాటికి సాధించాడు, ఒక ప్రశాంతత పవిత్రమైన ఆనందం అతనిలో వుద్భవించాయి. అది బాహ్య ప్రపంచంలో లేదు. మంటని చల్లార్చే మంచుకణాల ప్రవాహం అతని హృదయం; పిచ్చిలోకాన్ని దయతో దూరంగా వుంచే ఔదార్యం మతాన్ని, దైవాన్ని, మనుష్యుల్ని తోసేసి సంతృప్తిచెందే ఆధ్యాత్మికదృష్టి తనలో కడసారి యదార్థం."

మరో చోట—

"తన్ను తాను తృణీకరించినవాడు ప్రపంచాన్ని అంగీకరించలేడు. ప్రపంచం కదిలి పోతోంది. సూర్యుడు వెనక్కి వెడుతున్నాడు. చంద్రుడు చుక్కవుతాడు. సముద్రాలు గడ్డ కడుతాయి. ప్రాణులు చచ్చిపోతాయి. భూగోళం అనంతంలో అర్ధ శూన్యంగా తిరుగాడుతుంది. మానవుడి స్వప్నాలు, ఆశలు, విజయరోదన, విషాద గీతం - అన్నీ హరించి, సర్వ నాశనమవుతుంది. యీ జీవితాని కర్థం యెందుకుండాలో అర్థం లేదన్న తలంపులో నిరుత్సాహం లేదు; కొత్త బలం, వికాసం, ఆత్మ విశ్వాసము వుంటాయి. మానవుడికి

కావల్సింది మతాలు, దేవుళ్లు, మ్రొక్కుబళ్ళు, రాజకీయాలు కావు — అతనికి కావల్సింది దయ, కారుణ్యం కాస్తో కూస్తో.

'చివరికి మిగిలేది' వెలువడి పన్నెండు సంవత్సరాలు దాటుతోంది. పై నుదహరించిన భాగాలలో చివరి వాక్యాలు మినహాయిస్తే, నేటి మానవుడు నిస్పృహ చెందడానికి కారణాలు పొందుపరచబడి వున్నాయి ఆధునిక విజ్ఞాన శాస్త్రం ముఖ్యంగా ఖగోళశాస్త్రం సాధించిన ఫలితాలనుండి యీ నిరాశ జనించిందనవచ్చు సూర్యగోళం వేడిని వెలుగుని గోల్పోయి చప్పబడిపోవడంతో - ఇల్లా జరగడానికి కొన్ని కోట్లయుగాలు పట్టినా - భూగోళంపై జీవరాశి నివసిస్తుందన్న వొక భావాన్ని జేమ్స్‌జీన్స్ మొదలైన ఖగోళ శాస్త్రజ్ఞులు ప్రచారం చేశారు.

ఇటీవల ఈ శాస్త్రం ఎన్నో కొత్త ఫలితాలను సాధించింది. సూర్య గోళంలో నిరంతరం వేడి, వెలుగు నిలిచిపొయ్యే ఏర్పాటు వున్నదనీ. అందువల్ల భూగోళంలో ప్రాణులకు ఏ ఆపత్తు సంభవించదనీ, ఈనాడు ధైర్యంగా చెప్పగలుగుతున్నారు శాస్త్రజ్ఞులు. ఐన్‌స్టీన్ రిలెటివిటీ సిద్ధాంతాలను తత్వంతో క్రోడీకరించటం ముఖ్యమని, ఆ పనికి ఎందరో పూనుకుంటున్నారు. ఇందు మూలంగా, విజ్ఞానశాస్త్రం యెన్నో విజయాలను సాధించినా చివరి సత్యం, జీవితం రహస్యం - వీటిని మానవుడి అతీంద్రియజ్ఞానమే తెలుసుకోగలగాలి, విజ్ఞానశాస్త్రంవల్ల ఈ పనికాదు - అన్న భావంతో వెనుకటి నిరాశపోయి, ఒక కొత్త వికాసం, మనోబలం, నేటి మానవుడిలో ప్రబలుతున్నాయి. ఋజువు, ప్రమాణంలేనిదే మనం దేన్నీ సత్యంగా స్వీకరించనక్కరలేదు అన్న రసెల్ నిర్వచనాన్ని నేనిప్పుడు అంగీకరించలేకపోతున్నాను ఈ విషయంపట్ల డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు ఆదర్శతత్వం'లో వెలిబుచ్చిన అభిప్రాయాలపై మనస్సు మొగ్గుతోంది, అందులో కొన్ని వాక్యాలు చూద్దాం.

"సృష్టికి నడుమ మానవుడు వున్నాడంటే, పరమాణువుకి, నక్షత్రానికి నడుమ వున్నాడన్నమాట నక్షత్రం మానవుడికంటె ఎంత పెద్దదో, మానవుడు పరమాణువుకంటె ఇంచుమించు అంత పెద్ద అనొచ్చు."

శంకలతో కలవరపడే మనస్సు గురించి మరికొన్ని వాక్యాలు.

"అపనమ్మకం, ఖర్చులేకుండా అలవడుతుంది. ఈనాడు విశ్వాసం సమకూర్చుకోడానికే ధైర్యసాహసాలు కావాలి .కొందరున్నారు - వారు నమ్మడానికి సిద్ధంగా వుంటారు, కాని సాధ్యం కావడంలేదు సున్నిత మనస్కులు వీరు. వారెన్నో బాధల నెరుగుదురు; ఎన్నో ప్రశ్నలడుగుతారు. వీరు శంక ప్రకటించడం అంటే కారుణ్యం చూపడం అన్నమాట. వారి ఖండన, వాదన, భక్తి

నుండి జనించాయి. న్యాయం, సత్యం - వీటిని ప్రబలమైన ఉద్రేకంతో అన్వేషిస్తారు వీరు ఇల్లాంటి వారి గురించి మనం చింతపడాలి." రసెల్ మెచ్చుకున్న స్వేచ్ఛాజీవుల తత్వం గురించి మరికొన్ని వాక్యాలు.

"స్వేచ్ఛాజీవులని, మతోన్మాదులు బహిష్కరిస్తున్నారు వారిని ఈ విధంగా వెలెయ్యడంచూస్తే, నిమ్మళస్తులు, అసలు ఏ మతమూ లేకపోవడమే మంచిదన్న వాదానికి దిగుతున్నారు. మతాలన్నీ అడుగంటినా, లోకం మత భూయిష్టమైందిగానే వుంటుంది" జనన మరణాలమధ్య ఇరుక్కున్న ఈ సంకుచిత అనుభవాన్నుండి, ప్రపంచంలోని అనుభూతినంతటినీ మనదిగా స్వంతంగా చేసుకున్ననాడు, దైవం మానవుడు, విశ్వానికి కేంద్రం పరిధివంటి వారు అట్లా సమన్వయం కుదిరిననాడు, బాహ్యజగత్తుకి, అంతరంగ జగత్తుకీ తేడావుండదు. అదే ఉపనిషత్తు మెచ్చుకున్న సమగ్రజీవితం అనుకుంటాను ఈ సత్యం రసెల్ 'స్వేచ్ఛాజీవుల ఆరాధన' అన్న వ్యాసంలో వుందిగనకనే ఈనాటికి దాని ప్రభావం తొలగలేదనే భావిస్తున్నాను

* * *

ఈ వ్యాసం, శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారి ప్రోత్సాహంపై, వారి పత్రిక ప్రచురించిన, 'నన్ను మార్చిన పుస్తకం' అనే శీర్షికలో మొదటి వ్యాసంగా, 1953 లో వ్రాసినది. అనువదింపబడవల్సిన రసెల్ పుస్తకాల జాబితాతో ఆ వ్యాసం ముగిసింది. తిరిగి 1964 లో "జమీన్ రైతు" సంపాదకుల కోరికపై మరికొంత వ్యాఖ్యానంతో ఈ వ్యాసం ప్రచురితమైంది ఈ సంపుటిలో చేర్చిన వ్యాసాన్ని కాలం గడిచాక తిరిగి వ్రాసే పరిస్థితి ఏర్పడుతుందనుకోను

# కసిత్వం

భయపడకండి, ఈ 'కసిత్వం' అన్నమాట నేను సృష్టించిందే నాకు తెలిసినంత వరకు స్మాండి ఎప్పుడో ఇరవైయేళ్ళక్రితం వ్రాసిన ఒక నాటికలో పాత్ర "కవిత్వం కుర్రకారుకి - అందరికీ తలో భార్యా, ఉద్యోగమూ పడేస్తే, 'కవిత్వం' వ్రాయడం మానుకుంటారు" అంటాడు. పదేళ్ళ తర్వాత వ్రాసిన నాటకంలోకూడా ఈమాట దర్శనమిస్తుంది. ఒక రంగంలో యువకవి ప్రవేశిస్తాడు ఒక గేయం వినిపించమంటారు స్నేహితులు.

"నే వ్రాసేది 'కసిత్వం' లెండి" అని వుపక్రమిస్తాడు. ఈ 'కసిత్వం' అన్నమాటని రెండుసార్లు ప్రయోగించే అవసరం ఎందుకు రావాలి? ఒక సోదర రచయిత నాటికలో నాయకుడు స్వగతంగా 'నేనెందుకు బ్రతకాలి?' అని పదే పదే ప్రశ్నించుకున్నప్పుడు, 'చావు' అనగలిగినంతటి స్థితప్రజ్ఞులైన ప్రేక్షక జనం, నా నాటికలో జొరబడిన 'కసిత్వం' అన్న పదాన్ని గమనించి, ఆహ్లాదంతో స్వీకరించి మననం చేసుకోలేక పొయ్యారుగనకనే, రెండుసార్లు వాడడం, ఆ విషయాన్ని మళ్ళా ఇప్పుడు పరామర్శించడం, జరుగుతోందంటారా? సమకాలిక రసికలోకం నాకేలాంటి సన్మానమూ జరపాలన్న సూచనగాని, అలజడిగాని, ధ్వనియొక్క ప్రతిధ్వనిగాని లేకపోవడంతో, ముందుయుగాల రసికహృదయాన్ని మెప్పించి అమరత పొందుదామన్న చీకటికోరిక పోద్బలంపై సృష్టించినమాట ఈ 'కసిత్వం' అన్నది? నిజానికి ముందుతరాల మెప్పుకోసం ప్రాకులాడే వ్యక్తి ఒక్కడుకూడా వుంటాడనుకోను యీ రోజుల్లో మాకు, ఇప్పుడు, యీక్షణంలో కావాలి, కీర్తికాంత క్రీగంటిచూపులవనివ్వండి, శిరస్సుపై ఖ్యాతిదేవత తన్నులు కానివ్వండి. ముందు యుగాలవాళ్ళు ఏం పాపం చేశారని, వాళ్ళమీద యీ 'కసిత్వం' తో విరుచుకు పడడానికి?

ఆ మాట అర్థం తెలియక, రెండుసార్లు ప్రయోగించానంటారా? అసలు దానికి అర్థమంటూ ఉందా? కూర్చుని వ్రాసేసి దాని అంతు తేల్చెయ్యాల అంటే, 'కసిత్వానికి' పూనుకోవాలి.

ఇప్పుడు కూర్చుని విమర్శించి, విషయం అంతు తేల్చినా, నే సాధించిన

ఫలితాలు ఎంతవరకూ అంగీకరించ తగ్గవో నాకే తెలియదు. ఆధునిక మానసిక శాస్త్రం బైటపెట్టిన సిద్ధాంతాలు ప్రచారంలోకొచ్చి, సాహితీరంగంపై దాడి చేసింతర్వాత, ఏ నవలారచయిత, ఏ ధోరణిలో రచన సాగించినా, దానిమీద ఎవరికీ విశ్వాసం కుదరడంలేదు నేటి నవలా రచయిత తత్వాన్ని పాఠకుడు ఎంతవరకు స్వీకరిస్తున్నాడో తెలియపరుస్తూ, ఒక ఆంగ్ల నవలా రచయిత జె బి. ప్రీస్ట్లీ, (J B Priestley) యీ విధంగా మొరెట్టుకున్నాడు. "నీకు వివాహం అయిందంటే గేళిచేస్తారు. కాకపోతే పెదవి చప్పరిస్తారు. వ్యాపారం లోకిగాని, రాజకీయాలలోనికిగాని జొరబడ్డావంటే ఒక సంఘవిరోధి కింద తీర్పు చేస్తారు; కళాకారుడిగా చలామణి అవయత్నిస్తే నరాల బలహీనతకు గురైన దుర్బలుడికింద జమకడతారు; ఆత్మహత్య చేసుకుంటానంటే ఒక్క పేరాలో దుమ్మెత్తిపోస్తారు; సజీవుడవై వున్నావంటే ఇరవై అయిదు అధ్యాయాలదాకా కనుబొమ్మ లెగరేసి ఆశ్చర్యం ప్రకటిస్తారు."

కసిత్వం అన్నపదాన్ని సృష్టించి, అందుకు కారణాలు వెదుకుతున్నానంటే, యీ మానసిక తత్వజ్ఞుల ప్రకారం, నేనేదో మానసిక అనారోగ్యానికి లోనై వుండాలి - ముఖ్యంగా బాల్యంలో పాలిచ్చి పెంచిన పనిమనిషి, పెనిమిటితో తగవులాడి, ఆ కసినంతా మొట్టికాయల ద్వారా నా పైన వెళ్ళగక్కి, సమన్వయం కుదుర్చుకు నుండాలి. పసితనంలో ఏంకావాలో చెప్పడం చేతకాక ఒకమూల కూర్చుని ఏడుస్తూ వుండేవాడిని. ఇంట్లో నిత్యమూ జరిగే యుద్ధం సందడిలో నా ఏడుపు ఎవరూ వినిపించుకుని ఉండరు. ఫలానా కావాలని చెప్ప గలిగినా, అదివ్వడం బదులు ఎవరో చెవిని మెలిపెట్టి వుండాలి. ఇట్లాంటి అనుభవాలేవో బాల్యంలో జరగడంవల్లనే, నాలో కసిత్వం, ప్రబలి, దాని నిజ స్వరూపం మరుగుపరిచి, వొక కవితావేశంగా చలామణీ అవుతోందనీ, మానసిక శాస్త్రజ్ఞుల పితామహుడు ఫ్రాయిడ్‌గారి అంచనా అసలు, వారి జబ్బులూ వీరి జబ్బులూ పరామర్శించి, వాటికి కారణాలు కనుక్కోవాలని బైలుదేరాడంటే యీ ఫ్రాయిడ్‌లో ఏదో ఒకరకం మానసికవ్యాధి వుండివుండాలి. ఒక రోగి మరొక రోగినిగూర్చి తీర్పుచేస్తే, అది మనం నమ్మాలని ఎక్కడుంది? ఇట్లాంటి ప్రశ్నలు వేసిన ఆధునిక పరిశోధకులు లేకపోలేదు. ఇది నా అదృష్టం గాలించగా, గాలించగా, ఒక ఆంగ్ల మానసిక శాస్త్రజ్ఞుడు దొరికాడు. ఆయనపేరు, 'అయన్ సట్టి' (Ian Suttie). 'ప్రేమద్వేషాల పుట్టుపూర్వోత్తరాలు' (Origins of Love and Hate) అనే గ్రంథంలో వ్రాశాడు అందులో ఒక అధ్యాయంపేరు "ఫ్రాయిడ్ సిద్ధాంతంకూడా ఒక జబ్బే" నాలో 'కసిత్వం'

ఫ్రాయిడ్ అన్నట్లు తీరని కోరికల ఫలితం కాదనీ, ఒకవ్యక్తి - పాలిచ్చిన పనీ మనిషి - శిశువుపట్ల చూపవలసిన జాలి, ఆదరణ చూపకపోవడం కారణం అవొచ్చుననీ 'సట్టి' సిద్ధాంతాలు చదివాక తెలుసుకొని 'అమ్మయ్య' అని నిట్టూర్చాను. "ద్వేషంగా మారిన ప్రేమని మించిన ద్వేషం భూ ప్రపంచంలో లేదు. నిందించబడ్డ శిశువుని మించిన కాఠిన్యం నరకంలో కూడలేదు." - అంటాడీ దొరగారు బాల్యంలో ప్రబలిన 'కసి' బైటపడయత్నిస్తుందనీ, ఫ్రాయిడ్ అల్లా యత్నించనక్కర్లేదు. అది సాధ్యంకూడా కాదు. గావున, దాన్నొక విశ్వ మానవ చిహ్నంగా స్వీకరించి సమాధానం కుదుర్చుకోవచ్చుననీ ఈ 'సట్టి' చేసిన తీర్పు. కాబట్టి యీ కసిత్వం పుట్టు పూర్వోత్తరాల పరామర్శ దయతో స్వీక రించండి - అని ప్రేమతో ప్రాధేయపడడంకిందే జమకట్టి సమాధానపడు తున్నాను పెద్దలూ, ప్రముఖులూ, ఎందరెందరో ఈ కసిత్వం ప్రయోజనాన్ని ఛలోక్తులద్వారా వక్కాణించారు "ఎవరినో ద్వేషిస్తూ ఉంటేగాని మానవుడు సుఖంగా ఉండలేడు," అని బెర్ట్రండ్ రసెల్. రసెల్ మరొక నిర్వచనాన్ని ఉదహరించకుండా వుండలేను, "సౌఖ్యంపట్ల విముఖత ప్రకటించడం అంటె ఇతరుల సౌఖ్యంపట్ల విముఖత అన్నమాట. మానవజాతిపట్ల ద్వేషాన్ని అందమైన దుస్తుల వెనుక మరుగుపరచడం అన్నమాట" లారా షిఫోకాడ్ (Lara chefo cauld) అనే ఫ్రెంచి సాహితీవేత్త అన్నమాట చూడండి. "మరీ ఎక్కువగా ప్రేమించేవారిపట్లకంటె, ద్వేషించేవారిపట్లే మనకి ఇష్టం ఏర్పడుతుంది, ఆఖరుకి," ఆ 'ఆఖరుకి' అన్నదాంట్లో ఉంది కసిత్వం. "దేన్ని ద్వేషిస్తున్నాడూ అన్నది ముఖ్యం కాదు, దేన్నో దాన్ని ద్వేషిస్తూ ఉండాలి," అని సామ్యుయెల్ బట్లర్ (Samuel Butler). నాకు తాళంవేసిన పెట్టెలంటే ద్వేషం. తాళాలువేసి తీసే వాళ్ళంటే తన్న బుద్ధేస్తుంది. వీళ్ళంతా ఏమిటి దాచుకుంటారో ఆ పెట్టెలలో ఇంట్లో వాళ్ళు అపహరిస్తారనా? వారిపట్ల ఉండవల్సిన నమ్మకం అంతవరకేనా? కాదు, దొంగలు అపహరిస్తారని అనుకుందాం. ఈ తాళాలు వేసేవాళ్ళే అంటారు; 'అపహరింపబడుగాత' అని దేవుడు శాసిస్తేగాని, ఏదీ అపహరింపబడదని; దేవుడు శాసించినప్పుడు, అదెట్లానూ అపహరింపబడుతుంది, తాళంతోసహా. మరెందుకు తాళం వెయ్యటం?

అల్లాగే ఇంటి తలుపులు వెయ్యడం, తియ్యడం ఆ సందర్భాలలో బైలు దేరే చప్పుళ్ళు, లోహపు గడియలుకాక, అరచెయ్యిపైన రక్తపు కోతలు వ్యుత్పన్నం కావడం - ఇవేవీ గిట్టవునాకు మీ ఇంటావిడ తల దువ్వుకున్నాక, దువ్వెన పళ్ళల్లో తుట్టలుగా ఇరుక్కున్న వెంట్రుకల పరంపరంటే గిట్టక

పోవచ్చు, మీకు. నా మిత్రుడొకాయనకి, హోటల్లో భోజనం చేస్తూండగా, ఒక అందమైన ఆమెతో పరిచయం ఏర్పడిందట. ఇద్దరూ భోజనాలు సాగిస్తున్నారు. ఆవిడ చక్కదనాన్ని లోలోన మెచ్చుకుంటూ తాను కవై వుంటే ఎల్లా వర్ణించునో ఊహించుకుని పదాలు ఏరుతుండగా, ఆవిడ త్రేన్చిందట. దానితో ఆమెపై ఏర్పడ్డ సదభిప్రాయంపోయి హెచ్చుస్థాయి ద్వేషం ఏర్పడిందిట. అట్లాంటి సందర్భంలో, ఈ కసిత్వమే శరణ్యం.

ఒక్క త్రేన్పుతో తుళ్ళిపడినవి
ఆమె సౌందర్యం భవనం పునాదులు
కాబేజి సూపుకే పులకమారినంత,
స్పెయిన్‌లో ప్రజాయుద్ధం తథ్యం!
ఆ మూగకంఠంలో ములక్కాడ ముక్తాయింపా
చారుత్రాగ నేర్వని జాణకి చారిడేసికళ్ళా
హరాయించుకోలేని అంగనకి అవకాయ అగ్నిపరీక్ష
త్రిజగన్మోహిని ఒక్క త్రేన్పుతో సమాధి!

ఈ కసిత్వాన్ని నేనే కనుగొన్నానని విర్రవీగడంలేదు. మానసిక శాస్త్రం ప్రమేయం లేకుండానే, దశవిధ కావ్యగుణాలలో ఒకటిగా, దీనికి స్థానం ఏనాడో ఏర్పరిచారు పెద్దలు. శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సుకుమారత, సమత, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజము, సమాధి - అను దశవిధ కావ్యగుణాలలో, చివరిదైన, 'సమాధి' అన్నది కసిత్వానికి పెద్దలు చేసిన నామకరణమని నా విన్నపం సమాధి మంచి అందమైన పదం చక్కటి తైలవర్ణ చిత్రం ఇమిడి వుంది అందులో ద్వేషంతో అవతల వ్యక్తిగాని, వొస్తువుగాని, వృత్తాంతంగాని, నామరూపాలులేకుండా, భూస్థాపితం అవడం అన్నమాట.

ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా, చావండి

అని, ఆధునిక కవి, కసిత్వంతో గిట్టనివాటిని సమాధి చేసెయ్యడం కాదంటారా?

'కసి' జీవితానికి ఒక వ్యాపకం, ఆదర్శం కల్పిస్తుంది 'శత్రువుంటేగాని జ్ఞాని కానేరడు' అని హాలిఫాక్స్ (Hal fax) అనే రచయిత స్థిరాభిప్రాయం.

ఆంగ్ల వ్యాసకర్త చార్లెస్ లాంబ్, (Charles Lamp) ఒకాయన్ని అద్దమైన తిట్లూతిట్టి, దుమ్మెత్తి పోస్తూంటే, అది వింటున్న స్నేహితుడు "ఆయన్ను మీ రెరుగున్నట్లు నాకు తెలియదే!" అన్నాట్ట, "ఎరగడం? చస్తే

ఎరగను. ఎరుగున్నవాణ్ణి నేనెల్లా ద్వేషిస్తాననుకున్నావయ్యా?" అన్నాట్ట. ఇదీ సిసలైన కసిత్వంలో అంతరార్థానికి తార్కాణం. తాను హైదరాబాదులో గడిపిన రోజుల జ్ఞాపకాలన్నింటినీ శ్రీశ్రీ 'హైదరాబాధ' అన్న ఒక పదంలో ఇమడ్చ గలగడం; మరొక ఆధునిక కవి, తన కావ్యానికి 'కరినోపనిషత్తు' అని పేరు పెట్టడం— ఈ రెండూ కసిత్వానికి ఉదాహరణలు ఉపనిషత్తంటే జ్ఞాపకం వాస్తోంది. భగవద్గీతలో కూడా, ఈ ధోరణి ప్రశంస లేకపోలేదు.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహః వైరిణమ్॥

అన్నదానిలో 'మహాశనః' అనగా 'అధికమైన భక్షణము గలిగినదియు' అని తాత్పర్యం – అన్న పదం, కసిత్వానికి అత్తగారుగా పేర్కొంటే దోషం లేదను కొంటా. "నా కంతటి తెలివి తేటలు లేవు లెండి మరి!" అని విద్యాధికుల పట్ల కాస్త 'కసి' ప్రకటించడం మామూలే. అజ్ఞానంలో మహదానందం ఉందిగావున, జ్ఞానాన్ని చూరగొనడం తెలివి తక్కువ – అని కవి ఒక నినాదం ప్రచారం చేశాడు రాబర్టు లూయీ స్టీవెన్సన్, (Rabert Louis Stevensan) అజ్ఞానాన్ని ఒక ఆధ్యాత్మిక తత్వంగా రూపొందించి పారకలోకం నెత్తిన రుద్దాడు.

"పెద్దల జ్ఞానాన్ని గురించి చెప్పకండి నాకు;
వారి వెర్రిని గూర్చి, భయాన్ని గూర్చి, ద్వేషాన్ని గూర్చి చెప్పండి.
మరొకరికి, ఎవరికో, ఏ దైవానికో లొంగి
పోతామన్న భయం గురించి, చెప్పండి.
అజ్ఞానంతో పుట్టిన నమ్రతని మించిన జ్ఞానం
మనకి సాధ్యం కాదులే,
అంతు లేనిది నమ్రత ఒక్కటే."

అని టి. ఎస్ ఎలియట్ (T. S. Eliat) పాడుకున్నాడు.

"అజ్ఞానిగా చలామణి అవడంలో కూడా స్వార్థం వుంది. కాబట్టి, స్వార్థాన్ని అతిగా ఖండిస్తే, ఆ స్వార్థంలో భాగస్వాములం కావడం అన్నమాట," అని తత్వజ్ఞుడు జార్జ్ సంతాయన (Gearge Santayana).

ఈ ద్వేషం వెనక ఒక చిన్న కంత చేసుకుని అసూయ తొంగి చూస్తూనే వుంటుంది. "అసూయ కనపరచడం అంటే మనస్ఫూర్తిగా ముఖస్తుతిచెయ్యడం" అని చర్టన్ కాలిన్స్ (Churton Colins) ఉత్తమ నటుడిగా బహుమతి పొందిన నటుడని, తోటి నటులు అభినందించేటప్పుడు గొప్ప నటన చూస్తామన్న

ఛలో క్తిలో సత్యం లేదంటారా? ద్వేషించటంలో కూడా అసూయ వుంటుంది. మనం ద్వేషించే వాళ్ళని మరొకరు ద్వేషించకూడదు. ఒకాయన, ఒక ప్రభుత్వ శాఖని 'కసి'గా తిట్టేస్తున్నాడు. "వాళ్ళని ఇంకా చాలామంది తిడుతున్నారు లెండి మీరొక్కరే కాదు." అన్నాను. దానితో హాస్పిటల్ కెళ్ళి, స్పెషల్ వార్డులో చేరినట్లు తరువాత తెలిసింది.

పళ్ళు వూడిపోతున్న కొద్దీ, కొరకాలన్న ఇచ్ఛ యెక్కువవుతుంది కాబోలు! ఫ్రెడరిక్ చక్రవర్తి, సైన్యాన్ని కఠోర నియమాలతో మంచి అదుపు లోకితెచ్చే, శిక్షణకి పేరుపడ్డాడు. రాత్రుళ్ళు పదకొండు దాటాక, గుడారాల్లో యెవ్వరూ దీపం ఉంచకూడదనీ, ఉంచితే ఉరిశిక్షేననీ ఉత్తరువు జారీ చేశాట్ట, తణిఖీకి 'కాప్టెన్ జీటెరిన్' టెంట్‌లోకి ప్రవేశించి, ఆయన దీపం వెలుగులో ఒక ఉత్తరం వ్రాస్తున్న దృశ్యం చూశాడుట. యెవరికి ఆ ఉత్తరం? అని అడిగాడు. "భార్యకి" అని సమాధానం. "చెప్తాను. మరో వాక్యం కూడా వ్రాయి" అని. "రేపు నేను చచ్చిపోతున్నాను" అన్న వాక్యం చెప్పి వ్రాయించాడుట. మర్నాడు జీటెరిన్‌ని ఉరి తీశారు. ఫ్రెడరిక్ 'కసి' లో అసూయ ఉందను కుంటాను. ఆ వ్రాస్తున్న ఉత్తరం, భార్యకి అనడం బదులు, తల్లికి అని ఉంటే కాప్టెన్ జీటరిన్‌కి ఆ ప్రమాదం తప్పేదీ అంటే, అవునని మానసిక శాస్త్రంలో త్రిమూర్తులు ఫ్రాయిడ్, యూంగ్, అడ్లర్ - తలలూచేవారు కారంటారా? ప్రష్యా రాజుగారికి బావగారంటే గిట్టదు. రాజుగారు మంచానబడ్డాడు. చివరి ఘడియల్లో, మతాచార్యులుగారు ధైర్యం చెబుతూ "నీ శత్రువు లందర్నీ క్షమించితే గాని, స్వర్గానికి వెళ్ళే అవకాశం లేదు" అన్నాడుట రాజుగారు వెంటనే భార్యను కేకేసి "నీ ముద్దుల సోదరుణ్ని క్షమించానని వ్రాయి నే చనిపోయిం తర్వాత ఆ ఉత్తరం పోస్టు చెయ్యి" అని చివరి సందేశం వినిపించి యదార్ధ జీవితంలో కసిత్వానికి ఉదాహరణ సమకూర్చిన ఆ రాజుగారు స్వర్గానికే అరుదెంచాడని ఆశిద్దాం.

వీటినిబట్టి కసిత్వంలో ద్వేషం ప్రధాన అంశం అనుకోకూడదు. ఇంద్రియాల ద్వారా, ఆదర్శాలని, పారమార్థిక విలువలనీ తృణీకరించిన ప్రపంచంపై రేగి ప్రసారమైన కోపం, ఊహలో తిరుగాడి, ఒక కొత్త ఆవేశంతో కళానుగుణమైన యోగ్యతని సంపాదించుకున్నప్పుడే - అది కసిత్వం అనిపించుకుంటుంది.

ఒక క్రొత్త బరువుతో, ఒక క్రొత్త యాసతో
ఒకడనే పడిపోదును,
శూన్యమున
ఒకడనే కృశియింతును!

— అని కృష్ణశాస్త్రి, ఆ క్రొత్త బరువు, క్రొత్త యాస, కసిత్వానికి కావల్సిన సామగ్రి కసిత్వంలో స్థూలంగా రెండు రకాలుంటాయనిపిస్తుంది ఒకదాన్ని 'పై కసిత్వం' అందాం - అంటె, బాహ్య ప్రపంచంపై, పైకి ప్రవేశ్నగక్కిన కసిత్వం.

ఓ వ్యధావశిష్టులార!
ఓ కథావశిష్టులార!
పతితులార!
భ్రష్టులార!
బాధాసర్ప దష్టులార!
ఏడవకం డేడవకండి!

అన్న పై గేయం కసిత్వానికి ఉదాహరణ.

అమెరికన్ కవి వాల్టు విట్‌మన్ గేయాలలోనూ, డి. హెచ్. లారెన్స్ రచనల్లోనూ, యీ పై కసిత్వం ఛాయలు బోలెడు దొరుకుతాయి. గద్య రచయితలలో కార్లైల్‌ని కసిత్వం ఉద్యమ వ్యవస్థాపకుడుగా ఎంచవచ్చు. ఈ ధోరణి లోతుపాతులూ, పాటుపోట్లూ తీవ్రంగా శోధించిన మరొక రచయిత జేమ్స్ జాయిస్ ఒక్క వాక్యంలో కసిత్వం సారాన్ని ఇమడ్చగలిగిన వారెందరో ఉన్నారు. కొన్నింటిని ఉదహరిస్తాను. 'న్యూయార్క్ పట్నం, స్థనాలు లేని స్త్రీ లాగుంది' (ఎజ్రా పౌండ్) (Ezra Pond) 'అరబెట్టిన చొక్కాలు శిలపై ఏసులాగున్నాయి' (జాయిస్)(James Jayce) 'వెలిగించని సగం సిగరెట్టు వెనక నిలబడ్డారు నిరుద్యోగులు' (ఆడెన్) (W. H Auden) "రష్యాలో ప్రతివాడూ నాయకుడే. ప్రతివాడి వెనకా బోలెడు మంది బలగం. నే నెక్కడికి వెళ్ళినా, నా వెనక జనం. రష్యా విడిచి వచ్చేవరకూ వెంటాడు తూనే వున్నారు." (కాఫ్‌మన్) (Kaufmann) "యాభై ఏళ్ళ క్రితం మనుష్యులు భాగ్యవంతులూ లేక బీదలూ - ఈనాడు దేశాలు." (లయనెల్ ఫీల్డెన్) (Lionel Fielden).

నాటకం జరుగుతుంటే, యేడ్పుతో అంతరాయం కలిగస్తున్న పిల్లని ఉద్దేశించి నటుడు కెంబిల్ (Kemble) రంగంపై కొచ్చి ఇల్లా అన్నాడు. "ఈ నాటకం నిలిపివెయ్యకపోతే, పిల్ల యేడ్పు సాఫీగా కొనసాగదు."

ఇక రెండో రకంది. 'లో కసిత్వం' - అంటే తనపై తాను చూపే లోలోన కసిత్వం. ఈ పోకడ ఎక్కువగా భావ కవులలో కనిపిస్తుంది. సాత్వికుడు, శాంతిప్రియుడు, నెమ్మదైనవాడు అనుకునే వర్డ్స్‌వర్త్ కవి కూడా ఈ లో కసిత్వం ఆవశ్యకతని ప్రశంసించాడు

తనలో దూరి తన్ను తాను దూషించుట
తపస్సు దిగవిడిచిన కసిని
పండుగ విందారగించుట కాదా!

అని తన్ను తాను చులకన చేసుకుంటే కాని, ప్రకృతి వర్ణనకి పూనుకోలేక పొయ్యాడు భావ కవుల కసి, వ్యక్తిగతమైంది. ఆ తపన, ఆ మనస్తత్వం ఉన్నవారికిగాని దాని మెళుకువలు పూర్తిగా అవగాహన కావు అసలు సమాజం తమని అర్థం చేసుకోగల స్థితికి రాలేదనే వారి బాధ - దాన్నుంచి జనించిందే లో కసిత్వమూను తెనుగు కవితలో ఒకటి రెండు ఉదాహరణ లిచ్చినంత మాత్రాన, వీరిలోనే కసిత్వం వుందనీ, ఇంకెవర్విలోనూ లేదనీ నేననుకున్నానని అనుకోవద్దని మనవి. మేం ఇంకా చాలా మంది ఉన్నాం ఈ లో కసిత్వం వ్రాసినవాళ్ళం — అంటూ నా మీద విరుచుకుపడి పై కసిత్వం ప్రకర్షకి పూను కోకండని కోరుతున్నాను. నే నిచ్చే ఉదాహరణలో కవి అందంగా కోపగించు కుంటాడు. తన్ను తాను ముద్దుగా తిట్టుకుంటాడు - ఎంత ముద్దుగా అంటే, అది చదివాక, మనందరం అంత కసిగా, మనల్ని మనం తిట్టుకోడం ఒక ఫాషన్ కింద తయారు చేసేటంత ముద్దుగా నన్నమాట. ప్రత్యేక వ్యక్తిత్వాన్ని విడదీసి, గాలిలో వూది, విశ్వంలో కలుపుతాడు. అందరి కసిత్వానికి అది చిహ్నంగా రూపొంది, మానవత్వాన్ని ఋజువు చేయగల హక్కుని పొందు తుంది. సమాజం అతన్ని బహిష్కరించదు. అతనే సమాజాన్ని బహిష్క రిస్తాడు. కోయిలనీ, చందమామనీ విడిచేసి 'వేదుల' చిమ్మట చెలిమి కోరుతున్నాడు లో కసిత్వంతో.

'మ్రొక్కిన కొలది గాలితో ద్రొక్కుచున్న
యీ కఠిన లోకమెల్ల బహిష్కృతమ్ము,
రండు చిమ్మటలార! ఈ రాత్రివేళ
నా వలెనే పాడుకొను మీరె నాకు సఖులు.'

వీరి లో కసిత్వం రాత్రుళ్లే ప్రబలుతుంది.

ఎవరో పో, ఈ నిశీథి
నెగసి నీడవోలె నిలిచి
పిలుతు రెవరో, మూగకనులు
మోయలేని చూపులతో
ఎవరహా!

ఆ వొచ్చిన వ్యక్తి వూరికే చూడడం, పిలవడం కాకుండా మరి కొంత షేచీ తెచ్చిపెడతాడు

"ఎవరో నా హృదయనాళ
మేలా తునియలుగా, నా
నిర్జీవపు జీవితమ్ము
నిట వదలుదురా!"
ఎవరొహో!
ఇపుడా నను పలుకరింతురు?

ఆ వొచ్చినవాడు ఎవరు? టెలిగ్రాం తెచ్చిన పోస్టు బంట్రోతా? ఇన్‌కమ్ టాక్స్ చెల్లించాలన్న నోటీసా? హత్య చేసి వొచ్చి పట్టుబడకుండా దాక్కోవడం కోసరమా? ఇట్లాంటి ప్రశ్నలు వెయ్యకూడదు ఈ కృష్ణశాస్త్రి గేయంలో, కవి సమాజంలో వొక వ్యక్తిగా లేడు. అతడొక అనుభూతై, ఒక తపనగా, చింతనగా, అదృశ్యంగా విశ్వమంతటా వ్యాపించే భావ తరంగం — దాని గట్లు కసిత్వం. అదొక తపస్సు తపో భంగం చేస్తే, వెనక ఋషి శపించినట్లే, కసిత్వంతో శపించి, భూ స్థాపితం చేసేస్తాడు. ఇందలి కసిత్వం వొక చలి మంట. ఈనాడు 'ఏంగ్రీయంగ్ మెన్'గా పరిగణింపబడుతున్న యువక రచయితలు ఈ మంటకి ఫర్లాంగు దూరంలో కూర్చుని చలి కాచుకో వాలిసిందే.

పాశ్చాత్య గద్య రచయితలలో కసిత్వానికి అగ్ర పుగాకు చుట్ట—ఆయన చుట్ట కాలుస్తాడు, తాంబూలం వేసుగోడు – జె. బి. ప్రీస్ట్లీకి యివ్వాలని పిస్తుంది.

ప్రజాస్వామ్యంలో అవతరించిన, ప్రచార సాధనాల ఫలితంగా ప్రబలిన గుంపు సంస్కృతిని దుమ్మెత్తి పొయ్యడంలో ఆయనతో తులతూగగల రచయిత మరొకరు కనిపించలేదు, 'ఎడ్ మాస్' ('Admass') — అన్న పదాన్ని సృష్టించి, ఎడ్వర్‌టైజ్‌మెంట్ల ద్వారా చలామణీ అవుతున్న కళల విలువల్ని తిట్టడంలో చాలా గట్టివాడు ఉపన్యాసాలిచ్చే వారిని గూర్చి ఆయన వ్రాసిన వ్యాసంలో అద్భుతమైన లోపై కసిత్వాల సమ్మేళనం వుంది. కొన్ని భాగాలు ఉదహరిస్తాను

"ఉపన్యాసం వినడానికి వెళ్ళడం తెలివి తక్కువ; అంతకు మించిన తెలివి తక్కువతనం, వుపన్యాసం ఇవ్వడం వుపన్యసించడంలో డబ్బు లేదు. మజా లేదు; అందరికీ తెలుసు. సినిమా తారలని వ్యాసాలు వ్రాయవల్సిందిగా కోరే యీ వెర్రి సమాజం, వుపన్యసించమనకుండా, విడిచిపెడుతుందా రచయితల్ని?

నేను వుపన్యసించేటప్పుడు యెంతటి ఘోరమైన అవతారం యెత్తుతానో నాకు తెలుసు వుపన్యసించడానికి వెళ్ళినప్పుడు, నేనున్న ఊరుని, హాలుని అక్కడ సిద్ధమైన ప్రేక్షక జనాన్ని, నన్ను అసహ్యించుకొని తిట్టుకుంటాను గంభీరోపన్యాసకుని అవలక్షణాలన్నీ నాలో వున్నాయి. సిగ్గు పడతాను, గర్వం కనబరుస్తాను, దగ్గుతాను, నసుగుతాను, సణుగుతాను, గొణుగుతాను, తొట్రు పడతాను, అరుస్తాను, తుమ్ముతాను, చమట్లు కారుస్తాను, వెకిలి మందహాసం చేస్తాను. వుపన్యసించినప్పుడల్లా వొక వంద మంది పాఠకులను పోగొట్టుకున్నానేమో!

నా ముందు కూర్చున్న ప్రేక్షకుల వెర్రి మొహాలు తిలకించండి. చలనం లేదు, చైతన్యం లేదు - చురుకుదనం లేదు - ఆ మొద్దు మొహాలేసుకుని సాయంత్రం ఏం చెయ్యాలో తెలియక, నేనో వెర్రివాడుగా ప్రదర్శన సల్పుతుంటే, చూసి వినోదిద్దామనా! అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధికారి కలిసి కన్న సంతానం, వీళ్లు . మీకు నేనంటే ద్వేషం కదూ? సరే కానివ్వండి - మొత్తంగా మీరంటే నాకూ ద్వేషమే .. ఏం చెయ్యను వీళ్ళకి నేనంటే గురి లేకపోతే, వుపన్యసించలేను. గురి వుంటే, వుపన్యసించి, హింసించను... ఇవన్నీ తెలిసుండి యెవళ్ళో ఆహ్వానించగానే, యెందుకూ యెగడ్డం! అంగీకరించడం మనిషికి చేతనవును, కాదనడం దైవానికే సాధ్యం."

విచారంలో కన్నీ రెరుగుదుం; అమిత సంతోషంలో కన్నీరెరుగుదుం - ఆ కన్నీటితో తృప్తి లేదు కవికి. రాయప్రోలు గేయం చూడండి.

పడకటిలు జూచి యేడ్చు జవ్వని యొకర్తు,
చనిన దెసజూచి యేడ్చు జనని యొకర్తు
తన సొగసు జూచి యేడ్చు సుందరి యొకర్తు,
ఏడుపు ప్రియమ్ముగా వచియింపరేమొ!

ఏడుపు ప్రియమ్ముగా వచించాలంటే, కృష్ణశాస్త్రిగారి గేయంలో వలె లో కనిత్వానికి పూనుకోవాలి.

రేయి కడుపున చీకటి చాయ వోలె,
తమసు బెడద దివాంధగీతము విధాన,
మూక రావాన వలవంతరేక రీతి,
నా విషాదమ్ములో దాగినాద నేనె!

దివాంధగీతం - అంటే 'లో కనిత్వం' కాక మరేమిటి? కోపం

కురిపించిన కన్నీటిని ప్రియంగా పదిమందీ స్వీకరించడమూ జరిగింది. కన్నీరు కార్చగల సంస్కృతిని సృష్టించడమూ జరిగింది యీ గేయంలో.

ఈ కసిత్వం పుట్టు పూర్వోత్తరాలని చాలా మంది మేధావులు పరిశీలించారు. ప్రపంచంలో అక్కడక్కడ వుండిపోయిన ప్రాచీన మానవ సమాజాలని, ఫ్రేజర్, (Frazer) మార్గరెట్ మీడ్ (Margaret Mead), మలినోవిస్కీ (Malinouski) మొదలైన శాస్త్రజ్ఞులు, పరిశీలించి వాటిలో ఆధునిక సమాజాల సంస్కృతికి పనికి వచ్చే అంశాలను కొన్నిటిని బైట పెట్టారు. ఆ ఫలితాలలో కసిత్వం వొకటి, ఆదిమ జాతులకి, శరీర అవయవాలను, సహజ శక్తులను పూర్తిగా వినియోగించుకునే అవకాశాలుండేవి. ఒక ప్రక్క ప్రకృతి విజృంభణకి తట్టుకోడం మరొక ప్రక్క, ఇరుగు పొరుగు శత్రువులు జరిపే దాడులకు తట్టుకోడం, జీవనోపాధికి వేట ముఖ్యం. వేట యుద్ధం – వీటిల్లో నిత్యమూ నిమగ్నులవడం వల్ల, వారి జీవితాలలో, ఒక శక్తి నిండుదనము, 'మజా' వుండేవి. నాగరిక సమాజాలలో వ్యక్తుల జీవితంలో ఇవి లోపించాయి. విజ్ఞానశాస్త్రం సమకూర్చిన యంత్ర పరికరాలవల్ల నిత్యకర్మ సుఖమైంది. భార్యా పిల్లల గంద్రగోళం నుండి ఆఫీసుకే పారిపోవాల్సి వస్తుంది. అసలు పెళ్ళాంతో తగవులాడేందుకు కావాల్సిన వోపికే వుండదు.

నేటి సంఘంలో ఈ నిగూఢ శక్తులు బైటపడే మార్గాలేవి? ఫుట్‌బాల్ మాచ్ చూడాలి, కుస్తీ ప్రదర్శనలు చూడాలి, లేదా టార్జాన్ చలన చిత్రాలు చూడాలి. ఆధునికుడు గుంపు సంస్కృతిలో పడి కొట్టుక పోతున్నాడు. నిలబడి ఒక వ్యక్తిగా, తన 'మజా' ప్రదర్శించి, తన వునికిని యితరులకు తెలియజేసే అవకాశం లేక – కసిత్వంతో తృప్తిపడాల్సి వస్తుందేమో! ఈనాడు, రాజకీయ వేత్తలకి, సినిమా తారలకి, కొందరు ఆటగాండ్రకి తప్ప, ఇతరులకి 'మజా' జీవితాన్ని చవిచూసే పరిస్థితులు లేవనీ, అట్లాంటి పరిస్థితులను కల్పించడం ప్రభుత్వాల కర్తవ్యమనీ బెర్ట్రండ్ రసెల్ (Bertrend Russell) పదేపదే చెపుతున్నాడు.

ఆ మధ్య వుత్తరాన ఒకాయన, బ్యాంక్ నోట్లు అపచారం చేసి, తీర్పుని యెదుర్కొనే సాహసం లేక, ఆ నోట్ల కట్టల్ని చితిపై పేర్చి, నిప్పంటించి అంమలో పడి హతమైనట్లు పత్రికలో చూశాను. వుత్తరం వ్రాశాడుట– 'మజాగా– చావాలని ఇల్లా చేస్తున్నాను' అని. సత్యం, శివం, సౌందర్యం నిత్య జీవితంలో ఋజువు చేసుకోవాలనే వ్యక్తి తంటాలు పడతాడు ఆ తంటాలు పడటం, కళా జగత్తులో కసిత్వంగా పరిణమించొచ్చు. మెప వెకాల మరో

కన్ను పెట్టగూడదూ? తలనొప్పిగా వున్నప్పుడు, మెదడు పై డిప్ప పైకి లాగేసి, 'ఉఫ్' మని లోపలున్న దుమ్మూ ధూళీ దులిపివేసి, మళ్ళా డిప్పని యథావిధిగా బోర్లించే ఏర్పాటు ఎందుకుండకూడదు? నా తోటివాడు నా అంతటి మంచివాడయ్యే వరకూ, నేను కాస్త పాడై అతనితో సమంగా ఎందుకుండ కూడదూ? చచ్చిం తర్వాత స్వర్గం కంటె బ్రతికి వుండగా నా ఇల్లు ఎందుకు స్వర్గం చేసుకో కూడదూ? ఇట్లాంటి ప్రశ్నలు యెందుకడగరు యీ మనుషులు? భ్రష్టులారా, పతితుల్లార అని తిడుతుంటే, అది 'తిట్టు' అనేనా తెలుసుకోలేరేం యీ మనుషులు? నే కోరే సౌందర్యం, శీలం, శాంతి, ఆనందం వీళ్ళంతా యెందుకు కోరరూ? "ఒక మూర్ఖుడు చెప్పిన కథ — యీ జీవితం" అని షేక్స్‌పియర్ మా బాగా అన్నాడు. ఈ మనుషులంతా మూర్ఖులు, పతితులు, శుంఠలు, పశువులు, పిడతలు, యంత్రబ్రహ్మలు, నస్మరంతిగాళ్ళు — చావండి అందరూ — అనబుద్ధేస్తుంది ఊహలో ఈ మశువుల వెనక, నీడలా సాగి వుండి వుండి ముందుకి ఒక్క తోపు తోసి, క్షణంలో ఉప్పొంగి ముంచెత్తివేసి, మానవ మూర్ఖత్వపు శిఖరాని కేసి కొట్టిపడేసి, చప్పబడి, స్థిమితపడిన కళా కళేబరాన్ని సముద్రం శాంతి గుహలలో ప్రవేశ్పెడదీసే శక్తి, కసిత్వానికుంది. కాబట్టి ఈ కసిత్వాన్ని బైటపెట్టే మార్గాలాలోచించాలి. 'చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర, హృదయముచు చీల్చి చదువుడో సదయులారా' అని కవి మొరెట్టు కున్నాడంటే ఇది గుప్తంగా లోలోన దాగి వుందనీ, అది ఒక ఆపరేషన్ లాంటిది చేస్తేగాని బైటపడదనీ తెలుస్తోంది. కాబట్టి ప్రతి ఒక్కరూ కసిత్వానికి అనువైన సామగ్రి జాబితా ఒకటి తయారు చేసుకోవడం కర్తవ్యం. కొందరు కవులు ఇదివరలో కొన్ని చిట్టాలు తయారు చేసే వుంచారు.

ఊరవతల నీ రింకిన
చెరువు ప్రక్క! చెట్టునీడ —
గోనెలతో కుండలతో
ఎటు చూస్తే అటు చీకటి,
అటు దుఃఖం, పటు నిరాశ —
చెరసాలలు, ఉరికొయ్యలు,
కాలువలో ఆత్మహత్య!
దగాపడిన తమ్ములార!
మీ బాధలు నే నెరుగుదును .

అదొక చిట్టా. ఇట్లా నలుగురితోను పంచుకోవడంతో ఆ బాధలన్నీ తీరి పోతాయి.

కసితత్వం ఒక ఆవేశం. మానసిక స్థితి ఎప్పుడు యెందుకు విజృం భిస్తుందో చెప్పలేం. అదొచ్చినప్పుడు — మనస్సులో వికారాలు బైలుదేరతాయి. తల క్రిందికి, కాళ్ళు పైకిపెట్టి నిలబడ బుద్ధేస్తుంది. జుట్టు పీక్కోవాలనిపిస్తుంది. గుండె బాదుకోవాలనుంటుంది. ఆ క్షణంలో యెదుట పడిన వాడిని హత్య చెయ్య బుద్దేస్తుంది. వ్రాసిన గ్రంథాలన్నిటిని తగలబెట్టి, ఆ మంటలలో హతమవా లనుంటుంది. గునపంతో ఇంటిగోడ పునాదులు తవ్వాలనుంటుంది. డిటెక్టివ్ నవలల రచనకీ, చదవడానికి అంతటి ప్రాబల్యం యెల్లా వొచ్చిందో అర్థమయ్యే తీక్షణ ఘడియలవి ఆవేశంలో కసితత్వమొస్తుంది.

ప్రపంచ భూగోళపటాన్ని చింపుతాను, చించి సిటిపడవ కట్టి ఉప్పు టేరులో ముంచుతాను. తడిసి, చినిగి, విరిగిన పడవ కళేబరాన్ని ముళ్ళపొదతో చేర్చి కిరీటంగా ధరిస్తాను.

నే నొక పిచ్చాసుపత్రిని
అన్యులకి ప్రవేశం లేదు—
ప్రవేశం కోసం దైవం అప్లికేషన్ పెడితే
ఆలోచిస్తాను వీలునుబట్టి,
శివుడు, పార్వతీ క్యూలో నిలబడాల్సిందే.

దీన్నిబట్టి నేను ఒక ధీరోదాత్త నాయకుణ్ననుకోకండి— ప్రపంచంలో అరిష్టాలని నాశనం చెయ్యడానికి అవతరించిన నియంతననుకోకండి — తంతూ, దెబ్బలాడుతూ, పొడుస్తూ, తుపాకులు ప్రేలుస్తూ తిరుగాడే భయంకరమూర్తి ననుకోకండేం నిజానికి నా అంత మంచివాడూ, జాలిగుండె కలవాడూ, దయార్ద్ర హృదయుడూ, ప్రేమమూర్తి మరొకడుండడు తేలుని, నల్లిని, దోమనీ, ఈగనీ — వీటిల్లో దేన్నీ చంపలేను, ఇతరులు చంపుతుంటే చూడలేను. చంపిన వృత్తాంతం వినలేను. అట్లా చంపిన వారిని కోప్పడడానికి సంకోచిస్తాను. ఏమో, వారెందుకు యీ విధ్వంసక యజ్ఞం తలపెట్టారో! మధ్య నే నెవణ్ని — అనుకుని మూలగా వెళ్ళి కసితత్వం అల్లడంతో, ఆ కోపం తగ్గి, ఆవేశం గట్టుకు జారిన కెరటమై, ఎండి, దారకూడా విడవక మాయమయ్యే యత్నంతో అంత మొందుతాను. కావున, చొక్కా జేబులో చిక్కుకున్న చీపురుముల్లు దగ్గరనుంచి చైనా ప్రభుత్వం చేసిన దారుణం వరకూ — మధ్య కసితత్వం ద్వారా రూపుమాప గల దురంతాల జాబితాలు కళలో అవతరింప చెయ్యాలని అందరం ప్రమాణం చేసుకోవాలి.

# చలం

వెంకటచలంగారిని నే నెరగను, షుమారు పాతికేళ్ళ క్రితం 1936 లో కాబోలు గుంటూరులో జరిగిన నవ్య సాహిత్య పరిషత్ సభల్లో దూరంగా ఆయన్ని చూపించారు. ఆ రోజున ఆయన సభలోకి రాకుండా గదికి వెలుపల వచార్లు చేస్తూ వుండగా గదిలోపలి వారంతా ఆయన్ని గురించే మాట్లాడుకోవడం నాకు జ్ఞాపకం నా స్నేహితు డొకడు సాహసం చేసి ఆయన దగ్గరికి వెళ్ళాడు. 'విద్యార్థులకి మీ సందేశం ఏమిటి?' అని అడిగాడు. 'డబ్బు సంపాదించి పోషించగలిగే వరకూ, ప్రేమించిన స్త్రీ తటస్థపడే వరకూ పెండ్లి చేసుకోకండి' అని ఆయన సందేశం ఇచ్చాడు. దీన్ని పాటించడం ఎంత కష్టమో అందరికీ అనుభవమే వయస్సు మళ్ళిన ఒకాయన్ని 'మీరింకా ఎందుకు పెళ్ళి చేసుకోలేదండీ' అని అడిగారట, "నేను ఒక ఆదర్శమూర్తి కోసం వెదుకుతూ ఇన్నాళ్లు గడిపాను ఈ నాటికి ఆవిడ తటస్థపడింది. కాని ఆవిడ కూడా ఒక ఆదర్శ వ్యక్తి కోసం నాలాగే వెదుకుతూ వుందిట అట్లాంటి వ్యక్తి తటస్థపడలేదు కనుక తాను పెండ్లికి అంగీకరించక పోవడం నా దురదృష్టం" అని సమాధానం చెప్పాడుట వెంకటచలంగారిని మళ్ళా పదేళ్ళ క్రితం విజయవాడలో వారింట్లో కలుసుకొని వారితో ఓ పది నిముషాలు మాట్లాడే అవకాశం దొరికింది ఆనాడు నాకు చెప్పినవేవీ కొత్త విషయాలు కావు అవన్నీ ఆయన రచనల్లో వున్నవే. కాని ఆయనలో అంటే ఆయన మాటల్లో, భావాల్లో ఒక తత్వబద్ధమైన నిజాయితీ నన్ను వెంటనే ఆకర్షించింది మాటకి, చేష్టకి, ఆలోచనకి - పొత్తూ, సమన్వయం కుదరడమే ఈ నిజాయితీ స్వరూపమనుకుంటాను భావజగత్తులో విహరించే వారికి స్థూలజగత్తు పట్టదు లోకం మరమ్మత్తులో నిమగ్నులైన వారికి, ఆలోచించే వ్యవధే లేదు వోపికా లేదు ఇహం, పరం - రెంటినీ సాధించి చేష్టకి, భావానికి సమన్వయం కుదుర్చుకొని, వ్యక్తిత్వాన్ని పెంపొందించుకున్నవారు నిజంగా గొప్ప వ్యక్తులే.

వెంకటచలంగారిలో ఈ రకం గొప్పతనం నాకు కనిపించింది. కొంచెం వివరిస్తాను ఆయన కొన్ని పనులు చేయదలచుకున్నాడు. అవి చేసేశాడు.

కొన్ని చెప్పదల్చుకున్నాడు అవి చెప్పివేశాడు. ఆయన జీవితంలో కొన్ని పొందదలచుకొన్నాడు అవన్నీ పొందాడనే అనుకుంటున్నాను. ఏవన్నా ఒకటి రెండు మిగిలివుంటే ఇప్పుడు వాటిని కూడా సాధించే ప్రయత్నంలో వున్నాడు. ఈ మూడు ఆయన జీవిత విధానానికి ఒక అందమైన ఆకృతినీ, పరిపూర్ణతనీ కలగజేశాయి. ఇట్టి వ్యక్తులు దేశ చరిత్రలో వొకరై పోతారు. వెనకటి తరం వారిలో గిడుగు రామమూర్తిగారికి; వీరేశలింగం పంతులుగారికి, గురజాడ అప్పారావుగారికి ఎట్లాంటి ప్రాముఖ్యం వుందో ఈ తరం ఆంధ్రుల సమాజ చరిత్రలో 'చలం' గారికి అంతటి ప్రాముఖ్యం ఉందనుకునే వారిలో నేనొకడిని. ఈ వ్యక్తులందరూ 'సమాజంలో వారందరూ సుఖంగా జీవించాలి' అన్న ఆశ యంతో కృషి చేసినవారే బాల వితంతువుల ఘోర పరిస్థితి చూసి వీరేశలింగం గారు ఎంతో బాధపడ్డారు. పాశ్చాత్య భావాలను సగం సగం అర్థం చేసుకున్న వ్యక్తులు వేశ్యా వ్యాసంగంతో కుమిలిన సమాజంలో పడినప్పుడు ఆ సమాజం స్థితిని చూసి బాధపడ్డారు గురజాడ అప్పారావుగారు అల్లాగే ఆర్థిక. నైతిక, మానసిక స్వేచ్ఛలు లేకపోవడం వల్ల సమాజంలో వచ్చే అరిష్టాలను గ్రహించి బాధపడ్డారు వెంకటచలంగారు. జైల్లో చీకటికి చాలా కాలం అలవాటు పడిపోయిన తర్వాత సూర్యరశ్మికి తట్టుకోడం కష్టమన్నది మనందరికీ తెలిసిందే. సంప్రదాయపు సంకెళ్ళలో బిగిసిపోయిన గ్రాంధిక భాషకి బానిసలైన కళావేత్తల సమాజం సహజమైన జీవితానుభవానికి దూరమైపోయిన పరిస్థితికి గిడుగు రామమూర్తిగారు ఎంతో నొచ్చుకున్నారు. అల్లాగే యథార్థ జీవిత పరిస్థితులకు సంబంధం లేని వాఙ్మయ ప్రచారాన్ని అరికట్టి దోవ మళ్ళించి యథార్థ సమస్యల సరిహద్దులకు తమ రచనల ద్వారా తీసుకొచ్చారు వెంకటచలంగారు. కేవలం పుస్తకాలలో, వుపన్యాసాలలో కాకుండా నిత్య జీవితంలో సౌఖ్యానికి, వికాసానికి ఆయువుపట్టయిన నైతిక మానసిక శారీరక స్వేచ్ఛల ఆవశ్యకతని రచనల ద్వారా ప్రచారం చేశాడు అప్పట్లో యిది చాలా కొత్త భావం, విప్లవకరమైనది కూడా.

విప్లవపూరితమైన క్రొత్త భావాలని ప్రచారం చేసిన వారిని సమకాలిక సంఘం క్షమించదు. జీసస్ క్రైస్తు, సోక్రటీస్, లారెన్స్, గెలీలియో, మొదలైన వారిని సంఘం ఏ విధంగా హింసించిందీ చరిత్రలో చదువుకుంటాం. 'మనిషి పూర్వుడు కోతి' అని సూచించిన డార్విన్ పైనా, మనిషి అభివృద్ధి సెక్స్ జీవితంపైన ఆధారపడుతుందని సూచించిన ఫ్రాయిడ్ పైనా పాశ్చాత్య సంఘాలు విరుచుకుపడ్డట్లే చలంగారిపైన ఆనాటి సంఘం విరుచుకుపడింది ఆ రోజుల్లో

చలంగారిని తిట్టడం ఒక ఫ్యాషన్. సంఘంలో బోలెడంత కుళ్ళుంది. 'అదంతా బయట పెట్టడం వల్ల ఏం ప్రయోజనం మంచి విషయాలు గురించి వ్రాయ కూడదా' అంటూ ఆనాటి విమర్శకులు చలంగారి రచనలని మిస్ మేయో 'మదర్ ఇండియా'తో జతపర్చి తీవ్రంగా ఖండించారు "మీరు సుఖంగా, సంతోషంగా ఆనందంగా వుండండి; నిత్య జీవితంలో పాటించలేని మరీ ఎత్తైన నీతి నియమాలను పెట్టుకొని బాధ పడకండి; నైతిక ఔన్నత్యాన్ని కొనియాడినంత మాత్రాన్న మేము నీతిపరులం అని దగాపోయి విర్ర వీగకండి ఈ దగాలు, ఈ ముసుగులు తీసేసి నిజంగా మీరు వాంఛించే వాటిని పొందడానికి ప్రయత్నించండి" అని బోధించిన వెంకటచలంగారికి జరిగిన శాస్తి అది.

నిజం చెపితే ప్రజాబాహుళ్యానికి అంత భయం వర్ణనాతీతమైన దాన్ని వర్ణిస్తాయి కనక కళలన్నీ అమానుషాలే, అని హెర్‌బర్టు రీడ్ (Herbert Read) అన్నట్లుగా ఆనాటి సమాజానికి అశ్లీలాలుగా కనిపించిన వాటిని చలంగారు సాహసంతో చెప్పారు. తను ప్రేమించని భార్య నుండి విముక్తుడు కావడానికి చేసిన సాహసాన్ని సమర్థిస్తూ మిల్టన్ కవి విడాకుల ఆవశ్యకతను గూర్చి గ్రంథం వ్రాయాలిసొచ్చింది. కాని ఈనాడు విడాకులు పాశ్చాత్య దేశాల్లో పాత విషయమై పోయింది. సెక్సుకి శీలం పైన ఎంతటి ప్రభావం వుందో ఫ్రాయిడ్ సిద్ధాంతాలవల్లా, జాయిస్, ఆస్కార్ వైల్డు, షా, లారెన్సుల రచనల ద్వారా నలుగురికి తెలిసిపోయినవి ప్రచారం బాగా కొనసాగిన తర్వాత సెక్సుని గురించిన గంద్రగోళం కూడా చప్పబడిపోయింది. "ఎవడు ఎవత్తిని పెళ్ళి చేసుకొంటే ఎవరికి కావాలి! ఇది తెలుసుకోడం కోసం మూడు రూపాయలు యిచ్చి మూడు గంటలు హాల్లో కూర్చోనా?" అని ప్రశ్నించాడు, ఇబ్సెన్ శిష్యుడైన షా. అయినా కూడా సెక్స్, సమాజాన్ని కవ్విస్తూ, ఆకర్షిస్తూ, చెలగాటం ఆడుతూనే వుందంటే సెక్స్ వుద్యమం పూర్తిగా కొనసాగలేదని అనుకోవచ్చు.

ఇంచుమించు యింతటి విప్లవమూ చలంగారి రచనల ద్వారా తెనుగు దేశంలో వచ్చింది; చలంగారిని బయట తిట్టినా ఎందరో – ముఖ్యంగా యువతీ యువకులు చలం కథలను పరుపుల క్రింద దాచుకుంటూ రహస్యంగా చదివారని చెప్పుకొనేవారు. వారికి కావలసింది వాటిల్లో వుంది. అది ఎవరిమటుకి వారికి తెలుసు. పదిమందీ గుమిగూడి సమూహ ఉద్రేకంలో పడ్డప్పుడు మాత్రం చలంగారి గ్రంథాలని నైతిక ప్రవాహంలో టురద గుంటలు చేసి వాటిలో కప్పెట్టేవారు. సమాజం ఆనకట్టలు వేసినకొద్దీ చలంగారి వుద్యమ ప్రభావం హోరు ఎక్కువవుతూ వచ్చింది. ప్రచారం హెచ్చింది. ఫలించింది. ఈనాటి సంఘం

చాలావరకూ ఈ ఉద్యమం ప్రధాన సూత్రాలను ఆమోదించింది నైతిక ఆదర్శాలను పరామర్శించడానికి ఈనాడెవరూ చలంగారి రచనలు చదువుతారని నే ననుకోను; ఉద్యమం ఫలించగానే దాన్ని ఉద్బోధించిన రచన విలువ తగ్గుతుంది ఫ్రెంచి మహా విప్లవాన్ని ప్రేరేపించిన రూసో గ్రంథాన్ని విప్లవం ముగియగానే తమ చర్మంతో బైండు చేస్తాం అన్నారట ఫ్రెంచి ప్రజ

తమ ప్రచారం పూర్తిగా ఫలించిందని చలంగారు నమ్మినట్టు లేదు. చలంగారు తమ స్త్రీ అనే గ్రంథానికి 1930 లో వ్రాసిన ఉపోద్ఘాతాన్ని మళా ఇరవై ఏళ్ళ తర్వాత ఆ పుస్తకానికే వ్రాసిన ఉపోద్ఘాతాన్ని పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది "అత్త అధికారం నుంచీ, భర్త అధికారం నుంచీ తప్పించుకుంటున్న నవీన స్త్రీ; షోకులకు, సంఘ గౌరవానికి, బానిసవుతోంది ఒక పురుషుడి నీడ క్రింద నుంచుని లోకాన్ని ధిక్కరించగలిగే యిల్లాలు ఈనాడు సంఘ గౌరవం పేర, విద్య పేర, ఉద్యోగం పేర, ఫ్యాషన్ పేర, వెయ్యి మందికి దాస్యం చేస్తోంది, నవీన స్త్రీకి చుట్టూ స్త్రీలందరూ అత్తలైనారు!" అని వాపొయ్యాడు చలంగారు. అంటే ఆయన సంకల్పం పూర్తిగా సిద్ధించ లేదన్న బాధ వున్నట్లుగా మనం గ్రహించవచ్చు. పెద్ద కార్యం తలపెట్టిన ప్రతి వ్యక్తిలోనూ కొంత అసంతృప్తి వుండడం సహజం

అయినా చలంగారి రచనల ద్వారా సంఘంపై పడిన ప్రభావం మానసిక మైనది అది, మనుష్యుల దృక్పథంలో వొచ్చిన మార్పు మర్యాద, కుటుంబ గౌరవం ఇతరులేమనుకుంటారో అని బాహ్య ప్రపంచంలో గీట్లు గీసుకొని సంచరించే మధ్య తరగతివారిపై వారి రచనల ప్రభావం ఎక్కువగా పడింది. భాగ్యవంతులకీ ఇతరులకు భయపడే అవసరం లేదు. బీదవారికి నైతిక చింతనతో నిమిత్తం లేదు. ఇంక మిగిలింది మధ్య తరగతివారు. వారి మనస్తత్వాలను, వాంఛలను అలవాట్లను చలంగారంత బాగా అర్థం చేసుకొని స్పష్టంగా చర్చించిన మరొక వ్యక్తి నాకు కనబడలేదు. కొద్దిమంది విద్యార్థులు, ఉన్నతోద్యోగులు, రాజకీయాలలో పడ్డ కొందరి వ్యక్తులను మినహాయిస్తే మిగిలినవారు— వర్తకులు, వ్యవసాయదారులు, ప్లీడర్లు, డాక్టర్లు, మాస్టర్లు. వారందరి సంసార జీవితాలను చలంగారంతటి ప్రతిభతో చిత్రించిన మరొక రచయిత లేడను కొంటున్నాను.

"నాకు ఒక్క నిమిషం విశ్రాంతి నివ్వక మహా ప్రణయమారుత వేగం మీదనో అగాధవియోగ భారంకిందనో చీల్చి, నలిపి, ఊపిరాడక నా జీవితాన్ని పాలించే స్త్రీ లోకానికి నివేదితము"

అది చలంగారి "స్త్రీ" కి అంకితము. చలంగారి వ్యక్తిత్వం, శైలి, నైతిక తృష్ణ, ఆదర్శం, ప్రతిభ — అన్నీ వున్నాయి యీ వొక్క వాక్యంలో. చలం గారు చెప్పేదేమిటి? తమ 'స్త్రీ' కి మొదటి మాట యిది:

"స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకు మెదడు వుంది, దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకి హృదయం వుంది. దానికి అనుభవం ఇవ్వాలి. అనే సంగతి గురించి, ఈ దేశానికి నేనురాసే ఈ సంగతులు అర్థం అవుతాయా?'

అర్థమౌతాయి. ఈనాడు ఎందరో స్త్రీలు రచనకు పూనుకోవడమే ఇందుకు తార్కాణం మరొక చోట ఇల్లా వ్రాసుకున్నారు. వారి "స్త్రీని" గురించి "ఇల్లాంటి పుస్తకం నా చిన్న తనంలో నాకు దొరికితే నా జీవితాన్ని ఎన్నిరెట్లు పవిత్రవంతమూ, సార్థకమూ చేసుకోగలిగేవాణ్ని, నా వంటివారు యీ నూతన యుగంలో వున్నారేమో?"

తప్పకుండా వున్నారు అట్లాంటి వారిని తయారు చేయడం, చలంగారి రచనలు సాధించిన ప్రయోజనం. బీదల క్షేమం కోరే వారు ధనికుల నుద్దేశించి వ్రాయాలి. బలహీనుల మేలు కోరేవారు బలవంతుల నుద్దేశించి వ్రాయాలి పాపుల సౌఖ్యం కోరేవారు. యోగిపుంగవుల నుద్దేశించి వ్రాయాలి. అల్లాగే స్త్రీలోకం బాగు కోరేవారు, పురుషుల నుద్దేశించి వ్రాయాలి. అట్లాంటి రచనలవల్ల స్త్రీలలో వొచ్చిన మార్పును సంశయించే అవకాశం వుంటుందేమో కాని, కొందరి పురుష హృదయాల్లో కాస్తో కూస్తో మార్పు వొచ్చి తీరుతుందనిపిస్తుంది. ఇల్లాంటి జిజ్ఞాస, స్త్రీలలోనూ, పురుషులలోనూ వొచ్చింది. కొందరిలో పెరిగింది- ఇది చలంగారి రచనల ప్రభావం

నే నింతవరకూ చలంగారిని ఒక సంఘ సంస్కర్తగా పరిగణిస్తూ వచ్చాను కాని ఈనాడు ఆయన్ని ఒక రచయితగా చెప్పుకుంటున్నాం. సోక్రటీస్ ఒక సంస్కర్త; ఆయన ఏ రచనా చేయకపోయినా ప్లేటో మొదలైన శిష్యబృందం రచనల్లో ఒక తత్వవేత్తగా ప్రత్యక్షమవుతాడు. అట్లాగే చలంగారు - కథలు, నవలలు వ్రాయకుండా 'స్త్రీ', 'మ్యూజింగ్స్' కొన్ని లేఖలు మాత్రం వ్రాసివుంటే ఆయన ఒక సంస్కర్తగా పరిగణింపబడి వుండును. "ఒక వ్యక్తి ఎందుకు సంస్కర్తగా తయారవుతాడో ఎవ్వరికీ తెలియదు. ఏవో కొన్ని చెడ్డ పనులు, అపచారాలు, పాపాలు చేసి పశ్చాత్తాపపడి స్వయం సంస్కారానికి పూనుకొని సఫలుడై ఆ దశలో సంఘ సంస్కారానికి పూను కుంటాడు" అని విలియంజేమ్సు మొదలైన తత్వజ్ఞులు చెపుతున్నారు. తనలో

ఏదో కొంత చెడుగు వుండందే అసలు కళా సాధనకి పూనుకోడని చాలా మంది అభిప్రాయపడుతున్నారు

పూర్వం సంసారాన్ని త్యజించి, ఏ అడవిలోకో పోయి తపస్సు చేసే వారు.

ఇది పారిశ్రామిక యుగం ఎవరెస్టు శిఖరం ఎక్కితే, తీరా అక్కడ ఒక కాఫీ హోటలు వుంటుందని భమిడిపాటి కామేశ్వరరావుగారు అనేవారు. ఇప్పుడు ఆధ్యాత్మిక సమరం అంత ప్రశాంతంగా జరుపుకొనే అవకాశాలు లేవు. ఏ సంఘంలోనో, ఏ సభలోనో కలిసిపోయి గుంపు సంస్కృతికి ఉద్రేకానికీ లొంగిపోయి, వ్యక్తిత్వాన్ని దిగమింగుకోవాలి ఇదీ చేతకాని ఏ కొద్ది మందో కళాసృష్టికి పూనుకుంటారు. సంస్కర్తగా రచనలు చెస్తాడా, రచనలు చేసిన తర్వాత సంస్కర్తగా తయ్యారవుతారా, అనే విషయానికి సూటిగా సమాధానం రాదు. టాల్‌స్టాయి, వాల్టు విట్‌మన్, వేమన, సంఘంలోంచి పారిపోయినవారే; వెళ్ళిపోయి ఏదో సాధించాం, అని తమ సిద్ధాంతాలను, ప్రవర్తనను సమర్థించుకొన్నా సమకాలికులకు వారిపట్ల అంత గిరి కుదరలేదు "టాల్‌స్టాయి 'అనాకరీనైనా' (Ann Karenina), 'క్రుయిట్జర్ సొనటా' (Kreutzer Sonata) లాంటి మరికొన్ని నవలలు వ్రాయకుండా మతం పైనా, కళ పైనా ఆధ్యాత్మిక చింతనతో కూడుకున్న గ్రంథాలు వ్రాసి తన కాలాన్ని వృధా చేశాడు." అని ఈనాటి విమర్శకులు అంటున్నారు. అల్లాగే తన నాటకాలకి దీర్ఘమైన ఉపోద్ఘాతాలు వ్రాసి అలజడి కలిగించినా, షా ఉపోద్ఘాతానికి ఈనాడు ఏమీ విలువ లేదని, ఆ నాటకాలే చాలునని పెద్దలంటున్నారు దీన్నిబట్టి మనం ఒకటి గ్రహించవచ్చు. తాను చెప్పతలుచుకున్నది కళాభూయిష్ఠంగా చెప్పలేకపోయినప్పుడు రచయిత ఉపన్యాసాలకి, వ్యాసాలకి దిగుతున్నాడని. రచయితకి మూడు రకాల బాధ్యత లుంటాయి. ఒకటి తన పట్ల, రెండోది సమకాలికుల పట్ల. మూడోది భవిష్యత్ పట్ల. సమకాలికుల కోసం ఉపన్యాసాలు, వ్యాసాలు అవసరమవుతాయి, తనపట్ల బాధ్యత నిర్వర్తించుకోవాలంటే, స్వీయ కథ పూనుకోవాలి; సెయింట్ ఆగస్టైన్, రూసో, గాంధిగారు, వీరేశలింగంగారు, ప్రకాశం పంతులుగారు, నెహ్రూగారు లాంటి పెద్ద లెందరో ఆత్మకథలు వ్రాసుకున్నారు. చలంగారి మ్యూజింగ్సు ఒక రకమైన అంతరంగ కథనం. ఇంక మూడోది భవిష్యత్తు పట్ల బాధ్యత. అంటే తన రచనలకి ఇతర రచయితలపై గల ప్రభావం ఒక సంప్రదాయంగా స్థిరపడిపోయి ముందు తరాలు నడిచే సాహిత్యపు బాటలో ఒక మైలురాయిగా ఉండిపోయినప్పుడు దాని ఒడ్డూ, పొడుగూ, రంగూ ఆకృతీ తనే నిర్ణయించుకోడం కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ గారలు, యీ బాధ్యతని

గుర్తించే వ్యర్థ రచనకి పువక్రమించరనుకుంటాను. షెక్స్పియర్, కాళిదాసులు స్వీయ చరిత్రకి పూనుకోకపోవడం వల్ల సాహిత్య విమర్శలకు బోలెడు పని కల్పించారు.

రెండో రకం బాధ్యతను గుర్తిస్తూ చలంగారు 'స్త్రీ' వ్రాశారు. 'ఒక పువ్వు పూసింది' లాంటి రచనలు శాశ్వతంగా భవిష్యత్ కోసమే అనుకోవచ్చు. అంటే సంఘ సంస్కారంతో ముడిపడని కళానుగుణమైన విలువగల రచన అన్నమాట ఇప్పుడు చలంగారి రచనలలో సాహితీ విలువలను పరామర్శించ నవసరము లేదు అది ఏనాడో జరిగిపోయినది. ఆయన రచనలలో వచ్చి శృంగారం, బూతు, అశ్లీలం, నైతిక అరాజకత్వం, సెక్సుపై ఆరాధనాభావం వీటన్నింటినీ సోదాహరణంగా విమర్శించి విలువలు కట్టేశారు. ఒక కొత్త చెప్పదల్చుకొన్నప్పుడు అది సామాన్య మానవునికి కూడా అర్థం కావాలంటే ఆ విషయాన్ని బిగ్గరగా, పదే పదే, చెప్పే అవసరముంటుంది. పదేపదే చెప్పడం వల్ల రచయితకి ఆ ఒక్క విషయమే ప్రధానంగా కనబడి మిగతా వాటిపట్ల విముఖత చూపడం జరగొచ్చు చలంగారిలో యిది జరిగిందనుకుంటాను. గైడీ, మొపాసా, సోమర్సెట్ మాం రచనల్లో కూడా ఈ రకమైన ఒకే వస్తువుపై అభిమానం కనిపిస్తుంది ఈ అభిమానం సడలి ఊహాబలం వికేంద్రీకరింపబడి నప్పుడల్లా ఉత్తమమైన కళాఖండం బయటపడుతూ వుంటుంది. చలంగారి 'ఓ పువ్వు పూసింది', 'నవీన సారంగధరుడు' ఇట్లాంటి ఉత్తమ రచనలుగా ఉదహరిస్తాను. మీ కిష్టమైన చలంగారి రచనను ఒకదాన్ని పేర్కొనండీ అంటే ఆయన సారంగధరుణ్ని పేర్కొంటాను ఆ ఊళ్ళో ఆయన పాపం చాలా మంచివాడు ఇంట్లో యౌవనంలో వున్న సవతితల్లి ఆకర్షణలో పడకుండా నీతిపరుడుగా, సారంగధరుడుగా ఆ వూరిలో పేరు పొందాడు. ఆయన ఒకసారి పట్నం వెళ్ళడం సంభవించింది. రైలు దిగగానే కొందరు మిత్రులు కార్లో యెక్కించుకొని ఒక పెద్ద భవనానికి తీసుకు వెళ్లారు. ఆ హాల్లో ఆయన్ని దిగవిడిచి మళ్లా వస్తామని వాళ్ళు వెళ్ళిపోయారు. ఆయన ఏకాంతంగావున్నప్పుడు ఒక అందమైన స్త్రీ ఆ హాల్లోకి వొచ్చి ఆయనతో సరసాలు ప్రేమకలాపం మొదలెడుతుంది. ఆయన మొదట్లో ఒప్పుకోడు. ఇదంతా తప్పని ఆమెను వారిస్తాడు. ఆవిడ వూరుకోదు. ప్రణయం సాగిస్తూనే వుంటుంది. ఆయన అనుకుంటాట్ట. 'ఇది మన వూరుకాదు. పెద్ద పట్నం వచ్చాం మనల్ని ఎరిగున్న వాడు ఎవరూ లేరు. మనం ఏం చేసినా ఎవ్వరికీ తెలియదు. ఈ ఒక్కసారి ఛా ప్పేసుకుంటే తప్పేముందీ; మా ఊళ్ళో నాకు మంచి పేరు ఎల్లానూ వుంది,'

అనుకుంటాడుట. అనుకుని వాప్పేసుకుంటాడు; వెంటనే హాల్లో గోడచుట్టూ అమర్చబడిన కర్టెన్ల వెనుక నుంచి జనం బయటపడతారు. "కొంప తీశావయ్యా మేము సారంగధర సినిమా తీస్తున్నాము. నువ్వేదో సారంగధరుడిగా పేరు పడి వున్నావు నటించటం అంటూ లేకుండా, సహజంగా అమాయకుడిలా ఈ పాత్రని బాగా నిర్వహిస్తావని ఏదో మిష మీద నిన్నిక్కడికి రప్పిస్తే, అది కాస్తా భగ్నం చేశావు", అంటూ ఆ ఫిల్ము నిర్మాతలు ఆయన్ని ఆడిపోశారు.

ఈనాడు చలంగారి రచనలలో స్వచ్ఛమైన కవిత్వపు పోకడలను అందరూ గుర్తిస్తున్నారు. మనుష్యులనూ ప్రకృతినీ సమన్వయపరచి కవి దృక్పథంతో చిత్రించగల ప్రతిభాశాలి, చలంగారు. కవుల కవితలో కొన్ని మెళుకువలు, సంగీతంతో మేళనమైన వింత ధ్వని సౌందర్యం, ఆయనలో లేకపోవచ్చు. అయినా, ఆయన వర్ణనల్లో అపూర్వమైన శక్తి, స్పష్టత సమయస్ఫూర్తి, చటుక్కున దిగ్భ్రమ కలిగించే వుద్వేగమూ గోచరమవుతాయి. ఒకటి రెండు వుదాహరణలు - "సూర్యుడు పైకి లేచి పెద్ద చెట్ల ఆకు నీడలని మంటపెడు తున్నాడు. ఆకాశాన మధ్య మండిపడే భాస్కరుడి కంట పడింది ఆ పువ్వు తల్లి. పరిమళం లేని, మధువు లేని రంగు తప్పిన ఆ పువ్వుని అనవసరమని తల వూపింది సృష్టి. రేకులు రంగు తప్పి ముడతలు పడ్డాయి. కేసరాలు ఒక్కొక్కటే ఊడి జాలిగా కింద ఆకులమీద వాలి, గాలి ఊపుకి దుమ్ములో పడ్డాయి. కాని సృష్టిని తన గర్భం వైపు త్రిప్పి తననీ, తన అందాన్నీ, ప్రపంచాన్నే మరచింది - పువ్వు."

వాడిపోయిన పువ్వుని ఇంత అద్భుతంగా వర్ణించిన రచయితని గొప్ప కవి అనడానికి సందేహించను నేను. ఇప్పుడు మన దేశంలో కవులకున్న పలుకుబడి రచయితకి లేదు - అంటే గద్య రచయితకు అసలు రచయిత అన్న పదం, దాని వెనుక వున్న సాముదాయకపు చిహ్నం ఇంకా సమాజంలో గుర్తించబడి స్థిరపడిపోలేదు. పాశ్చాత్య దేశాలలో గుర్తించారు.

ఇటీవల నోబెల్ బహుమానాలు గద్య రచయితలకు రావడం గుర్తించ తగినది. హెమింగ్‌వే, బెర్ట్రెండ్ రసెల్, విలియం ఫాల్క్‌నర్, బారిస్ పాస్టర్‌నాక్, జీన్‌పాల్ సార్త్రె, వీరందరూ గద్య రచయితలే. వీరి రచనలలో కవితా వస్తువు, సామగ్రి, ఊహాబలం వున్నాయి, అవి వున్నప్పుడే ప్రసిద్ధ రచయితగా సాహిత్య రంగంలో స్థానం ఏర్పడుతుంది. చలంగారికి కూడా

యిట్లాంటి స్థానం ఏర్పడినట్లు తోటి రచయితలు గుర్తించడమే ఆయనకి సమర్పించుకోగల కానుక.

చలంగారి రచనలలో కవిత్వమే కాకుండా హాస్య ధోరణి, అవహేళన కూడా వుంటాయి. సాధారణంగా ఊహ, హాస్యం, కలవ్వు. హాస్యం విషాదం అల్లాగే వొకరిలో కలవ్వు. చలంగారిలో యివన్నీ కలిసి, సమైక్యతని పొందడం వొక విశేషం. ఆయన వొస్తువు పట్ల అభిమానాన్ని విస్మరించి కళాపూరితమైన సృష్టి ప్రవాహంలో తరుచు పడిపోవడం జరిగివుంటే యింకెంత బాగుండునో - అని అప్పుడప్పుడు విచారించినా, వున్నదానితో తృప్తి పడటానికి అలవాటు పడిపోవాలి. అట్లాంటివి యింకా వ్రాయనందుకు ఆయన్ని విసుక్కోకుండా వున్న వాటిల్లో సౌందర్యాన్ని కాలంతో మారే మన స్తత్వంతో కొత్త కోణంలోంచి ఆస్వాదిస్తూ, యీ ఆనందాన్నిచ్చినందుకు ఆయనకు కృతజ్ఞత చెప్పుకోడం మన విధి. కాలం జరిగినకొద్దీ, కొన్ని వొస్తువులు, దూరంగా వెడతాయి. మరి కొన్ని దగ్గరగా వొస్తాయి - స్థానాలు, కోణాలు మారుతూ వుంటాయి. మారి మారి స్థిరపడి కొన్ని శిఖరాలుగా నిలిచిపోతాయి. చలంగారు ఎంత పెద్ద వ్యక్తో సమకాలికులమైన మనం చూడలేకపోవొచ్చు కాని ముందు తరాల వారైనా చూసి గ్రహించే వాతావరణం పరిస్థితులు సమకూర్చడం మన బాధ్యత.

# జీవితంపట్ల బాపిరాజుగారి దృక్పథం

బాపిరాజుగార్ని గురించిన తమ జ్ఞాపకాలు ఇతరులతో పంచుకోడానికి వుత్సాహపడని వారుండరనుకుంటాను. కాని ఆయన్ని గురించి వ్రాయకూడక పోవడానికి కారణాలున్నాయి. ఆయన రచనలేవీ జాగ్రత్తగా చదవలేదు; వారి 'నారాయణరావు' కూడా యింతవరకూ పూర్తిగా చదవలేదు. ఆయన రచనలకు నాపై ఎట్లాంటి ప్రభావమూ లేదు ఆయన్ని బాగా ఎరుగను కూడా.

బాపిరాజుగారితో, పదిహేను సంవత్సరాల కాలంలో అంతా కలిపి పది పన్నెండు గంటలుంటుంది నా పరిచయం. రచయితగా, చిత్రకారుడిగా ఆయనంటే నాకు ఎట్లాంటి అభిప్రాయం వున్నదీ ఎవరికీ ముఖ్యం కాదు. కళా రంగంలో వారి అంతస్థు, కీర్తి నాకింకా జ్ఞానం రాకముందే స్థిరపడిపోయినవను కోవచ్చు. ఇంతవరకూ అవి క్షీణించిన సూచనలు కూడా కనబడవు. ఆయన ఏ వుద్యమాన్నీ లేవతీయలేదు; ఏ సిద్ధాంతాన్నీ, తీవ్రంగా ప్రచారం చెయ్యలేదు. అందుచేత సాహిత్య రంగంలో ఆయన రచనల విలువని గురించి అభిప్రాయ భేదాలు లేవు. ఆయన జీవించి వున్నప్పుడు చిత్రకారులు 'ఆయన నవలాకారుడు; వారి చిత్రాలను గురించి మనం పట్టించుగోనక్కరలేదు అనీ, రచయితలు 'ఆయన చిత్రకారుడు; రచనలను గురించి మనం పట్టించుగోనక్కరలేదు' అనీ అనుకున్నా, యీనాడు ఉభయులకూ ఆయన కావల్సిన వ్యక్తే.

కొందరి వ్యక్తుల కీర్తి, కీర్తిశేషులైతేం తర్వాతగాని బైటపడదు బాపిరాజు గారు వీళ్ళల్లోవారు కారు. మరి కొందరి ప్రతిభ వారి పనులపైనా రచనలపైనా ఆధారపడవు. తమ పనులను రచనలను మించిన వ్యక్తిత్వం గల మహనీయు లలో బాపిరాజు గారొకరనుకుంటాను ఐరోపా సారస్వత రంగంలో గెధె, అమెరికాలో వాల్ట్ విట్‌మన్, ఇంగ్లండులో వాల్టర్ పేటర్, ఇట్లాంటి వ్యక్తులు. వీరందరూ వొక జీవిత దృక్పథాన్ని ప్రచారంలోకి తెస్తారు. నాకున్న కొద్ది పరిచయంతో బాపిరాజుగారి జీవిత దృక్పథం స్వరూపాన్ని పరామర్శించడమే యీ వ్యాసం వుద్దేశం.

రాజకీయాలు, సంసారం, ఉద్యోగం, పలుకుబడి, దైనందిన వ్యవహారిక

విలువలు వీటన్నింటితో నిమిత్తం వుండాలి; కాని వీటికి లొంగిపోకుండా దూరంగా వుండి, మరో ప్రపంచాన్ని సృష్టించుగుని వ్యక్తిగతంగా పరిపూర్ణమైన, తీక్షణమైన ఆనందాన్ని అనుభవించడం - అదీ వీరి దృక్పథం. సున్నితమైన అనుభవం, సౌందర్యం, అన్వేషణతో ముడిపడని స్వేచ్ఛ, స్వచ్ఛమైన ఆనందం- యివీ వీరు కల్పించుకునే మరో ప్రపంచానికి పునాదులు ఇది వూరికే వూహించు గున్న జగత్తా లేక నిజంగా యిట్లాంటి వాతావరణంలో వుండి, వ్యక్తిగతమైన విలువల్ని సాధించారా? అనే ప్రశ్న వస్తుంది. గెథె సంఘాన్ని చివరదాకా పట్టుకుని ప్రాకులాడాడు; వాల్ట్ విట్‌మన్ దూరంగా పారిపొయ్యాడు. బాపిరాజు గారు ప్లీడరీ వృత్తిని వొదిలేసినా, సంఘంలో నుంచి పారిపోలేదు. సంఘంలో వుండే నిర్దేశించుకున్న జీవిత విధానాన్ని అచరణలో పెట్టారు. 'నాకివి కావాలి; నేనిట్లా చేస్తాను.' అనుకుని, వీటికోసం కొన్నిటిని వొదులుకొని, సాధించ గలగడం అనుకున్నంత సుళువు కాదు. ఈ యత్నంలో బాపిరాజుగారు కృతార్థు లయ్యారా అంటే, చాలావరకూ అయ్యారనే నే ననుకుంటున్నాను.

'గోదావరి వొడ్డు, యిసకలో పడుకుని ఆకాశంకేసి చూస్తూ గడిపిన క్షణాలే నా కెంతో ఆనందం కలిగించాయి' అన్నారు వొకసారి నాతో బాపిరాజు గారు. ఈ రకమైన ఆనందాన్ని జీవితంలో హృదయపూర్వకంగా అన్వేషించి, పొందగలిగిన వ్యక్తి ధన్యజీవి. బియ్యం కోసం దాచిన పాతిక రూపాయలతో, తటస్థపడితే చక్కటి పరిమళం గల అత్తరుని కొనేసి, వస్తుండడానికి యిష్టపడే తత్వం ఆయనిది. ఆ పరిమళం కేవలం ఆయనకోసంకాదు. దాన్ని గాలిమోసుకు పోయి, కెరటాలలో లీనమై సముద్రాన్ని వుప్పొంగేటట్లు చేస్తే ఆయనకు తృప్తి.

వీధిలో సంసారం, అడవిలో రహస్యం, పది మందిలోనూ వ్యక్తిత్వ ప్రకర్ష, వీట్లకు అలవాటుపడిన బాపిరాజుగారు సంతోషాన్ని దాచుకోలేరు. అది అందరికీ తెలియపరచాలి; అదేమిటో తెలియవరుస్తూ, పద్యంగానో, ఉత్తరం గానో, అవసరమైతే నవలగానో బహిర్గతం చేస్తేగాని ఆయనకి శాంతి లేదు. ఆ సమయంలో ఆయన ప్రక్కన వున్నవారు అదృష్టవంతులు. ఆయన చెయ్య లేని పని వారు చేసేస్తారు. ఆ విధంగా వ్యక్తుల్ని వుద్రిక్తుల్ని చేసే ప్రతిభ బాపి రాజుగారిది. కేవలం వుద్రేకం, వుత్సాహం గొప్ప రచనని సృష్టించలేవు. ఈ శక్తుల్ని తార్కిక శిక్షణలో తర్ఫీదు చేసి, నూతన తత్వానికి ఆహుతి చేస్తేగాని గొప్ప రచన రాదు. బాపిరాజుగారికి యిందుకు తగిన వోపిక, గడువు లేవు. అందుకే కాబోలు చివరి రోజులు 'నారాయణరావులో' సవరణచేస్తూ గడిపారుట.

బాపిరాజుగారు గొప్ప రచయిత; కాని ఆయన కలం నుండి సమాజం ఆశించిన గొప్ప రచన రాలేదేమో.

ఆనందాన్ని యితరులతో పంచుకునేటందుకు, బాపిరాజుగారు వుత్సాహ పడతారు; కాని కష్టజీవులపట్ల సానుభూతి వున్నా దుఃఖాన్ని, బాధని, తిలకించి, యితరులతో పంచుకోవాలన్న కాంక్ష ఆయనలో లేదనుకుంటా. ఒక వ్యక్తికి జబ్బు చేసింది అనగానే ఆ వ్యక్తిని గురించి ప్రసంగించడానికి అయిష్టత చూపడం నే నెరుగుదును జీవితంలో వీరి ఆంతరంగిక అనుభవాలు ఏవో నాకు తెలియదు. కాని జీవితంలో వున్నాయన్న విషయం చెడుగు, బాధ, బలహీనత తెలిసి కూడా అంతగా పట్టించుకున్నట్లు లేదు. వీటిని ఎదుర్కొన్నప్పుడు, ఊహలోకి ఎగిరిపోయి బొమ్మలు గీసో, పాటలు వ్రాశో మరిచిపోతారను కుంటాను ఈ రకం వ్యవస్థలోనించి జనించిన చిత్రాలకి, పాటలకి, పరిపూర్ణత వుండదు. బాధ నుండి పారిపోవడం తాత్కాలికమే, అది ఎప్పుడో చుట్టుముట్టి, కుంగదీసి, సృష్టించుగున్న మరో జగత్తు పునాదుల్ని కదుపుతుంది ఈ విషయం ఆయనకి స్ఫురించిందనే నా అనుమానం 19 వ శతాబ్దంతో ప్రబలిన **Romantic Temperament** సాక్షాత్కారం చేసుకున్న కళాజీవి బాపిరాజుగారు.

ఆయన నవల్ని గురించి మాట్లాడుతూండగా, దాని ప్రశంస వొదిలి, మరో నవల గురించి ప్రారంభించేవారు; సరే అనుకొని, ఆ నవలను గురించి చర్చిస్తూండగా, అది కాదు యీ నవల చదివావా? దాన్ని గురించి చెప్పు అని మూడోదాన్ని స్మరించేవారు. చివరికి ఆయన వ్రాయదల్చుకున్న నవల ప్రశంశతో మా సంభాషణ అంత మొందింది. నిజానికి మరో నవల వ్రాద్దామన్న పట్టుదల గాని అవసరం గాని ఆయనకి లేవనుకుంటాను. ఎందుకంటే నిత్య జీవితమే వొక నవలగా వుండాలనే దృక్పథం వారిది. ఇట్లాంటివారు జీవితంలోని అనుభూతులను అనుకరిస్తారు గాని, కొత్తవాటిని సృష్టించరు.

బాపిరాజుగారి అనుకరణ ప్రతిభ (**Imitative genius**) అనుకుంటాను. దొరసానుల పాటలు, నాట్యం ఆయన వేదికలపై అనుకరించగా నే చూశాను. ఇతరుల ప్రత్యేకమైన చేష్టలను మాటలను, చివరికి స్వభావాలనూ అనుకరించగల 'నటనా' చాతుర్యం ఆయనకి వుంది. ఒకప్పుడు కళోపాసన తత్వం చలామణీ అయింది. కళను వింత సరంజామాతో ఆరాధించడం, కళాకారుడు అందరిలోకి ఉత్తముడు, ముఖ్యుడు - అనుకోడం ఫాషన్. బాపిరాజుగారు ఈ ప్రచారానికి లొంగిపొయ్యాడు, ఆయనకి అభిమానమైన కావ్య వస్తువు కళోపాసన. అభిమాన మైన పాత్ర కళోపాసకుడు. అన్ని కథలలోనూ, నవలల్లోనూ, యీ వొస్తువు

పాత్రలు వుంటాయనుకుంటూ. ఒక చిత్రకారుడో, కవో, సంఘంలో నుండి పారి పోయి, గురువుగార్ని ఆశ్రయించి కళను ఆరాధిస్తూ వుంటాడు. గురుకులంలో ఒక అందమైన స్త్రీ కళను ఆరాధిస్తూ వుంటుంది. వారి మధ్య ప్రేమ కలాపం కొనసాగుతూ వుంటుంది. గురువుగారికి తెలుస్తుంది. ఆమెనో, అతన్నో మందలిస్తాడు.

కళ కోసం ప్రేమనో, ప్రేమ కోసం కళనో త్యాగం చెయ్యడం జరిగి, విషాదాంతంగానో, సుఖాంతంగానో ముగుస్తుంది రచన. బాపిరాజుగారు ప్రచారంలోకి తెచ్చిన జీవిత దృక్పథంలో 'కళ కోసం, సౌకర్యాన్ని త్యాగం చెయ్యాలి" అనే సూత్రం ప్రధానమైనదిగా భావించవొచ్చు.

రాజకీయాలలో లీనమై, సంఘాన్ని మరమ్మత్తు చెయ్యడం-అనే సారస్వత భావం ప్రచారంలో వున్న రోజుల్లో యీ భావాన్ని అనుకరించారు. రెండో ప్రపంచ సంగ్రామం ముగిసిం తర్వాత, సారస్వత విలువలు మారిపోయాయి. 1949 వ సంవత్సరంలో మేం కలుసుకున్నప్పుడు, బాపిరాజుగారితో నేనిల్లా అన్నాను.

— ఇప్పుడు ధోరణి మారిపోయింది. మానసికతత్వశాస్త్రం సారస్వతాన్ని వొక ఊపు ఊపి సొమ్మసిల్లింది. ఈనాడు మార్క్సు సిద్ధాంతాలు సారస్వతాన్ని కలవరపెడుతున్నాయి. ఆర్థిక అసమానత్వంవల్ల కలిగిన సంఘర్షణ కావ్య వస్తువైంది. బీదలపట్ల సానుభూతి, భాగ్యవంతులపట్ల పగ, ద్వేషం; మిల్లు యజమాని కూతుర్ని హేళన చెయ్యడం; కార్మికుల సమ్మె, విప్లవం యివన్నీ ప్రచారంచేసి, సారస్వతంద్వారా రాజకీయ రంగంలో చైతన్యం తీసుకురావాలనే వుద్యమం వుప్పెనలా పైన పడుతూంటే మనం ఏం చెయ్యాలి! ఎట్లా యీ ప్రవాహాన్ని ఆపుచెయ్యడం?' అని ప్రశ్నించాను. 'మనం ఆపు చెయ్యడం ఎందుకూ? మనమూ అల్లాగే వ్రాద్దాము' అని బాపిరాజుగారి సమాధానం.

కథానికలకి ఎక్కువ ప్రచారంవున్న రోజుల్లో ఆయన కథలు వ్రాశారు: జానపద గేయాలని ప్రజలు పాడుకుంటున్నారు అన్నప్పుడు అవి వ్రాశారు. నవలలు - ఫలానా వొస్తువుని చిత్రించేవి — కావాలంటే అవి వ్రాశారు. ఈ రకంగా ప్రజలు కావాలన్న వాటిని వ్రాయడంలో ఆక్షేపించవల్సింది ఏమీలేదు. ఇట్లా వ్రాయటం స్థిరపడని మనస్తత్వానికి చిహ్నం. స్థిరపడని మనస్తత్వం రచయితకి చాలా అవసరమైనప్పటికీ, ప్రధానమైన జీవిత సమస్యలపట్ల సిద్ధాంతీకరణ జరిగితేగాని, రచనలో పటుత్వం, శక్తి వుండకపోవచ్చు. స్థిరపడిపోయిన ఆశయాలు, గాఢంగా వాంఛించిన ఆదర్శాలు బాపిరాజుగారిని ఉద్రేకపరచ

లేదనుకుంటా. భావాలతో, ఆదర్శాలతో నిమిత్తంలేని, ప్రకృతి సౌందర్యం, అనుభవంలోని మాధుర్యం, పసితనంలోని అమాయకత్వం, యవ్వనంలోని అస్పష్టమైన లావణ్యం - వీటిని చిత్రించినప్పుడే బాపిరాజుగారి నిజస్వరూపం వ్యక్తమౌతుంది. కొండలంటే ఆయనకి మహా యిష్టం; రచనలపేర్లు, వాస్తువు అవే వింధ్యాచలం: తిరుపతి కొండమెట్లు, పాపికొండలు, భోగిరలోయ మొదలైనవి. బాల్యం తాలూకు ఉత్సాహం, సౌకుమార్యం, చివరివరకూ బాపిరాజు గారిలో ఉండిపోయ్యాయి. ఆయన ఎదగలేదు నది వొడ్డున ఇసుకలో పిల్లన గ్రోవిని తుంచి దూదుంపుల్ల ఆడుకునేవాడు వరదలొచ్చి వెళ్ళాయి. ఇసుక పాదాలకింద కదిలి, పూడుకుని గడ్డకట్టింది. నదే కొత్త తోవలోకి పారింది; పరిసరాలు మారిపోయినవి. ఇంకా బాపిరాజుగారు, దూదుంపుల్లల్ని ఏరుకుని, తుంచిన రెంటినీ కలిపి, పిల్లనగ్రోవిగా ప్రమోగించాడు అది ధ్వనించదు కాని ఆ దృశ్యానికి అలవాటుపడ్డ నాబోటివారికి, గానం, ఏ కొండలోయలోనో మారు ప్రమోగినట్లుగా వినిపిస్తూనే వుంటుంది. భావాలతో, ప్రయోజనంతో, విలువలతో నిమిత్తంలేనిది చిత్రలేఖనం. బాపిరాజుగారు స్వేచ్ఛగా విహరించేటందుకు అనువైన జగత్తు చిత్రకళ బాపిరాజుగారు గొప్ప చిత్రకారుడనుకుంటా. 'రేఖ'లో అద్వితీయమైన ప్రతిభగలవాడు నా చిన్నతనంలో ఆయన రచించిన 'సముద్ర గుప్తుడు' చూశాను. తరవాత అజంతా చిత్రాలతో, బొమ్మలద్వారా పరిచయం కలిగింది. బాపిరాజుగారి చిత్రలేఖనం అజంతా అనుకరణ. ఆధునికులు అజంతా ని ఆక్షేపించడం వుంది. 'భారతదేశంలో, 'కళ' అంటే 'అజంతా' అని అర్థం. అజంతాకేసి చిత్రకారులు వెన్ను చూపితేగాని వారికి విముక్తిలేదు.' అన్నాడు బెవెర్లీ ని కాల్స్. ఆధునిక ఊహాచిత్రాలని మెచ్చుకోడం ప్రస్తుతం ఫాషన్. ఈ మెప్పుగోడంకోసం, అజంతాని చులకనచేసే తత్వంపట్ల నాకు సానుభూతిలేదు. అజంతా 'రేఖ'లో అపూర్వమైన సౌందర్యంవుంది. సౌందర్యాన్ని గురించి యుగ యుగాలుగా మానవుడిలో ఉండిపోయిన అభిప్రాయాలు తారుమారై, సౌందర్య తృష్ణ నశించేటంతవరకూ, అజంతా సౌందర్యం ఉండిపోతుందనుకుంటాను.

అజంతాని అనుకరించడంలో బాపిరాజుగార్ని ఆక్షేపించనక్కర్లేదు. కళలో కూడా సౌందర్యతృష్ణ, రేఖా చిత్రణలో ప్రతిభ మాత్రం చాలవు. శిక్షణకు గురైన ఉద్రేకం ఒక దర్శనానికి (Vision) ఆహుతి అయితేగాని, గొప్పచిత్రంరాదు. ఈ 'దర్శన' ఆయనలో లోపించిందనుకుంటా. 'ఈ శక్తులు నాలో వున్నాయి. వీటిని ఎల్లా వుపయోగించను!' అని ఆయన అడుగుతాడు. ఆయనకి సలహా ఇచ్చినవారు లేరు. మిత్రులు తమ పద్యాలకి బొమ్మలు గీసిపెట్ట

మంటారు ఆయన గీస్తాడు; 'మా గోడని వో బొమ్మ తగిలించుకుంటాం' అనీ ఎవరేనా అడిగితే, ఆయన వ్రాసి పెడతారు ఒకమారు నేను, 'యెంకిపాటల'కి సరదాగా గీసిన బొమ్మల్ని చూసి బాపిరాజుగారు 'నా పాటలకి కూడా బొమ్మలు నువ్వు గియ్యాలిసుమా' అన్నారు. మానవ హృదయంలోని పసితనం రోదన యింత ప్రస్ఫుటంగా నేనెప్పుడూ వినలేదు.

ఆయన చిత్రాలు, రచనలు - వీటికంటె గొప్పవాడు బాపిరాజుగారు. హృదయంగల మానవతత్వవాది. జీవితం అనుక్షణంపొందే పరిణామాన్ని చూసి ముగ్ధుడై ఆశ్చర్యంతో వొణికిపోయి ఆప్యాయతతో ఎవరిభుజాన్నో తట్టడానికి, తిరుగాడే యాత్రికుడు. జీవితం ముసలమ్మలా మూలుగుతుంటే అందంగా మూలగమంటాడు; ప్రేమహృదయం పగిలి ముక్కలై పడితే, ఆ ముక్కల్ని ఏరి ఒక పద్ధతిలో, కళానుగుణంగా పేర్చి ఆ దృశ్యాన్ని చూడమంటాడు. కన్నీటి బిందువుదగ్గర చెవిపొంచి, గానంకోసం అన్నట్లుగా వింటాడు. ఆయన నిరంతర యువకుడు; ఆయనకి వార్ధక్యంలేదు; గతించిన యవ్వనాన్ని చూసినప్పుడు తప్ప ఆయన హృదయం ద్రవించదు. పదహారోఏట నన్ను చూశాడు, మళ్ళా పన్నెండు సంవత్సరాల తర్వాత, వోమారు నన్ను చూశాడు. 'ఇదేమిటి యిల్లాగైపొయ్యావు' అని ఆశ్చర్యం ప్రకటించి 'అయ్యో' అని గొణిగాడు. ఆయన కళ్ళల్లో తడిచూశాను. ఆనాటినుండి తరుచు అద్దంలో మొఖం చూసుకోడం మానేశాను.

బాల్యంలోని సౌందర్యం, యవ్వనంలోని అస్పష్టమైన తపన, బాపిరాజు గారు బాగా ఎరుగుదురు. రచనద్వారా వీటిని పాఠకులకి అందజెయ్యగలరు. ఈ సౌకుమార్యం, వారి కవితలో, వచనరచనల్లో, చిత్రలేఖనంలో ప్రస్ఫుటంగా కనబడుతుంది. పసివాడు, జంతుజాలం, చెట్టు, పువ్వు, మేఘం, సెలయేరు - వీటిల్లో జీవంవుంది - కాని పైకి చెప్పుకోలేవు. వీటి హృదయంలోకి ప్రవేశించి, వీటిచేత మాట్లాడించే శక్తి, డి హెచ్ లారెన్సు, విలియమ్‌బ్లేక్, రాగూరు, హౌస్‌మన్, కవులకుంది - బాపిరాజుగారు కవిగా ఈ కోవకు చెందుతారు. 'రావోయి సిన్నివాడా' లాంటి గేయాలు. హౌస్‌మన్ **'A shropshire Lad'** అనే శీర్షికన రచించిన గేయాలని స్ఫురింపజేస్తాయి.

పక్షి, మొక్క, మేఘం, కాలవ, మేక - యివన్నీ పల్లె ప్రాంతానికి జీవం. పొలం దున్నే పాలికాపు యీ వాతావరణంలో యిట్టె యిమిడిపోయి, ప్రకృతిలో వొక భాగంగా అయిపోతాడు. పాలికాపు, కూలివాడూ మనిషా?

బస్తీలలో వారికి వీరు మనుషులుగానే కనబడతారు. బాపిరాజుగారిలో కవికి అట్లాకాదు.

ఓ బీదవాడా
ఓ కూలివాడా
ఓ పాలివాడా!
నిన్నుద్ధరించడానికి
మిన్నునుంచి ఊడిపడ్డ
దేవతలము మేము
మమ్మల్నుద్ధరించుకోలేని
దద్దమ్మలం!

పాలికాపు మనిషికాదనీ, దేవతనీ తెలుసుకోగల దర్శన బాపిరాజుగారిలో చివరి దాకా ఉండిపోయింది ఆ దర్శన నిలుపుకోగల వ్యక్తి, మహావ్యక్తేననుకుంటున్నా.

ఎప్పుడూ ఆనందంతో ఊహాలో స్వేచ్ఛగా విహరించడం, ప్రయోజనంతో ప్రమేయంలేని సౌందర్యాన్ని అన్వేషించడం, అనుభవాన్ని పంచిపెట్టటం, ఎప్పుడూ ప్రేమతో ఋజం చరచడం - ఇదీ బాపిరాజుగారు జీవితంపట్ల అలవరుచుకున్న దృక్పథం. ఈ దృక్పథం సమాజానికి అవసరం. దీన్ని వ్యక్తపరిచి, ప్రచారం చేసిన బాపిరాజుగారిలాంటి వ్యక్తులకి మనం కృతజ్ఞులం. కాలవాహినిలో ఈ కృతజ్ఞత మరుగుపడొచ్చు. కాని ఆయన వేసిన చల్లటినీడ వుండిపోతుంది.

# నే నెరిగిన గోపీచంద్

మొదటిసారి 1946 లో మద్రాసులో కలుసుకున్నాను గోపీచంద్ గారిని. తాత్విక చింతనలో మునిపడ్డ రాజకీయ, సాంఘిక సిద్ధాంతాల ప్రచారంలో కృషిచేస్తూ కొన్ని రచనలు చేసినట్లు విన్నానుగాని అప్పట్లో వారి రచనలు నేను చదువలేదు గంభీరమైన విగ్రహం, నిండైన కంఠం, ఆహ్లాదాన్ని సూచించే నవ్వు, కచ్చితమైన మాటల్లో స్పష్టమైన భావప్రకర్ష, లోతుగా తికమకలతో కూడి సువిశాలంగా కనబడే విషయాన్ని చటుక్కున గ్రహించి, సూటిగా పరామర్శించగల ఊహాశక్తి - ఇవి ఆయనలో ప్రత్యేక లక్షణాలు.

రేడియో నాటికలు వ్రాయించే సందర్భంగా వారితో స్నేహం ఏర్పడింది. ఆ రోజుల్లో, నైతిక, ఆధ్యాత్మిక విలువల్ని సాంఘిక దృష్ట్యా పరిశీలించే అవసరం వుందన్న వారి అభిప్రాయాన్ని పురస్కరించుకొని, అట్లాంటి నాటికలకి అనువైన వస్తువు సూచించి, వారితో చర్చించిన సందర్భాలుండేవి. వీటి ఫలితంగా వారు వ్రాసిన కొన్ని నాటికలను గురించి చెప్తాను. ఒకటి మాంచాల. ఇది చారిత్రక నాటిక - దేశభక్తి, త్యాగము ప్రధాన విషయము. వీర, రౌద్ర, విషాద రసాల వ్యుత్పన్నత, నటుల కౌశల్యంపై ఆధారపడి వుంటుంది. చెయ్యవలసిన పనికి పురికొల్పడానికి ఉద్రేకం అవసరం అవుతుంది కాని, తర్కం కాదు కాని గోపీచంద్ గారి నాటికలో, పాత్రలు తమ ఉద్రేకాలని అదుపులోకి తెచ్చుకుని, వారి నిర్ణయాలకు, చేష్టలకు కారణాలు పేర్కొని నిదానంగా చర్చించుకుంటాయి. నిర్ణయానికి కారణాలు సమంజసమైనవీ, ఆచరణీయమైనవీ అని తోచగానే ఆ కారణాలే ఉద్రేకాలుగా ఎదుర్కోడం, ఈ నాటికలో ప్రత్యేకత అనుకునేవాడిని. ఉద్రేకం పాటలోనో, పద్యంలోనో, అంతం అవాలన్న నాటిక సంప్రదాయం ప్రకారం నాటకంలో సుదీర్ఘమైన చర్చకి, తర్కానికి చోటులేదు. "కవిత మాత్రం ఆవేశం రేకెత్తించగల" దన్న అభిప్రాయం సరైంది కాదని ఇబ్సెన్, షా, ప్రీస్ట్లీ, నాటకాలు ఋజువుచేశాయి. రేడియోకి వ్రాసినప్పటికీ, 'మాంచాల'లో తర్కబద్ధమైన ప్రేరణ రసానుభూతికి సాధనంగా ఉపకరించడం విశేషం.

ఆ రోజుల్లో బుద్ధిని కవ్వించి, వూహల్ని చక్కిలిగింతలు పెట్టిన పుస్తకాలు హక్స్లీ, 'బ్రేవ్ న్యూ వరల్డ్' (Brave New World), సామ్యుఅల్ బట్లర్ 'ఎరివాన్' (Erewhon) అనేవి. హక్స్లీ పుస్తకంలో మెళకువలు పూర్తిగా అవగాహన చేసుకోవాలంటే, వివిధ శాస్త్రాలలో ఆధునిక విజ్ఞానశాస్త్రం గావించిన పరిశోధనలతో పరిచయం వుండాలి. బట్లర్ "ఎరివాన్" ని చదివి ఆనందించాలంటే ఇవేమీ అంతగా అక్కర్లేదు. "ఎరివాన్" అన్న మాటకి అర్థం లేదు. ఎక్కడా లేదు అన్న అర్థం సూచించే 'Nowhere' అన్న పదాన్ని కుడి నుండి ఎడమవైపుకు అక్షరాలు త్రిప్పి వ్రాస్తే వచ్చినమాట 'ఎరివాన్' లో ఆదర్శాలతో నిండిన రామరాజ్యంలాంటి ఒక ఊహా సమాజం చిత్రితమైంది. మానవుడు అనుసరించగల నైతిక విలువలను, అతనికి ఆనందాన్ని సమకూర్చే సామాజిక సంప్రదాయాలను మానవుడే సమకూర్చుకోవాలిగాని - ఇతర శక్తుల మీద ఆధారపడగూడదన్న హేతువాదం యీ పుస్తకంలో ప్రధాన వస్తువు. 'మానవుడు చేసిన ఘనకార్యాలలో నికాయితీగల దైవాన్ని సృష్టించడం ముఖ్యమైంది' అన్న నిర్వచనం చేసిన రచయిత ఈ ఎరివాన్ రచించిన బట్లరే ఇందులో అస్వస్థులైన వారిని కోర్టులో విచారణ చేసి, వారి వారి జాడ్యాలు, జబ్బులనుబట్టి కారాగారశిక్ష విధిస్తారు నేరస్తులను — హాస్పిటల్స్‌లో వుంచి చికిత్సచేసి, కుదిర్చి ఇంటికి పంపుతారు ఈ అంశాన్ని వస్తువుగా నాటకం కూర్చాలని సూచించగా, గోపీచంద్‌గారు బట్లర్ పుస్తకం చదివి, 'విచిత్ర ప్రక్రియ' అనే నాటికని కూర్చారు. ఇది వినోదకరంగానూ, సుబోధకంగానూ ఉంటుంది. ఆ రోజుల్లోనే వారి దృష్టి మానవతావాదంపై (Humanism) మరలిందనుకుంటాను. ఆచంట జానకిరామ్‌గారి సూచనపై అప్పుడే ఉన్నవ లక్ష్మీనారాయణ "మాలపల్లి" ని నాటకంగానూ, 'పశ్చిమ వాహిని' అన్న మరో నాటకమూ వ్రాశారు శిక్షణకి, తర్కానికి లొంగని శారీరక వాంఛ-యౌవనో ద్రేకం కల్పించిన ప్రేమకల, వాస్తవ జ్వాలలో ఎల్లాగ కరిగిపోతుందో చిత్రిస్తుంది 'పశ్చిమవాహిని.' అంతర్జాతీయ సంస్కృతిని నెలకొల్పాలని ఉబలాటపడేవారికి జాతీయతత్వం రుచించకపోవచ్చు. దేశభక్తి నుండి జనించే జాతీయ సంస్కృతి నిలబడే సంస్కృతి. అట్లాంటి అనేక జాతీయ సంస్కృతులూ కలిపి, ఒక ఉమ్మడి సంస్కృతి నెలకొల్పడం అసాధ్యం. ఒకవేళ సాధ్యపడినా నిష్ప్రయోజనం - అని టి ఎస్. ఎలియెట్ లాంటి వారు అభిప్రాయపడుతున్నారు నేడు మన దేశానికి క్లిష్టపరిస్థితి ఏర్పడింది. ఈ సందర్భంలో దేశభక్తి, జాతీయ

తత్వంపట్ల అభిమానం సన్నగిల్లడం సముచితమా? - అన్న ప్రశ్నని మేధావు లందరూ తరిచి చూడాలి

గోపీచంద్‌గారు అప్పటి నాటికలలో ఈ రకం సమస్యల ప్రస్తావన నిగూఢంగా వుంది. అది అందలి ప్రత్యేకత

తరువాత వారు సినిమారంగంలోనూ, కొంతకాలం ఇన్‌ఫర్‌మేషన్ శాఖ లోనూ కృషిచేసి, ఆంధ్రప్రదేశ్ అవతరించగానే హైదరాబాదు వచ్చినప్పుడు, మళ్ళీ అక్కడ వారితో కలిసి పనిచేసే అవకాశం కలిగింది.

అప్పుడు వారు మరికొన్ని నాటికలు వ్రాశారు. ప్రతివారూ వారికి రుచించనిది జరిగినప్పుడు సంఘాన్ని దూషించడం పరిపాటవుతుంది. "పోనిస్తురూ, గుడ్డిసంఘం" అని సంఘాన్ని ఆడిపోస్తారు. ఈ గుడ్డి సంఘం ఎవరు? సంఘాన్ని కళ్ళు లేని ఒక వృద్ధురాలిగా చూపాలి. ఆమె దోవలో పోతూ వుంటే నలుగురూ తిడతారు. ఆమె సమాధానం ఏమిటి? మీరు ఈ విషయాన్ని నాటకంగా రూపొందించాలని కోరగానే, గోపీచంద్‌గారు 'గుడ్డి సంఘం' అనే నాటిక వ్రాశారు. ఇదొక చక్కని సాంకేతిక ఊహాచిత్రం సంఘంలో వ్యక్తుల నైతిక నాడులని కదిపే సన్నివేశాలు, మానవతావాదం లేవదీసిన భవనం పునాదులను ఊపిచూసే ఊహాబలముగల నాటిక యిది

గోపీచంద్ ఇంకా ఎన్నో రేడియో నాటికలు వ్రాశారు, నిర్వహించారు. నాకు తెలిసిన కొన్నింటిని చెప్పాను. వివిధ సాహితీ ప్రక్రియలలో కృషిచేసి విజయం సాధించిన రచయిత గోపీచంద్. రచయిత అంతరంగ జగత్తులో ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించి, తన వ్యక్తిత్వంతో సమన్వయం కుదుర్చు కునేందుకు, కధానిక, నవల గద్య రచయితకే ఉపకరిస్తాయి. ఈ సమన్వయం కుదిరి, వ్యక్తిగతశీలం స్థిరపడిన తర్వాత, తన చుట్టూ వున్న స్థూల జగత్తులోని సమస్యలు, వాటి పరిష్కారం గురించి పట్టించుకుంటాడు రచయిత. ఈ దశలో వ్యాసం, నాటకం ద్వారా పరిష్కారానికి పూనుకుంటాడు. గోపీచంద్‌గారి రచనలు ఈ రెండు దశలలోనూ కొనసాగాయి. అంతరంగ జగత్తునుండి వెలువడ్డ కధానికా, నవలా కాలానుగుణమైన సామాజిక సమస్య సాలిగూడులో చిక్కు పడక కొంతకాలంపాటు చలామణీ అయ్యే విలువల్ని కలిగి వుండడం సహజం గనుక; గోపీచంద్‌గారి కథలూ, నవలలూ సాహితీరంగంలో ఒక స్థానాన్ని సంపాదించుకున్నాయి. వారి 'అసమర్థుని జీవయాత్ర' చాలా మంచి నవల. ఆ పుస్తకం లోపలి వస్తువుకి సాంకేతికం అవడం మాత్రమేకాక, ఆ పేరులో జీవితవిమర్శ, భావ గర్భితమైన తీర్పుకూడా ఇమిడి వున్నాయి. హేతు

వాదులు, (Rationalists) మానవతావాదులు (Humanists) శాస్త్రీయమైన నిదర్శనాలు లేనిదే ఏదీ నమ్మనక్కర్లేదనీ, మానవ శ్రేయస్సుకంటే ముఖ్యమైన ఆదర్శం ఏదీ ఉండనక్కర్లేదనీ ప్రచారంచేస్తూ వచ్చారు డార్విన్, ఫ్రాయిడ్, ఫ్రేజర్ - తర్వాత తర్వాత ఐన్‌స్టీన్ ప్రముఖ ఖగోళ శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితాల నాధారంగా వెల్స్ (Wells), బెనెట్ (Bennet), జోలా (Zola), అనటోల్ ఫ్రాన్స్, (Anatole France, ఆర్వెల్ (Orwell) లాంటి రచయితలు వాస్తవిక ధోరణిలో సాంఘిక, నైతిక విలువలని పరామర్శించారు. మూఢాచారాలకు గురియైన ప్రతి సంఘంలోనూ, హేతువాదం ప్రచారం అవసరం. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారన్నట్లు శిఖరాన్ని సాధించేటందుకు చాలా మార్గాలున్నా, శిఖరం చేరుకున్న తర్వాత పైనుండి కనబడే దృశ్యం ఒకటే. పారిశ్రామిక పురోభివృద్ధి, విజ్ఞానశాస్త్రం సాధించిన ఫలితాలు మానవుడికి కొత్త శక్తుల్నీ జిజ్ఞాసనీ సమకూర్చాయి. అయినా, బహు సంఖ్యాకుల గుంపు తత్వంలో వ్యక్తి నలిగి అసమర్థుడవుతున్నాడన్న ధ్వనివుంది ఈ నవలలో. 1958 లో నా ఏకైక సోదరుడు అస్తమించినప్పుడు, ఒక మిత్రుడు 'విచారించి ఏం ప్రయోజనం. మనం చేసేది ఏమీలేదు" అని సానుభూతి తెల్పుతూ అన్నాడు. "చేసేది ఏమీలేదు గనుకనే బాధ, ఆవేదన" అన్నాను. ప్రక్కనేవున్న గోపీచంద్ "అవును, అదెట్లాంటిదో నాకు తెలుసు" అన్నారు "అందంగా, నిశ్చలంగా, బాధ, ఆవేదన లేకుండా ఉండడం ప్రకృతియొక్క ఆదర్శం నేనది సాధించ లేకపోయినా, ఆ స్థితిని ఊహించగలను" అన్న రిచర్డు జెఫ్రెస్ (Richard Jefferies) వాక్యాలు జ్ఞప్తికొచ్చాయి.

వారెన్నో కథానికలు వ్రాశారు. దేశభక్తి నైతిక జీవితంతో ముడిపడ్డ శీలం ద్వారా మానవుడు సంఘంలో తేగల మార్పు కథానికలకి ప్రేరణ. మానవుడుగా నిజాయితీ అలవర్చుకున్న తర్వాతే రచయిత కృషికి విలువ, ప్రయోజనం వుంటాయని గోపీచంద్‌గారి విశ్వాసంలా తోస్తుంది వ్యక్తి శీలమూ నిజాయితీ ప్రవర్తనలో కనబడ్డట్టే; రచయిత ఊహాబలమూ, ప్రతిభ, రచనలో కనబడతాయి. వారి 'సంపెంగ పువ్వు' అనే కథలో నాయిక అన్న మాటల వెనుక వారి కంఠమే వినబడుతున్నట్లుంది!

"నేను చాలా మంది రచయితల్ని ఎరుగుదును వాళ్ళ రచనల్లో వెలిబుచ్చే అభిప్రాయాలు ఎంత అభివృద్ధిదాయకంగా వుంటై! కాని ప్రవర్తన మామూలు మనిషి ప్రవర్తన కంటె అధ్వాన్నంగా వుంటుంది. దీనికి - భావాలను, ఆలోచనలను; ఆచరణలోకి అనుభవంలోకి తీసుకురావాలనే ప్రయత్నం లేక

పోవటమే కారణం అనుకుంటాను." సాహిత్యం ద్వారా సంస్కారానికి పూనుకునే రచయిత మొదట తన్ను తాను పరీక్షించుకొని, తన నిజాయితీ, శీలం, వ్యక్తిత్వం పట్ల నమ్మకం కలిగిం తర్వాత గాని అర్హుడు కాడన్న వీరి అభిప్రాయం గమనింపతగింది.

గోపీచంద్‌గారిది నిరాడంబరమైన శైలి. సూటిగా, సులభంగా, స్పష్టంగా చెప్పడమే వీరి ఆశయం. ఇది కూడా సహజంగా, అప్రయత్నంగా కొనసాగాలి తికమకలకు, మెళుకువలకు, గారడీలకు, బాణసంచా పేల్పులకు వారికి వ్యవధి లేదు వాస్తవిక ధోరణిలో వ్రాయాలనుకున్నప్పుడు, అట్లాంటి ప్రయత్నం వుండదేమో. వారి కథానికలో ఒక పాత్ర అంటుంది "నేను అందంగా, తెలివిగా మాట్లాడుతున్నానా లేదా? అనే గొడవే గాని, సహజంగా మాట్లాడుదాం అని కానీ, యదార్థంగా మాట్లాడుదాం అని గానీ మీకు ఎందుకు వుండదు?" వారి శైలికి మచ్చుగా ఈ వాక్యాలు చూడండి.

"నాకు ఇంకొక లోకంలో వున్నట్లుంది. ఆమె మాత్రం వీటిని గమనించ నట్లు యథాప్రకారం మాట్లాడుతూనే వుంది అందరినీ ఒకే మోస్తరుగా పలకరిస్తూ మాట్లాడింది. సెక్సును గురించి ఆమె ఫ్రీగా మాట్లాడుతూ వుంటే కుర్రవాళ్ళంతా కిక్కురుమనకుండా విన్నారు అవునూ, కాదూ అంటానికూడా వాళ్ళకి ధైర్యం లేకపోయింది. ఈ కొట్టడానికే వాళ్ళకు సిగ్గువేసింది. 'నేను స్త్రీ'ని అనే భావం ఆమెకు చచ్చినా గుర్తుకు రాలేదు."

ఇవి సహజంగా మామూలుగా మాట్లాడుకునేటప్పుడు వాడే పదాలతో కూర్చిన వాక్యాలు. 'సెక్స్' 'ఫ్రీగా' అన్నవాటికి తెలుగు మాటలు వాడాలన్న యత్నం లేదు. 'ఆమెకు చచ్చినా గుర్తుకు రాలేదు' అన్న దాంట్లో 'చచ్చినా' అన్నది మామూలుగా వాడే మాట. ఆలోచిస్తే మరొక మాట వాడితే మంచిదని పించవచ్చు శైలి కోసం ప్రయత్నం చెయ్యకపోవడానికిది ఉదాహరణ. ఇది అనుకొన్నంత సులువు కాదు.

తత్వజ్ఞుల జీవిత చరిత్రలు, వివిధ రాజకీయ వైజ్ఞానిక తత్వాలని గురించి వ్యాసాలు - ఎన్నో వ్రాశారు. గోపీచంద్ "చీకటి గదులు" అనే పెద్ద నవల పూర్తవకుండా నిలిచిపోయింది. చివరి రోజుల్లో వారింకా దేన్నో అన్వేషిస్తు న్నట్లుంది - ప్రాక్ పాశ్చాత్య తత్వాలను క్రోడీకరించి, సమన్వయపరిచి, ఆ కలయికనుండి, మరేదో కొత్త తత్వాన్ని తెలుసుకుని, దాని వెలుగులో తమతోటి వారితో యాత్ర సాగించాలన్న పట్టుదలతో చివరి వరకూ కృషి చేశారు.

జీవిత రహస్యం తెలుసుకున్నాక యోగిగా అయి, వ్రాతకే పూనుకోదేమో రచయిత. తాము అంతరంగ జగత్తులో తలపెట్టిన విజయం పూర్తి కాకుండా మధ్యలో, నడి వయస్సులో గోపీచంద్ పరమపదించడం సాహిత్య లోకం దురదృష్టం. రచయిత సంఘంతో బంధనాలు తెంచుకోలేని ఏకాంత జీవి. అతని దృక్పథాన్ని హర్షించి, స్వీకరించి, అతని అంతరంగాన్ని పంచుకోవాలని ఉబలాటపడే సమకాలిక తోటి రచయితలు ఎందరో ఉండరు. వున్నవారిలో ఒకరిని గోల్పోయినప్పుడు తోటి రచయితలు తమ బాధని పాఠకులతో పంచుకోడానికి యత్నిస్తారు. రచయిత కోరేది తన రచనలు నలుగురూ చదవడం, గోపీచంద్ రచనలన్నీ పరిశీలించి, వాటిలోంచి వైవిధ్యం గల రచనలని ఏరి, ఒక ఆమ్నిబస్ గ్రంథంగా వెలువరించి, నలుగురికీ అందజేస్తే.... తోటి రచయితలకి తృప్తి.

# ఉత్తమ కళాకోవిదుడు మొక్కపాటి

మనకున్న చిత్రకారులు అసలే కొద్దిమంది. వారిలో ఒకరైన మొక్కపాటి కృష్ణమూర్తిగారు నడివయస్సులో అస్తమించారన్న వార్త పత్రికలలో చూడగానే కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

పదేళ్ళ క్రితం వారిని విజయవాడలో కలుసుకుని, ఒకటి రెండు రోజులు గడిపే అవకాశం కలిగింది. నావి కొన్ని వాటర్ కలర్ చిత్రాలుచూసి, "మీకు ప్రకృతి మూడ్సు బాగా తెలుసు. దాని, రంగు వైచిత్రి తాకిడికి తట్టుకోగలరు కూడా" అని ప్రశంసించి, ఆయిల్ పైంటింగ్‌కి పూనుకోవల్సిందిగా ప్రోత్స హించి, దాని పద్ధతులు, పరికరాలు, సాధక బాధకాలు వివరించారు.

ఒకరు చిత్రం వేస్తూంటే చూస్తూ, చాలా విషయాలు తెలుసుకోవచ్చు. కాని మరొకరు ప్రక్క నున్నప్పుడు కుంచె నడవకపోవడం చాలామంది చిత్ర కారుల అనుభవం. కృష్ణమూర్తిగారు అల్లాకాదు "నాకు గురువులూ లేరు, శిష్యులూ లేరు. బోధనకు అలవాటుపడినవారిలో ఉండే చింతన, జిజ్ఞాస నాకు లేవు. ఏలూరులో మా ఇంటికొచ్చి, దొడ్లో చాపేసుకుని కూర్చుని, బొమ్మలు వేసు కుందాం వో వారంపాటు నాతో గడపండి" అని ఆహ్వానించారు అప్పట్లో ఆ అవకాశం వదులుకున్నందుకు నన్ను నేను క్షమించుకోలేను.

మరుసటి సంవత్సరం వారు నన్ను మళ్ళా కలుసుకొని కొన్ని ఆయిల్ చిత్రాలు చూసి, వాటి మంచిచెడ్డలు విమర్శించి, ఆ తప్పులు సరిదిద్దుకునే మార్గాలు సూచించారు. పాశ్చాత్యకళా సిద్ధాంతాలను గూర్చి, నేను తెలుసు కున్నవి చెప్పాను - **Expressionism, Fauvism, Impressionism, abstract painting** స్కూళ్ళు, క్లీ, పికాసో, సెజాన్, డిరైన్, బ్రాక్, జైమినీరాయ్, అమృతషెర్‌గల్, గాగేన్, వాన్‌గో - మొదలైన పేర్లు స్మరించినా, కృష్ణమూర్తిగారికి ఇవన్నీ కొత్తగా తోచినట్లనిపించింది వారి చిత్రాలు నాలుగైదు చూపించారు వాటిని చూడగానే ఆనందం, ఆశ్చర్యం కల్గించాయి. ఏ ఆధునిక సిద్ధాంతాన్నీ అనుకరించకుండా, వారి చిత్రాలు, ఆధునికంగానే కనిపించాయి.

వస్తువులో, గీతలో, వ్యక్తుల కూర్పులో, వారిది సంప్రదాయ తత్వమే - అయినా, రంగులవాడకం, సాంద్రత, నిర్వహణ శైలిలో, ఆ చిత్రాలు ఆధునికంగా కనబడ్డాయి. సౌందర్యం వాటి ప్రధాన లక్షణం. ఆధునికతత్వం పేరిటా, వికృతమైన మొహాలు, శరీరాలు, నుడ్డిరంగుల కూర్పుచూసి మెచ్చుకోమంటున్న కొందరు ఆధునిక చిత్రకారులవలె కాక, కృష్ణమూర్తిగారి బొమ్మలు అందంగా ఉంటై. ఆయన నవ్వి 'అప్పుడప్పుడు వికృతంగా వెయ్యాలని యత్నాలు చేస్తుంటాగాని, అవి ఫలించినట్లు లేదు" అన్నారు.

వారి రంగుల కూర్పులో మరొక విశేషం. ఆకుపచ్చ, నీలం దగ్గర రంగులు. వీటిని పక్క పక్కన వెయ్యడానికి చాలామంది జంకుతారు. వీటిని పక్కపక్కనేవేసి, స్పష్టత కుంటుపడని ఆకృతిని చిత్రించగల ప్రతిభ సెజాన్‌కి, షెర్‌గెల్‌కి ఉందంటారు. ఆ ప్రతిభ కృష్ణమూర్తిగారి చిత్రాలలో కనిపించింది. అరటిచెట్టు బైట బాగుండొచ్చు. కాని, చిత్రంలో అదంటే అయిష్టం. కృష్ణమూర్తిగారి చిత్రంలో చూశాక అరటెట్టుపై అయిష్టం తొలిగింది.

కృష్ణమూర్తిగారు నిరాడంబర జీవి. 'చెట్టుక్రింద చాపేసుకొని, ఆకాశంలో మేఘాన్ని, చిత్రపటంలో దానితో పోల్చి చూసుకుంటే గడిపినవే మరువురాని మధురక్షణాలు. ఈ అనుభవంకంటె నే నింకేమీ జీవితంలో కోరడంలేదు" అన్న వాక్యం జ్ఞప్తికొస్తుంది - నిజమైన కళాజీవి ప్రయోజనంతో, కోర్కెతో ప్రమేయం లేని స్వచ్ఛమైన ఆనందాన్ని ఎరుగున్న వ్యక్తి.

మరో విశేషం - తోటి చిత్రకారులపట్ల అసహనం ఈర్ష్య లేకపోవడం. ఏ సిద్ధాంతాన్నీ, ఏ కళాకారునీ చులకన చేస్తూ, నిరసనతో అభిప్రాయం వెల్లడించినట్లు జ్ఞాపకం లేదు నాకు. ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో నేటి చిత్రకారులని పరిచయంచేస్తూ, నన్నుకూడా (Landscape Painters) లో ఒకరుగా పేర్కొన్నారాయన. అంతటి అమాయకుడు, సహృదయుడు.

ఒక జాతి సంస్కృతి, నాగరికతలు కళాకారులపైనా, కవులపైనా, గాయకులపైన ఆధారపడతాయన్నది, పాత చింతకాయపచ్చడి, ఉపన్యాస వేదికలపై, గ్రంథాలలో ఈ నిర్వచనం ఎదుర్కొంటాం. కాని, నిత్య జీవితంలో ఈ కళల పట్ల ఎంతటి ఆదరాభిమానాలున్నాయో అందరికీ తెలుసు మన జీవితంలో 'రంగు' లేదు ఇందుకు కారణం, పెరిగిపోతున్న జనాభాయో, క్షీణిస్తున్న కళాతృష్ణో తెలియదు. "మనకి రెండు నీతులున్నాయి. ఒకటి: పైకి చెప్తాం కాని అనుసరించం రెండోది అనుసరిస్తాం కాని పైకి చెప్పం" అన్న

బెర్ట్రండ్ రసెల్ నిర్వచనం. చిత్రలేఖనంపట్ల నిజమేమోననిపిస్తుంది. దామెర్ల రామారావుగారి చిత్రాలకోసం ఒక ప్రదర్శనాశాల మినహాఇస్తే, తెనుగునాట చిత్రలేఖనంపట్ల అభిరుచి పెంపొందించే ప్రదర్శనశాలలుగాని, సంస్థలు కాని లేవు. బాపిరాజుగారు కీర్తిశేషులైన తర్వాత, సంతాప సభలు జరిగాయి కాని, వారి చిత్రాలని ప్రజలకందించే యత్నం జరగలేదు. భగీరధిగారు, గొప్ప **Landscape Painter** ఐదుకీ పదికి, కూడా వారి చిత్రాలను అవసరం గడుపుకునే నిమిత్తమై, చాలామందికి ఇచ్చివేశాడని వింటాను. దామకూర సత్యనారాయణగారు వారి చిత్రాల సంపుటి నొకదాన్ని స్వయంగా వెలువరించడం జరిగింది.

కేంద్ర అకాడెమివారు చేసినా, ప్రదేశ్ అకాడెమీవారు చేసినా, జరుగవలసిన కార్యక్రమం కొంతుంది. ప్రధాన నగరంలో, చిత్ర ప్రదర్శనశాల ఒకటి. దానిలో తెలుగు చిత్రకారుల, చిత్రాలని సేకరించి శాశ్వతంగా ప్రదర్శించే ఏర్పాటు చెయ్యాలి. ఆయా చిత్రకారుల, ప్రధాన చిత్రాల సంపుటిని చవుకగా, రెండు, మూడు రూపాయలు మించకుండా వెలువరించి లైబ్రరీలకి విద్యాసంస్థలకి అందజెయ్యడం మరొకటి. ఇప్పుడు లలితకళా అకాడెమీవారు హెబ్బార్, బెంద్రి రవివర్మగార్ల చిత్రాల సంపుటాలు ప్రచురించి సేవచేశారు.

కృష్ణమూర్తిగారి చిత్రాలు కొన్ని వాణి పత్రికలో ప్రచురించి, ఆ సంపాదకులు వారి చిత్రాలను పరిచయం చేశారు. వారి చిత్రాలను సేకరించి సంపుటంగా వెలువరించి అందజేసే భారం కళా పోషకులపై వుంది.

# దేవులపల్లి కృష్ణశాస్త్రి

కృష్ణశాస్త్రి కవిత్వం అంటే నాకు ఇష్టం. అప్పుడప్పుడు రహస్యంగా చదువుకుంటూ వుంటాను. బాగా ఇష్టమైన వాటిని మన స్వంతం చేసుకుంటాం; ఇతరులతో పంచుకోడానికి సిద్ధపడం, లోభి బంగారం ముద్దని రహస్యంగా చూసుకుని మురిసిపోయి మళ్ళా దాచేసుకున్నట్లు. ఆ కవిత్వంలో ఏదో గొడవ వుంది; అదంతా నాతో ప్రత్యేకంగా మొరపెట్టుకున్నట్లనిపిస్తుంది; ఆ గొడవంతా ఏమిటో ఎందుకో, స్పష్టంగా తెలియదు సరికదా, పరామర్శించి తెలుసుకుందామన్న వుబలాటం కూడా నాలో లేదు.

వింతగాఁదోచు నాదు జీవితము నాకె!
అమల మోహన సంగీతమందు హృదయ
దళన దారుణ రోదన ధ్వనులు విందు;

*　　　*　　　*

వక్రగతిఁ బోదుఁ జక్కని పథమునందె,
రాజపథమునకై కుమార్గమునఁ జూతు;
గరళమేతిందుఁ గడుపార నెఱిఁగి, యెఱిఁగి

— ఇందులో అంతా అరసున్నలు మినహా, నే నెరుగున్న గొడవే. ఇదంతా ఉపన్యాస వేదికలపై పదిమందికి చెప్పకోడానికి పీల్లేనిది. ఎవరికి వారు, ఏకాంతంగా, రహస్యంగా చదువుకుని, ఇదవ్వాల్సిందే.

గుంపులను కదిలేద్చి కవిత్వంట. జన బాహుళ్యాన్ని కార్యానికి రగిలేద్చి కవిత్వంట పదిమందిలోను నిలిచి పాడిందే పాటట — మరి కృష్ణశాస్త్రి కవిత బాత్‌రూమ్‌లో కూని దీర్ఘంగా ఎందు కాకర్షించాలి?

రేయి కడుపున చీకటి ఛాయవోలె
తమసు పెకద దివాంధ గీతము విధాన —
ఘూకరావాన వలవంత రేక రీతి
నా విషాదమ్ములో దాగినాద నేనె!

నీడలా, పొగలా నన్ను వెన్నాడుతూ, నా కూని దీర్ఘంలో ఆయన కంఠం

కలుపుతూ, నాచేత కన్నీరు కార్పించడం ఎందుకు? 'సరే, యీ బరువు, యీ విషాదం, యీ కన్నీరు అయింది – ఏమిటి నువ్వు నా కిచ్చింది?' అని ప్రశ్నిస్తే:

కన్నీటి చుక్క
గాక, మనసార, వలపూరగ గలంత దీర
గాన్కగా నేమొసంగగా గలను నీకు?

అని ఎదురు ప్రశ్న.

కృష్ణశాస్త్రిలో, దైన్యం, బాధ, దుఃఖం, విషాదం తనొక్కడకే తటస్థించాయనీ, ఇంకెవ్వరికీ యీ రకం అనుభూతులులేవనీ, వొక ధ్వనివున్నా తన బాధని ఇంకెవ్వరూ పంచుకోడానికి సంసిద్ధులు కాలేరనీ, తాను ఏకాకిననీ, ఒంటెగాణ్నని వొక నమ్మకం స్థిరపడిపోయినట్లుంది.

ఆశయమ్ముల ఆనంద లేశముల, అ
లంతి యాసల జీవితమంత, ఇట్లె
యేడ్పువైచితి వినువారె యేరులేక,
యేడ్పు సందడి నాలోననే చారంగ!

ఇది అన్యాయం – వినేవారు ఎవరున్నా లేకపోయినా నే వున్నాను. క్రొత్త ఆశ, ఉత్సాహం, మహదానందం, కార్యదీక్ష - వీటి సాధనకి కూడా తానొక్కడే పూనుకున్నట్లూ ఇంకెవరికీ వీటి జోలి పట్టనట్లూ అనేస్తాడు కవి:

ఎన్నడును
కనరాని దాని కొరకై
ఒక క్రొత్త బరువుతో ఒక క్రొత్త యాసతో
ఒకడనే వడిపోదును.

– పాపం, ఆయనకి తెలీదు. నేను ఎన్నిసార్లు పరధ్యాన్నంగా యివి పాడుకుంటూ, బాత్‌రూమ్‌లో పడ్డానో!

కృష్ణపక్షము, ఊర్వశి, ప్రవాసము, నా కోసం వ్రాసిన ఖండకావ్యాలు. వీటిని గురించి వింటూ, పత్రికలలో వ్యాఖ్యలూ విమర్శలూ చూస్తూవొచ్చినా, ఎమ్. ఎ. పరీక్షకు చదువుతున్న రోజులు – 1942 వరకూ జాగ్రత్తగా చదవ లేదు. 1940 లో రైతు బుక్ డిపోవారు యీ మూడింటినీ వొక గ్రంథంగా ప్రచురించారు. అది రెండవ ముద్రణం. గ్రంథం పేరు కింద, కవి పేరు 'కృష్ణశాస్త్రి బి. ఏ.' అని వేసివుంది. నేను ఎమ్ ఏ. డిగ్రీ పొందిం తర్వాత, పేరు పక్క 'ఎమ్. ఏ.' అని ఉత్తరాల కాగితాలపైన అచ్చువేయించుకోడం వల్ల కాబోలు, యీ గ్రంథం వ్రాసిన కవి పేరుతో సహా డిగ్రీకూడా కనబడగానే

యీ కవి నా తరం వాడు, సన్నిహితుడు అని స్ఫురించడమే కాకుండా, ఆ కవితలో వాస్తువు ఎట్లాంటిదై వుంటుందో కొంత తెలిసొచ్చింది. బి. ఏ. అని వేసుకోవడంలో వుద్దేశం ఇదేనా? ఇది కాకపోతే మరేమిటి? ఇది ఈయన వనా? ప్రచురణకర్తల వనా? ఏమో, — ఊహించుకోవాలి. "నేను కేవలం సంస్కృతము, వ్యాకరణము అభ్యసించిన పండితుడను మాత్రమేకాను కాలేజీలో చదివాను, బి. ఏ ప్యాసయ్యాను. పాశ్చాత్య సాహితీ ధోరణులు తెలుసు నాకూ ఇంగ్లీషొచ్చు; ఆంగ్ల భాష వెనకవున్న సాహిత్య సంప్రదాయంతో కాస్తో, కూస్తో పరిచయం వున్నవాణ్నే ఈ రకం విద్య నభ్యసించిన విద్యార్థులు, ఈ తరం కుర్రకారు చదివి తెలుసుకోతగ్గ ఆధునిక కవినిస్మా!" — ఇదంతా ఆ 'బి ఏ.' రెండక్షరాలలో వుందనుకుంటే కోప్పడతారా?

కావ్య వాస్తువులో, శైలిలో, పోకడలో 18_19 వ శతాబ్దపు ఆంగ్ల కవుల ఛాయలు _ ముఖ్యంగా బేక్, థామస్ మూర్, షెల్లీ, కీట్సు, బర్న్స్ - థామస్ లవెల్ బెడ్డోస్, టెన్నిసన్‌లవి _ కనిపిస్తాయి కాలేజీలో ఈ ఆంగ్ల కవుల కావ్యాలు చదవడం వల్ల — వ్యక్తి ప్రాధాన్యమైన వొక మనస్తత్వం ఏర్పడ్డ ఆ కాలపు విద్యార్థులని, కృష్ణశాస్త్రి పద్య కావ్య సంపుటం ఆకర్షించిందంటే ఆశ్చర్యం లేదు.

ఈ ఖండ కావ్యాలు కృష్ణశాస్త్రి యౌవన దశలో వ్రాసినవే యౌవనంలో ఉత్సాహం, ఉద్వేగం, ఆశ, ఆనందం జీవితం పట్ల పరిపూర్ణ విశ్వాసం మనోధైర్యం— ప్రబలంగా వ్యక్తిత్వాన్ని, అంతరంగాన్ని తీర్చిదిద్దుతాయి. అయినా కూడా కృష్ణశాస్త్రి కవిత్వం; బాధ, దుఃఖం, నిరాశలతో నిండి వుంది. కారణం? సమస్యలన్నీ వొక్కసారి యెదుర్కొంటాయి యువకుణ్ణి. ఆనాడు దేశానికింకా స్వరాజ్యం రాలేదు; తనకి స్వేచ్ఛ లేదు, భావ స్వాతంత్ర్యం లేదు; అనువైన ఉద్యోగం లేదు; తను ప్రేమించిన స్త్రీకి తనక్కర్లేదు. ఆదర్శమూర్తిని తనదిగా చేసుకొనే పరిస్థితే లేదు; పరిసరాలలో సౌందర్యం లేదు. సమాజంలో వైజ్ఞానిక తృష్ణ, దానితో వొచ్చే నిజాయితీ లేవు. ఇవి అతని బాధకి కారణాలు అవొచ్చు. కాని బాధపడడం వొకెత్తు; బాధపడుతున్నానన్న జిజ్ఞాసతో అంతరంగంలో సమాలోచన సల్పుతూ బాధపడడం వొకెత్తు ఇట్లాంటి జిజ్ఞాస నుండి వుద్భవించింది కృష్ణశాస్త్రి కవిత; అందలి సమాలోచన ఉంఽంగా సాగింది. అది సాగిన ధోరణి ఆధునికమైంది అందుకనే, కృష్ణశాస్త్రి బి. ఏ.

కృష్ణశాస్త్రి తన బాధని ఎంత అందంగా గానం చెయ్యగలడో, ఎందరెందరో ప్రశంసిస్తూ వ్యాఖ్యలు చేశా౨ విమర్శిస్తూ వ్రాశారు; నాకు వాటితో పరిచయం లేదు.

కాని ఆ బాధ పునాదులు పుట్టుపూర్వోత్తరాలు త్రవ్వి చూడడం జరగలేదేమో. శివశంకరశాస్త్రి తమ సింహావలోకనంలో, కావ్యంలో వాస్తువేదో, దాని లక్షణాలేవో పేర్కొన్నారు, నిజమే. దుఃఖాన్నుండి బైటపడిన కన్నీటి బిందువులను ఏరి చూపారు; వాటిని లెక్కించారు, నాణ్యం కట్టారు; వాటి జన్మస్థానం శోధించి తెలుసుకోవాలని చాలాసార్లు అనిపించేది నాకు. యవ్వనంలో జారిన కన్నీటి బిందువులు వువ్వగా వుండవు; మసకగా, బరువుగా వుండవు. అవి ఎక్కడినుండి పడితే నాకెందుకు — అరచేతిలో నిలిపి చూసుకుంటాను— అని తృప్తిపడే వాడిని.

నడి వయస్సులో గుప్పిలి విప్పి చూసుకుంటే ఆ కన్నీటి బిందువులు — కాస్త మెరుపు, తళుకు తగ్గినా, — అల్లానే వున్నాయి. నాలుగైదు చితికి, విడిపోయినా; మరి వార్థక్యంలో అవి ఏమవుతాయో చెప్పలేను. నడి వయస్సులో కూడా ఆ పద్య కావ్యాలు మరోసారి చదువుకునే అవసరం కనబడింది.

నాలుగైదేళ్ళకోసారి చదివి నేనెంతవరకూ ఎదిగానో గ్రహించుకోవల్సిన కవిత కృష్ణశాస్త్రిది. పాఠకుడితో పాటు కవి కూడా పెరుగుతూ వుంటాడు. ఆనాడు చదివినవి కొన్ని ఈనాడు రుచించకపోవచ్చు, అప్పుడు పట్టించుకోని ఖండ కావ్యం యిప్పుడు ప్రధానమైందిగా కనపడొచ్చు. అప్పుడూ, యిప్పుడూ, వొకే అనుభూతినిచ్చిన గేయాలూ వుండొచ్చు. అవి చదివి నేను పెరిగానా? నేను పెరిగాక అవి పెరిగాయా? నేను పెరగక అవి పెరిగాయా? నేను పెరగక దిగిపోతే అవి ముందు కెడుతున్నయ్యా? అంతరంగ జీవితంలో జరుగుతూండే ఉద్రేక పూరితమైన ఈ పాటుపోట్లకు కృష్ణశాస్త్రి కావ్యం కొలతబద్ద.

దుఃఖ సాగరంలో కొనసాగే పాటుపోట్లివన్నీ. ఈ దుఃఖానికి కారణం ఏమిటి?

ఏను మరణించు చున్నాను;— ఇట నశించు
నా కొరకు చెమ్మగిల నయనమ్ము లేదు.

—నిండు యవ్వనంలో మరణించాలన్న ఆలోచన కవికి ఎందుకు రావాలి? కృష్ణశాస్త్రి తన స్వీయ చరిత్ర ఎప్పుడైనా వ్రాస్తే అందులో ఏవన్నా కారణాలు దొరుకుతాయేమో. అంతవరకు ఊహించి తృప్తి పడాల్సిందే. ఈ పద్య కావ్య సంపుటంలో 'నేను' అన్నది — ఒక వ్యక్తిగా కవి కాదనే అనుకుంటాను 'ఏను మరణించు చున్నాను' అంటె, 'తను,' అని కాదు. తనలాంటివా రెందరోనని. ప్రత్యేకమైన అంతరంగ జగత్తులో — శరీరానికి బంధించబడ్డ వ్యక్తి, విముక్తుడై తన వ్యక్తిత్వాన్ని బాధతో క్రుంగదీసి, నలిపి ముక్కలు చేసి,

ఇతరుల అంతరంగ జగత్తులో వెదజల్లి, వ్యక్తిగా తను మాయమై, — వొక శక్తిగా, యితరులలో తన్ను చూసుకుని దాగిలిమూతలాడడం లాంటిది — ఆ 'నేను' అన్న ప్రయోగం పరిణామం. తాను ఇతరుల కళ్ళల్లో దూరి చూసేటంత వరకూ, ఇతరులు కూడా బాధపడుతున్నట్లు ఆయన తెలుసుకోలేదు.

అందుకనే :

ఇట నశించు

నా కొరకు చెమ్మగిల నయనమ్ము లేదు.

తను, అంతరంగం నుండి విముక్తుడై ఇతరుల జగత్తులో ఐక్యం అయిం తర్వాత — ప్రత్యేకంగా చెమ్మగిలే నయనం వుండదు — 'నా కొరకు' లో 'నా' లోపించినప్పుడు.

ఇంతకుముందు వేసిన కన్నీటి బిందువుల జాబితా మరోసారి చూద్దాం. దేశానికి స్వరాజ్యం లేదు. ఆనాడు 'అయ్యో లేదే' అన్న భావాన్నుండి జనించిన దుఃఖం ఈనాడు అంత తీవ్రమైనదనిపించదు. స్వరాజ్యం రావడంతో పాటు, దాన్ని కాంక్షిస్తూ వ్రాసిన కావ్యానికున్న విలువ కూడా పల్చబడుతుంది.

రెండవది, యవ్వనం త్వరితంగా గతించిపోతుంటే చూస్తూ వూరుకోడం తప్ప చెయ్యగలిగిందేమీ లేదన్న బాధ. ఇది కవులందరికి అభిమానమైన కావ్య వస్తువు. యవ్వన దశలో నిజంగా యీ బాధ అంత తీవ్రంగా వేధించదు; వేధించినప్పుడే కావ్యంగా అవతరిస్తుంది. నిజంగా వేధించినప్పుడు కవి రచనకే పూనుకోడేమో.

మూడవది, తాను కోరిన శృంగార జీవితం, ప్రేయసి లభ్యమవక పోవడం. ఇదీ అందరి కవులనూ ఉత్తేజపరిచే వొస్తువే. ఎటొచ్చీ కృష్ణశాస్త్రిలో మరో వేదన కూడా కనబడుతుంది. ఎక్కడో ఆదర్శమూర్తి వుండి ఏం లాభం? శృంగార జగత్తు నుండి విముక్తుడై చిత్తశుద్ధి, ఏకాగ్రతలను వెదుకుతూ మరో అంతస్థులో పచార్లు చేస్తున్నప్పుడు ఆదర్శమూర్తి తనని వెదుక్కుంటూ వచ్చి ఏం లాభం? ప్రేమ లభ్యం అవొచ్చు; కాని తాను కోరినప్పుడు లభ్యం అవక పోవడంలో వుంది విషాదం. ఇది కృష్ణశాస్త్రి ప్రేమ గీతంలో శ్రుతిలా విన బడుతూ వుంటూంది.

ఇప్పుడా నన్ను బలుకరింతురు?

అని కసురుతాడు కవి.

నాల్గవది ముక్తి సాధన. క్షుద్రలోకంనుండి దూరంగా వెళ్ళి ఏకాంతంగా సమాధిలోపడి 'నిన్ను నువ్వు తెలుసుకుని' ఆధ్యాత్మిక ప్రశాంతతని అలవరుచు

కోమని కొన్ని తత్వాలు బోధిస్తాయి అక్కర్లేదు, ఇక్కడేవుండి, సంసారం నడుపుతూ, నిత్యకృత్యం, కర్మలు యధావిధిగా నిర్వహిస్తూ, మంచిపనులు చేస్తూ ఆత్మబలం పెంచుకొని, ఫలాన్ని ఆశించక దేనికీ లొంగిపోక నిలబడి కడసారి యదార్థాన్ని ఎదుర్కో – అని కొన్ని తత్వాలు చెబుతున్నాయి. కృష్ణశాస్త్రి కావ్యంలో తనొక్కడికేకాక, చుట్టూవున్న పదిమందికీ కూడా ఇట్లాంటి ఆధ్యాత్మిక జ్యోతి అందచెయ్యాలి —— అది నావల్ల కాదేమో! అన్న భయం, చింత వున్నాయనిపిస్తుంది. తన చుట్టూవున్న జనం యింకా యీ మానసిక చైతన్యానికి అర్హులుకారేమో - వాళ్ళ జోలి నాకెందుకు, నేను దూరంగావెళ్ళి సంసారసాగరం లోని కెరటాలు ఇసుకమీద ఒరిగి నిట్టూరుస్తున్న ధ్వనినివిని ఆ లయని ఆ మాధుర్యాన్ని నాలో కలిపేసుకుంటాను —— అన్న ధ్వనికూడ వుంది కొన్ని గేయాలలో.

'కొన్ని పనులు చేసి తీరాలి, గావున వాటిని నువ్వు చెయ్యగలవు,' అన్న నైతిక సూత్రం ప్రతిపాదించాడు జర్మన్ తత్వజ్ఞుడు కాంట్. 'చెయ్య గలను, నిజమే. కాని చేసి తీరాలి అని శాసించే హక్కు ఎవ్వరికీ లేదు. ఒకవేళ వున్నా అట్లాంటి హక్కు వుండకూడదు. అంటాడు కృష్ణశాస్త్రిలో స్వేచ్ఛాజీవి యైన కవి.

ఏ చిన్న పని చేసినా, దాని ఫలితం ప్రపంచమంతటా వ్యాపిస్తుంది. ఫలితం మంచిదో, చెడ్డదో పని చేసిం తర్వాతకాని నిర్ణయం కాదు. నా కది మంచి చేసినా, ఇతరులకి హాని చెయ్యొచ్చు. అంతే కాదు, ఇప్పట్లో నాకు మంచి చేసినా, ముందు ముందు, నాకే హాని చెయ్యొచ్చు. అందుచేత ఏ పనీ చెయ్యను. పని జోలికి పోను, నేను కృష్ణశాస్త్రి, బి, ఏ. నంటా; 'ఏరని ఎంచితిరో నన్ను?' వెనకటి రోజుల్లో బి. ఏ. డిగ్రీ పొందిన వాకర్ని ఏనుగు మీద ఊరేగించినట్లు చెప్తారు. బి ఏ. డిగ్రీ వున్నవారికి కట్నం ఐదువేలదాకా ఇచ్చేవారేమో! నిజమే. కృష్ణశాస్త్రి వ్రాస్తున్న రోజుల్లో ఎందరో వృత్తులు, ఉద్యోగాలు విడిచేసి స్వతంత్ర సాధన కోసం జైళ్ళకెళ్ళారు రావుబహదూర్ మొదలైన బిరుదులు నాకక్కర్లేదని విసర్జించిన దేశభక్తులు కార్యానికి దిగిన రోజులవి.

కార్యం, పని, కృత్యం అనగానే, వాటి వెనుక బాధ్యతలు, ఫలితాలు, సంజాయిషీలు, నిందారోపణలు, త్రాసులో తూచి విలువ కట్టడాలు వుంటాయి- ఇవన్నీ క్షుద్ర జగత్తులో మానవుడు తప్పించుకోలేని పరిణామాలు. తాను వాటి నుండి కూడా విముక్తుడవాలి. దానికోసం పైన వుంటాను, విహరిస్తాను. క్రిందికి దిగిరాను - కావ్యం వ్రాసేటందుకు కాగితాలు, సిరా కావల్సినప్పుడు తప్ప, అంటాడు.

ఇట్లా అనుకోడానికి యీ పద్య కావ్య సంపుటిలో అక్కడక్కడా ఆధారా లున్నాయి. ప్రతి కవికీ ఇష్టమైన ప్రయోగాలు, పదాలు కొన్ని వుంటాయి — 'తుషారం' 'నిశీధి' 'తారు' 'బొగ్గు' 'అమూతం' 'ఎముక' లాంటివి, కృష్ణశాస్త్రికి ఇష్టమైన క్రియలు క్రుంగిపోవడం, జారిపోవడం, తునియలవడం, త్రుళ్ళిపడడం, కరిగిపోవడం, మొదలైనవి-ఈయన ఎక్కువగా అభిమానించి వాడేవి 'పడడం' 'పడిపోవడం' అన్నవి. ఈయన ఎప్పుడూ పైనే వుంటాడుగావున, 'పడిపోవడం' అన్న దానిలో ప్రత్యేకమైన సౌందర్యం కనబడుతుంది.

కొన్నింటిని ఉదహరిస్తాను.

"ప్రాణమునకును బ్రాణమౌ ప్రాణకాంత
యెదద శోధించి యశ్రులై పడిరె యిచట?"
స్నేహంపుఁ బూలతీవ
గాలితాకున నేలపై వ్రాలెనకట!

మరొక చోట —

'ఉర్వి వాలి
నా గులాబి సోలి తూలి నన్ను వీడె'

నూతేళ్ళ బ్రతుకూ —

'మ్రోడు మోకై పూయకుండగ
వాడి తూలిన తీవయై'
ఒక ఖండ కావ్యం పేరు 'క్రుంగిపోదు!' అని

మరొక చోట —

'ఎట్లో నిన్నూహ సేయుటో యెరుగలేక
వంగి వంగి శిరము వంచి క్రుంగిపోదు!'
ఇంక 'పడిపోవడం' అన్న పదం.

ఆకలివేగు నామె
యంగుళీ కిసలయ చంచలాంచలముల
విడివడి యనంత విశ్వాన బడితి నాడు.

— వెనుకటి రోజుల్లో విశ్వం అనంతం అని వర్ణిస్తే ఆక్షేపణీయం కాక పోవొచ్చు. రిలెటివిటీ సిద్ధాంతం ఋజువైన యీ రోజుల్లో వ్రాసే కృష్ణశాస్త్రి విశ్వం అనంతం అని వ్రాసివుండరు -

మరి కొన్ని ఉదాహరణలు.

—వినివికోని వింత వలపు వేడివేడి
తొందరల పరువుల నెంత తూలి తూలి
ఎంత దిగజారి దిగజారి ఎంత వెదకి
వెదకి పడినవో ...

*　　　　*　　　　*

——రాలెనో
యలసెనో స్వప్న మొండవళయై
పడె నా కనురెప్ప సెజ్జలన్! -
స్వామీ! నూత్నవసంత జీవప్రవాళ
పల్లవమ్ముల రుచులె నా బ్రతుకుజేర
గోసి తీయదనమ్ముల వోసినపుడె
వెడలి పడలేద!——

*　　　　*　　　　*

మిన్నెల్ల విహరించి మెఱుపునై మెఱసి
పాడుచు జిన్కునై పడిపోదు నిలకు

చివరి ఉదాహరణ :

—రేపునంతె నా కాష్ఠాల రేగుమంట
మన బ్రతుకుపట్ల నా దేహమును దహింపు!
పడదులే ఆర్పగా నొక బాష్పమేని!-

— 'పడదులే' అన్నది ఇంత అద్భుతంగా అమిరిన కవితా సందర్భం మరొకటి ఎరుగను నేను.

ఇరవైయేళ్ళ క్రితం చదివినప్పుడు కావ్యంలో కృష్ణశాస్త్రి దిగలేదు, పడలేదు. మళ్ళా యీనాడు అంతే. ఆయన వ్రాసిన రోజుల్లో ఆయన రొదని మొరని విన్నవారు లేకపోయారేమొ.

'——ఇట్లె
యేడ్చివై చితి వినువారె యేరులేక?'

ఏ ఒకరిద్దరో వున్నా, వారు స్వాతంత్ర్య సమరంలో నిమగ్నులై జైళ్ళల్లోవుండి వున్నారేమొ. ఆనాడు ఈ ఆవేదన వింతగా తోచివుండాలి. కాని యిప్పుడు ఈ ఆవేదనని పంచుకోగలవారి సంఖ్య పెరిగిందనిపిస్తుంది.

'నేను చిఱునవ్వు పెదవుల నిలుపలేను.' ఇట్లా నిలుపలేని వారెందరో

వున్నారు. రెండో ప్రపంచయుద్ధానంతరం- కాంగో, క్యూబాల గొడవ అనంతరం, చైనా పాలకుల దౌర్జన్యం అనంతరం - మానవుడింకా నీటిని కెలికి బురద పైకి లాగుతునే వున్నాడు. కృష్ణశాస్త్రి, ఆయన దృక్పథాన్ని స్వీకరించి సన్నిహితులైనవారు, నీటిని కెలకడానికి సంకోచిస్తారు. వారూ, వీరూ శాసించిన వాటిని చేసిపారెయ్యడానికి సిద్ధంగా లేరు వీరు. 'మరొకరు శాసించిన మార్గాన వెళ్ళి మంచిని తెలుసుకోడంకంటె, ఎవరికి నచ్చిన త్రోవని వారు వెళ్ళి చెడుని తెల్సుకోడమే శ్రేయస్సు' అన్న డాస్టావిస్కీ సూత్రాన్ని అంగీకరిస్తారు. వీరు నీటిమీద రాయి విసిరితే, తరంగాలు రేగుతాయి; ఇంకా కెలికితే, బురద పైకొస్తుంది. దాని జోలికి పోక విడిచేస్తే నిర్మలంగా వుండి, అద్దంలో వలె, ఆకాశం, నక్షత్రాలు, ప్రతిబింబిస్తాయి.

కృష్ణశాస్త్రి కవితలో దుఃఖానికి, విశ్వానికున్నట్లే, పరిధిలున్నాయని నమ్మినట్లే తోస్తుంది. ఈ పరిధులు బాహ్య జగత్తులో మానవుడి జీవితాన్నే నిర్ణీతం చేస్తాయి. మానవుడిపట్ల వుండే మమకారం అసంతృప్తితో ప్రారంభమై అసహ్యంతో అంతమవచ్చు. మానవుడి శరీరం, – అట్లాంటిది. ఆకలిదప్పులు, తిండి, విసర్జన, సంతానాన్ని కనడం, వ్యాధి, వార్ధక్యం, మృత్యువు,—అసహాయుడై వీటిని చూస్తూ భరించే గతి - వాటిపట్ల రోత. ఈ రోత జీన్‌పాల్ సార్ర్తె - తన 'డైరీ ఆఫ్ రాక్వెన్‌టిన్' అనే నవలలో బీభత్సంగా చిత్రించాడు. *సార్ర్తె - ప్రస్తుత జీవవాదం - ఎక్సిస్టెన్‌షియలిజమ్ - ప్రచారం చేశాడు. ఈ నిత్యకృత్యాల నిర్వహణలో మానవుడు ఖర్చుచేసే వికృత శక్తుల్ని కృష్ణశాస్త్రి ఎరుగును, సార్ర్తె ఎరుగున్నట్లే.

బురదలో క్రుళ్ళి పొరలాడు పురుగునెత్తి
కాంత చేర్పకుమోయి నీ కౌగలింత

మానవుడి పట్ల రోతని దిగమింగుకుని, కార్యానికి పూనుకోవాలి మానవుడు. 'ఎవరు ఏ పని చేసినా, దాని ఫలితం బాధ్యత అందరికీ సమంగా వర్తిస్తుంది - ఇప్పుడు, ఇక్కడ - అన్న ప్రస్తుత సజీవ వాదంలో, నైతిక జిజ్ఞాస, సౌందర్యం లేకపోలేదు. కవిత్వం అంటె జీవితాన్ని విమర్శించడం అన్న మాథ్యూ ఆర్నాల్డ్ నిర్వచనాన్ని, ఎందరు ఆక్షేపించి, ఖండించినా, యీనాటి వరకూ అందులో దాగిన సత్యం సాహితీవరుల ముందు నగ్నంగా దర్శనమిస్తూనే వుంది. ఈరకం జీవిత విమర్శ కృష్ణశాస్త్రి కావ్యంలో వుంది. విజ్ఞానశాస్త్ర పురోభివృద్ధి. పారిశ్రామికరంగంలో పరిణామాలు, రాజకీయ చైతన్యం. కళాజగత్తు పటాన్ని

---

* సార్ర్తె 1964 లో నోబెల్ బహుమానాన్ని నిరాకరించాడు.

మార్చి గీసినా ఆ పటాన్ని గోడని తగిలేచ్చటందుకు, కవులే దిగి రావాలి. తన పట్ల, తోటి మానవుడి పట్ల రోత దిగమ్రింగుకుని ఆత్మవికాసానికి చేయూత నివ్వాలి ఆ పటాన్ని అందరం చూడాలి అతను సాధించిన ముక్తి అందరం వంచుకోవాలి. చివరి పద్యంలో, కృష్ణశాస్త్రి ఇందుకు సంసిద్ధుడైనట్లు తెలుస్తుంది.

'అంత నే వెర్రినై పోదునయ్య; నిన్ను
బోలి పాడబోవుదు; నిన్ను బోలి నాట్య
మాడ బోవుదు' లజ్జబోనాడి; కాక
యింత దాహమ్ము దహియింప నెటులు మనదు?

ఏ విధాన సౌందర్య రసైక జీవి
నిలువ నేరుతునిట నొక్క నిముసమేని
మామకీన జీవిత శుష్కమార్గముల త్వ
దీయ పాద మంజీరముల్ మ్రోయకున్న!

ఆటతో పాటతో నేర్చినట్లు దేవ
ఏనుకూడ నీ వలె నటియింపనిమ్ము
ఎడతెగనియాత్ర నెట్లొ సాగించువరకు?
ఎట్లొ నీ దర్శనమ్ము సాధించువరకు.

పరమాత్మ దర్శనం సాధించడం ఎంత ముఖ్యమో జీవిత యాత్ర సక్రమంగా సాగించడం అంత ముఖ్యం - ఎట్లో అట్లు సాగిపోతే చాలుననుకోకూడదు. అందంగా సాగాలి జీవితయాత్ర. పరమాత్మ నటియింపవొచ్చు. కాని పరమాత్మ దర్శనం జరిగే వరకూ కవి నటియించడానికి వీల్లేదు.

'వీల్లేదు' అని చెప్పడానికి నే నెవర్ని? అట్లా శాశించవద్దనే కృష్ణశాస్త్రి గొడవంతా. 'ఇదీ గొడవ' అని నువ్వు వక్కాణించడానికి కావ్యంలో నిదర్శనలు చూపగలవా? అని విమర్శకులు రొకాయిస్తే బిక్క మొహం వేసి-

నా వలెనె యాతడున్మత్త భావశాలి,
ఆగికోలేడు రేగు నూహల నొకింత
ఎట్టి నిశినే నదరిపోవు. నెగసిపడును!

నేనూ అంతేనని సంజాయిషీ చెప్పి, నోరు మూసుగుంటాను.

ఈ వ్యాసం, **1964** 'తెలుగు విద్యార్థి' లో 'కృష్ణశాస్త్రి బి. ఎ' అన్న పేరుతో ప్రచురితమైంది. దీన్ని చదివి కృష్ణశాస్త్రిగారు "ఈ 'బి ఎ.' అన్న అక్షరాలు నే వొద్దన్నా వినకుండా, నా సమ్మతి లేకండా ప్రచురణకర్త

పుస్తకంపై తగిల్చాడు, నే బాధ్యుణ్ణి కాను" అన్నారు సాత్రే. ఇది నేను నమ్ముతాను. అందుకనే ఈ వ్యాసం పేరులోంచి 'బి. ఎ.' అన్న అక్షరాలు తొలిగించాను. జీన్‌పాల్ సార్‌త్రె ఫ్రెంచి నవలా రచయిత, 'ప్రస్తుత సజీవ వాదం' (Existentialism) ప్రచారం చేసిన తత్వజ్ఞుడు. ఆ వాదం తాలూకు గొడవ కొంత కృష్ణశాస్త్రి కవితలో వుంది. ఒకటి రెండు ఉదాహరణలు ఈ వ్యాసంలో పొందుపరిచాను. మరెవరన్నా, ఈ విషయాన్ని కొంత లోతుగా, విపులంగా పరామర్శిస్తే బాగుండును. సార్‌త్రె 1964 లో నోబెల్ బహుమానాన్ని నిరాకరించిన విషయం పాఠకులు ఎరుగున్నదే, కృష్ణశాస్త్రికి ఏ బహుమానమూ రాలేదని వాపోయ్యే వాళ్ళలో నే నొకణ్ణయినా, సార్‌త్రెలాగు, ఆయన కూడా దాన్ని నిరాకరించి ప్రస్తుత సజీవ వాదిగా, తమ తాత్విక నిజాయితీని నెలకొల్పుకుని, సంతుష్టి చెందుతే, హర్షించే వారిలో నే నొకణ్ణనే యిక్కడ చెప్పుకుంటున్నాను.

# కథకుడు, కవి, బాలగంగాధర తిలక్

బాలగంగాధర తిలక్‌ని రెండుమార్లే చూశాను. మొదటిమారు దూరాన్నుంచి చూడడమే. మంచి వర్చస్సు, కళైన మొహం, రూపసి. మనకి ఇష్టమైన రచయితని ఎదురుపడి చూశాక 'ఇల్లా ఉన్నాడేమిటి, ఈయన్ని చూడకపోతేనే బాగుండునే!' అని అనిపించొచ్చు కొందరి విషయంలో. కాని ఈయన్ని చూసినప్పుడు అల్లా అనిపించదు. చూశాక ఈయన పట్ల ఇష్టం ఏర్పడుతుంది. ఇంక రెండోమారు ఇంటికొచ్చి, ఇరవై నిమిషాలు గడిపాడు బాలగంగాధర తిలక్. పది నిమిషాలు మాట్లాడాడు. చాలా తక్కువ సేపు ఎరుగున్న వారిని విడిచి వెళ్ళడం ఎంత కష్టమో, ఇప్పుడు తెలిసొస్తోంది నాకు. ఆ ఇరవై నిమిషాల్లో ఆయన సన్నిహితుడయ్యాడు. దైనందిన జీవితంతో సంబంధంలేని ఒక బాంధవ్యం ఏర్పడింది ఆయనతో. దాని స్వరూపం ఇట్లాంటిదని నిర్వచించలేను. సమాజంలో ముఖ్యమైన వ్యక్తుల ఉనికిని మనం వారిని ఎరగం కావున, గమనించకపోవచ్చు. కాని ఆ వ్యక్తులు ఇంక లేరు అని తెలుసుకున్నప్పుడు. ఏదో ఒకలోటు ఏర్పడినట్లు భావిస్తాం. బాలగంగాధర తిలక్ విషయంలో అంతే జరిగింది.

మనస్సు వెనక్కి పోనిచ్చిచూస్తే ఆయనలో ప్రత్యేకత ఏమిటో ఇప్పుడిప్పుడు కనబడసాగింది. స్వేచ్ఛ, బద్ధం కావడం అన్నది, విరుద్ధమైనా ఒక స్వేచ్ఛాబద్ధమైన కౌతూహలం, ఒక తృష్ణ, వారి సంభాషణలో ప్రత్యేకతగా తోస్తూ వుంది. మనస్సులో, పొరలు, తలుపులు, దావరికాలు, కంతలోంచి చూడడాలు, లేకపోవడమే మానసిక స్వేచ్ఛ తెచ్చుకున్న వారిలో విశేషం అనుకుంటా అంతమాత్రంచేత వారిలో ఉద్యమాల పైన, సంస్థల పైన దెబ్బలు తియ్యడం లేదనుకోకూడదు. అవి అప్రయత్నంగా సంభాషణలో దొర్లుతాయి. కత్తినూరే చప్పుడు వినబడుతుంది. పొదిలోంచి అంబు తియ్యడం చూస్తాం. కాని వీటి వెనక స్వలాభాపేక్ష, అహంప్రకర్ష, లేవనుకున్నాను తటస్థంగా ఉండి, పరోక్షంగా తీర్పుచేసి, ఆ తీర్పు ఈ లోకం విచారణాలయం చిట్టాలో ఎక్కదన్న ధైర్యంతో, నవ్వుకుంటూ, నడుచుకుంటూ దూరంగా వెళ్ళిపోయి కూర్చుని, ఇంకా నవ్వుకునే వ్యక్తి తీర్పు — ఈయన సంభాషణలోనూ రచనలోనూ కనబడుతుంది.

అట్లాంటి మానసిక స్వేచ్ఛ అందరికీ సాధ్యపడదు. నిషేధాలు లేకుండా జీవితాన్ని సమగ్రంగా సంపూర్ణంగా చూసి, అనుభవించి తద్వారా తెలుసుకున్న దాన్ని వ్రాతలో రూపొందించడానికి నిజాయితీ అవసరం. తాను తెలుసుకుని, నమ్మినదాన్ని గురించి వ్రాయాలన్న తృష్ణ, మానసిక స్వేచ్ఛ, నిజాయితీ గల వారికే వీలవుతాయి. బాలగంగాధర తిలక్‌లో ఈ రకం శీలం ఉంది ఇందుకు కారణం, కొంతవరకూ ఆయన పరిస్థితులే. ఉద్యోగం చేసే అవసరం ఆయనకి కలగలేదు. ఏదో కొంత ఆస్తి వుంది. దానితో రోజులు గడుపుకోవచ్చు. ఆస్తి ఉండికూడా, ఎక్కడో పనిచేసి, లేక ఏ వ్యాపారమో చేసుకుని ఆస్తిని పెంచి, వ్యవహార రీత్యా అభివృద్ధి చెందాలనుకుంటారు ఎందరో. బాలగంగాధర తిలక్‌కి ఈ రకం కాంక్ష లేనట్లుంది. దీనివల్లనే ఏ ఉద్యమానికీ, తత్వానికీ లొంగక, మానసిక స్వేచ్ఛని గిరుల నడుమ బిగించక, తటస్థుడుగా ఉండి, జీవితాన్ని అవలోకించగలగడం, ఎందరికో సాధ్యపడదు. బాలగంగాధరతిలక్ ఇది సాధించాడు. ఆయన రచనలో ఒక కొత్తదనం, చురుకుతనం, స్పష్టత అందువల్లనే గోచరమౌతాయనుకుంటాను. పరిపక్వత, నిండుదనం, పెరిగిన వ్యక్తికి సాధ్యపడే హుందాతనం — ఇవి ఈయన రచనలో ఉంటాయి.

ఒక సిద్ధాంతాన్ని, ఆదర్శాన్ని ప్రచారం చెయ్యాలన్న ఉబలాటంలేక, తటస్థంగా ఉండి — సమాజం పోకడని గురించి పట్టించుకోకుండా, దూరంగా ఉండి తమాషా చూద్దామనుకున్న రచయిత రచన చప్పగా, పేలవంగా తయారై మాటల గారిడీగా అంతమొందొచ్చు. బాలగంగాధరతిలక్ రచనలో కనబడేది ఈ మాదిరి దృక్పథంకాదు. ఆయన ఒక వ్యక్తిత్వం అలవరుచుకున్న రచయిత! సమాజంలో మార్పులు కావాలంటాడు; కొన్ని తగవంటాడు. తాను హర్షించని వాటిని నరకడానికి కత్తి నూరతాడు. గిట్టని వారిని భూస్థాపితం చెయ్యడానికి సంసిద్ధుడే. కాని ఈ విసురుళ్ళు, తెగనరకడాలు, దెబ్బలు, కసుర్లు తనకి స్వయంగా సంభవించిన వాటి నుండి, కసితో పుట్టుకొచ్చినవి కావు.

తోటివాడి వ్యవస్థ తనదిగా భావించి, ఉద్రేకంతో కదలడం వీరిలో ప్రత్యేకత. అందువల్లనే పాత —— కొత్తలు, సంప్రదాయం, ఆదునికత్వం ప్రాక్ పాశ్చాత్య విలువల సమ్మేళనం, ప్రాచీనతత్వం, విజ్ఞానశాస్త్రం ప్రచారం లోకి తెచ్చిన ఒక తార్కిక దృష్టి — ఇవన్నీ కలిసి వుంటాయి. వీరి రచనలో— ముఖ్యంగా వీరి గద్యకవితలో. నేను వీరి రచనలన్నీ చదవలేదు. మనం రాస్తున్న ధోరణిలో వ్రాసే తోటి రచయితల రచనలు చదవడానికి కుతూహలపడతాం. పోకడ, వస్తువు, విధానం, అనుభవం — ఒకే స్థాయిలో నడిచినప్పుడు, ఆ

రచయితల పట్ల, సానుభూతి, అభిమానం ఏర్పడడం సహజం నే చదివిన కొద్ది రచనలూ, నన్ను ఆకర్షించాయి. ఏ పత్రికలోనన్నా వీరి గద్యకావ్యం కనబడితే అది ముందు చదువుతాను. మరొకసారి, ముందుముందు చదివే అవసరం రావొచ్చునని, దాన్ని పదిలంగా వుంచుతాను. ఈ లక్షణాలు కనబడే కొన్నింటిని ఉదాహరిస్తాను.

'వానలో సీతో' — అన్నదాంట్లో ఈ వర్ణన చూడండి.

'అరటితోట నడుంచుట్టి కాలువ ఏటవాలుగా మలుపు తిరిగింది.' తెలుగు నాట కాలవగట్టు, అట్లానే వుంటుంది. పల్లె ప్రాంతంలోని అందం అంతా వుంది ఆ వర్ణనలో.

ఆపాదం కింద పాదం :

'నారికేళ వనాంతాన ప్లాటినమ్ సంకేతంలా మెరుపు మెరిసింది!

'ప్లాటినమ్' - అన్నదాంట్లో అంతరార్థం భౌతికశాస్త్రం తెలిసిన వారికి - చటుక్కున స్ఫురిస్తుంది. ప్లాటినమ్, విలువైన లోహం, బరువైంది, మరొకదాంతో సులువుగా అతగదు. నారికేళవనాంతాన మెరుస్తుంది మరి.

చివరి పద్యం, మొదటి పాదం చూడండి.

'వానలో కానలో నాకు అవిరామ ప్రాచీనత స్ఫురిస్తుంది ' బాగానే వుంది. వానలో, కానలో మనందరికీ కూడా ప్రాచీనత స్ఫురిస్తుంది - కవులకు తప్ప కుండా. ఏ కవికైనా స్ఫురించవొచ్చు ఈ పద్యం ముగింపులో :

"బాబిలోనియన్, ఈజిప్టు నాగరికతా స్తూపాల నీడలలో ప్రాణప్రియా! మన మిరుపురం మధువు సేవించినట్లు గుర్తుకొస్తుంది."

కొందరిని పూర్వస్మృతులు కలవరపెడతాయి చారిత్రక దృక్పథం— ఆ జిజ్ఞాస నుండి జనించే ప్రాచీనతత్వం పట్ల రహస్యమైన వాంఛ — ఎందరి కవులలోనో కనిపించినట్లు, వీరి కవితలో కూడా కనిపిస్తుంది. వీరి స్మృతులు, బాబిలన్, ఈజిప్టు నాగరికతలకి సంబంధించినవి. లిథువేనియన్ ప్రాచీన సంస్కృతికీ ఆర్యుల సంస్కృతికీ పోలికలున్నాయంటున్నారు నేటి పరిశోధకులు. ఆర్యులు దక్షిణ రష్యానుండి వొచ్చారని మరికొందరంటున్నారు. దక్షిణ రష్యా ఈజిప్టు, బాబిలన్‌లకు దగ్గరలో వున్నదే అందుకనే వీరికి, అవి జ్ఞప్తి కొస్తాయి. ఆ నాగరికతలు వర్థిల్లి, పతనం చెంది స్తూపాలను మిగిల్చి అంతరించాయి. ఆ స్తూపాల నీడలో ఈ కవి, ప్రేయసితో కలిసి మధువు త్రాగినట్టు గుర్తుకొస్తోందిట. బాబిలన్, సుమెర్, ఆర్యుల ప్రాచీన నాగరికతల చరిత్ర చదివినవారికి ఈ పద్యంలో అంతరార్థం, దాగిన దృశ్యం, చక్కగా తెలిసొచ్చినట్లు, వాటిని గురించి తెలియనివారికి తెలిసిరాదేమో.

'ప్రవహ్లిక' అన్నది పరొాక విచిత్రమైన ఖండ కావ్యం ఆధునిక విజ్ఞాన శాస్త్రంతో ముఖ్యంగా - ఖగోళ శాస్త్రంతో పరిచయం వున్నవారికి యీ ఖండ కావ్యం రుచిస్తుంది.

"నక్షత్రాల మధ్య ఆకాశం వంటి
నల్లని కళ్ళదానా ఓ ఆడదానా--"

అని సంబోధన. ఓ 'ఆడదానా' అనడంలోనే వొక అందంవుంది-మనల్ని ఆకాశంలోకి లాక్కెళ్తుతుంది ఆడది. ఆమె ఎట్లాంటిది? నల్లని కళ్ళు గలది. ఎంత నలుపు? నక్షత్రాల మధ్య ఆకాశం అంతటి నలుపు అవును, నక్షత్రాల మధ్య - ఆకాశం అంతా నలు పే - మనకగుపడే రంగు భూగోళాన్ని చుట్టివుండే వాయుమండలం నుండి జనించినదే. ఇంకా ఎట్లాంటి సౌందర్యం? 'సృష్టి ముందటి చీకట్లోంచి ఏరుకున్న సౌందర్యాన్ని నీ కళ్ళల్లో నింపుకున్నావు,' భూగోళం నాలుగువేల మిలియన్ల సంవత్సరాలుగా వర్ధిల్లుతూంది. ప్రాణికోటి మొన్న మొన్ననే ప్రారంభమైంది. ప్రాణి సృష్టింపబడని ఆదికాలంలో భూగోళం లోని ప్రకృతి ఎంతటి సుందరమైందో! అదే స్వచ్ఛమైన, ఆది సౌందర్యం.

అతనెవరు? సృష్టి చివర లయంలోని శూన్యం అతను. వేడిపోగొట్టుకుని, ముందు ముందు (అంటె కొన్ని కోట్ల సంవత్సరాల పిదప) సూర్యుడు కొవ్వొత్తి లాగై, చప్పబడి దూరమైపోయినప్పుడు ప్రాణికోటి నశిస్తుంది - శూన్యం మిగుల్తుంది - అని జేమ్స్‌జీన్స్ మొదలైన ఖగోళ శాస్త్రజ్ఞులు కొన్నేళ్ళ క్రితం చెప్తూ వచ్చారు. బాలగంగాధరతిలక్ ఆ సిద్ధాంతాలు చదివి వుండాలి. ఇప్పుడు మళ్ళా అట్లాంటి ప్రమాదం లేదనీ, నిరంతరం వేడి, వెలుగుని వుంచుకోగల కీలకం సూర్య గోళంలో ఇమిడి వుందనీ అంటున్నారు ఈనాటి శాస్త్రజ్ఞులు. అయినా కూడా, ఎప్పుడో వొకప్పుడు భూగోళం తునియలై, ప్రాణి నశిస్తుందన్న సిద్ధాంతాన్ని మానవుడు ఊహిస్తూనే వుంటాడు పుట్టడం ఎట్లాంటి వింతో, నశింపు కావడం కూడా అట్లాంటి వింతె - ఈ వింత కావ్య వస్తువు. ఈ 'ప్రవహ్లిక' అనే గద్య కావ్యంలో మరి కొన్ని అందమైన, ఉపమానాలున్నాయి, అసామాన్య మైనవి. న్యూనతే వాటి సౌందర్యం. 'ఎర్రని ఆందోళన' అన్నది అట్లాంటిది. 'నీ భుజాలు వొంపు దగ్గిర చెదరి విరిగిన సముద్రపు కెరటాన్ని నేను.' చివరి పద్యంలో 'దట్టమైన అడవులలోని నిగూఢ రహస్యాలు దాచుకున్న కన్నులు కలదానా;' ముగింపు ఇట్లా వుంది:

'నాకు తల్లివి, నెచ్చెలివి, చెలివి
నన్ను కౌగలించుకున్న పెద్ద పులివి.'

చెలి, నెచ్చెలి, - తల్లి ప్రేమని, ఆప్యాయతని, ఆదరణని, కారుణ్యాన్ని చూపుతాయి. కాని అతనికి ఇవి చాలవు. మరేదో కూడా కావాలి. అది కామం. ఎర్రటి ఆందోళన - పెద్ద పులి. అది ప్రళయం, శూన్యం, పెద్ద పులి - వీటిలో ఇమిడిన కామం, శక్తి, ప్రియుడుగా అతనికి కావాలి. ఆ ప్రళయ నృత్యం ముగిసాక, చెలి, నెచ్చెలి, తల్లి - ఆ రూపం దాల్చాలి ప్రేయసి! ఆధునిక విజ్ఞాన శాస్త్రంలోని ప్రధాన సూత్రాలతో పరిచయం, ఆధునిక తత్వాన్ని, ప్రాచీన సంస్కృతీ సంప్రదాయంతో సమన్వయపరచగలగడం, సమాజం పోకడని అంతరంగ జగత్తులో పొదిగి, ఊహాబలంతో సౌందర్యాన్ని సృష్టించడం, ఈ లక్షణాలుంటాయి బాలగంగాధరతిలక్ కవితలో. ఇట్లాంటి సంస్కృతి, అభిరుచి, విద్యా సంప్రదాయం, ఉన్న పాఠకులకు ఈ కవిత రుచిస్తుంది.

ఆయన చాలా కథలు కూడా వ్రాశారు. ఇవన్నీ గ్రంథ రూపంగా వెలువడ్డాయో లేదో నే నెరగను నాలుగైదు కథలుమాత్రం చదివాను. ఈయన మంచి కథకుడే అనుకున్నాను. ఒక కథ, మంచి కథ ఐవుండి కూడా, అది సాహిత్యం అనిపించక పోవచ్చు. బాలగంగాధరతిలక్ కథలు, సాహిత్యం అనిపించుకుంటాయి. నాకు నచ్చినది వీరి 'దొంగ' అనే కథానిక. ఆ కథ చెప్తాను. గోపాలం చదువు లేనివాడు; సారా పుచ్చుకుంటాడు. కన్నాలు వెయ్యడం ఇతని వృత్తి. ఒక ఇంట్లో కన్నం వెయ్యడానికి నిశ్చయించు కున్నాడు ఆ ఇంట్లో వారి అలవాట్లు, రాకపోకలు, రెండు వారాలు పరిశీ లించాడు. ఆ ఇంట్లో భర్త, భార్య, పిల్లవాడూ వున్నారు. భర్త క్లబ్బులో జూద మాడి రాత్రి పొద్దుపొయ్యాక, ఏ ఒంటి గంటకో కాని ఇంటికి రాడు. ఇల్లాలు, ఒకర్తీ పిల్లవాడితో, వుంటుంది. ఆమె నగలు దొంగలించాలి. ఇట్టే చేసెయ్యె వచ్చు. వయసం బాగా తెలుసుకున్నాక ఒక రాత్రి, ఆ దంపతుల ఇంటి పెరట్లోకి ప్రవేశించాడు గోపాలం.

నెమ్మదిగా నడిచి వంట గది దగ్గరకు వచ్చాడు. కిటికీ పూచల్ని ఒకసారి లాగి చూశాడు. ఇంతలో లోపల్నుంచి మాటలు వినిపించాయి అతని పథకం దెబ్బతిన్నట్లనిపించింది. నిదానంగా, లోపలి మాటలు వింటున్నాడు. లోపల బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు. ఇంటావిడ గొంతులో ఏదో భయం, బాధా వున్నాయి. అతని కుతూహలం హెచ్చి, పూచల్ని కదిపి పూడదీసి, వంటింట్లోకి ప్రవేశించి, పక్క గదిలో మాటలు వింటున్నాడు. మెళ్లో గొలుసు ఇమ్మని

భర్త, ఇయ్యనని భార్యా - అదీ సంభాషణ. జూదమాడి సర్వమూ పాడు చెయ్య వద్దనీ, పిల్లవాడిని పెంచి పెద్దని చేసే భారం వహించి, యీ షోకిళ్ళు మాని వెయ్యమని, భర్తని బ్రతిమలాడుతోంది. తక్షణం, గొలుసు కావాలని భర్త, - తీవ్రంగా సాగుతోంది సంభాషణ. ఆమె గొలుసు ఇవ్వడానికి నిరాకరించింది. "ఈ గొలుసొక్కటే మనకి ఆధారం ... మీకు మంచీ, చెడ్డా, భార్యా కొడుకూ అన్న విచక్షణ పోయింది." అంటుంది భార్య. ఆమెని మొగుడు కొడుతున్నాడు.

"కొట్టండి, చంపండి, గొలుసు మాత్రం యివ్వను" అంటుంది భార్య. ఇద్దరూ పెనుగులాడుతున్న ధ్వని వినపడింది గోపాలానికి.

"పీక పిసికి తీసుకెడతాను గొలుసు, ఇల్లా పడెయ్యి." అని భర్త.

'ఎందుకివ్వాలి మీకు, జూదంలో తగలెయ్యడానికా? పిల్లవాడికి దగ్గు మందైనా తీసుకురాలేదు .... కట్టుకున్న పెళ్లాం చచ్చిందో, బతికిందో చూడరు. ఇంక వీధులమ్మట ముష్టెత్తుకు బతకాలి నేను" అన్న భార్య మాటలకి సమాధానంగా.

"ఈ వేలెడు వెధవ కోసం, నాకివ్వవన్న మాట. ఆగు. వీడిని చంపేస్తాను .." అని భర్త ఆమె వేపుకి వెళ్ళి, పిల్లవాడిని పట్టుకోబోతాడు. పిల్లవాడిని ఎత్తుకుని దూరంగా వెడుతుంది తల్లి. ఆ క్షణంలో గోపాలం గది తలుపులు తన్ని, వూడతీసి లోనికొచ్చాడు. భార్య తన మెడలో గొలుసు భర్తకి ఇస్తోంది. ఆ గొలుసుని లాక్కున్నాడు గోపాలం. భర్తని ఇల్లా చివాట్లు పెట్టాడు:

"ఆడకూతుర్ని కొడతావా? ఆ గొలుసు కాజెయ్యాలని చూస్తావా? దొంగ యెదవా .. ఏది ఆ గొలుసు యిల్లా ఇయ్యి. లేచావంటె సంపేస్తాను.

" తాగుడూ జూదమూనట్రా నీకు. సదువుకున్నోడివి. పెళ్ళాం నగలే ఎత్తుకు పోతావట్రా దొంగనాయాల ..."

భర్త చేతిలోంచి గొలుసు లాక్కుని, భార్యకిస్తాడు దొంగతనాని కొచ్చిన గోపాలం. వెళ్ళిపోతూ భర్తని హెచ్చరిస్తాడు.

"నువ్వు మళ్ళీ ఎప్పుడేనా గొలుసు తీసుకున్నట్టు కాని, ఆవిడ వొంటిమీద దెబ్బ పడినట్టుగాని తెలిసిందా, నీ ప్రాణం తీసేస్తాను." అని వెళ్ళబోతుండగా -

"ఎవరు బాబూ నువ్వు ...." అని అడుగుతుంది ఇల్లాలు.

తెల్లబోయి "నన్ను గోపాలం అంటారు లెండి. అంతె." అని తలెత్త కుండా పెరట్లోకి చీకట్లోకి నడిచి వెళ్ళిపొయ్యాడు, గోపాలం.

ఇదీ కథ. కేవలం కథగా చూస్తే, ఇది చాలా మంచి కథ, త్రాగుడూ,

జూదమూ ఎప్పుడూ అవినీతిగా పరిగణింపబడతాయి. కనుక ఈ కథలో వస్తువు మరో పాతిక, నలభై, యాభై ఏండ్లు గడిచాక కూడా పాతబడదు. కాలంతో దీని విలువ తగ్గదు శాశ్వతమైన సాహితీ ప్రయోజనాన్ని సాధించిన మంచి కథ ఇది యదార్థ జీవితంలో ఇట్లాంటి సంఘటనలు, పరివర్తన, లేకపోలేదు ఈ మధ్యనే ఢిల్లీలో ఇద్దరు పెద్ద ఉద్యోగులు, ఒక వేశ్య (నర్తకి) గృహంలో కేకపెట్టి అల్లరిచేసి పోలీసులకు పట్టుబడ్డారుట. అల్లరికి కారణం ఆ ఉద్యోగులు అక్కడ త్రాగుడు మొదలెట్టడం. వేశ్య వారిని త్రాగవద్దందిట. దురలవాటు విడిచిపెట్టమందిట. వారు గంద్రగోళం చేసి, ఘర్షణపడి, పోలీసులకు దొరికి పొయ్యారు. పడుపువృత్తి సాగిస్తున్న ఆ వేశ్య, వారిని త్రాగుడు మానమంటోంది. దొంగతనాని కొచ్చిన గోపాలం, జూదం మాననునీ, దొంగతనం మానమనీ భర్తని హెచ్చరిస్తున్నాడు.

ఒకటి యదార్థ సంఘటన, రెండోది కథ. మానవ ప్రకృతితో, అంతరంగ జగత్తుతో పొత్తు కుదుర్చుకున్న కథకుడు చెప్పిన కథ ఈ 'దొంగ' అన్న కథానిక. అందుకనే సాహిత్యం అనిపించుకుంటుంది. రచనలో అందచందా లున్నాయి. వృధావర్ణనలు, వ్యాఖ్యానాలు, లేవు. వెన్నెట్లో గోపాలం దొంగ తనానికి వెడుతున్న ఈ వర్ణన చూడండి.

'వీధులూ, యిళ్ళూ ఆ మసక వెన్నెట్లో ఒంటరిగా గోపాలంకోసం యెదురు చూస్తోన్నట్టు వున్నాయి." ఆ సమయాన్ని, ఆ దృశ్యాన్ని ఇట్టే వూహించగలం —— 'ఒంటరిగా యెదురు చూస్తున్న' ఇళ్ళని. ఇంక, కన్నం వెయ్యాలనుకున్న ఇంటికి చేరుకుంటాడు. ఆ ఇల్లు ఎల్లావుంది? ఒక్క వాక్యంలో గొప్పగా వర్ణించాడు కథకుడు.

"ఆ ఇల్లు మసక వెన్నెల్లో ముడుచుకున్న తాబేలులా వుంది."

రచయితది మంచి చూపు బలమైన వూహ.

'ముడుచుకున్న తాబేలు' గొప్ప ఉపమానం.

భర్త గొలుసు లాక్కున్న తర్వాత, గోపాలం వారిని ఎదుర్కుంటాడు.

"ఆమె సన్నగా ఎర్రగా నాజూకుగావుంది. జుట్టంతా రేగిపోయింది. చెక్కిళ్ళు కన్నీళ్ళతో తడిసిపోయి ఉన్నాయి. పాతికేళ్ళయినా ఉండవు. కళ్ళల్లో భయాశ్చర్యాలు పెనవేసుకున్నాయి చంకలో పిల్లవాడు ఏడుస్తున్నాడు"

ఆ మనిషి, ఆ పరిస్థితి, అర్థం చేసుకునేందుకు ఈ వర్ణన చాలు. ఆమె, గోపాలానికి అల్లా అగుపడింది మనం ఆమెని అతన్ని కళ్ళతోనే చూస్తాం. కథ ముగింపులోని అందాన్ని అవగాహన చేసుకోడానికి ఈ వర్ణన చాలా

ముఖ్యం. దీన్ని దాటేసి చివరలో ఏమవుతుందోనని, ఆఖరి వాక్యాలు చదివి తృప్తిపడితే, ఆఖరి వాక్యాలలోని ప్రత్యేక సౌందర్యం మనం గమనించలేక పోవచ్చు. ఆ చివరి వాక్యాలేమిటి?

"ఎవరు బాబూ, నువ్వు?" అని అడుగుతుంది, గొలుసుని, పిల్లవాడిని సురక్షితంగా ఉంచుకున్న తల్లి.

"నేనా——నేనా...." తెల్లబోయాడు గోపాలం.

"నన్ను గోపాలం అంటారులెండి. అంతె." అంటూ గోపాలం తలెత్త కుండా వడివడిగా పెరట్లోకి చీకట్లోకి నడిచి వెళ్ళిపొయ్యాడు.

అదీ ముగింపు.

ఆమె భర్తని నానా తిట్లూ తిట్టిన గోపాలం — 'అంటారు లెండి.' అని ఆమెని మర్యాదగా సంబోధించడం, 'తలెత్తకుండా' — వెళ్ళిపోడం గమనించ తగ్గవి. ఆమె సన్నగా ఎర్రగా నాజూకుగా ఉంది. ఆమె చెక్కిళ్ళు కన్నీళ్ళలో తడిసిన దృశ్యం చూసిన గోపాలం, 'తలెత్తకుండా' వెళ్ళిపోతాడు మరి! ఆ సంఘటన గోపాలంలో తెచ్చిన పరివర్తన, పాఠకుడిలో తెచ్చిన మార్పు — ఈ రెంటి సమన్వయం, ఆమెని 'అండీ' అని సంబోధించడంలోనూ, 'తలెత్తకుండా' వెళ్ళడంలోనూ ఉన్నాయి. ఇందలి స్వారస్యం అవగాహన చేసుకోడానికి, ఆమె వర్ణన అవసరమైంది. సగం కథ చదివాక, చివరికి ఏమవుతుందో నాకు తెలిసి పోయినా, చివరిదాకా చదవక తప్పిందికాదు అందుకే మంచి కథ అన్నాను.

ఇందులో, ఏదోషాలూ, ఇబ్బందులూ లేవని కాదు. శ్రద్ధగా, అదేపనిగా వెదికితే ప్రతి కథలోనూ ఏదో ఒక దోషం దొరక్కపోదు. ఈ కథలో గోపాలం మనస్తత్వ వర్ణన తీసుకోండి. "గోపాలానికి తను చేసే పనిమీద నైతిక సందేహాలు ఏమీలేవు. దొంగతనం తప్పనీ, పాపమనీ అతను అనుకోలేదు. ఎందరో తమ తమ అవసరాలకి యెన్నో వృత్తులూ, ఉద్యోగాలూ చేసినట్టుగా అతనూ యిది చేస్తున్నాడే తప్ప, మంచి చెడ్డల సూక్ష్మ విచారణ చేసే పిరికి తనం కాని, అసలటువంటి ఆలోచనలకి అవసరం కాని అతనికి కనిపించలేదు. అందువలన అతనికి అంతరాత్మని నొక్కివేయడమూ, ఒప్పించడమూ లాంటి బాధలు కలగలేదు. తన పనిలో దొరికిపోతే జైలుకి వెళ్ళాలన్న భయమూ, జ్ఞానమూ ఉన్నాయతనికి" ఇదంతా గోపాలం గురించి కథకుడి అభిప్రాయమూ, వ్యాఖ్యానమూ అనిపించుకుంటుంది — కాని దానివల్ల గోపాలం గురించి [illegible] తెలియదు. తెలిసినవి, విరుద్ధంగా, గింప్రగోళంగా [illegible] ఉన్నాయేమో అతను దొంగతనం తప్పని అనుకోడుట — సూక్ష్మ విచారణవల్ల సంక్రమించే పిరికి

తనం అతనిలో లేవని చదివాం మొదట్లో. తరువాతి వాక్యాలలో, 'తన పనిలో దొరికిపోతే జైలుకి వెళ్ళాలన్న భయమూ, జ్ఞానమూ ఉన్నాయి' అని చదివాం. ఈ భయం, జ్ఞానం ఉన్న వ్యక్తిలో, నైతిక సందేహాలు లేవనడం సబబు కాదని పిస్తుంది. ఆత్మ పరీక్షవల్ల జనించే పిరికితనం లేని వ్యక్తికి, జైలుకెళ్ళాల్సి వొస్తుందన్న భయం మటుకు ఎందుకుండాలి? రచయిత గోపాలం వ్యక్తిత్వాన్ని స్పష్టంగా పరిశీలించలేకపోయ్యాడు. తన వ్యాఖ్యానమే అతని మనస్తత్వమన్న భ్రమలోపడి సాగించిన ఈ వర్ణన తొలిగిస్తే కథకి ఏలోపమూ రాదనుకుంటా.

గోపాలం సంభాషణలో 'యాస' ప్రవేశపెట్టడం, బాగానేవుంది కాని, చివరిదాకా, సక్రమంగా కొనసాగలేదేమో అనిపిస్తుంది. ఈ వాక్యాలు పరిశీలించండి:

"ఆడకూతుర్ని కొడతావా? ఆ గొలుసు కాజెయ్యాలని చూస్తావా? దొంగ యెదవా. సిగ్గు లేదురా నీకు. బుద్ధిలేదురా ఏది ఆ గొలుసు యిల్లా ఇయ్యి. లేవకు. లేచావంటే సంపేత్తాను."

'గొలుసు కాజెయ్యాలని చూస్తావా' అన్నదాంట్లో 'చ', 'చు' శబ్దాలని వాడగలిగిన గోపాలం 'లేచావంటే సంపేత్తాను.' లో, 'స' బదులు, 'చ' ఎందుకు వాడలేడు? అల్లాగే 'బుద్ధిలేదురా'లో వొత్తు స్పష్టంగా పలికిన వ్యక్తి 'దొంగవెధవ' అని ఎందుకనలేడు? 'దొంగ యెదవ' అని ఎందుకనాలి? చదువుకోని గోపాలంకి, చదువుకున్న వాడి మనస్తత్వం ఆపాదించడం, చదువులేనివాడి 'యాస' సంభాషణలో, సంస్కారంవున్న వాడి శబ్దాలను, భాషని ప్రవేశపెట్టడం - ఇవీ ఈ కథలో దోషాలు. ఇవి స్వల్పమైనవి. మచ్చుకోసం, వెదికి పైకి లాగినవి. మొత్తం మీద, నిలబడే, మంచికథ? – 'బాలగంగాధర తిలక్ మంచి కథకుడు; కవి; ఇయన మనకి దక్కితే, ఎన్నో మంచి రచనలు చేసే వాడు. కాని ముందు ముందు, ఈయన ఎన్నో మంచి రచనలు చేస్తాడు, అంటూ, చేసిన వాటిని చులకన చెయ్యకుండా, వాటికి కృతజ్ఞత వెలిబుచ్చి, స్వీకరించి, తోటివారితో పంచుకోడంతో ముగిస్తాను.

# న వ్య త

ఆధునిక రచయితంటే ఎవరు?

తన చుట్టూవున్న జీవితాన్ని గురించి పట్టించుకొనేవాడే ఆధునిక రచయిత. వెనుకటి తరంలో గొప్ప కళాఖండాలుండొచ్చు. కాని వాటిలో విషయం సమకాలిక సమాజానికి అతకదు. కాబట్టి సాంప్రదాయంపై తిరుగుబాటు చెయ్యడం 'నవ్యత' ప్రధానసూత్రం.

వెనుకటి తరంవారిపై తిరుగుబాటు రెండు విధాలుగా జరుగుతుంది. ఒకటి సంప్రదాయాన్ని పూర్తిగా ఖండించి నిర్మూలం చెయ్యడం, రెండోది దాని జోలికిపోక వ్యక్తిగతంగా క్రొత్తవిలువలు సాధించి ప్రచారం చెయ్యడం, మనదేశ సాహిత్యంలో ఆధునికతత్వం ఒక ఉద్యమంగా కొనసాగడానికి రెండు కారణాలున్నాయి – పాశ్చాత్య విద్యాప్రభావము, దేశ స్వాతంత్ర్య ఉద్యమం – ఈ రెంటితోనూ ముడిపడి, 'గండుపడి నీరు భూభాగమంతా పొర్లి ప్రవహించి నట్లు' సాహిత్యం ఒక్కసారిగా చెలరేగి, మార్గం తెలీకుండా, ఇప్పటికి ప్రవహిస్తూనే ఉందనొచ్చు. గిడుగు రామమూర్తి, గురజాడ, వీరేశలింగం – వీరిని ఆధునిక ఉద్యమ వ్యవస్థాపకులుగా పరిగణిస్తున్నాము. సంఘ సంస్కారం వీరి ఆశయం. రచనకి ప్రయోజనం ఉండాలని వీరి సిద్ధాంతం. (సాహిత్యం ఏ కొద్దిమంది పండితులో, రసికులో రహస్యంగా ఆస్వాదించేదిగా తయారవక. సామాన్యులందరికి సుబోధకమై వారి నిత్య జీవితాలను సరిదిద్దుకొనేందుకు ఉపకరించాలి అన్నది వీరు సాధించిన ప్రయోజనం ) మొదటి యుద్ధానంతరం ఈ సామాజిక దృక్పథం కూడా పాతదైపోయింది సమాజాన్నుండి రచయితల దృష్టి వ్యక్తులపైకి మరలింది. వెనుకటివారికి, ఆధునికులకు ఉన్న పేచీ ఏమిటో శ్రీశ్రీ గారి 'వ్యత్యాసాలు' అన్న గేయంలో వివరించారు. అందులోంచి కొన్ని ఉదహరిస్తాను.

"వడ్డించిన విస్తరి మీ జీవితం
మా వంట మేమే వండుకోవాలి
ఒక్కొక్కమారు విస్తరే దొరకదు మాకు"

* * *

"మాకు గోడలు లేవు
గోడలను పడగొట్టడం మా పని"

*        *        *

"అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం"

*        *        *

"అభిప్రాయాలకోసం
బాధలు లెక్కపెట్టనివారు
మాలోకి వస్తారు"

*        *        *

అభిప్రాయాలు ప్రచారం చెయ్యడం, వాటిని జీవితంలో సాధించుకునేందుకు బాధలు పడగలగడం - ఇది ఆధునికతత్వ సారాంశం.

ఈ నవ్యత రెండువిధాలుగా ఉంది - ఒకటి వస్తువులో నవ్యత - రెండవది రచనా విధానంలో. వీటి స్వరూపం ఎట్లాంటిదో చూద్దాం.

ముందు శైలిలో నవ్యత, అందరికి అర్థమయ్యేలాగు వ్యవహారికంలో రచన సాగాలి. మధ్యతరగతివారి వ్యవహారికంలో ఇంగ్లీషు పదాలు, భావాలకు కూర్పు, వాక్యనిర్మాణం కలిసిపోయి ఉన్నాయి చాలామంది రచయితలు మధ్య తరగతి కుటుంబాలవారు కావడంవల్ల తెలుగు నుడికారము, జాతీయ రచనాతీరు, కుంటుపడ్డాయని వొప్పుకోక తప్పదు. కవిత్వంలో భావానికనువైన భాష నడక వెదకాలిగాని, భాషలో మెఱుకువలను ప్రదర్శించేటందుకు భావాన్ని ఎన్నుకోడం నేటి కవి హర్షించడు అలంకారికులు, పండితులు శాసించినట్లు కాకుండా, తన భావానికి అందని ఉద్వేగానికి అనువైన పదాలు, క్రమము, అలవరుచుకుంటాడు.

పదేపదే వాడడంవల్ల చాలా ఉపమానాలు విశిష్టతను గోల్పోయాయి. కోకిల, వెన్నెల, వసంతం, చందమామ వీటిచుట్టూ నిర్మాణమైన ఉపమానాలు, పారిశ్రామిక యుగంలో వారికి దిగ్భ్రమ కలుగచెయ్యవు. అసలు నేటి బస్తీల లోనివారు చందమామని ఎరుగరు. గ్రహణంనాడే చంద్రుణ్ణి చూడడం; ఆ రోజున ఎల్లాగు కనపడడు. యుగయుగాల సంస్కృతిని జీర్ణించుకున్న నేటి మానవుడిని కదపడానికి వింత పోకడలు పోవల్సివాస్తోంది. పదాలు, సాంకేతికాలు, విభిన్నమైన ఉపమానాలు వాటితో కసరత్తు చెయ్యాల్సివాస్తోంది అతను. "అరుబైట కూర్చో" అన్నదాన్ని — నేటికవి '6' అంకెవేసి దానిప్రక్క

బైటకూర్చే అన్న మాటలు వ్రాసి తన భావాన్ని వ్యక్తం చేస్తున్నాడు. ఇది చూడండి.

"నీ ముఖంమీద చీకటి,
సముద్రపు అలలు,
ఉపరిభాగంమీద
కాంతుల నృత్యం
నత్తగువ్వల
చిత్తుగువ్వల
గడియారంముల్లు
పిడుగుల జడి
అడుగుల సడి
నీ చుట్టుకమ్మిన నేను
నేనులో కలిసిన నువ్వు—"

ఆలోచిస్తే ఈ గేయంలో అర్థం దొరక్కపోదు. అర్థం అవకముందే ఆస్వాదింపబడాలి, అన్న Herbert Read సూత్రాన్ని అనుసరించారో, అన్నట్లు - ఆధునిక కవిత్వం, వొక మానసికస్థితిని నెలకొల్పడానికి యత్నిస్తోంది. రెండో ప్రపంచ యుద్ధానంతరం శైలిలోనేకాక కావ్యవస్తువులో కూడ మార్పు వచ్చింది. జాతీయతత్వం, కళారాధన నేడు శంకింపబడుతున్నాయి. మత విభేదాలు, ఆర్థిక వ్యత్యాసాలు, పోటీతత్వం, ఇవన్నీ సాహితీపరుల విమర్శకు గురవుతున్నాయి. ఈ బాధలు పడలేక పాతికేళ్ళక్రితం, కవి దూరంగా ఏ మూలకోపోయి వొంటిగా కూర్చుని దుఃఖిస్తానంటే నేటి కవి, అందరంకలిసి నడివీధిలో ఏడుద్దాం రండి అంటాడు.

అదీ తేడా!

ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధన మరికొన్ని మార్పులను తెచ్చిపడేస్తోంది. ఏటమ్, స్పుట్నిక్, ఆపరేషన్ బల్ల ఆదిమానవుడిలోని సహజశక్తులు, మానవుడి మనస్సులో దాగిన కోర్కెలనబడే అధోలోకం, గుంపు సంస్కృతి — ఇవన్నీ కావ్యవస్తువై కావ్యంలో ఇమడక, గద్యకవితగా, స్వేచ్ఛాకవిత్వంగా రూపొందు తున్నాయి.

ఉన్న పరిస్థితులను అంగీకరించి వాటిల్లో వొదిగి ఉండడం మన సంప్రదాయంకాదు ఈ గిరులన్నీ మనం గీసుకున్నవే. కాబట్టి మార్చుకుందాం అన్నది పాశ్చాత్య పద్ధతి. నవలల్లో, కథల్లో స్త్రీ పురుషుల ఆకర్షణ కథావస్తువు

గదా. ఇరవై యేళ్ళ క్రితం కథల్లో ఆదర్శతత్వం ఉండేది. ఒకడు ఒకామెను ప్రేమిస్తాడు. కాని కుటుంబ పరిస్థితులు అడ్డుతగిలి వారు వివాహం చేసుకోలేరు

అప్పుడేం జరుగుతుంది? నాయకుడు నిట్టూర్చి - మనం మనస్సులో ప్రేమించుకుంటూ దూరంగా ఉండిపోదాము — అని ప్రమాణాలు చేస్తాడు. కథ ముగుస్తుంది. ఇప్పుడు కథలో వారిద్దరూ, పెద్దవాళ్ళని వొప్పించడానికి యత్నాలు చేస్తారు. అవి ఫలించకపోతే లేచిపోతారు. లేచిపోవాలి — అదీ మార్పు. అలాగే పాతివ్రత్య చిత్రణంకూడా సాగింది. భార్యని శంకిస్తాడు. నలుగురు చివాట్లు పెడతారు చివరికి ఏం తేలుతుంది? ఆవిడ అట్లాంటి పనులు ఏమీ చెయ్యలేదనీ, భర్త అజ్ఞానంవల్ల అల్లా అనుమానం పడ్డాడనీ, నలుగురూ నచ్చచెప్పి అతన్ని చివాట్లు పెడతారు.

ఇప్పటి కథలలో - ఆమె నిజంగా చెడిపోయినప్పుడు ఏం జరుగుతుంది? అన్న ప్రశ్న దాని సమాధానం వస్తువుగా వుంటోంది. అసలక్కడినించే కథ ప్రారంభం.

కథానికలో కథ ముఖ్యం గాదు - ఒక మానసిక వ్యవస్థ చిత్రణ ఆదర్శంగా చేసికోవు. కాథెరిన్ మాన్స్‌ఫీల్డ్ మొదలైన వారి 'మానసిక చిత్రణ' కథలవల్ల కథా స్వరూపం మారింది. వాతావరణం సృష్టించడం రెండోది. వాడే భాషలో కొంత కరకుదనం వచ్చింది. ఉన్నదున్నట్లు, కుండ బద్దలుకొట్టినట్లు, సంభాషణలు కూర్చబడతాయి. గంద్రగోళాన్ని సూచించేటందుకు వాక్యాలు టెలిగ్రామ్ భాషలో, పత్రికలో శీర్షికలా కర్త క్రియ కర్మలలో కొన్ని లోపించుతూ నడవడం ఉంటుంది. తాత్విక పరామర్శ చింతన సాగించేటప్పుడు, చైతన్య ధోరణిలో ఫుల్‌స్టాప్, కామా లేకుండా ప్రవాహంవలె సాగిపోతుంది. వేగం తొందర, సంక్షిప్తత - ఆధునిక యుగ లక్షణాలుగా అంగీకరించినవారు, మరీ క్లుప్తంగా గల్పికను అల్లడం జరుగుతోంది.

ఇంక వస్తువులో ఆధునికతత్వం తెచ్చిన మార్పు చూద్దాం

ఇంచుమించు నేటి రచనంతా సామాన్య మానవుని ఉద్దేశించి వ్రాయబడు తోంది అనవచ్చు. చరిత్ర, సామాజిక వ్యవస్థ, మతాలు - ఇవన్నీ అతనికి అపచారం చేశాయి. గావున, అతన్ని ఉద్ధరించాలని, రచయిత సంకల్పం. వీరి కృషికి అంతర్జాతీయ సంస్థ, యునెస్కో వారి ప్రచారం కొంత దోహదం ఇస్తున్నాయి. రాజకీయతత్వాలను పరిశీలించి, చాలా మంది ప్రజాస్వామ్యాన్ని ఆమోదించారనుకుందాం. అయినా దానిపట్ల కూడా కొంత అసంతృప్తి లేక పోలేదు.

గుంపులకు కళని అందచెయ్యాలన్న ఉబలాటం, పారిశ్రామిక నాగరికతలో లోపించిన మానవత్వం, మతంలోని అసహనం-వాటిని విమర్శిస్తున్నారు. ఇవి సాహిత్యంలో ప్రబలంగా కనబడతాయి నాగరికతలోని కుళ్ళు, మర్యాదస్తుల మనిపించుకునేవారిలో దగా, మోసం - ఇవన్నీ బైట పెట్టడం వస్తువుగా ఉంటూ ఉంది. ఈ దగాలోంచి కుళ్లలోంచి, నాగరికతలోంచి ఏ మారుమూలకో పారిపోవడం సోమర్‌సెట్ మాం నవలల్లో చూస్తాం; దేన్నో వెదుకుతూ నాగరికతలోంచి పారిపోవడం - పద్మరాజు, కుటుంబరావు కథల్లో చూస్తాము సెక్స్ విషయంలో నాగరికుడు దగా పోతున్నాడు. స్వేచ్ఛకి, పరిపూర్ణ ఆనందానికి కృత్రిమ సాంప్రదాయాలు అంతరాయాలుగా వున్నాయి. సెక్స్ జీవితంలో అసంతృప్తి వ్యక్తిని పూర్తిగా పాడుచేసి, యితర రంగాలలో అతని ప్రవర్తనని కలుషితం చేస్తోంది. కావున దానివట్ల స్వేచ్ఛ చాల అవసరమని డి. హెచ్. లారెన్సు, జాయిస్‌కేరీ, మొరేవియా మొదలైన నవలాకారులు ప్రబోధిస్తారు. మనవారిలో ఈ విషయం గురించి ప్రతిభతో వ్రాసిన రచయిత వెంకటచలం గారు. సెక్స్ విషయంలో సంతృప్తి చెందినవాడి వ్యక్తిత్వం వికసిస్తుంది. అలాంటి వ్యక్తి సహజంగా మంచివాడై ఉంటాడు. మంచి పనులు చేస్తాడు. అదీ వారి సిద్ధాంతం, "ఏ అవయవాన్నీ ఎక్కువగా పని కల్పించి పాడు చెయ్యం. అల్లాగే మంచితనాన్ని గూడా తీవ్రమైన పరీక్షకు గురి చెయ్యకూడదు" అన్నది ఆధునిక నిర్వచనం మరి కొన్ని ఆధునిక రచయితల నిర్వచనాలు చూడండి. "ఎవరైనా సంతోషంగా వుంటే వారేదో అపచారం చేసినట్లు భావిస్తుంది మన సంఘం"

అల్లాగే మరొకటి · "నీతికి, జీవితాన్ని అనుభవించలేపోవడానికి ఏదో సంబంధం ఉంది"

"దాంపత్యం అనే గొలుసు బరువైంది. దాన్ని యిద్దరు మొయ్యాలి. అప్పుడప్పుడు, ముగ్గురు మొయ్యాలి." "ప్రతి యోగికీ భావికాలమున్నట్లే, ప్రతి పాపికీ భవిష్యత్ కూడా ఉంది." "నేటి సమాజంలో రెండురకాల నీతులున్నాయి. ఒకటి బోధిస్తాం కాని ఆచరించం, రెండోది ఆచరిస్తాం కానీ పైకి చెప్పం." అని బెర్ట్రండ్ రసెల్. "మన జీవితాలు మొదటి సగం తలిదండ్రులూ, చివరి సగం సంతానమూ, ధ్వంసం చేస్తారు." ఈవిధంగా, సమాజం ఆమోదించిన నీతికంటె, వ్యక్తిగతంగా సాధించిన విలువలే ముఖ్యమన్నది ఆధునిక తత్వం పెద్ద మనుషులు ప్రపంచమంతటా వొకటే - పోరంబోకులలోనే వైవిధ్యం చూస్తామంటాడు 'షా.' ఈలాంటి దృక్పథం ఫలితం ఏమిటంటే - నేటి సాహిత్యంలో

కాంతాన్ని మినహాయిస్తే, ఆదర్శ పాత్రలు లేవేమో అనిపిస్తుంది. ఉన్నా గుర్తుకి రారు అసలు పూర్తిగా మంచివారంటూ లేరని గుర్తించడమే ఆధునిక తత్వం. మనుషుల్లో కాస్త మంచి, కాస్త చెడు కలిసుంటాయి. చెడుకు కారణం కొంత వరకూ సాంఘిక పరిస్థితులు. వాటిని మారిస్తే వ్యక్తులు సత్ప్రవర్తన అలవరుచు కుంటారు. నవలల్లో, కథల్లో, ఈ యత్నం, దాని ఫలితాలు చూస్తాము. సమాజంలో పాతుకుపోయిన నైతిక సాంప్రదాయానికి, వ్యక్తిలో తపనకు వున్న సంఘర్షణ, దాని ప్రయోజనం చిత్రించి సాధించిన రచయితలలో - రాజమన్నారు గారు, నార్ల వెంకటేశ్వరరావుగారు, గోపీచంద్‌గారు, ఆరుద్రగారు, ఆత్రేయ గారు, యగ్గన్నశాస్త్రిగారు ముఖ్యులైన కొందరు.

మనకి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, ఆధునిక ఉద్యమం వత్తిడి, ఒరవడి తగ్గాయనిపిస్తుంది. విజ్ఞాన శాస్త్రం ప్రధాన సమస్యను పరిష్కరించ లేదనీ, థర్మో డైనమిక్స్ రెండో సూత్రం, సృష్టి రహస్యం మానవ పరిశోధనకి అతీతమై ఉందనీ, పరిశోధనకి లొంగని ఆ 'మాయ'నే 'పరమాత్మ' అందామనీ, ఐన్‌స్టీన్ వంటి శాస్త్రజ్ఞులు అన్నాక కొందరు వెనక్కి మళ్ళుతున్నారు. స్పెండర్, హాక్స్లే, ఈషర్‌వుడ్ - సార్‌త్రె - ఇల్లా ఏదో తత్వాన్ని తిలకించడంలోకి జారుకున్నవారే. సమాజంలో వ్యక్తుల కంటె కూడా మంచిగా వుండటానికి యత్నించడం దుర్నీతే నంటాడు, తత్వజ్ఞుడు క్రోచి (Benedetto Croce) యుగ యుగాలకి కాస్త చరిత్ర తయారవుతుంది యుగ యుగాల చరిత్ర కాస్త సాంప్రదాయాన్ని నెలకొల్పుతుంది. దాన్ని త్రోసి వెయ్యలేం. డాక్టరు రాధా కృష్ణన్‌గారు ఇల్లా వ్రాశారు ఒకచోట.

"వ్యక్తి వికాసం అభివవృద్ధి, అంటే శరీర వాంఛలు తీర్చుకోడమనే అనుకుంటున్నాము. పాపం, దుర్నీతి, చెడుగు అనాదినుంచి ఉన్నవే. ఎటొచ్చీ ఆధునికులు వాటిని ఆమోదించి మెచ్చుకుంటున్నారు వాంఛ ఉత్తమ తత్వంగా చలామణి అవుతోంది-" అని నిజంగా ఆలోచిస్తే సాహిత్యంలో ఒక విధంగా నవ్యత అనేది ఉండదు. మానవుడి కోర్కెలు, వాంఛలు, ఆశలు - వీటితో సాహిత్యానికి నిమిత్తం ఉంది. ఈ కోర్కెలు, వాంఛలు, ఆశలు ఎప్పుడూ మారవు, జననం, బాల్యంలో ఉత్సాహం, యౌవ్వనంలో ప్రేమ, నడివయస్సులో కీర్తికాంక్ష, వార్ధక్యంలో మృత్యువంటే భయం, ఆకలిదప్పులు, ఇల్లు, అనువైన వృత్తి భార్యా, పిల్లలు, సంసారం - వాటిని అల్లుకొన్ని ఉన్న వాంఛలు, కోర్కెలు, ఉద్రేకాలు - వీటిల్లో ఏ మార్పూ ఉండదు. వాటిని చిత్రించే పద్ధతిలో మార్పు ఉంటుంది. అదే నవ్యత.

# నవలలో కనబడని పాత్రలు

మనకి దర్శనమివ్వకుండా మన జీవితాలపై ప్రభావం కలిగి మనలో పెద్దమార్పు తెచ్చే శక్తులు రెండున్నాయి జీవితంలో. వీటిలో వొకటి కాలం: రెండోది కర్మ. కాలం తెచ్చేమార్పు చాలావరకూ భౌతికం. శారీరకమైన మార్పులు మనస్సును కొంత మార్చినా స్థూలంగా భౌతికం అనొచ్చు ఈ మార్పుని. కర్మ ప్రభావం, మనస్సుపైనా, శీలంపైనా, ప్రవర్తనపైనా ఉంటుంది. ఈ జన్మలో నువ్వు అందుకున్న ఆధ్యాత్మిక అంతస్తు, క్రితం జన్మలో సాధించిన ఫలితంవల్లనే నిర్ణీతమైపోయిందన్న వాదం అందరికీ తెలిసిందే. కొందరు దీన్ని విధివ్రాత అంటున్నారు. పరమాత్మ ఒకడున్నాడు — జీవితచక్రం ఆతను నడుపుతున్నాడు అన్నదీవుంది. కొందరు ఆధునికులు, దీన్ని పూర్తిగా అంగీకరించరు సమాజం మానవుడు కల్పించుకున్నాడు; దాన్ని మార్చుకునే శక్తి అతనిలోవుంది — అతనే అందుకు పూనుకోవాలిగాని, అతని అనర్థాలనూ, అగచాట్లనూ, పరమాత్మపైనా, విధిపైనా నెట్టివెయ్యడం భావ్యంకాదు — అని వీరి వాదం.

తన మంచిని సాధించగల శక్తి మానవుడిలోనే ఉందిగనక, జీవితంలో అక్రమాలకూ, అరిష్టాలకూ, అన్యాయాలకూ తనే బాధ్యుడు — అన్న ఈ ఆధునిక తత్వానికి పునాది విజ్ఞానశాస్త్ర పరిశోధన ఫలితాలు. కాని జీవిత రహస్యం, మానవుడు పూర్తిగా ఎన్నడూ శోధించలేడు. ఎంత తెలుసుకున్నా, అతనికందని రహస్యం, 'సృష్టిమాయ' ఉండనే ఉంటాయి - అని ఈనాటి శాస్త్రజ్ఞులు అంటున్నారు కావున, మన జీవితం వెనక ఏదోవొక కనబడని శక్తి ఉందని ఒప్పుకోవల్సి వస్తుంది. ఈ శక్తినే స్థూలంగా కర్మ అన్నాను.

జీవితానికి ప్రతిబింబమైన నవలలో కూడా, కనబడని రెండు శక్తులు — రెండు పాత్రలు — ఉన్నాయి. ఒకటి కాలం, రెండోది రచయిత వ్యక్తిత్వం. ఈ రెంటినీ పరామర్శించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

**కాలం** నవలలో ఒక ముఖ్యమైన పాత్ర అని నిర్వచించడంలో అతిశయోక్తి లేదనుకుంటాను.

కవితలో, వ్యాసంలో, కథానికలో, కాలం గురించి పట్టించుకోనక్కర్లేదు. కాని నాటకంలో, నవలలో, కాలం చేసే కసరత్తు, గారడీలు కనబడాలి. నాటకంలో, రెండో అంకంలో పదేళ్ళు గడిచాక మొదటి రంగంలో ఒచ్చిన పాత్రలు మళ్ళా కనబడితే, వారిలో కాలం తెచ్చిన మార్పు, వేషధారణలో, మేకప్‌లో, కంఠధ్వనిలో చూపొచ్చు. రెండంకాల మధ్య తెరపడి లేవడంలో ఉండే విరామం వల్ల కలిగే 'కొంతకాలం గడిచింది' అన్న భ్రాంతికి ప్రేక్షకుడు కాస్తోకూస్తో గురవుతాడు.

నవలలో కాలానికి సలాములు పెట్టడం తప్పదు. మరొక అధ్యాయం ప్రారంభించి, 'పదేళ్ళు గడిచాయి' అని వ్రాసి పారేస్తాడు నవలాకారుడు. కాల చక్రం కదిలిపోతూందనేవారు వెనకటి తరం రచయితలు. ఒక అద్భుతమైన సంఘటన వర్ణించేటప్పుడు "కాలం నిలిచిపోయింది" అని వ్రాయడం జరుగుతుంది. కాని కాలం నిలవదు; ఆ క్షణంలో, ఆ పాత్రలు, ఆ సంఘటనకి గురై, కాలం సంకెళ్ళు తొలగించుకొని, కాలానికి అతీతులైన నిండు వ్యక్తులుగా దర్శనమిచ్చారు స్మా - అన్న ధ్వని ఉంది అందులో.

'కాలం నిలిచిపోయింది' అన్న వ్యాఖ్యానం – ఎవరు చేసినట్టు? పాత్రలు, తమలో తాము అనుకుంటున్నారా? తోటివారితో చెప్పుకున్నారా? రచయిత అంటున్నాడా? పాఠకుడు ఆ క్షణంలో పొందవల్సిన అనుభూతికి చిహ్నమా?

పదేళ్ళు గడిచాయి – అనేస్తే చాలదు. పాఠకుడు, ఆ పదేళ్ళ కాలం ఆ నవల వాతావరణంలో సజీవుడై గాలి పీల్చేటట్లు చెయ్యాలి. పాత్రలద్వారా, పరిసరాల వర్ణనలద్వారా, ఆ సమాజంలో అప్పుడు జరుగుతున్న ఇతర సంఘటనల చరిత్రద్వారా, కాలం ప్రభావం చూపగలగాలి కాలం, స్థలంతో ముడిపడి ఉంటుంది. నవలలో ఉన్న ఉదంతం – ఫలానాచోట ఫలానా సమయంలో జరిగింది – అయి ఉండాలి. ఏ ఒక్క వ్యక్తి జీవితంలోనూ, నిత్యమూ అపూర్వ అనుభవాలు, సంఘటనలు ఉండవు. ఎప్పుడో ఒకమారు, కొందరి కొందరికి, రెండు మూడుమార్లూ! అద్భుతమైన అనుభవం జరిగి ఉండొచ్చు. మిగత సమయం నిత్యకృత్యాలతో, సాధారణమైన వ్యావహారిక లక్షణాలతో, నిండి ఉంటుంది. వారి జీవితం ఇది చూపడానికి, నవలలో చిల్లర పాత్రలు – (సాధారణ వ్యక్తులు. వీరు కథకి అంతగా ముఖ్యంకాదు) కొంత సామాజిక వ్యవస్థ చిత్రణ, నిత్యకృత్యాల కర్మకాండ పొందుపర్చాలి. ఇవన్నీ ఉంటేనేగాని, ఈ వ్యక్తుల వెనక ఒక సమాజం ఉంది. వీరు ఫలానా రోజుల్లో వర్ధిల్లారు ,

అన్న ధ్వనిరాదు. ఇందుకనే నవలలు సుదీర్ఘమైనవిగా ఉండాలన్న సంప్రదాయం స్థిరపడిపోయింది. నాలుగైదొందల పేజీలుంటేనే అది నవల అనిపించుకుంటుంది. సంక్షిప్తంచేసి, ప్రధానమైన కథని వంద పుటలలో ఇమడ్చవొచ్చు. కాని నవల ఇవ్వగల ప్రత్యేకమైన ఆనందం, కాలక్షేపం - సంక్షిప్తమైన కథ ఇవ్వలేదు.

నవలలో కొన్ని జరుగుతాయి. కాలం జరగాలి – ఐదేళ్ళనుండి, ముప్ఫై ఏళ్ళవరకూ పట్టొచ్చు. అవి జరగాలంటే తాను నిర్మించుకున్న సమాజంలో మానవుడు ఎలా ఉన్నాడో చూపడం నవల ఉద్దేశం అని ఒప్పుకుంటే, కొన్ని సంవత్సరాల ఉదంతం అందులో ఇమడ్చాలి. జాయస్ 'యులిసిస్' వెయ్యి పుటలకు పైగా ఉంది కాని అందలి వొస్తువు, డబ్లిన్ పట్టణంలో, ఒక రోజులో జరిగిన సంఘటన. అందులో కాలంలేదు ఒక్కరోజుపాటు, కాలం నిల్చిపోయింది. 'యులిసిస్' చమత్కారంతో, వింత పాండిత్యంలో, అపూర్వమైన ఊహాగానంగా సాగిన గ్రంథం నవల మాత్రంకాదు.

ఇరవయ్యో శతాబ్దిలో పాశ్చాత్య దేశాలలో గొప్ప నవలా రచయితగా పరిగణింపబడ్డ 'ప్రూస్ట్' (Prowst) నవల, - 13 భాగాలు, - ఒక్కొక్క భాగం ఏడెనిమిది వందల పేజీలు పైగా సాగింది. అందులో ప్రధాన పాత్ర 'కాలం'. అంత సుదీర్ఘంగా వ్రాసి కూడా, 'కాలం' గారడీలను, లీలను, ప్రూస్ట్ పరిపూర్ణంగా శోధించడంలో కృతార్థుడయ్యా డనుకోను. నిజానికి నవలలో మనుష్యులు ముఖ్యం, - కాలం, మనుషులకంటె ముఖ్యమనుకోకూడదు. కాలం గురించి అతిగా పట్టించుగుంటే, కాలం, మనుష్యులు, - ఇద్దరూ కూడా అర్థం కాకుండా పొయ్యే ప్రమాదం వుంది. కాలానికీ, స్థలానికీ, చక్కని సమన్వయం, పొత్తు సాధించిన నవల టాల్‌స్టాయి వ్రాసిన 'వార్ అండ్ పీస్'. అందులో ప్రధానపాత్ర స్థలం అన్నా తప్పులేదు.

కాలానికి నాలుగైదు పరిమాణాలున్నాయి. భౌతికంగా గడియారంలోనూ, క్యాలెండర్‌లోనూ, పంచాంగంలోనూ, సాగిపొయ్యేకాలం "హంతకుడికి పదేళ్ళు కారాగారశిక్ష విధించారు." అనగానే, ఆ పదేళ్ళు ఎట్లాంటివో మన మెరుగుదుం బైటలోకంలో పోలిస్తే తప్ప. ఆ పదేళ్ళు గడచిన సంగతి గ్రహించలేం. కాని ఆ ఖైదీ మనస్సులో ప్రవహించే కాలం మరొకటుంది. అతను హత్య చెయ్యకముందు జరిగినకాలం, ఆనాడు ఊహాలో వెనక్కి వెళ్ళిన కాలం, జైలులో, రాత్రి కలలో కాలం, 'నేను వూహిస్తున్నాను' – అన్న అతని జిజ్ఞాసలో కదలిపోతూన్న కాలం, ఆ ఊహించేటప్పుడు జరిగే కాలం,

మనిషి వూహించగలడు; మరీ చిత్రమేమిటంటే, తను వూహిస్తున్నట్లు తెలుసుకో గలడు; అట్లా తెలుసుకున్న వ్యక్తిని కూడా తెలుసుకోగలడు తన ఊహకి, బాహ్యజగత్తులో వాస్తువూ తనే, అంతరంగ జగత్తులో వాస్తువూ తనే - సృష్టిలో ఏ యితర ప్రాణికీ యీ ద్వంద్వమైన జిజ్ఞాస వున్నట్టు లేదు. ఈ ద్వంద్వ న్నుండి జనించిన కాలమే, నవలలో కనబడని పాత్ర.

కాలం లీలలు ఇంతటితో ముగిసాయనుకోకూడదు. రచయిత కూడా యీ కాలానికి బంధించబడ్డాడు. 'పదేళ్ళు గడిచాయి' అన్న నవలాకారుడు, నవల ప్రారంభించి, ముగించే వరకూ కాలంలో ప్రయాణం చేస్తాడు నిజమే. అతను ప్రస్తుతంలో వుండి, వెనక జరిగిన వాటిని గూర్చి వ్రాసే, చరిత్రకారుడు ఊహలో పాత్రల కాలంలోకి ప్రవేశిస్తాడు వారితో పాటు తనూ ఎదుగుతాడు. కాని రచయిత ప్రస్తుతాన్ని పూర్తిగా విడనాడలేడు. అతనేదో శిఖరం మీద వున్నాడు. ఇప్పటి స్థలంలో వుండి వెనకటి కాలంకేసి చూస్తున్నాడు. తన అంతస్తు, జిజ్ఞాస విడనాడలేడు ఈ అయిష్టత, లోపం, కాస్తో కూస్తో పాత్రలకి అబ్బుతుంది. ముందుగా ఇతివృత్తం అల్లుకుని, ఫలానా పాత్రలను గూర్చి వ్రాయాలి అని పథకం వొకటి తయారుచేసి, దాని ప్రకారం వ్రాసే నవలలో పరిణామం వుండదు, అది ఎదగదు, ముందుకి సాగదు. పాత్రలు కీలుబొమ్మ లవుతారు. అపూర్వ సంఘటన దగ్గరకొచ్చేటప్పటికి, రచయితలో వుద్వేగము, ఉత్సాహము, కుతూహలమూ తగ్గి, చప్పబడి, నవల 'కాలం స్తంభించింది' అన్న వాక్యాల గాడిలో పడి, ఎల్లాగో బైటపడలేక, పాత్రల పెండ్లితోనో, చావుతోనో బైటపడుతుంది. అసంతృప్తితో నవలాకారుడు మంచాన పడతాడు. నవలా రచయిత, పాత్రలు, పాఠకుడు, ఆశ్చర్యపడగల తృష్ణ, అస్పష్టత, 'మాయ' యివి నవలలో వుండాలంటే మైలురాళ్ళు వేసివున్న సిమెంట్ రోడ్డులో కాలం అనే జీపులో ప్రయాణం చెయ్యకూడదు పదేళ్ళనుండి సిద్ధమవుతున్న వొక వ్యక్తిత్వం. వొక్క అనుభవంతో ఆ క్షణంలో కొత్త వికాసాన్ని, తెచ్చుకో వొచ్చు; మరో పరిమాణం అలవర్చుకోవచ్చు. సరోజ చలాకీ అయిన పిల్లగా మనం ఎరుగుదుం మొదటి అధ్యాయంలో పదేళ్ళ తర్వాత ఆమె ఎల్లా వుంది? ఈ వాక్యాలు చూడండి

"ఆనాటి చలాకీ ఇంకా ఆమెలో వుంది. అది బాహ్య జగత్తులో వాస్తువుల నాశ్రయించుకుని నిలబడిన చలాకీ కాదు; ఆమెలో సహజంగా వున్న చురుకు దనం ఇప్పుడు, ఆమెకి ఏ లోటూలేదు, రేడియో వుంది; రోజూ సినిమా కెళ్ళొచ్చు; కార్లో షికారెళ్ళొచ్చు; ఇష్టమొచ్చిన చీరలు కొనుక్కోవచ్చు. ఇవేవీ

ఆమెకి అక్కర్లేకుండానే, ఆమె చలాకీగా వుండగలదు ఇవన్నా వుంటే ఆ చురుకుతనంలో కాస్తంత దిగులు కూడా వుందేమో ననిపిస్తుంది"

ఎవరికి కనిపిస్తోంది? నవలా రచయితకి. ఈ కల్పిత ఉదాహరణలో రచయిత ప్రస్తుతంలో వుండి చేసిన వ్యాఖ్యానం అది.

శ్రీనివాసరావు చదువుకునే రోజుల్లో సర్దాగా, నవ్వుతూ, అల్లరిచేస్తూ కనబడేవాడు. వివాహమైంది. ఉద్యోగం చేస్తున్నాడు; ఆ సర్దా, అల్లరీ, నవ్వూ మాయమయ్యాయి? ఈ ఏడెనిమిదేళ్ళలోనూ ఏం జరిగింది? అతన్ని ఆ రోజుల్లో బాగా ఎరుగున్న వారు యీనాడు అతని జీవితంలోకి ప్రవేశిస్తే, వారిలో ఎట్లాంటి మార్పులొస్తాయి? ఒక బెల్జియం స్త్రీని నాజీలు జైలులో వుంచి, మర్నాడు ఉరి తీస్తామన్నప్పుడు, ఆ ఉదయానికి ఆమె జుట్టంతా నెరిసిపోయిందట. కాలం, సముద్రగర్భం లాంటిది– ఎంతో పూపుతో వేగంతో కదిలి, ఎంతో దూరం వేగిరపాటుతో ప్రయాణం చేసి, వొడ్డున ఇసుకలో, పల్చటి చారని దిగ విడుస్తుంది. సముద్ర గర్భం కదలిక, పాటుపోట్లు, – నవల ఇతివృత్తం నత్తగుల్లని చెవికానించి వింటే, సముద్రం పాటుపోట్ల నాదం వినబడుతుం దంటాడు వర్డ్స్‌వర్త్ కవి. పాత్రలు నత్తగుల్లలే — కాని వారి ఉనికి కాలంలో– సముద్రంలో కాలాన్ని ఏదో విధంగా నవల పుటలమధ్య కట్టిపడేస్తాడు నవలా కారుడు. నవల చివరలో పాత్రల భావాలు, సంభాషణలు, గతంలో మరుగు పడిన అంతరార్థాలలో, తొణికిసలాడతాయి. వెనకటి అనుభవాన్ని వారు స్మరించకపోయినా, పాఠకుడు స్మరించి వొక్క కన్నీటి బిందువు వొదుల్తాడు– సముద్రపుటొడ్డున కెరటం తీగ విడిచిన చారలా, అది కాలం వొదిలిన కన్నీటి బిందువు. ప్రస్తుతంలో వుండి, కాలం అనే నౌకలో ప్రయాణం నవలాకారుడికి సాధ్యం– అది తన కాలం కాదు, అందరిదీను. ఈ కారణం వల్లనే, స్వీయ చరిత్రలు అంత తృప్తికరంగా వుండవు ప్రస్తుతాన్నుండి గుణపాఠాలు నేర్వాలన్న ఉబలాటం వొదులుకోలేరు. వారు వెళ్ళే నౌక స్వంతంది. దాన్ని నడపడం వారొక్కరికే తెలుసు. చూసేవారు నేర్వకపోయినా, వారు నేర్చు కున్నట్లుగా, గతంలోని అనుభవాన్ని స్మరించి, దానికో విలువ, ప్రయోజనం కల్పిస్తారు. కాని ఆ అనుభవం జరిగినప్పుడు, వారి మనస్తత్వం, వైఖరి, వేరు నవలా రచయితకి — గతంలో దాగిన ప్రస్తుతంతోనూ, జరిగిపోయి కూడా జరుగుతూన్నట్లుగా వుండే కాలంతోనూ నిమిత్తం వుంది. అందువల్లనే, స్వీయ చరిత్రకంటే, డైరీకి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. డైరీలో ఏరోజు జరిగిన

వృదంతం ఆరోజే. వ్రాసేస్తారు 'ఇది ప్రచురిద్దాం' అన్న ఉద్దేశంతో డైరీ వ్రాయడంలో, కొంత దగా, ఆత్మవంచన వున్నా, దానిమీద కాలం అడుగు జాడలు స్ఫుటంగా కనిపిస్తూనే వుంటాయి. కొందరు నవలాకారులు, డైరీ పుటల ద్వారాను, ఉత్తరాల ద్వారానూ, కథ చెప్పడానికి ఇదొక కారణం ఈ పద్ధతిని ఆక్షేపించడం నా పనికాదు — కాని ఇది తృప్తినివ్వదు. డైరీలో పేజీలు, ఉత్తరాలు, అక్కడక్కడ భరించగలను గాని, మొత్తం అంతా అదే అయితే నే నా నవల చదవలేను.

ఇందుకు కారణం, ఆ నవలలో కనబడని మరో పాత్ర లేకపోవడమే. ఆ పాత్ర నవలా రచయిత. రచయిత వ్యక్తిత్వం, గంద్రగోళంగా కనబడే మన చుట్టూవున్న సమాజంలోంచి, కొన్ని ముఖ్యమైన విలువలనీ, ప్రయోజనం గల సంఘటనలనీ, మనల్ని మనం శోధించుకునేటందుకు తోడ్పడే మన స్తత్వం గల వ్యక్తులనీ, ఏరి, ఒక క్రమంలో, పద్ధతిలో పొందుపరచీ, అప్రస్తుతమైన వాటిని విడిచేసి ప్రధానమైన జీవితపు పోకడలను ప్రదర్శించి వీలైతే వీటికి వొక అర్థం కల్పించి, మనల్ని కవ్వించి, కదిలించి, అందంగా, శక్తివంతంగా నచ్చజెప్పి, ఆ జీవిత దృక్పథాన్ని మనం ఆ కాసేపు అంగీకరించేటట్లు చేసే వ్యక్తి నవలాకారుడు. అతని ఉనికి, ఛాయ, "ఉన్నాడు ఫరవాలేదు" అనిపించే నీడ మనకి కావాలి. నిజమే, కాని అతను భవనం గేటు ముందుగా నిలబడి మనల్ని వెంటాడుతూ, తన జబ్బల పటిమా, తొడల బలమూ, ఛాతీ వెడల్పూ పదేపదే చూపుతూ భవనంలో అందచందాల ముందు తలమీద నిలబడి కసరత్తు సాగిస్తే మనం సహించలేము. నవలా రచయిత ప్రత్యేక జీవితవిశేషాలు మన కనవసరం; అతని వయస్సు, చదువు, ఉద్యోగం, సంతానం, ఆస్తిపాస్తులు, ఆశయాలు, సంస్కృతి, రాజకీయాలు, మతం, నమ్మకాలు, ఏదో సాధించానన్న ఉబలాటం, వీటితో మనకి నిమిత్తం లేదు. రచయిత వ్యక్తిత్వం అంటే యిట్లా దైనందిన జీవితానికి సంబంధించిన భోగట్టా అనుకో కూడదు. మనకి ఆ రచయిత నవలలంటే అభిమానం, అపేక్ష ఏర్పడింతర్వాత, రచయితని గూర్చిన దైనందిన జీవితానికి చెందిన విశేషాలు తెలుసుకోవాలన్న కుతూహలం ఏర్పడొచ్చు. అది వేరే విషయం.

మరి ఎందులో వుంది రచయిత వ్యక్తిత్వం? నవలా రచనా పద్ధతిలో ప్రచారంలో వున్న కొన్ని పద్ధతులు చూద్దాం. బాహ్య జగత్తులో గమనించిన విషయాలను, ఉన్నవి ఉన్నట్లుగా చెప్పడం వొక పద్ధతి. ఇందులో పాత్రల అంతరంగ పరిశోధన, సంఘటనపై వ్యాఖ్యానం వుండవు. ఇంచుమించు చరిత్ర కారుడి పద్ధతి ఇది.

(రెండోది బాహ్య జగత్తు సంఘటనలకు అంత ప్రాముఖ్యం ఇవ్వక, వ్యక్తుల అంతరంగాలని బైటపెట్టడం ప్రవర్తనకి, అంతరంగానికి ముడిపెట్టడం) పర్యవసానం నుండి పారాలు చదవడం, అంతరంగ వాక్ చిత్రం Interior Monologue, కలాన్నుండి, స్థలాన్నుండి వ్యక్తులను విడగొట్టి, అంతర్జాతీయ మానవులుగా, వారిలో ప్రధాన మానవత్వం అన్ని కాలాల వారికి అర్థమయ్యే టట్లుగా చిత్రించడం యీ పద్ధతి. ఈ పద్ధతిలో రచయిత చాలా పాత్రల ద్వారా దర్శన మిస్తాడు. అతని ఆశయాలు, నమ్మకాలు, ఆదర్శాలు మనకి రుచించక పోతే ఆ పాత్రల పట్ల అసహనం ఏర్పడుతుంది. మనకి అవి నచ్చితే, మనల్ని మనం అభినందించుకుంటూ చదువుతాం గాని, నవల చదవడంలో పొందే ప్రత్యేకమైన అనుభవం దాన్నుండి పొందం.

మూడో పద్ధతిలో రచయిత సర్వజ్ఞుడు :- అతనికన్నీ తెలుసు. పాత్రల మంచి చెడ్డలను పరామర్శించి వ్యాఖ్యానించి పాఠకుడితో పంచుకుంటాడు. "పాఠక మహాశయుడి"లో ప్రతి పుటలోనూ గుసగుసలు జరుపుతూనే వుంటాడు. వెనకటి తరం వారి అభిమాన ధోరణి ఇది సమీక్షించబొయ్యే విమర్శకుడికి కాఫీ ఇచ్చి మంచి చేసుకోడం లాంటిది; పాఠకుడితో ఈ విధంగా రహస్య మంతనాలు సల్పడం. ఈ రకం రచయితంటే యీనాడు జాలిపడతాం. గౌరవించలేము.

ఒక ప్రధాన పాత్ర తన వ్యక్తిత్వంతో ఐక్యత కుదుర్చుకుని, ఆ పాత్ర ద్వారా, ఆ పాత్రకి జరిగిన విషయాలను చెప్పించడం. ఆ పాత్రపట్ల రచయితకి సానుభూతి వుందిగనక తన వ్యక్తిత్వం, ఆ పాత్ర వ్యక్తిత్వంలో కలిసిపోయి పరోక్ష వ్యాఖ్యానంగా చిత్రణగా సాగుతుంది నవల. చాలామంది అవలంభించే పద్ధతి ఇది. మనం వొక మూల నిలబడి, వొక వ్యక్తి నీడలో నుంచుని జీవితాన్ని చూసే అవకాశం వుంది యీ పద్ధతిలో. ఎటొచ్చి ఆ కోణంలో రాచి, చూస్తుంటే కనబడేవి, ప్రధానమైనవి, అసాధారణమైనవిగా వుండి కూడా సాధారణంగా కనబడేవి అవాలి. లేకపోతే పులివేటకై వెళ్ళి నాలుగైదు రాత్రిళ్ళు వొక చెట్టు కొమ్మమీద కూర్చున్నాక - మనం తుపాకి పేల్చి చంపిన జంతువు, తెల్లమేక పిల్ల అవడంలా గుంటుంది

డైరీ పుటలు, ఉత్తరాలు వీటి ద్వారా కూర్చిన నవల విడిచేస్తే, నలుగు రైదుగురు తమకు జరిగిన వాటిని చెప్పడం పద్ధతి వొకటుంది సంఘటన వొకటే. అది నలుగురైదుగురికి సంభవిస్తుంది. వారు చెప్పేవాటిల్లో తేడా లుంటాయి. ఈ తేడాలు చూసి, అసలు సత్యాన్ని శోధించడమే నవలా రచయిత

ఉద్దేశం చమత్కారానికీ, వైవిధ్యానికి కొంత అవకాశం వుంది యీ పద్ధతిలో. కాని వస్తువు వొకటే అవడం మూలాన విసుగు జనించే చిక్కు కూడా వుంది.

రచయిత నవలలో వొక పాత్రగా, "నేను" అని వ్యవహరిస్తూ కథ చెప్పడం, మరో పద్ధతి. గందరగోళంగా కనబడే వాటిలో వొక సూత్రాన్ని వెదికి ప్రధానమైన వాటిని విడగొట్టడానికి యీ పద్ధతి ఎంతో వుపకరిస్తుంది 'నేను' అని చెప్పుకున్న వ్యక్తి తనకి తెలిసిన వాటిని గురించే వ్రాయగలడు. మిగతా వాటిని విడిచెయ్యొచ్చు. లోపల పాత్రలు ఎన్ని సంభాషణలు జరిపినా, ఇతని మాటలే మనం శ్రద్ధగా వింటాము. అతను మనకన్నీ చూపుతున్నాడు, చెప్తున్నాడు, దోవ చూపుతున్నాడు.

అతను ఏమైపోతాడో అన్న కుతూహలం మనలో చివరిదాకా వుండి పోతుంది ఈ 'నేను' అన్న వ్యక్తి రచయిత అనుకోకూడదు రచయిత సృష్టించిన వొక పాత్ర. ఎదురుగా నిలబడి "నేను" అని ఒక వ్యక్తి అనగానే మన దృష్టి అతనివైపు మరలుతుంది. ఆత్మీయంగా విశేషాలు చెప్పే స్నేహితుడు, మన మేలుకి కృషిచేసి మనల్ని పురిగొల్పుతున్న ఉపన్యాసకుడూ, వొక వింత వ్యక్తి స్వగతం, ఆత్మహత్యకి ముందు దిగవిడిచిన ఉత్తరం, ఎంతో అనుభవం గడించిన పెద్దాయన చేసే ప్రసంగం వీటిపట్ల మానవుడి కుతూహలం రెచ్చగొట్టబడడానికి సిద్ధంగా వుంటుంది. అదే యీ పద్ధతిలో విశేషం. కాని, ఈ 'నేను' నవలలో కొన్ని పేచీలున్నాయి. "నేను" అని వ్యవహరించే వ్యక్తి అతి తెలివైన వారు కాకూడదు. అతను పాఠకుడి అంతస్థుకి మించిన తాత్విక విజ్ఞాన ప్రవర్తకి పూనుకోకూడదు. మరీ తెలివి తక్కువవాడుగానూ కనబడ కూడదు. అట్లా కనబతే, నవల హాస్యగ్రంధంగా తయారవగలదు.

ప్రసరింపజేసి, వాటిని మరొక్కసారి వూపురి బిగబట్టి చూసేటట్టు వర్ణించ గలగడం, నవలాకారుడి వ్యక్తిత్వంలో ప్రధాన లక్షణంగా పరిగణిస్తాను. పల్లెటూళ్ళలో సంధ్యా సమయం వర్ణన ఎరుగుదుం. ఆవులు ఇండ్లకొస్తాయి; గొడ్ల కావరి వాటి వెనక పాడుతూ వొస్తాడు. దుమ్ము రేగుతుంది. పక్షులు గూళ్ళకి చేరుకుంటున్నాయి. యీ రకం వర్ణన పల్లెలలో సాయంత్రం ఇట్లాగే వుంటుంది. నిజమే మన మెరుగుదుం కాని ఇది, ఏ పల్లెటూరన్నా కావొచ్చు— ఇది చదివాక మనం ఎరుగున్న పల్లెటూరి నుండి మన దృష్టి మరల్దు.

ఈ వర్ణన చూడండి.

పాకవతల ఎండిన పొలంలో పిల్లలు ఆడుకుంటున్నారు - గొట్టిబిళ్ళ. సూర్యుడు గడ్డివామి వెనక దిగిపొయ్యాడు. పిల్లల నీడలు ఎగిరి గెంతడం లేదు.

గూళ్ళల్లో పిట్టల కోలాహలంలో వారి కేకలు వినబడ్డం లేదు. నేల బూడిద రంగులో వారి గోచీల బూడిదరంగు కలిసిపోయి, నగ్నంగా కనబడుతున్నారు. కాస్తంత దూరంగా వెళ్ళారు ఆ కుర్రవాడు పైకి చూశాడు. పైన గద్దలు— మధ్య దూరంగా రాబందు తిరుగాడుతోంది. భయపడ్డాడు కాబోలు చటుక్కున గుంపులోంచి తప్పుకుని పాకలోకి వచ్చేశాడు." ఇక్కడ మనం ఆడుకుంటున్న పిల్లల్ని చూడడమే కాకుండా, మట్టితో బూడిదరంగుని, ఆ పిల్లల నీడల్ని కూడా చూస్తున్నాం. సూర్యుడు అస్తమించాక నీడలుండవు పిల్లలు నగ్నంగా ఉన్నారు. గద్దలు, రాబందు – వుందనడం, దాన్ని చూసి పిల్లాడు భయపడి వెనక్కి రావడం – ఇవి ఫలానాచోట, ఫలానా సమయంలో జరిగింది – అనిపించడానికి తోడ్పడుతుంది ఏ పల్లెలోనైనా సాధ్యమయ్యే వాతావరణమూ వుండాలి. అక్కడ ప్రత్యేకతని సూచించే వాతావరణమూ వుండాలి. ఈ కల్పిత ఉదాహరణలో మరొక అధ్యాయం అయ్యాక కరణంగారి దూడ చనిపోయిందనీ, పొలంలో పడివుందనీ — తెలుసుకున్నాక, ఆ రాబందును గూర్చిన వర్ణనని మొదటికొచ్చి మరొక్కసారి చదవాలనిపించవచ్చు. అతడు, ఆమె నడుచుకుంటూ వెడుతున్నారు. వారి దుస్తులు, నడక, సంభాషణ, పరిసరాలు – ఇవన్నీ వర్ణించడం మన మెరుగుదుం.

ఈ వాక్యాలు చూడండి.

"ఆమె మొహం ఎడమవైపు, కుడివైపుకంటే బాగుంటుందని గ్రహించి కాబోలు, అతనికి కుడివైపున నడుస్తూంది. మెడ ఎడమవైపుకి తిప్పడం అతనికి అలవాటు. ఆమె కుడివైపుకి అతను నడుస్తున్నాడు కాస్త దూరం వెళ్ళాక, ఆమె అతని కుడివైపుకొచ్చింది. అతనూ ఆ యత్నమే చేస్తున్నాడు — నిలబడి, ఒకరి అవస్థ ఒకరు గ్రహించినట్లు నవ్వుకున్నారు."

ఈ రచయిత, మనుషుల్ని, అలవాట్లని, అంతరంగాన్ని, జాగ్రత్తగా పరిశీలిస్తాడు. శ్రద్ధగా చదవాలి— కథ కోసం, పేజీలు పేజీలు దాటెయ్య కూడదు అనిపిస్తుంది. అద్దంలో చూసుకుంటే మన మొహం ఎడమ, కుడి భాగాలు ఒకేలా గుండవని మనం గ్రహించలేక పోవచ్చు. మన వెనకున్నవారు అద్దంలో మన మొహాన్ని చూసి ఇట్టే చెప్పివేస్తారు.

"ఒకాయన యవ్వనం గడిచిపోయి, నడివయస్సులో పడ్డాడు. శరీరంలో వచ్చిన మార్పులకు అతను తట్టుకోలేదు జుట్టు పల్చబడుతోంది; నుదుటిమీద వెనక్కి వెడుతోంది చెవల వెనక క్రాపింగ్‌లో తెల్ల వెంట్రుకలు; కాస్తంత బొజ్జ, పట్కా వేసి బిగించినా, పంట్లాం పైనుండి బైటపడుతోనే వుంది.

నిలువు టద్దంలో పక్కకి తిరిగి చూసుకుని, ఊపిరి బిగించి, పంట్లాం కిందికీ పైకి సర్ది, ఏదో ఒక పద్ధతిలో నిలబడితే, బొజ్జ కనిపించడం లేదన్నట్లుగా ముస్తాబై బైటకి నడిచాడు." అని ఒక వర్ణన చేశాడు నవలాకారుడు. ఇల్లాగ దగా చేసుకోడం మానవ నైజం. ఇంత సూక్ష్మమైన పరిశీలనా శక్తిగల రచయిత మనకి సన్నిహితుడు — వ్యాఖ్యానం, విమర్శ లేకుండా మనల్ని మనం చూసుగునేటట్లు చేస్తాడు గనక.

రెండో లక్షణాన్ని ఔదార్యం అనొచ్చు. బాగా అనుభవం గడించి, మనిషి మనస్సులో ఉండే తికమకలు, పేచీలు అవగాహన చేసుకున్నాక, వారిని గురించి చటుక్కున నిర్ణయానికి రాకపోవడం అన్నమాట. మనుషుల్ని, మంచి వారిగా, చెడ్డవారిగా విభజించి, విలువకట్టి; మంచివారిని అందలం ఎక్కించి, చెడ్డవారిని శిక్షించి — ఇల్లా చెయ్యకపోవడమే ఔదార్యం మనుషుల హృదయాల్లో లోతులుంటాయి; పొరపాటులుంటాయి, అంతస్తులుంటాయి. వాటిల్లోకి చొచ్చుకుని వెళ్ళాక మానవత్వాన్ని ఋజువుచేసే ప్రధాన సూత్రాన్ని బైటకి లాగి చూపెట్ట గలగడం — మానవుడు అల్లా ఉంటాడు — అంతే — అని తెలుసుకోగానే ముక్కుమీద వేలేసుకుని చకితులమై, మౌనంలో పడతాం. మంచివారిలో చెడు, చెడ్డవారిలో మంచి — అందరిలోనూ రెండు కలిసివుంటాయి. వేటిల్లో ఏదో ఒకటి బైటపడటానికి కారణం, తల్లిదండ్రుల నుండి సంక్రమించిన శీలమా? సమాజ పరిస్థితులా? పరిసరాలా? విద్యాసంస్కృతులా? స్వయంకృషా? పూర్వజన్మ సుకృతమా? ఇవన్నీ తొలిగిస్తే అసలు 'నాది' అని మనిషిలో మిగిలిందేమిటి? చరిత్రనుండి విడగొట్టబడిన మనిషి ప్రపంచంలో మానవులకు ప్రతిబింబమా? లేక ఒక ప్రాంతంలో, ఒక మారుమూల, ఒక సమయంలో ఉన్న ఒక బృందానికి ప్రతిబింబమా? ఈ ప్రశ్నలు తన జిజ్ఞాసలో ఉంచుకుంటాడు ఔదార్యంగల నవలాకారుడు. పాత్రలు సహజంగా పెరుగుతాయి; ఏదో ఒక సిద్ధాంతాన్ని ఋజువు చెయ్యడంకోసం, వాటిని అడ్డంగొట్టి, పెడత్రోవని తిప్పడు; సమాజంలో అందరూ అతనికి ముఖ్యులే — త్రాగుబోతులు, జూదరులు, కళాకారులు, కోటీశ్వరులు, పండితులు, దొంగలు, స్వేచ్ఛాజీవులు, లంచగొండులు, వికలాంగులు, బలశాలులు — అందరూ మనుషులే — తాను సృష్టించిన ప్రపంచంలో పౌరులే. అతను నియంత కాడు; న్యాయాధిపతికాడు; పోలీసుకాడు. దైవానికి సృష్టిపట్ల ఎంతటి బాధ్యతో, అతనికి తాను సృష్టించిన వారిపట్లా అంతటి బాధ్యత. తాను సృష్టించిన లోకంలో వ్యక్తుల జీవితాలలో, దైవాన్ని ప్రవేశపెట్టే, గొప్ప నవలాకారుడైన థామస్‌హార్డీ — ఔదార్యాన్ని కోల్పోయి, రెండోశ్రేణి

రచయితగా దిగిపొయ్యాడు. ఆయన నవలల్లో పాత్రలు శిఖరానికి చేతులు చాస్తారు; విధి చేతిమీద ఒక్కవేటు వేస్తుంది. కర్మకి, విధికి, ఒక శక్తికి అధిపత్యం ఒప్పగించి, తన బాధ్యత ఒదులుకుని, తన పాత్రలతోపాటు, తనూ పతనం చెందిన మహా రచయిత హార్డీ. అనాటి సమాజానికి భయపడి, తెలుసుండి కూడా నిజంచెప్పక, విధిని కల్పించి తాను తప్పుకున్న హార్డీలో నిజాయితీ కొంత లోపించిందనే ఒప్పుకోవాలి.

ఈ నిజాయితీ, నవలాకారుడిలో మూడో లక్షణం. ప్రజలకి యిప్పుడు ఈ రకంవి నచ్చుతున్నాయి గనక - ఈ రకంవి వ్రాయబూనుకున్న రచయితలో నిజాయితీ లోపించిందన్నమాటే. తను చూసిందేమిటి? గ్రహించిందేమిటి? అందులో పంచుకోవల్సిన ప్రత్యేకత ఉందా? ఉంటే, అదే చెప్పు — నీ కోణం నుండి, నీ దృష్టినుండి, దేనికోసమూ వ్యక్తిత్వాన్ని విస్మరించని రచయిత నీడల జాడలు నవలంతా కనబడుతూనే ఉంటాయి:

ఆదర్శాల ప్రచారం లక్ష్యంగా పెట్టుకోకపోవడం, వ్యక్తిత్వం గల రచయిత లక్షణంగా చెప్పొచ్చు. నవలలో, నీతి, గుణపాఠాలు, ఆదర్శాలు — ఇవేవీ ఉండవనికాదు. వీటి ప్రచారంకోసం నవల సాగించడు మరో పద్ధతిమీద సమాజం నడిపితే శ్రేయస్సు అనుకున్న రచయిత, ఆయా విషయాలపై సుదీర్ఘమైన వ్యాసాలు వ్రాసి, డాక్టరేట్ డిగ్రీ పొందవొచ్చు, అల్లా చేస్తున్నారు కూడా. త్రాగుడువల్ల కలిగే అనర్థాలు; బాల్య వివాహాలు; బాల వితంతువులు; ఆస్తి చదువులేని స్త్రీలు, వేశ్యాలోలత్వం, వ్యభిచారము - ఈ సమస్యా పరిష్కారానికి నవల ప్రారంభించకూడదు. నవలలో పాత్రలు, వీటిల్లో కొన్నింటికైనా గురవడం, వాటిని కొంత చర్చించడం ఎల్లానూ ఉండనే ఉంటుంది. అప్పుడు కూడా, నల్లబల్లమీద సుద్దముక్కతో వ్రాస్తూ కూర్చోకూడదు నవలాకారుడు. అతను ప్రచారం చేసేది, జీవితంపట్ల దృక్పథం, ఆ దృక్పథంలో అతని వ్యక్తిత్వంలోని లక్షణాలన్నీ ఉండొచ్చు. అతనిలో లోపించినవీ ఉండొచ్చు. ఆ దృక్పథంలో ఏదో కొంత లోపించడం వల్లే అతను నవలా రచనకి పూను కుంటాడేమొ కూడ!

నవలాకారుడి జీవితంలో ఏదో వొడుదుడుకు, తొట్రుపాటు, లోపము ఉంటుంది బాల్యంలోనో, యౌవనంలో, ఏవో గాయాలు తగుల్తాయి, ద్వంద ప్రకృతి ఏర్పడుతుంది. ఆ విడిపోయిన రెండు మనస్తత్వాలకే సమన్వయం కుదుర్చుకోవాలంటే, నవల శరణ్యం అది వ్రాసేస్తే ఆ విభిన్న మనస్తత్వాన్ని సమన్వయపరిచి, ఐక్యత సాధించి విముక్తుడవుతాడు. ఆ విధంగా నవలా రచన,

పొక తపస్సు సాధన లాంటిది. ప్రపంచంలో తిరుగాడుతూ, గాయాలుతింటూ, మాధుర్యాన్ని చవిచూస్తూ, ఉద్రేకాలకు లొంగి, మనసుల్లో కలిసిపోయి కూడా ఏకాంతంలోకి వెళ్ళి పొంటిగా తన అంతరంగం అనే సముద్రంలో మునిగి, ప్రపంచాన్ని మనుషుల్ని ఉద్రేకాలని మరిచి, ఏకాగ్రత, దీక్ష పటుత్వము, పట్టుదల, తేజస్సు సంపాదించి తను లోకంలో కలిసి, లోకాన్ని తనలో కలుపుకొని, జీవిత రహస్యాన్ని తిలకించి ఆనందాన్ని, శాంతిని దర్శించి 'నవల' అనే సమాధిలో అడుగు పెట్టాలి. ఇట్లాంటి ఆనందం, శాంతితో కూడుకున్న దృక్పథాన్నే అతను ప్రసారం చెయ్యగలడేమో! తన్ను తాను తెలుసుగుని, పరమాత్మ సాక్షాత్కారమైన వ్యక్తి రచనకే పూనుకోడేమొ కాని ఈ దృక్పథం, నిబ్బరం, నిజాయితీ - వ్రాసేటప్పుడు రచయితలో ఉండడం ముఖ్యం. అతని శక్తులన్నీ పొక్కసారి ఖర్చుపెట్టడు. సమయోచితంగా వాడతాడు. "ఇంకా ఇతనిలో చాలా ఉంది" అనుకునేలాగు కొన్ని సందర్భాలలో పేట్రేగిపోక హుందాగా, నిశ్శబ్దంగా, మెల్లగా సాగుతాడు. అద్భుతమైన సంఘటన ఏర్పడినప్పుడు తను ఉద్రేకాలకి చోటిచ్చి, శక్తులన్ని విజృంభింపజేసి కేళి సల్పుతాడు. నవల మధ్యలో కావొచ్చు, చివరలో కావొచ్చు ఎప్పుడో అప్పుడు అతను కనబడతాడు. అది జరగకపోతే ఆలయానికెళ్ళి లోపలి విగ్రహాన్ని చూడకుండా పొచ్చెయ్యడం లాంటి చింత నిలిచిపోతుంది.

రచయిత దృక్పథంతో ఏదో తత్వం ముడిపడి ఉండనక్కరలేదు. 'అగ్ని కాలుస్తుంది, నీరు తడుపుతుంది' అన్న సత్యం గల తత్వాన్ని మించిన మరో తత్వం దేన్ని షేక్స్‌పియర్ ప్రచారం చేసినట్లు లేదు అంటాడు విమర్శకుడు వాల్టర్‌రాలె. పక్కింటివాడు సుఖంగా ఉంటేతప్ప నే సుఖంగా ఉండలేను అనడంలో ఉన్న రాజకీయాలు మినహాయిస్తే డికెన్స్ నవలల్లో ఏ రాజకీయాలు లేవంటారు విమర్శకులు. 'పక్కింటివాణ్ణి ప్రేమించు' అన్న దానిలో ఉన్న మతావేశానికి అతీతమైన ఏ మత సూక్తి టాల్‌స్టాయి, డాస్టావిస్కీలలో లేవంటారు సాహితీపరులు. మహాపురుషులు. మత ప్రవక్తలు, కళాకారులు, ఉద్యమ వ్యవస్థాపకులు బోధించిన సత్యాలు కాపీ పుస్తకాలల్లో వున్నవే మనం బాల్యం నుండీ వల్లె వేస్తున్నాము. నవలలోనూ ఇవే ఉంటాయి. ఎటొచ్చీ అవి పొక కల్పిత జగత్తులో వ్యక్తులచేత అమలు జరుపబడి, ఋజువు కావడం జరుగుతుంది. అక్కడ వాటిని చూశాక, కాపీ పుస్తకంలో సత్యాలని కేవలం వల్లె వెయ్యడం కోసమే చూడం. ఆచరణలో పెట్టడానికి యత్నం జరిగినా, జరిగితే బాగుండు ననిపించినా కూడా నవలా రచయిత ధన్యుడే. "అందులో సంధ్య వర్ణన చదివాక సాయంత్రం ఆకాశంకేసి చూసినప్పుడు నే కంట తడి

బెట్టని రోజు లేదు" అన్నాడు వాత్సాయన. బాహ్య జగత్తులో జరిగే సంఘర్షణ నుండి శబ్దాలు జనిస్తాయి. అంతరంగ జగత్తులో జరిగే సంఘర్షణ నుండి శబ్దాలు జనిస్తాయి. అంతరంగ జగత్తులో జరిగే సంఘర్షణ నుండి కావ్యాలు జనిస్తాయి- అన్నారెవరో. నిజమే కాని రచయిత, తన స్వీయ గాధని ఒక పాత్ర ద్వారా బైటపెట్టి సమన్వయం కుదుర్చుకుందామని తలపెడితే దెబ్బతింటాడు. నవలా కారుడి ప్రథమ యత్నంలో ఈ రకం స్వీయ గాధ దర్శనమిస్తుంది- అందుకనే ప్రథమ యత్నం విజయవంతమైందిగా పరిగణించరు 'ముందు ముందు మంచి నవల వ్రాసే సూచనలున్నాయి' అనేస్తాడు విమర్శకుడు. విమర్శకుడితోనో, ఆదర్శప్రాయుడైన పాఠకుడితోనో, తనకున్న సమస్యలను ఎవరితోనో పంచు కోవాలన్న తృష్ణకి, అంతరంగ అనుభూతి, ఏకాగ్రత తోడవాలి. వారిని తనలో కలుపుకుని తాను వారిలో ఐక్యం అవాలి. కూసం విడిచినట్లు, మంచు వెలుగులో కరిగినట్లు, పసికందు ఏడ్చినట్లు — యీ సమన్వయం సహజంగా జరిగినప్పుడే గొప్ప నవల తటస్థపడుతుంది ఇందులో ఏది లోపించినా మంచినవల కావచ్చు. గొప్పది కాదు.

# ఆధునిక నాటకం ఎందుకు ప్రజల్ని ఆకర్షించటంలేదు?

గోడలమీద కాగితాలంటించి, కరపత్రాలు పంచిపెట్టి, పత్రికలో ప్రకటించి, కార్ లో లవుడ్‌స్పీకర్ అమర్చి, వీధి వీధీ తిరుగుతూ నలుగురికి తెలియబరుస్తూ, ప్రచారం చేశాక, ఏ ఒక్క ఆధునిక నాటకాన్నో హాల్లో ప్రదర్శిస్తే, టిక్కట్లు కొనుక్కున్న ప్రేక్షక జనంతో ఆ హాలు నిండుతుందా? హాల్లో ఇంక చోటు లేక టిక్కట్ల అమ్మకం నిలిపి వెయ్యడం జరుగుతుందా? లోనికి వచ్చే అవకాశం లేక, కొందరు హాలవతల దిగడిపోయి, కసి వెళ్ళబోసు కుంటూ రాళ్ళు రువ్వడం జరుగుతుందా? రంగస్థలంమ్మీది పాత్రధారులు అంకం ముగియగానే, చుట్టూ కూర్చున్న ప్రేక్షక జనం నడుమ చోటు చేసుకుని లోపలికి వెళ్ళడానికి వీలు లేని పరిస్థితి ఏర్పడుతుందా? - వెనకటి తరం స్టేజి నాటకం ఆడినప్పుడు, ఇవన్నీ జరిగేవి. ఆధునిక నాటకం ఆడితే, ఇందులో ఏ ఒక్కటీ జరగదు. పామర జనం రారు. చదువుకున్నవాళ్ళు టిక్కట్టు కొనే అవసరం లేకపోతే, రండని బ్రతిమాలితే, "వీలుంటే చూస్తాలే" అని ఎల్లానో కాస్సేపు ఇతర పనులన్నీ ఒదిలించుకుని, అరగంట ఆలస్యంగా వొచ్చి, పది నిమిషాలు కూర్చుని వెళ్ళిపోతారు చప్పుడు కాకుండా. ఎవరి సమక్షాన నాటకం ఆడుతున్నారో, వారు మధ్యలో నాటకాన్ని ప్రశంసిస్తూ నాలుగుమాటలు చెప్పాలి- ఆ ప్రముఖ వ్యక్తి, వారి కుటుంబమూ, నటీనటుల కుటుంబాలు, స్నేహితులూ మినహాయిస్తే, ప్రేక్షక జనం అంటూ ఉండరేమో, ఆధునిక నాటకం ఆడినప్పుడు. ఆధునిక నాటకం ఎందుకు ప్రజల్ని ఆకర్షించడంలేదు? ఆధునిక నాటక సంప్రదాయం అంటూ ఒకటి ఎందుకు ఏర్పడటం లేదు? ఈ ప్రశ్నకు అందరూ తలో సమాధానం చెప్తున్నారు. వీటిలో కొన్నింటిని మాత్రం చెప్తాను.

సినిమా లొచ్చాక స్టేజి నాటకం కుంటుపడిందన్నది ఒక అభిప్రాయం. సంప్రదాయ, స్టేజీ నాటకంలో వస్తువు సినిమాలో ఉంటుంది - గయోపాఖ్యానం, తులాభారం, కృష్ణలీలలు, లవకుశ, పాదుకా పట్టాభిషేకం, హరిశ్చంద్ర, విప్ర నారాయణ, సక్కుబాయి, తుకారాం, - మీ ఇష్టం. ఏది చెప్పండి. అందలి కథ

సినిమాలో ఉండి తీరుతోంది. స్టేజి నాటకం ద్వారా, ఏ కాస్తంత పేరు తెచ్చుకున్న నటుడున్నా, అతను సినిమాలోకి పోతున్నాడు. వన్స్‌మోరంటే తిరిగి పాడటం మినహా, ఈ పద్యాలే సినిమాలో ఉంటాయి. అందమైన వేష ధారణ, మంచి సెట్టింగులు, వైర్ వర్క్ బదులు ట్రిక్ ఫోటోగ్రఫీ ఉంటుంది- మాయాబజారు ఉదాహరణ - యుద్ధాలుంటాయి, డ్యూయెట్లుంటాయి, వనాలు, విహారాలు, ఆశ్రమాలు, రాజ దర్బారులు, - మీ చిత్రం. చారిత్రిక శోభంతా సినిమాలో తక్కువ టిక్కెట్టుతో దగ్గరగా కూర్చుని, జాగ్రత్తగా ప్రశాంతంగా చూడొచ్చు.

స్టేజి నాటకం పేరుపడ్డ నటుడుంటంవల్ల వర్ధిల్లింది-ఆధునిక నాటకంలో నటుడు లేడు - ఎవరన్నా ఉండి కాస్త పేరు తెచ్చుకుంటే, సినిమా రంగంలోకి జారిపోతున్నాడు. నటీమణులు లేనేలేరు స్త్రీ పాత్రలు లేకుండా ఆధునిక నాటకం వ్రాస్తే తప్ప, దాన్ని ఆడేవారే ఉండరు. వెనక నాటక సమాజాలంటూ ఉండేవి. నిర్వహించి, శిక్షణ ఇచ్చే ఆచార్యుడుండేవాడు. నేటి నాటక సమాజాలకి, అధిపతి అంటూ లేడు. ఇతర వ్యాపకాలున్న పది మంది పోగైతే, దీన్ని అమెచ్యూర్ నాటక సమాజం అంటున్నారు. వారు ఏడాదికి ఒక్క ప్రదర్శనైనా ఇవ్వగలిగితే విశేషమే అది అవగానే, మళ్ళీ వారి పన్లలో వారు నిమగ్నులు కావడం, కొందరు బదిలీ అయి వెళ్ళిపోవడం, స్త్రీ పాత్ర పెండ్లి చేసుకుని కాపరానికెళ్ళడం జరిగి ఆ సమాజం చీలిపోతుంది

మరో కారణం ఆధునిక నాటకంలో వస్తువు న్యూనత, ఇతివృత్తం చాలా వరకూ మన సమాజాన్ని పరామర్శించేది కాదు. వాటిల్లో ప్రజలెరుగున్న సెంటి మెంట్ ఉండదు. చాలా భాగం పాశ్చాత్య నాటకాలలోంచి సంగ్రహించిన వస్తువు. సన్నివేశాలు, పాత్రలు, భావాలు - ఇవి మన హృదయాల్ని కదిలించవు. ప్రేక్షకుడు రసానుభూతి చెందడు. నాటకం అల్లిన వాతావరణంలోకి ప్రవేశించ లేడు. ఏవో భావాలుంటాయి, ఇవి నిత్య జీవితంలో పూర్తిగా ఇమడలేవు. మనం రోజూ చూస్తున్న దైన్యం, బీదతనం. అలవాటైన పరిసరాలు సెట్టింగులై స్టేజి మీదా ఉంటాయి. ఊహాలో అందమైన జగత్తుకి పారిపోవడానికి ఇవి ఉపక రించవు. పద్యాలుండవు, పాటలుండవు, అర్థం అవకపోయినా ఉత్తేజం కలిగించే గంభీరోపన్యాసా లుండవు. కొట్లాటలు, తన్నుకోడాలు, గుద్దులాటలు, ఎవడో ఒకడు చావడం, ఒకత్తి ఆత్మహత్య చేసుకోడం, ఒకడికి పిచ్చెత్తడం, కోర్టులు, సాక్షులు, న్యాయాన్ని గురించి చర్చలు, దర్పంతో వున్న ధనికుణ్ని చావదన్నడం, ముసలాడికి కుర్రకారు బుద్ధి చెప్పడం, మూఢ నమ్మకం మధ్య

నుండే మానవ శ్రేయస్సు - వీటితో నిండివుంటుంది ఆధునిక నాటకం. హృదయాన్ని కదపదు. బుద్ధిని కదుపుతుంది బుద్ధితో ఆస్వాదించే ప్రేక్షక జనం లేదు. అందుకని ఈ నాటకం ప్రజా బాహుళ్యానికి "ఎక్కదు".

మంచి నాటకాలు లేకపోవడం మరో కారణం అంటున్నారు కొందరు. గురజాడ వారి కన్యాశుల్కం తర్వాత, అంత మంచి నాటకం రాలేదన్నవారినీ ఎరుగుదును సంఘాన్ని మరామత్తు చెయ్యాలి అనుకుని తాత్కాలిక ప్రయోజనాన్ని సాధించే ఉద్దేశంతో నాటక రచనకి పూనుకుంటున్నారు ఈ రోజుల్లో. తలపెట్టిన ప్రయోజనాలు సిద్ధించగానే ఆ నాటకం అంతరించి పోతోంది. ఆంగ్ల ప్రభుత్వాన్ని కూలదోసి రాజకీయ స్వాతంత్ర్యం తెచ్చుకోవాలనుకున్న రోజుల్లో, నాటకంలో ఆంగ్ల విద్యనభ్యసించిన స్త్రీని హేళన చెయ్యడం ఫేషన్, రంగస్థలంపై ప్రేక్షకుడి ప్రాణమిత్రుడుగా కనబడినా, ఆంగ్లవిద్య నభ్యసించిన గిరీశం కూడా చివరికి పశ్చాత్తాపపడి చంపలేసుకుని గుణపాఠం చేర్చుకుని, నిష్క్రమిస్తాడు. ఈనాడుచదువుకోని స్త్రీని చూసి జాలిపడతాం. చదువుకున్న స్త్రీని గౌరవిస్తున్నాం "సక్కుబాయి" స్టేజి నాటకంలో, పురుషులతో సమానహక్కులు చలాయిస్తూ క్లబ్బులకెళ్ళే స్త్రీలని హేళనచేస్తూ, కొన్ని ఘట్టాలున్నాయి. ఆ రోజుల్లో ఆ రకం స్త్రీలని చూసి ప్రేక్షకులు నవ్వేవారు. ఈనాడు ఆ ఘట్టమే ఉండకూడదన్నాం. తాత్కాలిక సాంఘిక ప్రయోజనంతో సాగిన ఇబ్సెన్, షాల నాటకాలే మూలపడుతున్నాయి. మానవ ప్రకృతిని పరామర్శిస్తూ, శాశ్వతమైన ప్రవృత్తులను చిత్రించే నాటకాలే నాలుగు కాలాలపాటు నిలబడే అవకాశం ఉందనడానికి మోలియర్ నాటకాలు, చెకోవ్ నాటకాలు, ఇబ్సెన్ "బ్రాండ్", "పేర్ జింట్", షా "సైంట్ జోన్", "హరిశ్చంద్ర" "శకుంతల" "హామ్లెట్" మొదలైన నాటకాలు తార్కాణం కన్యాశుల్కంలో ఉపకథగా వెలిసిన ఘట్టాలు, రంగస్థలంపై ప్రదర్శింపబడినట్లు కనబడదు. ఆ నాటకంలో వస్తువు పాతదైనా, అందలి సన్నివేశం, ఒకటిరెండు పాత్రలు, మానవ ప్రకృతికి ప్రతిబింబాలవడంవల్లా గొప్ప నటులద్వారా, ఆ పాత్రలకి విశిష్టత సమకూరడంవల్లా ఆ నాటకం కొంతకాలం నిలుస్తుందనుకోవొచ్చు.

ఏటేటా నాటకాల పోటీలు జరుపుతున్నారు మంచి వాటికి బహుమతులిస్తున్నారు. నగరాలలో నాటక సమాజాలు బైలుదేరి, నాటక వారోత్సవాలు జరుపుతున్నారు, ప్రముఖులు అధ్వర్యం వహిస్తున్నారు. మెచ్చుకుంటున్నారు. ఇవన్నీ పత్రికల్లో వేస్తున్నారు. ఎకాడెమీలు బోలెడు ప్రోత్సాహం ఇస్తున్నాయి. వారెన్నిక చేసిన నాటకాలు పెద్దల సమక్షాన ప్రదర్శింప బడుతున్నాయి. బోలెడు

ఉత్తమ నాటకాల సంపుటాలు వెలువడుతున్నాయి. ఇంత జరిగినా, ఆధునిక రంగస్థల నాటక సంప్రదాయం స్థిరపడలేదు సరికదా, అసలు ఉద్భవించినట్లే లేదు. దేశంలో నాటకాల ప్రస్తావన వచ్చినప్పుడు, తెలుగు నాటకం ప్రశంస రాదు. భారత దేశంలో రంగస్థల నాటకాల సింహావలోకనం ఏటేటా జరుగు తుంది. ఆంధ్ర రంగస్థలం ప్రసక్తి రాదు ఏదో తిరకాసుంది.

ఆ తిరకాసేమిటో తెలుసుకోవాలన్న కుతూహలం నాటకాల పట్ల భక్తి శ్రద్ధలున్న వారందరికీ ఉంటుంది. నాకూ ఉంది. చదువుకునే రోజుల్లో, ఐదారు సంవత్సరాలు వెనకటి తరం నాటకాలు, ఇంచుమించు అన్నింటినీ చూశాను కొన్నింటిని పదేపదే చూశాను. నాటక రచనకి పూనుకున్నాను నిర్వహణలో ఉన్న ఇబ్బందులు, సమస్యలు తెలియక సాగిన తొలి నాటకాలు ప్రదర్శించి నప్పుడు, అవి ఎందుకు బాగాలేవో తెలుసుకునే అవకాశం దొరికింది. వాటిని తిరిగి వ్రాశాను. ఇదంతా జరిగేటప్పటికి, పదిహేను, ఇరవై యేండ్లు జరిగి పోయ్యాయి కొత్తతరం ప్రేక్షకజనం. కొత్త నాటకాలు రాసాగాయి. నా నాటకాల్ని గురించి వీరు పట్టించుకోవడంలేదు. అవి పాతవై వెనకపడ్డాయా? - అన్న సంశయం ప్రబలుతోంది ఈ కొత్త నాటకాలు కూడా అల్లానే వెనకబడు తున్నాయిలే అనుకుని ఎందరు నాటక రచయితలు తమ్ముతాము సమదాయించు కుని, సరిపెట్టుకుని, "నాకెందుకు పోనిస్తురూ" అనుకుని రచన మానుకుంటు న్నారో నాకు తెలియదు. నేటి నాటకాలలో తిరకాసేమిటో పరామర్శించి ఈ శాస్త్ర అనుభవంతోనూ, తెలుసుకొన్న కొన్ని సూత్రాలను మాత్రం ఇందు పొందు పరుస్తాను.

నాటక కర్తకి నాటక నిర్వహణతో పూర్తిగా ప్రమేయం ఉండాలన్న సూత్రాన్ని నేనామోదిస్తాను. కవి, నవలాకారుడూ రచన చేసేశాక, తమ పని పూర్తయిందని భావించవొచ్చును. కాని నాటకకర్త అల్లా అనుకోడానికి వీల్లేదు. నటీనటులనే కాకుండా, ప్రేక్షకులను పోగుచెయ్యడం కూడా అతనిపనే. ఆధునిక నాటకంలో ప్రధానపాత్ర నిత్య జీవితంలో మనం ఎరుగున్న వ్యక్తులలో ఒకదవటంవల్ల ఆ పాత్రని ప్రదర్శించే నటుడు రంగస్థలంపై ఎల్లా ప్రవర్తిస్తాడో బైటకూడా అల్లానే ప్రవర్తించే స్థితి ఏర్పడింది ఈ పరిస్థితిలో, అతనిలో స్థిర పడిపోయిన ప్రత్యేక పోకడలనే నాటకంలో పాత్రద్వారా ప్రదర్శించి, తన వ్యక్తిత్వాన్ని బలపరిచే నమూనా తయారు చేసుకుంటాడు. ఆ నమూనా రంగస్థలంపై పాత్రలో ప్రత్యక్షమవుతుంది. ఈ ప్రమాదం తప్పించాలంటే నాటకకర్తకి, నిర్వహణతో ప్రమేయం ఉండితీరాలి.

నాటకాన్ని సాహిత్యంగా రూపొందించడమే ఆదర్శంగా పెట్టుకున్న రచయితల మాట నే చెప్పలేను కాని, ఆధునిక రంగస్థల సంప్రదాయం నెలకొల్పాలనుకున్న రచయిత, నిర్వహణతో సంబంధం ఒదులుకోకూడదు. పాత్రలు వాడే భాష, మామూలుగా మనమెరుగున్న వ్యవహారిక భాషే ఐనా, భావాల న్యూనతవల్ల, పాత్రల విశిష్టతవల్లా, ఆధునిక నాటకంలో వాడే భాష అందచందాలు, వైచిత్రి, రచయితకే బాగా తెలుస్తాయి. ఒక్కొక్క సందర్భంలో నటుడుకి పోర్షన్ రాక, స్వంత కవిత్వానికి దిగితే, ఆ పాత్ర, సన్నివేశమూ కుంటుపడడం జరుగుతుంది. కొన్ని సంభాషణలు, నటుడు ఎంత బాగా చెప్పినా, ఆ కంఠంలో తగిన సంస్కారం లేకపోతే, ఆ సంభాషణ రాణించదు. ఈ ఇబ్బందులను, కొంతవరకు రచయిత ఎదుర్కొగలడు.

వెనకటి రంగస్థలం నాటకంలోనూ, కొంతవరకూ నేటి సినిమాలలోనూ, చాలా భాగం ఆకర్షణ నటుడి పేరు ప్రతిష్ఠలపైన ఆధారపడిందనొచ్చు. కాని ఆధునిక రంగస్థలం నాటకంలో, సాముదాయక బలం కావాలి కాని, నటుడి ప్రత్యేకత, ప్రతిభకాదు. ప్రతిభ అక్కర్లేదనడంలేదు నేను. ఉంటే సంప్రదాయం చటుక్కున ఏర్పడుతుంది. అదొక్కటే చాలదంటున్నాను.

'ఫలానా నటుడు గిరీశం పాత్ర ధరిస్తున్నాడు కావున, ఈ నాటకం చూద్దాం' అనుకున్న ప్రేక్షకులుండేవారు వెనక. ఆధునిక నాటకంలో, నటుడి ప్రతిభద్వారా ఆకర్షించిన ఒక్క నాటకాన్నైనా పేర్కొనగలమా?

నాటకంలో ఇతివృత్తం ప్రేక్షకుల అనుభవంలోనిదై ఉండాలి. పాశ్చాత్య నాటకాలలోని పాత్రలను సన్నివేశాలను దొంగిలించడం అనవసరం. మన సమాజంలో ఎందరో వింత వింత వ్యక్తులున్నారు, ఎన్నో సమస్యలు, నాటకీయత గల సందర్భాలూ ఉన్నాయి వీటిని విడిచేసి, పాశ్చాత్య నాటక సందర్భాలను, సమయాలను తస్కరించి మన రంగస్థలంపై ప్రవేశం పెట్టడంవల్లనే, ప్రేక్షకులకి మనం దూరమై పోతున్నాము. ఈ అనుకరణలవల్ల, తృప్తి, ఆనందం, ప్రయోజనం ఏదీ సిద్ధించదు.

ప్రేక్షకుడు, ప్రస్తుతాన్నుండీ, ఎరుగున్న సమాజంన్నుండీ పారిపోవడానికి నాటకం ఉపకరిస్తుందంటారు. నిజమే. కాని అతను అన్వేషించేది పాశ్చాత్య నాగరికత కాదు. తన దేశ చరిత్రలోకి పారిపోతాడు. కల్పిత జగత్తులోకి పారిపోతాడు. అందులో తెలుగు భాషే ఉండాలి, తెనుగుతనం ఉండాలి. తానెరుగున్న నరసయ్య, వెంకాయమ్మ ఉండాలి అందులో. అది ఆదర్శ సమాజం కావొచ్చు. తాను కలలుకంటూ ఉన్న జగత్తు కావొచ్చు.

ఎటొచ్చీ, తన బాధ్యత లేకుండా, తాను ఏ కార్యక్రమమూ నిర్వర్తించకుండా సిద్ధించిన సమాజం కావాలి తను పారిపొయ్యే సమాజం, సమాజాన్ని ఉద్ధరించడం, నడుంకట్టి, కార్యానికి దిగడం, నాటకకర్త పనికాదు. నాటకం వ్రాసి పారెయ్యడంతో అతని పని పూర్తయినట్లే. రంగస్థలమే అతని కార్య రంగం. అల్లానే నాటకం తిలకించి, ఊహలో ఐక్యత పొందడంలో ప్రేక్షకుని పనికూడా పూర్తయినట్లే. ఇదంతా కల్పిత జగత్తన్న జిజ్ఞాస, ఇద్దరికీ ఉంది. ఈ జిజ్ఞాస కళా దృష్టికి వెన్నెముక. అట్టి నాటకాలు వ్రాసిన వారికీ, చూసి ఆనందించినవారికీ - ఒక కొత్త పరిమాణం, దృక్పథం అలవడొచ్చు. మానసిక, నైతిక అంతస్తు పెంచడమే నాటక రంగం సాధించే ప్రయోజనం కాని ఈ పెరుగుదలకి కొలతబద్ద తప్పకుండా మన మెరుగున్న సమాజమే అవాలి

"తన చుట్టూ వున్న వ్యక్తులకంటె, మంచిగా, నీతిపరుడుగా ఉండటానికి యత్నించేవాడు 'దుర్నీతి' అనే గుమ్మంలో అడుగు పెట్టినట్లే" అన్న ఇటాలియన్ తత్వజ్ఞుడు 'బెనెడిట్ క్రోచె' మాటలు ప్రేక్షకుడికి పూర్తిగా అన్వయిస్తాయనుకుంటాను.

ఆధునిక నాటకం బాహ్య జగత్తులో సంఘర్షణను చిత్రిస్తుంది. తాను నిర్మించుకున్న సమాజంలో మానవుడు ఎట్లా వున్నాడో చూపడం దాని పని. వ్యక్తి అంతరంగంలో జరిగే సంఘర్షణ చిత్రించలేం - సాంకేతికాలని ఇరికిస్తే తప్ప. ఈ సాంకేతికాలు (Symbols) ప్రేక్షకుడి జిజ్ఞాస పరిమితులను దాటి వుంటే, అతనికి అర్థం కావు. సమూహంలో కలిసిపోయి, ఒకడై పోయినప్పుడు అతని జిజ్ఞాస పరిమితమై ఉంటుంది. ప్రేక్షక సమూహంలో చాలా తెలివైన వాడు, సంస్కారం గలవాడు ఉండొచ్చు - ఒంటిగా ఉన్నప్పుడు, అతని తెలివి ఎనభై పాళ్ళనుకుంటే, సమూహంలో కలిసినప్పుడు, ఇరవైకి దిగిపోతుంది. సామాన్య తెలివి పది పాళ్ళనుకుంటే, సమూహంలో కలిసినప్పుడు, అది ఇరవైకి పెరగొచ్చు. మొత్తంమీద, ఇద్దరూ గుంపులో కలిసినప్పుడు మొత్తం ప్రేక్షక జనం తెలివి ఇరవై, ముప్పై లోపు ఉండొచ్చు.

ప్రేక్షకుడి తెలివి, జిజ్ఞాస, సంస్కారం, ఇరవై ముప్పై లోపలే ఉంటుందని గ్రహించి, దాని కర్థమయ్యే వస్తువునీ, పాత్రలనీ నిర్మించుకోవాలి నాటక కర్త. రంగస్థలంపై జరిగే ఉదంతాన్ని ఉద్రేకంతో గమనిస్తాడు ప్రేక్షకుడు తర్కంతో, బుద్ధితో కాదు ఉద్రేకం పెరిగినకొద్దీ, బుద్ధి తగ్గిపోతుంది. పరాకాష్ట నందుకొని, రసాస్వాదన పూర్తయినప్పుడు, బుద్ధినీ, ఉద్రేకాన్నీ, విడదీయడానికే వీలులేక, రెండూ ఏకాగ్రత పొందుతాయి. అదే కళానుభూతి.

సంప్రదాయం స్టేజి నాటకాల వస్తువు, సుళువుగా కళానుభూతి పొందే టందుకు అనువైందిగా ఉండేది. నాటకం చూట్టానికి వెళ్లే ప్రేక్షకుడిలో ఆ నాటకానికి కావల్సిన ఉద్రేకం - ఒక వాతావరణం, వ్యుత్పన్నమై, సిద్ధంగా వుండేవి. 'పాదుక', గయోపాఖ్యానం' 'తులాభారం' మొదలైన నాటకాలలోని పాత్రలను గురించీ, కథని గురించీ, అతనికి అభిప్రాయం ఏర్పడి వుంది. ఈ భావన వెనక, మతం, సంస్కృతి, చరిత్రా ఉన్నాయి. ఒక సెంటిమెంటల్ ఉంది. రంగస్థలంపై నిర్మాణమైన సన్నివేశంలో అతను భాగస్తుడు.

ఆధునిక నాటకం చూట్టానికి వెళ్ళిన ప్రేక్షకుడిలో ఇట్లాంటి మానసిక సంసిద్ధత లేదు. అందులో కథేమిటో, పాత్రలెవరో అతనికి తెలియదు. రెండు మూడు అంకాలు జరిగాక కాని, అతని కుతూహలం రేగదు.

అతను రోజూ పడుతున్న ఇబ్బందులే రంగస్థలంపై పాత్ర పడు తున్నప్పుడు, అతను శ్రద్ధగా నాటకం చూస్తాడు - చివరికి ఏం జరుగుతుందో చూద్దామని, కథా నాయకుడు చివరికి మంచి పని చేసినా, దాన్ని ఉద్రేకంతో ఆనందించలేడు - కారణం? మధ్యలో వ్యక్తి స్వాతంత్ర్యం ఆవశ్యకత గురించి ఉపన్యాసం ఉండొచ్చు స్త్రీకి సమాన హక్కులని గురించి స్వగతాలుండొచ్చు. ఈ భావాలు - వాటి వెనక వున్న తత్వం కొత్తవి - అతనింకా జీర్ణించుకోలేదు. అనాదిగా ఒస్తూవున్న సంప్రదాయంతో ముడిపడ్డ ఉద్రేకానికి విరుద్ధమైనవి ఈ భావాలు. మెదడు, బుద్ధి, తర్కం. - ఇవి కావాలంటాయి. ప్రేక్షకుడు వీటిని ఇవ్వలేడు. తండ్రిని తల్లిని తృప్తిపరచడానికి శ్రీరాముడు అటవికి వెడుతుంటే కంట నీరెట్టుకోని ప్రేక్షకుడుండడు. స్త్రీ స్వాతంత్ర్యం పట్లా, వ్యక్తి గౌరవం పట్లా అభిమానం గల రాఘవరావు, చెల్లాయి లక్ష్మి కేశవరావుతో వెళ్ళిపోయి రహస్యంగా పెండ్లి చేసుకుంటానన్నప్పుడు, తన రిస్టువాచీ, మోటార్ సైకిలూ అమ్మి, సహాయపడినప్పుడు, 'ఎంతటి త్యాగం!' అని ఉద్రేకంతో ఆ సన్నివేశా నికి కరిగిపొయ్యే ప్రేక్షకులెందరుంటారో చెప్పలేను ఇట్లాంటి సన్నివేశాలూ, పాత్రలూ గల నాటకాలు, కొన్ని సంవత్సరాలు, కొన్ని డజన్లు చూడ్డానికి అలవాటుపడితేగాని, ఆధునిక నాటకానికి అనువైన మనస్తత్వం ప్రేక్షకుడిలో ఏర్పడదు. ఇప్పుడేం చెయ్యాలి? టిక్కెట్లు అమ్మినప్పుడు - నాటకం ఆడ్డానికి రెండు మూడు రోజులు ముందుగానే, నాటకంలో ఇతివృత్తం పాత్రలను పరిచయంచేసే వ్యాఖ్యానం మంచి చెడూ పరామర్శించి కరపత్రంలో ఇమిడ్చి ప్రేక్షకులకి వాటిని ఉచితంగా అందజెయ్యాలి.

వెనకటి స్టేజి నాటకంలో వ్యక్తులు, మహాపురుషులు - దేవుళ్ళు, చక్రవర్తులు, యోగులు, చరిత్రలో పేరువడ్డ యుద్ధవీరులు, దేశభక్తులు, త్యాగులు, అపూర్వమైన వ్యక్తులు. ఆధునిక నాటకంలో మామూలు మనుషులు ప్రధాన పాత్రలు - రిక్షావాడు, గుమాస్తా, ఫేలైన విద్యార్థి, నిరుద్యోగి, మిల్లు యజమాని, సేద్యకాడు, కాయకష్టం పడేవాడు, ప్రాక్టీసు లేని ప్లీడరు, పేషెంట్లు లేని డాక్టరు, రోగి, అనాధ, జైలునుంచి విడుదలైన నేరస్థుడు. ఈ జాబితా ఎవరికి వారు పూర్తి చేసుకోవచ్చు. అంటే, మనం రోజూ ఎరుగున్న సామాన్య వ్యక్తులన్న మాట. మనలాగే బాధపడుతున్న వాళ్ళు. వారిపట్ల మనకి సానుభూతీ, సంసిద్ధమైన ఉద్రేకం ఉండాలిగా? ఉండదు. కారణం?

నాటకం తానెరుగున్న సమాజాన్ని చిత్రించాలి నిజమే. కాని ఆ సమాజం మరీ బాగా ఎరుగున్నదవకూడదు. అది మరీ దగ్గరగా ఉండకూడదు. ప్రేక్షకుడు తన బాధలేమిటో గుర్తించి, ఆ జిజ్ఞాసతో తన స్థానాన్నుండి పారిపోడానికి ఉబలాట పడతాడన్నది మరిచిపోకూడదు తాను పడుతున్న బాధలే రంగస్థలంపై మరోవ్యక్తి పడుతున్నప్పుడు తాను రంగస్థలంపైకి దూకి, ఏదో చేసి, కార్యానికి దిగే పరిస్థితి రాకూడదు.

తనకంటె, డబ్బున్నవారూ, ఎక్కువ అధికారం ఉన్నవారూ, ఏదో ఆనందాన్ని బావుకుంటున్న వారూ - వీరిని హర్షిస్తాడు ప్రేక్షకుడు. "అయ్యో నా నాధుడు ఎట్టి కష్టాలు పడుతున్నాడో!" అంటుంది, కష్టపడుతున్న చంద్రమతి. భర్తని స్మరించి. ప్రేక్షకుడు "అయ్యో పాపం" అని నిట్టూరుస్తాడు. "గంపలో చక్కిలాలు, పాడు కాకులెత్తికెడితే, ఆ సచ్చినాడొచ్చి నాక ఏంతిని సత్తాడు" అని చిల్లరకొట్టు చంద్రమ్మ భర్తని స్మరించి వాపోయినప్పుడు; ప్రేక్షకుడు నవ్వుతాడేమో, కాని 'అయ్యో పాపం' అని బాధపడడు చంద్రమతి చక్రవర్తి భార్య, చిల్లరకొట్టు చంద్రమ్మ మన సందుచివర కొట్టుదగ్గర రోజూ చూసే మనిషే. వీలైతే, రంగస్థలంపైకి దూకి, తనూ వో చక్కిలం ఎత్తుకు పోవాలని పించొచ్చు.

సామాన్య మానవుడికంటె, కాస్తంత పైస్థాయిలో ఉన్న వ్యక్తులు, ఆదునిక నాటకంలో ఒకరిద్దరైనా ఉండితీరాలనుకుంటాను. ఇది ప్రజాస్వామ్యం. రాజులు, రాణీలు, దేవుళ్ళు, భక్తులు దొరకరు. అసాధారణ వ్యక్తులు అరుదు. ఉన్నవారిలో ఎన్నుకోవాలి, ఎవరు వీరు?

ఉన్నతోద్యోగులు, మంత్రులు, ఒకప్పుడు మంత్రులైనవారు, వ్యాపారం ద్వారా ధనం సంపాదించో, సంక్రమించిన ఆస్థిద్వారానో, సంఘంలో పలుకుబడి

తెచ్చుకున్నవారు, సినిమా స్టార్స్, మహాకవులు, విజ్ఞానశాస్త్ర పరిశోధకులు, ఆటగాండ్రు, శిల్పులు, గాయకులు, నటులు, నూరేండ్లు బ్రతికినవారు, మొదలైన వారు - అసాధారణ వ్యక్తులు వీరిపట్ల భక్తి శ్రద్ధలు ఏర్పడిననాడు, ఈ రకం పాత్రలు ప్రేక్షకుడు కావాలంటాడు. కాని ప్రస్తుతంలో వీరిలో కొందర్ని పాత్రలుగా అవతరింప వెయ్యడం కూడా కష్టమే దీనికి కారణం, వీరి సంఖ్య స్వల్పం కావడం. ఒక మంత్రిని ప్రవేశ పెడితే, ప్రేక్షకుడు "ఫలానా మంత్రి మీద దెబ్బరోయ్" అంటాడు వెంటనే. ఆ మంత్రిని గొప్ప త్యాగశీలిగా చిత్రించినా కూడా. అల్లాగే, సినిమా నటి ప్రధాన పాత్ర అవుతే, "ఫలానా తార మీద విసిరాడ్రోయ్!" అంటాడు ఆ ఫలానా తార అభిమాన తారైతే, పత్రికలకు వ్రాస్తాడు. వారూ, వీరు ఏకమై, ఆ వ్రాసినాయన్ని మంచాన పడెయ్యొచ్చు

సామాన్య మానవుడి శ్రేయస్సు కోరుతుంది ప్రజాస్వామ్యం - నిజమే. కాని అక్షరాస్యత పెరిగి, విద్యావ్యాప్తి జరిగి, ప్రజాస్వామ్య తత్వంలో వైజ్ఞానిక మెలకువలు ప్రజలలో బాగా పాతుకొనేటంత వరకూ, కేవలం సామాన్యుడి జీవితాన్ని చిత్రించే ఆధునిక నాటకం ప్రజామోదం పొందదనే భావిస్తున్నాను. దీనికి మరో కారణం కూడా ఉంది. సామాన్య మానవుడు, వొక్క ఆంధ్రదేశంలోనే కాక, అన్ని ప్రాంతాలలోనూ వొకేలాంటి వక్తి ఐ ఉంటాడు - ఇతను తెలుగువాడు, గుజరాతీవాడు, బెంగాలీవాడు - అని విడదీసి చూపే ప్రత్యేకత అతనిలో లోపించవచ్చు. ఎన్. జి. వో. మంచి నాటకం అందులో గుమాస్తా సామాన్యుడు, నీతిపరుడు, శీలంగలవాడు. కాని ఇంట్లో ఒత్తిడివల్ల, డబ్బుకోసం చిన్న అపచారం చేస్తాడు అది అతని పతనానికి దారితీస్తుంది అద్భుతమైన వాస్తువు. తీక్షణమైన నైతిక సంఘర్షణ ఉంది ఇందులో. అయినా, దేశమంతటా ఇట్లాంటి ఎన్ జి వో లు లేరంటారు. వారి భాష వేరు కావచ్చు సంభాషణలు లేకుండా, వొక Dream show గా ప్రదర్శిస్తే, ఈ నాటకం అన్ని ప్రాంతాలలోని ఎన్. జి. వోలను సమంగా ఆకర్షిస్తుంది. గిరీశం కూడా వో రకంగా సామాన్యుడే. చాలా మందిలో వుండే వ్యసనాలు అతనికి వున్నాయి. మంచి మాటకారి. కబుర్లతో తనకి కావల్సిన వాటిని పొందుతాడు. చివరికి చివాట్లు తిని తొలగిపోతాడు. కాని అతని వెనక తెనుగుదనం వుంది. కాబట్టి నైతిక సంఘర్షణ వొక్కటీ చాలదు నాటకానికి. ఆ సంఘర్షణ పుట్టు పూర్వోత్తరాలు, పరిణామం, హద్దులు, తెనుగు గడ్డకి సంబంధించినవై యుండాలి స్ట్రిండ్‌బెర్గ్ చెకోవ్, ఇబ్సెన్, పిరాండెల్లో మొదలైన ఐరోపా దేశీయుల నాటకాలని ఇంగ్లండులో ప్రదర్శించి, విమర్శకుల మన్ననల నందుకున్నా,

ప్రజామోదాన్ని పొందినట్లు లేదు. ఆంగ్ల నాటక కర్తలైన పినెరో, గ్రాన్విల్ బార్కర్, జె. ఎమ్, బారీ, గాల్స్‌వర్ది, మామ్, షాల నాటకాలే అక్కడి సామాన్య ప్రేక్షకులని ఆకర్షిస్తూ వొచ్చాయి. తన నాటకాలలో కొన్నిటికి, అమెరికాలో ఎక్కువ ప్రశంస లభించిందని, ఆంగ్ల రచయిత జె. బి. ప్రీస్ట్లీ వాపోతుంటాడు.

నైతిక విలువల ప్రదర్శనలో అంతర్యాలుంటాయి. ఎన్. జి. ఒ. వ్యవహారం తీసుకోండి. అమ్మాయి పెండ్లికి కట్నం కావాలి. అబ్బాయి పరీక్షకి డబ్బు కట్టాలి తన కుటుంబంలోని వారికోసం తన ఆదర్శాన్ని త్యాగం చేస్తాడు. ఇదీ వోరకం స్వార్థమే. వీరి కోసం కాక పక్కింటి వొక హరిజన మిత్రుడు కష్టాల్లో వుంటే, అతని శ్రేయస్సు కోసం ఈ తప్పిదమే చేస్తే, అతని అవచారానికి మనం కట్టే విలువ వేరు. ఇందులో స్వార్థం లేదు. అతని కోసం కూడా తన ఆదర్శాన్ని వొదులుకోకపోతే, అతన్ని మనం ఎంతవరకూ మెచ్చుకుంటాం? దేనికోసమూ కూడా తన ఆదర్శాన్ని వొదులుకోక పోవడం, నాటక కర్త అభిలాష కావచ్చు. కాని అది ప్రేక్షకుల అభిలాష కాకపోవొచ్చు. అసలు వారికి దాని అంతర్యమే అర్థం కాక పోవచ్చు.

అంత మాత్రంచేత ఆదర్శాల చిత్రణకి, తావు లేదనడం లేదు నేను. తావుంది. అట్లాంటి చిత్రణ చాలా అవసరం కూడా. అన్యాయం, అవచారం, దుర్నీతి — వీటిని ఏ ప్రేక్షకుడూ సహించడు. వీటిని రూపుమాపడానికి తనూ తహతహ లాడతాడు. నాటక కర్తని వీటినే సంస్కరించమని శాసించే హక్కు అతని కుంది. కాని ఈ సంఘర్షణ, దాని పర్యవసానం, సంప్రదాయానికీ, జాతి సంస్కృతికీ సంబంధించనివై వుండాలని మాత్రం అంటున్నాను. ఉద్రేకంతో తిలకించే ప్రేక్షకుడు మృదుత్వాన్నీ, సున్నితాన్నీ, మెళకువల్ని నిదానంగా పరిశీలించిగాని లోతుకి దిగలేడు. కథానికలో, నవలలో ఇది సాధ్యం. రంగస్థలంపై సాధ్యం కాదేమో. అందుచేత ప్రేక్షక సముదాయనికి (Average) ఒక సరాసరిని కట్టి, దానికి సాధ్యమయ్యే ఆదర్శాన్ని చూపగలగాలి నాటకకర్త.

వెనకటి తరం స్టేజినాటకం ప్రజల్ని ఆకర్షించడానికి మరో కారణం ఆ నాటకాల్లో ఉద్రేకాన్ని రెచ్చగొట్టే, సుదీర్ఘమైన గంభీరోపన్యాసాలుండటం. కాలు జారి కిందపడిన దుర్యోధనుణ్ణి చూసి ద్రౌపది నవ్వినప్పుడు, దుర్యోధనుడు బరువైన సమాసాలను వాడి, ఉదాత్తమైన భాషలో పెద్ద ఉపన్యాసం ఇస్తాడు. "ఆమెపై పగ తీర్చుకుంటాను" అన్నది దీని సారంశం అర్థం అవకపోయినా కూడా, ఆ భాష బరువుకి, గాంభీర్యానికీ, జోడైన నడకకి ఉత్తేజితులై, తమకు జరిగిన అట్టి పరాభవాల్ని ఊహించుకుని, ఉప్పొంగిపోయి చప్పట్లు కొడతారు ప్రేక్షకులు,

గొప్ప ఉద్రేకానికి లొంగిపోయినప్పుడు, కవిత్వంలోకి జారిపోవడం మానవుడి లక్షణం. గద్యలో కూర్చబడిన దుర్యోధనుడి ఉపన్యాసం, కవితావేశంతో నిండి వుండడం వల్ల, జనం చప్పట్లు కొడతారు మామూలు ప్రేక్షకుడు తన నిత్య జీవితంలో ధ్వని, దర్జా, మజా ఎరగడు కాని వాటితో ముడిపడ్డ ఉద్రేకాలని ఎరుగును. రంగస్థలంపై, ఆ ఉద్రేకాలలో తలతూగే బాధ విన్నప్పుడు, రసానుభూతి పొందుతాడు. ఆధునిక నాటకంలో ఈ గంభీరమైన భాష వినబడదు. నిత్య జీవితంలో వ్యవహార రీత్యా చెప్పుకునే చప్పటి సంభాషణలే వుంటాయి. నటుడికి నోరంతా నిజంగా ఉచ్చరించే బలమైన సమాసాలుండవు. పద్యాలుండవు. కవిత్వం కనబడదు.

నాటకకర్త — మన దేశంలోనే కాక, ఐరోపా దేశాలలో కూడా, ఈ ఇబ్బందిని ఎదుర్కొంటున్నాడు. అందుకనే 'ఈట్స్', 'రాబర్ ఫ్రై', 'ఇలియట్' మొదలైన పాశ్చాత్య నాటక కర్తలు, పద్య నాటకాల్ని ప్రచారంలోకి తేవాలన్న యత్నాలు చేశారు. చేస్తున్నారు. షా గారి పిగ్మేలియన్ అనే గద్య నాటకం, పద్య నాటకంగా అమెరికాలో ఎంతో ప్రచారం పొందుతోంది. ఉద్రేక ప్రకర్ష, ఆధునిక తత్వానికి విరుద్ధం. తర్కం, బుద్ధి, విమర్శనాత్మకమైన జిజ్ఞాస ప్రేరేపించిన ప్రవర్తనే, నాగరీకుడి లక్షణం అని నమ్ముతున్నారు. అతీంద్రియ జ్ఞానం, కవితావేశం, ఉద్రేకం, వ్యక్తిగతమైనవి. ప్రాచీన మానవుడి చిహ్నాలు గావున, మానవుణ్ణి సరైన మార్గాన నడపవు. సామాజిక సహకారాన్ని ఇవి పెంపొందించవు.

అందువల్ల ఆధునిక నాటకంలో కవితా ధోరణిలో సాగి, ఉద్రేకంతో కూడుకున్న సుదీర్ఘమైన సంభాషణలు అక్కడక్కడ వుండాలంటున్నాను.

నాటకంలో అట్లాంటి సందర్భాలు కల్పించాలి. అట్లాంటివి నటుడికి కూడా తృప్తినిస్తాయి. అట్లాంటి భాగాలని కంఠస్థం చెయ్యడం సులువు. అతని వాక్ప్రాబల్యాన్ని వ్యక్తం చేసే అవకాశ ముంటుంది. మరో స్థాయిలో, ఉదాత్తంగా సాగుతున్న సంభాషణవల్ల, రంగస్థలంపై కనబడుతున్న వ్యక్తులు, సన్నివేశాలు, ప్రేక్షకుడికి దూరంగా కనబడి, కాసేపు ఆ వాతావరణంలోకి పారిపోడానికి, ఈ రకం సంభాషణ లుపకరిస్తాయి. సినిమాలలో ఇట్లాంటి ఉపన్యాసాలుంటాయి. ప్రేక్షకులు చప్పట్లు కొడతారు. ఇది మంచిదే అనుకుంటాను. నాటకంలో కూడా ఇవి వుండాలంటున్నాను. ఉద్రేకానికి లొంగిన పాత్ర పద్యంలోకో, పాటలోకో దిగడం అసహజం కాదు సినిమాలో నాయిక తోటలో గంతులేస్తూ, నాట్యం చేస్తూ, పాడుతుంది. అనువైన సెట్టింగ్ వుండడంవల్ల ఇది ఎబ్బెట్టుగా వున్నదని

ప్రేక్షకుడు గమనించడు. రంగస్థలంపై ఈ సెట్టింగ్ వుండదు గావున ఈ చేష్టలు అసహజంగా వుంటాయి. జనం నవ్వుతారు కూడ. కాబట్టి, సందర్భాన్ని అనుసరించి ఉద్రేకాన్ని వ్యక్తం చేసే పద్యమో, పాటో పాడే పాత్రని ప్రవేశ పెట్టడం అవసరమనుకుంటాను. "సక్కుబాయి" లో యోగి, "రామదాసు" లో కబీర్ ఇట్లాంటి పాత్రలు "కన్యాశుల్కం" లో గిరీశం కూడా కొన్ని పద్యాలు చదువుతాడు - "The widow" అన్న ఆంగ్ల గేయం ఉదాహరణ.

రంగస్థల అలంకరణ గురించి ఆధునిక నాటక నిర్వాహకులు తగినంతగా పట్టించుకొనడం లేదేమో! మన నాటక సమాజాలకి కావల్సినంత ఆర్థిక బలం లేదని నాకు తెలుసు. పెద్ద పెద్ద సెట్టింగులు ఉండాలనడంలేదు నేను. అవి ఉండనక్కరలేదనే అంటున్నాను. స్థలాన్ని, సమయాన్ని సూచించే, ఒకటి రెండు పరికరాలుంటే చాలు రంగస్థలం అనేక వస్తువులతో, పరికరాలతో నిండివుంటే, ప్రేక్షకుడు వాటినే చూస్తాడు. ఏం జరుగుతున్నదో పట్టించుకోడు. ఆధునిక నాటకంలో. కాఫీలు, టీలు, త్రాగే దృశ్యాలుంటాయి. కాని ఇల్లాంటివి ఆస్వాదానికి అంతరాయాలనే నా అనుభవం. టీపార్టీ జరుగుతున్న ఘట్టాన్ని ప్రదర్శించేటప్పుడు తప్ప, కప్పులు, ప్లేట్లు, తినుబండారాల సరంజామా రంగస్థలంపై తేవడం జరుగుతోంది. ప్రేక్షకులు, ఆ పరికరాలకేసి చూడటం, తింటున్న చేష్టల్ని గమనించడంలో నాటకం కొంత దెబ్బ తింటుంది వెనకటి సారంగధర నాటకంలో, సారంగధరుడు ఫలహారానికి లోనికి వెళ్ళి, చెయ్యి తుడుచుకుంటూ ప్రవేశిస్తాడు. మన పూర్వులు సరిదిద్దిన సంప్రదాయాన్ని మనం తప్పకుండా ఆమోదించి, ఆచరణలో చూపాలి. భోజనం, యుద్ధం, కొట్లాట, ఈ చర్యలు రంగస్థలంపై చూపకూడదన్న సూత్రాన్ని మెచ్చుకుంటున్నాం కాని, ఈనాడు ఆచరించడం లేదు. **Naturalistic Drama**, అనండి **Realistic Drama** అనండి నిత్య జీవితానికి రంగస్థలం ప్రతిబింబం కావాలన్న పాశ్చాత్యుల ధోరణిని మనం విస్మరించాలనడంలేదు నేను. ఈ ప్రదర్శనకి మన జీవిత విధానానికీ పొత్తు కుదరదన్న నమ్మకంవల్ల అలా అంటున్నాను. ఇంగ్లాండులో కుటుంబంలో వారంతా భోజనాల దగ్గరే కలుసుకుంటారు. కష్టం, సుఖం, వ్యవహార విషయాలు, తీర్మానాలు, భోజనాల దగ్గరే జరుగుతాయి కావున, వారు భోజన పరికరాలని చూపడం తప్పదు. మనం భోజనం చేసేటప్పుడు మాటలాడుకోము. "భోజనాల దగ్గర ఏరకం నాటకీయతా చూపడాని కిచ్చగొనని చప్పటి పాత్రల నుండి నాటకీయతని సృష్టించాలి నేను" అని ఆంగ్ల నాటక కర్త జె. బి. ప్రీస్ట్లీ మొరెట్టుకున్నాడు భోజనాల దగ్గర

ప్రధాన నిర్ణయాలు చేసుకోవడానికి అలవాటుపడ్డ వారిని గురించే ప్రీస్ట్లీ అలా అంటున్నప్పుడు నిశ్శబ్దంగా తినే మనవారిని గురించి ఏమంటాడో తెలియదు.

సంభాషణలు ప్రవర్తనలో అంతం అవాలి అన్నది ఆధునిక నాటకానికి ప్రధాన లక్ష్యం. కాని ప్రవర్తన, చేష్ట (act) రంగస్థలంపై చూపనవసరం లేదనీ, సూచిస్తే చాలుననీ నా అనుభవం. లెంపకాయ కొడితే అవతల వ్యక్తి ఆ దెబ్బకి పడి చనిపోవచ్చు, ఉదాత్తంగా సాగే నాటకాన్ని ఈ దృశ్యం భంగ పరచొచ్చు. ప్రేక్షకులు నవ్వొచ్చు. నాటకం దెబ్బతింటుంది, ఆ దెబ్బతిన్న వ్యక్తితోపాటు.

అలాగే పెద్ద పెద్ద సెట్టింగులు పెట్టడం అనవసరమనుకుంటా. ధనికుని కూతురు కాలేజీలో చదువుకుంటూంది. ఆమె డబ్బున్నది అని చూపడానికి. ఆమె ఉండే మేడ, మెట్లు, మేడ మీది గదులు - ఇవన్నీ రంగస్థలంపై ఎంతో శ్రమతో అమర్చడం నే నెరుగుదును. దీనివల్ల ఏ ప్రయోజనమూ లేదు - ఆ అద్దాల బల్లలు, సోఫాలు, మెట్లు, లైట్లు, రేడియోలు వాటి మధ్య ధనికుడి కూతురు కనబడకపోవచ్చు. ప్రేక్షకుడు ఆమెని గమనించక ఆ ఇంటిని చూస్తూ కూర్చుంటాడు ఇంతా అమర్చాక, అ సెట్టింగు నాటకం అంతటా ఉంచాలి. మార్చి మరో సెట్టు పెట్టే వ్యవధి దొరకదు కథానాయిక మెట్లు మీద నుండి జారి పడే ఘట్టం ప్రధాన ఘట్టమైతే తప్ప మెట్లు, మేడ గదులు అమర్చడం అనవసరమనుకుంటాను పైలాపచ్చీస్‌గా 'షోకిల్లాగా ఉన్నాడని సూచించడానికి నా చిన్నప్పుడు చింతామణి నాటకంలో భవానిశంకరుడు రంగస్థలంపైకి సైకిల్ తీసుకొచ్చాడు. దాన్ని స్టాండు మీద ఆనించి, పద్యం చదివాడు. ప్రేక్షకులు నవ్వారు. పద్యానికి "వన్స్‌మోర్" రాలేదు.

ఇంగ్లాండులో సెట్టింగులకి తగిన సదుపాయాలు, పరికరాలు వున్నాయి. ఆధునికమైన యధార్థ జీవిత చిత్రణకు పూనుకునే నాటకానికి వారు మంచి సెట్టింగులు అమర్చగలరు అందులో పాత్రలు ధనికులు - వారికి సోఫాల్సూ కాండిలెబ్రాలు (గుత్తులుగా వ్రేళ్ళాడే విద్యుత్ దీపాలు) విండోలు, కర్టెన్లు, చలి కాచుకునే హార్త్‌లు చూపడం సహజం. కాని మన నాటకాలలో వీటికి స్థానంలేదు. మధ్య తరగతి వారికి ఈ సరంజామా, ఫర్నీచర్ సాధ్యం కావు. ఇంత అందమైన, ఖరీదైన ఫర్నిచర్ సినిమాల్లో చూసి, నిత్య జీవితంలో చూడలేకపోయిన యువకుడు దగాపడి దైన్యుడవుతున్నాడు.

పెద్ద పెద్ద సెట్టింగులు అనవసరం అనుకుంటే - బీదల గృహాలు చూపించినప్పుడూ, మనవారు మరీ సహజంగా చూపాలన్న యత్నం కూడా

హర్షించను నేను. మామయ్య, దగ్గుతో నులక మంచం మీద పరుంటాడు. మూల మంచినీళ్ళ కుండ పెడతారు - చీపుళ్ళు పిడకలు, తట్టలు, ఉట్టెలు, లాంతర్లు పెడతారు. నిజమే. బీదవాడి గృహం అలానే ఉంటుంది. కాని రంగస్థలంపై వాటినే కొంచెం "అందంగా" అలంకరించి చూపాలంటాను. సౌందర్యం ముఖ్యం. ప్రేక్షకుడు రంగస్థలంపయికి ఎగిరిరాడు. దూరంగా వుంటాడు. ఇది కళ. దూరంగా వుండాలి - కాసేపు ఇదే నిజమని నన్ను నేను దగా చేసుకుని రసానుభూతి పొందుతాను-అని ప్రేక్షకుడు అనుకుంటే, రంగస్థలంపయిన పరికరాలు, వ్యక్తులు, సంభాషణలు - అతని అంతస్తుకి కాస్తంత దూరమైనవే అవాలని నా అనుభవం.

స్త్రీ పాత్రలు లేకుండా నాటకాలు వ్రాయాలనడం సమంజసం కాదు. ఇల్లా చేయడంకంటె, స్త్రీ పాత్రలను పురుషులే నిర్వహించడం నాకిష్టం. ఎటొచ్చీ నాటకంలో కొన్ని స్త్రీ పాత్రలను స్త్రీలు, మరికొన్ని స్త్రీ పాత్రలను పురుషులూ నిర్వహించకూడదు.

ఎందరో నాటక కర్తలు, ఎన్నో సమాజాలు పూనుకుని, ఊరూరా ప్రదర్శనలిచ్చినప్పుడు గాని ఆధునిక నాటకం ప్రజల నాకర్షించదేమో!

# ఉత్తుత్తి ఊహాచిత్రాలు

## కొత్త సమాజాలు

**మౌన సమాజం :**

నిబంధనలు : నోరుండి మాటాడగలిగే ప్రతి ఒక్కరూ సభ్యులుగా చేరచ్చు.

కార్యక్రమం : మౌన మందిరంలో గుమిగూడి రోజూ ఒక అరగంట మౌనంగా గడపాలి. సెలవ రోజులూ, పండుగలూ వస్తే గంట.

సభ్యుడు యీ నిబంధన అతిక్రమించి, మాటలు, గోష్ఠి, ఉపన్యాసం, పిచ్చాపాటి, సంభాషణ – ఏది జరిపినా అధ్యక్షుడు ఇష్టానుసారంగా వేసిన శిక్ష భరించాలి. వినేటందుకు ప్రేక్షక జనంలేని సహారా ఎడారి, అమెజాన్ అడవులు, ఉత్తర ధ్రువం – ఎక్కడికేనా వెళ్ళమనొచ్చు.

ఇంట్లో నిత్యమూ తగవులాడుకొనే భార్యాభర్తలు మౌనంగా గడిపే టందుకు మందిరంలో ప్రత్యేకంగా గదులున్నాయి.

మౌనానికి అలవాటుపడని న్యాయవాదులకు, అత్తగార్లకు, ఉపాధ్యాయులకు నోటిమీద తగుల్చుకునే ప్రత్యేక ప్లాస్టిక్ బాండేజీలు సమాజ కార్యాలయంలో కొనుక్కోవచ్చు. ఒకేసారి డజనుకొంటే సగంరేటు.

గంట మౌనం పూర్తయ్యాక, బాండేజీలు తీసేస్తే శబ్దతైలం వుచితంగా ఇవ్వబడుతుంది. అరవయ్యోవడిలో పడ్డవారు, తమ బాల్యం గురించి చెప్పకుండా వుండలేరు గావున, వారు కొందరు పిల్లలను పోగుచేసి, మందిరంలో మౌనంగా గడపాలి. పోగుచెయ్యలేనివారు ముందుగా కార్యదర్శికి తెలియపరిస్తే పిల్లలను పోగుచేస్తాడు దీనికి ప్రత్యేక రుసుము చెల్లించాలి.

వార్షికోత్సవం : ఉగాదినాడు జరుగుతుంది ఆ రోజు ప్రతి సభ్యుడు వేదికపైకొచ్చి మాట్లాడాలి. నోరు పెగలక దడట్టుగుని పెపెమ్మా, మెమ్మెమ్మా అంటూ ఎవరికీ వినబడని ఘోరమైన ఉపన్యాసం చేసిన వ్యక్తికి సువర్ణ పతకం వొసగ బడుతుంది – 14 కారట్లది.

సమాజం వారి వార్షికోత్సవ సంచిక అనాడే విడుదలవుతుంది ఇందులో

ఎవరినో ఉపన్యసించవలసిందిగా ఆహ్వానించినప్పుడు, వారు 'ఊ' అనేసి కర పత్రంలో తమ పేరు పడ్డాక ఎగేసి, మానేసిన ఉపన్యాసం తాలూకు చిత్తు, నోట్సు ఇతరులకు చదివి వినిపించాలన్న ఉబలాటంతో వ్రాసి ప్రచురించని రచనలు; అత్తాకోడళ్ళు, భార్యాభర్తలు, తమ ఇళ్ళల్లో చెప్పుకునే ముచ్చట్లు టేప్ రికార్డు చేయబడి, దానిలోంచి సమకూర్చిన తిట్ల నిఘంటువు — మొదలైన శీర్షికలెన్నో వుంటాయి యీ సంచికలో.

సాలుచందా : ప్రతి సభ్యుడూ ఒక లౌడ్‌స్పీకర్ ఇచ్చుగోవాలి చేరినప్పుడు.

## 'ఇది' కథనం

ఒంట్లో కాస్త ఇదిగా వుండి ఇంటికొచ్చేసరికి కొంపంతా ఇదిగా వుంది. ఇది రోజూ వున్న ఇదే — అత్తా కోడళ్ళ మధ్య ఇది. పోనీ ఆవిడ పెద్దది — ఏదో ఇది చేసినా తను కాస్త చిన్నదిగా — కాస్తంత ఇదిగా వుండకూడదూ! ఆవిడంత ఇదిచేస్తే నేనెల్లా ఇదిగా వుండను? అని ఇదిగా అడిగింది నేను గదిలోకి రాగానే. 'తనికింత ఇదైతే నేనీ కొంపలో క్షణం ఇదిగా వుండలేనురా అబ్బి' అని బాగా ఇదై అంది అమ్మ. ఆ మాటకి నేను చాలా ఇదయ్యాను. 'నేను మాత్రం ఇంత ఇదితో ఇక్కడుంటానా — పోతాను పుట్టింటికి' అంటోంది ఆవిడ చెట్టంత వాణ్ణి వున్నానన్న ఇదేనా లేకుండా.

"అసలిదంతా ఏమిట్రా?" అని కంఠం పెద్దదిచేసి కాస్తంత ఇదిగానే అడిగాను.

"అంతిదిగా వుంటే ఆవిణ్నే అడగండి"

"తనే చెప్తుంది మహ యిదిగా."

"అబ్బబ్బ — విషయం ఏమిటో కాస్త ఇదిగా చెప్పండర్రా. మీరిద్దరూ ఇల్లా ఇదిగా వెడితే, నేను మాత్రం ఎందుకు? సన్యసించిపోనా?"

"అమ్మ వొండి పెడుతుంది — ఇదిగా తిందురుగాని"

"ఎల్లాగైనా పెళ్ళాం ఇది — ఎది? బెల్లంముక్క మీరూ మీరూ వుండి ఇదవండి — నేనే పోతా" ఇదీ వరస. ఇదవక ఏం చెయ్యమంటారో ఇదై మీరు చెప్పండి.

## కసిత్వం

"ఆ ముసిలామె రగ్గు కప్పుకుంది రగ్గే ముసిలామెను కప్పుకున్నట్లుగా వుంది."

"పౌర్ణమి వెళ్ళిన నాలుగోనాటి చంద్రుడు క్రాపింగ్ చేయించుకున్నట్లుగా కనిపించాడు."

"బస్తీలలో వాళ్ళు చంద్రుడి కేసి చూడరు. గ్రహణం నాడు తప్ప; ఆనాడు ఎల్లానూ కనబడడు."

"ఏదో విశేషం జరిగితేగాని నమ్మకం కుదరదు; నమ్మకం కుదిరితేగాని విశేషం జరగదు."

"అత్తగారు పళ్ళు పటపట కొరికింది — పికాసో చిత్రాన్ని అనుకరిస్తూ."

## కీటకాల చివరిమాటలు

సీతాకోక చిలుక : (గొంగళి పురుగు దశలో) మీ కంబళ్ళకు నే తగనుగా.
(తరువాత దశలో) చేనేత వస్త్రాల వారిపై దావా వడెయ్యాలి.
గొల్లభామ : యాదవభామగా స్మరించండి నన్ను
నల్లి : నరకంలో బోలెడు రక్తం.
సాలీడు ఇంద్రుడి కిరీటంలో గూడల్లుతా.
దోమ : నన్ను మీరు చంపలేరు. ఇది ఆత్మహత్య.
మిణుగురు పురుగు : ప్రళయకాల మహోగ్ర భయద జీమూతోరు గళఘోర గంభీర ఫెళఫెళార్భటులలో మెఱపేలా? (నోరు తిర్కి చచ్చిపోతుంది)

## పక్షుల చివరిమాటలు

నెమలి : (జాతీయ పక్షిగా నిర్ణయం జరిగిన తర్వాత) అమరజీవి నన్నారు పైగా!
గబ్బిలం : రాడారుగా వాడితే వెనక్కొస్తాను.
గుడ్లగూబ : నన్నెవ్వరూ పెంచుకోరుకావున, పోతాను నా కళ్ళని మీ కళ్ళ జోడుగా పీకేముందు.
కోడి : తేలు కుట్టింది.
చిలుక : వేదం వల్లెవేస్తాను.
కాకి : నా మరణ వార్త పత్రికలలో పడదు. (కాకి కబురు)
మగకాకి : నిశ్శబ్దంగా నిష్క్రమిస్తాను (కాకిగోల)
పావురం : రంభ వక్షంపై మకాం పెడతా.

## కొత్త సామెతలు

అసలు పన్ను వూడందే రాబడిపన్ను రాలుతుందా!
క్యూలో నిలబడ్డ వాడికే తెలుసు కూతంత ఓరిమి.
మాటినీకి సగంరేటు మోక్షానికి అరమెట్టు.

ముందున్న దే మనోవ్యాధి.

మంత్రానికి పోనిది పంచదార కంట్రోలు.

## ఈనాడు వీరికి అనువైన వృత్తులు

కాళిదాసు : కృత్రిమ వర్షం కురిపించే పరిశోధనాలయం డైరెక్టరు.
వేమన్న : బట్టలకొట్టు
శ్రీనాధుడు : టూరిస్టు బ్యూరోలో పబ్లిసిటీ ఆఫీసరు.
తెనాలి రాముడు : (ఎలక్షన్‌లో నెగ్గితే) శాసనసభ స్పీకరు (ఓడిపోతే) వేలం పాడేవాడు.
కుచేలుడు : కుటుంబ నియంత్రణ శిబిరానికి సూపరింటెండెంటు.

*　　*　　*

ఫస్టుక్లాస్ రైలుపెట్టె అంటే మనుషులు ఎక్కకూడనిది అనుకునే వాణ్ని చిన్నప్పుడు.

*　　*　　*

## వైజ్ఞానిక క్విజ్

"అది ఇటొస్తే అటువారంతా సలసల కాగిపోతారు.

అది అటొస్తే ఇటువారంతా మలమల మాడిపోతారు.

ఆటూకాక, ఇటూకాక మధ్యగావుంటే మొత్తం వారూ, వీరూ తగులబడిపోతారు.

'దీని సంగతి చూద్దాం' అని వారందరూ మధ్యలో ఎదురుగా ఉంటే, అది వెనక్కి తిరిగి గోడనున్న బల్లికి హాయిగొలుపుతుంది.

*　　*　　*

ఏమిటది?

*　　*　　*

సమాధానం : అటూ ఇటూ తిరిగే టేబిల్‌ఫ్యాన్.

# అనామకోపాఖ్యానం

ప్రజాస్వామ్య ప్రభుత్వాల ప్రధానాశయం వ్యక్తి శ్రేయస్సు వ్యక్తుల సంఖ్య విశ్వంలా పెరిగిపోతూంది. ప్రతి వ్యక్తినీ ప్రత్యేకంగా పలకరించి, కష్ట సుఖాలు కనుక్కోవడం ఏ ప్రభుత్వానికి సాధ్యంకాదు గనుక ఒకేరకం పనులు చేస్తున్న వ్యక్తులందరినీ ఒక బృందంగా కేటాయించి, ఆ బృందం ప్రతినిధితో ఇష్టాగోష్ఠి జరపడం జరుగుతుంది. కార్మికులు, కవులు, బట్టలు కుట్టేవాళ్ళు, అద్దె కొంపల్లో కాపురం ఉండేవాళ్ళు, నిరుద్యోగులు, నిరుద్యోగుల భోగట్టా తయారు చేసేవాళ్ళు — వీరందరూ ఇట్లాంటి బృందాలలో వ్యక్తులే. ఆయా బృందాలలో వ్యక్తులను గురించిన వివరాలు - ఆయా బృందాల ప్రతినిధులకు వ్రాసి తెలుసుకోవొచ్చు వీరిలో ప్రతిఒక్కరికీ ఫలానా 'పేరు' అంటూవుంది. వీరి పేర్లు ఫోటోలు అప్పుడప్పుడు పత్రికల్లో చూస్తుంటాము

పేరులేని కొందరు వ్యక్తులున్నారు. వీరిని గురించే ఈ అనామకోపాఖ్యానం. వీరిలో ప్రసిద్ధులు వార్తా మనుషులు. వీరు చేసేపని మనందరికి తెలుసు. పరదేశాన్నుంచి ఒక ప్రముఖ పురుషుడు తెల్లారగట్ట మూడింటికి విమానాశ్రయంలో దిగగానే ఈ వార్తామనుషులు అక్కడ ప్రత్యక్షమై, ఏం పనిమీద, ఎందుకొచ్చిందీ ఆయన్ని నిలేసి అడుగుతారు ఆయన ఆవులింత నాపుకుంటూ 'నేనిప్పుడేం చెప్పలేను' అంటాడు ఆ అద్భుత సందేశం, ఇంకా సూర్యుడు ఉదయించకముందే ప్రపంచంలో ప్రతి కాఫీ బల్లమీద, పెద్ద పెద్ద అక్షరాలతో ప్రత్యక్షమవుతుంది. పెద్దలతో సంప్రదింపులు జరిపి, మిట్టమధ్యాహ్నం, ఒంటి గంట దాటినా, భోజనం గురించి ఆలోచించక, ఆ ప్రముఖ పురుషుడు ముందు వీళ్ళనే పిలుస్తాడు. ఆయనచుట్టూ జేరి ప్రశ్నలడుగుతారు. ఆయన ఒక్కదానికీ సూటిగా సమాధానం చెప్పలేడు. మాట తడబడుతుంది — 'నా ఉద్దేశం అది కాదు' — 'అంటే పూర్తిగా కాకనూపోదు.' 'ఆ ప్రశ్న అడక్కూడదు ' 'దానికి సమాధానం మీకే తెలుసు.' ఇట్లా మాటలతో చెడుగుడీ ఆడినా, ఆయన సందేశానికి తుది మొదలు కల్పించి, 'ఫలానావారి ఉద్దేశం ఇది' అని ప్రపంచంలో ప్రతి టీ బల్లమీదికి పెద్దక్షరాలతో దిద్ది పంపడం వీరిపని.

వీరు లేకుంటే, ప్రపంచంలో ప్రముఖ వ్యక్తులుగా మనకి పరిచితులైన వారు, ఎందరో అనామకులుగా ఉండిపోవాల్సిందే. పాపం, వీరికి మాత్రం పేరు లేదు. వీరు వార్తా మనుషులు.

సర్వాంతర్యాములు. వీరు నట్టడివిలో అర్ధరాత్రి విమానం కూలి, కాలి అందలి యాత్రికులు అందరూ హతమైన వృత్తాంతం మనకి తెలియబరుస్తారు. చనిపోయినవారికి గూడా వీరి చెలిమి ఎంతో అవసరం. కాలిన విమానంలో చనిపోయిన టోక్యో వ్యాపారి – వారు, ఎన్ని గంటలకు ఎల్లా చనిపోయిందీ – వార్తా మనుషులకు చెప్పందే ప్రమాదం సంభవించిన చోటు వదలి జీవుడు పోడు కాబోలు! టోక్యో వ్యాపారి అనాయాస మరణం గురించి "సుఖంగానే మరణించాను" మృత్యువంటే ఒక బుష్‌కోటు విడిచి మరొక బుష్‌కోటు వేసుకోవడం లాంటిది అంటూ ఆయన చెప్పినట్లు పత్రికలో వస్తుందేమోనన్న భయంతో ఊపిరి బిగపెట్టి చూశాను. ఆనాటి పత్రిక రాలేదు. వార్తా మనుషులంతా వెర్రివారు కారు. ఆ వెర్రంతా వారి నాశ్రయించి, పట్టుకు వ్రేల్లాడి, తమ ఉనికిని బుజావు చేసుకునే వ్యక్తులదే.

వార్తా మనుషులకి తెలియని వార్తలేదు. హొనొలూలు లో నారింజపండ్లు పెట్టిన కొబ్బరిచెట్టు దగ్గర నుంచీ నారెళ్ళ పూడిలో ఆరుగురు సంతానాన్ని ఒకే సారి కన్న అండాళమ్మ వరకూ, వీ రెరగనివారు లేరు.

'మేం క్షేమంగానే చేరుకున్నాం' అంటాడు, ఆ ఆరుగురిలో ఒకడు వార్తా మనుషులతో గోష్ఠి జరుపుతూ 'ఏ రకమైన టాక్సులూ – మా రాకని ఆటంకపరచ లేదు.' అది పత్రికలో ఇల్లా పడుతుంది 'పన్నులు లేని ఆరుగురు పసికందులు' వీరికవన్నీ ఎట్లా తెలుస్తాయో నాకు తెలియదు. కాశ్మీర్ లోయలో ఫిలింతార డొక్కలో నొప్పివల్ల, షూటింగ్ నిలిచిపోయిందని వీరికెట్లా తెలుసు? ఫిలిం నిర్మాతలు, అక్కడనుండి ఒక విమానం పంపి, ఈ వార్తా మనుషుల్ని అందులో ఎక్కించి, కాశ్మీర్ లోయలోకి రప్పించుకుని, గోష్ఠి జరుపుతారా? "ఇహ పరవా లేదు. నొప్పి తగ్గింది. ఈ ఉదయమే షూటింగ్ ప్రారంభమైంది. ఇంక మీరు వెళ్ళొచ్చు" అంటాడు నిర్మాత ఇంతదూరమూ వచ్చి ఊరికే వెళ్ళిపోవడమూ!

"ఎన్నాళ్ళల్లో పూర్తి కావొచ్చు" అని అడుగుతారు. ఆయన నవ్వుతూ

"అది మా ప్రధాన తార ఆరోగ్యంపై ఆధారపడుతుంది" అంటాడు. "చికిత్స చేస్తున్న డాక్టరెవరు?" అని మరో ప్రశ్న. "ప్రస్తుతం మాకు కావల్సింది డాక్టరు కాదు. పెద్ద చెక్కులు వ్రాయగల బ్యాంకర్" అంటాడు, అటూ ఇటూ చూచి రహస్యంగా ఆ సమాధానంతో తృప్తి చెంది, తిరిగి మళ్ళా ఆ వొచ్చిన

విమానంలోనే, వెనక్కి వెడతారా? అందేలా రాజు నాలుగోమారు వివాహం చేసుకున్నాడంటే వీరు నవ్వరు. ఆండిస్‌లో అగ్ని పర్వతం ప్రేలిందంటే దుఃఖ సాగరంలో పడి ఈత కొట్టరు వీరు భగవద్గీత ప్రశంసించిన స్థితప్రజ్ఞులు వీరు, ఏ స్త్రీ కనబర్చని వోయ్పు వీరు కనబరుస్తారు. ఆ మధ్య వొక ప్రముఖ వ్యక్తి చర్చలలో పాల్గొన్న అనంతరం, వీరిని పిలిపించి చివాట్లు పెట్టాడు.

"నాకామధ్య జరిపిన వ్యవహారంలో నమ్మకం ఉందని మీతో మనవిచేస్తే, 'జరిపిన వ్యవహారంలో అమ్మకం వుందని' వార్త వెలువరించారు. మీకి పూట నేను ఏ సందేశమూ ఇవ్వను" అని కోపించాడుట "అమ్మకం కొనసాగితే మీకు లాభసాటిగా వుంటుందేమో ననుకున్నాం" అని వొకాయన.

"మహానుభావా, నిదానించండి — అది కేవలం అచ్చు తప్పు. మీ కిష్ట మైతే — మీకేవిధమైన అమ్మకం వ్యాపారం లేదని - వొక సవరణ పంప మంటారా?" అని మరొకాయన.

"వొద్దు వొద్దు — మీరు లేదనగానే ప్రజలేదో ఉందనుకుంటారు."

"మా పైన మీకే . నమ్మకము లేదన్నమాట!"

"మీరంటే కాదు - ప్రజలంటే."

"ఆ విషయం పత్రికల్లో వేయించమంటారా?"

"ఒద్దు, ఒద్దు. అది ప్రమాదం".

"మరేం చెయ్యమంటారు?"

"ఊరుకోమంటాను".

అంటే చలించక, విని వూరుకున్న స్థితప్రజ్ఞులు. ఆ ఎండలో తిండిలేక, ఆ గదిలో మూగి, ఆయన అవాకులూ, చవాకులు ప్రేలుతుంటే విని ఊ గొట్ట గలగడం అంత సుళువు కాదు అంత నిదానం, నిబ్బరం కలవారు గనుకనే, ప్రముఖుల కందరికి వీరంటె అంత భయం, గౌరవం ముందుగా వీరినే మంచి చేసుకోడానికి పిలిపించి, సమావేశం జరిపి, తినేందుకు సరంజాం తెప్పించి, తినిపించి, మళ్ళా శూన్యంలో కలిసిపోతారు.

"ఇప్పుడు నేనేం చెప్పలేను" అంటాడు వొక్కొక్కాయన, మహా ముందు ముందు ఏదో ఉందన్నట్లు! ఏ సందేశమూ లేకపోవడమే, చాలా మంది వినిపించే సందేశం. వీరిచ్చిన సందేశం మరొకటిగా ప్రచారం చెయ్యలేదని, 'మీరిచ్చింది అదే — మేం అందరం ప్రత్యక్షం విన్నదేగా' అని సాక్ష్యమిచ్చి, వొకర్ని వొకరు ఆదుకునేటందులకు ఈ వార్తా మనుషులు బృందాలుగా నివసిస్తారను కుంటా,

వార్తా మనుషులు ఏకాంతంగా గడపరు. నేనీపూట ఎవర్నీ కలుసుగోను-భార్య మినహా!' అంటూ వొంటిగా, దిగులుగా రోడ్డంట తిరుగుతూ పోతాడు. వీరిది బహువచన బ్రతుకు. అనేక దేశాల నుంచి, దేశంలో అనేక ప్రాంతాల నుంచి, వొచ్చి, వొకచోట గుమిగూడి వొక పెద్ద హాస్టల్‌లాంటిది వుంటుందా?- ఏదన్నా జరిగినా, ఎవరన్నా వొచ్చినా, వెళ్ళినా వొక్కసారిగా వొక్క మనిషిగా కదిలిపొయ్యే అనామక బృందం వీరు.

"వార్తామనుషులకు, మిగతా పనులు మానుకుని, సందేశాలిస్తూ ఎందుకు కూర్చోవాలి మేం?" మాకు దీనివల్ల కానీ ముట్టదు. వీళ్ళడిగే చొవ్పదంటు ప్రశ్నలకు ఊరికే సమాధానం ఇవ్వడం, వాళ్ళు - ఒకటంటే మరొకటి ప్రచురించటమూ - ఎందుకు జరగాలి? కాబట్టి వీరితో గోష్ఠికి, నిమిషానికి ఒక పౌను చొప్పున - నూరు డాలర్ల వరకూ, వార్తల మనుషుల నుంచి ఎందుకు గుంజకూడదు? 'న్యూయార్క్ పట్నం నుంచి నీటి సరఫరా సదుపాయం గురించి మీ అభిప్రాయం ఏమిటి?' అని అడిగితే, ఇచ్చే సమాధానం వెల ఆరు డాలర్లు..... ." అంటూ పి. జి. వోడ్ హౌస్‌గారు వార్తా మనుషులను కసురుతూ స్వీయచరిత్రలో వ్రాశాడు. ఆయన కసిరితే, విని భరించి, ఈ వార్త ప్రపంచం నలుమూలలా మోసినందుకు, ఆయన వీరికేమివ్వాలో ఆలోచించలేదు. "నే చనిపొయ్యానన్న వార్త చదువుకుని జనం 'వీడింకా బ్రతికే ఉన్నాడా!' అనుకుంటారు. వారల్లా అనుకోవడంలో నా ఆనందం ఉంది" అని వ్రాసుకున్నాడు. సామర్‌సెట్ మామ్. వార్తా మనుషులు లేందే, చాలామంది సజీవులైనట్లే తెలీదు ప్రపంచానికి. వారికి ఋణపడి ఉండడానికి బదులు, వారిని అనామకులుగా పరిగణించి వ్యవహరిస్తూ దుయ్యబట్టడం, నేను సహించలేను. వార్తా మనుషులతో తమ గొడవ చెప్పుకునే అవకాశం లేకనే చాలామంది, స్వీయచరిత్రలు వ్రాసుకోవడం

అంతమాత్రంచేత వీరిలో ఏ లోపమూ లేదనను. వీరికి ప్రముఖులపట్ల, పక్షపాతం ఉంది నేను నడిరోడ్డు మీదికెళ్ళి, 'నాకూ మా ఆవిడకూ ఈ ఉదయం, పనిమనిషిని గూర్చి జరిగిన యుద్ధకాండ వివరాలు చెప్తాను రండి—' అంటే వీరు పరిగెత్తుకొచ్చి నా చుట్టూ మూగరు.

"ఈ తగవు ఎంతకాలం కొనసాగుతుందంటారు?"

"ఆకలేసేటంతవరకూ?"

"విపులీకరించండి"

"ఆవిడనే అడగండి"

"పక్కింటి రామలింగంగారూ, హనుమాయమ్మగారూ, రాజీ కుదర్చాలని చూస్తున్నారట. ఆ యత్నం కొనసాగుతుందంటారా?

"నే నెప్పుడూ ఆశ ఒదులుకోను - ఆవిడలా - మా ఆవిడలా - నిరాశా వాదిని కాను." వారితో ఇట్లాంటి గోష్ఠి ఊహలో కొనసాగాల్సిందే, వారితో నాకున్న పేచీలలో ఇదొకటి.

మరొకటి కూడా ఉంది. పెద్ద పెద్ద సంఘటనలంటే వారికి పక్షపాతం జాస్తి అని నా అనుమానం రెండు మూడు రైళ్ళు ఒక్కసారి ఢీకొన్నప్పుడూ, కాలేజి భవనాలు తగలడినప్పుడూ, ప్రారంభోత్సవం జరిగిన మరుక్షణంలో ఒంతెన కూలినప్పుడూ, వీరు ఆ దృశ్యాల వృత్తాంతం తెలుసుకోడానికి ఎగబడ తారు కాని, ప్రాణంతీసి మా ఆవిడ కొనిపించిన చీరకొంగు; నెరుసుకి అంగుళం మేర కాలి, నా భోజనం ఆలస్యమైందని మొరెట్టుకుంటే వీరు పట్టించుకోరు.

వార్తామనుషులు అనామకులు. వీరికి పేర్లు లేవు. భార్యా, పిల్లలు, ఇల్లూ అంటూ ఉంటాయా? నిత్యజీవితంలో వీరికి ఏ గొడవలూ ఉండవా? లేక కేవలం లోక కళ్యాణం కోసం సర్వమూ త్యజించిన త్యాగమూర్తులా? నాకిదంతా అసంతృప్తికరంగా ఉంది చక్కగా అందరిమల్లే వారికి పేరు పెట్టాలి. వారు స్కూలుకెళ్ళాలి, పెండ్లి కావాలి. ఆ వివాహానికి దేశంలో ప్రముఖ వ్యక్తులంతా హాజరవాలి వారితో పెండ్లికుమారుడైన వార్తామనిషి ఇష్టాగోష్ఠి జరపాలి.

"మామగార్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని ఒక ప్రముఖవ్యక్తి ప్రశ్నిస్తాడు.

"అత్తగారు లేనప్పుడడగండి ఆ ప్రశ్న"

"మరి మీ సందేశం ఏమిటి" అని మరొక ప్రముఖవ్యక్తి.

"ఏదీ ఇప్పుడేగా పెండ్లయింది. మరో సంవత్సరం గడిచాక కనబడండి, చెప్తాను" అనాలి వార్తామనిషి. అట్లాంటి పరిస్థితులు అవతరించే వరకూ ఈ అనామకులను స్మరించుకుంటూ, అజ్ఞాతంగా గడుపుతాను.

# అత్తా కోడళ్ళ కలహాలు

అత్తా కోడళ్ళ కలహాలకి కారణం యేమిటి? ఈ ప్రశ్న అందర్నీ ఎప్పుడో అప్పుడు బాధించి తీరుతుంది. ఆలోచిస్తే, పైకి కనిపించే కారణాలు ప్రతివాడికీ తెలుస్తూనే ఉంటాయి. స్త్రీలు చదువుకోకపోవడంవల్ల అని. చదువులో పడగానే, క్రొత్త అభిరుచులు, నూత్న భావాలు హృదయాన్ని వంటింటినుంచి మరల్చి, విశాలపరుస్తాయని దీని తాత్పర్యం. ఇక్కడ మరో ప్రశ్న ఎదుర్కొంటుంది. చదువంటే ఇంగ్లీషు చదువా? ఇంగ్లీషైతే కాలేజీల కెళ్ళాలా? గృహనిర్వహణ గురించిన శాస్త్రం తెలుసుకుంటే చాలునని కొందరిమతం. కుట్టుపని, అల్లిక, పిల్లల పోషణ, ఇంటి అలంకారం, వ్యవహారాల్లో భర్తకు సహాయపడేటందుకు సరిపడ్డ లోకజ్ఞానం. యిది Domestic Science నేర్పే పరిజ్ఞానం.

రెండోరకం, ఇంగ్లీషు చదవాలనీ, పత్రికలు, గ్రంథాలు చదివి కొత్త విషయాలు తెలుసుకుని, లోకానికి సంబంధించిన విజ్ఞానం అలవరచుకోవాలనీ: ఇవి రెండూ భర్త ఇష్టా ఇష్టాలమీద ఆధారపడి ఉంటాయి.

కాని కోడళ్ళు చదువుకున్నంత మాత్రాన, కలహాలు తగ్గుతాయనుకోవడం వెర్రి. అత్తాకోడళ్ళలో ఒకరు మాత్రం చదువుకున్నవారైతే, కలహాలు మరింత ఎక్కువవుతాయని వేరే చెప్పక్కర్లేదు. పోనీ యిద్దరూ చదువుకున్న వాళ్ళే ఐతే! చెప్పలేం. కాని ఇట్లాంటి పరిస్థితి బహు అరుదు. అందరూ చదువుకున్న గృహాలలో కూడా అత్తాకోడళ్ళ కలహాలు ఇంకా సాగుతూవుండడంవల్ల, వీటికి ముఖ్య కారణం, పాశ్చాత్యవిద్య లేకపోవడం కాదని తేలుతుంది.

ఈ కలహాలకి కొన్ని మానసిక కారణాలున్నాయని నా నమ్మకం. వీటిని పూర్తిగా రూపుమాపలేకపోయినా, వీటి తీవ్రత తగ్గించే అవకాశాలు స్త్రీల సైకాలజీ తెలుసుకున్న వాళ్ళు కల్పించగలరనీ నమ్ముతూ, కొన్ని సైకాలజీ సిద్ధాంతాలు యిక్కడ క్లుప్తంగా వ్రాస్తున్నా.

ఆధునిక శాస్త్రాలలో సైకాలజి చాలా ఉన్నత స్థానం ఆక్రమిస్తుంది. ఈ శాస్త్రానికి పితామహుడు సిగ్మండ్ ఫ్రాయిడ్, (Sigmund Freud).

కలహ కారణాలని విమర్శించేముందు, మొదట్లో కొన్నిటిని గూర్చి

అంగీకారం కుదుర్చుకోవాలి. మొదటిది, చాలా కలహాలు అత్తల మూలంగానే నని. అత్తలు రెండు రకాలు. భర్తలు కలవాళ్ళు, విధవలు. ఈ భర్తలుకల వాళ్ళే, సుఖపుగానూ, బలంంగానూ దెబ్బలాడగలరు. కోడలు కాపరానికి రాగానే, పీళ్ళు తమకి తెలియకుండానే, అసూయా భావంవల్ల బాధపడతారు. ఈ అసూయ పైకి కనిపించదు. పైపెచ్చు, అపారమైన ప్రేమగా కూడా పరిణ మించొచ్చు. అసహజమైన ప్రేమకూడా ప్రమాదకరమైందే.

ఉదాహరణకు - దార్లో పోయే బట్టలవాణ్ణి అత్తగారు కేకేస్తుంది, కోడలికి చీర కొంటానని. లోపల తనే చీర కొనుక్కోవాలనుంటుంది; ఇది కనిపించని వాంఛ (Unconscious desire) కోడలి చీర కోసం కేకేసింది. తీరా బట్టల వాడు రాగానే, "నీకు చీర కావాలా;" అని కోడల్ని అడగడం యెందుకు? కొడుకు భార్యకి యేమన్నా తీసుకొస్తే, తనకి కూడా తేలేదని భర్తతో తగవు; కొడుకు మీద కోపం. కోడలు యవ్వనంలో వుంది. తను అనుభవించలేని వెన్నెల, సౌందర్యం, శృంగారం, యీ కొత్త పిల్ల అనుభవిస్తోందే! ఇవన్నీ కూతురనుభవిస్తే కోపం ఉండదు. కారణం? కూతురనుభవిస్తే తననుభవించినట్లే. ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రకారం, యీ అసూయకి కారణం, బాల్యంలోనూ, యవ్వనంలోనూ, తీరని వాంఛలని తేల్తుంది. అత్త, తన యవ్వనం, అత్తారింట్లో గడపడం మూలాన, తను స్వేచ్ఛగా, మానసికంగానూ, భౌతికంగానూ అనుభవించే అవకాశాలు లేకపొయ్యాయి. తను దౌర్జన్యం చేసి, యెదిరించి, కోరిన వాటిని పొందలేక పొయ్యింది. నీతి, కుటుంబ గౌరవం, సంఘ మర్యాదా, లా కోర్టులు, తన విరుద్ధ విప్లవ భావాలను అణచి, నొక్కిపెట్టినవి కాని, ఆ వాంఛలన్నీ పూర్తిగా నశింపు కావు. అవి తాత్కాలికంగా అణిగివున్నా, యెంత తీవ్రంగా అణిచిపెడితే, అంత తీవ్రంగానూ, కొంత కాలానికి బైటపడి, చెలరేగుతాయి. నిద్ర సమయంలో, పై చెప్పిన ఆటంకాలు లేకపోవడం వల్ల, మనస్సు, శరీరం స్వేచ్ఛ పొంది, కలల మూలంగా బైట పడతాయి. ఆ కలల్ని శోధిస్తే, వాటి మూలాలు, గడిచిపోయిన, యవ్వనంలో బాధించిన తీరని వాంఛలే నని తెలుస్తుంది. ఫ్రాయిడ్ యింకా ఘోరమైన సంగతులు వ్రాస్తాడు. ప్రతి తల్లికి పుత్రుడు మీద కూడా, తెలియని భౌతిక వాంఛ వుంటుందట. పుత్రుడికి భార్య రాగానే, అతన్ని తనకు లేకుండా పరాయిపిల్ల తన వశం చేసుకుంటుం దని, వొక చెప్పరాని అసూయట. అల్లాగే కొడుక్కి తల్లిపైన కూడా ఒక రకం వాంఛ, దాన్నుండి జనించేమోహక్కి ఉంటాయట. దీన్ని ఇడిపస్ కాంప్లెక్స్ (Oedipus Complex) అంటాడు. అందుకనీ యీ కోడల్ని హింసించడంలో

అంత ఉత్సాహం చూపుతుందని తేల్తుంది. అంచేతే, కొడుకు భార్యని కాని, భార్య పుట్టింటార్ని కాని దెప్పిపొడుస్తే అత్తకు ఎంతో సరదా. తిట్టి, హింసించ డానికి కోడల్లో ఏ లోటూ కనిపించకపోతే కోడలి పుట్టింటారి మీద పడడం, మనం చాలామార్లు చూస్తూనే వుంటాం. మళ్ళా కోడలేకనక, తన కొడుకుని దెప్పి పొడిస్తే, పరిహాసానికైనా సరే, విరుచుకుపడుతుంది, "మా వాడి కాలి గోరుకి పోలవు" అంటుంది తన కొడుకు యెంతో అవస్థపడి, పెళ్ళాన్ని పిల్లల్ని పోషించి కృశించిపోతున్నాడని, దానికంతా కారణం కోడలేననీ, పెద్ద తెలియని అనుమానం, ఏదో వుండి తీరుతుంది అత్తలో.

రెండోది, తన తీరని వాంఛలను, అణచుకోడానికి అలవాటుపడిన యిల్లాలు, కొత్త కోడలు, అవన్నీ అనుభవించడం చూచేటప్పుడు, తన మనస్సునీ, జీవితాన్ని తారుమారు చేసుకుంటుంది. సదాచారాలకి లొంగి, మర్యాదతో వ్యవహరించడానికి అలవాటుపడ్డ అత్తకి, కోడలి అనుభవం, యౌవ నోత్సాహం అవినీతిగా తోస్తుంది. దీన్ని ఫ్రాయిడ్ స్థిరపడిన ఆంతరంగికం (Conditioned Reflex) అంటాడు. దీనికి మందేమిటంటే, ఆంతరంగికం స్థిరపడకుండా చేసుకోవాలి. కొత్త వ్యక్తులకి గౌరవం యిచ్చి, తన స్వార్థాన్ని లొంగతీసుకోవాలి. కోడలి స్వార్థాన్ని గుర్తించాలి. కోడలు అత్తగారి స్వార్థాన్ని పొగడుతూ, దాన్ని అమలులో పెట్టే యత్నాలు చెయ్యాలి.

"ఇంత ప్రొద్దెక్కా పక్క మీంచి లేవడం?" అంటుందనుకోండి అత్తగారు.

"అబ్బే లేదండి, ఒళ్ళు నెప్పులుగా వుందండి - మీరు కూడా అంత తెల్లారగట్ల లేవడంమూలాన్నే, మీకా మెడ నొప్పులు...." అని సమాధానం చెప్పాలి. ఈ స్వార్థాన్ని తీరని వాంఛలనీ, మెల్లగా బైటపడేటట్లు చెయ్యాలి, కొడుకు కోడలూ కలసి

"మేం సినిమాకు వెడుతున్నాం."

"వెళ్ళండి నే రాను" అత్తగారంటుంది.

"మీరు రాకపోతే నే వెళ్ళను — మీరుంటేనే సరదా" అనాలి. అల్లాఅని, అత్తగార్ని తీసుకెళ్ళకపోయినా యేమీ అనుకోదు.

ఈపై చెప్పిన సిద్ధాంతాలన్నీ, భర్తలున్న అత్తగార్లకే కాకుండా, భర్తలు పోయిన వాళ్ళకుకూడా చాలా భాగం అనువర్తిస్తాయి. సైకాలజీలో ఫ్రాయిడ్ తరవాత పెద్దచెయ్యి, ఆల్‌ఫ్రెడ్ అడ్లర్ (Alfred Adler). ఇతని సిద్ధాంతాలు, విధవ అత్తగార్లకు అన్వయిస్తాయని తలుస్తా కాబట్టి, అవిక్కడ పొందుపరుస్తా.

ఈయన ప్రకారం, పురుషులకే కాకుండా, స్త్రీలకి కూడా 'అధికారం' మోజు చాలా ఉంటుంది. పురుషుడికి యితరులమీద 'అధికారం' చెలాయించాలని ఉండడమే వాళ్ళు చేసే యత్నాలకి, కార్యాలకి కారణం అని తేల్తుంది కథలు వ్రాసినా, ఉద్యోగం చేసినా, నటించినా, సంగీతం పాడినా, ఉపన్యాసాలిచ్చినా, రాజకీయాలలో దిగినా, శరీరం పెంచినా పీటిల్లో యేది చేసినా, ముఖ్యమైన కోరిక అధికార వాంఛ — ఇవేవీ చెయ్యలేనివాడు కోతలు కొయ్యడం అందుకే. అదీ చేతకానివాడు, వ్యాధిగ్రస్తుడైనప్పుడు, జబ్బునే ఆధారంగా చేసుకుని, యింట్లో వాళ్ళమీద అధికారం చెలాయిస్తాడు. అంచేతే, "జరుగుబాటుంటే జబ్బంత సుఖంలే"దన్న సామెత.

అల్లాగే స్త్రీలకి అధికారవాంఛ ఉంటుంది. అత్తలకు చదువులు, ఉద్యోగాలు, పోటీపడే అవకాశాలు లేకపోవడం మూలాన, అధికారం యెవ్వరి మీదా చెలాయించలేరు. కొందరు అక్కడికీ తెగించి భర్తమీద అధికారం చెలా యిస్తారు, గయ్యాళిగంపలని పేరుపడ్డాసరే. "లోకం పురుషుడికి చెందుతుంది; కాని, పురుషుడు, స్త్రీకి చెందుతాడు" అంటాడు బొక్కేషియో (Boccaccio). భర్తమీద చెలాయించే అధికారం, పిల్లలు పెద్దవగానే, భర్తమీదినుంచి, పిల్లల మీదికి మరల్తుంది. పిల్లలుకూడా పెద్దవాళ్ళయింతర్వాత, వాళ్ళమీదకూడా దౌర్జన్యంచేసే అవకాశాలు లేక చివరికి కోడళ్ళమీద పడతారు. ఇదీ వాళ్ళపై సైకాలజీ.

స్త్రీలో సహజమైన ఉద్రేకం చాలా తీవ్రంగా ఉంటుంది. అడ్లర్ ప్రకారం ఉద్రేకాలన్నింటిలోకి ప్రధానమైంది అధికారవాంఛ. ఇది బైటపడే అవకాశాలు లేక, సమయం చిక్కగానే, భయంకరమైన తీవ్రతతో కోడళ్ళమీద చెలరేగుతుంది.

కోడలు హడుల్తో ఉండాలి; కూతుర్ని యెక్కడ హింసిస్తారోనన్న భయం వల్ల కోడలి పుట్టింటారుకూడా హడుల్తో ఉంటారు. బామ్మ, తల్లినేమంటుందోనని భయపడి మనుమలు హడుల్తోంటారు. కోడలుంటే అధికారం చలాయించేందుకు, అన్ని అవకాశాలున్నాయి అత్తగారికి.

భర్త గతించగానే, విచారంవల్ల మూలపడిన అధికారవాంఛ, కొంత కాలానికి మరీ పేట్రేగిపోతుంది కొడుకుని కని, పెంచి, పెద్దవాణ్ణిచేసింది కాబట్టి, తనకి అతని నిత్య కృత్యాలలో కలగజేసుకునేందుకు సర్వహక్కులూ ఉన్నాయన్న భ్రాంతి, కేకలెయ్యడానికి భర్త లేకపోవడంవల్ల, విధవ అత్తగార్ల అధికారవాంఛ కోడళ్ళమీద మాత్రమే కాకుండా ఇరుగుపొరుగువాళ్ళమీద,

కూరలవాళ్ళమీద, నౌకర్లమీద చెలరేగి, అందరి ఆత్మగౌరవాల్ని ధ్వంసంచేసి, తనోచిన్న 'చివర రోజులలోని విక్టోరియా' లాగా, ఒక రాజ్యానికి రాణీలాగా ప్రవర్తిస్తుంది.

ఈ వాంఛని తగ్గించే మార్గం కనబడదు. పైగా యీ వాంఛలు మానవులకి ప్రాకృతికాలు. ఇవి మనుష్యులకు, మృగాలకు ప్రకృతికివున్న దగ్గర బంధుత్వానికి చిహ్నం. వీటిల్లో నైతికంగా ఆక్షేపించవలసిందిలేదు. ఆ మాట కొస్తే, స్వార్థాన్ని చంపుకొని, వ్యక్తిత్వాన్ని నిర్మూలనం చేసికొని, సన్యాసిలా జీవించడం, సృష్టికి వ్యతిరేకంగా బ్రతకడం అన్నమాట. కాని, వీళ్ళు చెయ్యగలిగిందేమిటంటే, ఈ అధికారవాంఛ బైటపడేందుకు, నెమ్మదైనమార్గం తెలుసుకోవాలి. అక్కడికి కొందరు విధవత్తగార్లు, దినంలో సగంకాలం బైటికి వెళ్ళి పురాణం చెబుతూ, కొందరు శిష్యురాండ్రను పోగు చేసుకుని, తమ అధికారవాంఛ ఆధ్యాత్మికంగా చలాయించుకుంటారు. కొందరు, తీరుబడిగావుంటే జైళ్ళకెడతారు. కొందరు ఉపన్యాస వేదికలపై అధ్యక్షురాండ్రవుతారు; ఇల్లాగ కొత్త మార్గాలు తెలుసుకొని, నూతన కుతూహలం కలగచేసుకుంటే, కోడళ్ళని మానసికంగా సంతోషపెట్టిన వాళ్ళవుతారు. అల్లాగే కొత్త విషయాలవల్ల సరదా కలిగేటట్టు చెయ్యాలి. ఇనప్పెట్టె తాళం అత్తగారికి ఇవ్వాలి; ప్రతి స్వల్ప విషయానికీ అత్తగార్ల సలహా పుచ్చుకోవాలి. తమ కింట్లో ప్రాముఖ్యత లేనట్లు నటించాలి. నటిస్తే చాలు, నిజంగా ప్రాముఖ్యత వాళ్ళే వుంచుకున్నా. ఎందుకంటే, కాలం గడిచిన కొద్దీ స్త్రీ హృదయం నటనకీ, యదార్థానికీ భేదం తెలుసుకోలేదు. మంచిగా వుండడం కంటె, మంచిగా వున్నట్లు నటించడం సుఖం. సంసారంలో నటన చాలా వరకు అవసరం.

ఈ వ్యాసం ఇంతటితో ముగిస్తున్నా. పై చెప్పిన సిద్ధాంతాలవల్ల తేలిన ముఖ్య విషయం వొకటే వుంది. పురుషుడికిమల్లేనే స్త్రీ హృదయంలో కూడా, తీరని వాంఛలనే మృగాలుంటాయి, అవి భయంవల్ల బైట పడవు. అక్కడికి రాత్రి సమయంలో కలల మూలంగా దర్శనం యిస్తూంటాయి. పగలు అవి బైటకి రాకుండా 'తప్పు' అనే తాళం వేస్తాం. అప్పటికి కూడా అవి చేసే గర్జనలు పగటిపూట కూడా వినిపిస్తుంటాయి తెలియకుండా అవి చేసే గర్జనలే కలహాలకి కారణం. అవి ఎట్లాంటి క్రూరమృగాలో పరీక్షించి వాటి నోరు నొక్కాలి. మరో చిన్న సలహా, కోడళ్ళు, అత్తగార్ల కంటె మంచివాళ్ళని అనిపించుకోడానికి యత్నించకూడదు. మానవ హృదయం, యితరుల భాగ్య సంపద విని యెల్లా నిరసిస్తుందో, యితరుల మంచితనాన్ని అల్లాగే నిరసిస్తుంది.

"ఇతరుల కంటె కూడా ఎక్కువ మంచిగా వుండటానికి యత్నించిన వ్యక్తి పెద్దవాడు" అంటాడు ప్రఖ్యాత ఆంగ్ల ఆదర్శ తత్వజ్ఞుడు బ్రాడ్లే (F. H. Bradley).

కలహాలకి కారణం అత్తలే అన్నానని, యిది చదువుకున్న అత్తగార్లు నన్ను తిట్టనక్కర్లేదు ఎందుకంటే వాళ్ళ కోడళ్ళు కూడా కొంత కాలానికి అత్తలు కాబోతున్నారు కాబట్టి, నే చెప్పినవన్నీ వాళ్ళకి కూడా సమానంగా అన్వయిస్తాయి- మరోసారి, కోడళ్ళ సైకాలజీ గూర్చి వ్రాయగలను.

ఇంగ్లీషు తెలిసినవారు, యీ విషయాన్ని గురించి యింకా తెలుసుకోవాలని వుంటే, వాళ్ళకి సులభమయ్యే ముఖ్యమైన గ్రంధాల జాబితా యిక్కడ వ్రాస్తున్నాను. ఈ వ్యాసంలోని దోషాలు నావి కాని, యీ దిగువ గ్రంధాల రచయితలవి కావు.

1) The under world of the Subconscious (Sigmund Freud)
2) Fantasia of the unconscious. (D H. Lawrence)
3) Ego and the Love of power in woman (Adler)
4) Psychology of the Old maid. (Jung & Mcdowgall)

ఈ వ్యాసం 1941 లో కళాశాలలో చదువుకుంటున్న రోజుల్లో శ్రీమతి దుర్గాబాయ్ [ఇప్పుడు దుర్గాబాయ్ దేశ్‌ముఖ్] ప్రోత్సాహంపై వ్రాసినది. గృహలక్ష్మిలో ప్రచురితమైంది. కోడళ్ళ మనస్తత్వం గూర్చి కూడా వ్రాయగలనన్న వాక్యంతో యీ వ్యాసం ముగిసింది. ఈ విషయమై మరి రెండు వ్యాసాలు కూడా గృహలక్ష్మిలో ప్రచురించినట్లు జ్ఞాపకం; కాని ఆ వ్యాసాలు ఇప్పుడు దొరకలేదు.

ఈ వ్యాసం వ్రాసి ఇరవై మూడు సంవత్సరాలైనా, వస్తువు అంత పాతబడలేదనీ, ఇప్పటికీ కాస్తో కూస్తో ప్రయోజనం వుందని నమ్మడం వల్లా, విద్యార్థిగా వుండి, తొలి దశలో వ్రాసిన వ్యాసం తీరు ఎట్లా వుంటుందో తెలుసుకోవాలని కుతూహలపడే వారికి వుపకరిస్తుందనీ — ఈ వ్యాసం యీ సంపుటిలో పొందుపరిచాను.

ఆనాడు సమాజంలో నాయకురాండ్రుగా పెద్దలైన స్త్రీలు జైళ్ళ కెళ్ళేవారు; రాజకీయాలలో పాల్గొనేవారు. అట్టి వ్యాపకం మధ్యతరగతి కుటుంబం వికాసానికి తోడ్పడిందన్న ధ్వని వుంది యీ వ్యాసంలో. ఈనాడు స్త్రీల మానసిక వికాసానికి ఎన్నెన్నో అవకాశాలున్నాయి. జడ్జీలుగా, డాక్టర్లుగా, స్త్రీ

సంక్షేమ కేంద్రాల నిర్వాహకులుగా, వుమన్ కేడెట్‌లుగా, ఉపాధ్యాయినులుగా, పంచాయితీలలో ముఖ్య సేవికలుగా — ఎన్నెన్నో అవకాశాలు. స్త్రీలందరూ సామాజిక జీవితంలో భాగస్వాములైననాడు అత్తా కోడళ్ళ కలహాలని గూర్చి వ్రాసే అవసరం వుండదు.

స్త్రీ అంతరంగ జీవితంలో, జిజ్ఞాస పెంచడానికి పాశ్చాత్య దేశాలలో వుపకరించిన వ్యక్తులు, ఫ్రాయిడ్‌కి డి. హెచ్. లారెన్స్. మనవారిలో కొంత వరకు వెంకటచలం. ఈనాడు రచయిత్రుల సంఖ్య పెరగడం ఇందుకు తార్కాణం. ఈ జిజ్ఞాస, వికాసం ఇంకా అభివృద్ధి చెందాలన్న ఆశవల్లా, ఇందుకు యీ వ్యాసం కొంచంగానైనా తోడ్పడగలదన్న నమ్మకం వల్లా ఈ సంపుటిలో పొందు పరిచాను. పాఠకులు హర్షిస్తారనుకుంటా.

# నడివయస్కు నిఘంటువు

షష్టిపూర్తులు సంప్రదాయబద్ధంగా జరుగుతూవున్నా, నాలుగైదేండ్లుగా, ప్రముఖుల షష్టిపూర్తికి ఆహ్వానాలు నాకు రావడం మొదలు పెట్టాయి. స్వయంగా రాలేకపోతే, శుభాకాంక్షలు, సందేశం పంపమని వ్రాస్తారు కార్యకర్తలు, ఈ ఆహ్వానాలు సంతోషాన్ని కలుగజేస్తాయి. రెండు కారణాలు. ఒక ప్రముఖుని కృషి, సేవ గుర్తించిన సమాజం, తన ఆహ్లాదాన్ని, కృతజ్ఞత చెప్పుకుంటున్నదిగదా అని ఒకటి; మరో పదిహేనేండ్ల వరకూ,* నాకు అరవై నిండవుకదా అన్నది మరొకటి.

పెద్దలకు సందేశం పంపే అర్హత నాకు లేదు, శుభాకాంక్షలు అందజేస్తూ ఏదో నంబరుగల టెలిగ్రాం పంపాలి. ఒక సంఖ్యగా అవతరించిన 'తంతీస్సు' (కొత్త మాట కల్పించాను క్షమించాలి) అందుకున్నప్పుడు, పంపిన నాకు గాని, చదువుకున్న కార్యవర్గం కార్యదర్శికిగాని యెట్లాంటి వుద్రేకం వుత్పన్నమవుతుందో ఊహించలేను. ఒక నంబరు తంతీస్సు బదులు మరో నంబరుది పంపితే ఏమౌతుందో ఊహించగల్గినా, పెద్దలకి తమ కృషిపట్ల కుర్రకారు ఏ రకం ఆదరణ, అభిమానం చూపుతున్నారు, ఎట్లాంటి విలువలు కడుతున్నారు – తెలుసుకోవాలన్న కుతూహలం వుండడం సహజం. కాని పిన్నలు, తమ అభిప్రాయం కోరగానే విమర్శకుడి చేతిబెత్తం చేపడతారు. పెద్దల కృషికి విలువ కట్టడం మాట అట్లా వుంచి, తమ కృషిని పెద్దల దానితో పోల్చుగుని, తామెంత పురోగమించారో చూపడంగా పరిణమిస్తుంది.

ఏమో – అరవై యేళ్ళకి నేనెట్లా తయారవుతానో తెలియదు. బాల్యంలోనే, శీలం అల్లబొయ్యే నమూనా స్థిరపడిపోతుందని మన శాస్త్రజ్ఞులు చెబుతున్నా, మానవత్వం ఆ విధంగా ఒక శాస్త్రీయ నిబంధనకి లొంగిపోతుందని ఒప్పుగోను. "చిన్నప్పుడే పరమపదించే బాలురు, మానవత్వం నాణెం ముద్ర, పరమాత్మకి అందజేస్తారు" అని ఎ. ఇ. హౌస్‌మన్ (A. E. Housman)

---

* ఈ వ్యాసం 1962 లో ప్రచురితమైంది.

కవి శిశువుని సమర్థించొచ్చు. నడివయస్సులో వారి మాటేమిటి? పోనీ, నలుగురూ నిర్ణయించిన పంథానే నేనూ వెళ్ళి అరవై పూర్తిచేస్తే, షష్టిపూర్తి జరపడానికి ఇప్పటినుండీ సన్నాహాలు జరుపుతున్న కార్యకర్తలు వున్నారనుకుందాం. కాని ఆనాటికి నేను మరో పంథా తొక్కి వారు ఆ సందర్భమే మరిచిపోవచ్చు; లేక ఉద్యోగాన్నుండి విరమించే వయస్సు యాభై అయిదు నుండి అరవై అయిదుకి పెంచాం* (ఈనాటి వైద్య శాస్త్రం ప్రభావం వల్ల మనుషులు చాలా కాలం దృఢకాయులై పనిచేస్తున్నారు. గావున)అని పార్లమెంట్ తీర్మానిస్తే, షష్టిపూర్తులు డెబ్భైకి నెట్టివేస్తారు నడి వయస్కుడనైన నాకు అంత కాలం నిలబడతానని తోచదు. ఓ వేళ, నిలబడి, అన్నీ సమగ్రంగా జరిపి, సన్మానసభ ఏర్పాటుచేస్తే నేను చెప్పదల్చుకున్నది ఆ సమయంలో మరిచిపోవనూవచ్చు.

అందుచేత బాల్యం, యౌవనం, నడివయస్సు, వార్ధక్యం — షష్టిపూర్తి పట్ల — నా అభిప్రాయాలు యెట్లాంటివో యిప్పుడే వ్రాసెయ్యాలి, చిత్రం ఇవన్నీ వ్రాస్తేగాని స్పష్టపడవు. విషయం విశదంగా వుంటేగాని వ్రాయలేం, వ్రాస్తే గాని విషయం విశదపడదు ఏదో తేల్చి వెయ్యాలన్న నిర్ణయం ఫలితం ఈ రచన. రచనకి ముందు వివిధ దేశాల రచయితలు, తత్వజ్ఞులు ఈ విషయం గూర్చి యేమన్నారో తెలుసుకుందామని, అప్పుడప్పుడు పొందుపరుస్తూ వొచ్చిన ఛలోక్తులు, నిర్వచనాల నోటుబుక్కు తిరగవేశాను. అవన్నీ చదివి ఆలోచించటం మొదలుపెడితే, నేను కొత్తగా చెప్పబొయ్యేది యేమీ కనబడలేదు. అంచేత ఆ నిర్వచనాలని గుచ్చెత్తి, వాఖ్యానంతో ఒక వ్యాసంగా సమకూర్చడం జరిగింది.

ఏరా, ఏమోయ్, ఏమయ్యా — అని సంబోధించడం మానేసి 'ఏమండీ' అని నలుగురూ అనడంతో యవ్వనదశ ముగిసిందని గుర్తించాను. స్త్రీలుకూడా నమస్కారం పెట్టి పలకరించడంతో నడివయస్సుకి సమాధాన వద్దాను.

"మీరు ఎంత చిన్నవారిలా కనబడుతున్నారు! అని ఎవరైనా అంటే, ముసలాడి వయ్యావని వొక గుర్తు" అని ఒక ఛలోక్తి. ఎవరిదో తెలియదు.

నడి వయస్కులకి ఉత్సాహాన్నిచ్చే నిర్వచనం నవలా రచయిత ట్రోలోప్‌ది (Authoy Trollope) ఒకటుంది.

"నిజమైన ప్రేమ, స్నేహం, నలభై అయిదు, డెబ్భై లోపలి వారికి సాధ్యం; అంతవరకూ వారికి సాధ్యమయ్యేది తాత్కాలిక అనుభూతి కలగజేసే చిలిపి చర్య" అని.

నా పదిహేనో ఏట బొగ్గుపొడుం రంగుతో మొహం మీద మీసాలు,

---

* ఇప్పుడు 58 కి పెంచారు.

గడ్డం వేసుకుని అద్దం చూసుకుని, పెద్దవాణ్ణిగా భావించుకుని గర్వపడేవాణ్ని. దాంతర్వాత వో పదేళ్ళపాటు క్షురకర్మ సరదాగా వుండేది. మరో పదేళ్ళు గడిచాక, గడ్డంలో అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు దర్శన మివ్వడంతో నడి వయస్సు వొచ్చి వొళ్ళో కూర్చున్నా ఇంకా లేదని భ్రమించి ముప్పై ఏళ్ళకే జుట్టు, గడ్డం నెరవడం ప్రారంభించిన వ్యక్తులను స్మరించుకుని, ఓదార్పు పొంది అవేవీ కనబడకుండా, సాఫీగడ్డం చేసుకోడం, ఒక యజ్ఞంగా పరిణమించింది. ఈనాడు, సృష్టిలో, ఈ నిరుపయోగమైన గడ్డం అనేది అసలు లేకుంటే ఎంత బాగుండును." అనుకొనే స్థితి కొచ్చాను.

ఆంగ్ల నవలా రచయిత అర్నాల్డు బెనెట్ (Arnold Bennett) అంచనా ప్రకారం అరవై యేళ్ళవాడు ఇరవై యేళ్ళు నిద్రలోనూ, మూడేళ్ళ పైగా భోజనం చెయ్యడంలోనూ గడుపుతాడు. బెనెట్ క్షురకర్మ భోగట్టా ఎందుకివ్వలేదో నా కర్థం కాదు. క్షురకర్మలో నాలుగేళ్లైనా గడుపుతాడని నా అంచనా.

నడివయస్సుని ఆహ్వానించి ఆతిథ్యం యివ్వడానికి నేనింకా సిద్ధపడలేదు. ఇంకా చాలా జరగాలి – ఒక్క గడ్డం నెరవడం మట్టుకే కాదు. తలమీద జుట్టు ఊడడం మొదలెట్టాలి. దానివల్ల ఒక లాభం ఏమిటంటే తెల్ల వెంట్రుకలు ఊడి పోతాయి. కాని అదేం చిత్రమో, నే నెరుగున్న బట్టతల నడివయస్సుల జుట్టులో సీరసించి, నెరసిన వెంట్రుకలు ఊడడం బదులు, అక్కడక్కడ మెదడుని పట్టుకొని వ్రేళ్ళాడతాయి– పుట్టిల్లు వదలలేని మునిలి భార్యకిమల్లే, నడివయస్సు రాకుండానే బట్టతల నునుపుకి మురిసిపొయ్యే మేధావుల జాబితా వేసుకొని సంతోషపడేవాణ్ని; ఎప్పుడు ఊడడం ప్రారంభిస్తుంది, యెప్పుడు సమాప్తమౌ తుంది - ఇది గమనించే భాగ్యం మానవుడికి లేదు; ఏ వొకరిద్దరు అపూర్వ వ్యక్తులకో తప్ప. నే నెరుగున్న వో డాక్టరుకి వుదయం స్నానంచేసి, దువ్వెన తలలోంచి లాగగానే, మొత్తం జుట్టంతా ఊడొచ్చింది. ఇది నడివయస్సు పీడోక్కలు వుదంతంలో అద్భుత ఘట్టం. ఇట్లా జరిగిందేమో తెలీదుకాని, ప్రసిద్ధ ఆంగ్ల విమర్శకుడు – ఛలోక్తుల నిఘంటువు తయారుచేసిన రచయిత లోగన్ పెర్సాల్‌స్మిత్ (Logan Pearsall Smith), బట్టతలకి ఈ విధంగా స్వాగతం చెప్పుకున్నాడు.

"బట్టతల శిఖరాన, నునుపు వుందని, కుర్రకారుకి తెలియదు."

కొత్త విషయాలను తెలుసుకోవాలన్న తృష్ణ, నడివయస్సులో సన్నగిల్లు తుందా? ఏమో తెలీదు. హిందీ నేర్చుకోవాలని పదేళ్ళుగా ప్రయత్నం జరుపు తున్నాను. తగిన పుస్తకాలు కొన్నాను, చాలాసార్లు ఉపక్రమించాను. ఎక్కడ

ప్రారంభించానో అక్కడే వున్నాను ఈనాటికి. నేర్చుకొనేటందుకు ఇంకా బోలెడు టైముందిలే – ఎప్పుడో ఒకప్పుడు సాధ్యంకాక పోతుందా – చూసుకుందాంలే– అన్న ధీమా ఒక పక్కన వుంది

"నాతో వృద్ధుడవుకా–
జీవితం మొత్తంగా నిర్మించాను.
యవ్వనంలో సగం చూస్తావు
మిగతాది వార్ధక్యంలో"

అన్న బ్రౌనింగ్ కవి పద్యం చదువుకుని, హిందీ పుస్తకాలకేసి చూస్తూ "ఎప్పుడో నీ పని పడతాలే!" అని సవాల్ చేస్తూంటాను. ఇంకా చాలా చెయ్యాలి; కుస్తీలో పహల్వాన్లని ఓడించాలి; ఎప్పుడో సినిమాలో నటించాలి ఫ్లూట్ వాద్యం నేర్చుకుని కచ్చేరి చెయ్యాలి; నందాదేవి శిఖరం ఎక్కి దిగాలి; భరతనాట్యం, కొద్దో గొప్పో చెయ్యకలగాలి. ప్రపంచం చుట్టిరావాలి – అబ్బో చాలా ఉన్నాయి లెండి. సాధ్యం కాదనుకుంటారా?

ఈ నిర్వచనాలు చూడండి.

"వార్థక్యంలో, నాట్యం, వాద్య సంగీతం సాధన చేశాడు సోక్రటీస్" అన్నాడు మాన్‌టెయిన్ (Montaigne). వార్ధక్యంలో కేటో (Cato) గ్రీకు నేర్చుగున్నాడు. గాంధీగారు చివరి రోజుల్లో కొత్త భాషలు ప్రారంభించి సాధించారు కూడ; రవీంద్రుడు డెబ్బైయ్యోపడిలో చిత్రలేఖనం ప్రారంభించాడు.

"ఎనభైయ్యో ఏట కేటో గ్రీక్ భాష నేర్చుకున్నాడని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాను, నా చిన్నతనంలో. ఇప్పుడు పడను 'అబ్బో; ఇది చాలా సంవత్సరాలకికాని పూర్తికాదు' అని భయపడి, యువకుడు విడిచేసిన కార్యాలకి, వృద్ధుడు ఇట్టె పూనుకుని సాధిస్తాడు." అని సామర్‌సెట్ మామ్. వోల్టేర్ (Voltair) అనే రచయిత తన అరవై ఐదో ఏట వ్రాశాడు, 'కాన్ డైడ్' (Candide) అనే ఉత్తమ గ్రంథం. వార్ధక్యంలో విక్టర్ హ్యూగో (Victor Hugo) గెథె – (Goethe) మంచి కవిత్వం వ్రాశారు. తన గొప్ప నాటకం సెంట్ జోన్ (Saint Joan) వ్రాసినప్పుడు (Shaw) వయస్సు అరవై. "ఏమీ లేనివాడికి కూడా, కాలం మిగుల్తుంది" అని గ్రాసియెస్ (Grossius).

అనుకున్నవన్నీ సాధించలేకపోతామా అని పైకి ధైర్యంగా కనబడినా, లోలోపల ఏదో బాధ, భయం మసలుతూనే వుంటాయి. ఒకసారేనా నిలబడాలని వుంది, ఓడిపోయినా విచారం లేదు. "వార్ధక్యం మంచి ప్రచారం" అన్నాడు యెమర్‌సన్ (R. W. Emerson). ఓడిపోయినా విచారం లేదని ఇప్పుడు –

అనగా నడివయస్సులో - అనుకోవచ్చు. కాని విచారం లేకుండా వుంటుందా? పెద్దతనంలో చాదస్తం, పట్టుదల యెక్కువని అందరకీ తెలిసిందే.

"నలభై అయిదు దాటాక, మనుషులు, తెగిస్తారు, సమీపంలో వున్న మృత్యువుని ధిఃకరిస్తూ" అని నవలా రచయిత కాన్రాడ్ (Joseph Conrad). వార్ధక్యంలో సాధించి ఓడిపోవడంతో ప్రాప్తించే విచారంకంటె, అసలు ఉపక్రమించగలనన్న జిజ్ఞాస బలంగా వుండి, తృప్తినిస్తుందేమో!

"వార్ధక్యంతోపాటు జ్ఞానం కూడా సంప్రాప్తిస్తుంది అనేది కల్ల. ఈ నిజం ముసిలాడినయ్యాక తెలుసుకున్నాను" అని అమెరికన్ విమర్శకుడు మెన్కెన్ (H. L. Mencken). మరి కొందరి నిర్వచనాలు వార్థక్యంలో ఏమీ సాధించలేమన్న భయాన్ని బలపరుస్తాయి.

"అరవై దాటాక మనిషి పనికిరాడు. షష్టి పూర్తి జరుపుకున్న వ్యక్తులు కృషి చెయ్యటం మానుకుంటే ప్రపంచం బాగుంటుంది' అని విలియమ్ ఓస్లర్ (William Osler).

"అరవై దాటాక చేసేటందుకు కొత్తవేవీ కనిపించవు కాని, పాతవాటినే కొత్త ధోరణిలో చేస్తాడు" అని తత్వజ్ఞుడు ఆల్ఫ్రెడ్ వైట్ హెడ్ (Alfred Whitehead).

"పక్షవాతం, ఉబ్బసంతోపాటు, మందు లేని మరో జబ్బుంది నాకు, అదే వార్ధక్యం" అని డెబ్భయి అయిదో ఏట డాక్టర్ జాన్సన్ (Doctor Johnson).

"పెద్దపని చేసి చూపించే సత్తువ లేక, మంచి సలహాలో విసిగిస్తాడు వృద్ధుడు" అని లారోషిఫొకాల్డు, (La Roche Focauld).

"యవ్వనం ఒక పెద్ద పొరపాటు. నడివయస్సు నొక భయంకర సంఘర్షణ, వార్ధక్యం ఒక పెద్ద చింత" అని బెంజమిన్ డిస్రెలి (Bengamin Disraeli).

"నలభయి దాటాక కూడా ప్రతిదాన్నీ అంగీకరించి 'ఊ' కొట్టి భళాభళీ అనేవాడు దుర్మార్గుడు" అని షా (Shaw).

"నలభయి దాటాక దొంగ కాకపోతే, ప్రతిభాశాలైనా అయివుంటాడు" అని లిన్ యుటాంగ్ (Lin yutang).

పూర్వీకుల అనుభవం ఎట్లాంటిదో చూద్దామని ఆదిమనివాసుల వృత్తాంతం తిరగవేస్తే మరీ భయమేస్తుంది. వెనక సౌత్ సీ దీవులలో వృద్ధులైనవారిని, కొబ్బరిచెట్టు మొగలోకి ఎక్కమనేవారుట. వారు ఎక్కిం తర్వాత బలమైన యువకులు ఆ చెట్టుని ఊపేవారుట. ఆ ఊపుకి కింద పడిపోకుండా నిలబడ

గలిగిన వృద్ధుణ్ని విడిచేసేవారుట - నిలబడక పడిపోయినవారిని చంపివేసే వారుట.

ఇవన్నీ తెలుసుకున్న తర్వాత, కొన్ని ఆదర్శాలు వొదితేసుకున్నాను. కుస్తీలో ఆరితేరి ఉస్తాదు కావాలన్న కోర్కె పోయింది. సర్కసులో ఫీట్లు నావల్ల కాదు. వేణువు వాయిస్తుంటే బుగ్గలుబ్బి, నోరు ఒంకరవుతుంది - విడిచేస్తాను. గారడీకి పనికిరాను. గోదావరి ఈ ఒడ్డు నుంచి ఆ ఒడ్డుకు ఈదను. భౌతికంగా, శారీరకంగా శక్తులు కుంటుపడతాయి- ఆ రకం ఆదర్శాలు ఒదులు కున్నాను. మానసికంగా పురోగమించి, కోరినవాటిని సాధించగలనా? గోదావరి ఈదలేకపోవచ్చు - కాని ఒడ్డున పాకేసుగుని, గడ్డిలో పడుకుని, ఆకాశంలో నర్తించే పిల్ల మేఘాల వయ్యారానికి మురిసిపోయి ఆనంద శిఖరం అందుకొని, సృష్టి రహస్యం క్షణం తెలుసుకొని అనంతంలో ఐక్యం అవగలనా? నాకు, థోరియొ (Thoreau) నిర్వచనం ఇష్టం.

"చందమామని చేరుకొనే నిమిత్తమై ఒంతెన వేద్దామనీ, యువకుడు పోగు చేసిన ఇటిక, ఇసుక, కర్ర కంపతో నడివయస్కుడు పాకేసుగుంటాడు" ఇది వ్రాసిన థోరియొ నడివయస్కుడై వుండాలి. నడివయస్కుడు పోగు చేసిన సరంజాంను వృద్ధుడు యెట్లా వినియోగిస్తాడో చెప్పలేదు మరి! నడివయస్కుడు వేసిన పాకని, వృద్ధుడు, పాకవతల పడుకుని తిలకిస్తాడా? పాకలో ముసు గెట్టుకుని పడుకుంటాడా? ఏమో నాకు తెలీదు.

నడివయస్సు ముగిసి వార్ధక్యం యెప్పుడు ప్రారంభమవుతుంది? నా చిన్నతనంలో ముప్పై యేళ్ళ వాళ్ళంతా పెద్దవాళ్ళ లాగా అగుపించేవారు. ముప్పైయ్యో ఏట నలభయ్యో పడిలో పడ్డవాళ్ళంతా వృద్ధులకింద జమకట్టే వాడిని.

"సునాయాసంగా వృద్ధులయ్యేవారు అరుదు" అంటాడు రిచార్డు స్టీల్ (Richard Steele). ఇది నిజమే ననిపిస్తుంది.

"నలభై ఆరుకి వార్ధక్యం ఆరంభం" అని సిసిరొ (Cicero). విజ్ఞాన శాస్త్రం ప్రబలి, వైద్య శాస్త్ర సానుకూలంచేసిన చిటకాలతో ఆరోగ్యం, ఆయువు ప్రమాణం పెరిగిన ఈనాడు - ఇది ఒప్పుకోం. ఉద్యోగం నుండి విరమించే వయస్సు యాభై ఎనిమిది, దీన్ని అరవై దాకా పెంచాలని కోరుతున్నారు చాలా మంది. రిటైరై కూడా మళ్ళీ ఏదో వృత్తో వ్యాపకమో కావాలనే ఉబలాటపడే ఉద్యోగులు ఎందరో ఉన్నారు అసలు అరవై దాటాక కాని, మన సమాజంలో గౌరవం, పరపతి లభించవు. రాజకీయాలకి అనువైన వయస్సు అరవై.

సన్మాన సభలకి అరవై దాటిం తర్వాతే యత్నాలు నడివయస్కుడు పొగడ్త, కీర్తి కోరినా, నిజంగా వాటిని యెదుర్కుంటే తట్టుకోలేడేమో.

"చివరి దశలో సిగ్గు, దుఃఖం బాధించవు" అని జాన్‌సన్ (Johnson).

మరో ప్రయోజనం కూడా వుంది ఈ ముసలాడు ఎవడికి అడ్డుతగలడు; ఎవరితోనూ పోటీ పడడు—కాసేపు పొగిడినా నష్టం లేదు. పట్టండి పొగుడుదాం. అనుకునే; సన్మానానికి నడుం కడతారు కార్యకర్తలు.

"వృద్ధుడు పొందే ఆదరానికి ఎవరూ అసూయపడరు," అని ఎమర్సన్ (Emerson).

వృద్ధుడికి మమకారం, స్వార్థం తగ్గి, నిష్కామిగా తయారవాలన్నది, ఆధ్యాత్మిక ఆదర్శం కావచ్చు. కాని అల్లా తయారవుతారన్నది మాత్రం కల్ల.

"ముసలాళ్ళకి తమకేం కావాలో తెలుసు. కుర్రకారుకి తెలీదు" అని పెర్సాల్ స్మిత్ (Pearsall Smith). ఈ రచయితదే మరో నిర్వచనం వుంది.

"సమ వయస్కులై, కలిసి వృద్ధులయ్యేవారు, కాస్త పరిచయంలో ఆప్త మిత్రులవుతారు" అని. నిజమేమో నే నింకా చెప్పలేను కాని, ఆ యిద్దరిలో ఒకరికి మాత్రం సన్మానం జరిగితే, వారికింక నిజమైన అన్యోన్యం, స్నేహం సాధ్యమా? "నన్ను మెచ్చుకోలేదని కాదురా నా ఏడుపు — వాణ్ని - మనవాణ్ని మెచ్చుగుంటారనే నా ఏడుపు" అని భమిటిపాటి కామేశ్వరరావు పాత్ర. ఇది కేవలం ఆంధ్రులకే వర్తిస్తుందనుకోకూడదు. మానవత్వానికి సంబంధించిన ప్రపంచ సత్యాలలో ఇదొకటి. "పరిపాలనా భారం నలభై లోపలివారే వహిస్తే, ప్రపంచం బాగుంటుంది" అని సి. ఇ. ఎమ్. జోడ్ (C. E. M. Joad).

"మనకి సంభవించేవి రెండు రకాల ఆపత్తులు. ఒకటి మనకి పట్టిన దురదృష్టం" అని ఫ్రెంచి తత్వజ్ఞుడు లా బ్రుయరీ (La Bruvere),

"పోస్టాఫీసు ఎక్కడుందో చెప్పలేని దద్దమ్మ, ముసలాడనగానే ఏది వాగినా చెవులు నిక్కబొడుచుకుని వినడానికి వొందలాది ప్రజలు పోగవుతారు" అన్న ఎఫ్. పి డన్ (F. P Dunne) వాక్యంలో ఎంతో కసి వుంది. తన సమకాలికుడైన మరో వ్యక్తి లోకంలో పైకి రావడం మనసులో పెట్టుగున్నాడా అనిపిస్తుంది. లేకపోతే ఆ నిర్వచనానికి అంత పదునైన ముల్లు పెట్టడు.

"మరో తోటి నటుడికి సన్మానం జరుగుతుంటె, ఇతర నటులు అభినందనలు తెలియిజేసి ఆహ్లాదం వ్యక్తపరిచినప్పుడు గొప్ప నటన చూస్తాం" ఇదెక్కడిదో జ్ఞాపకం లేదు గాని, సత్యంతో కూడుకొని, నవ్వించే నిర్వచనం.

ఇంతకీ వార్థక్యం ఎప్పుడొస్తుందో చెప్పలేం.

"ఇప్పుడు నా వయస్సుకంటె పది హేనేళ్ళు దూరంగా వుంది వార్ధక్యం." అని బారూచ్ (Baruche). ఏడు, ఎనిమిది, పదీ కాదు — బాగా పదిహేనేళ్ళ దూరం? దీని ప్రకారం, నాబోటి నడివయస్కుల దృష్టిలో, యాభై అయిదు దాటినవారంతా వృద్ధులే, షష్టిపూర్తి జరుపుకున్నవారి దృష్టిలో, డెబ్భైఅయిదు దాటిన వారంతా వృద్ధులే. నే నెరిగున్న ఒక కవికి, ముప్పై దాటడానికి మూడేళ్లు నలభై దాటడానికి నాలుగేళ్ళు, యాభై దాటడానికి ఐదేళ్ళు, అరవై దాటడానికి ఆరేళ్ళు పట్టిందని ఆయన స్నేహితుల ఛలోక్తి. "కొన్నేళ్ళుగా ముప్పై దాటని వాళ్ళు పట్నాలలో వొందలాదిగా వున్నారు." అన్నాడు ఆస్కార్ వైల్డు (Oscar Wilde) "నలభై యువకుడి వార్ధక్యం; యాభై మునిలాడి యవ్వనం" అని విక్టర్ హ్యూగో (Victor Hugo) ఎవరిమట్టుకు వారికి వార్ధక్యం వొచ్చిందన్న జిజ్ఞాస లేకపోవడం ఒక సుగుణం. ఒక్క సంఘటన, ఒక్క అనుభవం, మునిలాణ్ని చేసేస్తుంది అనుకున్నా, ఆ అనుభవం వెనక బోలెడు చరిత్ర వుండి తీరుతుంది. గామాలు (Gama), జిబ్‌స్కోలు (Zybsco), సాండోలు (Eugene - Sandow), ఒక్క అనుభవంతో వాడిలి కుంగిపోతారా?

"ఒక్కక్షణంలో వార్ధక్యం ఒచ్చేస్తుంది — ఎప్పటినుండో సిద్ధపడుతూ" అన్న అంద్రెమార్వా (Andre Maurois) నిర్వచనం నిజంలా తోస్తుంది.

"మన చాదస్తాన్ని నలుగురూ భరించి, సానుభూతి కనబరచి గౌరవిస్తారు" — అన్నది ఒక్కటేకాదు వృద్ధుల తృప్తికి కారణం. వార్ధక్యంపట్ల నలుగురూ చూపే ఆదరణ గౌరవం, కాస్త కృత్రిమంతో కూడుకున్నది — పూర్తిగా సహజమైనది కాదు అనుకున్నా, ఈ ఆమోదంలో వృద్ధుడికి ఆనందం ఉండితీరుతుంది. పెద్దలు మెట్లెక్కేటప్పుడు పక్కనున్న పిన్నలు చేయూతనిస్తే నిరసించటం లేకపోలేదు. తీరా చెయ్యి అందించకపోతే 'బొత్తిగా పట్టదేం నా గొడవ' అని చీదరించు కొనడమూ ఉంది. ఈ రకం ఆదరణకంటే, వార్ధక్యానికి మరికొన్ని సంతోషాన్నిచ్చే మెరుగులున్నాయి. కొత్తవాటిని ఆశించకపోవడం — ఆశించడంవల్ల కలిగే అసంతృప్తి వారికుండవు తోటివారైన వృద్ధులు, తమకంటె యెక్కువ ప్రశాంతతని పొందుతున్నారన్న అసూయతప్ప. అనుభవం అయితేగాని, నే నీవిషయం చెప్పలేను

"అహంనుండి విముక్తుడవటం వృద్ధులకే సాధ్యమౌతుంది. అసూయ ద్వేషం, పగ — వారికుండవు. ఇదొక గొప్ప సుగుణం" అని సామర్‌సెట్‌మామ్ (Somerset Maugham) "ఆరోగ్యవంతుడైన జ్ఞానంగల వృద్ధుడుకంటే కళైన ప్రాణి మరొకటిలేదు" అని లిన్ యుటాంగ్ (Lin Yutang) "జీవితం

చివరలో చిమ్మే సంధ్య చీకటితోపాటు, దీపంకూడా తెచ్చుకుంటుంది" జూబెర్ట్ (Joubert). "మతిమరుపు, పిన్నలలో ఉంటే యెవరూ గమనించరు, మందలించరు. ముసిలాడు పొడుండబ్బీ మరిచిపోతే 'అయిపోయింది ముసలాడివని' అని నలుగురూ వాపోతారు" జాన్సన్ (Johnson) వార్ధక్యంలో తామెల్లాఉన్నా, ముస్తాబైనా, వారికికాని, ఇతరులకు కాని పట్టదు.

"పెద్దయింతర్వాత పంట్లాం పైకి మడిచి తొడుక్కుంటాను" అని టి. ఎస్. ఎలియట్ (T. S. Eliot).

యువకులు, వృద్ధులపట్ల కాస్త హేళన, పరిహాసం కనబర్చటం ఉంది. వృద్ధులుకూడా, పిన్నలపట్ల అంతకంటె పదిరెట్లు హేళన, పరిహాసం చూపడం కూడా ఉంది. పెద్దలు నదులు, అడవులు దాటారు; లోయలు, శిఖరాలు దిగవిడిచారు. అవన్నీ చెయ్యవలసిన పిన్నలనుచూసి "ముందుందులే ముసళ్ళ పండుగ" అని జాలి ప్రకటించడం ఆక్షేపణీయంకాదు. అవన్నీ దాటేశాను కాబట్టే హెచ్చరించి, మందలించి, సలహాయిచ్చి విసిగించే హక్కు వారికుంది.

"వార్ధక్యం, వివాహం అంతాకోరతారు; తీరా పొందాక అంతా విచారిస్తారు" అని ఫుల్లర్ (Fuller).

"మనం ముసిలాళ్ళం అవడంలో విషాదంలేదు. ఇంకా యువకులుగా ఉండడానికి చేసే యత్నంలో ఉంది విషాదం." అని ఆస్కార్ వైల్డు (Oscar Wilde).

"తోకచుక్కలు, వృద్ధులు గౌరవింపబడతారు. ఇద్దరికీ తెల్లగడ్డాలుంటాయి : ఇద్దరూ భవిష్యత్తు చెబుతారు" అని జనతన్‌స్విఫ్ట్ (Jonathan Swift),

అంతా ఒకేమార్గాన వార్ధక్యం చేరుకోరేమో కొందరు, నదీప్రవాహంపైన తేలిపోతారు; మరికొందరు లోయలగుండా వెడతారు

"మరొకరు వెళ్ళినమార్గంద్వారా వార్ధక్యం చేరలేము." అన్నాడు మార్క్ ట్వెయిన్ (Mark Twain) కచ్చితంగా అందుకనే, అరవయ్యో పడిలోపడిన వ్యక్తులు తిరిగి ప్రేమించి వివాహం చేసుకుంటే, పిన్నలు ఆక్షేపించనక్కరలేదు. విలియంబ్లేక్ (William Blake) అన్నట్లు, కాలాన్ని కామించేది అనంతం అయినప్పుడు, వార్ధక్యాన్ని స్నేహం ఎందుకు కామించకూడదు? వృద్ధుడు ఏకాకి; ఏకాంతజీవి – అతనికే స్నేహం, ఆదరణ ఎక్కువ కావాలి. ఫ్రెంచి నవలా రచయిత స్టెండాల్ (Stendhal). తన డైరీలో "ఇవాళకి యాభై

సంవత్సరాలు పూర్తయినాయి" అని వ్రాసుకుని, తాను ప్రేమించిన స్త్రీల జాబితా పొందుపరిచాడట. "ప్రేమించలేకపోవడం ఒక్కటే వృద్ధుడి విషాదం." అని కిర్కిగార్డు (Kilrke gard). వార్థక్యం ప్రేమలో భగ్నహృదయాలుండవు-సాఫీగా ఒడిదుడుకు లేకుండా ప్రవహించే పిల్లకాలవగట్టున సన్నగా ఎదిగి, ఎండలో మెరిసేగడ్డిని తాకకుండా ప్రవహిస్తుంది. అడుగు కనిపిస్తుంది. ఆ ప్రవాహంలో – అడుగునున్న బంగారు రంగు ఇసుక, ఎర్రరాళ్ళు – పెద్ద చెట్లక్రింద నీడలో మేఘాల బింబాలు కదులుతాయి. జరిగిన ఒకగాథ. ఎఫీలె వయసు ఎనభై; సంసారం, పిల్లలు, అన్నీ ఒదిలేసి అతనితో ఉండడానికి సిద్ధపడింది యూనిసీ. ఆమె చనిపోయింది. ఊళ్ళో నలుగురూ "ఇంకేముంది, ప్రేయసి చనిపోయింది. దీంతో ముసిలాడు మంచానపడి చస్తాడు పాపం" అని దిగులుపడ్డారు. కాని అల్లా జరుగలేదు. అతను హాయిగా నిక్షేపంలా ఉన్నాడు. వృద్ధుడికి ప్రేమ సాధ్యం కాదనుకున్న ప్రజలు, బాధమాత్రం తప్పదని ఎందుకనుకోవాలి. అందుకనే "ప్రజ అంటే వృద్ధనారి – సణుగుతారు" అన్నాడు కార్లైల్ (Carlyle). అందుకనే "మనుషులకు వయసుంటుంది కాని ప్రజకి వయస్సులేదు" అన్నాడు కృష్ణశాస్త్రి ఈ 'ప్రజ' తత్వం వార్థక్యంలో మూర్తిభవించిందనొచ్చునేమో! వృద్ధుడికి సాధ్యమయ్యే ప్రేమనిగూర్చి విలియమ్ బట్లర్ ఈట్స్ (W. B Yeats) ఒక ఖండకావ్యంలో మృదువుగా వర్ణించాడు. అందులో ఒక భాగం:-

"వృద్ధుడవైం తర్వాత,
కుంపటి పక్కన నిద్రతో అవులించినప్పుడు,
ఈ కావ్యం చదువుకో.
ఒకడు నిన్ను ప్రేమిస్తాడు,
నీలో యాత్రికుణ్ణి ప్రేమిస్తాడు;
నీ మారిపొయ్యే మొహాన్ని ప్రేమిస్తాడు.
ప్రేమ పారిపోయింది –
పారిపోయి శిఖరంపై నక్షత్రాల గుంపులో
తన మొహం దాచుకుంది."

మా నాన్నకి షష్టిపూర్తి జరిపినప్పుడు, ఒక స్నేహితుడు ఆయనకి భగవద్గీత కానుకగా యిచ్చాడు. మా నాన్న ఆయనకి కృతజ్ఞత చెప్పాడు కాని, ఆయన వెళ్ళాక "భగవద్గీత యేం చేసుకోనురా – అందులో యేముందో యెరుగుదుం – దేన్ని గురించి యెక్కువగా పట్టించుకోకు – శరీర సుఖం

శాశ్వతం కాదు. విడిచిపెట్టు; ఫలం కోరకుండా నీ కర్మ నువ్వు చెయ్యి అని చెబుతుంది. గీత ఆచరణలో పెట్టాలిగాని, చదువుకునేటందుకా! ఆచరణలో పెట్టగలిగితే నాకి షష్టిపూర్తి ఎందుకు అసలు?" అన్నారు. ఇంచుమించు ఈ భావమే వ్యక్తపరుస్తూ, ఆల్డస్ హక్స్లీ (Aldous Huxley) చేసిన నిర్వచనం పొందుపరుస్తాను. "వార్థక్యంలో చింతని, అధ్యాత్మికతత్వం బావలేదు. తత్వ బోధని ఆచరణలో పెట్టడానికి మనోనిశ్చయం, పట్టుదల కావాలి అవి ముసలి తనంలో శరీరంతోపాటు సన్నగిల్లుతాయి. ఆధ్యాత్మిక చింతన బలవంతులకి, శక్తివంతులకి సాధ్యం." కొన్నేళ్ళుగా హక్స్లే హిందూ సిద్ధాంతాలు, వేదాంత పరన తీవ్రంగా కొనసాగిస్తున్నాడు. ఉపనిషత్తుల సారాన్ని జీర్ణించుకున్నాడు. ఆధ్యాత్మిక జీవితంగూర్చి గ్రంథాలు వ్రాశాడు. ఇటీవల ఆయన గృహం ప్రమాదవశాత్తు తగులబడింది. ఎన్నాళ్ళుగానో ఆయన పోగుచేసిన గ్రంథాలు, విలువైన వస్తువులు అందులో దగ్ధమైనాయి. ఆ దృశ్యంజూసి, అసహాయుడై కళ్ళమ్మట నీళ్ళు కార్చాడన్న ఉదంతం తెలుసుకుంటే, ఈ నిర్వచనాలలో కొత్త విలువ పొడచూపకపోదు. వార్థక్యం గురించి హక్స్లీవి* మరొక పరిశీలన;

"వార్ధక్యాన్ని మూడు విధాలుగా ఎదుర్కొంటున్నారు ఈనాడు ఒకటి ఆదునిక వైద్యశాస్త్ర పరికరాలను వినియోగించి, వార్ధక్యం లక్షణాల తీవ్రతని తగ్గించడం; దూరంగా ఉంచడం; రెండోది మానసికం. చేష్టలో, రూపంలో, ఆలోచనలో, యువకుడుగా కనబడాలన్న కృషి. మూడోది, మతం, తద్వారా ఓర్పు పొందడం. చివరిది శక్తి లేనివారికి సాధ్యంకాదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన నాగరీక దేశాలలో, ఎవ్వరికీ రుచించదు." ఈ చివరి నిర్వచనం సారాంశం, ఇంచుమించు మా నాన్నగారు షష్టిపూర్తినాడు నాతో చెప్పిందే. కాబట్టి హక్స్లీ సూచించిన చిట్కా ఏమిటి? "ఆదరించి, స్నేహంచేసి, ప్రేమించేవారు దొరికి ఆ స్నేహం ద్వారా ప్రేమ పొందగలిగినవారు ధన్య జీవులు. నుశినుండి మంట వెలిగినట్లు, శక్తులుడిగిన శరీరంనుండి, ప్రేమ సన్నటి జ్వాలగా, అతీతమై ప్రకాశిస్తుంది. కాబట్టి ఒకర్నొకరు దగా చేసుకోకుండా, సన్నిహితులమై మసలుకొందాం" శక్తులుడగడం నలభైనుండి ప్రారంభమవు తుందనుకోవచ్చు.

---

* హక్స్లీ 1963 లో చనిపొయ్యాడు హక్స్లీ భావాలు తెలుసుకోదల్చిన వారు, నా వ్యాసాల సంపుటిలో చేర్చిన 'హక్స్లీ' అనే వ్యాసం చూడొచ్చు

"నెరసిన వెంట్రుకలు యెప్పుడు నల్లబడడం ప్రారంభిస్తుందో అప్పుడు నడివయస్సు ప్రారంభమైందనొచ్చు" ఎవరన్నారో తెలీదుగాని, ఇందులో కొంత నిజంవుంది. నలభై నుండి వెంట్రుకలు నెరవడం మొదలెడుతుంది. అంతకుముందు నెరిసినా పట్టించుకోం నలభై తర్వాత పట్టించుగుంటాం. ఏదో చేస్తాం అవి నల్లబడటం ప్రారంభిస్తుంది. అది నడివయస్సు ఫిలిం దర్శకుడు అలెగ్జాండరు కోర్డా (Alexander Korda) అరవయ్యో ఏట వొకమారు జర్మనీ వెళ్ళాడుట. అక్కడ సినిమా ఆఫీసులో పనిచేస్తున్న వొకామె కోర్డా వెళ్ళిపోతూన్నప్పుడు "మీరు ప్రతి నెలా వొస్తూండాలి" అందిట "పదేళ్ళ క్రితం అయితే, ప్రతిరోజూ వొస్తూండాలి అని అందువుకదా!" అన్నాడుట. వార్ధక్యం తిరుగుడు మేడమెట్లమీద దిగుతున్న విషయం కోర్డాకి తెలుసు

పెద్దతనం పైబడిన స్త్రీలను గురించి కొన్ని ఛలోక్తులున్నాయి. పాతికేళ్ళకే ఐదారుగురు సంతానం కని, పెద్దలుగా కనిపించే స్త్రీల విషయం వొదిలేద్దాం వయస్సుని గురించిన జిజ్ఞాస, తాపత్రయం. పురుషులకంటె స్త్రీలకి హెచ్చు దీనికి కారణం లేకపోలేదు మన పూర్వీకుల దృష్టిలో వయస్సుతో బాటు, పురుషుడికి అనుభవం, జ్ఞానం పెరుగుతాయి. స్త్రీలకు ఈ దృష్టితో విలువ కట్టే సంప్రదాయం లేదు మాతృత్వం సాధించడంతో వారి ప్రయోజనం పూర్తి. ఆధునికులు స్త్రీ పురుషులిరువురినీ, విజ్ఞానం దృష్ట్యా సమానులుగా పరిగణిస్తారు కాబట్టి —

"స్త్రీ నరకానికెళ్ళడం అంటే ముసలిదవడం" అని నినాన్ డి లెక్లాస్ (Ninon de Leclos).

"అనుభవం బట్టి పురుషుడి వయస్సు, చూపులనిబట్టి స్త్రీ వయస్సు నిర్ణయించవొచ్చు" అని మార్టిమర్ కాలిన్స్ (Mortimer Collins).

"ఒకప్పుడు ఆమె చాలా అందంగా వుండేది — అంటే ఆమె సంతోషించి గర్వపడదు; బాధపడుతుంది" శరత్.

"అయ్యో, ముందు చచ్చిపోతానే అని మొగాడు, అంత వెనక యెందుకు పుట్టానా — అని ఆడదీ యేడుస్తారు" అని అమెరికా దేశ విమర్శకుడు మెన్‌కెన్ (Mencken).

"ఆమె పుట్టిన రోజు గుర్తుంచుకో, వయస్సు మర్చిపో" (అనామకుడు).

"ఆవిడకి నలభై ఆరు అనుకోడం కంటె, ఆవిడకి జరిగే మరో ఉపద్రవం వుండదు" అని పినెరో (Arthur Pinero).

బాల్యం, యవ్వనం, నడివయస్సు ఈ దశలన్నీ ఒక్కొక్కటే గతించి

నప్పుడు మానవుడు శోకించినట్లు, ప్రాణి జీవితం విడిచేసి, మృత్యువు అనే దశ పొందినప్పుడు గూడా శోకించదు — అంటుంది భగవద్గీత.

"దేహినోస్మిన్ యథాదేహే
కౌమారం యౌవనం జరా,
తథాదేహాంతర ప్రాప్తి
ర్ధీర స్తత్ర నముహ్యతి."

అని సాంఖ్య యోగం, ఒక అవస్థ పోయి, మరో అవస్థ కలిగేటప్పుడు ఆత్మస్థిరుడను జ్ఞానముండుటచేత ఆత్మ నశించిందన్న శోకం ఎట్లా చెందదో, అట్లే ఒక దేహం నుండి మరో దేహానికి చెందేప్పుడు, దుఃఖింపడు - అని రామానుజుని వ్యాఖ్యానం

ఇందులో రెండు ఇబ్బందులున్నాయి. 'ఆత్మ స్థిరుడు' — అన్న జ్ఞానం ఎందరికుంటుంది? అల్లా వున్నవాడు మాత్రం యౌవనం గతించిందే - అని శోకించడా? శోకించడం అంటె భోరున కుసిళ్ళి కుసిళ్ళి ఏడుస్తాడని కాదు నా తాత్పర్యం. బాల్యం, యౌవనం, అందమైన దశలు; అందమైన సమయం. అవన్నీ పోతాయని తెలుసుండీ కూడా, దుఃఖించని వ్యక్తి వుంటాడా? కొలనులో చందమామ వంకర బింబం, వికసించిన గులాబి పువ్వు, కరగిపొయ్యే సంధ్యాదేవి సిగ్గు సరసం, నడివేసంగిలో వాన తుంపర — దూరంగా ఆలయములో సన్నాయి వాద్యం, నిద్ర నుండి లేచి ఆవులించిన కన్యనేత్రాలలో అమాయకమైన మెఱుపు — ఇవన్నీ కాసేపే. క్షణికాలనుకుని వాటిని కాంక్షించడం, ఆనందించడం విరమిస్తున్నామా? యౌవనంలో వెలుగు, శక్తి, ఆనందం త్వరితంగా పోతున్నాయనే అసలు కవుల గొడవ.

"ఇది పగిలిపోవునను భయమ్మింత వఱకు
ఈ తలంపున, నిపుడాత్మకింత శాంతి;
విరిగిపోయిన చెక్కల దరికిచేర్చి
నీ చితికి కాష్ఠములుగ మన్నించెదవని!"

అని నాయని సుబ్బారావు.

ఇంచు మించు వర్డ్సువర్త్ (Wordsworth) కవితంతా ఈ బాధతో కూడుకున్నదే; దీనిమీద ఓమర్ ఖయ్యామ్ (Omarkhayyam) ఒక సిద్ధాంతం లేవనెత్తాడు. యవ్వనం గతించినప్పుడు, నడివయస్సు వీడ్కోలిచ్చినప్పుడు, మానవుడు కన్నీరు కార్చడం మరచిపోతే, మనకి మహా కావ్యాలుండవు.

"కాంచు చుండగ నాకస్మికంబుగాగ
నెట్టిపాటుననో మణిమెకాని
చిగురు నశించె బూవులు చిందిపోయె,
జిన్న కోకిల యంతలో జిన్నవోయె,
దుమ్మెదకు కూడ నేమియు దోచదాయె,
విషమ విశ్వంబునకు నిది వింత పనియె!"

అని వేంకట పార్వతీశ్వర కవులు వాపోయ్యారు. కోర్కెల నుండి జనించిన జీవిత మాధుర్యం ఎరగని ప్రాణికి ముక్తి సాధించే అర్హత దేనికో;

"వలపు తీపి యెరుగని వట్టిరాతి
గుండె లోకమ్ము నిప్పులు గురియనిమ్మ,
హృదయ మున్నంతవరకు, నా ప్రేమకాంక్ష
బ్రతికి యున్నంత వరకేడ్చి, బ్రదుకుచుందు!"

అదొక్కటి వుండి, ఇంకేమీ లేకపోయినా యేడుస్తూ బ్రతుకుతాను - చావను. అని వేదుల గీతికలో ధ్వని మృత్యువుకి భయపడక సమాధానపడి సిద్ధపడటం మటుకే కాదు మానవుడు సాధించే తాత్విక దృష్టి. నిండుగా, అందంగా, ఉజ్వలంగా అన్ని దశలనూ సమ దృష్టితో అనుభవించడం నేర్చుకోగలగాలి,

"జాగ్రత్త! జాగ్రత్త! మాయ జగత్తని
శాస్త్రములెల్లను విప్పెదవు;
భాగ్య భోగము చంచల మంచును
బైరాగి ధర్మము, జెప్పెదవు;
ఎవ్వారు వింటురీ పిచ్చిబోధనము
లీ మధుమాస నిశీథమున
ద్రాక్ష రసాయన పాత్రిక పెదవుల
దవుల దలంతురే చేదనుచు?"

అని రామిరెడ్డి హెచ్చరిక. అన్నీ చూశాకా మృత్యువు రాగానే 'నేను సిద్ధం' అనడం సుఖవేమో!

లాగ్నే (Lagne) అనే గణిత శాస్త్రజ్ఞుడు పదునెనిమిదవ శతాబ్దివాడు— గణిత శాస్త్రంలో, స్క్వేర్, క్యూబ్, రూట్లు తెలుసుకునే పద్ధతి కనుక్కున్న ప్రజ్ఞాశాలి. వార్థక్యంలో జబ్బుచేసి మంచాన పడ్డాడు. తుది ఘడియలు సమీపించాయి. ఎవ్వరు పలకరించినా మాట్లాడ్డం లేదట. స్పృహ పోయింది. చూపు మాత్రం వుంది. ఒక స్నేహితుడు అతని మంచం దగ్గరకెళ్ళి — "నూటనలభై నాలుగుకి, స్క్వేర్ రూట్ ఎంత?" అని అడిగాడట. "పన్నెండు" అని సమాధానం ఇచ్చాడు. అవే అతని చివరి మాటలు.

గీత చెప్పిన నిశ్చల మనస్సు, స్థిరత్వం, సాధించిన ధన్యజీవి.

# మొదటి మాటలు

పువ్వు పుట్టగానే పరిమళించవచ్చు గాని, గొప్పవాళ్లు పుట్టగానే వారి గొప్పదనం గుబాళిస్తుందా?

గొప్పవాళ్ళు పుట్టగానే మాట్లాడగలిగితే ఏం మాట్లాడి వుంటారో, అలాగే వాళ్ళు చనిపోయే క్షణంలో ఏం మాట్లాడి వుంటారో ఊహించి వ్రాయడం ఒక సారస్వత క్రీడ. ఈ క్రీడలో విశేషమేమిటంటే, ఒక్క వాక్యంలో ఆ ప్రముఖుల జీవితంలోని విశేషమంతా వ్యక్తం కావాలి.

తెలుగు రచయితలలో ప్రసిద్ధులైన కొందరి మొదటి మాటలను ఊహించి వ్రాసిన వాటిని ఈ చిన్న వ్యాసంలో పొందుపరుస్తున్నాను. ఈ విధంగానే ప్రముఖుల చివరి మాటలు కూడా ఊహించి వ్రాయొచ్చు.

ఉదాహరణకి:

కందుకూరి వీరేశలింగం: "ఒక్క వెధవని వుండనివ్వను -స్వర్గంలో."

గిడుగు రామమూర్తి: "నేను మరణించుచుంటినని ఏ ప్రజయున్ దలంప నవసరంబు లేదు - అని అనను నే చస్తున్నా. దగ్గరగా రా, చెవులో చెప్పు - పైన అరసున్నలుంటాయా?"

గురజాడ: డామిట్, కథ అడ్డంగా తిరిగింది.

వేమన: మనరవేమా,

ఉన్నవ లక్ష్మీనారాయణ : అక్కడ 'బ్రాహ్మణ అగ్రహారం' వ్రాయాలి.

కాళిదాసు : మేఘాలమీదనే మనం వెళ్ళడం?

రామిరెడ్డి : 'చిమ్మ చీకటి నొంటి జిక్కు కొనియంటి!'

నండూరి సుబ్బారావు : ఆరిపేయవె దీపము.

బాపిరాజు : పోవోయి సిన్నవాడా.

సజీవులైన వ్యక్తుల చివరి మాటలు మన సంప్రదాయం హర్షించదు గావున ఈ శీర్షికలో మొదటి మాటలు మాత్రం ఉంచాను

ఇక కొందరి మొదటిమాటలు. రాయప్రోలు సుబ్బారావు: "అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ." (పుట్టగానే ఆయన ఏడుపు )

దీనికాధారం :

"ఏ ప్రపుల్ల పుష్పంబుల నీశ్వరునకు – పూజసల్పితినో ఇందు పుట్టినాడ – కలదయేని పునర్జన్మ కలుగుగాక – మధుర మధురంబయిన తెన్గు మాతృభాష"

విశ్వనాథ సత్యనారాయణ : (మంత్రసానిని సంబోధిస్తూ.)

"ఓహో కిన్నెరసాని!"

(జననం శీతాకాలంలో అయితే)

"హా హా హూ హూ"

మునిమాణిక్యం . "మనం ఇంకా ఇరవయేళ్ళదాకా చీర కొనక్కర్లేదు – కాంతానికి."

చలం · (మంత్రసానితో) పో, లేచి పో, డాక్టర్‌తో.

మొక్కపాటి : "బార్ – బార్ – బార్" (అని ఏడుపు) మూలం. బారిష్టర్ పార్వతీశం

నండూరి సుబ్బారావు : "ఎనక జల్మములో ఎవరమో"

ఉన్నవ లక్ష్మీనారాయణ : (చుట్టూచూసి, "ఏమిటీ మాలపల్లి?"

భమిడిపాటి కామేశ్వరరావు : "ఎప్పుడూ ఇంతే"

కృష్ణశాస్త్రి : "వెక్కి వెక్కి రోదింతునువిసువులేక – ఏడ్వలేక ఏడ్వలేక ఏడ్చుచుంటి."

# టైపురైటరు కొట్టిన గాయం

నేను చెప్పదల్చుకున్న విషయానికి ఒక పేరు పెడదామనుకున్నా – "టైపు రైటర్ కట్టిన గేయం" అని. ప్రథమంలోనే మూడు టైపు దురంతాలు దొర్లినందుకు క్షమాపణ కోరుతున్నాను. 'ట' బదులు 'ర' పడింది. 'కట్టిన' – అనగా 'నిర్మించిన' అనే అర్ధంలో వాడిన పదంలో 'క' బదులు 'కొ' ప్రత్యక్ష మైంది. 'గేయం' లో 'గే' పోయి, 'గా' అవతరించింది.

నాకు యంత్రాలంటే భయం – సాధారణంగా వాటి జోలికిపోను. ఈ దఫా ఒక మిత్రుడు మళ్ళా సాయంత్రం బండిలో తీసుకెడతానని తన తెలుగు టైపు రైటరు యంత్రాన్ని ఇంట్లో దిగవిడిచి వెళ్ళాడు. ఇదెల్లా పనిచేస్తుందో చూద్దామన్న కుతూహలం చంపుకోలేక గద్యలో ఒక బుల్లికావ్యం ముందుగా వ్రాయకుండా, తిన్నగా కాగితంపైన టైపు చేద్దామన్న ఉబలాటంతో ఉపక్ర మించాక పొందిన ఫలితాన్ని ఇప్పుడు చెప్పేసుకుంటున్నాను.

ఇంగ్లండులో నవలాకారులు, రోజుకి నలభై పేజీలు తిన్నగా కాగితం పైననే టైపు చేసుకుపోతూ, మూడు వారాలలో నవల ముగించివెయ్యగలరుట! టైపురైటరుని గూర్చి ఒక ప్రముఖ శాస్త్రజ్ఞుడు చెప్పిన మాటలు ఈ సందర్భంలో ఉదహరించకుండా ఉండలేను. ఒక వందకోతులు, డజను టైపురైటర్లపైన, తమిష్టం వొచ్చినట్లు అక్షరాలని వెయ్యి సంవత్సరాలు నొక్కుకుంటూపోతే, చివరికి ఒక షేక్స్పియర్ నాటకం టైపయ్యే అవకాశం లేకపోలేదుట. తమ పూర్వీకులు కొందరు రామాయణంలో పాల్గొన్నవారవడంవల్ల, తెలుగు టైపు రైటరుపై అక్షరాలు నొక్కుతూపోతే, మన దేశంలో కోతులు, వెయ్యి సంవత్స రాలకంటే ముందుగానే తెలుగు రామాయణంలో ఒక కాండైనా కూర్చే పరిస్థితి ఉందనుకోడంలో తప్పులేదేమో! ఇంక నా మొదటి యత్నం సాధించిన ఫలితా లేవో చూద్దాం. 'షిఫ్టు' ఉండగా.

"౯౮౭౬౫౪౩౨౧ : -" అన్న అంకెలు, గుర్తులు, షిఫ్ట్ లేకుండా "అ ఆ ఇ ఈ ఉ 'ఐ ఓం (–" లుగా అవతరిస్తాయన్న తికమక నే నెరగను. 'చారుమతి'–

అన్నమాట కొట్టిచూశాను. 'కారుమతి' గా తయారైంది. 'ఎక్కడికి!' అన్నది, జలుబు చేసినట్లు 'ఎచ—డికి'గా ప్రత్యక్షమైంది.

ఇంక నా వచన కావ్యం ఎట్లా తయారైందో జాగ్రత్తగా గమనించండి.

మజ-జా-జ్జ-జ్జా-జారె-జ్జరే-జ్జారె

ట్విట్టు, ట, టకటొంకు

పొసపొస తొకతొక, ధణధణ

రశన కృత్యా దవస్థ, గుళుత్సక

అహిఫేనం.

సీలోగూంకట్టచరనాఈరూభిత్యం క్షమింపరానిది

పానువేస్తున్న పని రాజారాంకి చాలాబాధ

లాటీ, చీల, స్థాణువు

క్షుల్లకము, కామ్యచ్, క్యష్, క్యజ్

ఆచార్యక్విడ్, యహ్, జిజ్.

ఉచ్ఛన్న, ంజిబార్, నేపుల్స్

ఘూర్జర, మంజిరి, ఉండక్రియ

జన్మించియు వ్రణము లేనిదేది? ధ్రుగు.

ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ర, ధ—

రస్యా, క్షిప్రం, ఓః శాంతిః ద్రోలోకం.

ఈ వచనగేయంలో పదిహేను పదాలున్నాయి. నా మనస్సులో ఉన్న గేయం ఏమిటో భగవంతుడికి తెలియాలి. అవతల వారికి అర్థం అవకపోవడం, ఆధునికతత్వం లక్షణాలలో ఒకటి కాని పాఠకుడు, తను కల్పించిన అర్థానికీ, కవి భావానికీ పొత్తుకుదుర్చుకుంటే కాని నిద్రపోడు. అందుచేత కొందరు కవులు, వారి కావ్యానికి వారే వ్యాఖ్యానం, టీకా తాత్పర్యం, యివ్వవలసిన సంప్రదాయం గడ్డకట్టడానికి సిద్ధంగా ఉంది గనక ఈ కవిభావం ఏమిటో పసిగట్టే యత్నం చేస్తాను కావ్యానికి ఏదో అర్థం ఉండితీరాలనడం లేదు నేను. గొప్ప కావ్యాన్ని అర్థం చేసుకోకుండానే, అనుభవించే మానసికస్థితి మనలో నెలకొల్పాడు టి. ఎస్. ఎలియట్ రససిద్ధికి ప్రస్ఫుటమైన భావం అవసరం లేదని ఈ నిర్వచనంలో ధ్వని ఏదో ఒక ధ్వని, లయ, నడక; ఒక బిగి ఉండడం ముఖ్యం. ఇది మనసులో పెట్టుకుని మొదటివాక్యం చూడండి.

మజ-జ-జ్జ-జ్జరా....

వగైరా అక్షరాలన్నీ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తాయి. టైపురైటర్ ఎంతటి అద్భుతమైన యంత్రమో అనే ప్రశంసార్థకము. రెండో వాక్యంలో 'త్విట్టు' అంటే 'కాంతి' అని అర్థంవుంది, ఏకాక్షర నిఘంటువులో. ఆధునిక విజ్ఞాన శాస్త్రం వెదజల్లిన కాంతికిరణాలలో టైపురైటరు ఒకటని కాబోలు భావం. 'ట' అంటే, 'కాకి' 'ధ్వని' అని అర్థాలున్నాయి; కాకిగోల చేస్తుంవనా టైప్‌రైటర్! 'టకటొంకు' అన్నదానికి 'మోసము' అని అర్థం. 'పొసపొస' అంటే 'తొంద రగా' అని; 'తాకతాక' అంటే స్పష్టం కానిది; 'ధణధణ' అనేవి 'ధ్వని'ని సూచిస్తాయి. ఇవన్నీ టైపు కొట్టేటప్పుడు కలిగే అనుభూతి వర్ణనలనుకొంటాను.

నాలుగోపాదంలో 'రశన' అంటే; పదహారు పేటల స్త్రీల మొలనూలుట. కృత్యాదవస్థ' అంటే, కావ్య ప్రారంభంలో కవిపడే కష్టం. ఈ కష్టం పదహారు పేటల స్త్రీల మొలనూలుతో సమమైంది. కష్టాన్ని మరిచిపోడానికి, టైపు చెయ్యడం నల్లమందు లాంటిది - అహిఫేనము. ఆరో పాదంలో 'రూథిత్యం' తాలూకు భీభత్సం నాకూ బోధపడలేదు. కవి ఆ పాదంలో చెప్పినట్లు నా అజ్ఞానం క్షమింపరానిది. ఆ మాటని ఉచ్చరించి చూడండి మీకే తెలుస్తుంది. ఏడో వాక్యంలో 'పాను' ముందు 'తు' ఎగిరిపోయింది. 'తుపాను వీస్తున్నప్పుడు, పసి, రాజారాంకి చాలా బాధ' అని అర్థం. ఎవడీ పసి రాజారాం? ఏమో. ఇదొక ప్రార్థనలా ఉంది. రఘుపతిరాఘవ రాజారాం? ఎనిమిదో పాదంలో కవి కొత్త దోవ తొక్కినట్లు తోస్తుంది. ప్రకృతి భీభత్సం ప్రార్థనలనుండి, ఒక్కసారి క్షుద్ర జగత్తులోకి ఉరికినట్లుంది. లేకపోతే ఈ 'లాటి' లాటీచార్జీ లేమిటి చెప్పండి! ఏమిటో 'చీల' ట. 'చీల'కి, 'ప్రకృతి' 'కీలము' 'మేక' అని అర్థాలున్నాయిట. 'స్థాణువు' అంటే శివుడట. అనగా వాయువుచే కొట్టబడికూడా స్థిరంగా నిలిచి వుండేవాడు అంటే 'మొద్దు' అని అర్థం కూడా వుందంటోంది. నా 'విద్యార్థి కల్పతరువు.' అట్లాంటి 'మొద్దు' 'క్షుల్లకము'తో' అనగా 'నత్తగుల్ల'తో సమానమట.

'క్షుల్లకము' అనే అందమైన మాట దొరికిందన్న సంతోషంతో కవి ఉన్మాదుడై, మాతృభాషను విడిచేసి, పరదేశాల సాహితీ రంగంలో తాండవం చేస్తూ 'కామ్యచ్' 'క్యష్' 'క్యజ్' యహ్' 'ణిజ్' లాంటి లాటిన్, స్పానిష్, భాషలలోని పదాలని తన కావ్యంలోకి స్వేచ్ఛగా దొర్లించినట్లు వూహించాను మొదట్లో. కాని ఇది పొరబాటు. ఈక్యష్, కామ్యచ్, క్యజ్, ణిజ్, వగైరా గమ్మత్తు మాటలన్నీ - నాకు అదేమిటో తెలియదు గాని, - సనాద్యంత ధాతు

వృత్తులట! దీని తర్వాత "ఉచ్ఛ్రన్న" అనే ప్రచండ ధ్వని గల మాట దర్శన మిచ్చింది తీరా చేసి, షోడశ సంధులలో 'ఉచ్ఛ్రన్న' వొకటిట. కాస్తంత వోపికతో తర్వాత కూడా చదవండి. 'ంజి బార్' 'నేపుల్స్' 'ఏమిటి? "గంజి వార్చ" దానికి ప్రైవరైటరు కల్పించిన వికృతా? కాదు 'నేపుల్స్' వొక రేవు పట్నం. అల్లాగే ఆ ముందు మాట 'జాంజిబార్' - రేవు పట్నం అయినట్లు, ప్రపంచ భూగోళపటం చూశాక గ్రహించాను. 'నేపుల్స్' పట్నం చూసి మరీ మరణించమన్నారు అక్కడివారు. మనకవి, నేపుల్స్ చూశాక ఘూర్జర, మంజరి, 'ఉండ క్రియ' కాదు - గుండ క్రియ మొదలైన రాగాల విన్నాక, మరణిస్తే, స్వర్గానికి చేరుకుంటాడని తాత్పర్యం. తరువాత వాక్యం, అర్ధమవక బెంగపెట్టు కున్నాను. 'డ్డుగ్రు' ఏమిటి? ఇదేదో జర్మన్ పదజాలంలోది లాగుంది. అక్ష రాలని - ఎడమ వైపు నుంచి కుడివైపు ఫిరాయించి చూశాను. 'గ్రుడ్డు — అయింది. జన్మించియు వ్రణములేనిదేది! వ్రణమేమిటి? 'ప్రాణం' అయి వుంటుంది. ఇప్పుడు చదవండి, జన్మించియు ప్రాణము లేనిదేది? ఇది యక్ష ప్రశ్న. సమాధానం 'గ్రుడ్డు' యక్ష ప్రశ్నకి సమాధానం తెలుసుకున్నానని గర్వించి, విర్రవీగి, కవి తన్మయుడై నృత్యం సాగించాడు. ఆ నృత్యం ఎల్లా కొనసాగింది? ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ర, ధ లాంటి ధ్వనులలో సాగింది ఇవి అర్థం లేని అక్షరాలనుకుంటున్నారేమో కాదు ఇవి పంచభూత బీజాక్షరములలో అగ్ని బీజములు. కవి హృదయం నిప్పులాంటిదిగా మరి! ఇంక చివరి పాదం మరీ అగమ్యగోచరంగా వుందిస్మాండి

"రస్యా, క్షిప్రం, ఓఃశాంతిః ధోలోకం ఓం శాంతిః బాగానే వుంది. కావ్యాంతంలో కవి దీవన. కాని మొదట్లో ఆ 'రస్యా' ఏమిటి? అసలు రష్యా గొడవెందుకు రావాలి? ఇటీవల అక్కడి పాలకులు మారారు. నిజమే ధోలోకం తప్పకుండా 'అధోలోకం' అయివుంటుంది. దానికి ఇంగ్లీషు మాట (Uncon-scious) అనేది. జిజ్ఞాసారహితమైన అంతరంగంలో, అధోలోకం వుంటుంది. అందులో మానవుడి కోర్కెలు, రహస్యమైన వాంఛలు, అడివి మృగాలల్లే తిరుగాడుతూ వుంటాయి. ఈ 'రష్యా' కవి అధోలోకంలోంచి బైటపడిన వొక వింత భావన కింద జమకట్టి స్వస్తి చెప్పకుందామా? మతి చెడి, రెండు రోజులు మంచానపడ్డాను. ఆధ్యాత్మిక చింతనతో కూడుకున్న వొక మనస్తత్వం, 'క్షిప్రంగా' అంటే శీఘ్రంగా - అలవరచుకున్నాను. ఆ స్థితిలో గీత చదువు తున్నాను అందులో దొరికింది యీ 'రష్యా' ఈ శ్లోకం చిత్తగించండి.

ఆ యుత్స త్త్వ బలారోగ్య సుఖప్రీపితి వివర్ధనాః
రష్యా స్నిగ్ధాస్సిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః
ఇందులో 'రష్యా' అంటే రసయుక్తములైనవి అని అర్థం.

ఇంతకీ నే చెప్పొచ్చె ముక్క ఏమిటంటే ఆధునిక ధోరణిలో కవిత్వం చెప్పదల్చుకున్నవారు, "అయ్యో నాకు అనుభూతినిచ్చి, తన్మయతని సమకూర్చే పరికరం వొక్కటీ లేదే!" అని వాపోక, హాయిగా ఏ సైపు సంస్థలోనూ నేర్చుకోక, స్వయంగా తెలుగు సైపురైటరుమీద కావ్యాలల్లడం అలవాటు చేసుకుంటే 'క్షిప్రం'గా (తొందరగా) ధన్యులవగలరని.

# మనస్సులో మార్పులు

మనస్సు చాలా చిత్రమైంది – అని అందరం అంటూనే ఉంటాం—కాని ఆ వైచిత్రి స్వరూపం ఎట్లాంటిదో తెలుసుకోవాలని కుతూహలపడం. ఇందుకు కారణం లేకపోలేదు. మనస్సు ఎన్నెన్ని వింత వైఖరులు, వికారాలకు లోనై, అవన్నీ, ప్రవర్తనద్వారా బైటపడినప్పుడుకాని, మనం గమనించం. అల్లా బైట పడడంకూడా, మన చుట్టూవున్న వారి ప్రవర్తన ద్వారా జరిగినప్పుడే మనం పట్టించుకుంటాం. 'చూశావా, ఏంచేశాడో—చిత్రం!' అని ముక్కుమీద వేలేసుకుంటాం. 'సరోజిని అల్లాంటి మాట అంటుందని నే నెప్పుడూ అనుకోలేదు. మనస్సు చాలా చిత్రమైంది స్మా!'

ఇంక రెండో కారణం – ఎవరి మనస్సు వారు పరిశీలించుకోడం జరుగుతుంది – 'ఆత్మపరీక్ష' అనండి, మీ ఇష్టం - అల్లా పరిశీలించుకున్నప్పుడు, వారి మనస్సు, వారికి వింతగా కనపడకపోవచ్చు. ఆ పరిశీలనంతా స్మృతులు, జ్ఞాపకాలు – వీటితో జతపడుతుంది. జరిగిననాటి జ్ఞాపకాలనుండి విడదీసి, మనస్సుని పరోక్షంగా, తటస్థంగా పరిశీలించడం అందరికి సాధ్యంకాదు. అసలు, మనస్సుకి ఎంతటి శక్తి ఉందో, ఎంతదూరం వెళ్ళగలదో, మనలో చాలా మందికి తెలియదు. శరీరం ఎన్ని కష్టాలను, బాధలను భరించగలదో అనుభవం ఐతేకాని నిర్ణయించలేనట్లే, మనస్సుకి ఉన్న శక్తుల్నికూడా ఆచరణలోకి తెస్తే తప్ప నిర్ణయించలేము.

తిండిలేకుండా, ముప్పై, నలభై రోజులు శరీరం నిలబడగలుగుతుందన్నది, కొందరు నిరాహారదీక్ష పూని ఋజువుచేశారు. ఈ నిలబడ్డానికి, శరీరం వెనక మనస్సు బలంకూడా ఉందనుకోవాలి. ఫ్రాన్స్‌లో ఒక కన్య, తన పెంపుడుకుక్క, తగులడుతున్న భవనంలో చిక్కడిపోయిందని, దాన్ని రక్షించడానికి ఆ భవనంలోకి జొరబడి మరి తిరిగి రాలేదు. ఆమెకి నిప్పంటే ఎంతో భయంట. కుక్కపిల్లకోసం నిప్పులో జొరబడిందంటే – ఆ సాహసం మనస్సుకే సాధ్యమనుకోవాలి; నిప్పులోకి నడిచింది ఆమె శరీరమే అయినా నడిపించింది ఆమె మనస్సు; మనస్సులో కుక్కపిల్ల పట్ల ఉన్న అనురాగం.

కుక్కపట్ల అంతటి అనురాగం ఉండడం కూడా, మానసిక వైచిత్రే నంటాను.

మనుషుల్ని చూసినకొద్దీ, కుక్కలపట్ల నా వాత్సల్యం మెండవుతోంది అన్నాడు ఒక తత్వజ్ఞుడు. మూగప్రాణికీ, మానవహృదయానికీ ఉన్న బంధం వింతైనది, అది కేవలం ప్రాణంపై తీపివల్ల జనించిందే ననలేము. సృష్టి వైచిత్రితో ముడిపడ్డ బంధం అది

యజమాని చనిపొయ్యాక, దిగులుతో అన్నం తినక, చిక్కి శల్యమై, చనిపోయిన కుక్కల గాథలు ఎన్నో వింటాము. పుట్టింటవున్న లేగదూడని చూడ్డానికి వారంవారం ఒచ్చే ఇల్లాలిని ఎరుగుదును ఆ దూడ చనిపోగానే ఆమె రావడం మానేసింది. 'ఇంక మా ఊళ్ళో ఏముంది?' అని వాపోయింది

ఎడ్విన్ మ్యూయిర్ అనే ఆంగ్లకవి కలలో తాను చూసిన వింతదృశ్యాన్ని వర్ణించాడు. 'నిద్రపోతుంటే. నా పక్కన ఎవరో వ్యక్తి నిలబడ్డాడు. ఆయన దుస్తులపై అక్కడక్కడ రక్తపు మరకలున్నాయి. కళ్ళల్లో దైన్యం ఉంది. నన్ను లేపాడు ఇద్దరంపొలాలవెంట వెడుతున్నాము సూర్యోదయం కావస్తోంది. మా ముందు ఎన్నెన్నో అడవిజంతువులు కనబడ్డాయి. అవన్నీ సూర్యుడికి జోహారు లర్పిస్తున్నట్లు, తమ మొహాలని తూర్పు ఆకాశపు టంచులవైపు ఎత్తి, ప్రార్థిస్తున్నట్లు కనబడ్డాయి ఏనుగు తొండాన్ని పైకి లేవనెత్తింది. పక్షులు ముక్కులను ఆకాశం వైపు లేవనెత్తి కూర్చున్నాయి ఆ పొలంలో ఒక కుక్క పిల్ల నేలమీద వాసనచూస్తూ, అటూ ఇటూ పరుగు లెత్తుతూంది తన పని తను చేసుకుంటూంది. దేన్నో వెదుకుతూవుంది. నేలని వాసన చూడ్డంకూడా, ఒక ప్రార్థనలాంటి.'

'రైనర్ మెరియా రిల్కె' — అనే జర్మనీదేశపు కవి - కుక్కకీ, మనిషికీ ఉన్న మూగబంధాన్ని వ్యక్తంచేసే ఒక సంఘటన గురించి వ్రాసినది ఉదహరిస్తాను. "ఆ ఉదయం వొక నల్లకుక్క — వికృతంగా ఉంది—చూడుది— వొచ్చి నాముందు నిలబడింది. నేనూ — అదీ - ఇంకెవ్వరూ లేరు. నా ముందు నిలబడి, తల పైకెత్తి నా కళ్ళల్లోకి చూసింది, నా చూపుని వెదుకుతూ దానికి కావల్సింది, దానికేసి నేను చూడడం దాని చూపులో అంతా ఉంది - వ్యక్తికి అతీతమై అనంతంలో స్థిరంగా నిలిచిపొయ్యే వింత దైన్యం. నా కాఫీకప్పులో పంచదార వేసుకున్నాను ఆ కుక్కకి కూడా కాస్తంత పెట్టాను. ఇది చాలా సాధారణమైన వ్యవహారకాండ - ఒకరు ఇవ్వడం, మరొకరు పుచ్చుకోడం కాని ఆ వొక్క చేష్టతో మా ఇద్దరి నడుమా అన్యోన్యం ఏర్పడింది. అదొక బంధం,

ఈ లోకంలో పుట్టడం వొక అదృష్టం — తోటి వారిని స్పర్శించి, దాని ద్వారా పరమాత్మను కలవడం అదృష్టం కాదా! ఆ అదృష్టం ఆనాడు మా ఇద్దరికీ కలిగింది."

13 వ శతాబ్దిలో యూరప్‌లో 'సైంట్ ఫ్రాన్సిస్ అఫ్ అసిసి, — అనే యోగి పుంగవుడు ఉండేవాడు. బీదసాదలను, వ్యాధిగ్రస్తులనూ ఆదరిస్తూ ధైర్యంచెప్తూ ఊరూరా తిరిగేవాడు. దైవచింతన బోధించేవాడు. మనుషులేకాక జంతుజాలంకూడా ఆయనకి శిష్యులై ఆయన సందేశాన్ని శ్రద్ధాభక్తులతో వినే వారుట. జనంలేని ఆటవికస్థలంలో విహరించినప్పుడు ఆయన చుట్టూ ఎన్నో పక్షులు చేరేవిట. ఆయన ప్రార్థన సల్పుతుంటే అవన్నీ విని ఆహ్లాదంతో 'కూసేవిట,' ఎగిరేవిట. ఆయన ఉపన్యాసం ముగియగానే, ఆ పిట్టలు ఎగిరి పొయ్యేవిట.

రమణాశ్రమంలో, కుక్కలు, కోతులూ, ఉండేవి. రమణమహర్షి వాటిని బుజ్జగించి, పలకరించి, అవసరమైనప్పుడు చికిత్స జరిపేవారుట. కోతులు కలహించుకుని, ఆయన దగ్గరకొచ్చి ఫిర్యాదు చేయడం- వాటి తగాదాలను ఆయన పరిష్కారంచేసి, వాటికి రాజీ కుదిర్చి పంపించి వెయ్యడం జరిగేవి.

నేను కాస్తంత పెరిగి పెద్దవాణ్ణి అయినప్పటి నుంచీ, మా ఇంట్లో పెంపుడు కుక్కలు ఉండేవి ఒక కుక్కపిల్ల, నేపరుండే మంచం ఎక్కి తల దగ్గర, దిండుగా పరుండడం నాకు జ్ఞాపకం. కాలవలో స్నానానికి దిగి, ఈదుతూ అవతల గట్టుకి నెడితేకూడా ఈదుకుంటూ వొచ్చిన మరొక కుక్క కూడా జ్ఞాపకం.

పదేళ్ళక్రితం చనిపోయిన కుక్క, చివరి ఘడియలు స్మరించినప్పుడల్లా నా కళ్ళవెంట నీళ్ళు తిరుగుతాయి. అది నాతో ఏడేళ్ళు గడిపింది. చివరలో జబ్బు చేసింది. జంతువైద్యులకి చూపించి మందులు వేయించాం. కాని నయం కాలేదు. అల్లాగే నీరసంగా ఏదోకాస్తతిని పడుకుని ఉండేది. ఆ రోజు నేను ఆఫీసులో ఉన్నాను. ఏదో పార్టీ జరిగింది సాయంత్రం ఆ పార్టీ ఏర్పాట్లు తోటివారితో హుషారుగా, కులాసాగానే గడిపాను ఆ రోజు—పైకి నవ్వులు, కేరింతలు, కబుర్లు — కాని మనస్సులో మారుమూల ఏదో దిగులు, ముద్దలా గుండె చుట్టూపట్టినట్లు-పీడిస్తోంది. అదేమిటో ఇప్పుడు తెలిసింది — కాని ఆనాడు నేను దాన్ని గ్రహించాననలేను. మనస్సు కొన్ని పోకడలు పోతుంది — ఎవరికి వారు దాని వొత్తిడిని ఆ క్షణాన గ్రహించలేకపోవడమే వైచిత్రి-అనుకుంటాను.

ఆ సాయంత్రం ఇంటికొచ్చేసరికి, ఐదు దాటుతోంది. కుక్కపిల్ల, చిన్ని

బుట్టమంచంపై పడుకునుంటుంది. నేను గదిలోకొచ్చి, కాలిజోళ్ళు విప్పుతుండగానే, అది, ఆ మంచం దిగి, అడుగులు వెయ్యలేక, అతికష్టంమీద కుంటు కుంటూ వొచ్చి, నా పాదాల దగ్గరకొచ్చి, పాదం నాకి, నా కళ్ళల్లోకి దీనంగా చూసి, తల నా కాలి మడమ మీద ఆనించి, కన్ను మూసింది.

వీధి చివర జోళ్ళ చప్పుడునిబట్టి, ఆ వొచ్చేది ఎవరైందీ దానికి తెలుసు తెలుసుకోగానే, తన మంచం దిగి, నే కూర్చునే చోటుకి నడవడం సాగించింది. ఆ మధ్యాహ్నమే అది చనిపోయినట్లు పడివుందిట. నాకోసం, కొన ఊపిరి విడవక, ప్రాణం నిలుపుకుని, నే నొచ్చాక, నా దగ్గరకొచ్చి, స్పర్శించి, ప్రాణం విడిచేసింది. నేను, ఆ రోజు ఆఫీసులో దాన్ని గురించి ఎందుకు ఆలోచించలేదు? మనస్సు — ఒక మూల వింతగా పీకుతోంది; ఎటో పిలుస్తోంది. ఆ పిలుపు ఎందుకు వినిపించుకోలేదు? తొందరగా ఎందుకు ఇంటికి రాలేదు? మనిషి స్వార్థ పరుడు - తన సుఖం, తన శ్రేయస్సు, తన ఆనందం అంతేనా? తోటి ప్రాణి పట్ల ప్రేమ, గౌరవం, లేదా? నన్ను నేను క్షమించుకోలేను, మనస్సుకు తెలుసు,- నా మనస్సుకి. కాని దాన్ని నేను గ్రహించలేదు. మత ప్రవక్తలూ, తత్వజ్ఞులూ, పెద్దలూ, తరతరాలుగా బోధిస్తూ వొచ్చిన, ప్రథమపాఠం, దయ, కారుణ్యం, ప్రేమ అనేవి. వాటిని మనస్సు ఋజువు చేసుకుంది. ఆ కుక్క చివరి ఘడియలు ముగిసే వరకూ, నేను ఋజువు చేసుకోలేకపొయ్యాను. జీవితకాలం దహించివేసే అగ్నికణం, ఆ కుక్క కంటిలో సిటికణం — విశ్వమంతా వ్యాపించి, గోళాలని దహించగల అగ్ని - కాని కుక్క కంటిలో సిటికణం మనం చూడం; చూసినా గ్రహించం. ధర్మరాజు లాంటివారికి అది సాధ్యమేమొ. పరలోనికిపోతూ, తనతో కుక్కని అయన ఎందుకు తీసుకు వెళ్ళాడో ఇప్పుడు నాకు అర్థమౌతుంది.

స్కాట్లండ్ దేశపు రాణి, మేరి స్టూవర్ట్ తుది ఘడియలలో జరిగిన ఉదంతం తెలుసుకున్నాక, నాకు కొన్ని రోజులు నిద్ర పట్టలేదు. మనస్సు చెదిరి పోయింది. మతి పోయినట్లయింది మేరీ స్టూవర్ట్ 1542 లో జన్మించింది. స్కాట్లండ్ దేశానికి రాణిగా వుండేది. ఆ సమయంలో ఎలిజబెత్ రాణి ఇంగ్లండ్ దేశాన్ని పాలించేది. వారిద్దరికీ పడేదికాదు. మేరీ స్టూవర్ట్‌పై నేరాలు మోపి బంధించి, మరణదండన విధించింది, ఎలిజబెత్ రాణి.

1587 వ సంవత్సరం, ఫిబ్రవరి, 8 వ తేదీ ఉదయం నలభై ఐదవపేట, మేరీ స్టూవర్ట్ రాణి శిరస్సు ఛేదించారు. ఆమె జీవిత చరిత్ర, ఎందరెందరో వ్రాశారు; ఆమె తుది ఘడియల చుట్టూ ఎందరో కావ్యాలు కూర్చారు; ఎంద

రెందరో నాటకాలు వ్రాశారు. స్టీఫాన్ జ్వేగ్ అనే ఆయన వ్రాసిన గ్రంథంనుండి, ఆ చివరి ఘడియల ఉదంతం ఉదహరిస్తాను.

'ఆమె వెల్వెట్‌పై బంగారు జరీతో అంచులు పొదిగిన గౌను ధరించింది. గౌను వెనక, పొడుగాటి సిల్కు గుడ్డ వ్రేళ్ళాడుతూంది. అవి రాణులు ధరించే దుస్తులు —వెనక వ్రేళ్ళాడే సిల్కుబట్ట నేల మీద పడకుండా, పరిచారికలు ఎత్తి పట్టుకుంటారు. ఆమె శిరస్సుపై 'విగ్' (సౌరాలతో కూర్చినది) వుంచారు. ఆ ముందు, మొహాన్ని కప్పే పల్చటి మేలి ముసుగుని అమర్చారు. తెల్లటి జోళ్ళు వేసుగుంది. జల్తారు అంచులో తనే స్వయంగా కుట్టిన చేతిరుమాలును తీసుకుంది రాణి ఆ రుమాలునే ఆమె మొహం మీద కట్టివేస్తారు.'

అల్లా ముస్తాబై మారణ వేదిక వద్దకు నడిచి వెళ్ళింది మేరీ రాణి. శిరచ్ఛేదానికై అక్కడ జరిగిన ఏర్పాట్ల వర్ణన, రెండు మూడు పుటలు సాగాక, స్టీఫాన్ జ్వేగ్ ఇల్లా వ్రాశాడు.

'మృత్యువుని ప్రేమించినదానికిమల్లె, ఆమె రెండు చేతులతోనూ మారణ బండను గట్టిగా కౌగలించుకుంది. రాణి ఠీవిని చివరి వరకూ నిలబెట్టుకుంది. పదునైన గొడ్డలి వేటుతో శిరస్సుని ఛేదించే దృశ్యం భయానకంగా వుంటుంది. మొదటి గొడ్డలి వేటు, మెడ మీద పడక, శిరస్సు వెనక భాగాన్ని విడగొట్టింది. ఆమె పెదవుల నుండి అస్పష్టమైన రోదన వినబడింది రెండో వేటు మెడ మీద పడింది—రక్తం చిమ్మింది. మూడవ వేటుతో శిరస్సు, శరీరం నుండి విడిపోయి దూరంగా పడింది. ఆ తలని పైకెత్తి నలుగురికీ చూపడం తలారి పని. కింద పడిన తల, జుట్టు (విగ్) పట్టుగుని, ఆ నాటి తలారి పైకి ఎత్తబోగా, జుట్టు తన గుప్పెట్లో వుండిపోయి, తల మాత్రం క్రింద నేల మీద పడి బంతిలా దొర్లింది.'

మరో పది నిమిషాల వరకూ, ఆమె పెదవులు కదుల్తూనే వున్నాయిట. విడిపోయిన మొండెంపై బట్ట కప్పివేశారుట. పరిచారులు, ఆ శరీరాన్ని మరొక గదిలోకి తీసుకువెళ్ళేనిమిత్తం లేవదీసి మోస్తుండగా వొక వింత జరిగింది.

'ఆమె దుస్తుల కింద ఏదో కదిలింది. రాణి గౌను మడతల్లోంచి బైట పడింది, రాణి పెంపుడు కుక్క ఆ కుక్క వొళ్ళంతా రక్తంతో తడిసింది. ఆ కుక్క మొఱిగి గెంతింది. అది తొలిగిపోక రాణి తలకీ, మొండి శరీరానికీ నడుమ పరుంది. దాన్ని బలవంతంగా లాక్కెళ్ళి నీళ్ళతో కడిగారు.'

నా పెంపుడు కుక్క చివరి ఘడియలూ, మేరీ స్టూవర్ట్ రాణి పెంపుడు

కుక్క ఉదంతం చాలా రోజులు కలవరపెట్టినై నన్ను. ఈ అస్పష్టమైన వ్యధ వ్రాస్తేగాని తగ్గదని తెలుసు కథగా వ్రాయక తప్పిందికాదు. నా కథలో హత్యా నేరంపై వొకణ్ణి ఉరి తీస్తారు. ఉరికి ముందు నేరస్థుడు జైల్లో కొన్ని రోజులు గడుపుతాడు వాడికి అన్నం తెచ్చినప్పుడు జైలు తలుపులు తెరుస్తారు జనంతో పాటు, ఆ జైలు ఆవరణలో వుండే కుక్క కూడా వాడి దగ్గరకు వొస్తుంది. దానికి వొక ముద్ద పెట్టేవాడు. ఉదయం వాణ్ణి ఉరి తీస్తారు. ఆ సమయంలో ఆ కుక్క కూడా అక్కడ వుంటుంది. ఉరితీశాక వాడి శరీరం కిందకి పడిపోతూ వుండగా, ఆకుక్క పెద్దగా మొఱుగుతుంది; సూపరింటెండెంట్ అదిరిపడతాడు. రివాల్వర్‌తో ఆ కుక్కని కాల్చి చంపుతాడు. ఆ నిశ్చలమైన వాతావరణాన్ని అరుపుతో భంగం చేసినందుకు

అదీ కథ. దీని అర్థం ఏమిటో స్పష్టంగా నాకు తెలియదు. కాని అల్లా వ్రాయక తప్పిందికాదు. ఆ రచనలో యీ వ్యధ నుండి బైటపడ్డాననే అనుకుంటున్నాను.

శరీరంలోని అవయవాల ద్వారా, ఇంద్రియాల ద్వారా బైట ప్రపంచం లోని సంఘటనల సారం, లోనికి ప్రవేశించి, మనస్సుపై, వొక పల్చటి పొరగా పడుతుంది అనుభవం చిత్రం బాహ్య జగత్తు కథనంలో పాల్గొనేదీ, పాల్గొంటున్నట్లు గ్రహించేది కూడా మనసే - అంటే ఏదో చెట్టుకేసి చూస్తుంది - చెట్టుని చూసినట్లు గ్రహిస్తుంది అట్లా గ్రహిస్తున్న మనస్సుని కూడా మనస్సే గ్రహిస్తుంది. అల్లా లోలోన, ఒకదానివెనక ఒకటిగా మనస్సు తన చర్యలను గ్రహించే జిజ్ఞాస కలది కావడం మనస్సు ప్రత్యేక లక్షణం. బాల్యంలో, యవ్వనంలో, అనుభవం, ఎన్నో పొరలను మనస్సుమీద పడేస్తుంది. వయస్సు ముదిరినకొద్దీ, ఇంద్రియాల పటుత్వం తీవ్రతా తగ్గి ఈ పొరల ఒత్తిడి, సంఖ్యా తగ్గిపోతూ వుంటుంది. చివరి దశలో మనస్సు తనకు కావల్సిన పొరలను విడదీసి వాటి వెనుక మరుగుపడ్డ, ఆ అనుభవాన్ని గతంలో ఉదంతాన్ని పైకి లాగి స్మరించి మళ్ళా ఊహల్లో జీవించగలదు. ఒక్కొక్కప్పుడు నిజంగా జరిగిన గతంలోని అనుభవానికి తర్వాత ఊహించిన ఊహలో అనుభవానికీ తేడాలేకుండా పోవచ్చు. అట్లా ఏకమైపోయిన అనుభవానికి అర్థం ఆపాదిస్తే అది కవిత్వం అవొచ్చు. అర్థ శూన్యమైతే అ వ్యక్తి పిచ్చాసుపత్రిలో అంతమొందవచ్చు.

'కావల్సినప్పుడు అనుభవాన్ని స్మరించగలగడమే ప్రతిభ' అన్నాడొక సాహితీవరుడు. బాహ్య జగత్తు గమనంలో పాల్గొన్న మనస్సుకీ, తర్వాత తటస్థంగా వుండి పాల్గొంటున్నదన్న దృశ్యాన్ని తిలకించే మనస్సుకీ తేడావుంది.

పాల్గొనడంలో ఉద్రేకం వుంది – అది శారీరికం; భౌతికం. కాని తిలకించే వయస్సులో ఈ రకం ఉద్రేకం లేదు. అది కళాసృష్టితో సాక్షాత్కరించే అనుభూతికి వెన్నెముక. 'సీలు తేబోతుంటె, సీతోడె ఒట్టమ్మి - నా ఎనక ఎవరోను నడిసినట్లుంటాదె' అంటుంది 'యెంకి' పాటలలో యెంకి, ఆమె మాటలు మనం నమ్మితీరాలి 'సీతోడె ఒట్టు' అని ఒట్టేసుకుని చెప్తోంది. వెనక ఎవరో నడుస్తున్నట్లు, ఆమెలో తటస్థంగా వున్న మనస్సుకి తెలుసు; అట్లా తెలుసున్న విషయం కూడా మనస్సుకే తెలుసు. మనస్సు చూపిన ఈ రెండు అవస్థలూ ఇంద్రియాల ద్వారా జిజ్ఞాసలో తలెత్తినప్పుడు, ఆ అనుభూతిని, పైకి మాటల్లో చెప్పివెయ్యడం జరిగిందన్నమాట. తన వెనక నడుస్తున్నట్టున్నది నాయుడు బావే కావచ్చు; ఆమెకి నాయుడిపట్ల అంతటి అనురాగం వుండొచ్చు. కాని అవి ముఖ్యంకావు. తన వెనక ఎవరో నడిచినట్లు స్ఫురించడం ముఖ్యం. నాయుడు బావ కానక్కర్లేదు. 'ఎవరో' లో వున్న అస్పష్టత, అతృత, మాత్రం మనస్సుకి తెలుస్తాయి కాని, ఆ 'ఎవరో' ఎవరైందీ మనస్సు పట్టించుకోదు. అదే అందులోని వైచిత్రి. ఈ వైచిత్రే కళాసృష్టికి పునాది అనుకుంటాను. మనస్సు చేసే వింతలు మరికొన్ని వున్నాయి. అవి చాలా మందికి అనుభవమే. మనకి ముఖ్యులైనవారికీ, ఆత్మీయులకీ ఏదన్నా ఆపద సంభవించినపుడు గాని, ప్రమాదం జరిగినప్పుడుగాని – వారెంతో దూరంగా, మరోచోట వున్నప్పుడు– ఇక్కడ మనకి, మనస్సు ద్వారా ఆ విషయం స్ఫురించడం జరుగుతుంది. ఆత్మీయుడికి ఎక్కడో తలనొప్పి, జ్వరం వస్తే ఇక్కడ మనకి తలనొప్పి, జ్వరం వస్తుంది కొన్ని సందర్భాలలో ఆ ఆత్మీయుడు ఎవరో కూడా మనకి తెలియక పోవచ్చు. స్థలంతో, సమయంతో, స్థూల జగత్తులో యధార్థంతో – వీటితో ఎట్లాంటి నిమిత్తమూ లేకుండానే, కొన్ని అనుభూతులని మనసు పసిగట్టి వేస్తుంది. తత్వజ్ఞులు దీన్ని 'అతీంద్రియ జ్ఞానం' అంటారు. కాని చిత్రం – ఈ అతీంద్రియ జ్ఞానం కూడా మనిషికి ఇంద్రియాల ద్వారానే అబ్బుతుంది, శరీరంలో అవయవాలు, ఇంద్రియాలు సామంత రాజులు. కప్పం చెల్లిస్తారు. మనస్సు కప్పం స్వీకరించి పరిపాలించే చక్రవర్తి; చక్రవర్తి పైకి చెప్పే సంగతులు, స్థూలంగా 'జ్ఞానం' అనుకుంటే, పైకి చెప్పక లోలోన ఆలోచించి, తెలుసుకునే సంగతులే అతీంద్రియ జ్ఞానం

ఇది ఎక్కడ, ఎప్పుడు చదివానో నాకిప్పుడు గుర్తులేదు. కాని విషయం చాలా చిత్రమైంది. ఒక యువకుడు, వొకామెని గాఢంగా ప్రేమిస్తాడు. ఆమె అతనికి లభ్యం కాదు. ఆమె ఎక్కడో దూరప్రాంతంలో వుంటుంది. ఇతను

వ్రాసిన ఉత్తరాలకు, జవాబు కూడా వ్రాయదు. ఇతను చాలా దిగులుగా వుంటాడు. ఇల్లా వుండగా, అతని జీవితంలో కొత్త పరిణామం వొచ్చి పడుతుంది, అతను ఏకాకి అవుతాడు దిగులుగా వుంటాడు ఆ సమయాన తను ప్రేమించిన ఆమె తన దగ్గరవుంటే ఎంత బాగుండును! కోరిన వ్యక్తి మనకి దొరకడం వొక్కటే చాలదు మనం కోరినప్పుడు, మనకి దొరకడం ముఖ్యం. కళ్ళు మూసుకుని, చేతులు తలమీద ఆనించి, ఆమెవొస్తే బాగుండుననుకుని ధ్యానంలో పడతాడు. కంటిరెప్పలమీద ఏదో బరువు తగుల్తుంది. గదిలో అలజడవుతుంది కళ్ళు తెరిచి చూస్తాడు తాను కోరిన ఆమె, తన ఎదురుగా నిలబడి వుంటుంది. నిజమే. భ్రమకాదు. ఆమెను తాకుతాడు. నిజంగా ఆమె!

ఈ ఉదంతంలో కవిత్వం వుంది. హాస్యంతో మిళితమైన ఇట్లాంటి కథనే పి. జి. ఓడ్‌హౌస్ అనే ఆంగ్ల హాస్య కథకుడు వ్రాశాడు. ఈ కథలో ఒక కన్య తన ప్రియుడు తన దగ్గరికి వస్తే బాగుండు ననుకుంటుంది. అతను ఎక్కడో దూరంగా వున్నాడు. తనపట్ల ఆసక్తి చూపడం లేదు. ఆ రోజు దిగులుగా వుంటుంది. ప్రియుడు వొస్తే బాగుంటుంది. వచ్చేటట్లు చెయ్యమని దైవాన్ని ప్రార్థిస్తుంది. ఈ ఒక్క వరం ప్రసాదించమంటుంది. దైవం ఆవిడ ప్రార్థన విని, మొర ఆలించి ప్రియుణ్ని ఆమె వద్దకు పంపుతాడు. కళ్ళు తెరిచి చూడగానే ఆమె ఎదురుగా నిలబడి వుంటాడు ప్రియుడు. అవును నిజంగా అతనే; భ్రమ కాదు. సందేహానికి తావేలేదు ఆమె భక్తికి సంతసించి దైవం ఆమె ప్రియుణ్ని రెండింతలుచేసి మరీ పంపాడు ఆమె దగ్గరకి. అంత లావుగా అయ్యాడన్నమాట ప్రియుడు.

మనస్సు మరికొన్ని వింత పోకడలు పోతుంది. గదిలో టేబిల్‌ఫాన్ తిరుగుతుంటే; నడుమ వేళ్ళు పెట్టి, దాన్ని ఆపు చెయ్యాలనిపించడం. ఎందుకో తెలియదు. ఎత్తుగా వున్న మేడమీద — డాబామీదికి వెళ్ళినప్పుడు అక్కడినుంచి కిందికి దూకాలనిపిస్తుంది లేకపోతే మరెవరినైనా — మనకి గిట్టని వారిని అక్కడ నుంచి కిందికి తొయ్యాలనిపిస్తుంది. రోడ్డుమీద నడుస్తుంటే, దీప స్తంభాలని లెక్కించడం వుంది నేను మెట్లు ఎక్కేటప్పుడు, ఎన్ని మెట్లో లెక్కించుకుంటూ ఎక్కుతాను. ఎదురుగుండా కిటికీ వుంటే కిటికీ ఊచలు లెక్కపెడతాను చుట్టూవున్న వాటి సంఖ్య లెక్కించడం వింతైనది. కారణం కనబడదు

మరికొందరున్నారు. వారు మాట్లాడుతుంటే చేతి చిటికినవ్రేలు, అటూ ఇటూ కదుపుతారు. కొందరు ఉంగరంవ్రేలు కదుపుతారు. వ్రేళ్ళు కదపడం

చాలా మంది చేస్తూండడం గమనించాను నేను. కొందరు కాళ్ళు ఊగిస్తారు. నిలబడి మాట్లాడుతున్నప్పుడు కూడా, మోకాలు కదిపే వొకామెను చూశాను. లోపల ఏదో భయం, అస్పష్టమైన దుడుకు, నరాల బలహీనత — ఇవి వున్న వారు అవయవాలు ఊగించి కదుపుతారు — అని మానసిక శాస్త్ర గ్రంథాలలో వ్రాశారు. నేటి కథలలోనూ, నవలల్లోనూ చిత్రితమయ్యే వ్యక్తుంలో ఈ అలవాట్లు పోకడలు అంతగా కనబడకపోవడం ఆశ్చర్యం వేస్తుంది. పైకగుపించే ప్రవర్తన మనస్సులో జరుగుతున్న నాటకానికి చిహ్నం అనుకుంటాను నేను. వేసంగిలో క్షణంలో మబ్బులురేగి, ఆకాశంలో ఉరుములు, మెఱుపులు విజృంభించి, వర్షించినప్పుడు దుస్తులు తీసేసి గంతులెయ్యాలనిపిస్తుంది. మనస్సు ఆ సమయంలో నిజంగా నృత్యం చేస్తుంది అల్లా అనడం సాహితీ సంప్రదాయం మాత్రమే అనుకో కూడదు.

ఇవన్నీ స్వల్పమైన విషయాలు మనస్సు మరికొన్ని ప్రమాదకరమైన పోకడలు కూడా పోతుంది. యోగిపుంగవులు; తాపసులు, మహా మేధావులు, ఇల్లాంటి వాటిని అనుభవించి, ఇతరులకు చెప్పడం వుంది. ఈ అనుభవంలో ఆధ్యాత్మికానుభూతి, కళాసృష్టి రహస్యం, పరలోకానికి సంబంధించిన 'మాయ' వున్నాయనుకోవాలి.

'వర్డ్స్‌వర్త్, అనే ఆంగ్లకవి ఇట్లాంటి వింత అనుభూతి పొందాడు. దాన్ని 'ప్రెల్యూడ్' అనే ఉపోద్ఘాత కావ్యంలో వ్రాశాడు. అతను, అప్పుడు బాలుడు. శెలవలకి ఇంటికి వచ్చాడు. రోజూ సాయంత్రం, నడుచుకుంటూ వెళ్ళడం అతనికి అలవాటు. ఆరోజు వొక చెఱువుగట్టుమీద నడిచివెళ్ళాడు. చుట్టూ రాతి బండలు వున్నాయి. గట్టున పెద్ద పెద్ద చెట్లున్నాయి. రాళ్ళ మధ్య గట్టుకి దగ్గరగా, గొర్రెల కాపరి వాడుకునే చిన్న పడవవుంది. ఆ పడవ తాడుతో ఒక కఱ్ఱకి కట్టివుంది. ఆ కట్టు విప్పి, పడవలోకెక్కాడు. ఆకాశంలో చందమామ వున్నాడు. తెడ్డుతో, తోస్తూ ఆ పడవని నడుపుతున్నాడు. తొందరగా వెళ్ళాలని వున్నా, నిదానించి అడుగులు వేస్తున్నవాడికి మల్లే పడవ నడుపుతున్నాడు. రహస్యంగా సాగిస్తున్న ఆ చర్యలో ఆనందం వుందిట.

దూరంగా చిన్ని కొండల నడుమ ప్రతిధ్వనులు ఆ పడవని తోస్తున్నా యనిపించిందిట. పడవ ముందుకి సాగగానే, వెనకాల, ఇరుప్రక్కలా, వెన్నెల వెలుగులో చిన్ని చిన్ని సున్నాలుగా విడిపోయిన నీరు మెరిసి, మెరిసి వెండి దారంవలె సాగిపోతూందిట. ఎదురుగా వొక కొండ, శిఖరం కనిపిస్తున్నాయి. ఆ శిఖరంకేసి చూస్తున్నాడు శిఖరంపైన ఆకాశం, నక్షత్రాలు. దాని కేసి చూస్తూ

తోసుకుంటూ వెడుతున్నాడు. పడవ హంసవలె సాగిపోతూందిట. అతనివెనక, ఏ కొండా, రాతిబండా లేదు. భూమీ, ఆకాశం కలిసిన అంచుమాత్రం వుంది.

అప్పుడు ఏం జరిగింది? వెనక్కి తిరిగి చూశాడు. ఏమీలేని చోట, ఒక పెద్ద కొండశిఖరం, క్షణక్షణమూ పెద్దదవుతూ పైకిలేవడం చూశాడుట.

తెడ్డు నీటిమీద కొడుతూ, పడవ నడుపుతున్నాడు — వేగంగా — ఆ వింతగా లేస్తున్న కొండ శిఖరాన్నుండి దూరంగా వెళ్ళిపోవాలన్న ఆతృతతో. 'వర్డ్స్‌వర్త్' కావ్యంలో భాగం యొక్క సారాంశం పొందుపరుస్తాను

"ప్రాణం వున్నదానికి మల్లే ఆ కొండ శిఖరం ఎదుగుతూ, పెద్దదవుతూ, నా వెనక కదిలి, నన్ను తరుముకొస్తూంది. నా చేతులు వొణికిపొయ్యాయి నేను అదిరిపొయ్యాను. గబగబ తోసుకుంటూ ఎల్లాగో గట్టుకి చేరుకున్నాను. పడవ దిగి, పడవని చెట్టుకర్రకి కట్టేసి, ఆలోచనలో పడి ఇంటికేసి నడిచాను. ఇది జరిగిన చాలా రోజులవరకూ నా మెదడులో నే నెరిగిన సజీవశక్తులు మెదిలాయి. నా మనస్సులో చీకటి ముసురుకుంది. అదొక శూన్య భావం; ఏకాంతం ఆ దృశ్యం నేనిదివరలో ఎరుగున్నది కాదు. చెట్లు, సముద్రం, ఆకాశం, పచ్చటి పొలాలు, ఇవేవీ కాదు. సజీవుడైన మనిషిలా, సజీవం అవక, నా మనస్సులో వింతగా కదిలే, మహత్తర శక్తి అది — పగలు నా మనస్సుని కలవరపరిచే పెద్ద మాయశక్తి; రాత్రి నా కలల్ని కలవరపరిచే వింత రూపం."

బాల్యంలోనూ, యౌవనదశ ప్రారంభంలోనూ ఇట్లాంటి వింత అనుభవాలు చాలా మందికి కలుగుతాయి. కాని మనం వీటిని గమనించం నలుగురికీ చెప్పదగ్గ అపూర్వమైన అనుభవంగా మనకి ఆ దశలో అనిపించదు. తటస్థంగా వుండి ఈ అనుభవాన్ని గమనించిన మనస్సు, ఆ సమయంలోనే ఆ అనుభవంలో పాల్గొని మమేకమైపోయి వుండడంవల్ల మాటలు తెచ్చుకోదు అనుభవిస్తుంది మనస్సు— కాని పైకి చెప్పలేదు వర్డ్స్‌వర్త్ కవికి యీ అనుభవం 14 వ యేట జరిగింది. 29 వ యేట దీన్ని కావ్యంగా వ్రాయగలిగాడు. ఈ అనుభవం చెప్పడం కోసమే ఆయన యీ కావ్యం వ్రాయలేదు. కావ్యం వ్రాస్తూంటే, అనేక ఇతర జ్ఞాపకాలతో బాటు, ఇదీ జ్ఞప్తికివొచ్చి, విశిష్టత తెచ్చుగుని కావ్యంలో స్థానం ఏర్పరుచుకుంది

నా బాల్యంలో నాకూ ఇట్లాంటి వింత అనుభవం జరిగింది. కాని నేను ఆనాడు జరిగినప్పుడు దాన్ని గురించి అంతగా పట్టించుకోలేదు. అది అపూర్వమైంది అనుకోలేదు. నలుగురితో చెప్పాలన్న తృష్ణ లేకపోయింది. దీన్ని గురించి

ఈనాటి వరకూ వ్రాయనేలేదు. కారణం ఇందాక చెప్పాను. అవస్థలో వర్ధ మనస్సు నుండి తటస్థంగా చూసే మనస్సు విడిపోలేదు.

నా పదమూడవ ఏట జరిగిన సంగతి ఇది. అదొక పల్లెటూరు. కాలవ రెండు పాయలుగా చీలుతుంది. ఒకదాని ముందు 'లాక్' వుంటుంది. రెండోది 'వైర్' గుండా (నీటిని సన్నగా దిగువ కాలవలోకి వదనిచ్చే అడ్డు కట్టడం— వంతెన దిగువన తలుపులు అన్నమాట) కింది కాలువగా సాగిపోతుంది.

అవి వేసంగి శెలవులు : ఎగువ కాలువ గట్టునే నడుచుకుంటూ వెళ్ళడం నాకు మామూలు ఈ షికారు సాయంత్రం కాదు, ఉదయం ఏడు, ఎనిమిది మధ్య ఇల్లా నడుస్తూ వెళ్ళేవాడిని. నాలుగైదు ఫర్లాంగులు నడిచాక పెద్ద పెద్ద చెట్లు, గడ్డి, చిన్ని రాతిబండలు, మట్టి – ఇవి కనిపిస్తాయి. ఆ రాతిబండల దగ్గర కాసేపు కూర్చుని, కాలవ వొడ్డుకి వొచ్చి స్నానం చేసే అలవాటు కాలవ వొడ్డుకి ఫర్లాంగు దూరంలో వుంటోంది — యీ దృశ్యం దూరంగా పొలాలు, వాటిముందు తోట, తోటముందు గడ్డివామి, పశువులు – అదీ దృశ్యం.

వేసంగిలో ఉదయం ఎనిమిదింటికి కాసే ఎండలో ఈ పొలాలు, చెట్లు, వెండి తెరవెనక కదిలినట్లుగా రంగులేక ఊదాగా కనబడతాయి. నేను ఆ బండల మధ్య చల్లటి నీడల ఆకారం చూస్తున్నాను. పది నిమిషాలు జరిగాక, తల పైకెత్తి పొలంకేసి, తోటకేసి చూశాను. అక్కడ పొలం లేదు. తోట లేదు. ఎదురుగా గడ్డివామిలేదు. దూడలు లేవు. అవన్నీ తెల్లగా, ఊదాగా కరిగి అదృశ్యమై పొయ్యాయి చుట్టుపక్కల ఏ వస్తువూ స్పష్టంగా కనబడ్డం లేదు. భయపడ్డాను మనస్సు ఎల్లాగో ఐపోయింది. కాసేపు అంతా శూన్యం— చీకటి— కాని బంగారు శూన్యం— వెండి చీకటిని. తొందరగా లేచి, గబగబ నడిచి, వైర్ వంతెన దగ్గర కొచ్చాను. అక్కడ అన్నీ మామూలుగా కనబడసాగాయి. అమ్మయ్య అనుకున్నాను. చాలా రోజులు నా మనస్సు కలవరపడింది. మరో లోకం క్షణం దర్శించినట్లైంది. కాని ఎవరితోనూ చెప్పుకోలేదు. సిగ్గేసింది; భయమేసింది.

అజ్ఞానం - 1

# నేను - శంకరనారాయణ నిఘంటువు

[యువ పత్రికలో బుచ్చిబాబుగారు "అజ్ఞానం" అన్న శీర్షికను కొన్ని రోజులు నిర్వహించారు. అందులో కొన్ని వ్యాసాలను ఈ సంకలనంలో చేర్చడం జరిగింది. —ప్రచురణకర్తలు]

**ఆ** మధ్య వొక సినిమా కథలో కథానాయకుడు భార్యతో 'జీవితాన్ని తేలికగా తీసుకో' అన్నాడు సుళువుగా ప్రాణం విషం తీసుకుని చావమనికాదు దీని అర్థం. జీవితంలో కష్టాలొచ్చి పడినప్పుడు, మరీ ఎక్కువగా పట్టించుకుని ఇదవకూడదని — దీని అర్థం అనుకుంటా 'ఇదవకు' అన్న దానికి అర్థంలేదు. నిజమే — కాని అదేమిటో ప్రతి తెలుగువాడికీ తెలుసు. 'జీవితాన్ని తేలికగా తీసుకో' అన్నది ఆంగ్ల భాషా సంస్కృతుల సంపర్కం నుండి వొచ్చిపడిన భావాన్ని తెలుగులో చెప్పడం సొంపు. ఫలితం ఆసించక, విధి నెరవేర్చు—మేలు జరిగినప్పుడు ఎగిరిపడకు - కష్టం వొచ్చినప్పుడు కుంగిపోకు - రెంటినీ సమంగా స్వీకరించు - అన్న గీతా వాక్యంలోని ధ్వని అన్న మాట. ఇంగ్లీషులో 'లైఫ్' అన్న మాటకి 'జీవితం' అనీ, 'ప్రాణం' అనీ రెండర్థాలున్నాయి. శంకరనారాయణ నిఘంటువు చూశాను. లైఫ్' అన్న మాటకి 'జీవము' 'ప్రాణము', 'ఉసురు', 'జీవితకాలము', 'ఆయుస్సు', 'బ్రతుకు' - ఇన్ని అర్థాలున్నాయి.

ఈనాడు విద్యాధికులైనవా రందరూ ఇంగ్లీషులో ఆలోచించి, తెలుగులో సంభాషించడం, వ్రాయడం జరుగుతోందన్న విమర్శ వొకటుంది. ఈ విమర్శ కూడా, ఆంగ్ల భాషా సంపర్కం వల్ల వొచ్చినదే ననుకోడం అజ్ఞానమేమో నాకు తెలియదు.

ఇంగ్లీషులో ఆలోచించడం అనేది 'ఆధునిక వ్యవస్థ' వల్ల వొచ్చిన పరిణామం. మన రాజ్యాంగం ఇంగ్లీషువారిది; సంఘ పరివర్తన విజ్ఞానం వారిది;

మనం నెలకొల్పుతూ వున్న సాంకేతిక, పారిశ్రామిక పురోగమనైక పద్ధతి వారిది; వీటి తాలూకు పరిజ్ఞానాన్ని నలుగురికీ అందజేసే భాష, భావాలు వారివి. వీటికి సరైన అర్థం గల మాటలని కూర్చాలంటే, సంస్కృత పదాలు వాడాలి. ఇంగ్లీషు, సంస్కృతం ఇండో - ఐరోపా భాషల కుటుంబంలోనివే. లాటిన్, గ్రీక్ భాషల నాధారంగా ఇంగ్లీషులో కొత్త మాటలు సృష్టించినట్లుగానే సంస్కృతం ఆధారంగా తెలుగులో కొత్త మాటలు కూర్చవచ్చు; ఇంగ్లీషులో చెప్పేవన్నీ తెలుగులో తప్పకుండా చెప్పవొచ్చునన్న గాఢ విశ్వాసంతో, ముక్కోటి ఆంధ్రుల మేలుకోరి, శంకరనారాయణ నిఘంటువు వ్రాశాడు. పాపం, శంకరనారాయణ:

ఈయన పూర్తిపేరు పాలూరి శంకరనారాయణ. స్వగ్రామం, శ్రీకాకుళం; అక్కడి మునిసిపల్ హైస్కూలులో విద్యాభ్యాసం; తర్వాత, గణితశాస్త్రంలో ఎమ్. ఏ. డిగ్రీ తెచ్చుకున్నాడు. ఖగోళశాస్త్రజ్ఞుల బృందంలో సభ్యుడు. గణిత శాస్త్రజ్ఞుడి ఆరాధ్య దైవం 'స్పష్టత' - సంశయించడానికి వీలులేని 'సత్యం'; ధ్వనులకీ, అంతరార్థాలకీ, గుసగుసలకీ తావుండని, ఖండితమైన విస్పష్టత, పరిపూర్ణత, అంకెలలోనూ, రేఖలలోనూ, సున్నాలోనూ, చదరంలోనూ 'స్పష్టత' చూడగలం.

శూన్యం – సున్న - ని అంకెగా పరిగణించి, దాని ద్వారా అంకెలకి విలువ కట్టడం, మానవ ప్రగతిలో ప్రథమ ఘట్టం. ఈ ఘనత భారతీయులకే దక్కింది. క్రీస్తు తర్వాత 499 వ సంవత్సరంలో వ్రాయబడిన 'ఆర్య భటీయం' లో, నేటి పాఠశాలలో నేర్పే గణితశాస్త్ర సూత్రాలన్నీ వున్నాయి బ్రహ్మ గుప్తుడు, శ్రీధరుడు, మహావీరుడు, రెండవ ఆర్యభటుడు-ప్రాచీనకాలపు ప్రసిద్ధ గణితశాస్త్రజ్ఞులు. క్షేత్రగణితంలో మహావీరుడు ప్రతిపాదించిన సమస్యని - వొకదాన్ని ఉదహరిస్తాను - శంకరనారాయణ నిఘంటువు ఆధారంగా:

ఒక సమకోణ చతురస్రంలో, వైశాల్యం, క్షైవారంతో, సంఖ్య ప్రకారం సమంగా వుంటుంది; మరొకదాంట్లో, వైశాల్యం, సంఖ్య ప్రకారం ఐమూలరేఖతో సమంగా వుంటుంది. అట్లాంటప్పుడు వాటి పార్శ్వము లేవి?

ఆ రెండూ సమంగా వుండి, కొంత ఐక్యత సాధించినా, ఈ సమస్యలో ఉద్రేకం లేదు; 'క్షైవారం' అందమైన మాట - కాని అందులో శృంగారం లేదు. ఐమూలరేఖ, విప్లవానికి రగల్చదు. 'పార్శ్వము' అన్న మాట ఉచ్చరించినంత మాత్రాన పార్శ్వం పోటు రాదు. ఉద్రేకరహితమైన స్పష్టతని అన్వేషించిన గణిత శాస్త్రజ్ఞుడూ, నైఘంటికుడు కూడా ధన్యజీవులు. 1755 లో డాక్టర్ జాన్సన్ -

ప్రసిద్ధ సాహితీవేత్త - కూర్చిన నిఘంటువులో 'నైఘంటికుడు' అన్నదానికి - 'ఎవరికీ అపకారం చెయ్యకుండా కష్టపడి పనిచేసే గులాము' - అన్న అర్థం చెప్పుకున్నాడు. మరొక పదానికి ఇట్లాంటి తప్పుదర్థం వ్రాశావేమిటయ్యా, అని ఎవరో వొకామె రొకాయిస్తే 'అజ్ఞానంవల్ల - మహా తల్లీ!' అన్నాడుట. అంటె, జాన్సన్ కూర్చిన నిఘంటువులో బోలెడు ఉద్రేకం వున్న శంకరనారాయణ నిఘంటువుని, 1895 ప్రాంతంలో వ్రాసినట్లు తెలుస్తుంది ఆంగ్లభాష మాట్లాడే పెద్దలు నలుగురూ కూడబలుక్కుని, స్వాతంత్ర్యపోరాటం సాగించ సంకల్పించిన రోజులవి. ఉద్రిక్తమైన వాతావరణం ప్రబలిన కాలం అది. వారంతా ఇంగ్లీషులో ఆలోచించి, ఇంగ్లీషులో మాట్లాడుకొనేవారు. ఉద్రేకంతో నిమిత్తంలేని ఇంగ్లీషు పదాలకి - తెలుగు అర్థా లేమిటో చెప్తూ తన నిఘంటువుని వ్రాశాడు - అది ఆయన చేసిన ఘనకార్యం. 1852 లో సి. పి. బ్రౌన్ దొర, తెలుగు నేర్చుకో దలిచిన - ఇంగ్లీషువారి కోసం, 'తెలుగు - ఇంగ్లీషు' నిఘంటువు వ్రాశాడు సంస్కృతానికి పాణిని; గ్రీకు భాషకి డయోనిసియస్, డిస్కోలస్‌లూ; లాటిన్ భాషకి డొనాటస్, ప్రిసియన్‌లూ; అరబిక్ భాషకి అల్ ఖలీల్ ఎట్లాంటి సేవ చేశారో - ఇంగ్లీషు — తెలుగుకి, శంకరనారాయణ అట్లాంటి సేవ చేశాడు. ఇంగ్లీషు మాట్లాడే వారి సంఖ్య - పాతిక కోట్లు - తెలుగువారి సంఖ్య, ఇంచుమించు నాలుగు కోట్లు. వారికీ వీరికీ అన్యోన్యం ఏర్పడాలని ఈయన ఆశయం.

మనిషి బాగుంటాడు. జరీ అంచు తలపాగా, వేస్టుకోటు, దానిపై మడిచిన కలర్ కోటూ, పైన ఉత్తరీయం, వేస్టుకోటు జేబులోంచి వ్రేలాడే జేబుగడియారం గొలుసు - ఇది 1941 లో అచ్చైన, 8 వ కూర్పు నిఘంటువు తొలిపుట ఫోటోగ్రాఫ్‌లో మనకి కనబడే శంకరనారాయణ వేషధారణ. చెవులకి దుద్దులున్నాయి. చక్కటి, చిన్ని నోరు, తీర్చిదిద్దిన ముక్కు, మంచి కళ్ళు; - అప్పుడు ఆయన వయస్సు ముప్పై ఐదు మించదేమో. ఇంతకుమించి ఆయన్ని గురించి నాకేమీ తెలియదు.

ఆ రోజు మధ్యాహ్నం, కాలేజీలో ఏదో దొరల పార్టీ జరిగివుంటుంది. అంతా ఇంగ్లీషులో సంభాషణ. 'థాంక్‌యు' 'ప్లీజ్' 'సారీ' 'వెరీగుడ్' - ఇవన్నీ ఆయన బుర్రలో తిరుగుతున్నాయి. వీటికి తెలుగేమిటి! దేశ నాయకులు తెలుగులో సంభాషిస్తే ఏ పదాలు వాడతారు? పార్టీ ముగిసింది. సాయంత్రం ఇంటికొచ్చాడు శంకరనారాయణ పాగా తీసి బల్లమీద వుంచాడు. వేస్టుకోటులో గడియారం, భార్య కిచ్చాడు. దాన్ని ఆమె భద్రంగా, లోపలి గదిలో బీరువాలో వుంచింది. పళ్ళెంలో ఫలహారం తెచ్చింది - మినప సున్నుండలు, అరిసెలు,

జంతికలు, శంకరనారాయణ తనలో తాను నవ్వుకున్నాడు భార్యకి 'థాంక్ యూ' అని చెప్పాలనుంది. తెలుగులో 'థాంక్ యూ' అనడం ఎట్లాగ? కృతజ్ఞత తెలుపుటా? వందన సమర్పణా? ఉపకార స్తుతా? షేక్‌హాండ్ ఇవ్వాలా? భార్యకి వందన సమర్పణం ఏమిటి? ఏ మాటా లేకుండా, ఆమెని కౌగలించుకుని, 'కృతజ్ఞత' తెలిపితే సరిపోతుందా?

ఇంతలో ఆమె గ్లాసులో మంచినీళ్ళు తెచ్చింది. ఆయనకి మజ్జిగ కావాలి.

"కాస్తంత మజ్జిగ తెచ్చిపెడుదు - 'ప్లీజ్', ప్లీజ్—" అన్నాడు.

ఆమె నవ్వుతూ లోనికెళ్ళి మజ్జిగ తెచ్చింది.

" 'ప్లీజ్' - ఏమిటండీ?" అంది భార్య.

" 'సంతోషపెట్టు'; 'ఆనందింపచేయు'; 'ఆమోదించు'; 'ఇష్టపడు' ... నీ ఇష్టం .. " అంటా డాయన

-"ఓష్ అదా — తెలిసింది లెండి - నేను పనిమనిషిని బ్రతిమాలినట్లు. 'అణా మెంతులు తెచ్చిపెడుదు' — 'బాబ్బాబు' - అల్లాంటిది - ఔనా?" అంటుంది ఆమె. నిజమే. 'బాబ్బాబు.' 'మా అమ్మ కదూ. 'అమ్మ అమ్మ' — ఇవన్నీ తెలుగులో 'ప్లీజ్' అనడం లాంటివి 'బాబ్బాబు' — అనడంలో బ్రతిమలాడ్డం వుంది. అంటే ఉద్రేకం వుంది - కరుణరసం. ఉద్రేకరహితమైన మాట వెదకాలి

"మరో సున్నుండ తెచ్చేదా?" అంటుంధి భార్య.

"ఇందాక పార్టీ అయింది. పొట్ట బరువుగా వుంది. ఎక్స్‌క్యూజ్ మి."

"అంటే?"

"అంటే, మరో సున్నుండ తిననందుకు క్షమించు - మరోలా అనుకోకు, అన్యథా భావించకు. మరిచిపో . . అని " అంటాడు. ఆయనకి తెలుసు, వీటిల్లో ఉద్రేకం వుందని, 'అన్యథా భావించకు' — లో బోలెడు కరుణ రసం

"ఇవాళ మీ ధోరణి మారిందే."

"అవును స్మా. ఐయామ్, సారీ." అంటాడు.

"సారీ ఏమిటి?"

"నాకు చాలా విచారంగా వుంది."

"ఏం జరిగిందండోయ్, అంత విచారానికి?"

"ప్లీజ్' అన్న పదానికి తెలుగు చెప్పలేక పొయ్యాను — ఇంగ్లీషు పదం వాడేశాను. అందుకు విచారం, బాధ, ఖేదం — ఐయామ్ సారీ," అని శంకర నారాయణ తనలో తాను గొణుక్కుంటాడు.

భార్యకి క్షమాపణ చెప్పడమే కొత్తగా వుంటుంది. ఆ భావం వెనక ఆంగ్ల సామ్రాజ్యం, ఆంగ్ల సంస్కృతీ సాహిత్యాలున్నాయని ఆయనకి తెలుసు. వాటి నుండి విముక్తి పొందాలంటే, ఇంగ్లీషు మాటలకి తెలుగులో అర్థాలు చెప్పుకోవాలి

ఆ రాత్రే స్నానంచేసి ప్రారంభించాడు ఇంగ్లీషు– తెలుగు నిఘంటువు. శంకరనారాయణ పన్ను సలుపుతోంది – 'పన్ను'కి ఇంగ్లీషు 'టూత్'. సంస్కృతంలో 'దంతం'; ఫ్రెంచ్ భాషలో 'డెంట్'; 'డెంట్' అంటే, మొదట్లో 'తినుట' అని అర్థం; అది జర్మన్ భాషలో 'డ' శబ్దం 'జ'గా మారి, 'జాన్' అయింది. గ్రీకులో 'ఓంటి', లాటిన్ భాషలో, 'డెన్‌టెమ్'. ఇటలీ భాషలో, 'దెంటి' స్పానిష్ భాషలో 'దయెంటి'. ఇంగ్లీషులో భాషా పరిణామ సూత్రం ప్రకారం, 'ద' శబ్దం 'త' గా మారి – 'దంట్' – 'తంట్' అయింది. ఆ 'టంత్' లోంచి వొచ్చిందే 'టూత్'. వీటన్నింటికీ ఆది భాష ఇండో - యూరోపా భాష; ఐదువేల సంవత్సరాల క్రితం వర్ధిల్లిన భాషల కుటుంబం. కాని 'పన్ను' కేవలం తెలుగు. పంటినొప్పి భరించలేక ఆదిమవాసుడైన ఆంధ్రుడు, 'పా, పా' అని మూలిగేవాడా? లేక 'అబ్బా, అబ్బా' అంటూ, నొప్పి నషాళాన్ని అందుకున్నాక, 'బా' 'బా' అంటూ, తర్వాత వొక వ్యాకరణ సూత్రం ప్రకారం, 'బా' 'పా' అయిందా?

జ్వరం తగిలిందని శంకరనారాయణకి తోచింది ఆ రాత్రి.

చలి; కాళ్ళు, చేతులు వొణుకుతున్నాయి 'ఇన్‌ఫ్లుయెన్‌జా' వ్యాధి చిహ్నాలా? 'ఇన్‌ఫ్లుయెన్‌జా'కి తెలుగేమిటి? కాగితంమీద వ్రాశాడు. 'జ్వరయుక్తమైన అంటు గుణముగల విష పడిసెము' అని భార్యని కేకేసి అడిగాడు– ఎల్లా వుంది తెలుగు అని. ఆమె నవ్వింది. 'మాంచి జలుబు చేసింది' అంటే చాలదూ. "వేడిచారు పెడతా నుండండి," అని లోనికెళ్ళింది. 'అ' అక్షరంతో ప్రారంభమయ్యే పదాలను గురించి ఆలోచిస్తున్నాడు. అంబారి, అమేష, అజమాయిషి– ఇవన్నీ ఉర్దూ మాటలు; జబర్దస్తీ, జవాబు, బిచాణా, మరమ్మత్తు– ఇవన్నీ ఉర్దూ. 'ఆనకట్ట' అన్న పదానికి మూలం తమిళం. అద్దం రవునుగా వుంది – అన్న వాక్యంలో 'రవును' అన్నది ఇంగ్లీషు మాట- 'రౌండ్' ఇదంతా గంద్రగోళంగా కనబడుతోంది. అసలు తెలుగు భాష అంటూ వొకటుందా? భాషలన్నీ సంకరమైనవే. అందుకనే, ప్రపంచంలో అందరూ మాట్లాడడానికి వీలుగా వుండే వొక కృత్రిమమైన ప్రపంచ భాషని తయారు చెయ్యడానికి ఎందరో యత్నిస్తున్నారు. పాశ్చాత్య దేశాలలో ఇట్లాంటివి వంద భాషలు కల్పించారు. 1879 లో మార్టిన్

ష్లేయర్ అనే ఆయన 'వొలాపక్' అనేదాన్ని కూర్చాడు. 1877 లో 'ఎస్పె రాంటో' భాషని కల్పించారు. ఇండో-ఐరోపా భాషలు మాట్లాడేవారి సంఖ్య ముప్పై కోట్లు; ద్రవిడ భాషను మాట్లాడే వారి సంఖ్య పదికోట్లు. తమిళ భాషకి 'ఫిన్నిష్' భాషకీ పోలిక లున్నాయని ఇటీవల కనుక్కున్నారు. ఆర్యులకి పూర్వమే, ద్రావిడులు యూరప్ ప్రాంతం నుండి వలసపోయి, దక్షిణ భారత్‌లో స్థిరపడ్డారా? తమిళ భాష మాట్లాడేవారి సంఖ్య రెండు కోట్ల ఏడు మిలియన్లు. 'మిలియన్' అంటే 'పది లక్షలు'. కాగితం మీద ఈ సంఖ్య వ్రాశాడు శంకర నారాయణ.

చలి, జ్వరంతో ఎందుకు మొదలెట్టడం నిఘంటువు ప్రొద్దున్న చూసుకో వచ్చులే ననుకున్నాడు. కాని, ఆయనకి భయం, తెల్లారి లేవగానే, పక్కింట్లో వెధవావిడ, పెరట్లో దర్శనమౌతుంది 'విధవ' చిత్రం! తెల్లారేదాకా వేచి వుండ కూడదు. వెంటనే మొదలెట్టాలి.

రెండేళ్ళు గడిచాయి. నాలుగైదొందల గ్రంథం అయింది నిఘంటువు. అవి, దీపావళి పండుగ రోజులు కాబోలు, ఆయన సతి, వంటింట్లో, వంటకా లతో, పిల్లాడికి బాణసంచా ఎండబెట్టడంతో సతమతమౌతూ వుంది: చీరకొంగుకి నిప్పంటుకుంది.

"మంట, మంట" అని కేకపెట్టింది. ముందు వరండాలో కూర్చున్న భర్త పలకడు.

"అమ్మో, నిప్పు, నిప్పు." అని అరిచింది. శంకరనారాయణ, లోనికొచ్చి, నిప్పు ఆర్పేశాడు.

"అమ్మయ్య, సమయానికొచ్చి ఆర్పేశారు. లేకపోతే ఎంత ప్రమాదం జరిగివుండునో, థాంక్యు," అంది ఆమోదంతో.

"గుడ్" — బాగుంది. కాని, ఇంకముందు ఎప్పుడన్నా ఇట్లాంటి అగ్ని ప్రమాదం జరిగినప్పుడు, 'మంట' 'మంట' అరవకూడదు. 'మంట' అంటె 'కడుపులో మంటా?' కాలి మంటా? వొళ్ళుమంటా?' — 'హెల్ప్, హెల్ప్' అని అరవాలి," అన్నాడు. నిఘంటువు స్మరించుకుంటూ, ఆమె నవ్వింది. మోదం చూపెడుతూ, ఆయన వంచె గోచీలో కప్పగంతు గీసి పడేసింది.

శంకరనారాయణ సతి ఉత్తమ ఇల్లాలు. అతని మంచిభార్య ప్రతి నైఘంటకుడికీ దొరకదు. వెబ్‌స్టర్ దొర విషయము చూడండి.

నోవా వెబ్‌స్టర్. అమెరికాదేశపు నైఘంటికుడు 1750 లో పుట్టి, 1828 లో, ఇంగ్లీషు నిఘంటువు వ్రాసి, 1843 లో చనిపొయ్యాడు. ఇంగ్లండ్‌లో

అక్స్‌ఫర్డ్ నిఘంటువు ఎంత ప్రసిద్ధమైందో, అమెరికాలో వెబ్‌స్టర్ నిఘంటువు అంత ప్రసిద్ధమైంది. ఒకరోజున, వెబ్‌స్టర్ భార్య, బజారుపని చూసుకుని, చీకటిబడ్డాక ఇంటికొచ్చిందిట. లోపలిగదిలోకెళ్ళింది. తన భర్త పనిమనిషిని కౌగలించుకుని, సరసమాడుతున్న దృశ్యం చూసింది. ముక్కుమీద వేలేసుకుని నేను ఆశ్చర్యపడ్డాను' అంటే, భర్త ఇల్లా అన్నాడుట.

"ప్రసిద్ధ నైఘంటికుడి భార్యవై వుండి, 'విస్తుపోయ్యాను' అనాలిగాని, 'ఆశ్చర్యపడ్డాను' అంటావా? నన్ను ఆశ్చర్యపరిచావు, నువ్వు విస్తుపోయ్యావు," అని అంటే, ఇంగ్లీషులో "నువ్వు 'ఎస్టానిష్' అయ్యావు" – "నేను 'సర్‌ప్రైజ్' అయ్యాను." – అని విమర్శించి చెప్పడంలో. ఆ రెండుమాటలకీ అర్థంలో తేడా ఉందని భార్యకి తెలియచేస్తున్నాడన్న మాట.

ఈ రెండు మాటలకీ తేడా ఏమిటో చూద్దామని శంకరనారాయణ నిఘంటువు పుటలు తిరిగేశాను.

'ఎస్టానిష్' అంటే, 'ఆశ్చర్యపరుచు' అని వ్రాశాడు.

'సర్‌ప్రైజ్' అంటే 'ఆశ్చర్యము,' 'విస్మయము కలుగజేయు' అని వ్రాశాడు ఇంతేనా? ఈ రెండు మాటలకీ 'ఆశ్చర్యము' అన్న అర్థం వొకటేనా? వెబ్‌స్టర్ ఎట్లాంటి చిక్కుల్లో పడ్డాడో, ఆ చిక్కుని ఎల్లా స్పష్టం చెయ్యాలో, శంకరనారాయణకి తెలియదా?

తెలుసు. ఎందుకంటే, 'సర్‌ప్రైజ్' అన్న మాటకి, మరో అర్థంకూడా వ్రాశాడు. 'అకస్మాత్తుగా పట్టుకొను' అని 'అకస్మాత్తుగా పట్టుకొను', 'ఆశ్చర్యము', 'విస్మయము', 'అద్భుతము కలిగించు', 'సంభ్రమపడుచు', 'ఏమరిపాటున పట్టుకొనుట' ఇన్ని అర్థాలు వ్రాశాడు శంకరనారాయణ. పనిపిల్లతో సరససల్లాపాలాడుతున్న భర్తని, ఆమె అకస్మాత్తుగా పట్టుకుంది, అన్నమాట. ఆమె విస్తుపోయింది; దిగ్భ్రమ చెందింది. బ్రౌన్‌దొర, నిఘంటువుకూడా చూశాను ఈ మాటలకి అర్థం. అందులో 'అబ్బురము' 'అగాయిత్యం' అన్న మరి రెండు అర్థాలుకూడా ఉన్నాయి. అంటే, పనిపిల్లతో ఉన్న భర్తని చూసి 'ఏమిటండీ ఈ అగాయిత్యం' అనాలన్నమాట బ్రౌన్‌దొర ప్రకారం ఈమాటకి సున్నితమైన అర్థాల పరామర్శ చూశాకనే నాకు శంకరనారాయణ నిఘంటువు పట్ల గౌరవం ఏర్పడింది. ఆలోచన ఇంగ్లీషులో సాగినా, భావవైచిత్రిని, తెలుగులో స్పష్టంగా చెప్పగలం అన్న ధైర్యం ఏర్పడింది. తన నిఘంటువుకి తొలిపలుకుగా, ఈ పద్యం చెప్పుకున్నాడు శంకరనారాయణ –

అడిగిన యర్థంబు నంతయు సమకూర్చు
నడిగిన తక్షణం బమరినిచ్చు,
నెవ్వార లడిగిన నేకరీతిగ నిచ్చు,
నెవ్వ డడిగిన నివ్వ దవ్వ దనక,
గాన నిఘంటువు కల్పవృక్షము గాదె
కాదెహో తప్పక కామధేను
వట్టి వస్తువు దీని యక్కఱ లేనట్టి
వార లుందురె యెట్టివారికి నిది
లేకయుండుటగను జేయు లేకయుంట,
యంధకారంబునందు నల్లాడు టొప్పొ
కామధేనువో కల్పవృక్షంబో మనకు,
లభ్యములుగా వకారాది లభ్య మిలను.

కల్పవృక్షాన్నీ, కామధేనువునీ సినిమాలో తప్ప చూడని నేను, ఈ తొలి పలుకుకి, నేను ఈ వ్యాసం మొదట్లో పేర్కొన్న సినిమాకథలో నాయకుడి భాషని వాడుతూ మరీ తేలికగా తీసుకోక బరువుగానే తీసుకుంటాను, శంకర నారాయణ నిఘంటువును.

ఆజ్ఞానం - 2

# బెదరిపోయిన సింహాలు

ఒక కథ చెప్తాను ప్రాచీన రోమ్ సామ్రాజ్యంలో ఒక చక్రవర్తి ఉండేవాడు. ఆనాటి చక్రవర్తులు క్రూరులు, కఠినులు. ఇతరులు శారీరకంగా బాధ పడుతుంటే, చూసి వినోదిస్తారు. ఒక మనిషి ఎల్లా చనిపోతాడో చూడడానికి, వొక ఖైదీని పైకి ఎగురవేసి, నేల మీద మోపిన బల్లెంపై ఆ మనిషి కూలి, వొళ్ళు చీలి, చనిపోయిన దృశ్యం చూసి గ్రహించే మనస్తత్వం వారిది. వారి వినోద క్రీడలకు బానిసల్ని ఉపయోగించేవారు ఆనాటి రోము రాజ్యంలో ఎందరో బానిస లుండేవారు. పండుగరోజున ఖైదులో వున్న బానిసల్ని చుట్టూ గోడలు కట్టిన రంగస్థలంపై వొదుల్తారు వారిమీదికి సింహాలను విడిచిపెడతారు. ఆ సింహాలు వారిని చంపి తింటుంటే, చక్రవర్తి, ఆయన అనుచరులు, పుర ప్రముఖులు చుట్టూ కూర్చుని చూస్తూ వినోదిస్తారు. సింహంతో దెబ్బలాడి, చంపబడక, తప్పించుకున్న ఖైదీని జైలు నుండి విడుదలచేసి, స్వేచ్ఛ నిచ్చే ఆచారం వుంది. కాని ఎవ్వరూ సింహం బారి నుండి తప్పించుకుని ప్రాణాలతో బయటపడినవారున్నట్లు లేదు

ఒక బానిసకి ఆ అదృష్టం పట్టింది. చక్రవర్తి సంజ్ఞ చేయగానే బానిస మీదికి వొక సింహాన్ని వొదిలారు. అది గబ గబ అతని మీదికి వెళ్ళింది. అతను దాని తల పట్టుకుని చెవులో ఏదో చెప్పాడు. వెంటనే ఆ సింహం తోక ముడిచి, తన బోనులోకి వెళ్ళిపోయింది చూస్తున్న పుర ప్రముఖులు చకితులయ్యారు. చక్రవర్తి మళ్ళా సంజ్ఞ చేశాడు మరో సింహాన్ని వొదిలారు బానిస మీదికి. ఆ సింహం అతని మీదికి వురికింది. అతను దాని తల పట్టుకుని చెవులో ఏదో చెప్పాడు. ఆ సింహం కూడా వెంటనే తోక ముడిచి బోనులోకి వెళ్ళింది. అందరూ ఆశ్చర్యపడ్డారు. మరో సింహాన్ని వొదిలారు. అదే జరిగింది. అల్లా ఆరు సింహాలని వొదిలారు. అవన్నీ అతను చెవిలో ఏదో చెప్పగానే, భయపడి పారిపోయాయి.

చక్రవర్తి బానిసని కేకేసి, "ఏమిటి రహస్యం? ఆ సింహాల చెవులో నువ్వు చెప్పినదేమిటి? ఏం చెబితే అవి అల్లా పారిపొయ్యాయి? ఆ కిటుకు చెప్తే, నిన్ను విడిచేసి, స్వేచ్ఛని ఇచ్చివేస్తాను." అన్నాడుట.

"అందే బానిస చెప్పిన సమాధానం ఇది: "ఏమీ లేదు మహారాజా! భోజనం అయ్యాక ఉపన్యసించడం అంటూ వుంది కదా సింహం నన్ను భుజించాక 'నువ్వు ఉపన్యసించవలసి వుంటుందిస్మా' అన్నాను. అది వినగానే బెదిరిపొయ్యాయి." అన్నాడు. ఉపన్యసించడం అంటే కొందరికి అంతటి భయం వుంటుంది సింహం కూడా భయపడి పారిపోతుంది. మొదటిసారి ఉపన్యసించవల్సివొచ్చినప్పుడు ఒక ప్రముఖ వ్యక్తి వేదికపై కెళ్ళేముందు తన కాలు విరిగి, సభ వాయిదాపడితే బాగుండు ననుకున్నాడుట. ఒక ప్రముఖ రచయిత ఉపన్యాసం ఇవ్వడం గురించి ఇల్లా వ్రాశాడు : "సినిమా నటులను వ్రాయవల్సిందిగా కోరే వెర్రి ప్రజ, రచయితలను ఉపన్యసించవల్సిందని అడగడంలో తప్పు లేదు. నేను ఉపన్యసించలేను. నేను అందంగా వుండను. నాది గార్దభ స్వరం. చెడ్డ ఉపన్యాసకుడికి వుండే చెడ్డ లక్షణాలన్నీ వున్నాయి నాలో. ఉపన్యసించేటప్పుడు, సణుగుతాను, నసుగుతాను, దగ్గుతాను, తుమ్ముతాను, సకిలిస్తాను, గర్జిస్తాను, మాటలు మింగుతాను, నట్టుకుంటాను, మొహం పిడతలా పెడతాను. ఈ ప్రేక్షకులంటే రోత. వీళ్ళందరినీ తన్న బుద్ధివేస్తుంది. తుపాకి చేతికిస్తే బారుచేసి పేల్చి చంపుతాను సమితి అధ్యక్షుడూ, కార్యదర్శి కన్న సంతానం ఈ ప్రేక్షక జనం; వీరు పాటించాలి సంతాన నిరోధక వ్రతం." మొదటిసారి వేదిక మీదికి వెళ్ళే ముందు భూకంపం జరిగి, ప్రేక్షకులూ, నేనూ - అందరం నశింపవాలనిపించింది నాకూను ఇంకెప్పుడూ ఇట్లాంటి తెలివితక్కువ పన్లకి ఎగవడకూడదని ప్రమాణం చేసుకున్నాను. కాని మనిషి చపలుడు. రెండోసారి ఉపన్యసించినప్పుడు, గుండెకాయ దడ దడ కొట్టుకోడం ప్రారంభించింది. అంత వరకూ నాకు అంతటి బలమైన, గట్టి గుండెకాయ ఉందనుకోలేదు. ఆ గుండె చప్పుడుని, విద్యుత్ తరంగాలుగా మార్చే యంత్రం ఏదన్నా వుంటే, చంద్ర మండలంలో రేడియో పెట్టుకున్నవారికి వినబడి తీరుతుంది. తల్లి గర్భంలోంచి బిడ్డ నేల మీద పడగానే, మెదడు పని చెయ్యడం ప్రారంభించి, ఉపన్యాస వేదికపైకి వొచ్చేసరికి నిల్చిపోతుంది.

ఏడ్పు, పసికందు తొలి ఉపన్యాసం కాళ్ళు, చేతులు గిజగిజ కొట్టుకుంటాడు, ఏదో పట్టుకోవాలి చేతికి గడ్డిపీలిక అందించండి, చేతులు కొట్టుకోడం నిల్చిపోతుంది. మరి ఏడవడు. ఉపన్యాసకుడికి కూడా, పట్టుకునేటందుకు

పీదన్నా కావాలి సముద్రంలో ఓడ కొట్టుకుపోతూవుంటే, నిలబడాలంటే, లంగరు కావాలి. ఒక ఉపన్యాసకుడు, కోటు బొత్తాం పట్టుకుని మెలితిప్పుతాడు. ఒకడుజేబులో చెయ్యిపెట్టి, ఏదో నలుపుతాడు మరిఒకడు తన రెండు చేతులూ నలుపుకుంటాడు ఈ మధ్య కొన్ని సభలలో, ఉపన్యాసకుడు తెచ్చుకున్న కాగితాలని ఉంచేటందుకు, ఒక ఎత్తయిన బల్ల పెడుతున్నారు ఒక్కొక్క ఉపన్యాసకుడు ఆ బల్లని కౌగలించుకొని వొదలడు. ఒక్కొక్కడు, ఎదురుగా ఉన్న 'మైక్'ని పట్టుకుంటాడు ఈ మధ్య నే విన్న ఒక ప్రముఖవ్యక్తి, ఉపన్యసిస్తూ ఎడమచేతిలో ఒక కాగితం మడిచిపట్టుకుని, ఆ కాగితాన్ని కుడిచేతి లోకి లాక్కొని, మళ్ళా ఎడమచేతికి మార్చి, దాన్ని కుడిచేతిలోకి లాక్కుంటూ గడిపాడు, గంటన్నరసేపు ఆ కాగితం ముక్క లాగివేస్తే, ఆ వ్యక్తి మరి మాట్లాడలేడు ఏదో పట్టుకోవాలి లేకుంటే, పడిపోతాడు, జారిపోతాడు, నశింపవుతాడు — అంతభయం. 'తాను చనిపోతాను' — అదీ భయం.

నిజానికి ఉపన్యాసకుడి భయం, తాను భౌతికంగా, శారీరకంగా చని పోతాను అన్నది కాదు తన మనస్సు, మెదడు, వ్యక్తిత్వం ఇవి చనిపోతాయి — అన్న భయం. ప్రేక్షకులముందు, మనస్సు తగుల్చుకున్న ముసుగులను తీసివేసి, నగ్నంగా ప్రదర్శించాలి

నలుగురిముందూ నగ్నంగా ఉండలేడు నాగరికుడు. దుస్తులు తీసివేసి, నడివీధిలో నగ్నంగా నడవడానికి ఎంతో ధైర్యం ఉండాలి. సిగ్గుపడిపోతాం. నా స్నేహితుడొకడు, కింది వాటలో నగ్నంగా స్నానం చేస్తున్న కన్యని చూసి సిగ్గుపడి, ఏడాదివరకూ తేరుకోలేదు ఉపన్యసించడం అంటే, నలుగురి మధ్యా నిలబడి నగ్నంగా ఉన్న మనస్సుని ప్రదర్శించాలి బొత్తాం నలపడం, జేబు రుమాలు మెలితిప్పడం, బల్లని పట్టుకుని ఊపడం — ఇవన్నీ నగ్నంగా ఉన్న మనస్సుని కప్పడానికి చేసే యత్నాల చిహ్నాలు. ప్రేమకలాపం, కామక్రీడా జరిపినప్పుడు, ప్రేయసీ ప్రియులు, నగ్నంగా వ్యవహరించలేకపోవడం, నాగరిక ప్రపంచం అరిష్టాలలో ప్రధానమైందని, చలం, లారెన్సు, జాయిస్ మొరెడు తున్నారు

ఏదోవిధంగా ప్రేక్షకుల్ని బాధపెట్టని ఉపన్యాసకుడు అరుదు ఉపన్యాసం ముగిసి, ఉపన్యాసకుడు గదిబైటకి రాగానే తుపాకి బారుచేసి చంపాలనిపించ వచ్చు, ప్రేక్షకులలో కొందరికి. ఇట్లాంటి ప్రమాదం ఎప్పుడోగాని జరగదు. కాని ప్రమాదం, ఉపన్యాసకుడికి తప్పదు. అదేమిటంటే, తన్ను తాను హింసించు కోవడం. మనిషి సుఖాన్ని, సంతోషాన్ని అన్వేషిస్తాడంటారు, నిజమే. కాని

దుఃఖాన్నీ, బాధనీకూడా అన్వేషిస్తాడని చాలామంది గ్రహించరు. తన్ను తాను మానసికంగా, హింసించుకుంటాడు మానవుడు. బాధని కోరతాడు. దుఃఖాన్ని ఆశిస్తాడు. గాయపడాలి అంటాడు, జబ్బు చేయాలంటాడు ఏదో ప్రమాదం జరిగి, కాలో చెయ్యో విరగాలని కోరుకుంటాడు, చావాలంటాడు మృత్యువుని కోరతాడు ప్రాణి చివరికి మృత్యువుతో అంత మొందుతుంది నాలుగంతస్తుల మేడమీదికి వెళ్ళి, గోడ అంచుమీదనుంచి కిందకి చూస్తే కళ్ళు తిరుగుతాయి; కాళ్ళు తడబడతాయి. అక్కడనుంచి కిందికి దూకితే? దూకి చనిపోతే-? ఆ చావుని వూహించడంలో ఆనందం పొందుతాడు. ఎలక్ట్రిక్ ఫాన్ గిరగిర తిరుగుతూవుంటే, అందులో వేళ్ళు పెట్టి, నిలిపి, వేలుకి దెబ్బ తగిలితే – ఆ అనుభవాన్ని ఊహించుకుని ఆనందం పొందుతాడు తోటి మానవుడు చనిపోయే దృశ్యం చూడటంలో ఎంతో ఆనందం పొందేవారు, ప్రాచీన గ్రీకు, రోమ్ నాగరికతల ప్రజ. తొడపాశం పెట్టే మాష్టరు, కుస్త్రీలకెగబడే జనం, డిటెక్టివ్ నవలలో హంతకుడి వేటలో పాల్గొనే పాఠకుడు, క్రోడికం పెట్టే అత్తగారు, సినిమా చిత్రాలను సెన్సార్ చేసే అధికారి – వీరంతా ఇతరులని బాధించడంలో ఆనందం పొందుతున్నారు – ఆ బాధ తమకి సంభవించినట్లుగా ఊహించుకుని; ఈ ఆనందం వెనక, 'మృత్యువుపై మమకారం' ఉంది. మనిషి 'అహం'ని-ప్రేమిస్తాడు తన్ను తాను ప్రేమించుకుంటాడు – ఇది తృష్ణకు కారణం. తన్ను తాను హింసించుకుంటాడు – ఇది మృత్యువుపట్ల కోరిక. 'అహం'ని చంపుకో మనడం కూడా. మృత్యువుపట్ల కోర్కెనుండి జనించినదే. దేన్ని ప్రేమిస్తాడో, దాన్ని చంపుకోవడము – మానవుడి జీవితంలో విషాదకర వ్యవస్థ ఎవరన్నారో ఇప్పుడు జ్ఞప్తికి రావడంలేదు – "మానవుడు ప్రేమించిన దాన్ని చంపుతాడు – ధైర్యశాలి, కత్తితో పొడిచి చంపుతాడు; పిరికిపంద, ముద్దుతో చంపుతాడు" అని.

కావల్సినదాన్ని పొందలేనప్పుడు, తన్ను తాను హింసించుకోడం మొదలవుతుంది. శిశువు ఏవో కావాలంటాడు అవి దొరకవు, కోపం చూపుతాడు. కసి ప్రకటిస్తాడు. కాని మరీ ఎక్కువగా ప్రకటించకూడదు. తల్లీ తండ్రీ అతన్ని కనుక్కుంటారు వారిని మరీ హింస పెట్టకూడదు తను ఎవరిని ప్రేమిస్తాడో, వారినే ద్వేషించే వ్యవస్థ అది కాబట్టి, ఆ కసి, ఆ ద్వేషం, తన పైననే చూపుతాడు రెండేళ్ళ ఆడబిడ్డ – తల్లి చెంచాతో నోట్లో తినడానికి పెడుతూంది బిడ్డకి ఇష్టం లేదు గింజుకుని, అయిష్టం కనబరుస్తుంది. తల్లి గ్రహించక, ఇంకా చంచాతో పెడుతూనే వుంది బిడ్డ ఏం చేసింది? ఆ చెంచాని

లాక్కుని, గొంతులో వుంచుకుని, కసిగా, తినుబండారాన్ని వొక్క గుటకలో మింగివేసింది. తనని తాను హింసించుకుంది.

ఈ హింసా తత్వం బీజాలు బాల్యములో నాటబడతాయి కొన్ని చర్యలు లైంగికానుభూతిలో నిమిత్తం గలవి. మేష్టరు బెత్తంతో కొడుతుంటే, కామక్రీడ సౌఖ్యంతో ముడిపడ్డ ఆనందం పొందుతాడుట నేరస్తుణ్ణి దండించడం — నైతిక చింతన, సాంఘిక ధర్మం — ఇవన్నీ ఈ రకం రహస్యమైన ఆనందం నుండి జనించినవే నంటారు నేటి మనఃశాస్త్రజ్ఞులు ఇతరులని హింసించడం, మనల్ని మనం హింసించుకోవడం — ఈ రెండూ, 'అహం' శాసించిన నైతిక పరిణామాలే. కురుపు సలుపుతూంటే, దాన్ని కెలికి బుద్ధివేస్తుంది. కెలికి, నెప్పిచేసి 'అయ్యో' అని బాధపడడంలో ఆనందం; సలుపుతున్న పన్నుని కదిపి చూడడం, అట్లాంటిదే. హింసలో రహస్యమైన శారీరక అనుభూతి; మనల్ని మనం హింసించుకోడంలో 'మృత్యువు పట్ల కోరిక' — 'అహం'ని అంతం చెయ్యడం — అదీ మానవుడి నైతిక వ్యవస్థ.

బాల్యంలో తలిదండ్రులు, ఇంట్లో పెద్దలు — ఆదర్శాల పునాదులు వేస్తారు వారి మాదిరిగా ఉండడానికి యత్నిస్తాడు బాలుడు. వారిని అనుకరిస్తాడు. వారి ఆదర్శాలను తనవిగా స్వీకరిస్తాడు కాని, కొన్ని ఆదర్శాలు, తన వ్యక్తిత్వానికి విరుద్ధాలైనవిగా వుండొచ్చు అట్లాంటప్పుడు, సంఘర్షణ బైలుదేరుతుంది. సాధించలేక, విఫలుడై ఓడిపొయ్యానే — అన్న చింత ఉండిపోతుంది. ఈ చింత నిరంతర దిగులుగా స్థిరపడి — సాధించి, గెలిచినవారిపట్ల ద్వేషంగా పరిణమిస్తుంది. కాని బాలుడు, ఎదిగాక వెంటనే, తాను ఓడిపోయినట్లు అంగీకరించక, ఇంకా, ఆ ఆదర్శాలను సాధించడంలో పట్టుదల చూపుతూ, మూర్ఖంగా తయారవుతాడు. అదంతా దగా — అదొక నాటకం. అది నాటకం అని గ్రహించి, వొప్పేసుకుని, ముసుగు తొలిగించాక, సుఖంగా, హాయిగా, నిశ్చింతగా ఉంటాడు — ఉపన్యాసం ముగిసాక, ఉపన్యాసకుడు, హాయిగా, సుఖంగా ఉన్నట్లు. ఆ 'హాయి' 'సుఖం' కొన్ని రోజులు పాటు ఉపన్యాసకుణ్ణి కలవర పెడుతూ వుంటుంది. ఉపన్యాసానికి ముందుపడిన ఆవేదన, ఆదుర్దాకంటె, ఐపొయ్యాక కలిగిన అలజడి వారంవరకూ నిద్ర పట్టకుండా చేస్తుంది. సంగీతం రానివారు, నేర్చుకునేటందుకు చేసేయత్నాలు విరమించినప్పుడూ, స్థూలకాయం గల స్త్రీలు, సన్నబడాలని చేసే యత్నాలు మానుకున్నప్పుడూ ఇట్లాంటి తహతహా అలజడీ పొందుతారు ఆదర్శానికీ యదార్థానికీ మరీ ఎక్కువ వ్యత్యాసమున్నప్పుడు, బాధ పడటమే కాకుండా, ఏదో అపరాధం చేశామన్న భావం

ఉండిపోతుంది. "నే నింతే సాధించాను – చాలా స్వల్పం" అనుకున్న వ్యక్తి, అంతటి స్వల్పాన్నే సాధించిన మరొక వ్యక్తిని విమర్శించడు. మరొక వ్యక్తి సామాన్యుడు; మనం ఘనులం కావున మనల్ని మనం విమర్శించి, ఖండించుకోవడంలో, మన ఘనత చెప్పివేసి, ఆనందం పొందుతాం. సాధించలేనప్పుడు, ఆదర్శాల అంతస్థుని పరిమితం చెయ్యడం వొక పద్ధతి, స్వల్పమైన ఆదర్శాన్ని ఎన్నుకుని, సాధించి తృప్తి పడటం అన్న మాట. లేదా, ఓటమికి కారణాలు వెదకడం మరొక పద్ధతి. "నా ఆరోగ్యం బాగుంటేనా!" "నాకే గనక అవకాశాలుంటేనా!" ఇవన్నీ వెదికే కారణాలు. కాని నేటి సమాజంలో ఏదో విధంగా డబ్బు గడించడమే జీవిత లక్ష్యంగా ఉంటుంది. కొందరికి ఇది సుఖవు - ముఖ్యంగా డబ్బున్నవారికి. డబ్బు లేనివారు సంస్కృతీ, విద్యా, కళారాధనా – ఇవి ముఖ్యం కాని, డబ్బు కాదని తృప్తి పడతారు ఈ రెండూ సాధ్యపడని కొద్ది మంది ఉంటారు. ఈ జగత్తు మాయ; పరమాత్మ యదార్థం, తపస్సు ద్వారా, పరమాత్మని చూరగొని, ఐక్యం అవుతాను – అని వీరు ఆధ్యాత్మిక చింతనని లక్ష్యంగా స్వీకరిస్తారు. "ఏ శక్తి సామర్థ్యమూ ప్రతిభా లేనివారు దైవం పేరిట ఖ్యాతి తెచ్చుకుంటున్నారు." అని బెర్నార్డ్‌షా అన్నట్లు. వీరికి శిష్యగణం ఏర్పడి, ఆ శిష్యులు కూడా వీరి ద్వారా మానసిక ఘనతని తెచ్చుకుని తృప్తి పడతారు.

మానసిక శాస్త్రంలో ప్రత్యేక కృషి చేసిన పండితులు చెప్పిన కొన్ని ఉదాహరణలను పొందుపరుస్తాను. అమ్మా నాన్నా చిన్నతనంలో మనపట్ల ప్రేమా, వాత్సల్యమూ చూపుతారు. వారి మెప్పు పొందడం కోసం యత్నిస్తాడు శిశువు. వారు కోరినట్లు నడుచుకోడానికి యత్నిస్తాడు. అదే 'మంచి' అంటేకూడా. వారు కోరినదానికి విరుద్ధంగా వుంటే, వారు దండిస్తారు. అదే 'చెడ్డతనం' అంటే. అట్లా చెడ్డగా వుంటే, వారు శిక్షిస్తారు పాపం, శిక్షణ, పశ్చాత్తాపం – ఇవన్నీ ఆ దశలో స్థిరపడతాయి. పెద్దయ్యాక ఈ మంచి చెడ్డలు, 'అహం' 'అహం శాసించిన ఆదర్శం'గా – రూపొందుతాయి

పదహారు మాసాల వయస్సు గల బిడ్డని, తండ్రి "ఏయ్ – ఏయ్" అన్న ధ్వని చేస్తూ బుజ్జగిస్తాడుట. బుజ్జగించడం నిలిచాక, బిడ్డే తనని తాను బుజ్జగించుకుంటూ, "ఏయ్ – ఏయ్" అన్న ధ్వనులు చేసిందట రెండేళ్ళకు మరొక బిడ్డ, తల్లి అసంతృప్తి ప్రకటిస్తూ తనని కొట్టిన విధంగా తను కొట్టుకుందిట. "వెళ్ళి ఆ మూల నిలబడు" అని తల్లి శాసిస్తుంటే, శిక్షిస్తుంటే. ఆ బిడ్డ తల్లి ఎదురుగా లేనప్పుడు వెళ్ళి మూల నిలబడేదిట. బిడ్డ, తల్లి కంఠం, ధోరణి

అనుకరిస్తుంది. వారు విధించే శిక్ష, అనుకరించడం సాధ్యం కానప్పుడు అసంతృప్తి లోలోన రేగి, 'గజ్జి'గానో, 'చర్మ వ్యాధి'గానో ఆ అసంతృప్తి బైట పడుతుందట తలిదండ్రుల మెప్పు పొందాలన్న వాంఛ, పెరిగాక సమాజములో నలుగురి మెప్పు కూడా పొందాలన్న కోర్కెగా పరిణమిస్తుంది ఉపన్యాసకుడు ప్రేక్షకుల మన్ననల నందుకోవాలనుకుంటాడు ఇది రాదేమోనన్న భయమే ఉపన్యాసకుడి ఆందోళనకి కారణం ఉపన్యసిస్తేగాని మెప్పు దొరకదు. మెప్పు దొరుకుతుందన్న ధీమా ఏర్పడితే గాని ఉపన్యసించలేడు. మెలితిప్పే బొత్తాం, కాగితం, రుమాలు, పట్టుకుని వూపే బల్ల – ఈ మెప్పుకోసం తహతహలాడే 'అహం' యొక్క బహిర్గత చిహ్నాలు.

ఉపన్యాసకుడుగా తగిన పేరు సంపాదించలేనప్పుడు, ఆవ్యక్తి అవతారం మారుతుంది ఇతర ఉపన్యాసకులపట్ల సానుభూతి, ఆపేక్ష, కరుణ, ప్రోత్సాహం-చూపవచ్చు. లేక, ఇతర ఉపన్యాసకుల్ని ఆక్షేపించవచ్చు. అసలు ఉపన్యాసాలు కూడదు; నిశ్శబ్దం, – ప్రశాంతత అలవరచుకుని, మౌనంగా గడపాలన్న వొక సిద్ధాంతాన్ని తోటి వారి నెత్తిన రుద్దే యత్నం జరగొచ్చు. ఇట్లాంటి వ్యక్తే, ఉపన్యాసం ముగిసి, ఉపన్యాసకుడు బైటకి రాగానే, తుపాకి పేల్చి చంపాలనుకునేవాడు – 'రోగుల పట్ల అతి దయ, అనుచితమైన ఆదరణ చూపడం, ఆదర్శాన్ని సాధించలేక విఫలులైన వారి లక్షణం' అంటుంది, అన్నా ఫ్రాయిడ్ అనే మనశ్శాస్త్ర పరిశోధకురాలు. మృత్యువుపట్ల కోర్కె అతి దయగా రూపొందుతుందంటుంది, ఈమె "నేను గట్టిగా పట్టుదలతో కృషిచేస్తే, ఇవన్నీ చేసి వుందును," అంటాడు విఫలుడైన వ్యక్తి ఇలాంటి వ్యక్తి ఏ కళనీ అభ్యసించక, దేన్నీ సాధించక, సాంకేతిక పరిజ్ఞానం, నైపుణ్యంలేని, సామాన్యవ్యక్తిగా వుండటముతో తృప్తిపడతాడు ఇట్లాంటివారే ఆధునిక కవితనీ, చిత్రకళనీ, "మాకేమీ అర్థం కాదు." అనే నినాదంతో వెక్కిరిస్తారు ఆధునికతత్వాన్ని అర్థంకాదంటూ హేళన చెయ్యడము వీరికి 'ఫాషన్' "ఇప్పుడు వక్తలు ఎక్కడున్నారండీ! వెనక బిపిన్ చంద్రపాల్, సురేంద్రనాథ్ బెనర్జీ, సరోజినీనాయుడు, ఎనిబిసెంట్, సి ఆర్ రెడ్డి – వాహ్ వక్తలంటే!" అంటారు వీరు వీరికి నన్నయ, యఱ్ఱాప్రగడ, ముద్దుపళని పేర్లే తెలియవు తెలుసు, కాని తెలియదని పైకి చెప్పడములో, ఒక ఆధిక్యతని ప్రకటిస్తున్నారు.

"ఈ చిత్రం నా కర్థం కావడంలేదు. ముక్కు, కళ్ళు ఏవి?" అని అడుగుతారు వీరు. మాటిస్ అనే ఫ్రెంచ్ చిత్రకారుడు గీసిన వొక నగ్న స్త్రీ చిత్రం చూసి వొకామె "ఆడది అల్లా వుండదే" అందిట. "ఇది ఆడది కాదు.

ఇది వొక బొమ్మ" అన్నాడుట మాటిస్. ఈ దృక్పథము నుండి చిత్రమైన వ్యక్తులు బైలుదేరుతారు తాను ప్రేమించిన వ్యక్తిని, మరొకామె ప్రేమించి, విజయం సాధించినప్పుడు, విఫలురాలైన స్త్రీ, తన సర్వస్వమూ, విజయం సాధించిన సోదరికి ఇచ్చివేసి, ఆమెక సేవ చేస్తూ గడిపిందిట. సోదరి పొందిన విజయం తనదిగా భావించి తృప్తి పడిందన్న మాట ఒక నవలలో, ప్రేమ సాధించలేని ఒక పురుష పాత్ర, ఇతర ప్రేయసీ ప్రియుల్ని కలవడంలో గడిపి తృప్తి చెందుతాడు. "మా నాన్న గొప్ప చిత్రకారుడు; మా అమ్మ మంచి నర్తకి; మా అన్న గొప్ప కవి," ఇవన్నీ ఇతరుల ద్వారా, మనం పొందే ఘనతకి అంతరంగ చిహ్నాలు.

తలిదండ్రుల ముందు అనరాని మాట ఏదన్నా అంటే, వారు కూక లేస్తారు. బాలుడు నోరు మూసుగుంటాడు. మౌనం — ముసుగుగా, మనస్సుకి కప్పుకుంటాడు. ఏదిగాక, ఉపన్యసించమంటే ఆ ముసుగుని తియ్యాలి తల్లి, తండ్రి, అన్న, మామయ్య — తాను బాల్యంలో ఎరుగున్న పెద్దలు ఎవరన్నా ప్రేక్షకులలో వుంటే, ఆ ముసుగు తియ్యలేడు. వారెవ్వరూ లేకుంటే, కొంత వరకూ సాధ్యవడుతుంది. సన్నిహితులకి వక్త, వ్యక్తిత్వముతో పరిచయం వుండి తీరుతుంది ఉపన్యసించేటప్పుడు, తా మెరుగున్న వ్యక్తి, ఇప్పుడు ప్రసంగిస్తూ వున్న వ్యక్తి — ఇద్దరూ వొకటో కాదో, నాటకము ఆడుతున్నాడో లేదో వారు వెంటనే పసికడతారన్న భయంవల్ల, వారి సమక్షంలో ఉపన్యాసం సాగదు. ఎరుగున్న స్నేహితులు, బంధువులు, ఎవ్వరూ ప్రేక్షకులలో ఉండరన్న ధీమాతో, స్నేహితు డొకాయన, కొత్త ఊళ్ళో చక్కగా ఉపన్యసిస్తాడు. కాని ఇంటి కొచ్చి, స్వగ్రామంలో నోరు మెదపలేడు.

"వొద్దు", "కూడదు" "అనకు" "చెయ్యకు" "వెళ్ళకు" "చెయ్యి పెట్టకు," — లాంటి గర్జనలతో, బాలుడి ఊహాజగత్తులో అంతరాయాలు, నిషే ధాలు కల్పిస్తారు పెద్దలు. ఈ నిషేధాలవల్ల బాలుడు, ఊహా జగత్తులో స్వేచ్ఛగా విహరించలేడు. ఆ జగత్తు పరిమితం అవుతుంది. అందులో పెద్దలతో, యుద్ధం రేగుతుంది. పెద్దలు బలశాలులు - వారు నెగ్గుతారు బాలుడు వోడిపోతాడు. సభలో నిలబడి మాట్లాడలేడు. మృత్యువుని కోరతాడు. తన్ను తాను హింసించు కుంటాడు. "సరే, వొచ్చి మాట్లాడతాను లెండి," అని ఆహ్వానాన్ని స్వీకరించి తన్ను తాను హింసించుకుంటున్నాడు. లోలోన అనుకుంటాడు: "నలుగురి మధ్య నిలబడి, బట్టలు తీసివేస్తాను. ముసుగును తొలిగిస్తాను నా తడాఖా చూపిస్తాను. అప్పుడు కాదన్నారు, కూడదన్నారు, వొద్దన్నారు. ఇప్పుడు, విజృంభిస్తాను.

వినండి; చావండి." కాని వేదికపై రాగానే, ప్రేక్షకులపట్ల కసి, తన మీదికి ఎదురుతిరుగుతుంది. నా కాలు విరిగి, సభ వాయిదాపడితే బాగుండుననో, భూకంపం వొచ్చి, 'ఉపన్యసించే బెడద తప్పా'లనో అనుకుంటాడు.

బాల్యంలో ఏర్పడే అంతరాయాలు వింత స్వరూపాలు దాలుస్తాయి. ఈ ఉదంతం చూడండి. ఒకామె ఉంది. వయస్సు ఇరవై నాలుగు – చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. కాని ఆమె మనస్సు పాడైంది. దిగులుగా ఉంటుంది. స్తబ్ధత, మాంద్యం ఏర్పడ్డాయి. డాక్టర్లతో చెప్పుకుంది. ఏమిటి ఆమె అవస్థ? రోడ్డుమీద గబగబ నడుస్తూవుంటే, తను నడవకుండా, జనం అడ్డుకుంటారుట. స్టేషన్ ప్లాట్‌ఫారమ్‌మీద, రైలు పెట్టెలో ఎక్కడానికి వేగంగా నడుస్తూవుంటే, జనం అడ్డుకుని, తనని నడవనీయకుండా చేస్తారుట. ఇవన్నీ తప్పించుకుని నడిచేసరికి, రైలు వెళ్ళిపోతుందిట. అట్లాగే బస్‌స్టాండ్ దగ్గరకి వేగంగా నడిచి వెడుతుంటే, వాళ్ళూ వీళ్ళూ అడ్డు తగులుతారు. తనని తొందరగా నడవనివ్వరు. బస్సు వెళ్ళిపోతుంది. అల్లాగే, ఏ పనీ సకాలంలో జరగనీయకుండా, జనం అడ్డు తగుల్తూండడంవల్ల పన్లు జరక్క, ఆమె వెనకబడిపోతోందని, డాక్టర్లతో చెప్పుకుంది దీనికి డాక్టర్లు చేసేదేమీలేదు. మనఃశాస్త్రజ్ఞులు ఆమెని పరీక్ష చేశారు బాల్యంలో ఆమె పొందిన అనుభవాలు, అనుభూతులు ఎట్లాంటివో చెప్పించారు తేలింది ఇదీ. ఆమె చిన్న పిల్లగా ఉన్నదశలో, ఇంట్లో పెద్దలు, అడ్డుతగులుతూ వొచ్చారుట. రోడ్డుమీద పెండ్లిబాజా వినబడితే, ఆ చోద్యం చూద్దామని ఈ బాలిక వేగంగా రోడ్డు మీదికి వెళ్ళి చూడాలనుకున్నప్పుడు, తన కంటే ముందే, అమ్మ, అత్తయ్య – వారంతా స్థూలకాయులు – గుమ్మం దగ్గరకి వెళ్ళి, ఈ పిల్లకి అడ్డుతగిలేవారు ఆమె కంటే ముందుగా వెళ్ళేవారు; గుమ్మంలో అడ్డంగా నిలబడి, ఈమెకి ఏదీ కనబడకుండా అడ్డుకునేవారు. వంటింటి చూరు వొకమారు అంటుకొందిట తను చూడాలని గబగబ పరుగెడుతుంటే, అత్తయ్యో, అమ్మో, పిన్నమ్మో తన ముందుగా నడిచి, తనని ముందుగా చూడనీకుండా అడ్డు తగిలేశారు. ఇదొక మానసికమైన అంతరాయంగా ఆమె అంతరంగంలో స్థిరపడింది తనని తాను హింసించుకోడం మొదలెట్టింది. రోడ్డు మీద అందరూ నడుస్తారు. కేవలం ఈమె నడవకుండా, ఎవ్వరూ అడ్డుకోరు. ఈమే, ముందు వెడుతున్నవారి వెనకగా నడిచి, వారు అడ్డు తగుల్తున్నారనుకుని, తను సాధించలేని పనికి సాకుని వెదుకుతూందన్నమాట. ఈమెయే వారి వెనక వెళ్ళి ఆలస్యాన్ని కోరుతుంది. కసిని తనపై తిప్పుకుందన్నమాట. అల్లాగే రోడ్డుమీద ప్రమాదాలు అందరికీ జరగవు. 'ప్రమాదం జరగాలి' అన్న జిజ్ఞాస

రహితమైన కోర్కె గలవారికే జరుగుతాయి ప్రమాదాలు. ఈ కోర్కె పునాదులు 'మృత్యువుపట్ల కోర్కె' అన్న భవనానికి, బాల్యంలో తాను వేసుకున్న పునాదులు.

ఇట్లాంటి అర్థంకులు బాల్యంలో పొందిన వ్యక్తి, ఉపన్యాసకుడుగా తయారయితే, 'నేను ముందు మాట్లాడుతాను' 'మిగతావారు, నా తర్వాత' అంటాడు. ఉపన్యాసం బెడద, గబగబ కానిచ్చివేసి 'అమ్మయ్య' అని నిట్టూర్చి, ప్రేక్షకులలో కూర్చుని, మిగతా వక్తల అవస్థ తిలకిస్తూ ఆనందించవచ్చు. మరొకరకం వక్త 'నేను చివ్వర మాట్లాడుతాను; మిగతావారిని ముందు కానిమ్మనండి, చివ్వరలో నన్ను పిలవండి' అంటాడు. మిగతావారంతా మాట్లాడేసరికి, ప్రేక్షకులు విసుగు చెంది వొక్కరొక్కరే జారుకుంటారు తను మాట్లాడవల్సి వొచ్చే సమయానికి, హాల్లో జనం ఎవ్వరూ ఉండరు – ఇంక అట్లాంటప్పుడు తను మాట్లాడే ప్రమాదం తప్పుతుంది

అన్నలు, తమ్ముళ్ళు, చెల్లెళ్ళు, అక్కలు లేక వొంటిబిడ్డగా పెరిగి పెద్దవాడైన బాలుడు, పెద్దయ్యాక, ఉపన్యసించవల్సివొస్తే "ఇంకెవ్వరూ లేకపోతే నే వొస్తాలెండి" అంటాడు అంటే ఆ సభలో వొక్కడే ఉపన్యాసకుడిగా ఉండాలని కోరతాడు; ఇంకెవ్వరూ ఉండకూడదు. పోలికలు, వ్యత్యాసాలు – వాడికంటె వీడిది బాగుంది – అన్న ప్రశంస ప్రేక్షకులలో రాకూడదన్నమాట.

మనవైపు తిప్పుకునే ద్వేషభావము, క్రోధము కొన్ని సందర్భాలలో వొక సాముదాయక వ్యవస్థగా పరిణమించొచ్చు. మనకి మరొకరిపైన ఉన్న ద్వేషభావాన్ని, మనవైపు ప్రసరింప చెసి, బాధపడి, అవతల వ్యక్తిని హింసించడం అన్నమాట. ప్రసిద్ధ మనః శాస్త్రజ్ఞుడు జె. సి. ఫ్లూగెల్, చెప్పింది గమనించ తగింది :

"గనులలో పనివాండ్రు, పని నిలిపి, గనులలోనే ఉండిపోవడం; కర్మాగారాలలోనూ, దుకాణాలలోనూ, పని నిలుపుచేసి, పనివాళ్ళు సమ్మెచెయ్యడం. ఈ విధంగా వారు తమ సౌకర్యాలని త్యాగంచేసి. ప్రజల సానుభూతి పొంది, దానిద్వారా తమకు కావలసిన వాటిని పొందగలగడం, నేటి [illegible]లో సరిపాటైపోయింది. సహాయనిరాకరణోద్యమాలు, అహింసాత్మక, శాంతియుతమైన సమ్మెలు, జైళ్ళల్లో నేరస్థులూ, రాజకీయ ఖైదీలూ అవలంబించే నిరసన వ్రతాలూ, నిరాహారదీక్షలూ ఇట్లాంటివే కొన్ని పాఠశాలల్లో, విద్యార్థులు చేసే తప్పిదాలకూ, పొరబాట్లకూ ఉపాధ్యాయులను దండించే పద్ధతి ప్రవేశపెట్టి చూశారు. పిల్లల్ని దండించడము బదులు, ఉపాధ్యాయులే తమను తాము దండించుకొంటారన్నమాట."

మన వ్యక్తిత్వం నిర్దేశించిన ఆదర్శాలను జీవితంలో సాధించే యత్నం లోపించినప్పుడు, ఏదో అపచారం చేసినట్లు బాధపడతాం. అట్లాంటప్పుడు, బాధని ఆహ్వానించి, స్వీకరిస్తాం "నాకు ఇది జరగాల్సిందే – తగినశాస్తి" అని దుఃఖాన్ని ఎదుర్కొంటాం. తగినశాస్తి జరిగినప్పుడు, తాను పాపం చేశానన్న భావంనుండి విముక్తుడౌతాడు, మనిషి. అట్లాంటి సందర్భంలో, మనకి బాధ కలగక, అన్నీ సక్రమంగా జరిగి, అనుకూలమైన పరిస్థితులు ఏర్పడి, పురోగమించినప్పుడు, "ఏమిటి చెప్మా! అన్నీ బాగా ఉన్నాయి – నాకు ఏ అపకారమూ జరగలేదు ఎందుకో!" అని ఆశ్చర్యపడతాడు. బాగా ఉన్నవాణ్ణి చూసి దైవం కూడా ఓర్వలే దంటారు "అపకారం జరగలేదే! బాధ కలగలేదే!" అన్న ఈ భయంవల్లనే, మానవుడి పురోగమనానికి అంతరాయం ఏర్పడుతోంది. నేటి నాగరీక సమాజాలలో ఎవరన్నా సుఖంగా ఉంటే, వా రేదో అపచారం చేసినట్లు భావించడం ఉంది. అల్లా సుఖంగా ఉండే అవకాశం, ప్రజాస్వామ్యంలో అందరికీ ఉండాలి – ఏ కొద్దిమంది అదృష్టవంతులకో కాదు అది సాధ్యం కాకపోతే అందరూ సమంగా బాధపడాలి; కష్టపడాలి. అసలు అదృష్టానికి తా వుండకూడదు. దీన్ని మనః శాస్త్రజ్ఞులు, "పాలిక్రటీస్ అడ్డంకు" అంటారు. పాలిక్రటీస్, ప్రాచీనకాలంలో, 'సామోస్'ని పాలించిన నిరంకుశ ప్రభువు. అతను తలపెట్టిన కార్యక్రమాలన్నీ విజయవంతములై ఫలించాయి ఓటమి అంటే ఏమిటో అత నెరుగడు. అతని అనుచరులు, స్నేహితులు ఆశ్చర్య పడ్డారు. ఇతని కాలం మూడిం దనుకున్నారుట. అదృష్టదేవత, ఇతన్ని కూల దొయ్యడానికి పన్నాగాలు పన్నుతూ, వేచివుంది – వొక్కసారి కూలదోస్తుంది, అని బెదిరి, పాలిక్రటీస్ దగ్గరకు వెళ్ళి "అయ్యా, మాకు భయంగా ఉంది – మీకు ముప్పు వాటిల్లుతుంది. అది జరగకుండా, ఏదన్నా యాగం చేసి, దానం చెయ్యండి" అని కోరారుట. సరేనని, ఆ ప్రభువు ఖరీదైన తన వేలివుంగరాన్ని సముద్రంలో పారవేశాడుట.

ఆ ఉంగరాన్ని వొక చేప మింగింది. ఆ చేపని బెస్తవాడు పట్టి, వండి, పాలిక్రెటీస్ ప్రభువు విస్తరిలో వొడ్డించాడుట. ఆ చేప వొంట్లో ఉంగరం బైట పడింది అనుచరులు విస్తుపొయ్యారు. ప్రభువు చేసిన దానాన్ని దేవతలు స్వీకరించలేదు. వారు కోపగించి, ఈయన్ని కూలదోయడము తప్పదని నమ్మి, వారంతా ఆ ప్రభువుని విడిచేసి పారిపొయ్యారుట.

పాపం ఎరుగని పసికందు – చిన్నప్పుడు చనిపోతే – పాపం ఎరగని ప్రాణి, దేవతలకిష్టం అని నమ్మడం మనసులో ఉంది. మంచివాడు బ్రతకడు

నాయనా — పాపీ చిరాయువు — అన్నసూక్తి. జబ్బుతో మంచాన పడినవ్యక్తి, అల్లాగే ముక్కుతూ, మూలుగుతూ నాలుగుకాలాలపాటు ఉంటాడు — దబ్బున చావడు. బలంగా, ఆరోగ్యంగా, తలనొప్పంటే ఏమిటో ఎరగని వ్యక్తి 'టప్' మని ఎగిరిపోతా డనుకోడంలో "పాలిక్రెటీస్ అర్ధంకు" ఉందన్నమాట.

ఒక్కొక్క రచన బాగా జరగాలంటే, రచయితకి శరీర అనారోగ్యం అవసరం. అట్లాంటప్పుడు, గట్టిగా కోరితే అనారోగ్యం ప్రాప్తిస్తుంది. జబ్బుగా ఉన్న దశలో, గొప్ప రచన వెలువడవచ్చు అది పాలిక్రెటీస్ అర్ధంకు తెచ్చి పెట్టేదే. జబ్బుచేస్తే - ఆ సాయంత్రము ఉపన్యసించే అవస్థనుండి తప్పించు కోవచ్చు ననుకుంటే, జబ్బు చెయ్యనూవచ్చు; ఆ జబ్బే, అర్ధంకుని తొలగించి భయాన్ని పొందరోలి, అద్భుతంగా ఉపన్యసించే శక్తినీ ఇవ్వొచ్చు ఈ అర్ధంకు వొకటుందన్న జిజ్ఞాస ఉన్ననాడు, భయాన్ని చాలావరకూ జయించే అవకాశం ఉందనొచ్చు

మానసిక శాస్త్రం ఒంటున్నవాటిని విడిచివేస్తే, ఉపన్యాసకుడి భయానికి కారణం — తన్ను తాను ఎదుర్కొనే అవస్థ పట్టడమే అనుకుంటాను. "నిన్ను నువ్వు తెలుసుకో" అంటాయి వేదాలు. మన భావాలు ఎట్లాంటివో, మన నిజ స్వరూపం ఏమిటో, పైకి చెప్పివేస్తేగాని తెలిసిరావు. పైకి చెప్పివేసి, తన్నుతాను తెలుసుకోగలగడం అంటే, మనిషికి భయం. "నేను చాలామంచివాణ్ణి. గొప్ప వాణ్ణి" అని దగా చేసుగోడం సుళువు — ఉపన్యసించకుండా, ఉపన్యసించగానే తన బండారం "నిజ స్వరూపం" బైట పడుతుంది. ఇందుకు సిద్ధపడనప్పుడు భయపడి, బెదిరిపోక తప్పదు — సింహానికైనా సరే.

అజ్ఞానం - 3

# గ్రంథకర్త: అనామకోపాఖ్యానం

"పెనిమిటి బిడ్డని గుణముల
వినుతింపగ, ప్రేమ భావ విహ్వల మతియై
చనుమొనల పాలు గురియగ
కనుగొనలను జలము లొలుకగా బెగ్గిలియెన్."

*　　　*　　　*

"మన దేశం మొత్తంమీద 15 8 కోట్లకు పైగా పశువులున్నాయని అంచనా. ఉజ్జాయింపుగా చెప్పితే దేశంలో ప్రతి ముగ్గురికీ ఒక పశువు చొప్పున ఉన్నదన్న మాట అయితే వీనిలో అధిక భాగం తిండి లేక బక్కచిక్కి ఎందుకూ కొరగాకుండా ఉన్నాయి దేశంలోని ఉత్తమజాతి అవులైనా పాశ్చాత్య దేశాలందలి సామాన్యపు ఆవులు యివ్వగల పాలలో సగము మాత్రమే యివ్వ గలుగుతున్నాయి. మేలు జాతి పశువుల ఉత్పత్తిని ప్రోత్సహించే నిమిత్తం కీలక గ్రామ పథకమనేది ప్రవేశపెట్టబడింది. గత రెండు ప్రణాళికలలో ఈ పథకం క్రింద దాదాపు రెండువేల గ్రామాలు ఎన్నిక చేయబడినవి. ఈ గ్రామాలలో ఉత్తమ జాతి యెద్దులు ఉంచబడతాయి. ముసిలి పశువులు, వ్యాధి పీడితమైన పశువుల సంరక్షణ నిమిత్తం పెక్కుచోట్ల గో సదనములు యేర్పాటు చేయ బడ్డాయి."

*　　　*　　　*

మొదటిది పద్యం. అందులో మధురమైన కవిత్వం వుంది పొలిస్తూ పుల కించి పరవశురాలైన తల్లి స్థితి వర్ణన. చను మొనల పాలు కురుస్తూ వుండగా, కన్నులంట నీరు కారుతుందన్నది గొప్ప భావన. నాకళ్ళంట నీళ్ళు తిరుగుతాయి. ఇది వ్రాసినాయన్ని ప్రపంచ కవుల చిట్టాలో ఉంచడానికి సంకోచించను.

రెండోది వచనం దేశంలో ప్రతి ముగ్గురికీ ఒక పశువు చొప్పున వుందని గ్రహించినప్పుడు నా గుండె జలదరిస్తుంది పీటిల్లో చాలా భాగం తిండి లేక

బక్క చిక్కి — ఎందుకూ కొరగాకుండా వున్నాయని తెలుసుకుంటే భయం వేస్తుంది. ముసలి పశువులు, వ్యాధి పీడితమైన పశువుల సంరక్షణ నిమిత్తం చాలాచోట్ల గో సదనాలు ఏర్పాటు చేస్తున్నారని తెలుసుకుంటే, నా కళ్ళంట నీళ్లు తిరుగుతాయి

ఆ పద్యం, ఈ గద్య — కరుణరసాన్ని పోషిస్తున్నాయి ఆ పద్యం వ్రాసినాయన, వెనకటి తరం మహాకవి. ఈ వచనం వ్రాసినాయన, నేటి కాలపు గ్రంథ కర్త. కాని ఇద్దరికీ పేళ్లు లేవు — 'పేరులు' అనడం ఒదులు — 'పేళ్ళు' అన్నాను; చూశారా, వెనకటి తరం కవిత్వము అనగానే, గ్రాంథికంలో పడి పోతాము కాబోలు: ఈ ఇద్దరికీ పేరులు లేవనికాదు ఉంటాయి. అమ్మా, నాన్నా - వాళ్ళు పుట్టగానే నామకరణం చేసివుంటారు సందేహం లేదు. కాని ఆ పేరులు మనకి తెలియవు ఏమిటీ దారుణం? అంత గొప్ప పద్యం వ్రాసిన కవి పేరే మనకి తెలియదా? తెలియకేం? మాచక్కా తెలుసు. పరిశోధకులు ఊరుకుంటారా? ఈ కవి ఒంటిమిట్ట వాసి అని వావిలికొలను సుబ్బారావుగారు వాదించారు. ఈయన తెలంగాణములో ఓరుగల్లు వాడని వీరేశలింగం పంతులుగారు నిర్ధారించారు. ఆ తర్వాత, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, ఈ కవి ఏక శిలానగర వాసియై ఉంటాడనీ, ఏక శిలానగరమూ ఓరుగల్లూ వొకటేననీ వాదించారు. వాదా లన్నింటినీ విమర్శించి అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఈ కవి ఓరుగల్లు మండలం జనగామ తాలూకాలోని ... ఈ వాక్యం పూర్తిచెయ్యను; ఆ ఊరు పేరు చెప్తే, ఆ కవి ఎవరో నా పాఠకులు ఇట్టే గ్రహించివేస్తారు ఈ పాటికి గ్రాహించారేమొ కూడా — ముఖ్యంగా, నా పాఠకులలో స్త్రీలు, ఇట్టె గ్రహించి వుంటారు. ఈ కవి తెలుగువారికి అత్యంత ప్రియుడు. ప్రపంచ కవుల జాబితాలో వేసేశాను కూడా. వాక్యం పూర్తి చెయ్యనా?

"ఈ కవి ఓరుగల్లు మండలం జనగామ తాలూకాలోని బమ్మెరయేనని స్థాపించినారు " పోతన పూర్వుల జన్మస్థలము బమ్మెర అనీ, ఆయన భాగవతం ఓరుగల్లులో వ్రాశాడనీ తేలిపోయింది ఆ కవి ఎవరో, ఏ ఊరివాడో తెలుసుకోడానికి ఇంత గంద్రగోళం జరిగింది ఆ కవి ఏకాలంనాటివాడో ఈనాటివరకూ నిశ్చింతగా తేలలేదుట పండితులు రక రకాలుగా చెప్తున్నారు- ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన 'శ్రీ మహాభాగవతం' సంపాదకవర్గంవారు, ఈ పండితుల నిర్ణయాలపై చేసిన తీర్పు యిది:

"ఇన్ని నిర్ణయములందు కొంత మెరుగైనది. పోతన పదునైదవ శతాబ్ది యుత్తరార్థమునం దున్నవా డనునదే యైనను పోతన కాలము తదితర కృతుల

నిదమిత్థముగా తేల్చి చెప్పుట కిప్పటికి లభించిన చారిత్రిక సామగ్రి చాలదనియే మా యభిప్రాయము."

ఊరు, కాలం మాట అటుంచి పోతన పేరన్నా, మనకి తెలిసి రావడం మన అదృష్టం. కాని నేనుదహరించిన వచనం వ్రాసినాయన పేరు కూడా మనకి తెలియదు. వందలాదిగా వర్ధిల్లుతున్న అనామక గ్రంథకర్తలలో ఆయన వొకడు ఆ గ్రంథం పేరు 'పురోభివృద్ధికి ప్రణాళికలు.' గ్రంథకర్త పేరు లేదు ఎన్ని కాపీలు ముద్రించారో లేదు రచయిత తన హక్కులు కాపాడుకో లేదు. 'వెల' లేదు. అవి 'అమ్మకమునకు కాదు,' పీఠికలో మాత్రం, సెకండరీ పాఠశాలల విద్యార్థుల నుద్దేశించి వ్రాసిన పుస్తకం అని చెప్పుకున్నాడు. "పాఠ శాలా విద్యార్థులకే కాక మన దేశంలో ప్లానింగును గురించి తెలుసుకొనగోరే సామాన్య పాఠకులకు సహితం ఈ పుస్తకం చక్కని ప్రవేశికగా ఉపయోగపడ గలదని ఆశిస్తున్నాము" అని పీఠిక ముగింపు. 'ఆశిస్తున్నాము' ఏమిటి? ఆ రచయిత వొక్కడూ రాసింది కాదా? చాలా మంది కలిసి వ్రాశారా? ఏ వొక్కరి పేరూ లేదు ఈ గ్రంథంలో ఆడదో, మొగాడో తెలియదు. ఆయనకి సన్మానం లేదు పుస్తకం విడుదల చేసే ఉత్సవం లేదు. ఆయన ఫొటో పత్రికల్లో పడదు అయనకి ఏ అకాడమీ ఎవార్డు లివ్వరు. ఆయన వొక పుస్తకం వ్రాసినట్లే ప్రజలకి తెలియదు. సాహిత్య గోష్ఠులలో అందులో భాగాలు చదివి వినిపించడు; ఆయన భార్యకి కూడా తెలియదేమో. తెలిసినా ఆ పుస్తకం ఆమె చదవదు అసలు వ్రాసిన రచయితే దాన్ని చదవడేమో! ప్రూఫులు కూడా ఆయన చూసి వుండడు. అది మరొకరి పని ఇందుకు కారణం? ఆ పుస్తకం, భారత ప్రభుత్వం సమాచార, రేడియో మంత్రిత్వ శాఖ ప్రచురణ విభాగం వారు ప్రచురించడమే ఇందుకు కారణం.

దీన్ని గురించి ఆలోచిస్తే నా గుండె తరుక్కుపోతుంది ఇట్లాంటి అనామకులైన గ్రంథకర్తలు వొందలాదిగా వున్నారు ఆ గ్రంథాలలో వొస్తువు అతి ముఖ్యమైనది మన దేశంలో రెండు అద్భుత సంఘటనలు జరిగాయి. మొదటిది దేశంలో విదేశీ పరిపాలన ముగిసి, జాతీయ ప్రభుత్వం ఏర్పడటం; రెండోది ఒక జాతీయ ప్రణాళిక రూపొందించబడి అమలు జరుపబడటం ఈ ప్రణాళికల ఆధారంగా, భారతజాతి కష్టసుఖాలూ, పురోగమిస్తూ వున్న పద్ధతీ, ఇంకా ఏవేమి చేస్తే ఈ జాతి సుఖపడతారో చూపడం — ఇదీ, యీ గ్రంథాలలో విషయం ఇట్లాంటి సాహిత్యాన్ని వెలువరిస్తున్న రచయితలు అనామకులు కావడం బెంగేస్తుంది. గ్రంథకర్త ఎవరైతే నాకెందుకు, ఈ పుస్తకం చదవ

తగ్గది ఇందులో విషయం అద్భుతమైంది, నేను తప్పక తెలుసుకోవాల్సింది– అనుకుని, పాఠకులు చదవవొచ్చుగా! పేరులేని గ్రంథకర్తలు వ్రాసిన ఈ గ్రంథాలని చదవరు సరికదా, అసలు ఇట్లాంటి గ్రంథాలు వున్నాయనే, జనానికి తెలియదు. ఒకామె పుట్టినరోజుకి. ఎవరో వొక టేబిల్ లైట్ బహూకరించారుట. దాన్ని వాడడం కోసం, ఆమె పుస్తకం కొందిట. అట్లాంటి సందర్భంలో కూడా ఈ పుస్తకాన్ని ఎవరూ కొనరు చదవరు పుస్తకంలో విషయం – దేశానికీ, ప్రభుత్వానికీ, ప్రజాక్షేమానికీ సంబంధించినది. వీట్లని గురించి తెలుసుకోవాలన్న ఆక్కర, అభిరుచి లేకపోవడమే శోచనీయం

ప్రాచీన గ్రీస్ దేశంలో డెమాస్థనీస్ అనే మహావక్త వుండేవాడు– దేశం గురించీ, ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాలని గురించీ ప్రసంగించేవాడు – వేలాదిగా మూగి జనం, ఆయన చెప్పింది వినక, గంద్రగోళం చేస్తూండడం చూసి, ఇల్లా మొదలుపెట్టాడు డిమాస్థనిస్ –

ఒకడు వొక గాడిదని తీసుకు వెడుతున్నాడు. కొంత దూరం వెళ్ళాక, ఆ గాడిద తనకు కావాలనీ అమ్మితే కొంటాననీ అన్నాడుట మరి వొకడు. సరే బాగుంది అనుకుని, యజమాని తన గాడిదను అమ్మివేశాడు బాగా ఎండ కాస్తోంది. గాడిదను అమ్మివేసిన యజమాని, గాడిద నీడలో ఎండ తగలకుండా కూర్చున్నాడుట. 'ఇది నా గాడిద, నేకొన్నాను. దీని నీడలో నువ్వు కూర్చో దానికి వీలులేదు. తొలిగిపో' అన్నాడుట కొన్న వ్యక్తి. 'నేను గాడిదను అమ్మానే కాని, దాని నీడని అమ్మలేదు' అన్నాడుట అమ్మినాయన. అల్లా తగవులాడు కున్నారు." అని ఉపన్యాసం నిలుపు చేశాడుట డిమాస్థనీస్. "తరువాత ఏం జరిగింది? చెప్పండి," అని గోల చేశారుట ప్రేక్షక జనం. అందే డిమాస్థనిస్ ఇల్లాగన్నాడు.

'మీరంతా వెర్రి ప్రజలు. దేశం, ప్రభుత్వం, ప్రజలూ గురించి చెప్తే, మీకక్కర్లేదు, వినరు, గోలచేస్తారు. ఒక గాదిద కథ చెప్తే, చెవులు నిక్కపొడిచి వింటారు. అంతేగా!"

ఆ కథ ముగింపు ఏమిటో తెలుసుకోవాలనుంది నిజమే. కథలంటే మనందరికీ అంత ఇష్టం. విషయం గాడిదను గూర్చినదే – అంత ముఖ్యమైంది కాదు, నిజమే. గ్రీసు దేశంలో, పదివేల గాడిదలున్నాయి; వాటిల్లో ముప్పాతిక వంతు వ్యాధికి గురై మానవుడికి వుపకరించకుండా వున్నాయి. వాటిని చికిత్స చేసి సంరక్షించే బాధ్యత ప్రభుత్వానిది. ఆ ప్రభుత్వ యంత్రంతో ప్రజలంతా సహకరించాలి అని చెప్పితే, జనం వినడాని కిష్టపడరు వెళ్ళిపోతారు

చెట్టంత మనిషి ఎదురుగా నిలబడి చెప్తేనే వినిపించుకోని ప్రజ, ఆయన వ్రాసిన పుస్తకాన్ని చదువుతారా? చదువరు అమెరికాలో, 'వంటకాలు - వాటికి కావల్సిన పరికరాలు' అన్న గ్రంథాన్ని ప్రచురించారుట ఒక్క కాపీ కూడా అమ్ముడు పోలేదుట 'ప్రతి కన్య తెలుసుకోవల్సింది,' అన్న పేరుతో ఆ గ్రంథాన్ని విడుదల చేసేసరికి కొన్ని వేల కాపీలు అమ్ముడు పోయిందిట. వ్యక్తికీ - సమూహానికీ - అంతటి వ్యత్యాసముంది. వ్యక్తిని గూర్చినదే సాహిత్యం వ్యాధి పీడితమైన వొక పశువుని, గోసదనంలో చేర్చిన కథనం వింటాను, చదువుతాను, తెలుసుకుని, కళ్ళంట నీళ్ళెట్టుకుంటాను. అన్ని పశువుల్నీ సంరక్షించేటందుకు, పదమూడు వందల గోశాలలు పని చేస్తున్నాయి. ప్రస్తుతం అరవ ప్రణాళికలో వీటి సంఖ్య పదిహేడు వందలు కాగలదు. ఇందుకు ప్రజలు సహకరించాలి. అంటే, ఉత్సాహపడను, విసుక్కుంటాను. ఇది వ్రాసినాయన అనామకుడవడమే నా కిష్టం అనుకుంటాడు పాఠకుడు.

ఈ గ్రంథం, విద్యార్థుల నుద్దేశించి వ్రాసినా, దీని నెక్కడా పాఠ్య గ్రంథంగా పెట్టారనుకోను లైబ్రరీలకీ, పంచాయతీ సమితులకీ, డెవలప్‌మెంట్ బ్లాక్‌లకీ ఈ గ్రంథాలని పంపుతారు సామాన్య మానవుణ్ని వుద్దేశించి వ్రాసిన ఈ పుస్తకాన్ని సామాన్య మానవుడు చదవడు అతనికి చదవడం రాదు. గ్రామంలో చదవనేర్చిన యువకులు నలుగుర్నీ పోగుచేసి, ఈ పుస్తకంలో భాగాలు చదివి వినిపించాలి— కాని అల్లా జరుగుతోందనుకోను. దిగ్భ్రమ కలగ జేసే సంగతులుంటాయి ఈ గ్రంథాలలో "దేశ జనాభా ఏడాదికి 80 లక్షలకు పైగా పెరుగుతూ వున్నదని తేలింది " నేటి కథలలో, నవలల్లో పుట్టుకొస్తూ వున్న జనాభా కలిపితే, మరెంతగా పెరుగుతుందో, మన సాహితీ విమర్శకులు అంచనా వేస్తే బాగుండును

"ఈ నవల మధ్యలో లక్ష్మి చనిపోయిన ఘట్టం నమ్మతగిందిగా లేదు." అంటాడు విమర్శకుడు కాని లక్ష్మి జీవించి వుండి, మోహన్‌ని పెండ్లాడితే, దేశ జనాభా పెరిగే సంగతిని వ్యాఖ్యానించడు.

ఈ వాక్యం చూడండి :

"నీరు నదులందు పుష్కలంగా వుంది. దీనిలో చాలా భాగం సముద్రాల పాలౌతున్నది. ప్రతి యేటా సముద్రాలలో కలిసిపోతున్న నీరు యెంతో తెలుసా? ఈ నీటితో మన దేశమును 16 అంగుళాల లోతుకు ముంచివేయ వచ్చును."

నీరులేక పంటలు దెబ్బ తింటున్నాయి తిండిలేక జనం మలమల మాడు తున్నారు నా గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఇందులో విషాదం వుంది.

"1950 సంవత్సరంలో, దేశంలో ఉత్పత్తి చేసిన గుడ్డనంతా మన జనాభా యావత్తుకూ సరిసమానంగా పంచే పక్షంలో తల వొకటికి 9 గజములు మాత్రమే లభించేది. 1957 లో, తల వొకటికి 17 గజముల గుడ్డ లభించింది." అంటాడు మన అనామక గ్రంథకర్త. అంటే బట్ట ఉత్పత్తి పెరిగిందన్నమాట. కాని 1950 లో అత్తగారు 9 గజాల చీర ధరించి వుండవచ్చు. 1957 లో కోడలు 6 గజాల చీర కడుతోంది. ఆ మిగత 12 గజాలూ, 5 గజాలూ కూడా దొరకని వారికి లభ్యమవాలన్న త్యాగబుద్ధి చూపుతోంది కోడలు. దీని ఫలితంగా అత్తగారి పోరు కాస్త తగ్గింది.

"ఓణి కనబడేలాగు, మరీ చిన్న చీర కట్టుకుని, షికారెల్లడం ఏంబాగుం టుందే?" అని అత్తగా రంటుంది.

"అదేమిటం డత్తయ్యా, తల వొకటికీ మనకి దొరికేది 17 గజాలే ఇది 5 గజాల చీర. మిగత 12 గజాలూ మీకే ఇస్తున్నానుగా," అంటుంది కోడలు.

"ఏమన్నావ్? నాకు 12 గజాల చీరా! నేను అంత లావుగా కనిపిస్తు న్నానుటే! నాకిచ్చిన 17 గజాలూ ఉండనే వుంది – నువ్విచ్చే దేమిటి మహా."

"మీ కిచ్చినదాంట్లో 6 గజాలు దుప్పటిగా కప్పుకుంటున్నారు. మిగతాది పెట్టి స్టీల్ సామాను కొంటిరాయిరి, మీ అబ్బాయి డైనింగ్ టేబిల్ మీదికని." అన్న కోడలి సమాధానానికి పళ్ళు పటపట కొరకడంతో, హాస్యరసం తొణికిస లాడ్డం లేదంటారా?

అనామక గ్రంథకర్త కొత్త విషయాలు చెప్తాడు. తూనికలు, కొలతల విషయాలు చూడండి. "ఈ మధ్య దేశమందు 1100 గ్రామాలు యెన్నిక చేయ బడి, వానిలో వాడుకయందున్న తూనికలను, కొలతలను పరిశీలించడం జరిగింది. మొత్తంమీద 143 రకాల కొలమాన పద్ధతులు వాడుకలో నున్నట్లు తేలింది. దేశమందు 100 రకాల మణుగు తూకములు ప్రచారమందున్నవట!" ఇన్ని రకాల తూకాలు వాడుతూ, వర్తకులు ప్రజల్ని మోసంచేసి ఆర్థిక మాంద్యానికి కారకులై, ధనికులు మరీ ధనికులౌతున్నారన్న మార్క్స్ సిద్ధాంతం లాంటిదాన్ని ప్రతిపాదించి మన గ్రంథకర్త, ఆశ్చర్యం ప్రకటించాడు. అవుతే ఏంచెయ్యాలి? మెట్రిక్ (దశాంశ) పద్ధతిని ఎన్నుకున్నాం. "దాదాపు 2000 సంవత్సరముల క్రిందట ఒక భారతీయ గణిత శాస్త్రవేత్త 'సున్న' యొక్క విలువను కనుగొన్న విషయం మీకు తెలుసా? దశాంశ పద్ధతి దీనిమీద ఆధార పడింది."

ఆ గణిత శాస్త్రవేత్త పేరు ఎందుకు చెప్పడానికి సంశయించాడో నాకు

తెలియదు. తెలుసుకుందామని ప్రాచీన గణితశాస్త్ర చరిత్ర చదివాను. క్రీ.పూ. 200 సంవత్సరం నాటికే పింగళుని 'ఛందాసూత్రం'లో 'సున్న' వాడుకలో ఉన్నట్లు తెలుస్తుంది. పాఠకుడిలో పరిశోధనాత్మక రేకెత్తించేటట్లు చేస్తాడు మన గ్రంథకర్త.

దేశం గురించి నాకు తెలుసుకోవాలని లేదు. మన ఆంధ్రదేశం గురించి చెప్పండి, వింటాను — అని మీలో కొందరంటారని నాకు తెలుసు. ఇంతవరకూ కేంద్ర సమాచారశాఖవారు ప్రచురించిన పుస్తకంలో భాగాలు ఉదహరించాను. ఇప్పుడు మన తెలుగుదేశం గురించి అనామక గ్రంథకర్తల పుస్తకంలో విషయాన్ని పరిచయం చేస్తాను.

నేడు పెద్దపుస్తకాలని చదివే వోపిగ్గా లేదు, తీరికాలేదు. అందుకే వీరు చిన్ని పుస్తకాలను వ్రాశారు. ఏ చిన్నిపొత్తమూ నలభై పుటలు మించదు. బస్సుస్టాండ్‌లో క్యూలో నిలబడ్డప్పుడు, చదివేటందుకు అనువైన చిన్ని కరవత్రంలో వారు చెప్పదల్చిందంతా చెప్పివెయ్యగల సంక్షిప్త శక్తులు వీరిలో వున్నాయి. మరొక విశేషం. వెనక నే నొక పుస్తకము వ్రాసి అచ్చువేయించాను. తీరా చేతికొచ్చాక, దాన్నిండా అచ్చుతప్పులే. ఇట్లాంటప్పుడు, పుస్తకం చివరలో 'తప్పొప్పుల పట్టిక జతపరచడం ఆచారముగా వుండేది. నా పుస్తకాన్ని వొక ప్రముఖ వ్యక్తికి ఇవ్వాల్సి వొచ్చింది. సిగ్గుపడ్డాను. ఇన్ని అచ్చుతప్పుల పుస్తకాన్ని ఎల్లా గివ్వను? అందుచేత పుస్తకము చివరలో "ఈ పుస్తకంలో, ఫలానా పుటలలో ఫలానా వాక్యాలు వొప్పులు," అని వ్రాసి పంపించాల్సి వొచ్చింది మన గ్రంధకర్తల గ్రంధాలలో మెచ్చుకోతగ్గ విషయం, వొక్క అచ్చుతప్పు కూడా దొర్లకపోవడం, మరొకటి — వీరిది అద్భుతమైన శైలి. ఉద్రేకం, ఉద్వేగం, భావనాపటిమ, ఈ శైలి ప్రధాన లక్షణాలు.

"విశ్వసృష్టికీ, మానవజీవితానికి, సర్వానికీ సత్యాహింసలు కూకటివేళ్ళు."

"మన స్వాతంత్ర్యోద్యమం, నిజానికి క్రమంగా ఇతర దేశాలకుకూడా వ్యాపించే వొకానొక సువిశాల సాంస్కృతిక ప్రాభవము అని చెప్పాలి. బహుశః ఇక వ్రాయనున్న విశ్వచరిత్రకు మన నేటి దేశ చరిత్ర పీఠికేమోనని తోస్తుంది."

మన గ్రంధకర్త, కవిత్వంలో పడిపోతాడు. అతన్ని ఎవ్వరూ ఆపలేరు.

"అబద్ధమాడని భారతావని ప్రజానీకాన్ని చూసి విదేశీయ యాత్రికులు విస్తుపోయారు — సత్యమే మానవరూపాన్ని ధరించి, భారతదేశంలో అవతరించిందా అన్నట్లు! దేశమంటే ఎలా మట్టి మాత్రమే కాదో, అలాగే ప్రజలంటే కేవలం రక్తమాంసాలు మాత్రమేకాదు. ప్రపంచాన్నే వొకానొక పరమ ఆశ్చర్యమయ విచిత్ర చిత్రంగా ఏ పరిపూర్ణశక్తి చిత్రిస్తోందో; ఆ సంపూర్ణ

జ్ఞానమయశక్తియే కోటానుకోట్ల ప్రజల గుండెల్లోనూ గుడి కట్టుకుని ప్రతిష్ఠాపితమై వుంది. అదే ప్రజల్లో జీవశక్తి."

ఇది సాహిత్యం కాదని ఎల్లా అనుకోను?

మన ప్రజకి పురాణగాధలంటే ఇష్టం. ఈ పుస్తకాలలో ఆ ప్రసక్తి లేదనుకోకండి. ఇది చూడండి :

"న్యాయాన్యాయ నిర్ణయంలో మన ప్రజల వివేకం కనిపిస్తూనే వుంటుంది. అలాగే మంచి చెడుల విషయంలో. శ్రీరాముని, దశరధుడు వనవాసానికి పంపటము ప్రజలు హర్షించలేదు. పంపవద్దని వాదించారు. శ్రీరాముని రథ చక్రాలకు అడ్డు పడ్డారు. అది కేవలం ఒక వ్యక్తిపై వుండే ఏదో స్వంత మోజు కాదు. ఆదర్శాల పట్ల సామాన్య ప్రజలకు సైతం వున్న అచంచల భక్తి శ్రద్ధలకు అది సజీవ తార్కాణం. చిత్ర మేమిటంటే, ప్రజలు ఆనాడు కూడా తమ అభిప్రాయాలని ప్రకటించుకోడానికి వెనుకాడలేదు. ఒక ఉదాహరణ — నలుడు, ధర్మరాజులా నష్టదాయకమైన జూదం ఆడుతున్నప్పుడు దమయంతి ఎంత చెప్పినా వినడు. చివరికి, ప్రజలు రాజభవనంలో ప్రవేశించి, నలుదుని వాదిస్తారు. రాజ్యాన్ని పణంగా పెట్టి, జూదమాడకూడదని హెచ్చరిస్తారు. నలుడు వినలేదనుకోండి. అది వేరే సంగతి."

చప్పట్లు కొట్ట బుద్దేస్తుంది. అయ్యారే! భేష్! — అన బుద్దేస్తుంది. మధ్య మధ్య మన గ్రంథకర్త చక్కటి సూక్తులు విసురుతాడు. మచ్చుకి—

"ప్రజలపై ప్రభుత్వం కేవలం కర్ర పెత్తనం, నిరంకుశాధికారం ఎలా చెలాయించకూడదో, అలాగే ప్రజలూ ప్రభుత్వానికి పరాధీనులై వుండకూడదు."

బాగుంది నాయనా, చక్కగా చెప్పావు. అక్కడక్కడ జాతీయాలు, సామెతలు, కనబడతాయి. "విద్య లేనివాడు వింత పశువు." "అప్పుతో పుట్టి, అప్పుతోనే జీవించి, అప్పుతోనే మరణించేవాడు - వెనకటి భారతీయ కర్షకుడు"- "ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్."

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌర సంబంధాలశాఖ ప్రచురించే, ఈ గ్రంథా లలో చక్కటి చిత్రా లుంటాయి. "అవిద్యపై యుద్ధం" అన్న పుస్తకంపై వున్న చిత్రం ప్రశంసనీయమైంది. అవిద్యని సూచిస్తూ, మూడు వేలు ముద్రలు, దాని నిర్మూలనికి అవసరమైన పరికరాలు - కత్తులు, కలం-" ఈ వేలు ముద్రల చుట్టూ చిత్రించబడ్డాయి. గొప్ప భావం, గొప్ప చిత్రం.

అంత మాత్రంచేత, ఏ లోపమూ లేని ఉత్తమ కళాఖండా లనడం లేదు. వీటిని. మనకి నచ్చని, వొకటి రెండింటిని మాత్రం చెప్తాను. ఒకటి, మన గ్రంథ

కర్త, ప్రగల్భాలు పలుకుతాడు. గొప్పలు చెప్తాడు. బడాయి చూపుతాడు. తన పేరు కూడా చెప్పుకోని స్వార్థరహితుడైన ఈ రచయిత, నమ్రత విడనాడడం శోచనీయం.

"1960-61 సంవత్సరంలో మొత్తం 20 అంశాల్లోనూ 15 అంశాల విషయంలో పెట్టుకున్న లక్ష్యాలను మించి కృషి చేసినై పంచాయతీ సమితులు." అని మొదలెట్టి - సమితులు 1103 ఆయిల్ ఇంజన్లను రైతులకు సప్లై చేసినై. 4117 పంట బావులు కొత్తగా నిర్మించబడినై. 243 పంపుసెట్లు సరఫరా చేయ బడినై. 23769 ఎకరాల భూమి అదనంగా సాగులోకి తేబడింది..... 14 లక్షల పశువులు చికిత్స పొందినై... ప్రజారోగ్య కేంద్రాల్లో 30 లక్షల మంది, గ్రామీణ డిస్పెన్సరీల్లో 34 3 లక్షల మంది చికిత్స పొందారు ...అన్ని మండలా ల్లోనూ 20192 మామూలు పాఠశాలలు, 3616 బేసిక్ విధానపు పాఠశాలలూ పని చేస్తున్నయ్. 2811 వయోజన విద్యాకేంద్రాలు ప్రారంభించబడినై. 2615 పఠన మందిరాలు ప్రారంభించబడినై."

ఇవన్నీ నిజమై ఉండొచ్చు. కాని ఇదంతా బడాయిగా కనబడక మానదు. 2615 పఠన కేంద్రాలలో, వొక్క చోటైనా, ఈ రచయిత వెలువరించిన గ్రంథాన్ని చదవడం జరుగుతోందా - అనే, నా గోల. 26 వంతెనలు కట్టా రంటాడు. ఇందులో ఎన్ని కూలాయి, ఎన్ని ఉన్నాయో చెప్పడు. నాలుగు లైబ్రరీ భవనాలకి శంఖుస్థాపన జరిగిందంటాడు. అవి పూర్తి అయిన సంగతి చెప్పడు. ఏ ప్రోజెక్టు నిర్మాణానికో రెండు కోట్లు కేటాయించారంటాడు. ఈ డబ్బు సద్వినియోగమై, ఆ ప్రాజెక్టు ఫలించిందని చెప్పడు. ఇదే నమ్రత లేక పోవడం అంటే. మరొక పొరబాటు చేస్తాడు మన గ్రంథ కర్త. అంకెలతో హడలగొడతాడు. అంకెలను పొందుపర్చడం అంటే మహా సరదా. అదొక కేళీ విహారం. అంకెల జగత్తులో చైతన్యం గోల్పోయి స్థూల జగత్తుకి అతీతుడై, అనందానుభూతి పొందుతాడు. "1960 లో ఆంధ్రరాష్ట్రంలోని పారిశ్రామిక వివాదాలు 67 మాత్రమే. అదే కాలంలో కేరళ రాష్ట్రంలో 241, మద్రాసు రాష్ట్రంలో 210, మైసూరులో 80 వివాదాలు వున్నాయి."

దేశంలో ఇతర ప్రాంతాలూ, పాశ్చాత్య దేశాలూ, వీటిలో పారిశ్రామిక వివాదాల భోగట్టా ఇవ్వకుండా, ఈ నాలుగు రాష్ట్రాలతోనూ నిలిపివేసి, నిగ్రహం చూపి, స్థితప్రజ్ఞు డయ్యాడు మన గ్రంథ కర్త - అభినందించాలి. ఇందులో గుణపాఠం లేకపోలేదు. మిల్లు యజమానిని చావదన్ని, ఆయన కూతుర్ని లేవ దీసుకుపోయిన పారిశ్రామికుడూ, ధనిక వర్గాలని దుయ్యబట్టే కార్మికుడూ, నవలల్లో, నాటకాల్లో అభిమాన పాత్రలుగా అవతరింప చేస్తున్న రచయితలు

గమనించదగ్గ విశేషం, ఆంధ్రలో పారిశ్రామిక వివాదాలు చాలా తక్కువ— అన్నది.

మన గ్రంథ కర్తలో మనం హర్షించలేని మరో లక్షణం - అస్తమానూ, "ప్రజలు సహకరించాలి" అంటూ ఉండడం. "ఈ పథకం అమలు పరచడంలో చేయూత యివ్వాలి." ఇది ఈ రచయిత మకుటం. "ప్రొద్దుటే లేపు నన్ను; ఎనిమిదిలోగా కోళ్ళ పెంపకం గూర్చిన పుస్తకం పూర్తి చెయ్యాలి." అనడం బదులు, భార్యతో - "తెల్లారగట్టే లేపడంలో, నాతో నువ్వు సహకరించాలి," అంటే నే నాశ్చర్యపడను. ఏ విధంగా సహకరించాలో చెప్పడు. అసలు, ఎవరిని ఉద్దేశించి ఈ మాట లంటున్నదో కూడా స్పష్టంగా తెలియదు.

"మహిళను సభ్యురాండ్రుగా చేర్పించడానికి ప్రత్యేక కృషి జరగాలి." ఇది, ఎవరితో చెప్తున్నట్టు? గ్రామీణ స్త్రీలా? ఉద్యోగం చేస్తున్న స్త్రీలా? సహకార సంఘాలలోవారా? పాఠకులా? ఎవరు? బ్రహ్మదేవుడికి తెలియాలి.

ఇట్లాంటివి వొకటి రెండు విడిచేస్తే, ఈ అనామక గ్రంథ కర్తల కృషి వల్లనే, మన శ్రేయస్సు కోసం, ఏం జరిగిందో ముందు ఏం జరగబోతున్నదో తెలుసుకోడం సాధ్యమౌతుంది.

ఈ గ్రంథాలు నలుగురూ చదివేలాగుచెయ్యాలంటే, వొకటి రెండు కొత్త పద్ధతులు యత్నించాలంటాను. ఫలానా ఊళ్ళో కొత్తగా పశు వైద్యశాల పెట్టారంటాడనుకోండి మన గ్రంథకర్త. ఆ పుస్తకం అట్ట మీద వొక సినిమా తార ఫోటో వెయ్యాలి. లోపలి పుటలో "ఈ సినిమా తార పెంచుతున్న కుక్క పిల్లకి, ఈ పశు వైద్యశాలలో చికిత్స జరిగింది" అని వ్రాయాలి. ఒక అడివి ప్రాంతాన్ని పునరుద్ధరించి అక్కడ వొక టూరిస్ట్ హోటల్ పెడుతున్నట్లు మన రచయిత భోగట్టా యిస్తాడు. "ఈ మధ్య ప్రఖ్యాత ఈతగాడు, మిహిర్ సేన్, ఈ అడివి ప్రాంతం సందర్శించి అక్కడి సరస్సులో ఈదాడు. అక్కడ హోటలు లేక నానా ఇబ్బందీ పడ్డాడు. ఇంక ఇప్పుడు ఆ ఇబ్బంది ఉండదు" అన్న భోగట్టా జతపరచాలి. "ఫలానా చోట సైకిల్స్ తయారీ కర్మాగారం పెడుతున్నారు" అంటాడు; గ్రంథకర్త. గుజరాత్‌లో ఎన్ని కర్మాగారాలు పెట్టిందీ చెప్తాడు "ఫలానా సినీ నటుడు ఆ మధ్య ఈ ప్రాంతం సందర్శించి, అక్కడ హోటల్లో గడిపాడు. అతని కొడుకు అక్కడే సైకిల్ తొక్కడం నేర్చుకున్నాడు." అనొచ్చు.

ఏ నది మీదనో, వరదలు అరికట్టే నిమిత్తం వొక ఆనకట్ట కట్టాలని ఏడవ ప్రణాళికలో ఇన్ని కోట్లు కేటాయించారు, అంటాడు రచయిత. "ఈ

ప్రాంతంలో వరదలకి తోడు, వర్షాలు కూడా జాస్తి. గంటలో ఇన్ని అంగుళాల వర్షం కురుస్తుంది. కాబట్టి, వర్షపు సిక్కులో మునిగిపోకుండా, అక్కడి గ్రామీణులు, నదిలోకి దూకుతారు. ఆ నదిలో కొట్టుకుపోకుండా ఈ అనకట్ట" అనొచ్చు.

మరొక చోట మొహంలో వొంకిరలు సాఫీ చేసే శస్త్ర చికిత్సాలయం పెడుతున్నప్పుడు, స్థూలకాయుడి మొహాన్ని చిత్రించి, "ఈ మొహం చూస్తే, సంతాన నిరోధం ఎంత అవసరమో తెలుస్తుంది." అంటేనేం? మధ్య మధ్య జోక్‌లూ, కార్టూన్లూ, వుండాలి. క్షుద్రలోకం మరమ్మత్తు భోగట్టాని రసవత్తరంగా వినోదకరంగా రూపొందించవచ్చు.

ఇవన్నీ చేసినా, ఈ గ్రంథాలు ప్రజామోదం పొందడానికి చాలా కాలం పడుతుందనుకుంటాను. దీనికి కారణం ఊహించగల్ను. రెండు వందల సంవత్సరాలు, పరప్రభుత్వానికి అలవాటుపడి వున్నాము. ప్రభుత్వం ఏ పని తలపెట్టినా అది మనకి హానికరమైనదే నన్న అభిప్రాయం, మనస్తత్వం; మనవారిలో స్థిర పడిపోయినాయి ప్రభుత్వం వేరు, ప్రజ వేరు. వీరి మేలు వారు కోరరు - అన్న భావం. స్వతంత్రం వొచ్చాక, మన ప్రజా ప్రతినిధులే పాలకులయ్యారు. ఎన్నెన్నో మంచి పనులు చేస్తున్నారు. అయినా కూడా, పాలకులపట్ల, వెనక వుండిన అలక్ష్య భావం - అధికారులపట్ల ఉండిన నిరసన భావం - పూర్తిగా తొలిగిపోలేదు - ముఖ్యంగా పల్లె ప్రజల్లో వారు చదువు లేనివారైనందున, జరిగిన మార్పు ప్రాబల్యం వెంటనే గ్రహించలేకపోతున్నారు. ప్రతిదీ ప్రభుత్వం చెయ్యాలి - నా కెందుకూ? - అన్న భావం వొకటి మనవారిలో ఉండిపోయింది. అందుకనే మన అనామక గ్రంథ కర్త "ప్రజలు సహకరించాలి మొర్రో!" అంటాడు.

మరో కారణం. ప్రభుత్వానికి, రక్తమాంసాలున్న స్వరూపం లేకపోవడం, అనాదిగా రాజే పాలకుడు. రాజు, వొక వ్యక్తి - రక్త మాంసాలు గల వ్యక్తి. అతన్ని ఆరాధించడానికి అలవాటుపడ్డాం అల్లాగే స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వ్యక్తులు, వారిని ఆరాధిస్తాం. తర్వాత తర్వాత పాలకులైన వ్యక్తులు ప్రజా ప్రతినిధులు - ఒక ప్రాంతాన్నుండి వొచ్చిన ప్రతినిధి. వారికి సలహా ఇచ్చారు. పౌరశాఖ ఉద్యోగులు, సివిల్ సర్వెంట్స్, వీరి శిక్షణ, బ్రిటిష్ సివిల్ సర్వీస్ పద్ధతులపై జరిగింది. ప్రత్యేకమైన వ్యక్తిత్వం వుండకపోవడం, ఉన్న దాన్ని పైకి కనబరచకపోవడం ఒక సంప్రదాయమైంది. వారు ఏ అభిప్రాయాన్నీ వెలిబుచ్చకూడదు ఒక పనికోసం, జమాఖర్చు వెయ్యగలరు గాని, ఆ పని

మంచిదా, చెడ్డదా అన్న విలువ కట్టలేరు – కట్టకూడదు. ఉదాహరణకి – కన్యాకుమారి వద్ద సూర్యోదయం, చూడవల్సిన దృశ్యం అంటారు. ఈ దృశ్యం నిదానంగా చూడాలంటే, యాత్రీకులకు వొక ఎత్తైన వేదిక, అనువైన చోటున నిర్మాణం చెయ్యాలన్న నిర్ణయం జరిగిందనుకోండి. ఇందుకు, ఏ స్థలం బాగుంటుందో నిర్ణయించే భూమి పరిశోధకుల సంఘాన్ని నియమిస్తారు. తర్వాత, వేదిక పథకం తయారు చేస్తారు. ఎంత ఖర్చవుతుందో అంచనా వేస్తారు. పని వాండ్రని రప్పిస్తారు. ఉద్యోగి ఇవన్నీ జేస్తాడు – కాని, సూర్యోదయం అందమైన దృశ్యమో, కాదో చెప్పడు.

"ఏమయ్యా, ఈ వేదిక దేనికి?"

"నాకు తెలియదు. సెక్రటరీ కట్టమన్నాడు, కడుతున్నాం. కచ్ ప్రాంతంలో వొకటి కడుతున్నాం. గోవాలో రెండింటిని, ఎనిమిదవ ప్రణాళికలో, రెండుకోట్లు కేటాయించబడింది. జిబ్రాల్టర్‌లో. " "సూర్యోదయం ఈ వేదికనుండి బాగా కనబడుతుందా?'

"ఆ ప్రశ్న లోక్‌సభలో అడగండి. వేదిక ఎత్తు నూట పదిహే నడుగులు, వెడల్పు మూడు వొందలు "

"ఆగండి. సూర్యోదయం అందంగా వుంటుందా? మీరు చూశారా?"

"మాకు టైము లేదు. పదహారో తేదీని, మంత్రిగారు, ప్రారంభోత్సవం జరుపుతారు. ఆనాటికి పూర్తవాలి ఇవన్నీ చూసే టైములేదు మాకు. పైగా సూర్యోదయం మెచ్చుగుంటూ, కావ్యం వ్రాయడానికి, ఏ కవుల్ని పిలవాలో నిర్ణయించే వొక కమిటీని వేశాంగా."

అంటే ప్రజాసేవకుడైన – ప్రభుత్వోద్యోగి, వ్యక్తిగతమైన ఉద్యోగానికి లోనవక నిష్పాక్షికంగా వుండాలన్న సంప్రదాయం – వొకటి వుండిపోయింది. ఇది కొంతవరకు అవసరం కూడా. కాని బ్రిటిష్ ప్రభువులు నెలకొల్పిన ఈ మనస్తత్వం, పరదేశ పాలనకు అవసరం కావొచ్చు – స్వదేశ పాలనలో అంత తూ. చా. తప్పకుండా అమలు జరపనక్కర్లేదేమో

ఈ మనస్తత్వం, చిహ్నమే అనాసక గ్రంథకర్తలు తయారుచేసే పుస్తకాలు. గ్రంథకర్తకి పేరులేదు ప్రజా ప్రతినిధి చెప్పినదాన్ని అమలు జరపడమే అతని విధి. ఉద్రేకంలేదు, మంచి చెడ్డల ప్రశంసలేదు, బాగోగుల ప్రస్తావన లేదు. అంకెలగారడీ – అంతా. పాఠకుడికి కావల్సింది. అంకెలు కాదు; నిమిషానికి గుండె ఎన్నిమార్లు కొట్టుకుంటుందో కంటే, గుండె కొట్టుకున్న చప్పుడు వినబడితేనే సాహిత్యం.

మరి ఈ గ్రంథకర్తలు ఏం చెయ్యాలి?

ఒక అనామక రచయితల సంఘంగా ఏర్పడాలి. ఏటేటా, వారి గ్రంథాల ప్రదర్శనలు జరపాలి. సమావేశాలు ఏర్పరిచి, వారి రచనలు చదివి వినిపించి వ్యాఖ్యానించాలి. ఉత్తమమైన వాటికి ప్రభుత్వంకాక, ప్రజలలో పెద్దలు ఎవార్డు లివ్వాలి. పోటీలు, పరీక్షలు పెట్టి ఈ పుస్తకాలలోని పరిజ్ఞానాన్ని బాగా గ్రహించినవారికి బహుమతు లివ్వాలి.

ఈ సూచనలన్నీ నా అజ్ఞానానికి నిదర్శనాలేమో! పాతకాలపు కళాకారుడు అనామకుడుగా వుండిపోవడానికి ఇష్టపడేవాడు. ఏ శిల్పంపైనా, ఏ చిత్రంపైనా, తన పేరు వ్రాసుగున్నట్టు లేదు. మహాకవి – ఈ కావ్యం నేను వ్రాశా ననడు - భగవంతుడే నాచేత వ్రాయించాడంటాడు. రచయిత ఏకాంతజీవి – కాని అతనికి మనుషులు కావాలి. కాసేపు వారినడుమ వుండి, పరిశీలించి, నవ్వుకుని, మళ్ళా ఏకాంతంలోకి జారిపోతాడు. మనుషుల్లో వున్నప్పుడు, అహం, వ్యక్తిత్వం పెరుగుతుంది. దూరంగా వెళ్ళి, ఒంటిగా వుండి, తపస్సులో పడినప్పుడు, తన వ్యక్తిత్వం, జారిపోతుంది. 'అహం' గోడలు పడిపోతాయి. ప్రత్యేకాత్మ జీవాత్మలో కలిసిపోతుంది. అప్పుడు, 'నేను' అన్నది లేదు. గ్రంథకర్తకి పేరుండదు. వ్యక్తిత్వాన్ని జయించుకుంటూ వొచ్చి, చివరికి ఓడించి, నశింపు చెయ్యడమే కళాకారుడి పురోగమన రహస్యం – అనుకోడంకూడా అజ్ఞానమే నేమో!

అజ్ఞానం - 4

# "ఎక్కడికి పారిపోతావు, తమ్ముడూ?"

ఈనాడు యువకులు ఇళ్ళల్లోంచి పారిపోతున్నారు. వెనక లేదని కాదు. పరీక్షలో కాపీచేస్తూ పట్టుబడి, ఆ నేరంతో ఇంట్లో పెద్దల్ని ఎదుర్కొనే ధైర్యం లేక, ఎక్కడికో వెళ్ళిపోయి, బైరాగుల్లో కలిసిపోయి, ఏ పది పదిహేనేళ్ళ తరవాతో తన ఊళ్ళో, తనింటివారు గుర్తుపట్టినట్లు పసిగట్టి, మళ్ళా ఆ ఊళ్ళోంచి వెళ్ళిపోయిన ఒకరిద్దరి వ్యక్తుల ఉదంతం కథకింద చెప్పుకునే వారు వెనక. కోరిన కన్యని పెళ్ళాడే అవకాశం లేక, అయిష్టమైన పెండ్లికి ఒప్పుకోలేక ఇంట్లోంచి పారిపోయిన యువకులు, వెనక కొందరు లేకపోలేదు కాని ఇట్లాంటివి అరుదుగా జరిగేవి. నూటికి కోటికి ఒకటి — అద్భుత సంఘటనగా, అపూర్వమైందిగా పరిగణింపబడి, కథకి, నవలకి వస్తువయ్యేది.

ఇటీవల ఇళ్ళల్లోంచి పారిపొయ్యే యువకులసంఖ్య పెరిగింది. ఇంచుమించు ప్రతిరోజూ, ఎవరో ఒకరు ఇంట్లోంచి వెళ్ళిపోయిన ప్రకటన చూస్తూనే వుంటాం. వెళ్ళిపోయిన వ్యక్తి ఆచూకీ తెలియపరిచినవారికి ఏదో బహుమతి ఇచ్చుకుంటామని ప్రకటిస్తారు. పోలీసు శాఖకి ఫిర్యాదు చేస్తారు. వెళ్ళిపోయిన ఉదంతం రూఢీపరుస్తూ మేజిస్ట్రేట్ పంపిన పత్రాన్ని రేడియోలో వినిపిస్తారు. కొన్ని పత్రికలు, పారిపోయినవారి ఫోటోలు ప్రచురిస్తాయి. "ఇంటికి రా, అమ్మ బెంగెట్టుకుంది. ఏమీ అనం." "నువ్వు వెళ్ళినప్పడినుంచీ తమ్ముడు అన్నం తినడంలేదు — స్కూలు మానేశాడు — తిరిగిరా — నీ వెట్లా చెప్తే అట్లా చేస్తాం." "మతి చెడిన అన్నయ్యని ఆస్పత్రిలో చేర్పించాం — పదే పదే నిన్నే స్మరిస్తున్నాడు — వెంటనే రా." "ఆ పిల్లనే చేసుకుందువు కానిలే — ఇంత మాత్రానికే వెళ్ళిపోవాలా? అత్తయ్య మంచం పట్టింది. తిరిగి రా." ఇట్లాంటి ప్రకటనలు, రోజూ ఏదో ఒక పత్రికలో చూస్తూవుంటాం.

మతిచెడి తిరిగేవార్నీ, దోవతప్పి ఎటోపోయిన పిల్లల్నీ, నేరం చేసి శిక్షకి బెదిరి పారిపోయేవార్నీ విడిచివేద్దాం. ఇట్లాంటివి, అన్ని కాలాలలోనూ,

అన్ని చోట్లా జరుగుతూనే వుంటాయి. ఇట్లాకాక, కుటుంబంవారితోనో, సమాజం తోనో పేచీవచ్చి, పారిపోయే యువకుల సంఖ్య పెరిగిందంటున్నాను. రోజూ వొకరు, ఇంట్లోంచి పారిపోతున్నారని చెప్పొచ్చు ఈ లెక్కని, తెనుగుదేశం లోనే, ఏడాదికి మూడు, నాలుగొందల మంది యువకులు పారిపోతున్నారను కుందాం. దేశం మొత్తంమీద, వొక ఏడాదిలో, ఐదారువేలమంది యువకులు ఇళ్ళల్లోంచి పారిపోతున్నారేమో! వీరిలో మూడొంతులు – తిరిగి ఇళ్ళకి చేరు కుంటారనుకున్నా, కనీసం వెయ్యిమంది యువకులు, తిరిగిరాక, మాయమవు తున్నారన్నమాట. ఇది తల్చుకుంటే బెంగేస్తుంది.

యవ్వనం అద్భుతమైన దశ. దీన్ని పిల్లలకిచ్చి ఖర్చు చెయ్యడం నేరమే నంటాడు బెర్నార్డ్‌షా. వారు ఖర్చుచేసినా దాని ఫలితం సంఘానికి దక్కకుండా పోతోందనే నా దిగులు. ఇట్లా పారిపోయే యువకులు పదుహేను పాతిక సంవత్స రాల వయస్సు గలవారై యుంటారు వీరిట్లా పారిపోతున్నారంటే, సంఘంలో ఏదో తిరకాసుందన్నమాటే. లేదా, సంఘంలో ఇమడనీయని లోటు వారిలో ఏదన్నా ఉందనుకోవాలి. వారి కుటుంబమే సంఘానికి ప్రతిబింబం. దీనికి కారణం ఏమిటి?

పూర్వకాలంలో ఇట్లా ఇల్లు విడిచి వెళ్ళినవారు లేకపోలేదు. పాండవుల జీవితం ఇంచుమించు, అడవుల్లో గడిచింది. రాముడు, లక్ష్మణుడు పధ్నాలు గేండ్లు అరణ్యంలో గడిపారు. రావణుడితో యుద్ధం ముగిసి లంకని జయించాక, లంకలోనే వుండిపోదామంటాడు లక్ష్మణుడు. రాముడు మందలించి తీసుకొస్తాడు. ఇంటికి చేరుకున్నాక, సీత ఎంతోకాలం ఇంట్లో వుండలేదు. ఋష్యాశ్రమంలోకి చేరుకుంటి. ఈ తిరుగుడు సరదా ఆర్యులలో వుండేదేమో! భారతదేశానికి వారి రాక పై ప్రాంతంనుండే. కాని అనాదిగా దక్షణాన ఉంటున్న ద్రావిడులలో, ఇది లేనట్లుంది. ఇందుకు కారణం దక్షణదేశపు నైసర్గికస్థితి. వీరెక్కడికీ పారి పోలేరు. దక్షణాన, తూర్పూ, పడమరా సముద్రం ఉంది. ఉత్తరానికి ప్రయాణం చెయ్యాలంటే అన్నీ అడవులు. పెద్ద పర్వతాలు.

ఇల్లు విడిచి వెళ్ళిపోయిన మరొక మహావ్యక్తి సిద్ధార్థుడు. ఎవరితో చెప్ప కుండా, రాత్రి రాత్రి ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. ఎందుకు? అద్దంలో తన మొహం చూసుకున్నాడు. నిద్రపోతున్న భార్య మొహంపై సన్నటి వెలుగు పడిన దృశ్యం చూశాడు. ఆ ఉదయం తన ఊళ్ళో వీధుల్లో చూసిన దృశ్యాలని స్మరించాడు. అతని గుండె తరుక్కుపోయింది. ఆ జుట్టు తెల్లబడిపోతుంది; ఊడిపోతుంది. మొహం అంతా మడతలు – చర్మానికి వ్యాధి; జాడ్యం; మూలుగు. చివరికి అసలు ఉండదు – మృత్యువట అఖరికి, చచ్చిపోయినవాడి

గుండె కొట్టుకోదుట. తన గుండెమీద చెయ్యి ఆనించి చూసుకున్నాడు సిద్ధార్థుడు. గుండె పగిలినట్లయింది. ఇంతేనా ఈ సౌందర్యం, ఈ యవ్వనం? మనిషి ఎప్పుడూ, ఇల్లాగే నిత్యయవ్వనుడుగా ఎందుకుండకూడదు? ఉండాలి — ఏదో మార్గం ఉండితీరాలి. అదేమిటో కనుక్కోవాలి. ఎవరితో చెప్పకూడదు, తను అన్వేషిస్తున్న రహస్యం ఏమిటో. అర్ధరాత్రి పారిపోయి, దూరంగా వెళ్ళి, అడివిలో చెట్టుకింద పొంచెగా కూర్చుని, ఆలోచనలో పడ్డాడు. అది నిర్వాణం.

ఈ శతాబ్దిలో ఉండివుంటే, బుద్ధుడు ఏ రసాయనాల పరిశోధనాలయం లోనో పరిశోధన చేస్తూ గడిపేవాడు యవ్వనాన్ని కొనసాగించే పరిశోధనలు ఇప్పుడు జరుగుతున్నాయి. ఏదో చిట్కా కనుక్కుని, నోబెల్ బహుమానం పొంది, భారత రత్నగా, పూజనీయుడయ్యేవా డనిపిస్తుంది.

మరి నేటి యువకులు ఎందుకు పారిపోతున్నట్లు? నాకు తెలియదు. ఒక పరిశోధకుల బృందం ఇంటింటికీ వెళ్ళి, కుటుంబం పెద్దల్నడిగి, ఆరాలు తీసి, పాక చిట్టా తయారు చేస్తేగాని చెప్పలేం నా అజ్ఞానం సూచించే కారణాలు పేర్కొంటాను. పరీక్షలో ఫేలవడం; విద్య చివరంటా చెప్పించే ఆర్థిక స్తోమత లేకపోవడం; తలిదండ్రులపై తోటి విద్యార్థులు వేసే అభాండాలకి తట్టుకోలేక పోవడం, కుటుంబం పెద్దలలో ఎవరో తన తల వంపుకి కారకులవడం; ప్రేమించిన మరోకులం కన్యని పెండ్లి చేసుకోలేకపోవడం; కోరిన కన్య మరొకర్ని వివాహమాడటం, అనువైన ఉద్యోగం దొరక్కపోవడం; వ్యభిచరించి పట్టుపడటం, పల్లెజీవితంతో విసుగెత్తి, మజాని పట్నాలలో వెదకాలని వెళ్ళడం; ఆస్తుల పంపకాలలో పేచీలు, డబ్బుకున్న పలుకుబడికి, రన ఆదర్శతత్వం దెబ్బతినడం, మతం, నమ్మకం, వీళ్ళ గురించి పెద్దలతో వాదోపవాదాలు; మూర్ఖత్వం – వైజ్ఞానిక దృష్టి, వీటికి చిహ్నాలైన పిన్న పెద్దల నడుమ జరిగే సంఘర్షణకి తట్టుకోలేకపోవడం — ఇట్లాంటివి కారణాలుగా తోస్తాయి. తన క్షేమాన్నీ, భద్రతనీ ఎవరో అడ్డుతగిలి అపహరిస్తున్నారన్న భయం — ఈ కారణాల సారాంశం.

విద్యావిధానం అసంతృప్తికరంగా వుంది. దీనితో సమాధానం కుదుర్చుకో లేని యువకులు పారిపోతున్నారని కొందరు. కొన్ని నిర్వచనాలు పొందు పరుస్తాను. యవ్వనం అంటే, జీవితాన్ని గూర్చిన నిజానిజాలను పెద్దలకు బోధించవలసిన సమయం; పిన్నల నుండి పెద్దలు నేర్చుకొన్నదే పయోజన విద్య. ఇతరుల అజ్ఞానాన్ని విశదపరిచేదే ఉన్నతవిద్య; నాన్ననీ, కాలేజినీ విడిచి నప్పుడే ఉన్నత విద్య పట్టా పొందటం ఎవరు ఉపాధ్యాయుడు? విద్యార్థుల విద్యా విధానాన్ని పరిశీలించే వ్యక్తి, మనం కళాశాలలో నేర్చుకున్నదంతా మరిచి

పోయ్యాక మిగిలేదే నిజమైన విద్య. నేర్చుకోతగ్గదేదీ నేర్పడం సాధ్యంకాదు. ఉపాధ్యాయుడు పిల్లలకి మేలు చేసేది తను చనిపోయిననాడే — కారణం? ఆ రోజు పిల్లలకి శెలవు; మన కెంత తక్కువ తెలుసునో తెలుసుకునే అవకాశం ఇచ్చేదే కళాశాల చదువు; కావల్సినప్పుడు భయాన్ని నెలకొల్పేది విద్య. ఈ నిర్వచనా లన్నింటిలోకీ, చివరిది గమనించతగ్గది. ఒక విషయం గురించిన విజ్ఞానం పెరగడంతోబాటు భయంకూడా పెరుగుతూ వుంటుంది. ఈ భయం జన్మస్థానం ఏదో చెప్పలేం. కుర్రవాడు ఏదో చేస్తాడు; ఏదో అంటాడు. అది తప్పని మందలిస్తారు పెద్దలు. కూకలేస్తారు; అప్పుడప్పుడు కొడతారు. 'తప్పు' అంతే. ఎందుకు తప్పో, విడమరిచి చెప్పరు తోటివారితో చెప్పుకుంటాడు. వాళ్ళూ చెప్పలేదు. వారూ తనలా మందలింపబడ్డవారే. ఇదెందుకు తప్పో పాఠ శాలలో, కళాశాలలో చెప్పరు - ఉపాధ్యాయుణ్ణి అడగలేడు. ఆ భయాన్ని ఎల్లానో దిగమింగుతాడు తాత్కాలికంగా. మరో తప్పు చేస్తాడు. మళ్ళా మంద లిస్తారు. మళ్ళా భయాన్ని దిగమింగుతాడు. కథలు, నవలలు చదువుతాడు; సమాధానం దొరకదు. ఇల్లా దిగమింగిన భయాలన్నీ అంతరంగంలో కరుడు కట్టి, ఒక గోడలా లేచి, మనస్సంతా వ్యాపిస్తుంది. అంతరంగంలో అదిమిపట్టిన భయమునుండి పారిపోతున్నాడు యువకుడు. తనమాట, తన చేష్ట — తానెరుగున్న సంఘంలో వ్యక్తులు హర్షించరు. తప్పని కసిరి కొడతారు, తనేమీ చెయ్యలేడు — భయం.

పాఠశాలలో విద్యార్థిగా వుంటున్న దశలో, యువకుడికి మానసికంగా కొన్ని పేచీలు వొచ్చిపడతాయి. కాస్త పెరిగి, వితర్కించుకున్నాక, ఈ అనుభవాలు సమస్యలుగా తలెత్తి, అతని అసంతృప్తికి కారణాలవుతాయి. సంఘంలో కొన్ని కులాలవారు, కులంపేరిట అధికులుగా వుంటున్నారు. ఆ కులానికి చెందిన విద్యార్థిని. తోటి విద్యార్థులు, మాటలతో హింసించి ఏడిపిస్తారు. పాఠ శాలలో అందరూ సమానులే. కాని వాస్తవానికి. కులం బట్టి వొచ్చే వ్యత్యాసా లకు, విద్యార్థి గురై, బాధపడతాడు. అల్లాగే డబ్బు, హోదా — వీటివల్ల ఏర్పడే వ్యత్యాసాలూను. మా తోటి విద్యార్థి తండ్రి ఆ గ్రామంలో ప్రభుత్వోగి — అది అంత పెద్ద ఉద్యోగం కాకపోయినా, ఆ గ్రామంలో వారికది పెద్దగా అగు పడేది. ఆ విద్యార్థి ఇద్దరు నౌకర్లు స్కూల్లో దింపడానికొచ్చేవారు. మళ్ళా బడి మూసెయ్యగానే, ఆ నౌకర్లు తీసుకువెళ్ళేవారు. 'ఏమిటి వీడి గొప్ప మహ,' అని, అతన్ని తోటివారు, ఏకాకిని చేసి ఏడ్పించేవారు. ఉపాధ్యాయుడు, ఆ కుర్రవాణ్ణి వెనకేసుకురావడం జరిగేది. ఇందుమూలంగా, విద్యార్థులకి ఆ

ధ్యాయుడంటే గిట్టేదికాదు. తోటి విద్యార్థుల అపహాస్యానికి తట్టుకోలేక, ఆ బడిని, తనింట్లో పెట్టించమన్నాడు తండ్రిని. బడి మాన్పించి, ఇంట్లో 'ప్రైవేటు' చెప్పించాడు తండ్రి.

నాకు లెక్కలు వొచ్చేవి కావు. లెక్కల మేష్టరు శిక్షించేవాడు. గుప్పిటి బిగించిన వేళ్ళమీద బెత్తంతో కొట్టడం. స్వల్పంగా తొడపాశం — ఇట్లాంటి శిక్షలు. మా నాన్న పలుకుబడి గల ఉద్యోగి అయినా, ఈయన ఖాతరు చెయ్యక, శిక్షించేవాడు. నేను ఇంట్లో ఫిర్యాదు చేశాను. నాన్న ఆ మేష్టరుకి అరటివండ్ల గెల పంపాడు. ఓ వారం పాటు తొడపాశాలు, బెత్తం ప్రేల్పుళ్ళు లేకుండా పొయ్యాయి. బ్రిటిషువారి పాలన కాలంలో ప్రభుత్వానికి — చిన్న గుమాస్తా అయినాసరే — చాలా పలుకుబడి వుండేది వొందేసి ఎకరాలున్న రైతాంగం, గుమాస్తాకి భయపడేవారు. పాలితులకు సంక్రమించే మనస్తత్వం ప్రబలడంవల్ల 'మనకి ప్రభుత్వంతో జోక్యం వుండనక్కర్లేదు — మనకేమీ మేలు జరగదు' అన్న నైరాశ్యంతో కూడుకున్న దృక్పథం అలవాటవుతుంది ప్రజకి. దాని కనువైన వైరాగ్య దృష్టినే అలవరుచుకుంటారు. మన కింతే రాసి పెట్టుంది. మరో జన్మలో, మరో లోకంలో సుఖిద్దాం. ఇక్కడినుండి పారిపోదాం — అన్న తత్వంగా మారుతుందన్నమాట. ఉన్నత పదవుల్లో వున్న ఉద్యోగులు కూడా, విధి నిర్వహణలో తోటి ప్రజపై లాఠీచార్జి లాంటివి జరిపించి, రిటైరు అయ్యాక, పాప పరిహారార్థం, గీతా పఠనం, భజనలు మొదలెట్టేవారు. ఆ దాస్యంనుండి విముక్తి పొందాలనే, ఆనాటి యువకులు ఎందరో ఇళ్ళల్లోంచి పారిపోయి, కష్టాలుపడి, స్వతంత్ర నిర్మాత లయ్యారు.

ఆర్థికస్థితి, మతం, కులం — వీటివల్ల సంక్రమించే వ్యత్యాసాలు సమసి పోవాలన్నది ప్రజాస్వామ్యం. ఈ సమానతలో నిజానిజాలు పరిశీలించే ప్రథమ సంస్థ ప్రాథమిక పాఠశాల. ఇక్కడ, మంచి వేతనాలిచ్చి, సరైన ఉపాధ్యాయుల్ని పెడితే తప్ప, ఈ వ్యత్యాసాలకు కుర్రవాడు గురై, ఎదిగాక, వ్యాకులత చెందడం తప్పదు - ఇంట్లోంచి పారిపోవడం తప్పదు. అన్నీ భయాలే — డబ్బు, పలుకుబడంటే భయం; పై కులం పిల్ల; కిందకులం ఉద్యోగి; ఆయన పెద్ద — అరవైయ్యేళ్ళు నిండాయి. ఆయనంటే భయం. సంప్రదాయం అంటే భయం; స్వేచ్ఛంటేనే భయం. ఈ భయంనుండి విముక్తు దవాలంటే వొకటే మార్గం - ఇంట్లోంచి, ఊళ్ళోంచి, ఈ జనంలోంచి పారిపోవాలి. మరో చోట, మరో రకం మనుషుల మధ్యలో, హాయిగా, నిష్పేచీగా, నిర్భయంగా ఉండొచ్చు.

మనుషులు రెచ్చగొట్టే భయాలే కాకుండా, ప్రకృతి, సృష్టి వైచిత్రి

ప్రేరించే భయాలు కొన్ని ఉంటాయి. విజ్ఞానశాస్త్రం ప్రబలాక, ఈ రకం భయం వొత్తిడి తగ్గినా, మన సమాజంలో ఇది ఉండనే వుంది. బుద్ధుడి విషయం చూశాం. క్రైస్తు, శంకర, వేమన, రూసో, వాల్ట్‌విట్‌మన్, టాల్‌స్టాయ్, లారెన్స్, షెల్లి, సుభాస్‌చంద్రబోస్ – వీరంతా అంతరంగంతో ఆధ్యాత్మికంగా సమాధానం కుదుర్చుకోలేక, సమాజంలో మనుషుల్లో ఇమడలేక, ద్వంద్వాల సంఘర్షణని అంతం చెయ్యడం కోసం, దేన్నో అన్వేషిస్తూ, ప్రకృతిలోకి పారిపోయిన వ్యక్తులే. నిన్ను నువ్వు తెల్సుకోమంటుంది తత్వశాస్త్రం. వీరంతా కాస్తో కూస్తో తమ్ము తాము తెలుసుకున్న చరితార్థులే. తెలుసుకున్నాక, ఎక్కడుంటే అదే ఇల్లవుతుంది. ఇంటికి తిరిగొచ్చినట్లే,

ఈనాడు పారిపోతున్న యువకులు దేన్ని అన్వేషిస్తునారో, తిరిగొచ్చిన వారిని పరామర్శిస్తే తప్ప, చెప్పలేం ఇల్లా పారిపోయిన యువకుడి కథ సినిమాలో చూస్తాం. సినిమాలో ఇట్లాంటి కథ చూసినప్పుడు "ఇదంతా అతిశయోక్తి, సత్యదూరం, మెలొడ్రామా - కేవలం అసహజమైన సినిమా కథ." అని చులకన చెయ్యడం అధునికులకు పరిపాటి. కాని, నేడు పారిపోతూన్న వ్యక్తుల సంఖ్యని చూస్తే, నాకు సినిమాకథ అంత అతిశయోక్తిగా కనబడదు. జీవితంలో జరుగుతున్నదానికి దగ్గరగానే ఉందనిపిస్తుంది. ఎటొచ్చీ, సినిమా కథలో, ముగింపు అసాధారణమైందిగా, అతి నాటకీయతతో కలుషితమై, కళ దృష్ట్యా ఉత్తమస్థాయి నందుకోలేక పోయిం దనుకోవచ్చు. పారిపోయిన యువకుడు, రిక్షావాడుగానో, హోటల్లో సర్వర్‌గానో ఉండి, కోటీశ్వరుని కుమార్తెని ప్రేమించి, పెండ్లి చేసుకోడం అసందర్భంగా అగుపడొచ్చు. పారిపోయి వొచ్చిన కుర్రవాణ్ణి ఎవరో చేరదీస్తారు. పుట్టు పూర్వోత్తరాలు బైట పెట్టక, చివరిదాక రహస్యంగా ఉంచుతారు. తన పుట్టుక ఉదంతం తెలుసుకున్న బిడ్డ, మళ్ళా పారిపోతాడు అట్లా పారిపోనీకుండా ఉంచే కారణాలు కల్పించడంలోనే వుంది సినిమా కథకుడి చమత్కారం. చివర, బైట పెట్టాక, తల్లో, తండ్రో - ఎవరో వొకరు చనిపోక తప్పదు.

సినిమా కథ మాట అటుంచీ, అసలు యువకులు ఇల్లా పారిపోవడానికి కారణం. సినిమాలే అన్న ఫిర్యాది అప్పుడప్పుడు వినబడుతూ ఉంటుంది. సినిమాలో నటించాలని, ఇంట్లో చెప్పకుండా పట్నం పారిపొయ్యే యువకుల మాట అటుంచుదాం. కాలేజీలో చదువుకునే రోజుల్లో నా స్నేహితు డొకడు, ఎవరితోనూ, ఆఖరికి నాతో కూడా చెప్పకుండా, హాస్టల్ నుంచి పారిపొయ్యాడు. అతని తండ్రి నా వద్దకు వొచ్చి, "మావాడు ఏమయ్యాడు?" అని అడిగాడు.

నాకు తెలియదన్నా. "నీ ఊహ ఏమిటి?" అన్నా డాయన. "మేం ఈ మధ్య ఎక్కువగా సినిమా కబుర్లు చెప్పుకుంటున్నాం. సినిమాలో చేరడానికి బొంబాయి వెళ్ళి ఉండొచ్చు," అన్నాను. నే అన్నట్టుగానే, బొంబాయి సినిమా స్టూడియోలో పట్టుబడ్డాడు, నా స్నేహితుడు. సినిమాలో చేరడానికి వెళ్ళిన యువకుణ్ణి గూర్చి ఆర్. కె. నారాయణ్ వొక కథకూడా వ్రాశాడు. కాని ఈనాడు ఇట్లా సినిమాలో చేరడానికని వెళ్ళిపొయ్యేవారిలో, పురుషులకంటె, స్త్రీలే ఎక్కువమంది అనొచ్చు నేమో.

సినిమాలో చిత్రితమయ్యే జగత్తు యువకుడిలో రేగే అసంతృప్తికి కొంత వరకూ కారణమనుకుంటా. జీవితం, సినిమాలో చిత్రించినంత అందంగా ఉండదు. సినిమా కథలో ఒక ధనికుడు వుంటాడు. అతని వృత్తి వ్యాపారం - ఏంటో స్పష్టంగా ఉండదు. అతని మేడ - అందలి గదుల వైభవం, కారు, నౌకర్లు — ఇవన్నీ చూస్తే. అతను కోటీశ్వరుడై ఉండాలి మధ్య పెద్ద హాలు — మూలల కార్నర్ టేబుల్స్, పెద్ద పూలతొట్టెలు, గిల్ట్ ఫ్రేముల్లో, పెద్ద చిత్ర పటాలు, పెద్ద వ్రేల్లాడే దీపాల గుత్తెలు, కంచు గొలుసుల ఊయెల, స్పైరల్ మెట్లు, ఇటాలియన్ పద్ధతిలో తెరుచుకునే అద్దాలకిటికీలు, డైనింగ్ టేబిల్, సోఫాసూట్, పియానోవాద్యం, పెర్షియన్ తివాచీలు, మార్బుల్‌రాతి శిల్పాలు - వరండావైపు కెడితే, అందమైన ఉద్యానవనం, దానిలో నీళ్ళు పొంగే ఊటకట్టడాలు, నడుమ శిల్పం, అక్కడ పిక్‌నిక్ సరంజాం, ఖరీదైన కాఫీసెట్, వంటవాడు, డ్రైవర్, గుమాస్తా — ఒక్క కూతురు ఇంత అందంగా అమర్చబడిన భవనాలు, ఆంధ్రదేశంలో నాలుగైదే వుంటాయేమో! ఇవి నిత్య జీవితంలో యువకుడికి కనబడవు. అవి కావాలంటాడు వాటి లేమివల్ల కొంత అసంతృప్తి. ఒకదాన్ని కోరడానికి ముందు, అట్లాంటిది ఉందనీ, సాధ్యపడు తుందనీ తెలుసుకోవాలికదా!

రాముడు చక్కనివాడని విని శూర్పణఖ. చూడాలని ఇంట్లోంచి పారిపోయి వొచ్చింది. సినిమాలో కోటీశ్వరుని కొమార్తె చక్కంది; చదువు కున్నది; సంగీతం పాడుతుంది; నాట్యం చేస్తుంది, ఆమెకి చిత్రలేఖనం తెల్సు; కవిత్వం మెచ్చుకోగలదు; అవసరమొస్తే, దొంగాడిపై తుపాకి బారుచెయ్యగలదు. ఈ కన్య నిత్య జీవితంలో కనబడదు ఆ వయస్సులో వారికి, పది — పదహారు లోపు వారికి, సినిమా జగత్తే యదార్థ జగత్తుగా తోచి, శాస్త్ర జ్ఞానం వొచ్చి, నిజానిజాలు తెలుసుకన్నాక, ఈ సౌందర్యం తమ జీవితంలో లేదన్న నిరాశ జనించవచ్చు. చదువు, ఉద్యోగం, ప్రేమ, పెళ్ళి, స్నేహితులు, పుస్తకాలు,

కులాసావ్యాపకాలు, మానసిక స్వేచ్ఛ - ఇవన్నీ వొకెత్తు: వీటిని పేర్కొని, ఇది నాకు కావాలి అని అడగొచ్చు. కాని నాకు సౌందర్యం కావాలి అని ఏ యువకుడు అనగలడు? అందుకే దాన్ని వెదుక్కుంటూ పారిపోతున్నారు. జీవితం అంతా వొక్క కళలో ప్రావీణ్యం సంపాదించడానికి వినియోగించినా పరిపక్వత సాధ్యపడ దనుకుంటే, సినిమాలో నాయిక, లేతప్రాయంలో ఇన్ని కళలలో ఆరితేరి వుండటం చూస్తున్న దంపతులలో, భార్య అసూయపడకనూ మానదు. ఆ దృశ్యం చూస్తున్న యువక బ్రహ్మచారి గుండె ఆహ్లాదంతో కొట్టుకోకా మానదు. ఈ భావాన్నే వొక వచన గేయంగా కూర్చాను.

సౌందర్యం ఆరణాల కమ్ముతున్నారు హాలీవుడ్‌లో

మేటనీకి సగం రేట్లు

ఈనాడు, ఇట్లాంటి అందమైన దృశ్యాలని కూర్చి ప్రదర్శించడంలో, మన సినిమాలు, హాలీవుడ్ వాటికి తీసిపోతా యనలేము.

మరి మార్గం ఏమిటి? యువకుడు తన జీవితంలో సౌందర్యాన్ని అనుభ వించగలగాలి. ఒకటి అట్లాంటి వ్యాపకాన్ని కళగా సాధించడం. అనుభవాన్ని ఊహలో తిప్పుకుని తన స్వార్థంతో ముడిపడ్డ వ్యక్తిగతమైన ఛాయలను తొలగించి, రచనద్వారా ఇతరులతో పంచుగుని అంతరంగ బాధనుండి విముక్తు డవాలి. చిన్నప్పుడు, రెండణాల నోటుబుక్కు కొని, శలవల్లో స్నేహితుడికి ఉత్తరంగా వ్రాస్తాడు కుర్రవాడు. అందులో విషయం ఏమీ వుండదు. కాని, తన ఆహ్లాదాన్నీ, అనుభవాన్నీ స్నేహితుడితో పంచుగుని సుఖంగా ఉంటున్నాడు. అనుభవాన్ని తోటివారితో పంచుగుని, విముక్తి పొందాలన్న తృష్ణే రచనకి ప్రధాన ప్రేరణ.

నైరాశ్యాన్నుండీ, అసంతృప్తినుండీ జనించినవే కళలన్నీ నిజానికి. అహం, వ్యక్తిగతమైన తపన తగ్గినకొద్దీ, ఆ కళా ఖండానికి స్థాయీ, ఔన్నత్యమూ పెరుగుతాయి. అహం ప్రేరేపిస్తుంది; ఆ అహాన్ని దిగమింగి, కూలదోసిననాడే కళాప్రయోజనం అతనికి సిద్ధిస్తుంది. ఇట్లా అనుకోడం, అజ్ఞానమేమో నన్న భయం నాలో వుండిపోయింది. ఇవన్నీ యదార్థంతో పొత్తు కుదుర్చుకోని ఉత్తుత్తి సిద్ధాంతాలేమో! పారిపోడం, అసలు సృష్టిలక్షణమేమో. నవమాసాలూ కాగానే, తల్లి గర్భంనుండి పారిపోతుంది బిడ్డ ఇంకా నవమాసాలూ పూర్తవ కుండానే పారిపోవాలని ఉబలాటపడితే, చస్తుంది. విశ్వంలో కోట్లాది గోళాలన్నీ, వొకదాన్నుండి వొకటి, వేగంగా పారిపోతున్నాయంటున్నారు ఖగోళశాస్త్రజ్ఞులు. దూరంగా వున్నవి మరీ వేగంగా పారిపోతున్నాయిట. బాల్యం నుండి యౌవనం

లోకి, యవ్వనం నుండి నడివయస్సులోకి, దాన్నుంచి వార్ధక్యంలోకి, చివరికి మృత్యువులోకి పారిపోతున్నాయి. ప్రాణులన్నీ, ప్రాణులేకాదు, దేశాలూ, సంస్కృతులు, నాగరికతలూ అన్నీ ఉన్నత శిఖరాలకి ఎగబ్రాకి, లోయలోకి అంతమౌతున్నాయి. పిల్లకెరటం, తల్లి గుండెను నాలుకతో పొడిచి, ఒడ్డుకి పారిపోతుంది. తల్లి పసిదాన్ని తనలోకి తీసుకుపోతుంది. అది పెరిగి పెద్దదై తల్లినీ, అమ్మమ్మనీ చెరోచేతా పట్టుకుని మళ్ళా ఒడ్డుకి పారిపోతుంది. ఒడ్డు క్రుంగి, క్రుంగి, దిగజారి భూగర్భంలోకి పారిపోయి చచ్చి సముద్రంగా – (Dead Sea—) మిగిలిపోతుంది. దక్షిణమేఘం త్రుళ్ళిపడి, తునియలై నేల మీదకి పారిపోతూంది. విశ్వంలో గాలులకి క్షణం స్థిమితంలేదు. అన్నిదిక్కులకూ పారిపోతున్నాయి. ఏదీ, ఎక్కడా, స్థిమితంగా నిలబడదు. అట్లా పారిపోవడం, సృష్టి ప్రధానలక్షణమేమో! అదేమార్పు, అది సృష్టిపరిణామం. ఇల్లా ఏదో అనుకుంటేతప్ప, పారిపోతూన్న యువకులని గురించిన నా బాధకి ఉపశమింపు కనబడదు.

## సినీ కవిత (కావ్య ప్రశంస)

# 'కారులో షికారు'

కారులో షికారు కెళ్ళే పాల బుగ్గల పసిడిదాన
బుగ్గమీద గులాబి రంగు ఎలా వచ్చెనో చెప్పగలవా
నిన్ను మించిన కన్నె లెందరో మండు టెండలో మాడిపోతే
వారి బుగ్గల నిగ్గు నీకు వచ్చి చేరెను తెలుసుకో ॥కారులో॥

నిలిచి విను నీ బడాయి చాలు తెలుసుకో ఈ నిజా నిజాలు
చలువరాతి మేడలోన కులుకుతావె కుట్టిదానా
మేడగట్టిన చలువరాయి ఎలా వచ్చెనో చెప్పగలవా
కడుపు కాలే కష్ట జీవులు ఒడలు విరిచీ గనులు తొలిచీ
చెమట చలువను చేర్చి రాళ్ళను తీర్చినారు తెలుసుకో ॥కారులో॥

గాలిలోన తేలిపోయే చీరగట్టిన చిన్నదానా
జిలుగు వెలుగుల చీర శిల్పం ఎలా వచ్చెనో చెప్పగలవా
చిరుగుపాతల బరువు బ్రతుకుల నేతగాళ్ళే నేసినారు
చాకిరొకరిది సౌఖ్య మొకరిది సాగదింక తెలుసుకో ॥కారులో॥

ఇది వొక సినిమా పాట దీనిలో అందచందాలు పరామర్శించేముందు, ఈ పాటంటే నాకు చాలా ఇష్టమని చెప్పివేస్తున్నాను.

1959 లో కాబోలు ఈ పాటని వొక గ్రామఫోన్ రికార్డుగా విన్నాను. ఇది ఏ చిత్రంలోనిదో నాకు తెలియదు విన్నాక బాగుందనుకున్నాను. దీన్ని వ్రాసిన కవి ఎవరో అప్పట్లో తెలిసిందే కాదు. తర్వాత ఈ పాటని చాలా మార్లు విన్నాను. అప్పుడు కూడా ఈ పాట బాగుందనుకున్నాను. పాతబడలేదు. ఈ మధ్య మళ్ళా విన్నాను. ఇంకా బాగానే వుంది. నాలో నిల్చిపోయింది. అట్లా నిల్చిపోయినప్పుడే, అది మంచి కవిత్వం అంటారు.

ఇది అంతగా నాకెందుకు నచ్చిందో మరి. పరామర్శిస్తేగాని దాని

రహస్యం బైటపడదు. పాఠకుడి సహాయంతో ఆ పనికి పూనుకుంటున్నాను; ఏం బైటపడేదీ ఉభయులమూ చూద్దాం.

ఈ పాటలో – "పాట" అనడం మానేసి, "గేయం" అందాం. కాసేపు సినిమా పాటనీ, సందర్భాన్నీ, పాడిన వారినీ మరిచిపోయి, పుస్తకంలో చదివిన గేయంగా చూద్దాం. ఈ గేయంలో మూడు ప్రశ్నలున్నాయి. వాటికి సమాధానాలూ వున్నాయి. ఇందులో సగంపైగా సొంపు, ఆ ప్రశ్న లడిగిన రీతిలోనే వుందనిపిస్తుంది.

అందమైన అమ్మాయి. వయస్సు పదిహేను - పదహారు దాటదు. పాల బుగ్గలు, బుగ్గమీద గులాబిరంగు; కాస్తంత సిగ్గు; గాలిలో తేలిపొయ్యే చీర కట్టుకుంది - జిలుగు వెలుగుల శిల్పంతో కూడిన చీర. అమ్మాయిలో కాస్తంత బడాయి వుంది; కులుకుతుంది సుఖంగా, నవ్వుతూ వుంటుంది.

ఆ అమ్మాయి మకాం, చలువరాతి మేడలో సాయంత్రం అవగానే, హాయిగా కార్లో షికారుకి బైలుదేరింది. మన కవి కంటబడింది. ఆమెని నిలేశాడు కారు, ఆమే డ్రైవ్ చేస్తోంది అనుకోను తనే డ్రైవ్ చేస్తే కులుకూ, తళుకూ, వయ్యారం పీలువడవు ఆమె లేతచేతులు స్టీరింగ్‌ని తిప్పగలవా? మృదువైన పాదాలు బ్రేక్‌ని నొక్కగలవా? అందమైన చీరకి మోటార్ తైలం అంటుకొని పాడైపోదూ? పెట్రోల్ వాసనకి, జడలో సంపెంగ పరిమళం సమసిపోదూ? నేననుకోడం, ఆమె వెనక సీట్లో వయ్యారంగా కూర్చుంటుంది. ముందు సీట్లో డ్రైవర్ నడుపుతాడు. "గాలిలోన తేలిపోయే చీరగట్టిన చిన్నదానా" అని సంబోధిస్తున్నాడు కవి. కారులో కూర్చుని వుండగా, గాలిలో చీర ఎల్లా తేలిపోతుంది? కారు మంచి జోరుగా వెడుతోంది. గాలికి ఆమె ముంగురులు అల్లల్లాడి పోతున్నాయి; జుట్టు రేగిపొయ్యే ప్రమాదం వుంది. అందుకని, చీర కొంగుని తలపై కప్పుకుని వుండాలి. ఆ కొంగు, చివరి భాగం గాలికి, కిటికీ లోంచి బైటపడి తేలియాడి పోతూ వుండాలి.

కవి రోడ్డుకి అడ్డంగా నిలబడ్డాడు. డ్రైవర్ కార్ నిలపక తప్పింది కాదు. ఆమె కారు దిగి, నిలబడి, చీరకొంగు, జడ సర్దుకొంటూ వుంది డ్రైవర్ పక్కవీధిలో టీకొట్టుకెళ్లాడు. అప్పుడడిగాడు – ఆ బుగ్గమీద గులాబిరంగు ఎలా వచ్చిందో చెప్పగలవా అమ్మాయీ, అని 'చెప్పగలవా?' అన్నది చాలా అందమైన ప్రశ్న. అందులో ఆప్యాయతా, కారుణ్యం వున్నాయి. కాస్తంత వెటకారం, ఏ మాయమూలో వున్నా, అది పొగలా కమ్మివేసే ఆరాధనా భావం వెనక, మరుగుపడింది "నిన్ను దేవుడు ఇంత అందంగా ఎందుకు పుట్టించాడు?" "నువ్వెందుకు ఇంత అందంగా వున్నావు." అన్న ప్రశ్నలకి కావ్య రూపం,

'చెప్పగలవా?' అన్నది. ఈ ప్రశ్నలో 'సమాధానం' చెప్పు – అన్న ధ్వనిలేదు. "దానికి సమాధానం, నీకు తెలుసా? – తెలియదు పాపం" అన్న భావమూ వుంది. "నీకు తెలియదులే" అన్న జాలీ వుంది. "ముందు ముందు తెలుసు కుంటావులే" అన్న ఆశా వుంది. ఒక రకమైన 'విశ్వప్రేమ' ఇమిడివున్న ప్రశ్న అది. మన కవి ఈ కన్యని ప్రేమించి, 'నీ బుగ్గమీద గులాబిరంగు ఎలా వొచ్చిందీ?' అని ప్రశ్నిస్తున్నాడనుకో కూడదు. కవి, సౌందర్యం ఎక్కడున్నా ప్రేమిస్తాడు– ఆ ప్రేమలో, ప్రేమించినదాన్ని తన స్వంతం చేసుకోవాలన్న వాంఛలేదు. సూర్యాస్తమయం తాజ్‌మహల్, కన్యాకుమారివద్ద సూర్యోదయం అందంగా వుంటాయి. వాటిని ప్రేమిస్తాం – కాని అవి 'నావి' అనుకోం. అట్లాంటిదే ఈ కన్యపట్ల ప్రేమ. ఆ కన్య సమాజంలో సౌందర్యానికి ప్రతినిధి. ఆమె వెనక తరతరాల నాగరికత వుంది. ఆ నాగరికత ప్రతినిధిగా నిలబడ్డ కన్య బుగ్గమీది గులాబి గురించి కవిలో కుతూహలం రేకెత్తి, సమాధానం తెలిసీ కూడా, ఆ సమాధానం ఆ కన్యకి తెలీదుగదా! అన్న భావంపట్ల సానుభూతి చూపుతూ అడిగిన ప్రశ్న అది.

అందుకే ఇందులో కరుణరసం వుందన్నాను.

కవి అడిగిన ప్రశ్నలూ, చెప్పిన సమాధానాలూ ఎట్లాంటివో పరిశీలిద్దాం.

మొదటి ప్రశ్న – బుగ్గమీద గులాబిరంగు ఎలా వొచ్చింది?

సమాధానం : ఎందరెందరో కన్నెలు మండుటెండలో మాడిపోతే వారి బుగ్గల నిగ్గు నీకు వొచ్చి చేరింది–అల్లా చేరడంలో నిజానిజాలెట్టివో తెలుసుకో. అంటే ఏమిటి? ఎందరెందరో కన్యలు ఎండలో కష్టపడి పనిచేసి మాడిపొయ్యారు. ఆ కన్యల బుగ్గల నిగ్గు ఈ కారులో అమ్మాయి కొచ్చింది. ఆ కన్యలు కష్ట పడ్డారు. ఫలితం అనుభవిస్తున్నది, కారులో కన్య.

ఒకటి రెండు సందేహాలు; 'నిన్ను మించిన కన్నెలు' అంటే? అందులో ఈమెని మించిన కన్నెలు? చక్కదనంలోనా? ధనం, హోదాలోనా? బలంలోనా? ఎందులో ఈ కన్యని మించారు? స్పష్టంగా లేదు. ఈమె కంటె అందమైన కన్యలై వుండరు. ఐవుంటె, ఈ కారు కన్య చక్కదనం, ఆ కష్టపడిన ఇల్లాలు కూతురికి అబ్బిందన్నా తప్పులేదు. ఈమెకంటె ధనం, అధికారం గలవారా? ఐవుండరు. ఐవుంటే మండుటెండలో మాడిచావరు. ఏ సమాధానమూ తృప్తి కరంగా లేదు. 'నిన్ను మించిన కన్నెలు'– అనడంలో ఇక్కడ సరైన అర్థం కుదరదు. ఇది దోషం.

మొత్తం మీద, కొందరు కన్యలు మండుటెండలో మాడిపొయ్యాక, వారి బుగ్గల నిగ్గ ఈ కారు కన్య బుగ్గమీది కొచ్చింది – అని ఒప్పుకుందాం. భాష

కష్టం చేసిన వారి శరీరాలు మృదువుగా, నాజూకుగా, సుకుమారంగా వుండవు. చేతులు, చర్మం వేళ్ళు దళసరెక్కుతాయి. వారి యవ్వనం ఇట్టె గడిచిపోయి, వార్ధక్యం వొచ్చి మీదపడుతుంది. కష్టపడి పనిచేశారు గావున, వారి బుగ్గలమీద గులాబిరేకులు ఎండలో వాడి, విడి, పడిపోతాయి. కష్టపడని కారుకన్య బుగ్గ మీదికి ఎగిరి వొస్తాయి.

కారులో కన్య — ఏ పనీ చెయ్యదు. కష్టపడ నక్కర్లేదు. తండ్రి ధనికుడు. లక్షాధికారై వుండాలి. అంత డబ్బు ఎలా సంపాదించాడో మనకి తెలియదు. కష్టపడి గడించిన డబ్బా? బ్లాక్ మార్కెట్ వ్యాపారం ద్వారానా? పెద్దలు గడించి పడేసిన ఆస్తివల్లనా? మనకి తెలియదు. కూతురికి వొక కారు కొనిచ్చాడు. హాయిగా ఆమె షికారు కెడుతూ వుంటుంది. అన్నం తినేటప్పుడు, చేతులకూ, నాలుకకూ, నోటికీ పనితప్ప, — మరేపనీ ఎరుగదు. కాబట్టి ఈమె బుగ్గమీద గులాబి ఎక్కువ రోజులు పరిమళిస్తూ వుంటుంది— అని మన కవి భావన. కాని ఇది పూర్తిగా నిజం కాదు కష్టించి పనిచేసినా — యవ్వనం సమాప్తం అవడం, నడివయస్సు వచ్చిపడడం తప్పదు. భౌగోళికమైన స్థితి గతులు, వంశపారంపర్యంగా వొచ్చిన ప్రత్యేకమైన భౌతిక పరిణామాలను మినహాయిస్తే; కాలం తెచ్చిన ఈ మార్పు అందరి కన్యలకీ సమంగా వర్తిస్తుంది. స్త్రీలోలుడూ, బ్రహ్మచారి — ఇద్దరికీ నడివయస్సు వొకే సమయంలో సంక్రమిస్తుంది. బ్రహ్మచారిలో యౌవనదశ పెరుగదు. కావున కష్టపడి పనిచేసిన కన్యల బుగ్గలూ, కారులో షికార్లెళ్లే కన్యల బుగ్గలూ — వొకేసారి వాడిపోతాయి. పెద్ద తేడా ఏం లేదు. అందుకని ఈ కవి చెప్పిన ఈ సమాధానం తృప్తికరంగా లేదు. కారులో కన్య తండ్రి - దొంగ వ్యాపారంచేసి డబ్బు గడించాడనుకుందాం పట్టుబడ్డాడనుకుందాం. అతన్ని జైల్లో పెడతారు. ఆస్తి పోతుంది. అప్పుడు, కారులో కన్య గతి ఏంగాను? ఏ ఫ్యాక్టరీలోనో చేరి కష్టపడి, మండుటెండలో పనిచేసి పొట్టబోసుకోవాలి. అల్లా పనిచేసినంత మాత్రాన, ఆమె బుగ్గలో నిగ్గు వెంటనే నశింపవుతుందా? అవదు వయస్సు మళ్ళాకనే అవడం మొదలెడుతుంది. కాని వో విధంగా అవుతుంది— బుగ్గమీది గులాబి, యార్డ్లీ కంపెనీవారి టాల్కమ్ పౌడరూ, క్రీమ్ వాడడం వల్ల ఏర్పడినప్పుడు 'ఎర్ర గులాబులు' (**Red Roses**) అను పేరిట యార్డ్లీ టాల్కమ్ పౌడర్ మార్కెట్లో వుంది. కారులో కన్య, అది వాడుతూ వుంటుంది. తండ్రి తప్పిదం వల్ల ఆస్తంతా పోయి తను ఫ్యాక్టరీలో పనికి కుదురుకున్నప్పుడూ, మరి టాల్కమ్ పౌడర్లకి వీలుండదు. గులాబి ఎగిరి పోతుంది. కాబట్టి, ఆ కన్యలు మండుటెండలో మాడడం వల్ల

ఈమె బుగ్గమీద గులాబి ముల్లెపిందనుకోవడానికి ఆధారం లేదు. 'నిజమే బాగా చెప్పాడుస్మా, కవి' అనిపిస్తుంది గేయం చదివినప్పుడు. కాని, ఇందులోదంతా నిజం కాదు.

రెండో ప్రశ్న — సమాధానం

'నిలిచి విను నీ బడాయి చాలు; తెలుసుకో ఈ నిజా నిజాలు' అంటున్నాడు మధ్యలో కవి. ఇది మంచి హెచ్చరిక కారులో అమ్మాయి రోడ్డుమీద నిలబడింది. ఇతను మాట్లాడుతుంటె, తనకేమీ సంబంధం లేనట్లు, పరధ్యానంతో అటూ ఇటూ చూస్తూవుంది కాబోలు మన కవి వొళ్లు మండింది— 'నిలిచి విను' "కాళ్లు ఊపకు' — "ం బడాయి అపు చెయ్యి" — "నిజా నిజాలు తెలుసుకో." — అంటె, "ఇంట్లో నీ కెవ్వరూ అసలు రహస్యాలు చెప్పరు. అంతా దొంగలు. అసలు సంగతి నేను చెప్తున్నాను - విని, ఇప్పుడేనా తెలుసుకో ఈ నిజా నిజాలు." అంటున్నాడు ఇందులో "ఈ నిజా నిజాలు" — అనడం ఎంతో బాగుంది "ఇవి విను" మిగత విషయాలు నువ్వు ఎన్నో తెలుసుకుంటావు. అవి అంత ముఖ్యమైనవి కావు. ఈ నిజాలు గమనించు " ఈ విధంగా ఆ కన్యను హెచ్చరించి, ప్రశ్న అడుగుతున్నాడు కవి

ఏమిటి ప్రశ్న? "చలువరాతి మేడలోన కులుకుతావే కుబ్రదానా, మేడ గట్టిన చలువరాయి ఎలా వచ్చెనో చెప్పగలవా?"

ఆమె బిత్తరపోతుంది. ఆశ్చర్యంతో కనుబొమ్మలు చిట్లించి, కళ్ళు పెద్దవి చేస్తుంది, అవును, నిజమే. వాళ్ళది పెద్ద మేడ. అందులో కులుకుతూ వుంటుంది. స్నానం చేసి, 'మేకప్' చేసుగుని, ఉయ్యాలమీద ఊగుతూ టిఫిన్ తింటుంది— పావురంతో ఆడుకుంటుంది. రామచిలుక బుజంమ్మీద — తొడమీద కుక్కపిల్ల. రేడియోగ్రామ్ వింటూ వుంటుంది. తనూ పాడుతుంది. ఏదో జ్ఞాపకం వచ్చి, ఉయ్యాలదిగి, నాట్యం చేస్తున్నట్టు గంతువేస్తుంది, అద్దంలో చూసుకుని మురిసిపోతుంది.

తను కులుకుతున్నట్లు ఈయనకి ఎట్లా తెలుసో, అని ఆశ్చర్యపడుతుంది.

పెద్ద మేడ — కాని అది చలువరాతి మేడ — అన్నది తను గమనించనే లేదు. ఈయన కెట్లా తెలుసు? చలువరాయి ఎలా వొచ్చిందో తనకి తెలియదు. ఎందుకు తెలియాలి? ఏమిటీ అర్థంలేని ప్రశ్న కారులో కన్య అల్లా ఆలోచిస్తే తప్పేం లేదు. విజ్ఞాన సర్వస్వం తయారుచేస్తున్న సంపాదకుడికి తప్ప, చలువ రాయి ఎక్కడ దొరికేదీ, దాని ఖరీదు ఎంతైందీ తెలుసుకోవాలని లేదు. నిరుపయోగమైన భోగట్టా ఇది. కారులో కన్య తండ్రి, ఏ రోడ్ల కంట్రాక్టరో,

ఇళ్లు కట్టించే అసామియో ఐతే, ఆ పిల్ల చలువరాళ్ళను గురించి వారూ వీరూ చెప్పుకుంటే విని, కొన్ని వివరాలు తెలుసుకుని వుండేది. అట్లా కానప్పుడు చలువరాళ్ళని గురించిన ఈ ప్రశ్న సమంజసం కాదనాలి మన కవికి ఈ ప్రశ్న ముఖ్యమైంది. చలువరాయి ఎల్లా వొచ్చింది?

సమాధానం : కడుపుకాలే కష్టజీవులు ఒడలు విరిచీ గనులు తొలిచీ చెమట చలువను చేర్చి, రాళ్ళను తీర్చినారు.

కష్టజీవులు గనులు దొలిచారు వారి చెమటే చలువను చేరింది – ఆ కూర్పుతో రాళ్ల పైకి లాగారు.

నిజమే, వాళ్ల చేసినపనే ఇది కాని, కేవలం వాళ్ళవల్లే జరిగిందనలేము. ఫలానాచోట చలువరాయి దొరుకుతుంది ఫలానాచోట గని తవ్వండి – అని చెప్పేవారు కూడా కొందరుండాలి. ఫలానా పని చెయ్యి – అని కొందరు చెప్పాక, మరికొందరు ఆ పని చెయ్యాలి. మొదటి వాడిది మెదడు పని; రెండో వాడిది శరీర కష్టం. కాని ఇద్దరూ అవసరమే రెండోవాడు వొళ్లు విరిచి పని చెయ్యాలి– మొదటివాడు, చటుక్కున భావం తట్టక, బుర్రని గోడకేసి కొట్టుకో వచ్చు; ఇద్దరికీ చెమట పడుతుంది ఇద్దరూ కడుపు కాలినవాళ్ళే – కాలుతున్న కడుపుతో వాడు ఆలోచిస్తున్నాడు; వీడు పని చేస్తున్నాడు. మంచి ఆకలిగా వున్నప్పుడే మెదడు చురుకుగా పనిచేస్తుందంటారు కొందరు. కాబట్టి కేవలం కష్టించిన వాళ్ళవల్లే ఈ చలువరాయి రవాణా అయిందనుకోడం పూర్తి నిజం కాదు.

చివరి ప్రశ్న ఏమిటో చూద్దాం.

గాలిలోన తేలిపోయే చీరగట్టిన చిన్నదానా – అని సంబోధన. అంటే పల్చటి చీర – తేలికైంది; మెత్తటిది, మృదువైన చీర. గాలిలో తేలిపోతుంది. వెనక – బ్రిటిష్‌వారు రాకపూర్వం మన దేశంలో అగ్గి పెట్టెలో ఇమిడేటంత పల్చటి చీరలు నేసేవారని చెప్తారు. ఈ కాలంలో కన్య అంతటి పల్చటి చీర ధరించిందన్నమాట.

"జిలుగు వెలుగుల చీరశిల్పం ఎలా వచ్చెనో చెప్పగలవా?" జిగేల్‌మని మెరిసే చీర – వెండితీగలూ, బంగారు తీగపోగులూ వుంటే అల్లా మెరుస్తుంది. నేడు కృత్రిమ రసాయనిక ప్రక్రియలు రూపొందించిన వాటితో తయారైన చీరలు – రయాన్, నైలాన్ మొదలైనవి – అట్లా మెరుస్తాయి. చీర తయారీలో ఎంతో 'శిల్పం' – పనివాడితనం వుంది. ఆ శిల్పం ఎట్లా వొచ్చిందో తెలుసా అని అడుగుతున్నాడు కవి.

అవును, ఆమె వాటిని గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. అసలు ఆ చీర ఖరీదెంతో ఆమెకి తెలియదు! ఏపార్టీలోనో, ఏ పెళ్ళిలోనో, ఏ ధనవంతురాలో అట్లాంటి చీర కట్టేవుంటుంది — ఈమె ఆచీరని చూసి, నాన్నతో చెప్పింది — నా కట్లాంటి చీర కావాలి అని అంతే; రెండు రోజుల్లో ఆ చీరలు, నాలుగైదు వొచ్చి వర్డాయి.

సమాధానం :

"చిరుగు పాతల బరువు బ్రతుకుల నేతగాళ్ళే నేసినారు." ఆ చీరని నేసిన వాళ్ళు బీదవాళ్ళు. చిరుగు పాతలు ధరిస్తారు. వారి బ్రతుకులు వారికి భారం. అట్లాంటివారు నేశారు. ఇందాకా, రెండో ప్రశ్నకి మనం సమాధానం పరిశీలిస్తున్నప్పుడు, దొరికిన పొరబాటే మళ్ళా ఇందులోనూ ప్రత్యక్షమైంది. నేసినవాళ్ళు చిరిగిన చొక్కాలు, ధోవతులు ధరించి ఉండవచ్చు. కాని, ఆ చీరలో 'శిల్పం' అంతా వాళ్ళవనే అన్నది పూర్తి యదార్థం కాదు. బట్టకి ప్రత్తి అవసరం. దాని ఉత్పత్తి, పంపిణీ, అదంతా పెద్ద వ్యవహారం. ఎన్నెన్ని దేశాలలోనో ఇది తయారై రవాణా అవుతుంది. కొన్ని లక్షల మంది ఆ పనిలో వున్నారు జిలుగు, మెరుపు, తళుకు ఇచ్చేటందుకు అవసరమైన, సిల్కు, రయాన్, నైలాన్, మొదలైనవాటి తయారీ, మళ్ళా వేరే పెద్ద పరిశ్రమ కొన్ని పాశ్చాత్య దేశాలలో తయారవుతాయి. రసాయనిక శాస్త్ర రంగంలో నిపుణులు ఆ పనిలో ఉంటారు. ఇవన్నీ పోగైనాక, వాక 'నమూనా' (Design)—ఇట్లా ఉండాలి. అని నేసి చూపెట్టే కళాకారుడుండాలి. ఆ కళాకారుణ్ణి, అవసరమైతే పై దేశంనుండి రప్పించాలి. దానికి బోలెడు డబ్బు కావాలి. వీళ్ళందర్నీ పోగుచేసి, ఉండేటందుకు ఇళ్ళు చూసి పెట్టి కావల్సిన యంత్రాలను తెప్పించి, నడిపించే వ్యవహర్త కావాలి. బోలెడు డబ్బు పెట్టుబడి పెట్టాలి. అట్లాంటి పెత్తందారు లేకపోతే, అసలు నేతగాళ్లే ఉండరు. నేతగాళ్ళకి ఈ నేసే పనిచూపే నాధుడు లేకపోతే చిరుగుపాతలు కూడా లేకుండా అటవీకులల్లె ఉండిపొయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. అందుచేత కారులో అమ్మాయి చీరలో శిల్పం, కేవలం నేతగాళ్ళవనే అనలేం. ఐనా ఆశిల్పం ఎల్లా వొస్తే ఆమెకెందుకు? ఆ నేతగాళ్ళకి తాము నేసిన చీర ఎవరు ధరించారో తెలుసా? వాళ్ళకి అదెంత తెలుసో ఈమెకి అంతే తెలుసు.

గేయంలో ప్రశ్నలు, సమాధానాలూ ముగిశాయి. అంతా ఐపోయింది. కాని కవి అంతటితో గేయం సమాప్తి చెయ్యలేదు. చివ్వర మరో వాక్యం కూర్చాడు.

"దాకి రొకరిది, సౌఖ్యమొకరిది, సాగదింక తెలుసుకో," అని పాఠకుడికి ఇబ్బంది లేకుండా, ఆ గేయంలోని అంతరార్థం ఏమిటో కవి చెప్పకున్నాడు.

ఇదొక నీతి పాఠం. ఏమని? కష్టపడేవాడొకడు, ఫలితం అనుభవించేవా డొకడు; — ఇట్లాంటి పరిస్థితి ఇంక సాగదు – అని తెలుసుకో. కష్టపడినవాడే, ఫలితం అనుభవించాలి.

"నువ్వు కూడా కష్టపడి పనిచెయ్యాలి, ఇల్లా సింగారించుకొని, కులుకుతూ కార్లో షికార్లు తిరిగితే లాభం లేదు. ఇంక నీ షికార్లు సాగవు-అని తెలుసుకో." అన్నాడు కవి.

నిజానికి మన కవికి ఆ కార్లో అమ్మాయి పట్ల కోపం, ద్వేషం. లేవు. ఇవన్నీ ఆ అమ్మాయిని ఉద్దేశించి చెప్పినవి కావు. ఆ అమ్మాయికి షోకులూ, షికార్లూ, అమిర్చిపెట్టిన పెత్తందార్లని ఉద్దేశించి చెప్పిన విషయాలివి. అంటే, ఆ, అమ్మాయి తండ్రిని ఉద్దేశించి చెప్పిన వన్నమాట.

అమ్మాయి తండ్రి, మొదట్లో అంత పెద్ద ధనికుడు కాడు. సామాన్య కుటుంబీకుడే. ఎక్కడో నౌకరీ చేసి, పొట్టబోసుకునేవాడే. అతనికి పెద్దల నుండి సంక్రమించిన ఆస్తి లేదు. కాని రెండో ప్రపంచ యుద్ధం సాగిన రోజుల్లో, ఓ కలప వ్యాపారంలోనో, ఇనపకడ్డీల వ్యాపారంలోనో, బోలెడు లాభాలు వొచ్చి పడ్డాయి దొంగవ్యాపారం చేసి మరి కొంత డబ్బు సంపాదించాడు.

తన అవసరాలూ, కుటుంబంలో వారి అవసరాలూ తీరాక కొంత డబ్బు మిగిలిపోయింది అల్లా మిగిలిందే మూలధనం. (Capital) అంటారు. దాన్ని ఏం చెయ్యాలి? అనేక విధాలుగా ఖర్చు పెట్టొచ్చు. సత్రవులు, ఆస్పత్రులూ కట్టించొచ్చు. దాన ధర్మాలు చెయ్యొచ్చు. లేక వొక సినిమా తియ్యవచ్చు. ఆ చిత్రం బాగుండి, డబ్బొచ్చిపడితే, మరో చిత్రం తియ్యవచ్చు. కోటీశ్వరుడై, పెద్ద సినిమా స్టుడియో నెలకొల్పవచ్చు.

అట్లా డబ్బు చేసుకున్నాక – పెత్తందారు కూతురు, మన కారులో షికార్లు తిరిగే అమ్మాయి. కాబట్టి ఏమిటన్నమాట? "పెత్తందార్ల ఆటలు సాగవు సుమా" అంటున్నాడు కవి. దీన్ని రెండు విధాలుగా విమర్శించవచ్చు.

ఒకటి, పెత్తందారు, కష్టపడకుండా, ఈ డబ్బు సంపాదించాడనడం సబబు కాదు. 'కష్టం' అంటె కాయకష్టం మాత్రమే అనుకోకూడదు సమాజంలో రెండు రకాల వారుంటారు. ఏం చెయ్యాలో చెప్పేవారు; చెప్పినదాన్ని చేసే వారు; వీళ్ళిద్దరూ సమంగా కష్టపడి పని చేసేవారే, – మెదడు పని కొందరిదీ; మరి కొందరిది కాయకష్టం. కొందరు మాత్రం, చెప్పేవారుగా ఎందుకుండాలి? అవసరాలు తీరాక మిగిలిపోయిన ధనం వున్నవారే చెప్పేవారుగా ఉంటున్నారు. కార్లో అమ్మాయి తండ్రి మెదడు పనితో లక్షాధికారి ఐవుండొచ్చు. ఇతనితో

మన కవికి పేచీ లేదు. ఆ మెదడు పనీ లేకుండా, పెద్దలు సంపాదించి పారేసిన వందెకరాల భూమి సంక్రమించివుంటె, దానిపై వొచ్చే ఆదాయంతో, సలహా చెప్పేవారి చిట్టాలో చేరిపోయ్యే దక్షత తెచ్చుకున్నాడు - అన్నప్పుడే 'ఇది సాగదు' అంటాడు కవి. ప్రస్తుతం ప్రజాస్వామ్యం కొనసాగుతున్న దేశాలలో ఇది సాగుతూనే వుంది. ఏం చెయ్యాలో చెప్పడం, పనికి కావల్సిన వాటిని తన ఆధీనంలో ఉంచుకోడం - ఈ రెండూ, పెత్తందార్ల చేతుల్లో వుండకుండా,-అందరికీ సమంగా చెందే సామాజిక వ్యవస్థ ఉండాలంటాడు కవి కాని ఇది 'సాగదు' అని ఖచ్చితంగా అనడం కవి కుస్తీకి దిగినట్లు ధ్వనిస్తుంది.

'ఇది సాగదు' - మరో వ్యవస్థ వొచ్చి పడుతుంది. బాగానే వుంది. అందరూ కష్టపడ పని చేసి, ఫలితాన్ని సమంగా అనుభవించడం, మనందరికీ ఇష్టమే. కాని తిరా ఆ వ్యవస్థ వొచ్చాక, అందులో ఎట్లాంటి పేచీ లుంటాయో, కవికి ఏం తెలుసు? ఎల్లా తెలుసు? ఎవరో చెప్పింది చెప్తున్నాడు, ఆ వ్యవస్థని గూర్చి వ్రాసినాయన కారల్ మార్క్స్, ఆయన చెప్పిన సూత్రాలు ఆధారంగా రూపొందిన సమాజంలో ఈ గేయంలో కవి అడిగిన ప్రశ్నలను అడిగే స్వేచ్ఛ కవికి ఉండకపోవచ్చు పెట్టుబడిని స్వాధీనం చేసుకున్న ప్రభువు నిరంకుశ ప్రభువు కావొచ్చు. ఆ ప్రభువుని ప్రశ్నలడిగే స్వేచ్ఛ కవికి ఉండకపోవొచ్చు.

రెండోది - కవి నిజానికి, కార్లో అమ్మాయిని సంబోధించి చెప్పడంలేదు. ఆమె వెనక వున్న సమాజ వ్యవస్థని, దానిలో పెత్తందార్లనీ ఉద్దేశించి చెప్తున్నాడు. తిన్నగా అ పెత్తందారు దగ్గరకే వెళ్ళి, నాలుగూ పెట్టే ధైర్యం కవికి లేకనా? కార్లో అమ్మాయి తండ్రి సినిమా కంపెనీ పెట్టాడనుకుందాం. కవిని కేకేసి, "పాటకి ఇంతిస్తాను, నాలుగు సినిమా పాటలు వ్రాసిపెట్టు" అంటాడు. అప్పుడు ఆ కవి, పెత్తందారు ఏ విధంగా దొంగవ్యాపారంలో డబ్బు సంపాదించిందీ యాకరువు పెడుతూ పాటలు వ్రాయగలడా? సాహసించి వ్రాస్తే, ఆ పాటలో అర్థం, ఆయన గ్రహిస్తే, ఈ కవిని మాన్పించి, మరో కవిని పెట్టుకోవాలి. ఎవరి కూడు తింటున్నామో, వారినే వెక్కిరించలేము. భారతంలో కర్ణుడి విషయం వేరుగా చెప్పనక్కర్లేదు. ఉదాహరణకి, మన పెత్తందారు, కాలేజి పెట్టాడనుకుందాం. అందులో కవిని, ఉపాధ్యాయుడుగా వేసాడనుకుందాం. పెత్తందారు వీరశైవుడనుకుందాం. అప్పుడు, వీరశైవం తుక్కు మతం, అని మేష్టరు బోధించగలడా? ఆ ధైర్యం లేక, ఇస్లామ్ మతాన్నో, క్రైస్తవమతాన్నో దూషిస్తూ, చివరికి, అన్ని మతాలూ తుక్కు మతాలే అనేసి నాస్తిక తత్వాన్ని బోధించడంతో తృప్తిపడాల్సి వొస్తుంది. అసలు మతం గొడవ లేకుండా,

లౌకిక సూత్రాలపై ప్రభుత్వమే కళాశాల నిర్వహిస్తే. పండితుడికి ఈ పేచీ లుండవు. కాని, ప్రభుత్వం ఆదేశించిన ప్రకారమే, బోధించే పరిస్థితి ఏర్పడు తుంది. మళ్ళా దాని పర్యవసానం వేరు. మనకిక్కడ అప్రస్తుతం.

ఆధునిక కావ్య సంపుటిలో వొక గేయంగా, ఈ రచన చదివినప్పుడు నాకెల్లా నచ్చింది? ఈ గేయం నాకిష్టం అన్నాను మొదట్లో. ఒక సామాజిక వ్యవస్థకి సాంకేతికంగా వున్న వొక అమాయకురాలైన కన్యని, కొన్ని ప్రశ్న లడగడం నాకు నచ్చింది. మూడు ప్రశ్నలున్నాయి, ఈ గేయంలో ఈమూడూ, మూడు విలువలకి సాంకేతికాలుగా స్వీకరిస్తాను. బుగ్గమీద గులాబి, సౌంద ర్యానికి సాంకేతికం; చలువరాయి, బలానికీ, శక్తికీ సాంకేతికం; చీరలో శిల్పం, కళకి సాంకేతికం చివరలో 'నీతి' కూడా నాకు నచ్చింది - ఒక్క బాగాలేనిది 'సొగదింక తెలుసుకో' - అన్న ఔదిరింపే

ఈ గేయం వొక సామాజిక వ్యవస్థని పరామర్శిస్తోంది, కాని, సాధార ణంగా, మనం కవితలో వెదికే, పరమార్థ చింతన, సాక్షాత్కారం, అతీంద్రియ జ్ఞానంతో ముడిపడ్డ మహదానందం, ఇందులో దొరకవు కవి ఆశించిన వ్యవస్థ సిద్ధించగానే గేయంలో 'పస' పోతుంది. విశ్వమానవుడిలో సదా నివాసం ఏర్పరుచుకున్న జిజ్ఞాస, తృష్ణ, ఆశ, 'మానవత్వం' మొదలైనవాటిని అంటి పెట్టుకున్న రసం అంతగా లేదు. ఇది లేనందున, ఇది మంచి కావ్యమే అయినా, మంచి సాహిత్యం అనలేను. కావ్యం, దానికున్న స్వరూపాన్ని బట్టి, అందులో కవిత వున్నా లేకపోయినా, కావ్యంగా, సాహిత్యంగా చలామణీ అవుతుంది. కథో, నవలో ఐతే; అందులో ఎంత కవిత, సాహిత్యం వున్నా, గద్య స్వరూపం బట్టి, సాహిత్యంగా చలామణీ అవదు.

పాఠకుడుగా నే పొందిన అనుభూతిని విడిచేసి, సినిమా పాటగా, దీని ప్రభావం ఎట్లాంటిదో చూద్దాం దీన్ని పాడేవారొకరుంటారు; నేపధ్యవాద్యాలెన్నో వుంటాయి. తెరపై కథలో, వొక సందర్భంలో ఎవరో పాడతారు ఎవరో నటిస్తారు హాల్లో వేలమంది జనం చూస్తారు. ఆ పాట నుండి ఉద్భవించేది సాముదాయకమైన రసం. పాటలో విషయం, భాగ్యవంతుణ్ని ఆక్షేపించడం; ఒళ్ళొంచి పని చెయ్యకుండా సుఖాలనుభవించేవారిని వొయ్యారంగా వెక్కి రించడం. హాల్లో జనంలో చాలామంది 'బీదలే' - అంటె కష్టపడి పనిచేసి పొట్ట పోసుకునేవారే. వారికి సినిమా వొక్కటే వినోదం, విశ్రాంతి. వారికి, భాగ్య వంతులపట్ల కాస్త కసి వుంటుంది; ఆ 'కసి' ఈ పాటద్వారా బైటపడుతుంది. వారి మనస్సులో రహస్యంగావున్న ఆవేదన, వ్యధ, ఇతరులతో పంచుకోవడంతో తగ్గుతుంది. అందుకని, ఈ పాట సినిమాహాల్లో బాగా రక్తికడుతుంది ప్రేక్షక జనంలో వారి తెలివితేటలు, సున్న నుండి, పంచవరకు ఉంటాయనుకుంటే — ఈ

పాట 30 పాళ్ళు తెలివిగల సమూహానికి రుచిస్తుంది, "నీ బదాయిచాలు" "సాగదింక తెలుసుకో." అన్న పదాలు, వారు లోలోన అనుకుంటున్నవే.

హాల్లో జనం, ఏ పదిమందో ఉండి సినిమాచూస్తే చిత్రం ఎంత మంచిదైనా రక్తికట్టదు. సమూహ ఉద్రేకానికి — అంతటి ప్రభావం ఉంది. ఒక గుంపులో కలిసిపోయినప్పుడు, వ్యక్తి ఎంత నిదానం కలవాడైనా ఎంతటి శాంతి కాముఅయినా, ఆ గుంపులో ఆ క్షణంలో రేగిన ఉద్రేకానికి లొంగిపోయి, వ్యక్తిత్వాన్ని గోల్పోయి, వారిలో ఐక్యం అయి, చేష్టలో, మాటలో వారినే అనుసరిస్తాడు, అట్లాంటి సమిష్టి ఉద్రేకాన్ని పురిగొల్పేదిగా ఉంది గనకనే, సినిమాపాటలో, ఎంతటి కవిత్వం వున్నా, అది 'చౌకబారు'గా వుందన్న సాముదాయక భావం ప్రజాస్వామ్యంలో ప్రచారమౌతూ వుంది. ఆ పాటకి పెట్టిన ట్యూన్, పాడడంలో నటుడి చేష్టలు, సినిమాలో సందర్భం — ఇవన్నీ పాట స్థాయిని దిగలాగే ప్రమాదం సాముదాయక కళా వ్యవస్థలో వుందనే వొప్పుకోవాలి. సినిమా - కళా, పరిశ్రమా? అన్న విషయం ఎందరో చర్చించారు ఒక వ్యక్తి సృష్టించినదాన్ని, వొక వ్యక్తి, విడిగా ఆస్వాదించి, ఆనందించినప్పుడు — అది కళ. ఒక వ్యక్తి సృష్టించినదానికి, ఎందరెందరో రూపకల్పనచేసి, ప్రదర్శనని, వేలాదిమంది, కలిసి ఆస్వాదించి, ఆనందించినప్పుడు — అది పరిశ్రమ కవి మొదటిదశలో కళాకారుడు, సినిమా నిర్వాహకులు నిర్దేశించినట్లు పాటవ్రాసి వూరుకుంటాడు. ఆ రచన చివరి దశలో 'పరిశ్రమ'గా అంతమొందవచ్చు. ఇదివరలో సినిమా లేదుగనక, మొదటిదశ కళనే మనం మెచ్చుకుంటున్నాం; ఇప్పుడే సినిమాని స్వీకరించి, రెండవదశకి అనువైన కొలతబద్దతో విలువలు కట్టడం, నేర్చుకోవాలి

కార్లో అమ్మాయిని రోడ్డుమీద చాలాసేపు నిలబెట్టాం. డ్రైవర్ పక్క వీధిలో టీ తాగి, సిగరెట్ కాల్చి, చక్కా వచ్చాడు. అమ్మాయికార్లో ఎక్కి, 'పోనీ' మంది డ్రైవర్తో. కవిని 'థ్యాంక్' చేసే వుంటుందా? అతను 'కవి' అని ఆమెకి తెలియకపోవచ్చు. ఏ ప్రెస్ రిపోర్టరో అనుకుందా? అసలు, ఆ కవి కూడా. కార్లో అమ్మాయిని ప్రశ్నలడిగాడనుకోగలమా? అదృశ్యం. వొక సినిమా షూటింగ్ తాలూకు ఘట్టమా? కార్లో అమ్మాయి, సినిమా నటి కాకూడదూ. ఆ అమ్మాయి నటిస్తున్న ఆ చిత్రానికే, మనకవి పాటలు వ్రాసి వుంటే, అసలు విషయం గ్రహించి, ఆ ప్రశ్నలడిగినందుకు పెదవి కొరుక్కుని బాధపడతాడా? ఏమో. ఆ కవి ఎవరు?

ఈ పాట నచ్చిన కొత్తలో, (1959 లో కాబోలు.) "చాలా బాగుందండి పాట" అన్నాను శ్రీశ్రీగారిని, ఆయనే వ్రాశాడనుకొని. వ్రాసింది ఆయనకాదుట. ఆచార్య ఆత్రేయట. కాని నేను పెదవి కొరుక్కోనక్కర్లేదు — మీరూ అంతే.

(ఈపాట అన్నపూర్ణావారి 'తోడికోడళ్ళు' చిత్రంలోనిది.)

# షేక్స్‌పియర్ కవితాజగతి

"విశ్వంలో తిరుగాడుతున్న భూగోళం గురించీ, మానవ జాతిని గురించీ చర్చించడం ఎట్లాంటిదో ఈనాడు షేక్స్‌పియర్‌ను గురించి చర్చించడం అట్లాంటిది." షేక్స్‌పియర్ 400 వ* జన్మదినోత్సవ సందర్భంగా బి బి సి లో ప్రసంగిస్తూ, విమర్శకుడు వి ఎస్ ప్రిచెట్ చెప్పిన మాటలు. ఒక్క పాశ్చాత్య దేశాలే కాకుండా ప్రపంచంలో అన్ని దేశాలూ ఈ జన్మదినోత్సవం జరుపు కుంటున్నాయి. ఇంతటి ఖ్యాతి మరే కవికి సమకూరలేదు. షేక్స్ పియర్‌ని గురించి వ్రాసినన్ని పుస్తకాలు మరే కవిని గురించి వ్రాయబడలేదు. ప్రతినెలా షేక్స్‌పియర్‌ని గురించి ఒక వ్యాసమో ఒక పుస్తకమో వెలువడుతూనే ఉంది. ప్రతిరోజూ ఎవరో ఒకరు ఆయన్ని గురించి వ్రాయడంలో నిమగ్నులై ఉన్నారనడం అతిశయోక్తికాదు. షేక్స్‌పియర్‌ని గురించి వ్రాయడం నాగరక ప్రపంచానికి ఒక తీరిక సమయపు వ్యాపకం అయిపోయిందన్నారెవరో.

ఎడతెగని ఈ సాహితీ కల్లోలానికి, ఇన్ని పుస్తకాలు వెలువడడానికి కారణం ఏమిటి? మానవుడి అంతరంగ వికాసానికి దోహదమిచ్చే దృక్పథం, ప్రక్రియలు, షేక్స్‌పియర్ నాటకాలలో ఇమిడి ఉండడం ఒక కారణం మన నిజస్వరూపాన్ని మనం చూచుకునేటందుకు తోడ్పడుతాయి ఆయన విషాదాంత నాటకాలు. బాహ్య ప్రపంచానికి తెలిపోకుండా, మనం ఏకాంతంగా, రహస్యంగా, సాగించే ఆలోచనలు, ఆశలు, ఊహలు, ఈ నాటకాలలో ప్రధాన పాత్రలు బహిర్గతం చేస్తాయి. మన ఆలోచనలు మన వాంఛలూ, మన నిజస్వరూపాలు వాటిద్వారా తెలుసుకుని ఆశ్చర్యపడతాం: భయపడతాం; అంతా ముగిసిం తర్వాత 'అమ్మయ్య' అని నిట్టూరుస్తాం 'మనమింక ఇట్లాంటి పోకిళ్ళు పోకూడదు' అని తీర్మానించుకుని, మానసిక వైరాగ్యాన్ని అలవరచుకుంటాం విశ్వంలో గోళాలు ఢీకొంటున్నాయి. సూర్యగోళం గతితప్పి అనంతంలోకి పోతోంది.

* షేక్స్‌పియర్ 400 వ జన్మదినోత్సవం 1964 లో ప్రపంచమంతటా జరిగింది ఆ సందర్భం పురస్కరించుకుని 'భారతి' లో ప్రచురించిన వ్యాసం ఇది

భూగోళం వెలుగులేక గడ్డకట్టి పోతోంది. మానవజాతి చరిత్ర రేపటితో సమాప్తమవుతుంది — కాన, మానవులు తమ వీలునామా సిద్ధపరచాలి అని అశరీరవాణి శాసిస్తే, 'షేక్స్పియర్ నాటకాలే మానవుడి వీలునామా' అనేటంత పలుకుబడి తెచ్చుకున్నాయి, ఈ నాటకాలు.

ఇట్లాంటి నాటకాలు వ్రాసినాయన ఎవరు? ఎట్లాంటివాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవడం కోసం ఇన్ని పుస్తకాలు వెలువడడానికి మరో కారణం. షేక్స్పియర్ గురించి నిక్కచ్చిగా పరిశోధించి తెలుసుకున్న విషయాలు ఎన్నో లేవు. ఆయన 1564 సంవత్సరం, ఏప్రిల్ 23 వ తేదిని స్ట్రాట్‌ఫర్డు గ్రామంలో జన్మించాడు, స్కూల్లో చదువుకున్నాడు. ఏన్‌హతావే అనే ఆమెను - తనకంటే వయస్సులో ఏడు సంవత్సరాలు ఆమె పెద్ద—1582 నవంబర్‌లో పెండ్లి చేసుకున్నాడు. 1583 లో వీరికి 'సుసన్న' అను కుమార్తె కలిగింది. రెండేళ్ళ తరువాత, జూడిత్, హామ్‌నెట్ — అను కవలలు జనించారు. లండన్ పట్నం వచ్చి నాటకం కంపెనీలో చిన్న చిన్న పనులు చేస్తూ, కొన్ని నాటకాలు వ్రాశాడు. కొంత డబ్బు సంపాదించాడు. స్వగ్రామం వెళ్ళి, వీలు వ్రాసి — అందులో ఆస్తిని పెద్ద కుమార్తెకి — తన రెండో మంచాన్ని, మరికొన్ని సామానులనీ భార్య పేరా వ్రాసి — 52వ యేట పరమపదించాడు. పండితులు తమ పరిశోధనా ఫలితాలను, నొక్కి వక్కాణించక, ఇదమిత్థమని నిర్వచించక' అస్పష్టమైన ధోరణిలో తమ గ్రంథాలలో పొందుపరచిన విధానాన్ని హేళన చేస్తూ స్టీఫెన్ లీకాక్ అనే హాస్య రచయిత ఇలా అన్నాడు. "షేక్స్పియర్ బహుశః ఫలానా సంవత్సరంలో, ఫలానా చోట జన్మించి ఉంటాడు. బహుశః చనిపోయి వుంటాడు." ఈ శతాబ్దంలో పరిశోధనల ఫలితంగా షేక్స్పియర్ జీవిత విశేషాలను మరి కొన్ని తెలుసుకోగలిగారు. నిజమే. అయినా 'అసలు ఈ నాటకాలు వ్రాసింది షేక్స్పియర్ కాదు. ఆయన పేరుతో ఫలానావారు వ్రాశారు' అన్న వాదాన్ని బలపరుస్తూ ఈనాటికీ ఎవరో ఒకరు వ్రాస్తూనే ఉన్నారు.

షేక్స్పియర్ ఎట్లాంటి మనిషి? ఆయన మనస్తత్వం ఎట్టిది? ఆయనకో తత్వం అంటూ వుందా? ఉంటే దాని స్వరూపం ఏమిటి? ప్రధానమైన జీవితపు సమస్యల పట్ల ఆయన అలవరచుకున్న దృక్పథం ఏది? ఈ ప్రశ్నలకు సమాధానాలుగా ఎన్నో పుస్తకాలు వెలువడ్డాయి. వీటిల్లో చాలా భాగం ఊహాగానాలే. కొందరు — కోల్ రిడ్జ్, మిడిల్‌టన్ మర్రీ, విండ్‌హామ్‌లెవీ లాంటి వారు - తమ మనస్తత్వాన్నీ, దృక్పథాన్నీ షేక్స్పియర్‌కి ఆపాదించి. షేక్స్పియర్‌ని తమరుగానే చిత్రించి చూపడం జరిగింది. ఇన్ని పుస్తకాలుండడంవల్లే, మనం

షేక్స్పియర్‌ని ఎరుగున్నంత బాగా మరే ఇతర వ్యక్తినీ ఎరగం అన్నాడు జె. బి. ప్రీస్ట్లీ.

షేక్స్పియర్ ఎట్లాంటివాడు? అన్న దానికి విమర్శకులు చెప్పే సమాధానం, 'షేక్స్పియర్ హామ్‌లెట్ లాంటి మనిషి' అని. కోల్‌రిడ్జ్, గెథేలు, హామ్‌లెట్ పాత్రని గూర్చి వ్రాసిన నాటి నుండి, ఇదొక సమస్యతో కూడుకున్న నాటకంగా పరిణమించింది. ఈ నాటకంపై వచ్చినన్ని విమర్శలు, పుస్తకాలు మరే నాటకంపైనా రాలేదు హామ్‌లెట్ నాటకంలో సమస్య ఏమిటి? అతని తల్లి, తన తండ్రిని చంపిన వ్యక్తితో వ్యభిచరించి, వివాహమాడుతుంది. అతని తండ్రి దయ్యం రూపంలో కనపడి, రాజ్యం కోసం తనేవిధంగా హత్య గావింపబడిందీ చెప్పి, వారిపై పగ సాధించమంటాడు

హామ్‌లెట్ సరే నంటాడు కాని ఆ పని చెయ్యలేదు. పగ సాధించలేదు, వారినీ వీరినీ, – అనవసరమైన వారిని–చంపుతూ, అసలు పనికి ఉపక్రమించక జాప్యం చేస్తాడు. తుదకు అందరూ చనిపోతారు. ఎందుకు జాప్యం చేస్తాడు? అన్నది సమస్య. ఈ సమస్య గూర్చే గ్రంథాలు, వ్యాసాలు వెలువడ్డాయి. హామ్‌లెట్ ఆదర్శజీవి; తత్వజ్ఞుడు; ఆలోచిస్తాడు. ఊహలో జీవిస్తాడు, సృష్టిని తిలకిస్తాడు, సమాధిలో పడతాడు. సత్ చిత్ ఆనందాన్ని ఆరాధిస్తూ, తన విధిని విసర్జిస్తాడు. కార్యశూరుడు కాదన్న మాట. స్థూల జగత్తు మాయ అనీ అనిత్యమనీ, సమాధానం చెప్పుకుని, తన పనిని కర్మకి విడిచేసి ప్రత్యేకమైన 'అహం'ని జీవాత్మలో కలిపివేసే యత్నంలో నిమగ్నుడవుతాడు. ఈ రకం స్వార్థరాహిత్యం పట్టించుకోకపోవడం – హిందూ తత్వానికి సన్నిహితమైన దృక్పథం. ఫలాపేక్ష కాకుండా, తన పని నిర్వర్తించక పోవడమే కాదు, - అసలు పని నిర్వర్తించడు హామ్‌లెట్. దీనికి కారణం ఏమిటి? ఈ కారణాలన్నీ పొందుపరచడానికి నే నిప్పుడు పూనుకోడంలేదు. జీవితపు సమస్యలపట్ల ఒక నిర్ణయానికి రాలేకపోవడం హామ్‌లెట్ లక్షణం. అదే షేక్స్పియర్ లక్షణం కూడా అని ఋజువు చేసేందుకు ఇన్ని గ్రంథాలు వెలువడుతున్నాయనుకుంటాను అసలు నిర్ణయానికి రాలేకపోవడం – షేక్స్పియర్ విషాదాంత నాటకం సారాంశం. నాయకుడు ఒక సందర్భంలో రెండింటిలో ఏదో ఒకదాన్ని ఎన్నుకుని ఆ పని చెయ్యాల్సి వస్తుంది. "ఇదేనా చెయ్యి, లేకపోతే అదేనా చెయ్యి, మరి మార్గం లేదు," అని స్థూల జగత్తు శాసిస్తుంది. ఆ పరిస్థితుల్లో అతను నిర్ణయానికి రాలేడు. ఏ నిర్ణయమూ సాధ్యం కాక పోవడమే, మానవుడి విధి నిర్వహణలో విషాదం. "తెలివి

హీనులు బల్లగుద్ది చెప్తారు. తెలివైనవారు నోరు మెదపరు. ఇదే ప్రపంచానికి అరిష్టం" అన్నది, తత్వజ్ఞుడైన బెర్ట్రండ్ రసెల్ నిర్వచనం. హామ్లెట్ నాటకం ఈ నిర్వచనాన్ని సోదాహరణంగా విశదీకరిస్తుంది. షేక్స్పియర్ ఎట్లాంటివాడు? అతని దృష్టిలో పంచేంద్రియాలలో, ఏ ఒక ఇంద్రియాన్ని విడి చెయ్యకుండా, అన్ని అవయవాలనీ సమంగా వాడుకుని, సుఖంగా వుండగలిగిన వ్యక్తి ధన్యుడు. ప్రతి-డు సంతోషంగా జీవించాలి ఆ సంతోషాన్ని యే విధంగా సాధించినా ఫరవాలేదు. మనిషి ఉద్రేకాన్ని తగుమాత్రంగా వాడుకోవాలి కాని, దానికి బానిస కాకూడదు. నిండు జీవితం, సమగ్రమైన ప్రవర్తన, ఆనందాన్ని వ్యక్తంచేసే శీలం - ఇవి వున్నవాడు షేక్స్పియర్‌కి ఇష్టమైన వ్యక్తి. షేక్స్పియర్ ఏ మతాన్ని ఏ తత్వాన్ని బోధించాడు? ఎన్నో రకాలుగా వ్రాస్తారు విమర్శకులు. కాని వాల్టర్ రాలే చెప్పిన సంగతే నాకు సబబుగా తోస్తుంది. "నిప్పు కాలుస్తుంది, వాన తడుపుతుంది — అనడంలో ఏ తత్వం వుందో, అంతకుమించిన మరో పెద్ద తత్వం షేక్స్పియర్ బోధించాడనుకోను." అన్నాడు రాలె.

షేక్స్పియర్ కళద్వారా బహిర్గతం చెయ్యలేని కొంత 'రహస్యం' చీకటి ఉదంతం వున్నాయి వాటిని హామ్లెట్ ద్వారా బైటపెట్టి ముక్తి సాధించే యత్నంలో నాటకకర్త విఫలుడయ్యాడు — అందుచేత కళదృష్ట్యా 'హామ్లెట్ నాటకం అసంతృప్తికరమైనది, అని టి. ఎస్. ఇలియట్ వాదం తల్లి వ్యభిచారం నాటకానికి వస్తువుకాదు. అది చెప్పివేస్తేగాని తన బాధ తీరదు. హామ్లెట్ ద్వారా చెప్పడానికి యత్నించాడు. కాని తనలో వున్న ప్రమాదకరమైన ఉద్రేకం, నాటకం వస్తువులో వున్న నమూనాను మించింది - కావున, ఆ వుద్రేకం పూర్తిగా వస్తువులో లీనమవలేదు —— అన్నది ఇలియట్ వాదం

మానవుడు ఒక వ్యవస్థలో ఇరుక్కుంటాడు. ఆ స్థితికి హామ్లెట్ ప్రాతి పదిక. అందులో షేక్స్పియర్ దర్శనమవుతుంది. ఇంతటి కల్లోలానికీ, ఇంత ఖ్యాతికి ఈ కారణాలు సరిపోతాయా? కళాకారుడుగా, షేక్స్పియర్ చేసిన అత్యాచారాలను, దారుణాలను ఎందరెందరో ఎత్తిచూపారు. షేక్స్పియర్ తత్వాన్నీ, నాటకాలలోని చెడుగునీ తీవ్రంగా ఖండించిన రచయిత టాల్స్టాయ్. క్రైస్తవమత సూత్రాలను ఆరాధించిన టాల్స్టాయి, షేక్స్పియర్‌లోని మానవతా వాదాన్ని తన దృష్టిని అవగాహన చేసుకోలేకపోవడం, ఆయన దురదృష్టమని, టాల్స్టాయ్ విమర్శనాన్ని ఖండిస్తూ ఎన్నో గ్రంథాలు వెలువడ్డాయి. షేక్స్పియర్ నాటకంలో హితబోధ లోపించిందని, తన వాటిల్లో అది వుందిగావున,

తనే షేక్స్‌పియర్‌కంటె ఘనుణ్ణి అనీ బెర్నార్డ్‌షా పదేపదే చెప్పుకున్నాడు. షేక్స్‌పియర్ నాటకాలలోని రస హీనమైన లక్షణాల జాబితా నొకటి తయారు చేశాడు లోగన్ పెర్సాల్‌స్మిత్ (Logan Pearsall Smith) అనే ఆయన. ఆ చిట్టాలో కొన్నింటిని వివరిస్తాను.

"గొప్ప రచయితలు మనని విసిగిస్తారు. మన జీవితం అంతా వారి రచనలే చదువుతూ కూర్చోవాలిట దర్బారు దుస్తులు ధరించి వారి సమక్షాన నిలబడాలిట. షేక్స్‌పియర్ ఒక జాతీయ సంస్థగా మననెత్తిన రుద్దడంచూస్తే, మనకీ అనుమానం తగుల్తుంది — 'పో, పో,' అన బుద్దేస్తుంది. వేదికపై నిలబెట్టిన ఈ శిలా ప్రతిమని కదిపి చూడాలనిపిస్తుంది. ఇదంతా పెద్ద దగా — మోసం లాగుందే అనుకుంటాం. తీరా షేక్స్‌పియర్ నాటకాలు చదవడం మొదలు పెడితే, ఏం కనిపిస్తుంది? విసుగు పుట్టించే ఛలోక్తులు, చెత్తకబుర్లు, అవే సన్ని వేశాలు, వికటకవనం, మాటలపై గారడీ, ఒళ్ళుబలసిన పదజాలం, హత్యలు, యుద్ధాలు, కొట్లాటలు, చివరికి ఒక అరడజను శవాలను బైటకు ఈడ్చి వెయ్యడం" — అంటాడు పెర్సాల్ స్మిత్ అంతా రోదన, ఏడుపు, ఖేదం, శోకం, ఇంతేనా? మనిషివట్ల అసహ్యం పుట్టించే ఈ స్వగతాలేనా ఉత్తమకావ్యం? మొదటి ప్రపంచ యుద్ధానంతరం, యూరప్‌లో షేక్స్‌పియర్ నాటకం 'రోమియో, జ్యూలియెట్ చదివి కొందరు యువతీ యువకులు, ప్రేమ పేరిట ఆత్మహత్య చేసుకున్నారుట. రోడ్డుమీద నడిచే కన్యల్ని అల్లరిపెట్టే యువకుల్ని రోడ్డు రోమియోలని వ్యవహరిస్తున్నాం షేక్స్‌పియర్ నాటకంలో కొన్ని భాగాలు చదవలేక, మొహం తిప్పేసుకునే వాడుట ప్రసిద్ధ విమర్శకుడు డాక్టర్ జాన్సన్. షేక్స్‌పియర్ పాత్ర చిత్రణలో లోపాలున్నాయి, వస్తువుని మలచడంలో దోషా లున్నాయి కొన్ని సందర్భాలలో కళాదృష్టి కుంటు పడుతుంది. కొన్ని ప్రదర్శన యోగ్యంకావు ఇల్లా వెదికితే ఎన్నెన్నో చెప్పుకుపోవచ్చు. మరెందుకు షేక్స్‌పియర్ అంటే ఇంత ఆరాధన, ఇన్ని స్తోత్రాలు?

ఇందుకు కారణం షేక్స్‌పియర్ కవిత ఆయన వాడిన భాష, అలవరచు కున్న శైలి, ప్రదర్శించే ఊహాబలం, ప్రతిభ. ఈ కవితా స్వరూపం ఎట్టిదో, ఈ శైలి లక్షణాలేవో, భావన వైశాల్యం ఎంతటిదో, పరామర్శించి చూపాలనే ఈ వ్యాస రచనకు పూనుకున్నాను.

ఆంగ్లభాషతో గాఢమైన పరిచయంలేక, షేక్స్‌పియర్ కవిత ఎట్లా ఉంటుందో తెలుసుకోవాలని కుతూహలపడే వారెందరో ఉన్నారు. వారిని ఉద్దేశించి వ్రాసిందే ఈ వ్యాసం. ఆంగ్లభాషతో పరిచయం ఉన్నవారిలో కూడా

చాలామంది షేక్స్‌పియర్ కవితలో అందచందాలని ఆస్వాదించలేకపోతున్నారు. ఇందుకు కారణం, షేక్స్‌పియర్ నాటకాలు, పాఠ్యగ్రంథాలు కావడమే. ఈ నాటకం రచన ఎప్పుడు జరిగింది? షేక్స్‌పియర్ వ్రాతప్రతికీ తరువాత అచ్చయిన ప్రతులకీ తేడాలేవి? నాటకంలో వస్తువుకి ఆధారాలేవి? సమకాలిక విశేషాలు ఎందుకు ఎల్లాగ వాడుకున్నాడు నాటకకర్త? రంగస్థల ప్రదర్శనలో చిక్కులేవి? ఒక పదానికి అనాడున్న అర్థం ఏమిటి? ఇప్పటి అర్థం ఏమిటి? విద్యార్థుల దృష్టి ఈ సమస్యపై మరలి, నాటకంలో కవితావిశిష్టతని గ్రహించే అవకాశాలు ఉండకపోవడం, మనదేశంలోనేకాక, ఇతర దేశాలలోకూడా జరుగుతున్నదే.

చాలా చోట్ల వచనం వున్నా, షేక్స్‌పియర్ నాటకాలు కావ్యాలుగా రచించబడ్డాయి.

ఆ రోజుల్లో, కర్టెన్లు తదితర రంగస్థల పరికరాలు లేనందున, ఎక్కడ, ఎప్పుడు, ఏం జరుగుతున్నదీ, పాత్రలే చెప్పుకుని, తగు వాతావరణాన్ని సృష్టించుకునే సంప్రదాయంవల్ల స్వగతాలు వెలువడ్డాయి. ఈ స్వగతాలు ప్రకృతి వర్ణనకోసమే కాకుండా, జీవితం గురించి కొన్ని నిర్వచనాలు చేసుకోడానికీ, అంతరంగ వైక్లబ్యాన్ని బైట పెట్టడానికీ ఎక్కువగా ఉపయోగపడతాయి. ఛలోక్తులు విసరడంలోనూ, జీవితంపై అద్భుతమైన నిర్వచనాలు చెయ్యడంలోను షేక్స్‌పియర్ అద్వితీయుడు. ఆయన వ్రాసిన నాటకాలన్నింటిలోనూ ఉన్న మంచి సూక్తులని ఏరి పుస్తకంగా వెలువరించారు. ఉపన్యాసాలలోనూ, వ్యాసాలలోనూ, వీటిని వాడుతూ ఉండడం పరిపాటైపోయింది. అసలు షేక్స్‌పియర్ నాటకాలు చదువడంలో ఉన్న ఆనందం, మనం తరచు వింటూ వున్న సూక్తులను పోల్చి పసిగట్టడంలోనే ఉంది - అని ఎవరో అన్నారు కూడా. ఇప్పుడు నేను, ఆ సూక్తుల జోలికిపోను.

వాటిని ఉదహరించడం మొదలిడితే, ఆగడం కష్టంట. ఈ నిర్వచనాలు జాబితాలు తయారుచేసి, ఏ నాటకంలోను ఏయే ఉపమానాలు, విశేషాలు, సమాసాలు, ప్రధానంగా తోస్తాయో విపులీకరించి, కారెలైన్ స్పర్జిన్ (Caraline Spurgeon) అనే ఆమె పెద్ద గ్రంథం వ్రాసింది.

గడియారం విప్పి అందులో భాగాలన్నీ విడగొట్టి చూపటమే చెయ్యదల్చుకున్నది, షేక్స్‌పియర్ శైలిలో ఉన్న ప్రత్యేకతను, పొడిమాటల్లో చటుక్కున అర్థమయ్యేలాగు చెప్పడం నా ఉద్దేశ్యం. సంస్కృత పదాలు, ఘాటైన సమాసాలు జనవ్యైన మాటలు వాడి, ఇంతకంటే, గంభీరంగా షేక్స్‌పియర్ భాషను

అనువదించవచ్చును. తెలుగులోకొచ్చిన కొన్ని షేక్స్‌పియర్ నాటకాలలో ఈ రకం భాష వాడి, అనువాదకులు కృతార్థులయ్యారు. ఒక వాక్యాన్ని విప్పి, మాటల పొందికపై పొడి మాటల్లో వ్యాఖ్యానించడంతో తృప్తిపడతాను.

షేక్స్‌పియర్‌ది చాలా కఠినమైన భాష. కృత్రిమమైందీ తికమకలతో కూడుకున్నదీ. ఇతర భాషలలోకి అనువదించడం సాధ్యంకానప్పుడే గొప్ప కవిత అన్నారుకూడా ఒక విమర్శకుడు. దానికితోడు మరో ఇబ్బందికూడా ఉంది. షేక్స్‌పియర్ వాడిన నాడు ఉన్న అర్థం, కొన్ని మాటలకు ఇప్పుడు లేదు. కాలంతో, అవి కొత్త అర్థాలు తెచ్చుకున్నాయి. షేక్స్‌పియర్‌ది వ్యక్తిగతమైన శైలి. కొన్ని మాటలకు తాను వేరే అర్థం కల్పించినట్లు తోస్తుంది. కొన్ని సందర్భాలలో, కొన్నిటిని సృష్టిస్తాడు, పదాలను పిండించి సాగేస్తాడు, కృత్రిమ కవి సమయాలను కల్పిస్తాడు. కవిత ప్రబలి శైలి ప్రజ్వరిల్లిన కొన్ని భాగాలను పదిమంది అనువదించడానికి పూనుకుంటే, పదిమందీ పది రకాలుగా అనువదిస్తారనడంలో సందేహంలేదు శైలి లక్షణాలను ఉదహరించడమే నా ఉద్దేశంగావున, మూలంలో ఉన్న ఆంగ్ల పదాలను వాడకూడదనుకున్నా; అయినా, షేక్స్‌పియర్ శైలి ప్రత్యేకతని అనువాదంలో తీసుకురావడం ఎంత కష్టమో చూపడంకోసం, ఒక్క వాక్యాన్ని మాత్రం ఉదహరిస్తాను. షేక్స్‌పియర్ శైలిలో విశిష్టతను పూర్తిగాచూస్తే ఒక్క వాక్యం ఉదహరించగలవా అని అడిగితే – ఈ వాక్యం ఉదహరిస్తాను.

**In the dark backward and abysm of Time**

కవి వ్యక్తిత్వమంతా ఉంది ఈ వాక్యంలో. తెలుగులో దీని అర్థం ఏమిటి? స్థూలంగా 'కాలగర్భంలో' అనొచ్చు. అసలు కాలగర్భంలో అన్నది ఎంతో మంచి సమాసం. అద్భుతమైనది. కాని మనం తరుచు వాడటంలో ఇది పాత చింతకాయ పచ్చడై పోయింది. కాబట్టి 'కాలగర్భంలో' అని అనువదిస్తే అర్థం సరైంది అయినా, కవి వ్యక్తిత్వం, శైలీ, ప్రత్యేకతా అందులో లేవు ఆ వాక్యంలో మాటలకు విడివిడి అర్థాలు చూద్దాం. 'డార్క్' అంటె చీకటి, నలుపు. 'బేక్‌వర్డ్' అంటే – వెనక్కు తిరిగిన. వెనకవైపు. 'ఎబిసిమ్'– అనేది వెనకటి కవులు వాడిన పదం. ఇప్పుడు 'ఎబిస్'గా మారింది. 'ఎబిస్' అన్న దానికి రెండు మూడు అర్థాలున్నాయి అంతులేని అఘాతం, భూనభోంతరాళం, ఆది ప్రళయం, అడుగుభాగం లేనిది – ఇవన్నీ కలిపితే చీకటి, వెనక్కి తిరిగింది అంతులేని అఘాతం. . అదీ కాలాన్ని గూర్చిన షేక్స్‌పియర్ భావన. బరువైన పదాలు వాడి ఇల్లా అనువదించవచ్చు;

అంధకార తిరోగమనైక
కాలగర్భ భీకరాఘాతమ్ము!

కాని ఇది ఎంత మందికి అర్ధమవుతుందో నాకు తెలియదు. అంతేకాదు, షేక్స్పియర్ మూలంలో 'గర్భం' అన్న ధ్వని లేదు అది తీసివేస్తే తెనుగులో అర్థం రాదు.

అనుభవాలను, వ్యక్తులనూ కొత్త దృక్పథంతో చూస్తాడు షేక్స్పియర్ అని వర్ణించడంలో చమత్కారమైన భాష వాడతాడు కృత్రిమ ప్రయోగాలు చేస్తాడు. మనల్ని నిలిపి లేవదీసి, కూర్చొబెట్టి, మరోసారి ఆలోచించి ఊహించే టట్లుంటాయి కొన్ని ప్రయోగాలు. ఒక్క వాక్యంలో, ఒక్క సమాసంలో ఇమిడిన కవితా రీతుల్ని కొన్నిటిని ఉదహరిస్తాను.

నాయకుడు ఏవో కొత్త విషయాలు ప్రేయసితో చెప్తుంటే ఆమె ఆశ్చర్య పడిన సందర్భంలో :

"రక్తం ఆమె బుగ్గల పైకొచ్చి తొంగి చూచింది. వెన్న మీగడల రాణి ఆమె."

మరొక నాయికను గూర్చి—

"ఆమె శరీరంలోని అతుకులూ, ఆవేశాలూ " స్త్రీ చూపే ఆవేశంలో ప్రత్యేకత ఆ 'అతుకులు' అన్న దాంట్లో ఉంది.

"ఆకుపచ్చ కళ్ళ రాకాసి— అసూయ "

ఆ రంగుకీ అసూయకీ ఉన్న స్నేహం ఎట్లాంటిదో మన మెరుగుదుం.

రాత్రిని వర్ణిస్తూ—

"నిశీధి చాచిన ఇనప నాలుక" ఆ రాత్రుళ్ళు మన మెరుగుదుం. ఈ ఉపమానంతో ఆ చీకటిని ఎదుర్కొగలం.

"సమానమైన చేతులుగల న్యాయం." న్యాయం ముందర అందరూ సమానులే అని - చేతులు ఒకటి పొడుగూ, ఒకటి కాస్త పొట్టి ఉండకూడదు.

మనిషి మెదడు ఎట్లాంటిది?

"అతుకులు, సాగెయ్యడాలూ, త్వరితంగా జరిగే కర్మాగారం". ఆ 'త్వరితం'గా అన్నది గమనించాలి

ఒక చోట 'శాంతిచేసే బలహీనమైన గానం' అంటాడు షేక్స్పియర్. 'శాంతి'లో కాస్తంత చప్పదనం ఉంది. బలహీనమైంది కాని అందరూ కోర దగింది— కాబట్టి గానం.

"తడిసిన కళ్ళతో ధర్మం మూతి బిగించి చేసిన రొద" తడిసిన కళ్ళు, బిగిసిన మూతి— రెండు విశేషణాలు వాడడం, ఆయన శైలిలో ప్రత్యేకత.

"నిశీధి నడుమ మృతి వైశాల్యం." ఆ 'వైశాల్యం' నడుమ ఉండాలంటే ఆ నిశీధి ఎంతటిదో!

ఇక్కడ 'మృతి' అన్నది షేక్స్‌పియర్ కంఠం

"అతని దోషాలు, మృదువుగా అతని మీద పడ్డాయి." మృదువుగా అంటే! అల్పమైన దోషాలనా? అవి ఎంతటివైనా అతడు భరించగలడనా? ఆ దోషాలు అతనిలో లేవు– ఎవరో మీద పడేశారనా? పడేసినవారు, పేడ కలిపి చల్లినట్లుగాక, మృదువుగా ఎందుకు పడేశారు?

"పాపం మంచివాడు ఈ నిందలు మృదువుగా పైనపడేద్దాం" అనుకున్నారా? ఆ పడేసిన వాళ్ళు?

యుద్ధం ముగిసిం తరవాత, ఎట్లా వున్నదీ, వర్ణన.

'రక్తపాతమైన యుద్ధం దిగవిడచిన పీలునామా'

"దగ్ధమైన పగటి వెలుగు" ఈ ఎండ మండిపోవడం మనమూ ఎరుగుదుం.

'కోపగించిన కోతివలె చిమిడిన అతని అంతరంగం' – నా కర్థం కాదు, కోపగించిన కోతికి చిమడ్డానికి ఉన్న సంబంధం ఏమిటో నాకు తెలీదు. వింత ఉపమానం.

"ధనంతో వంకర తిరిగిన జాతిప్రియులు". ధనం ఉన్నవారు త్రాగి తందన్నాలు తొక్కి కూడా దేశానికి ప్రియులు కాబోలు!

"ప్రశాంతతను పీల్చే నేత్రం" ఆ కన్నెత్తితే చాలు కనకాభిషేకాలు.

ఒక్క విశేషంతో తారక మినుక్కుమంటుంది – తేమగా ఉన్న తారక" తడిసినట్లు, తేమగా కనబడే నక్షత్రాన్ని శీతాకాలంలో చూస్తాం. దీనితో సమమైంది వాల్మీకి చందమామ – 'శ్వాసతో మసకైన అద్దంలాటి చందమామ'.

అధికారం కోసం అత్యాచారాలు చేసి పతనం చెందిన వ్యక్తులను, సన్నివేశాలను వర్ణించేటప్పుడు, షేక్స్‌పియర్ శైలిలోని ఉదాత్తత, శిఖరాన్నందుకుంటుంది. ఆ ధోరణిని 'కసిత్వం' అనొచ్చు.

"కళ్ల తెరుచుకున్న గూడుపురాణి" .. ట, కూలదోయడానికి కుట్రలు సల్పేవారు.

"వెళ్ళిన రోజుల్లో వెలిగిన వెర్రివారున్నారు."

"పంగల కర్రలా రెండుగా పీడిన మనిషి" అన్నది చాల చిత్రమైన వర్ణన– ఆధునిక చిత్రకళలో, ముఖ్యంగా పికాసో, పాల్‌క్లీ చిత్రాలలో ఇట్లాంటి మనిషి స్వరూపం చూస్తాం.

"పిచ్చుక క్రింద పడటంలో ఒక ప్రత్యేక కర్మ వుంది." విద్యుత్ తీగపై నుండి పడ్డ పిచ్చుకను చూసినప్పుడు నాకీ వాక్యం బాగా అర్థమైంది

"చమట్ల వేగిరపాటువల్ల రాత్రి, పగటికి తోటి పనివాడవుతుంది." చలి దేశాల్లో వారికి చమట వేగిరపాటు అంత సులువుగా బోధపడదు.

"సంధ్య దిగవిడచిన కిరణం వలె పతనమౌతాను."

చెట్ల ఆకుల మధ్య, కొండ శిఖరం వెనక, కిరణం జారి పోవడం చూసిన వాళ్ళు, వెలుగు దిగజారడంలో ఉన్న దైన్యాన్ని బాగా గ్రహిస్తారు

స్త్రీకోసం సామ్రాజ్యాన్ని వదులుకున్నవారి ప్రగల్భం— "సామ్రాజ్యాలని ముద్దుతో తుడిచివేశాము".

"జమకొచ్చిన ప్రేమలో యాచన ఉంది".

—లెక్క, జమలో జమ — ఇందులో జమ.

రక్తనాళాలు పచ్చగా ఉంటాయి - కాని కోపం వచ్చిన వారిని ఇల్లా వర్ణిస్తాడు షేక్స్పియర్.

'రక్తనాళాలలోంచి ఎర్ర ప్రవాహాలు. ..'

'జీవితం ఒక నడిచేనీడ,' ఊహిస్తే భయమేసే ఈ ఉపమానంలో షేక్స్పియర్ని దర్శిద్దాం.

ఇప్పుడు కొంచెం దీర్ఘమైన భాగాలని పరిశీలిద్దాం. షేక్స్పియర్ నాటకాలలో వారి దేశ చరిత్రకు సంబంధించిన గాథలే కాకుండా, ప్రాచీన గ్రీసు రోమ్ దేశాల పౌరాణిక గాథలకు సంబంధించిన విశేషాలు, వ్యక్తులు ఉదాహరణలుగా దొర్లుతాయి ఆ గాథలతో పరిచయం లేనివారికి వ్యాఖ్యానం లేనిదే ఆ భాగాలు అర్థం కావు అట్లాంటివి విడిచేస్తాను. అందరికీ అందుబాటులో ఉన్న కొన్ని అనుభూతులను షేక్స్పియర్ ఏ విధంగా కవిత్వం ద్వారా ప్రేక్షకులతో పంచుకున్నాడో చూపే నిమిత్తమైన ఆ అనుభూతులను శీర్షికల క్రింద విడమరచి స్వేచ్ఛానువాదం సాగిస్తాను.

## సౌందర్యం - ప్రేమ :

ఆమె కాగడాలకి' జోరుగా కాలడం నేర్పుతుంది.

'రాత్రి చెంపపై వ్రేళ్ళాడుతుంది' ప్రతి రచయితకీ, ధ్వనినిబట్టి, అర్థం బట్టీ, తాను కల్పించిన ఊహబట్టీ, కొన్ని అభిమాన పదాలుంటాయి వ్రేళ్ళాడడం, 'కదపడం', 'పూపడం', 'మెరుగైన', 'ముంచడం', 'తాకిడి', 'తొంగి చూట్టం' మొదలైనవి షేక్స్పియర్కి ఇష్టమైన మాటలు. 'ఆర్' అన్న అక్షరం గల పదాలంటే ఆయనకి ఎంతో ప్రీతి.

'అశుభమైన తారకల కాడిని కదిపేసి ఇక్కడ శాశ్వతమైన విశ్రాంతి తీసుకుంటా'నంటాడు ఒక పాత్ర ఒకామె సౌందర్యం ఇలా వర్ణిస్తాడు.

"ఆమె శ్వాస గదినంతా పరిమళం చేస్తుంది శెమ్మాలో దీపం వెలుగు ఆమె మీదికి ఒరిగి, కనురెప్పల వెనక దాగిన కాంతులను తొంగిచూస్తుంది"— గొప్ప వర్ణన.

మరొకచోట –

"ఉప్పు ప్రవాహంతో తడిసిన సముద్రపుటొడ్డున శాశ్వత భవనాన్ని నిర్మించుకున్నాడు."

'రోజుకొకసారి భీకరంగా పొంగే కెరటాలను తన నురుగుతో కప్పి వేస్తూ'.

'రోజుకొకసారి' ఎందుకో నా కర్థం కాలేదు. ఉపమానాన్ని పిండించి అస్పష్టమైన అందాన్ని సమకూరుస్తాడు షేక్స్పియర్.

"గాలిలోంచి చూస్తుంటే స్వర్గంలో ఆమె కళ్లు మెరుస్తాయి. పగలనుకుని పక్షులు పాడతాయి. ఆమె "దుఃఖానికి మాటలు నేర్పుతుంది. బాధతో కొట్టుకునే గుండె గుసగుస చెప్తూ పగలమని శాసిస్తుంది." దైన్యం ఆ గుస గుసలో వుంది.

'నీ తల్లిపాలిటి అద్దానివి నువ్వు'.

'ఆమె యవ్వనపు సొగసు నీలో చూసుకుని మురిసిపోతుంది.'

## అమాయకురాలి వర్ణన :

"ఆమెకి ధైర్యం లేదు. నెమ్మదైంది. తన కదలికకి తనే సిగ్గుపడుతుంది."

వాల్మీకి వర్ణించిన 'సిగ్గుపడిన కన్యలు' మరీ బాగుంటారు.

"వస్త్రములవలె నదిలో నీరు ఒడ్డున చేరుతోంది; సిగ్గుపడిన కన్యల తొడలవలె ఇసుక ఒడ్డు మెరుస్తోంది" అని వాల్మీకి.

"శూన్యం ఏర్పడుతుందన్న భయం లేకపోతే ఆమెని చూడ్డానికి గాలి కూడా వెళ్ళును, ప్రకృతిలో ఖాళీ ఏర్పరుస్తూ."

'సిగ్గు బిడియాలు గల కన్య కూడా, తన పేరు సౌందర్యాన్ని చంద మామ ముందు బైట పెట్టినప్పుడు తన దుబారాతనాన్ని బాగా చూపెడుతుంది'

ప్రేమని పైకి చెప్పుకోలేని స్త్రీని ఇలా వర్ణిస్తాడు.

"పుష్పంలో పురుగులా, దాపరికం ఆమె ఎర్రటి చెక్కిలిని తింటూ వుంది— ఆకుపచ్చ, పసుపురంగు దైన్యంతో. శిలా ఫలకంపై 'సహనం' అనే ప్రతిమవలె దుఃఖాన్ని చూసి నవ్వుతూ కూర్చుంది."

పుష్పంలోని మృదుత్వం, శిలా ప్రతిమలోని నునుపు, – వీటి కలయికతో దైన్యం రంగుల్ని కూడా తెచ్చుకున్నట్లుంది; లోపలున్నప్పుడు ఆకుపచ్చ,

(కంఠంలో నాళాలు) నవ్వు రూపంలో బైటకొచ్చినప్పుడు పసుపు. ఇదొక అపూర్వమైన భావన

## ప్రకృతి :

ప్రకృతి వర్ణనలో కవి పరిశీలనా శక్తి వ్యక్తమవుతుంది. ఈ పరిశీలన రెండు విధాలుగా ఉంటుంది. ఎదురుగా వున్నదాన్ని, వున్నది ఉన్నట్లుగా వర్ణించడం 'ఆ చెట్టుకి ఇరవైనాలుగు కొమ్మలున్నై.' ఇట్లాంటి వాక్యాన్ని గమనించం 'ఇరవై నాలుగు అంకెలా కొమ్మలు పెనవేసుకున్నాయి'. అనగానే మనకొక బొమ్మ చిత్రితమౌతుంది. ఇట్లాంటి వర్ణనలో వాల్మీకి అద్వితీయుడు. ఇది చూడండి. 'గాలికి చెట్లు కదులుతున్నా, వాటి వెనకవున్న కొండలు నృత్యం చేస్తున్నట్లుగా ఉంది'. షేక్స్పియర్ నాటకాలలో ఇట్లాంటివెన్నో ఉన్నాయి. అందమైన ఉపమానమని తోస్తే, దాన్ని ప్రేమిస్తాడు. సందర్భాన్ని మరచి దాన్ని వెంటాడుతాడు. నిద్రిస్తున్న పసి కందులను హత్య చెయ్యడానికి వచ్చిన ఒక దుండగీడుచేత 'ఆ పిల్లలు, రెమ్మమీద ఉన్న రెండు గులాబీలు'లా ఉన్నారని పిస్తాడు. గాయపడిన ప్రియుణ్ని చూసి ప్రేయసి భయంతో ఎలా వెనక్కి తగ్గుతుంది "మెత్తని మెదడు గాయపడ - నత్తగుల్ల బాధతోతన గుహలోకి వెనక్కి తగ్గి ఆ నీడలో మొత్తంగా ముడుచుకుపోయి చాలా సేపటి వరకూ, బైటికి రావడానికి జంకినట్లు ...." ఇందులో చివరి వాక్యం — అందే చాలా సేపటివరకూ బైటకి రాదన్నది అనవసరం.

"రాత్రి వెలిగించిన కొవ్వు ఒత్తులు ఆరిపోయాయి మసక కొండ శిఖరం మీద ప్రభాతం కాలిబొటన వ్రేళ్ళమీద నిలబడింది మహదానందంతో."

మరో రకం వర్ణనలో, వెనక తాను చూసిన వాటిల్లో అందమైన వాటిని జ్ఞప్తికి తెచ్చుకుని, వాటిని తన ఎదురుగా ఉన్న వస్తువుతో జతపరచి, కొత్త అందాన్ని వెదకడం జరుగుతుంది. ప్రస్తుతంలో గతాన్ని స్మరించగలగడమే ప్రతిభ అన్నారెవరో.

పైనుంచి చూస్తుంటే భూమి ఎలా వుందో వాల్మీకి ఇలా వర్ణిస్తాడు.

"మహా నగరాలలో భూమి రథచక్రంలా ఉంది. కొండలు ఒడ్డున గులకరాళ్ళలాగున్నాయి. నదులు దారంలాగా ఉన్నాయి పెద్ద పర్వతాలు, చెరువులో నీళ్లు త్రాగుతున్న ఏనుగుల వలె ఉన్నాయి."

"కన్యలాంటి ముల్లుమీద వాడిన గులాబి" అన్న షేక్స్పియర్ వర్ణన ఈ రకందే. కన్యలో కారిన్యం ఆయనెరుగును— అది ముల్లులాంటిది. ఇల్లాంటిదే మరొకటి.

"మృత్యువు కొట్టిన దెబ్బ. ప్రియుడు బుగ్గ గిల్లడం లాంటిది. నెప్పిగా ఉన్నా, కావాలంటాం."

మరొకటి—

"ప్రభాతం దగ్గరపడుతోందని చెబుతుంది, మెరుగు - పురుగు దాని నిరుపయోగమైన వెలుగు సన్నగిల్లుతుంది." ఇందు నిరుపయోగమైన వెలుగు అన్నది అవసరం. రెండు విశేషణాలుంటేకాని తృప్తిపడడు షేక్స్పియర్, ఒకటి కాకపోతే ఒకటైనా నిలబడకపోతుందా— అనుకున్నట్లు అతని దృష్టి అట్లాంటిది. ఆ దృష్టినుండి జనించిన శైలి పోకడ కూడా అట్లాంటిదే ఉపమా నాన్ని కామించడం విరమించి, ఉద్వేగంలో కూడా ఏకాగ్రత సాధించినప్పుడు, ఆయన వర్ణనలు చాలా శక్తివంతంగా ఉంటాయి

"ఆనందంతో వారు తమ టోపీలను పైకి ఎగరవేశారు - చందమామ కొమ్ములమీద వ్రేళ్ళాడవేసినట్లు" ఇది అద్భుతమైన ఉత్ప్రేక్ష. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్న నానుడిని పరామర్శిస్తూ, 'అతి' అంటే ఏమిటో ఇల్లా ఉదహ రిస్తాడు.

"పొదిగిన బంగారానికి మెరుగెట్టడం, మల్లెపూవుకి తెల్లరంగు పూయడం, పరిమళించే పుష్పంపై అత్తరు చల్లడం, మంచుని చదును చెయ్యడం, ఇంద్ర ధనుస్సుకి మరో రంగు అమర్చడం; ఆకాశం యొక్క అందమైన కంటికి కొవ్వొత్తి వెలుగు చూపడం."

## జీవితం - మానవ ప్రకృతి :

ప్రపంచంలో ఉత్తమ నాటక కర్తగా ఖ్యాతి గడించుకున్నాడు షేక్స్ పియర్. మానవ ప్రకృతిని బాగా పరిశీలించి తరచి చూచాడు, పైకి ఎలా కనబడినా వారిలో ప్రాకృతిక శక్తుల విజృంభణ, కామము, రహస్యమైన వాంఛలు వుంటాయనీ, వాటికి లొంగిపోయినప్పుడు మానవుడు పతనమౌతాడనీ గ్రహించాడు. విషాదాంత నాటకాలు వ్రాసిన కాలంలో మానవుడిపట్ల అతనికి రోత పుట్టిందనడానికి నాటకాలలో ఎన్నో నిదర్శనాలున్నాయి. ఉద్రేకానికి లొంగిపోయి, అధికారం కోసం ఘోర అపచారాలు చేసిన వ్యక్తులని ప్రత్యేక మైన కసితో వర్ణిస్తాడు. "మనుషులు మనుషుల్ని ఎలా నమ్ముతారో నా కర్థం కాదు" అంటాడు ఒక షేక్స్పియర్ నాయకుడు. పాపాలు చేసినవారి మొహాలు 'కరుడుగట్టిన బురదనీటి గుంటపై పరచిన పరదాలవలె' వుంటాయంటాడు. పాపాత్ములు వారొక్కరే నాశనం కాక, తోటివారైన మంచి వారిని కూడా నాశనం చేస్తారు. జీవితంపైనా, మనుషులపైనా రోతపుట్టించే భావాలు, నిర్వచ

నాలు ఎన్నోవున్నా, మానవత్వంపట్ల అతని విశ్వాసం సడలించలేము. ఘోరాలు చేసినవారిని చూసి విస్తుపోతాం. ముక్కుమీద వేలేసుకుంటాం కాని అట్టివారిని ద్వేషించడు, వారిని చూసి జాలిపడతాడు. జాలిపడేటట్లు చేస్తాడు కొన్ని ఇక్కట్లు, పోటీలు, పెనుగులాటలు బలవంతుల - బలహీనుల మధ్య రేగే వైరం -- ఇవన్నీ మానవ సమాజాల కూర్పులో కేంద్ర స్థానాలు. మనమూ అందులోనివారమే గనక, మరెవ్వరికీ వారిపై తీర్పు చెప్పే అధికారం లేదంటాడు, షేక్స్‌పియర్. మంచి చెడ్డలను సమంగాచూసి, చెడుగుని చూసి జాలిపడటం -- అదే షేక్స్‌పియర్ జీవిత దృక్పథంలోని ప్రత్యేకత. "దుష్టుడికి బంగారు తొడుగు తొడగండి -- ధర్మశాస్త్రం ఇచ్చిన గునపంతో ఆ తొడుగుని పొడిస్తే గునపం ముక్కలవుతుంది -- ఆ దుష్టుడికే చినిగిన బట్టలు కట్టండి—— ఒక పొట్టివాడు గడ్డిపోచతో ఆ దుస్తుల్ని ఛేదిస్తాడు." ఈ జీవితం అంతా మాయ - కాలం కదిలిపోతుంది ఏదీ శాశ్వతంగాదు. దీనికోసం ఎందుకీ పెనుగులాట? "పిల్లలు ఆటకోసం పురుగులను హింసించి చంపినట్లు భగవంతుడు తన ఆటకోసం, మనల్ని చంపుతాడు" అంటాడు. అంతమాత్రంచేత, అన్నీ వదులుకుని తన విధిని నిర్వర్తించకుండా, కార్యరంగంనుండి పారిపోయిన వ్యక్తిని షేక్స్‌పియర్ క్షమించడు విధి నిర్వర్తించు, ఫలం పొందలేకపోతే గుండె బాదుకోవద్దు. మానవ ప్రకృతి చిత్రణలో శైలి ఎట్లా ప్రజ్వరిల్లిందీ చూపాలంటే, ఆ సందర్భం ఏమిటో చెప్పాల్సి ఉంటుంది. ఈ వ్యాసానికి సందర్భంతోనూ, పాత్రలతోనూ, నాటకీయతతోనూ నిమిత్తంలేదు. గావున, అట్టి వాటిని విడిచేసి, కేవలం భావాన్ని ప్రదర్శించి కొన్ని భాగాలను మాత్రం ఉదహరిస్తాను.

"ఈనాటి పోకిళ్ళకి నువ్వు తగవు నాయనా!
ప్రొమోషన్ కోసం తప్ప ఎవ్వరూ చమటోడ్చరు."

"నీ భావాలు అనబడే పల్చటి దురదని రుద్ది రుద్ది ఎందుకు పుండు చేసుకుంటావు?"

'పల్చటి దురద' గమనించ తగ్గది.

"నేను స్త్రీనని మరిచావా? అనుకున్న వెంటనే మాట్లాడి తీరాలి."

"కంచు, రాయి, భూమి, అనంత సముద్రం, వీటిశక్తి పరిమిత ప్రాణిని ముంచివేస్తుంది. ఈ భీభత్సంతో, పువ్వుకున్న బలంతో సౌందర్యం ఏ సంప్రదింపులు చెయ్యగలదు?"

క్షుద్ర జగత్తు తాకిడికి సౌందర్యం తట్టుకోలేదని దీని తాత్పర్యం. 'సంప్రదింపులు' అన్నదాంట్లో ఉంది కవి ప్రతిభ.

'ఈ కొవ్వొత్తి వెలుగు, నీడని ఎంతదూరం ప్రసరిస్తుందో - మంచిపని ఈ కపట ప్రపంచంలో అంతగా ప్రసరిస్తుంది.'

'ఈ జీవితం, ఒక ఉంర చెప్పిన కథనం - ధ్వని, కసి తప్ప వేరే అర్థంలేదు.'

కూతుళ్ళు, అల్లుళ్ళు ఆదుకోక విడిచేసినప్పుడు వృద్ధుడైన తండ్రి వాపోతాడు.

'నిప్పు చక్రానికి కట్టేశారు నన్ను,
కరిగిన సీసంలా నా కన్నీటి బిందువులే
నన్ను కాలుస్తున్నాయి.'
'బలహీనుల్ని లేవదీయడం ఒక్కటే చాలదు, నుంచోబెట్టగలగాలి.'

ప్రాణాలు విడిచే ముందు, హామ్లెట్ స్నేహితుడుతో తనని గూర్చిన యదార్థాన్ని ప్రపంచానికి చాటవల్సిందిగా కోరుతూ అన్న మాటలు——

"నన్ను నీ మనస్సులో ఎప్పుడైనా తల్చుకుంటే,
ఒక్కక్షణం వినోదాన్ని మరిచిపో,
నాలాగే నువ్వు కూడా బాధపడు" - అంటే, నా కథ చెప్పేటప్పుడైనా, నాలోని దిగులు స్మరించుకో – అని.

ఒక చక్రవర్తి సాధించిం దేమిటి?
'గాలి చొరనీయకుండా ఒక రంధ్రాన్ని
పూడ్చేటందుకే ఆ చక్రవర్తి మన్నయ్యాడు.'
'అతడు మరణించాడు - తల దగ్గర పచ్చ గడ్డి కుప్ప,
కాళ్ళ దగ్గర ఒక రాతిబండ.'
'గంట గంటకి పండిపోతుంటాము,
మళ్ళా గంట గంటకి కుళ్ళిపోతూంటాము
ఆ నడుమ వ్రేళ్ళాడుతూంది మన కథ."
వ్రేళ్ళాడ్డం యిక్కడ కూడా ప్రత్యక్షమైంది.

'అదృష్టదేవత దానిష్టమొచ్చినట్లుగా మ్రోగించుకునే వాద్యం కానివారు, రక్తము, విచక్షణ సమంగా కలిసినవారూ, ధన్యులు.'

'కామానికి బానిసకాని వాణ్ణివ్వు –
నా హృదయాంతరాళాల్లో ధరిస్తాను.'
'ధరించడం' షేక్స్పియర్ వింత ప్రయోగం,

'మంచంతటి పవిత్రత నీలో వున్నా నింద తప్పదు ' వేడి ఉత్సాహం, వేగిరపాటులేని శీలం – మంచు లాంటిది, పవిత్రమైనదే కాని ఆకర్షించదు.

'నడి వయస్సులో రక్తంలో తృష్ణ మచ్చికైంది,
విచక్షణ తీర్పులకి లొంగిపోతుందిలే!'

"నా దోషాలు స్వర్గంలో కూడా వాసచేస్తున్నాయి."

'వారు, కాలం కూర్చిన సంక్షిప్త సారాంశం.'

సైన్యాధిపతి తన అనుచరులను సంతోషపెట్టే నిమిత్తం, వినోదాలు కల్పిస్తూ అంటాడు.

'ఈ రాత్రి వారి గాయాల నుండి, మధువు తొంగి చూడాల్సిందే" అని.

మరి రెండు సుదీర్ఘమైన భావాలను వుదహరిస్తాను

ఆ ప్రధాన పాత్ర సద్గుణుడు. అట్లాంటి వ్యక్తిని హత్య చెయ్యడం న్యాయం కాదు. ఎంత మంచివాడు?

'అతను సద్గుణుడు, నమ్రత గలవాడు. తన పని చెయ్యడంలో, తిన్నగా వ్యవహరిస్తాడు. దేవకన్యలు, అతని మంచి గుణాలను తమ నాలుకలకు బాకాలు కట్టుకుని ప్రచారం చేస్తారు, జాలి అనేది – అప్పుడే నగ్నంగా పుట్టిన పసివానికి మల్లే, గాలిలో స్వారీ చేస్తూ కనబడిన రాజాశ్రితులకంటె ముందు, ఇతడు చేసిన అన్యాయకృత్యాన్ని ప్రదర్శిస్తుంది '

జాలిని పసివానితో పోల్చిన విధం గొప్పగా వుంది. ఆ పసివాడు గాలిలో ఎందుకు స్వారీ చెయ్యాలి? మత గ్రంథాలలో దేవబాలురు ఆకాశంలో తిరుగాడుతున్న దృశ్యం జ్ఞప్తికొచ్చి ఉండాలి. పసివాడు – నగ్నంగా వున్న పసివాడుట- తికమకలతో కూడిన ఇదొక అద్భుతమైన వర్ణన

హామ్‌లెట్ స్వగతంలో భాగాలు – తల్లి వ్యభిచరిస్తుంది పినతండ్రి, తన తండ్రిని హత్య చేసి, తన తల్లిని వివాహమాడతాడు. తన ఆస్తిని కూడా స్వంతం చేసుకుంటాడు. వారి మీద పగ తీర్చుకోమని కోరతాడు తండ్రి. తాసీ పని చెయ్యవలసి వచ్చినందుకు బాధ పడతాడు హామ్‌లెట్. ఆత్మహత్య చెసుకొంటే మంచిదనుకుంటాడు. కాని, ధైర్యం చాలదు. చచ్చి మరో చోటికి పోతే, అక్కడ ఇంతకంటె బాగుంటుందని ఎవరు చెప్పగలరు? ఇక్కడ, ఈ లోకంలో బాధలు పడటం మంచిదా? చచ్చి, మరో చోట బాధలు పడటం మంచిదా? ఆ స్వగతంలో కొన్ని భాగాలు.

"చావంటే భయం ఆ భయంవల్లనే మనిషి ఎన్నో కష్టాలకు ఓర్చుకుని జీవిస్తున్నాడు ఒక్క కత్తి పోటుతో ప్రశాంతతని పొందే మార్గం తన చేతిలో ఉండి కూడా – ఎన్నో కష్టాలు భరిస్తున్నాడు. కాలం కొరడాలు, క్రౌర్యం,

నిరంకుశుల దుండగాలు, గర్విష్ఠుల అహంభావం, తృణీకరింపబడిన ప్రేమ, న్యాయస్థానాల కాలయాపనలు, అధికారుల నిరసన, శీలం కలిగి తెలివైనవారిపట్ల జ్ఞాన హీనులు చూపే తృణీకార భావం, - వాటిని ఎవరు భరిస్తారు?

కాలాన్ని గూర్చిన భావంతో ప్రారంభించిన ఈ పరామర్శని కాలం గూర్చిన మరో భావనతో ముగిస్తాను. కాలం ఎట్లాంటిది?

దర్జాగా విందులుచేసే గృహస్థు. వెళ్ళే అతిధుల్ని మృదువుగా కరస్పర్శ చేసి, వారు వెళ్ళగానే వచ్చే అతిధిని, చేతులు జాచి నవ్వుతో ఆహ్వానించి—వెళ్ళేటప్పుడు నిట్టూర్పుతో వీడ్కోలిచ్చే విందుల గృహస్థు.

శీలం తన ఘనత చెప్పుకుని ప్రతిఫలం కోరకూడదు స్మా!

ఎందుకు కోరకూడదు?

కారణం ఏమిటంటే. సౌందర్యం, తెలివి, కుటుంబ గౌరవం, ఎముకల పటిమ, పనిలో నేర్పరితనం, స్నేహం, దానధర్మం, - అన్నీ పరిసమాప్తంచేసే కాలం అసూయకి లొంగిపోతాయి.

— ఇట్లాంటివి చదివిం తర్వాత, మూడో నేత్రం తెరుచుకున్నట్లు, మరో కొత్త దృష్టి అలవరుచుకున్నట్లు, మహదానందం మనస్సులో వ్యాపిస్తుంది.

కళాశాలల్లో విద్యాభ్యాసం చేసి, ఆంగ్ల భాషతో పరిచయం ఉన్న ప్రతి వ్యక్తిపైనా, కాస్తో కూస్తో షేక్స్పియర్ ప్రభావం పడి తీరుతుంది ఆ ప్రభావం ఎట్లాంటిదో చెప్పడం కష్టం. వ్యక్తుల వింత చేష్టల్ని పరిశీలించి తమలో తాము నవ్వుకొనడంలో ఉండొచ్చు ఆ ప్రభావం. మనలో ఎన్ని మంచి గుణాలున్నా, శీలంలో ఏదో ఒక పెద్ద లోటుంటే, ఆ లోటు పరిస్థితుల ననుసరించి పెరిగి చివరికి మన పతనానికి కారణం అవుతుందని నమ్మి తమ శీలాన్ని ఎవరికి వారు పరిశీలించుకొనడంలో ఉండొచ్చు. మనిషి పైకెన్ని మాటలు చెప్పి, ఎన్ని వేషాలేసినా, స్వవిషయం వచ్చినప్పుడు, స్వార్థం చేసిన కసరత్తు ఫలితంగా ఉబికిన ఉద్రేకానికే లొంగిపోతాడు, - అల్లా జరక్కుండా దాన్ని అదుపులో వుంచుకోవడం ప్రధానమని నమ్మి, అల్లా తమ ప్రవర్తనని మలుచుకోవడంలో వుండొచ్చు; లౌకికమైన ప్రయోజనంతో నిమిత్తం లేని సౌందర్యం లేని ఆరాధించే స్వభావంలో వుండొచ్చు; మాటల్లో ఉపన్యాసాల్లో షేక్స్పియర్ సూక్తులను పొందుపరచడంలో ఉండొచ్చు; తమిళ రచయిత ఎస్. వి. వి అన్నట్లు అప్పులవాడు డబ్బు అడగటానికి వచ్చినప్పుడు — "జీవితం నడిచే నీడ" — "క్షణం గొంతి శ్రమించి తెర వెనక్కి కుంటుకుంటూ వెళ్ళే అప్రయోజక రంగస్థల నటులం నువ్వూ, నేనూ." అంటే అప్పు తీరదని తెలుసుకోవడంలో ఉండొచ్చు

రచయితల్లో ఈ ప్రభావం మరింత స్పష్టంగా కనబడవచ్చు. షేక్స్పియర్ నాటకాలు బాగా చదివి, విద్యార్థుల మనస్సుకు పట్టేలాగా పాఠాలు చెప్పిన ప్రముఖ ఆచార్యులు తెలుగువారిలో ఎందరో ఉండేవారు, వున్నారు. షేక్స్పియర్ నాటకాలపై వ్యాఖ్యలు వ్రాసినవారూ ఉన్నారు గురజాడ నాటకంలో గిరీశం "ఏమిటోయ్, షేక్స్పియర్‌లా మొహం వేలవేశావ్!" అనడంలోని మానవునిలోని దౌర్బల్యాన్ని తిలకిస్తూ ఆలోచనా నిమగ్నుడైన షేక్స్పియర్‌ని అప్పారావుగారు ఎంత బాగా ఎరుగుదురో చూపుతుంది. నేటి కవితలో, గద్య రచనలో షేక్స్పియర్ ప్రయోగాల నీడలు, ధోరణులు, ప్రతిధ్వనులూ అక్కడక్కడ దొరుకుతాయి. నుడికారం జాతీయం, సంప్రదాయం చెడనంత వరకూ ఈ పోకడలు హర్షించతగ్గవే. భాషకీ, భావ ప్రకర్షకీ, కొత్త బిగినీ, లయనీ, ఊపునీ ఇస్తోందా? మానవ ప్రకృతి చిత్రణలో ఇదివరకు వెలుగు సోకని చోట్ల కాంతి ప్రసరింప చేసేటందుకు ఇది తోడ్పడుతుందా అన్న ప్రశ్నలు వేసుకోవాలి. ఆంగ్ల భాష గొప్పది దానికున్న పలుకుబడి, దక్షతా, ప్రపంచ భాషలలో మరే ఇతర భాషకీ లేదంటున్నారు. అట్టి భాషలో వ్రాసి గొప్ప కవిగా పేరుగాంచిన షేక్స్పియర్ ప్రభావం, అంతర్జాతీయభావం పెంపొందాలంటూన్న ఈ రోజుల్లో, ఇతర భాషల్లో కాస్తో కూస్తో కనబడ్డంలో ఆశ్చర్యంలేదు.

నా 'చివరికి మిగిలేది' లో 'చీకటి సమస్య అన్న ఒక అధ్యాయంలో, షేక్స్పియర్ నాటకంలో హామ్‌లెట్ మనస్తత్వాన్ని తర్కించడం జరిగింది. అందులోనూ నాయకుణ్ణి, హామ్‌లెట్ సమస్య ఎదుర్కొంటుంది. తల్లి చేసిన అపచారంవల్ల సమాజానికి దూరమౌతాడు. హామ్‌లెట్ తన తల్లిని ద్వేషిస్తాడు. ఇందులో నాయకుడు తన తల్లిని ద్వేషించలేడు, ప్రేమిస్తాడు. హామ్‌లెట్‌ను గూర్చి వ్యాసం వ్రాస్తాడు హామ్‌లెట్ తల్లిని పైకి ద్వేషించినా, లోలోన ప్రేమిస్తాడు కావుననే, ఆమెను వెంటనే చంపడానికి సిద్ధం కాదని వ్రాసిన ఈ వ్యాసాన్ని ప్రచురించే ధైర్యం లేక, చించివేస్తాడు.

ఆ నవలలో కొన్ని మాటలు, వాక్యాలు చూడండి: "ఆకాశం విశాలంగా నవ్వి, సూర్యుణ్ణి అరచేతి మేఘంతో కప్పింది."

"నిశీధిలో సృష్టి వేసుకున్న మంటలో వడిజ్వాల'.

"ఎర్రటి శక్తి" నూనె జ్వాలల మసక చప్పుడు".

"చీకటి సమస్య", ఇసుక కాళ్ళకింద చలితో ఒణికిపోతోంది" "రాత్రంతా మంచు పీల్చి వికసించలేని పుష్పం లాంటి" – ఆమె చక్కదనం. "యుగాలుగా కొండ శిఖరాలపై మంచు కురిపించి మత్తెక్కిన చంద్ర బింబాలు – ఆ నేత్రాలు" "ఎర్రపూలను బంధించిన గడ్డి పోచలు" "ఆద్యంతాలు కలది కన్నీరొక్కటే."

వీటి మూలాలు షేక్స్పియర్ రచనలలో ఉన్నాయో లేవో నేనెరుగను గాని, షేక్స్పియర్ నాటకాలు చదవకపోతే ఇల్లా వ్రాసి ఉండేవాణ్ణి కానని మాత్రం చెప్పగలను. కేంద్ర సాహిత్య అకాడమీ వారు, షేక్స్పియర్ నాటకాలని, యునెస్కో సంస్థ ప్రోద్బలంతో, దేశి భాష లన్నింటిలోకి అనువదించే యత్నం చేస్తున్నారు. తెలుగులో కొన్ని మంచి అనువాదాలు వెలువడ్డాయి కూడాను. ఇవి గాక, షేక్స్పియర్ని గురించిన ఒకటి రెండు పుస్తకాలను తెలుగులో, — అనువదించడానికి మరెవరన్నా పూనుకోవాలి. వాల్టర్ రాలె, (Sir Welter Raleigh) ఇవార్ బ్రౌన్, (Ivor Brown) వ్రాసినవి రెండు మంచి పుస్తకాలు వీటిల్లో షేక్స్పియర్ జీవిత విశేషాలు, నాటకాల చరిత్ర, ఇతివృత్తం పాత్రల విమర్శ, తాత్విక చింతన సమగ్రంగా, గంభీరమైన భాషలో, కూర్చబడ్డాయి.

# తెలుగుసీమలో వర్డ్స్‌వర్త్

ఆంగ్లకవి వర్డ్స్‌వర్త్ ఆంధ్రదేశం చూడలేదు. అసలు అట్లాంటి ప్రాంతం ఒకటుందనే ఆయనకి తెలిసివుండదు. తెలుగునాడు, తెలుగుభాష ఉన్నాయని ఎరగడు. ఆయన భారతదేశానికి రాలేదు ఇండియా అనే దేశం వుందనీ అది బ్రిటీషువారి పాలనలో వుందనీ మాత్రం ఆయనకి తెలుసు. మరి "తెలుగుసీమలో వర్డ్స్‌వర్త్" అనడం ఎందుకు?

వర్డ్సువర్త్ 1770 సంవత్సరంలో జన్మించాడు. ఎన్నెన్నో ఖండకావ్యాలు, పెద్ద కావ్యాలు విమర్శలు వ్రాసి, ఇంగ్లండులో కాల్పనిక కవితా ఉద్యమాన్ని నెలకొల్పి, ప్రచారంచేసి, యువకవులకు మార్గదర్శకుడుగా కీర్తి తెచ్చుకుని, చనిపోయ్యాడు. కాలం జరిగింది; ప్రకృతిని ప్రతిభతో గానం చేసిన మహాకవిగా, ప్రపంచ సాహిత్యంలో స్థానం ఏర్పరుచుకున్నాడు.

కొన్ని రోజులు ఫ్రాన్స్‌లో గడిపాడు, మరికొన్ని రోజులు విద్యార్థిగా కేంబ్రిడ్జ్, లండన్ నగరాలలో గడిపాడు పీటిని విడిచేస్తే ఆయన జీవితం అంతా ప్రకృతి పొలిమేరలో గడిచిందనే చప్పాలి అదంతా ఆశ్రమవాసంలాంటిది -- వెనక మన ఋషులూ, యోగులూ అల్లా గడిపేవారు హాక్సెడ్, యార్క్‌షైర్, పెన్‌రిత్, రాంప్‌సైడ్, రేస్‌డౌన్, అల్‌ఫాక్స్‌డెన్ -- ఈ ప్రాంతాలలో ఆయన నివసించాడు. ఇవన్నీ పల్లె ప్రాంతాలు - అంతటా సరస్సులు కొండలు, పెద్ద పెద్ద చెట్లు, సువిశాలమైన బయళ్ళు, పొలాలు, తోటలు - వీటినే వర్ణించాడు. ఈ వర్ణనలు చూస్తే ఆంధ్రదేశంలో ప్రకృతి దృశ్యాలు జ్ఞప్తికొస్తాయి. ఇవన్నీ చూసి వర్ణించడం అనిపిస్తుంది. అందుకనే తెలుగుసీమలో వర్డ్స్‌వర్త్ అనడం.

షికారుగా నడుస్తూ తిరగడం వర్డ్సువర్తుకవి ప్రధాన వ్యాపకం ఆయన చదువు, పని కూడా ప్రకృతిని చూడడమే అనొచ్చు. "అయ్యగారు చదువుకుంటూ పనిచేసే చోటు ఎక్కడ?" అని ఎవరో వర్డ్సువర్తు ఇంట్లో పనిమనిషి నడిగారట.

"అయ్యగారు చదువుకునే చోటు పొలంగట్టు" అందిట పనిమనిషి.

వర్డ్సువర్తుకవి తెగ నడుస్తాడు - ప్రొద్దున మధ్యాహ్నం, సాయంత్రం,

రాత్రి - అస్తమానూ నడవడమే. ఆయన బాటసారి; నిరంతర యాత్రికుడు. యాత్రా గ్రంథాలు చదవడం ఆయనకి మహా ఇష్టం. స్నేహితులకి ఉత్తరాలు వ్రాస్తూ "చదువుకునేటందుకు, ఏవన్నా యాత్రా గ్రంథాలుంటే పంపించండి" అని కోరుతాడట. ఇండియా గురించి కొంత చదివి వుండాలి. ఊహలో ఆయన తెనుగుసీమలో తిరిగి ఉండాలి.

వర్డ్సువర్తు, ప్రకృతి కవి అన్నాను అంటే ప్రకృతిని కావ్యంలో గొప్పగా వర్ణించగల కవి - అని కాదు నే చెప్పేది; అందమైన ప్రకృతి వర్ణనలు, మంచి ఉపమానాలు, గంభీరమైన పదజాలం - గల ఈరకం కావ్యాలల్లిన మహాకవులలో, వర్డ్సువర్తుని మించిన వారెందరో వున్నారు. వాల్మీకి, కాళిదాసు, టాగూరు, మిల్టన్, గెథె - మొదలైన వారెందరో ఉన్నారు కాని వర్డ్సువర్తు ప్రత్యేకత వర్ణనలో లేదు. ప్రకృతిలో గాఢమైన చెలిమి చేసినవారిలో వొచ్చే మార్పు - సౌందర్యము, శాంతి, మహదానందము, శీలము - ఎట్లాంటిదో చెప్పడంలో వుంది ఆయన ప్రత్యేకత.

కన్య, జలపాతం చూస్తూ గడిపితే, ఆ జలపాతంలో లయ, క్రమము, ధ్వని, నాదము - వీటి సమ్మేళనంవల్ల ఏర్పడే సంగీతం, సౌందర్యం - ఇవన్నీ కన్య శరీరంలోకి జొరబడి, ఆ కన్యని అందంగా చేస్తాయి - ఇది వర్డ్సువర్తు కావ్యంలో ఒక భావం. అలాగే మరొకచోట —

సముద్రపుటొడ్డున పడిన నత్తగుల్లని చెవి దగ్గర పెట్టి కదిపి, వింటే, దానిలో సముద్ర గర్భంలోని హోరు వినబడుతుంది అంటాడు.

ఈ రెండు భావాలలో ప్రకృతి వర్ణన ఏమీలేదు. ప్రకృతి మధ్య గడిపితే మనలో ఏం జరుగుతుందో చూపడమే ఆయన పని. ఇట్లా చూపడంలో, ఆయనని మించిన కవి విశ్వ సాహిత్యంలో లేడనే అనుకుంటున్నాను. మనుషులుండని ఊరవతల - సరస్సు, నది కాలువ, ఆరుబైట, అడవి కొండలు; ప్రశాంతంగా ఉండే ప్రకృతి నడుమ వుండి అందులో లీనమైపోతే, ఆ ప్రకృతిలోని ప్రశాంతత, నైర్మల్యము, శీలము, బలము, సౌందర్యము - ఇవన్నీ అబ్బుతాయంటాడు. శీలం అబ్బుతుందన్న భావాన్ని వొక్క-దాన్నీ వే వొప్పుకోను. మనుష్యుల మధ్య వున్నప్పుడే శీలం రాణిస్తుంది; మనిషి ఏకాంతంగా వున్నప్పుడు, శీలం ప్రసక్తే వుండదు ఈ వొక్క భావం మినహా, ఆయన చెప్పినవన్నీ నేను అంగీకరిస్తాను. ఆ చెప్పడం, అందంగా, సొంపుగా, నచ్చేటట్టుగా చెప్పాడు ఆయన.

వర్డ్సువర్తు ఇంగ్లండులో ప్రకృతిని వర్ణించినా, ఆ ప్రకృతి ప్రాబల్యం

యొక్క వర్ణనలో పెద్దతేడా ఉండదు. ఆ ప్రాబల్యం ఎట్లాంటిదో కొన్ని ఉదాహరణలు పొందుపరుస్తాను.

"బైట చల్లని గాలి వీస్తోంది. నా లోపల సృష్టి శక్తుల్ని రగులుస్తూ మరొక పల్చటి గాలి బైలుదేరి, వొక తుఫానై, తాను రూపొందిన దానినే కలవరపరిచే శక్తివలె, శరీరమంతా సోకింది. పొగమంచుని చీల్చుకొచ్చే తుఫాను వొస్తోందని మనకి ముందుగానే తెలుస్తుంది. ఆ జిజ్ఞాసలో వుంది ఆ శక్తి."

మరొకటి: "తూర్పు ఆకాశంలో కిరణాలు పొడిచి, ప్రభాతంగా పండని ఆకాశాన్ని నా ముందు దిగవిడచి, అంతర్ధానమౌతాయి."

ఇది చూడండి:

"నేను వొంటిగా వున్నాను. నా చుట్టూ వున్న ప్రశాంత వాతావరణాన్నే భంగపరచేదిగా వుంది నా ఏకాంతం."

ప్రకృతిలో "మనకి కనబడని వింత పనివాడితనం ఉంది - విభిన్న శక్తుల సంఘర్షణని నిలిపివేసి వొక సంఘంగా మలిచివేసే పనివాడితనం."

వర్డ్సువర్త్ "ఏకాంతజీవి" అను పేరిట వొక మహాకావ్యం వ్రాయ సంకల్పించి, దానికి అవసరమైన శక్తి; పరిజ్ఞానము, మానసిక నిబ్బరమూ తనలో వున్నవో లేవో తరచి చూసే ఉద్దేశ్యంతో, ఆ "ఏకాంతజీవి" వ్రాసే ముందు, **The Prelude** అను పేరిట వొక ఉపోద్ఘాత కావ్యం వ్రాశాడు. ప్రకృతితో బాల్యంలో గాఢమైన చెలిమి ఏర్పడ్డంవల్ల, పెద్దయ్యాక, మానసిక ఆనందం ఎల్లా అలవడుతుందో చూసిన మహాకావ్యం ఈ ఉపోద్ఘాత కావ్యం.

యోగాభ్యాసం చేసినవారికీ, తపోధనులకూ, ఆరాధనా వైరాగ్యాలు అలవరచుకున్న ఋషులకూ సాధ్యమయ్యే మహదానందాన్ని వర్డ్సువర్త్ సాధించడమేగాకుండా, ఆ సాధన ఎల్లా సాధ్యపడిందీ ఇతరులకు మరుపురాని మాటల్లో చెప్పగల మహాకవి ఈయన. ఇట్లాంటి మానసిక రహస్య మందిరాలను శోధించి, ప్రకృతికీ, జీవుడికీ వున్న బంధాన్ని విపులీకరించి, మానసిక శాంతినీ ఆరాధనా దృక్పథాన్నీ అలవరచుకునే విధానాన్ని ఇంత అందంగా, శక్తివంతంగా చెప్పిన ఉపోద్ఘాత కావ్యాన్ని నేనెరగను. అందులోంచే కొన్ని భాగాలు పొడిమాటల్లో ఉదహరిస్తాను.

"మన గుండెకాయ కొట్టుకోడంలోనే వొక ఠీవి, మహాత్మ్యమూ వున్నాయి." బాల్యంలో సరదా, హుషారూ, జోరూ పరుగులూ గంతులూ వుంటాయి. ఈ శక్తంతా "వొక తుఫానులా రక్తనాళాలలో ప్రవహిస్తుంది - దాన్ని ఇట్టే మరిచిపోతాము," అంటాడు వర్డ్సువర్త్. బాలుడు ఎదుగుతాడు; ఘోషవస్తు

డౌతాడు. ఏవో చిక్కులు వచ్చి పడతాయి అర్థం చేసుకుని సలహా ఇచ్చే మేష్టర్లుండరు. పెళ్ళి విషయంలో ఏవో పేచీలు; డబ్బు ఇబ్బందులు - చికాకు పడతాడు. ఏం చెయ్యాలి? ఊరవతలకి వెళ్ళి పొలం గట్టున కూర్చుంటాడు. దూరంగా ఊళ్ళో పాకలు, పెంకుటిళ్ళు వాటి కప్పులమీదనుండి తెల్లటిపొగ పల్చగా లేస్తుంది. దాని ఆకృతిలో వొంపులుంటాయి.

"ఆ పొగలో కదిలే వొంపులూ, రేఖలూ చూస్తూవుంటే, ఇంద్రియాలకు సంబంధించిన ఆనందం వొంట్లో జొరబడుతుంది. కదలని మేఘాలు సరస్సులో నీటిని కదలకుండా, వాకే మట్టంలోకి తెచ్చి, నిలుపుతాయి. ఈ నిశ్చలత్వం వొంట్లో జొరబడుతుంది."

ఆ దృశ్యంలో ఆనందం ఉందంటాడు వర్డ్సువర్తు. అది ఎట్లాంటిది?

"సంతోషం బరువు తెచ్చుకున్నట్లు, ఆ ప్రశాంతమైన నీటి మట్టం, మనస్సుమీద బరువుగా నిలుస్తుంది ఆ నిశ్చలమైన ఆకాశం, నా మనస్సులో మునిగిపోయి, స్వప్నంవలె నన్ను నిలబెట్టింది."

# బెర్ట్రండ్ రసెల్ భావప్రపంచం

ఈ శతాబ్దపు ప్రపంచ మేధావులలో ఆంగ్ల తత్వశాస్త్రజ్ఞుడు బెర్ట్రండ్ రసెల్ అగ్రగణ్యు డనడానికి నేను సందేహించను. 'మేధావి' అంటె ఒకభావం వెలిబుచ్చి దాని మంచి చెడ్డలు తరచి చూసి, అది మానవ శ్రేయస్సుకి ఎంత వరకూ ఉపకరిస్తుందో పరామర్శించి, మంచిదైతే స్వీకరించమనీ, చెడ్డదైతే విడిచెయ్యమనీ నచ్చచెప్పే వాడన్నమాట ఒకటి రెండు రంగాలలో ప్రత్యేకంగా కృషి చేసి అపారమైన పరిజ్ఞానం సంపాదించి, అనుభవం గడించి, వీటిని పురస్కరించుకుని మానవ వ్యవస్థను గూర్చి సమాలోచన జరిపే వాడై వుంటాడు మేధావి. పాశ్చాత్య దేశాలలో బెర్నార్డ్ షా, హక్స్లె, హెచ్ జి వెల్స్, హాల్డేన్, హేవ్‌లక్ ఎల్లిస్, సార్త్రె, విల్ డురాన్‌ట్, ఆర్థర్ కెస్ట్లర్, మన దేశంలో జయప్రకాశ్ నారాయన్, సి వి. రామన్, సి ఆర్ రెడ్డి, ఎమ్. ఎన్. రాయ్, హుమయూన్ కబీర్, కొందరు మేధావులుగా పేర్కొంటాను. కొత్త భావాల ప్రతిపాదన కాకుండా, పాతవాటినే తమ జీవితంలో అనుసరించి, మహత్తర కార్యాలను సాధించి, వాటి ద్వారా, ఆ భావాలకి వలుకుబడి, ప్రచారం సంపాదించిపెట్టినవారు కొందరున్నారు — లిన్‌కన్, గాంధి, ఆల్బర్ట్ ష్విట్‌జర్. వినోబాభావే, నెహ్రూ లాంటివారు వీరిని మేధావులనడంకంటె కర్మయోధులనడం సముచితం.

మేధావులు ఎక్కువగా తమ దేశకాల పరిస్థితుల ననుసరించి, కొత్త భావాల బాగోగులను విమర్శిస్తారు ప్రాగ్ దేశీయుల దృష్టి అంతగా పాశ్చాత్య మానవుడిపై మరలదు అల్లాగే పాశ్చాత్య మేధావి దృష్టి, ప్రాగ్ దేశాల మానవుడిపై మరలదు. ఇట్లా కాక, ప్రాక్ పాశ్చాత్య దేశాల చారిత్రిక, సామాజిక స్థితిగతులను అవగాహన చేసుకుని, స్వయంగా వెళ్ళి చూసి ఆయా దేశాలలో మానవ సమాజం ఎట్లా నిర్మితమై నిర్వహింపబడుతున్నదీ గమనించి, విశ్వమానవుడి శ్రేయస్సును గురించి పట్టించుకునేవారు కొందరున్నారు — డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, బెర్ట్రండ్ రసెల్ లాంటివారు. వీరినే ప్రపంచ మేధావులంటున్నారు. డాక్టర్ రాధాకృష్ణన్ సమాలోచన, ఎక్కువగా ఆధ్యాత్మిక

చింతన వైపు మొగ్గుతుంది. ఐహిక చింతన వైపు మొగ్గుతుంది రసెల్-సమాలోచన. ఇంకా స్థూలంగా చెప్పాలంటె, మానవుడి ఆత్మ ఆరోగ్యకరంగా వుండాలని రాధాకృష్ణన్, శరీరం నుండి విడగొట్టే ఆత్మ వేరే లేదు; కావున శరీరం ఆరోగ్యకరంగా ఉండాలని రసెల్, చెప్పారు.

డాక్టర్ రాధాకృష్ణన్ భావాల వెనక, అతి ప్రాచీనమైన హిందూ తత్వ సంప్రదాయం ఉంది.' రసెల్ భావాల వెనక ఆధునిక విజ్ఞానశాస్త్రం సాధించిన ఫలితాలువ్నాయి. రసెల్ దృక్పథం మనకి కొత్త. ఈ దృక్పథాన్ని పరిచయం చెయ్యాలనే ఈ వ్యాసం తలపెట్టాను. పాశ్చాత్య దేశాలలో గొప్ప తత్వశాస్త్రజ్ఞుడుగా పేరు పొందాడు రసెల్. ప్రపంచంలో ఇంచుమించు అన్ని దేశాలనూ పర్యటించాడు. అన్ని దేశాల చరిత్రలు, తత్వ శాస్త్రాలు, రాజకీయాలు, సమాజాలూ, చదివి, తెలుసుకుని అన్ని దేశాలవాటికీ ఉపకరించే కొన్ని భావాలను ప్రచారం చేశాడు, ఆయన తన భావాలు వెలిబుచ్చక విడిచేసిన విషయం వొక్కటైనా ఉందనుకోను. కాని చిత్రం సాహితీపరుడుగా ఆయనకి నోబెల్ బహుమానం లభించింది. డాక్టర్ రాధాకృష్ణన్‌కు ఈ బహుమతి రానందుకు ఆశ్చర్యపడేవాళ్ళలో నేనొకణ్ణి. ఇప్పుడు రసెల్ వివిధ విషయాలపై వెలిబుచ్చిన భావాలన్నింటినీ ఉదహరించి పరామర్శించ బోవడంలేదు నేను. ఇది డాక్టరేట్ డిగ్రీ కోసం తయారుచేసే 'థీసీస్' లాంటిది కాదు.

రసెల్‌కి ప్రపంచ ఖ్యాతి తెచ్చిపెట్టిన గ్రంథం, గణిత శాస్త్రాన్ని పురస్కరించుకుని ఆయన వ్రాసిన తత్వ శాస్త్రం–' ప్రిన్సిపియా మాథెమాటికా' అనేది. నాకు లెక్కలు బొత్తిగా రావు. ఈ గ్రంథానికి ఆయన వ్రాసిన పీఠిక చదివాను కాని అర్థమైందనలేను. ఆ గ్రంథం చదివి అర్థం చేసుకున్న వారిని వేళ్ళమీద లెక్కించవచ్చు. ఇట్లాగే మరికొన్ని తత్వ శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు వ్రాశాడాయన. నేను వాటి జోలికి పోను.

సామాన్య పాఠకుడికి, ఏదో విధంగా తన జీవితంలో వుపకరించేవీ, వాటిని పరిశీలించాక ముందు ముందు స్వీకరించాలి అనే కుతూహలాన్ని రేకెత్తించేవీ, మనదేశానికి, మన సమాజానికి సమన్వయపరుచుకుని, పోలికల పరామర్శలో గల వైజ్ఞానిక తృష్ణని పురిగొల్పేవీ - ఇట్లాంటి కొన్ని భావాలని పేర్కొని, సులువుగా అర్థమయ్యేలాగు వితర్కించడమే నే తలపెట్టింది ఈ రచనలో. ఇట్లాంటి భావాలు, ప్రధానంగా విద్య, నీతి, కుటుంబ జీవితము, ఇహపరాలని గూర్చిన చింతన, సమాజ స్వరూపము, పరిణామము - వీటితో ముడిపడి వుంటాయి. మన రాజ్యాంగం చాలావరకూ ఆంగ్ల రాజ్యాంగ సూత్రాలని

అనుసరించి వున్నదైనా, రాజకీయరంగంలో భావాలు, అనుక్షణమూ మారుతూండదమే కాక, వివాదంతో కూడి వుంటై కావున, రాజకీయాలపై రసెల్ భావాలను - ప్రధానమైన వాటినీ; కాలానికీ, స్థలానికీ అతీతమై, శాశ్వతమైన సూత్రాలుగా పరిగణించిన వాటినీ మినహాయించి - ఇందులో విపులీకరించను. మొత్తంమీద మతం మానవుడికి హాని చేసిందనే రసెల్ తీర్పు. ప్రధానమైన మతాలన్నింటినీ ఆయన రచనల్లో చర్చిస్తాడు ఆయా మతావలంబకులకు ఈ చర్చ కాస్త హేళనగా తోచవచ్చు. కావున, కాసేపు పాఠకుడు తమాయించుకుని, మండిపడక, శాంతంగా, పరిశీలించి, ఆయన భావాలు, తన మతానికి ఎంత వరకూ, ఏ విధంగా వర్తిస్తాయో, తాను ఆ భావాన్ని స్వీకరించడానికి తగినన్ని ఆధారాలున్నాయో లేవో స్వయంగా సమాలోచన జరుపుకోవాలని కోరుతున్నాను. రసెల్ నైతిక భావాలను పరామర్శిస్తున్నాను. గావున, ఈ భావాలనన్నింటినీ నేను స్వీకరించాననికాని, పాఠకుణ్ణి స్వీకరించమంటున్నాననికాని అనుకోవద్దని కూడా పాఠకుణ్ణి కోరుతున్నాను. కొన్ని విషయాలపట్ల, రసల్లే తన భావాలని కొన్నాళ్ళ తరువాత మార్చుకోడం జరిగింది. ఆర్థిక పారిశ్రామిక రంగాలలో పురోగమించిన అమెరికా, ఇంగ్లండ్ దేశీయులకే, రసెల్ భావాలు కొన్ని మొదట్లో నచ్చలేదు ఇప్పటికీ కొన్నిభావాలని తీవ్రంగా ఖండిస్తున్నారు. ఆయన ప్రథమంగా చెప్పినప్పుడు, కొన్నిభావాలు కొత్తవిగా, విప్లవాత్మకంగా కనబడినా, ఈనాడవి పాతవిగా కనబడొచ్చు. కొన్ని కొన్నిభావాలు మరో తరంవారికి ఆచరణయోగ్యంగా తోచవచ్చు. ఉద్రేకపడక, నిదానంగా పరిశీలించే మనస్తత్వం అలవరచుకోవాలన్నది రసెల్ ప్రధాన బోధ - కావున, పాఠకుణ్ణి, దేశీయ, ప్రాంతీయ, కుల, మత, భాషా సంస్కృతుల నుండి జనించే ఉద్రేకాన్ని విస్మరించి, రసెల్ భావాలను పదిలంగా పరిశీలించమని కోరుతున్నాను.

గురుభక్తి సన్నగిల్లిందంటున్నారు ఈ రోజుల్లో. రసెల్ పట్ల గురుభావం వుంది నాలో. తత్వశాస్త్రానికి సంబంధించిన ఏ ఐదారు గ్రంథాలనో విడిచి, ఆయన రచనలన్నీ ఇరవయ్యేళ్ళుగా చదువుతూ వచ్చాను. 'స్వేచ్ఛాజీవుల ఆరాధన' అన్న ఆయన వ్యాసం, నన్ను మార్చిన రచనల్లో వొకటి. దాన్ని గురించి పన్నెండేళ్ళ క్రితమే 'నన్ను మార్చిన పుస్తకం' అన్న వ్యాసంగా వ్రాశాను. ఆయన భావాలలో కొన్నిటిని నేను స్వీకరించలేను కొన్ని, నేనిల్లా తయారవడానికి కారణాలయ్యాయి. జీవితంపట్ల వొక ప్రశాంతమైన దృక్పథాన్ని అలవరుచుకోడానికి, ఆయన భావాలు కొన్ని తోడ్పడ్డాయి. ఈ భావాలు నాతోటి వారు తెలుసుకుంటే మంచిదని తోచి, ఈ రచనకు పూనుకున్నాను.

బెర్ట్రండ్ రసెల్ భావాలు పరామర్శించే ముందు, ఆయన జీవిత విశేషాలను తెలుసుకోవల్సిన అవసరం ఎంతైనా వుంది. ఆ భావాల పుట్టుక, స్వరూపం, స్థిరీకరణ, ప్రచారం - వీటిని ఆయన జీవితంలో పొందిన అనుభవాల నుండి విడగొట్టడం కష్టం అనుభవం జరిగాక, వొక భావం ఉదయిస్తుందా? లేక వొక భావం ఆదర్శప్రాయంగా కనబడ్డాక దాన్ని స్వీకరించి, తదను గుణంగా జీవిత నాటకంలో తన పాత్ర నిర్వహించడం జరుగుతుందా? మతంవల్ల మానవుడికి అపకారం జరిగింది కావున నాస్తికతత్వం స్వీకరించి ఆది శాసించిన కులమత విభేదాలు విస్మరించి, సంప్రదాయం నిర్దేశించిన సమాజాన్ని నెలకొల్పుకోవాలన్న భావాన్ని, అనుసరించి, గోపరాజు రామచంద్రరావు లాంటి వ్యక్తి, జీవిత సమరానికి పూనుకున్నాడా? సమరం సాగించి, అనుభవం అయ్యాక, ఈ సూత్రాల ప్రచారానికి పూనుకున్నాడా? చెప్పడం కష్టం. కొన్ని భావాలు అనుభవానికి వెనకా, కొన్ని ముందూ, పుట్టవచ్చు. వీటిని విడదీయడం కష్టం గనుకనే, రసెల్ జీవిత విశేషాలని పొందుపరిచే అవసరం వుందని తోచింది. ఆయన జీవితంలో రసవత్తరమైన ఘట్టాలున్నాయి. వాటిని తెలుసు కుంటే, కొన్ని భావాలను కూడా తెలుసుకొన్నట్లే. అనుభవం ముగిసి, ఉద్రేకం సమసి, నిదర్శనాలు దొరికాక వెల్లడైన వాటి ననుసరించి పుడుతుంది 'భావం.' భావం' స్థిరపడ్డాక, ఉద్రేకపూరితమైన మరొక పరిస్థితి ఏర్పడినప్పుడు ఆ భావం కేవలం వొక అభిప్రాయంగా వ్యక్తం చేస్తాడు రసెల్. నా కిష్టమైన రెండు రసెల్ నిర్వచనాలని ఉదహరిస్తాను

"ఈనాడు రెండురకాల నైతిక విధానాలు చలామణిలో వున్నాయి. పైకి చెప్పేది వొకటి, అనుసరించేది మరొకటి. అనుసరించేది పైకి చెప్పం. పైకి చెప్పింది అనుసరించం." ఇది అభిప్రాయం కాని, భావం కాదేమో 'ఈనాడు' అంటే, ఇట్లాంటి స్థితి ఈ శతాబ్దిలో మాత్రం ఏర్పడిందనా? ఇది అన్ని కాలాలలోనూ, జరిగేదే —— ఆదిమవాసులు ప్రథమంలో అలవరచుకున్న నైతిక సూత్రాలు మినహాయిస్తే రెండోది "మూఢులు బల్లగుద్ది చెప్తున్నారు, విజ్ఞులు నోరుమూసుకుని కూర్చుంటున్నారు ఈనాటి అరిష్టాలకి ఇదే కారణం" ఇదికూడా, అన్ని కాలాలలోనూ, అన్నిదేశాలలోనూ జరుగు తున్నదే కేవలం 'ఈనాడే' జరుగుతూంది అనలేం ఇది అభిప్రాయంకాని, భావంకాదు. ఇట్లాంటి అభిప్రాయాన్ని ఎదుర్కొన్నప్పుడు, పాఠకుడు, తన దేశకాల సమాజ పరిస్థితులకు ఎంతవరకూ వర్తిస్తుంది, దీని వెనక వున్న భావం ఏమై వుంటుందీ, మొదలైన ప్రశ్నలు వేసుకుని, అంతరంగ సమాలోచన జరుపు

కోవాలి. ఇట్లాంటి పని కల్పించేవే రసెల్ అభిప్రాయాలు, భావాలు. రసెల్ జీవిత విశేషాలు తెల్సుకుంచే ఈ సమాలోచన సుఖవవుతుంది.

1872 వ సంవత్సరం, మేనెల 18 వ తేదీని జన్మించాడు బెర్ట్రండ్ రసెల్. తండ్రి వైకౌంట్ ఏంబర్లి, తల్లి కేట్స్టాన్లి. వీరి సంతానం ముగ్గురు; మొదటి పిల్లవాడు ఫ్రాన్క్, తరువాత కుమార్తె రేషెల్. మూడవ పిల్లవాడు రసెల్. తన తల్లికి వ్రాస్తూ, రసెల్ తల్లి, బిడ్డను ఇల్లా వర్ణించింది. "ఎనిమిది న్నర పౌన్ల బరువు బిడ్డడు. ఇరవైయ్యొక్క అంగుళాల పొడుగు, లావుగా వికృతంగా వుంటాడు. ఎడమెడంగా ఉండే నీలంరంగు కళ్లు, అంతగా కనపడని గడ్డం....సకాలానికి పాలివ్వకపోతే, ఎగిరిపడతాడు." రసెల్ పుట్టి ఏడాది గడిచాక, దీర్ఘవ్యాధితో ఆయన తండ్రి మంచానపడ్డాడు. అక్క రేషెల్ చని పోయింది తల్లి చనిపోయింది. మరో పదునెనిమిది మాసాలు గడిచాక తండ్రి కూడా చనిపొయ్యాడు తండ్రి ఏంబర్లీ నాస్తికుడు. తన కుమారుడు ఇద్దరు నాస్తికుల పోషణలో ఉండాలని ఆయన వ్రాసిన వీలునామా ప్రభుత్వం పాటించక, రసెల్ని అమ్మమ్మ తాతగార్ల పోషణలో ఉంచారు. రసెల్ బాల్యం, వారి పోషణలో, పెంబ్రోక్ భవనంలో గడిచింది. తోటివారి సహవాసం లోపించి నందున, సిగ్గు, భయాలతో, వొంటిగా తోటలో తిరుగుతూ గడిపేవాడు. ఆనాటి ధనిక కుటుంబాలలో, ప్రేమాతిశయాలు, ఉద్రేకం ప్రకటించకపోవడం అలవాటు. అనురాగం, ఆపేక్ష పైకి చెప్పలేకపొయ్యేవాడు రసెల్. మంచుపై జారడం, పిట్టగూళ్ళ కోసం చెట్లెక్కడం, బాల్య క్రీడలు. 'రోలో' అనే ఆయన రసెల్ మామ. విజ్ఞానశాస్త్రంపట్ల అభిరుచి కలగచేసింది ఈ మామే. అందరూ చెప్పిన దాన్ని శంకించడం ఐదవ ఏటనే ప్రారంభించాడు రసెల్. 'భూమి గుండ్రంగా ఉంది' అన్నదాన్ని నమ్మలేక, ఇదెంతవరకూ నిజమో కనుక్కుందా మని, తోటలో నేలమీద కంతచేసి త్రవ్వడం మొదలెట్టాడు - ఆ కంతగుండా వెడితే, ఆ వలవైపు నున్న ఆస్ట్రేలియా ఖండంకి చేరుకోవాలి మరి! నిద్రించి నప్పుడు దేవకన్యలు కావలా ఉంటారనేవారుట. దేవకన్యలని చూద్దామని కళ్లు తెరిచి కూర్చున్నాడుట రాత్రంతా. ఎవ్వరూ కనబడలేదన్నాడు. కళ్ళు తెరవగానే పారిపోతాయి దేవకన్యలన్నారుట. అందుచేత, నిద్రిస్తూన్నట్లు నటించి, చేతికి తగుల్తారేమో చూద్దామనికుని, చేతులతో చుట్టూ వెదికేవాడుట.

మెల్లిమెల్లిగా, రసెల్కి గణితశాస్త్రంపట్ల అభిరుచి ప్రబలింది. ఎవ్వరూ సంశయించనిడాకి వీల్లేని పరమ సత్యం, గణితశాస్త్రంలో వుంటుంది— 'రెండు రెళ్ళు నాలుగు' అన్నది అట్లాంటి సత్యం. గమనించే మానవుడు వున్నా

లేకపోయినా, అన్ని కాలాలలోనూ, అన్నిచోట్లా, రెండు రెళ్ళు నాలుగే. పరమ సత్యాన్ని 'లెక్కల'లో అన్వేషించాలన్న సంకల్పం లేకుంటే, చిన్నప్పుడు ఆత్మహత్య చేసుకుని వుండేవాడుట. బాల్యంలోనే చరిత్ర పట్ల అభిరుచి ఏర్పడింది. తరువాత సాహిత్యం పట్ల. బ్లేక్, షెల్లీ కవులు ఈయనకి ఇష్టం. జె. ఎస్. మిల్ రచనలు చదివాడు దాని ఫలితంగా, దైవం పట్ల గురితప్పింది. ఇబ్సెన్ నాటకాలు ఇతని దృష్టిని, కుటుంబ సమస్యల వైపు మరల్చాయి. యువకుడుగా రసెల్ ఆప్యాయతని కోరేవాడు. అది లభ్యం కాలేదు. ఆయన అక్క 'రేషెల్' బ్రతికి వుంటే, ఈలోటు తీరేదేమో. ఏకాంతంగా గడిపేవాడు. ఏకాంతంగా గడిపినవారే ఘనకార్యాలు చెయ్యగలుగుతారన్న డాక్టర్ రాధాకృష్ణన్ నిర్వచనం, రసెల్‌కి వర్తిస్తుంది 'క్రామర్' పాఠశాలలో విద్య నభ్యసించాడు పదునెనిమిది మాసాలు అక్కడ గడిపి లాటిన్, గ్రీకు భాషలు నేర్చుకుని, 'కేంబ్రిడ్జ్'లో స్కాలర్‌షిప్ పొందాడు. ఆయనకు జర్మన్, ఫ్రెంచ్, ఇటాలియన్ భాషలు కూడా తెలుసు

1890 లో కేంబ్రిడ్జి ట్రినిటి కళాశాలలో చేరాడు. తత్వశాస్త్రంలో కేంబ్రిడ్జి వారిదే ఆధిపత్యం. మాక్‌టగ్గార్ట్, వైట్‌హెడ్, మూర్, బ్రాడ్, విట్‌గెన్‌స్కీన్, ఎడ్డింగ్‌టన్, రూథర్‌ఫోర్ట్, కీపీస్ మొదలైన ప్రముఖులంతా అక్కడ చదివినవారే. జి ఇ మూర్ ఈయన ముఖ్య స్నేహితుడు. స్నేహితులతో స్వేచ్ఛగా, సంతోషంగా పొగ పీలుస్తూ, కబుర్లు చెప్తూ, సిగ్గు భయాలని దిగమింగుకున్నాడు కేంబ్రిడ్జిలో మూడేళ్ళు గణితశాస్త్రం చదివి, 1893 లో ఏడవ రాంగ్లర్‌గా ఉత్తీర్ణుడయ్యాడు తత్వశాస్త్రం చదువుతూ మరో ఏడు గడిపాడు. ప్రసిద్ధ తత్వ శాస్త్రజ్ఞులు బ్రాడ్లే, హెగెల్‌ల గ్రంథాలు చదివాడు. బాల్యంలో స్త్రీల నెరగనందున, యవ్వనంలో స్త్రీ సహవాసం కోసం కలలు కనేవాడు. లోగన్ పెర్సాల్ స్మిత్ అనే రచయిత చెల్లెలు 'ఎలీస్'ని ప్రేమించి 1894 డిసెంబర్ 13 న వివాహమాడాడు. అతని వయస్సు అప్పుడు ఇరవై రెండు; ఆమె అతని కంటె ఐదేళ్ల పెద్ద తనూ, భార్య 1895 లో రెండుమార్లు జర్మనీ దేశం పర్యటించి, మార్క్స్ సిద్ధాంతాల ననుసరించి బయలుదేరిన కమ్యూనిజమ్, జర్మనీలోని మిలిటరీ తత్వం ఎల్లా పని చేస్తున్నాయో గమనించి, తాను తెలుసుకున్న విషయాలని ప్రసంగాల ద్వారా ఎరుకపరిచి వాటిని 1896 లో జర్మనీలోని ప్రజాస్వామ్య ఉద్యమం గురించిన గ్రంథంగా వెలువరించాడు ఉత్పత్తి పెరుగుదలకు సంబంధించిన విలువ పెరుగుతూ వుంటుందన్న సిద్ధాంతానికీ, సంపత్తి అంతా వొకేచోట కేంద్రీకృతమౌతుందన్న సిద్ధాంతానికి పొత్తు

కుదరలేదని రసెల్ విమర్శ ఆర్థిక సంపత్తి ఒక్క కూటమి ఆధ్వర్యంలోకి వచ్చే దశలో ప్రభుత్వం ఆ పరిశ్రమని స్వాధీనం చేసుకోవాలికానీ; మార్క్స్ చెప్పినట్లు వర్గ సమరం పెంచి, నియంతృత్వం ప్రబలేటట్లు అన్నింటినీ వొకేసారి కబళించడం మంచిది కాదనీ ఈయన సూచన. కలవారు, లేనివారు – ఈ రెండు వర్గాలనే ఎరుగును మార్క్స్; వీరి నడుమ సాంకేతిక నిపుణులు గల మధ్య తరగతి వొకటుందని గమనించినట్లు లేదు మార్క్స్. సామ్యవాదం ఎక్కడ వచ్చిపడుతుందోనన్న భయంతో జర్మనీ ప్రజ, ధనికులైన పాలకులు జరిపే దారుణాలని భరించి వూరుకుంటున్నారనీ కావున, పాలకులు హింసాకాండ నిలిపి భావ స్వాతంత్ర్యాన్ని గుర్తించనట్లయితే, యుద్ధం, సర్వ నాశనం తప్పదనీ ఆనాడు రసెల్ చెప్పినవి జరిగాయి. ఈ సిద్ధాంతాలని రసెల్, ఫేబియన్ సమాజం ఉపన్యాసంలో చర్చించాడు ఆయన తొలి ఉపన్యాసం అదే. ప్రేక్షకుల ముందు నిలబడడమంటె భయం వేసింది. ముచ్చెమట్లూ పోశాయి. తన కాలు విరిగి 'ఈ పూట ఉపన్యాసం లేదు' అని ఎవరన్నా ప్రకటిస్తే బాగుండును అనుకున్నంత భయం వేసిందట.

అమెరికాలో కొన్ని నెలలు గడిపి, స్వదేశం వొచ్చి, ఎసెక్స్‌లో వుంటూ గణిత శాస్త్రానికి సంబంధించిన తత్వశాస్త్ర గ్రంథ రచనకి పూనుకున్నాడు రసెల్. అతని కుటుంబంవారు ధనికులు. ఉద్యోగం చేసి రోజు గడుపుకోవల్సిన అవసరం ఆయనకి లేనందున కాలాన్నంతా తత్వశాస్త్రాల పరిశీలనలో వినియోగించగలిగాడు. వైట్‌హెడ్ అనే మరొక తత్వ శాస్త్రజ్ఞుడూ, ఈయనా కలిసి వ్రాసిన మూడు సంపుటాల గ్రంథం ప్రిన్సిపియా మాథెమాటికా అన్నది. మొదటి సంపుటి 1910 లో ప్రచురితమైంది. ఆయనకి ప్రపంచ ఖ్యాతి తెచ్చిన గ్రంథం ఇది. రసెల్ భావాల పరామర్శకి ఇది ముఖ్యం కాకపోయినా, ఒకటి రెండు సంగతులైనా ఈ గ్రంథం గురించి చెప్పకుండా విడిచెయ్యడం సబబుగా తోచదు.

ఈ గ్రంథాన్ని చదివి అర్థం చేసుకున్నవారు కొద్దిమందే. ఒకటి సంఖ్య అంటే ఏమిటి అని నిర్వచించేటందుకు ఇందులో 347 పుటలు పట్టిందిట. అంకెలు పవిత్రమైనవనీ, సున్న, మూడు, ఐదు - మొదలైన అంకెలలో అతీంద్రియ జ్ఞానానికి సంబంధించిన మాయ, దైవత్వం వున్నాయనీ, ప్రజలలో ఒక అభిప్రాయం వుంది. అట్లాంటి మాయ ఏమీలేదని బెర్ట్రండ్ రసెల్ గ్రంథం చదివాక తెలిసొస్తుంది. రెండు రెండూ కలిపితే నాలుగన్న విషయం, అనేకమంది అల్లా కలిపి చూశాక తేలిన సత్యం అన్న 'మిల్' వాదం తప్పంటాడు రసెల్. రెండు రెండు నాలుగు - అన్నది, ఒకటి సత్యం, అసత్యం అని ఎల్లా

అనలేమో, అట్లాంటి సత్యం - 'గజానికి మూడడుగులు' లాంటి సత్యం. మరొక విశేషం ఏమిటంటే, అంతకుముందు ఆదర్శ తత్వజ్ఞులైన బ్రాడ్లే, హెగెల్‌లు పరమాత్మ వొక్కటేననీ, సృష్టిలో ఏ వొక్కదాన్నీ విడమరిచి పరిశీలిస్తే, అసత్యంగా, ఐక్యతకి భిన్నంగా కనబడుతుందనీ, కావున పరమార్థ చింతనలో ఏకత్వం సాధించాలనీ బోధించారు ఈ బోధకి గొడ్డలిపెట్టు రసెల్ గ్రంథం ఒక ఉదాహరణ కన్ను చెడిందనుకుందాం పరీక్షకు వైద్యుని వద్దకు వెడితే - కన్ను ఇల్లా అవడానికి కారణం ఏమిటి? మెదడు, ముక్కు, చెవులు, బాగు న్నాయా? మిగత అవయవాలు ఎట్లా వున్నాయి? రోగి ఎట్లాంటి ఆహారం తింటున్నాడు? ఆ ఆహారం ఎట్లా లభ్యమైంది? ఆ ప్రాంతపు వ్యవసాయం ఎట్టిది? రవాణా సౌకర్యాలున్నాయా? అక్కడి ప్రభుత్వం ఎట్లాంటిది? ఆ ప్రభుత్వం పుట్టు పూర్వోత్తరాలెవ్వి? ప్రపంచ చరిత్ర ఎట్టిది? - ఈ విధంగా ప్రశ్నలడుగుతూ, కన్ను చెడిపోవడానికి, కారణాలు వెదికే వైద్యం లాంటిది జరిపేవారు, హెగెల్ వంటి ఆదర్శ తత్వజ్ఞులు. కంటిని వొక్కదాన్నీ, విడిగా మనం పరీక్ష చెయ్యొచ్చునంటాడు రసెల్. కంటిలోనికి ప్రవేశించే వెలుగు కిరణాలు, అవి తగలగానే శాకిడిని మెదడుకి చేరవేసే నాళాలు, మెదడు నుండి తిరిగి వొచ్చే వొత్తిడి - వీటిని పరీక్షిస్తే చాలునంటాడు రసెల్. కాబట్టి సమస్యలను విడమరిచి, వొక్కొక్కదాన్నీ ప్రత్యేకంగా, వేరు వేరుగా పరిశీలించా లన్నది రసెల్ ప్రచారం చేసిన తత్వం. తర్క శాస్త్రాన్ని, మానసిక శాస్త్రం నుండి విడగొట్టడం; తర్కం అన్నింటికీ కాక, కొన్నింటికే ఉపయోగపడు తుందని చూపడం - ఇవి కూడా రసెల్ తత్వశాస్త్ర పరిశీలన ఫలితాలు. ఉదాహరణకి ఏది మంచి, ఏది చెడ్డ? అన్న ప్రశ్నకి సమాధానం, తర్కశాస్త్రం వల్ల నిర్ణయం కాదు. ఏది కుడి. ఏది ఎడమ? అన్నది, వొక వ్యక్తి ఏ దిక్కున నిలబడ్డాడో, దాన్నిబట్టి వుంటుంది. అల్లాగే ఇది మంచి, ఇది చెడు అని పరోక్షంగా ఎవ్వరూ నిర్ధారణ చెయ్యలేరు. "ఫలానాది, నేను మంచిదిగా భావిస్తు న్నాను." అని మాత్రం అనగలం. అంటే, నైతిక విలువలు వ్యక్తిగతమైనవి - అన్నమాట. క్రైస్తవ మతం చెప్పినవి కొన్ని తప్పన్నారు. యూరప్‌లో, బలవంతులు బలహీనుల్ని చంపొచ్చునన్నారు; నార్డిక్ జాతివారు, అనార్యులని నాశనం చెయ్యమన్నారు; బోల్‌షెవిక్కులు కాని వారిని, బానిసలుగా చేసుకోవచ్చు నన్నారు బోల్‌షెవిక్కులు. ఈ దారుణాలు 'తప్పు' అని ఋజువు చెయ్యలేమని రసెల్ అంగీకరించాల్సి వొచ్చింది, తన తత్వం ప్రకారం ఇట్లాంటి ప్రతిఫలాన్ని ఎదుర్కొని స్వీకరించ గలగడం, ఆయన వైజ్ఞానిక నిజాయితీకి నిదర్శన.

అతీంద్రియ జ్ఞానాన్వేషణ, ఉద్రేకము, ఆయనకు గిట్టవు. యోగులు ఋషులు వట్ల ఆయనకు గురిలేదు. అయినా కేవలం తర్కం వల్ల, బుద్ధివల్ల ఋషులు చెప్పింది తప్పని ఋజువు చెయ్యలేమని అంగీకరిస్తాడు. తర్కం బుద్ధి, విజ్ఞాన శాస్త్రం - వొకప్రక్క, తపస్సు, అతీంద్రియ జ్ఞానం, సాధన మరొకప్రక్క మానవుడికి ఈ రెండూ కావాలి అని ఆయనే "అతీంద్రియ జ్ఞానం - తర్కం" అనే గ్రంథంలో చెప్పుకున్నాడు.

రాజకీయ రంగంలో స్థానం ఏర్పరుచుకోవాలని యత్నించాడు బెర్ట్రండ్ రసెల్. వ్యాపారం స్వేచ్ఛగా కొనసాగాలనే ఉద్యమంలో పాల్గొన్నాడు. 1907 లో పార్లమెంటు అభ్యర్థిగా పోటీ చేశాడు. స్త్రీల హక్కుల కోసం బయలు దేరిన ఉద్యమానికి ప్రతినిధిగా పోటీ చేశాడు. స్త్రీలకు వోటింగు హక్కు కావాలంటూ రసెల్ ఉపన్యసిస్తుండగా, జనం అల్లరిచేసి, సభలో రెండు ఎలుకల్ని వొదిలారు ఆయన భార్యపై కోడిగుడ్లు విసిరారు. ఎలెక్షన్‌లో రసెల్ వోడి పొయ్యాడు

రసెల్ దృక్పథంలో మార్పు 1901 సంవత్సరంలో వొచ్చిందనొచ్చు. సామ్రాజ్యవాదిగా, ఆనాటి బోయర్ యుద్ధాన్ని సమర్థించిన రసెల్, ఆ యుద్ధం తగదని గ్రహించాడు. అప్పటి విద్యా విధానంలో కాఠిన్యం వుందని తెలుసు కున్నాడు నేరస్థులను గూర్చిన చట్టాలు కొన్ని న్యాయ విరుద్ధంగా వున్నట్లు గ్రహించాడు పోటీతత్వం, వైషమ్యాలకు కారణమనీ, మానవుడు ఏకాకిగా వుంటున్నాడనీ, అతన్ని ఈ విషాద వ్యవస్థ నుండి విముక్తుణ్ని చెయ్యాలని, ఆ సంవత్సరంలో సంకల్పించుకుని, 'స్వేచ్ఛాజీవుల ఆరాధన' అనే వ్యాసం ప్రచు రించాడు ఇది మంచి రచన. కవితావేశంతో, ఊహా బలంతో కొన్నిచోట్ల ఖండ కావ్యంలా సాగిపోతుంది. అందువల్లనే కాబోలు, రసెల్‌కి ఈ రచన అంత నచ్చలేదంటాడు. కొన్ని వాక్యాలను పొందు పరుస్తాను.

"శక్తిని ఆరాధిద్దామా? మంచితనాన్నా? పెద్ద దేవుడుకి మొక్కుదామా? మన అంతరాత్మ సృష్టించిన వ్యక్తిలా పరిగణిద్దామా?"

కర్మ నిర్వర్తించడంలో, బాహ్య శక్తుల దౌర్జన్యానికి మనం లొంగి పోవాలి, కాని భావనలో, ఊహలో మనం స్వేచ్ఛాజీవులం; తోటివారి నుండీ, అల్పమైన ఈ భూగోళంపై పాకే శరీరాల నుండి బ్రతికున్న నాలుగు రోజులూ తుదకు మృత్యువు నుండి కూడా విముక్తులమైన స్వేచ్ఛాజీవులం ఈ బలంతో జిజ్ఞాసతో, కార్య రంగంలోకి దూకుదాం, కోర్కెలను జయిస్తే వొచ్చే శాంతితో ఆలోచనల నుండి విముక్తులమైనాక కళాజగత్తు కల్పించిన సౌందర్య దర్శనంతో,

లొంగని క్షుద్రశక్తిని లొంగదీసుకుందాం. కాలంతోపాటు మాసి, మారిపొయ్యే స్వలాభాపేక్ష తెచ్చుకున్న సంపదను కోరక, 'అహం' వేటకి లొంగక ఊహాలో విహరిస్తేనే స్వేచ్ఛాజీవులం."

కష్ట సమయంలో, తలొగ్గుదాం; జరిగిన వాటికి చింతించక ధైర్యంగా వుండటమే జ్ఞానం ...శారీరక బాధ, గతంలోని స్మృతులు, మృత్యువు, అతి విశాలమైన విశ్వాన్ని తిలకించడంతో ప్రత్యక్షమయ్యే మానవుడి అల్పత్వం - వీటి ముందు మనమూ, మన అల్పమైన కోర్కెలూ ఎంత? మనం ఏమైందీ పట్టించుకోని ఈ గోళం మనకేదో మేలు చెయ్యాలని కోరక, స్నేహితులు వొకరి తర్వాత వొకరు మృత్యువాత పడిపోతూంటే, ఏకాంతంగా మనం జీవిత సమరం సల్పాలి; ఈ మాయని చేదించాలి, ఇది తెలుసుకుంటే వీటిని జయించినట్లే.... స్వలాభాపేక్ష విడిచి, శాశ్వతమైన సత్యాన్ని తృష్ణతో అన్వేషించడమే స్వేచ్ఛా జీవి ఆరాధన. తోటి మానవుడి పట్ల కరుణ చూపుదాం. ఈ చీకట్లో తారట్లాడే వారే వారూను, యీ విషాద నాటకంలో వారూ పాత్రలే. వారి రంగం ముగిశాక వారి తప్పులు గతంలో అమరత గణించుకున్నాక, వారి కష్టాలకు మనం కారకులం అన్న బాధ మనకి వుండకూడదు. దివ్య జ్యోతి వారి హృదయాలని వెలిగించినప్పుడు, వారి వెన్నుమీద చరిచి, ధైర్యం చెప్పి, కరుణ చూపుదాం."

1901-1902 సంవత్సరాలలో, బెర్ట్రండ్ రసెల్, వివాహం గూర్చి తన అభిప్రాయాలు మార్చుకోవల్సి వచ్చింది ఆ రోజుల్లో ఆయనకి భార్య ఎలిస్‌కి అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి. ఆమె క్వేకర్ సంప్రదాయానికి చెందినది. ఈయన తెలివికి, చురుకుదనానికి తట్టుకోలేక పోయిందా? ఏమో! స్నేహితు లెవరన్నా వొచ్చినప్పుడు వారిలో బొత్తిగా స్తబ్దుగా కనబడ్డ వ్యక్తితో సంభాషణ ప్రారంభించేదిట. ఈ దంపతులు వొకరికొకరు దూరమైపోతూ 1911 లో విడిపోవడం జరిగింది. మరొక పదేళ్ళ తర్వాత విడాకులుచ్చుకున్నారు. మొదటి ప్రపంచ సంగ్రామ సమయంలో, ఇంగ్లండు యుద్ధంలో పాల్గొన కూడదని ప్రచారం చేశాడు రసెల్. అతని అన్న ఫ్రాంక్, ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయంలో బౌద్ధం స్వీకరించాడు, మూడుసార్లు పెండ్లి చేసుకున్నాడు. ఇద్దరు భార్యలతో వుంటున్నాడన్న నేరంపై జైలుశిక్ష పొందాడు. అనేక డబ్బు తగాదాలు, దావాలు, నష్టాలకు గురై దుర్మార్గుడుగా తయారవడం వల్ల, తమ్ముడు రసెల్ కూడా ఇట్లాంటివాడేనన్న అపవాదు వ్యాపించి, రసెల్ స్నేహితులు జారు కున్నారు. సంఘం మర్యాదలకు అతను అర్హుడు కాడన్నారు. వెలివేసినట్లు, రసెల్ ఏకాకిగా, తన పని తను చేసుకుంటూ గడిపిన రోజులవి. మాత్రైన

భావాలను దాపరికం లేకుండా చెప్పే స్వభావం రసెల్‌ది. స్నేహితులకు కూడా ఇది బాధగా వుండేది సిడ్నివెబ్ అనే ప్రసిద్ధ ఆర్థికవేత్తని తబ్బిబ్బు చేసిన భావం ఇది.

"ప్రజాస్వామ్యంలో వొక మంచి వుంది తమ ఓట్లిచ్చి ఎన్నుకున్న ప్రజలకంటె తెలివిహీనుడై వుండడు పార్లమెంట్‌కు ఎన్నికైన సభ్యుడు. సభ్యుడు ఎంత తెలివి తక్కువ వాడైనా, అతన్ని ఎన్నుకున్న వోటర్లు అతని కంటె తెలివితక్కువవాళ్ళై వుంటారు" హెగెల్ ఆదర్శతత్వాన్ని మెచ్చుకునే జె. ఎ. స్మిత్ అనే ఆయన్ని ఇబ్బంది పెట్టిన చలోక్తి వొకటుంది. పరమాత్మ మెదడులో వున్న భావాల సమీకరణే 'సత్యం' అన్నాడు స్మిత్.

"అంటే, పరమాత్మ నా తలమీద వెంట్రుకల్ని గురించి ఆలోచించడం మానుకుంటె, నాది బట్టతల అవుతుందనా మీ ఉద్దేశం?" అని రసెల్ ప్రశ్న. లైబరీలో క్లర్క్‌గా వుంటూన్నా 'బెర్రి' అనే ఆయన రసెల్‌కి ఇష్టుడు. ఇందుకు కారణం, వొక రోజు బెర్రి వొక కాగితంపై ఏదో వాక్యం వ్రాసి రసెల్‌కి ఇచ్చాడుట. ఆ వాక్యం ఇది :

"ఈ పుట వెనక వైపున వ్రాసింది అబద్ధం" అని. పుట వెనక్కు తిప్పి చదివితే "ఈ పుట వెనక వైపున వ్రాసింది అబద్ధం" అని వ్రాసి వుందిట. ఏది ముందు? ఏది వెనక? ఏది సత్యం? ఏది అబద్ధం?

మతం పేరిట పెద్ద కబుర్లు చెప్పే వారిలో కొందరు దయాదాక్షిణ్యాలు చూపరన్న రసెల్ భావం వెనక వొక ఉదంతం వుంది. ఒకాయన్ని గురించి పెద్దవాడుగా చెప్పుకునే వారుట. ఒక పనివాడు, త్రాగి, ఆయన తోటవైపు గోడ మీద, తిడుతూ ఏదో వ్రాశాడుట. దీని ఫలితంగా ఆ పనివాడికి శిక్ష పడింది. జైలు కెళ్ళాలి లేదా జరిమానా కట్టాలి. కట్టేటందుకు వాడి వద్ద డబ్బు లేదు. జైలుకెడితే, నౌకరీ పోతుంది. భార్య గర్భవతి, ఈ చిక్కులో పడ్డ ఆ పనివాడు రసెల్‌తో చెప్పుకున్నాడుట రసెల్ వెళ్ళి క్షమించవల్సిందిగా ఆయన్ని కోరాడుట నేరస్థుడు శిక్షపొంది తీరాల్సిందే అన్నాడుట ఆ కామందు. క్రీస్తు బోధించిన కారుణ్యం ఇల్లా పరిణమించిందా అనుకుని, జరిమానా డబ్బు తనే కట్టి ఆదుకున్నాడు రసెల్.

రసెల్ 1910 లో ట్రినిటీ కళాశాలలో తర్క, గణిత శాస్త్రాల ఉపాధ్యాయుడుగా చేరాడు 'తత్వశాస్త్ర సమస్యలు' అనే గ్రంధం వ్రాశాడు, ఈ రోజుల్లోనే. బాహ్య జగత్తును గూర్చి మనకేం తెలుసు? మనకి తెలిసింది 'సత్యం' - అన్నది నిర్ధారణ చెయ్యడం ఎల్లా? పుస్తకంలో ఇట్లాంటి ప్రశ్న

లుంటాయి. ఒక బల్లని గురించి మనకేం తెలుసు? చూపుకి వొగలాగుంటుంది బల్ల కొడితే వొకరకం చప్పుడవుతుంది. తాకితే వొకరకం స్పర్శ వుంటుంది. చప్పుడు, స్వరూపం, స్పర్శ - వీటి వెనక 'బల్ల' అనబడే పరమ సత్యం వేరే వొకటుందనుకోడం దేనికి? తాకినప్పుడు, తట్టినప్పుడు, స్పర్శించినప్పుడు బైట పడే ప్రత్యేక లక్షణాలే సత్యం 'బల్ల' అన్న వేరే సమిష్టి సత్యం లేదు. 'బల్ల' అన్నది తర్కం అల్లిన అమరిక - అదీ రసెల్ వాదం. దీని పర్యవసానం కొన్నాళ్ళు జరిగాక ఆయన అలవరుచుకుని ప్రచారం చేసిన తత్వం - పదార్థానికీ మనస్సుకీ - ప్రధానమైన తేడా ఏమీలేదు - అన్న సత్యం.

బాహ్య జగత్తుని గూర్చిన పరిజ్ఞానం - అన్న విషయమై రసెల్ 1914 లో ఇచ్చిన ఉపన్యాసాలు గ్రంథంగా వెలువడ్డాయి.

ఈ సంవత్సరమే ఆయన అమెరికా పర్యటించాడు. కొత్త భావాలని ఇంగ్లండ్‌లో హర్షించరు, అమెరికా వారు హర్షించడం చూసి సంతోషించాడు రసెల్. అక్కడ టి ఎస్. ఎలియట్ స్నేహితుడయ్యాడు. డబ్బుకి ఇబ్బంది పడుతున్న ఎలియట్ దంపతుల్ని తనతో వుండమన్నాడు. తర్కం గురించి ఈయన వ్రాసిన గ్రంథాన్ని ఎలియట్, 'నేషన్' పత్రికలో సమీక్షించాడు. తన భావాలు చక్కగా అర్థం చేసుకున్న వ్యక్తి ఎలియట్ వొక్కడేనని, తర్వాత హర్షం వెలిబుచ్చాడు రసెల్.

తొంభై నాల్గవ యేట, ప్రపంచశాంతి స్థాపన ఉద్యమం నెలకొల్పి నిర్వ హిస్తున్నాడు బెర్ట్రండ్ రసెల్. ఇందులో ప్రపంచంలో పేరుపడ్డ ఇన్‌స్టీన్‌లాంటి మేధావులూ, ప్రతిభాశాలులూ సభ్యులుగా చేరారు. మారణ యంత్రాల తయారీ నిలుపు చెయ్యవల్సిందిగా వివిధదేశాల నాయకులను కోరుతూ విశ్వశాంతి స్థాపనకై ఆయన ఈనాడు చేస్తున్న కృషి 1914 సంవత్సరం ఆగస్టులో రేగిన మొదటి ప్రపంచయుద్ధ కాలంనాడే ప్రారంభమైందనవచ్చు. ఆ యుద్ధం ప్రారంభ మైనప్పుడు, ఇదివరకు తాను తెలుసుకున్న భావాలు సరైనవికావనీ, మనిషి ప్రవర్తన శాసించేది ఉద్రేకం కాని తర్కబద్ధమైన వివేకం కాదనీ గ్రహించాడు రసెల్ : 'కీనీస్' లాంటి మేధావులు ఆనాటి యుద్ధకాండని హర్షించకపోయినా, తమ భావాలని పైకి ప్రకటించక యుద్ధ సమయపు పనులు పదవులు స్వీకరించి చేయూత నిచ్చినవారే. కొందరు యుద్ధాన్ని మర్చిపొయ్యేటందుకు, చిత్రలేఖ నానికీ, రచనకీ పూనుకున్నారు. ఒక యువకుడు అందంగా ముస్తాబై, రోడ్డు మీద నడుచుకుంటూ వెడుతుంటే "నీకు సిగ్గులేదూ - నీతోటి వారంతా ఖిలిటరి

దుస్తులు ధరించి యుద్ధానికెడితే, నువ్వు ముస్తాబై సోమరిగా తిరుగుతావా?" అందిట వొక ముసిలామె, ఆ యువకుడిపై కోపగించి. అంటే ఆ యువకు డన్నాడు: "వారంతా యుద్ధం చేస్తున్నది, నే ప్రదర్శిస్తున్న నాగరికత సంరక్షించడం కోసమే." రసెల్ ఆ యుద్ధం కూడదన్నాడు. దేశంలో వారంతా ఉద్రేకపూరితులై యుద్ధకాండ జరుపుతుంటే మనస్సు గాయపడి "నేను చనిపోతే బాగుండును" అనుకున్నాడు రసెల్ ఈ నైరాశ్యాన్ని విడిచేసి త్వరలోనే యుద్ధం నిలిపివేయ వల్సిందిగా ప్రచారానికి పూనుకున్నాడు. యుద్ధం నైతికంగా చెడ్డదని కాదు ఈయన భావం మంచిచెడులు, వ్యక్తిగతంగా నిర్ణయమౌతా యన్న వ్యక్తి, ఆయుద్ధం 'తప్పు' అని తాను నిర్ణయించకూడదు. కొనసాగించే వారి దృష్టిలో ఆ యుద్ధం మంచిదే కావచ్చు. గాంధీకి అహింస ఆచరణ యోగ్య మైన వొక ఆదర్శం రసెల్‌కి అల్లాకాదు. మొదటి ప్రపంచ సంగ్రామం కూడదన్నాడు కాని, అసలు యుద్ధం అనేది కూడదనలేదు. ఆయుద్ధం ఎందుకు కూడదో, ఆయన చెప్పిన కారణాలివి :

మొదటి ప్రపంచసంగ్రామం, రెండో సంగ్రామానికి దారితీసింది. రష్యాలో కమ్యూనిజమ్; ఇటలీ, జర్మనీలలో నియంతృత్వం, దాన్నుండి వొచ్చినవే .ఆ యుద్ధంలో ఇంగ్లండ్ పాల్గొని వుండకపోతే, ఏం జరిగేది? జర్మనీ గెలిచి వుండేది; అమెరికా యుద్ధంలో పాల్గొనేదికాదు. జర్మనీలో నియంతల రాజ్యం నెలకొల్పబడేది కాదు; రష్యాలో విప్లవం చెలరేగినా, కమ్యూనిస్టు విప్లవం లాంటిది చెలరేగి వుండేది కాదు. స్వాతంత్ర్యం, ప్రజా ప్రభుత్వము – వీటిని సంరక్షించి, సైనికప్రభుత్వ తత్వాన్ని నశింపు చెయ్యడం కోసం మొదటి సంగ్రామం సాగిందన్నారు. ఆ యుద్ధం ఫలితంగా, స్వాతంత్ర్యం సన్నగిల్లింది; సైనిక తత్వం పెరిగింది. ఇంక ప్రజాస్వామ్యం ముందు ఎట్లా ఉంటుందో చెప్పలేను. 1956 లో ప్రచురించిన 'జ్ఞాపకాలు' అన్న పుస్తకంలో స్మరించాడు. యుద్ధ సన్నాహాలని వ్యతిరేకిస్తూ ప్రచారం సాగించడంవల్ల రసెల్‌కి ప్రభుత్వంతో పోరు తప్పింది కాదు స్నేహితులంతా విరోధు లైనారు. ఒట్టోలైన్ మోరెల్ దంపతులు మాత్రం ఆతిథ్యమిచ్చి వారింట్లో సమా వేశాలు ఏర్పాటు చేసి ఆదరించేవారు. ఎవరెట్ ఉదంతంతో రసెల్ ప్రచారం కార్యరూపం దాల్చింది. ఎర్నెస్ట్ ఎవరెట్ అనే వ్యక్తి యుద్ధంకి అభ్యంతరం తెలిపిన వారిలో వొకడు. అతను సైనికుడుగా చేరక తప్పింది కాదు చేరాడు. ఉత్తరువులు ఉల్లంఘించాడన్న మిషపై రెండు సంవత్సరాలు కఠిన శిక్ష విధించారు ఈ శిక్షాకాండని విమర్శిస్తూ కరపత్రాలు పంచి పెట్టిన ఆరుగుర్ని

బందీ చేశారు. ఆ కరపత్రం వ్రాసింది నేనేనని రసెల్ చెప్పాడు 1916 జూన్ 15 వ తేదీని, లార్డ్ మేయర్ సమక్షాన జరిగిన తీర్పుకి రసెల్ హాజరై తనే వాదించాడు. రసెల్ నేరస్థుడని నిర్ణయించి వంద పౌన్లు జరిమానా కట్ట మన్నారు. జూలైలో ట్రినిటి కళాశాలవారు, ఈయన్ని ఆచార్య పదవి నుండి తొలిగించారు తన ప్రచారాన్ని కొనసాగిస్తూ, 'సమాజ పునర్నిర్మాణ సూత్రాలు' (Principles of social Reconstruction) అనే గ్రంథం వ్రాయడం, స్టాన్లీ అన్విన్ సాహసించి దాన్ని ప్రచురించడం జరిగింది.

మానవ శ్రేయస్సు నాశించి, సామాన్య ప్రజకి అర్థమయ్యేలాగు రసెల్ వ్రాసిన మొదటి గ్రంథం ఇది ఇట్లాంటివి పాతిక గ్రంథాలు వ్రాశాడు. జర్మనీ లోనేకాక, జపాన్, ఇండియా దేశాలలో, రసెల్‌కి ఖ్యాతి తెచ్చిపెట్టినవి ఈ గ్రంథాలే.

ట్రినిటి కళాశాలలో ఉద్యోగం పొయ్యాక, ఏం చెయ్యాలో ఆలోచిస్తూ ఉండగా, అమెరికావారు 'హార్వార్డ్'లో వొచ్చి ఉపన్యసించవల్సిందిగా ఆహ్వానించారు కాని, ఈ ప్రయాణానికి ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. 'రాజకీయాల వెనక వున్న తత్వశాస్త్ర సూత్రాలు' అన్న విషయంపై ఉపన్యసించదలచి వ్యాసాలు వ్రాశాడు కాని, ప్రభుత్వం, ఆ ఉపన్యాసాలు, సముద్రతీరపు పట్టణాలలో ఇవ్వకూడదనీ, కావాలంటే, సముద్ర తీరానికి దూరంగా వున్న ప్రాంతాలలో ఇవ్వవచ్చనీ, ఉత్తరువు చేశారు సముద్ర తీరపు పట్నాల నుండి, శత్రువులకు సంజ్ఞలు, రహస్య వార్తలు పంపుతాడన్న భయంతో ప్రభుత్వం ఇట్లా శాసించిందిట. "ఒక ప్రాంతంలో ఇవ్వతగ్గ ఉపన్యాసం, మరో ప్రాంతంలో ఎందుకివ్వకూడదు?" అని ప్రశ్నించాడు రసెల్ నిజానికి, ఈ ఉపన్యాసాలు విన్న యుద్ధ సామగ్రి తయారు చేసే కర్మాగారాలలో పనిచేసే పనివాండ్ర శిక్షణ - కుంటుపడుతుందని ప్రభుత్వం భయపడినట్లుంది. ట్రిబ్యునల్ పత్రికలో రసెల్ వ్రాసిన వ్యాసం ప్రభుత్వం దృష్టి కొచ్చింది. అందులో కొన్ని భాగాలు;

"శాంతి నెలకొల్పుకోకపోతే యూరప్‌లో క్షామం తాండవిస్తుంది. తిండి కోసం, వొకరితో వొకరు తగువులాడుతారు. అమెరికా యుద్ధ దళాలు, ఇంగ్లండ్‌లో స్థావరం ఏర్పరుచుకుంటాయి. ఈ భావాలు ప్రభుత్వంకి తెలుసు ననుకోను. అసలు వారి మెదడులో ఏ రకమైన భావం కూడా లేదనుకోడానికి నిదర్శనాలున్నాయి." కోర్టులో హాజరుకమ్మన్నారు రసెల్‌ని. విచారణ జరిపి, ఆరు మాసాలు శిక్ష విధించారు బ్రిక్స్టన్ చెరసాలలో వుంచారు. కొంచం పెద్ద గది ఇచ్చారు. దానికి వారానికి రెండున్నర షిల్లింగులు అద్దె చెల్లించాలి

రసెల్. "ఇవ్వని పక్షంలో ఈ గది ఖాళీ చెయ్యమంటారా?" అని జైలు అధికారిని ప్రశ్నించాడు రసెల్. గదిలో ప్రవేశించగానే పుగాకు ఇవ్వరు. వ్రాత పరికరాలు, గ్రంథాలు ఇస్తారు. జైలులో కొన్ని రచనలు చేశాడు.

"శరీరాన్ని బంధించవచ్చు, కాని మనస్సుకి ఎప్పుడూ స్వేచ్ఛే. ఊహలో, బ్రెజిల్, చైనా, టిబెట్, ఫ్రెంచ్ విప్లవం - ఇవన్నీ చూశాను. లోకం అంతా వొక పెద్ద జైలులో బంధించబడింది. నేను స్వేచ్ఛా జీవిని, లోకాన్ని కూడా స్వేచ్ఛా జీవిగా చెయ్యాలి." అని వ్రాసుకున్నాడు.

జైలు నుండి విడుదలయ్యాక, మనస్సు స్వరూపాన్ని పరామర్శిస్తూ వ్రాసిన వ్యాసాలని, మొదట్లో ఉపన్యాసాలుగా వినిపించి, తరువాత ది ఎనాలిసిస్ అఫ్ మైండ్ (The Analysis of Mind) గ్రంథంగా వెలువరించాడు. కొందరు స్నేహితులు పోగై; మూడేళ్ళపాటు ఉద్యోగం కోసం దేవులాడక రసెల్ గ్రంథ రచన చేసే అవకాశం కల్పించ సంకల్పించి - కొంత నిధిని సేకరించి, రసెల్‌కి ఇచ్చే ఏర్పాటు చేసి మనస్సు స్వరూపం గూర్చిన ఉపన్యాసానికి పారితోషికంగా కొంత ముట్టచెప్పారు. యుద్ధం ముగియగానే, ఆ నిధిని కూడా నిలిపివెయ్యమన్నాడు రసెల్ మనస్సు గూర్చిన గ్రంథంలో - బుద్ధి ప్రజలనుకున్నంత మానసికమైంది కాదనీ; అల్లాగే పదార్థం, అందరూ అనుకున్నంత స్థూలమైంది కాదనీ, ఈ రెంటికీ మూలం, కాస్తంత మనస్సు, కాస్తంత పదార్థం కలిసినదనీ, పేర్కొనబడింది ఒక వస్తువు ఎర్రగా వుందంటే, ఆ ఎఱ్ఱదనం మనస్సు సృష్టించింది. ఆ సృష్టి, ఆ ఎఱుపూ - రెండూ ఒకటే అవుతాయి. అల్లాగే, వస్తువుల్నీ, బాహ్య జగత్తునీ గురించి, జిజ్ఞాస కనబరిచే మెదడు కూడా, వొక మానసికమైన సృష్టే మెదడు పని - చూడ్డం, వినడం, స్పృశించడం మటుకే. అది తటస్థంగా వుంటుంది. ఇవిగాక, అలోచనలు, భావాలు, కోర్కెల్లూ కూడా వున్నాయి. ఇవి కూడా, జిజ్ఞాస సృష్టించినవే అనుకుంటే, మనస్సు కూడా తటస్థంగా వుండే వొక చైతన్యం యొక్క సృష్టి— అదీ రసెల్ వాదం.

మొదటి యుద్ధానంతరం, సామ్యవాదం స్వీకరించాడు. ఈనాడు సామ్యవాదం అంటె, పరిశ్రమల్ని ప్రభుత్వమే నిర్వహించాలన్న వాదంగా ఎంచుతారు. కాని రసెల్, పరిశ్రమలు, అందులో పని చేస్తున్నవారే నిర్వహించాలంటాడు. ప్రభుత్వాలు ఎక్కువ అధికారం చెలాయించడంవల్లనే ఈనాటి అరిష్టాలు ప్రబలాయని ఆయన భావం పదవుల్లోవున్న అధికారులు, ఇతరుల స్వేచ్ఛని అరికడతారంటాడు. 1917 వ సంవత్సరం జనవరిలో రష్యాలో జరిగిన విప్లవం పట్ల

హర్షం వెలిబుచ్చాడు కాని రష్యాదేశం సందర్శించి వొచ్చాక, ఈ అభిప్రాయం మార్చుకున్నాడు. ఒక పారిశ్రామిక బృందంతో కలిసి, రష్యాలో వొక నెల గడిపాడు. ట్రాట్‌స్కీని కలిసాడు, తినుబండారాలకోసం, పొడుగాటి క్యూలలో నిలబడేవారు జనం అనాడు. గొడుగు కొనాలంటె, ఎంతో తంతు జరగాలి. బీదతనం, దైన్యం కనబడేది. తాగుబోతులు అంతగా లేరు. వేశ్యావృత్తి బాగా తక్కువ. లెనిన్‌ని కలిశాడు. రక్తపాతం, విప్లవం లేకుండానే ఇంగ్లండ్‌లో సామ్యవాద వ్యవస్థ నెలకొల్పే అవకాశం ఉందన్నప్పుడు, 'అల్లా ఎప్పుడూ జరగదు' అన్నాడుట లెనిన్.

రష్యాలో తాను చూసిన వాటి నాధారంగా, సార్వజనీన సమాన సామ్య సిద్ధాంతం — అనుసరణ — అనే గ్రంథం వ్రాశాడు. రష్యావారు ప్రదర్శించిన విశ్వాసాన్ని, శక్తి సామర్థ్యాలన్నీ కనీసపు అవసరాల సాధనలో పొందిన విజయాన్ని కొనియాడినా; మొత్తం మీద, ఆ వ్యవస్థని హర్షించలేదు రసెల్. "నేను ఆ వాతావరణంలో సుఖంగా వుండలేను. ప్రేరణ, సౌందర్యం, ప్రేమ వీటిపట్ల అక్కడ ఆదరణ లేదు. కేవలం శారీరక వాంఛలను తృప్తిపరిచేపనిలో లీనమైనారు అక్కడి నాయకులు. నేను ఆకలి దప్పులను ఎరగను, నిజమే. కాని, ఆకలిదప్పులు తీరడంతో, జ్ఞానం సమకూరుతుందా?" అని వొక లేఖలో తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. ప్రభుత్వాన్ని వ్యతిరేకించినవారిని నిర్దాక్షిణ్యంగా అణిచివేస్తారు, అక్కడి నియంతలు. భావ స్వాతంత్ర్యంవల్లనే మానవుడు పురోగమిస్తాడు అని నమ్మిన రసెల్‌కి, రోమ్‌లో మత గురువులూ, రష్యాలో బోల్‌షె వెక్కులూ దూరులు. మతం పేరిట ఇతరులని హింసించినట్లే నియంతలు హింసిస్తారు. జాతీయ భావం, మతం, అధికార వాంఛ—మనుషులపై వీటి ప్రభావం ఎంతో ఉంటుంది. కాని మార్క్సు సిద్ధాంతం, ఆర్థిక ప్రభావాన్ని గుర్తించింది. కాబట్టి ఇంగ్లండ్‌లో, పరిశ్రమలు నడిపేవారే పరిశ్రమలను స్వాధీనం చేసుకునే వర్గాల సామ్యవాదం నెగ్గుతుందని రసెల్ అభిప్రాయం. వ్యక్తిపట్ల గౌరవానికీ, గుంపు శ్రేయస్సుకీ పూర్తిగా పొత్తు కుదరదు. "వ్యక్తిగా మానవుడిలో మంచి ఉంది, — సమాజాలతో కాదు" అన్నది రసెల్ నిర్వచనం. వ్యక్తి గౌరవం, గుంపు శ్రేయస్సు - ఈ రెండూ ఆయనకి కావాలి. కాని వాటిని ఎల్లా సమన్వయపరచేదీ ఆయన తేల్చుకోలేక పోయాడు అనాడు. ఈ కారణంగా రష్యా పట్ల సానుభూతి గల స్నేహితుల్ని పోగొట్టుకున్నాడు రష్యా గురించిన పుస్తకం 1920 లో వ్రాశాడు. 1962 వరకూ ఐదుమార్లు ఈ పుస్తకం ముద్రణైంది. 1948 లో దీనికి పీఠిక వ్రాస్తూ "ఆనాడు, కమ్యూనిజమ్ అన్న

పదానికి బదులు (సోషలిజమ్) సామ్యవాదం అన్న పదాన్ని వాడడం సముచితం. ఈ పుస్తకం ఈనాడు తిరిగి వ్రాస్తే, కొన్ని సంగతులు చెప్పే తీరులో మార్పు ఉండొచ్చునేమో, కాని ప్రధాన విషయాలు; 1920 లో చెప్పినవే, ఈనాటికీ వర్తిస్తాయి అనాడు నే చెప్పిన మార్పులే ఇంచుమించు జరిగాయి"

1919 వ సంవత్సరంలో, ట్రినిటి కళాశాలవారు, రసెల్ ని ఆచార్యునిగా నియమించారు ఆ రోజుల్లోనే 'డోరాబ్లాక్' అను నామెతో స్నేహం కలిసింది. ఆచార సంప్రదాయాలని అతిక్రమించి, స్వేచ్ఛగా ప్రవర్తించే స్వభావం గల యువతి ఆమె. "నన్ను ఆమెతో వొంటిగా విడిచి వెళ్ళకండేం" అని స్నేహితుల్ని బతిమలాడేవాడుట రసెల్ మొదట్లో ఎలీస్ కి విడాకులివ్వాలి ఇది కారణంగా, ట్రినిటి కళాశాలవారు, తిరిగి అతన్ని ఉద్యోగంలోంచి తొలగించకుండా, తనే ఆ పదవికి రాజీనామా యిచ్చి, డోరాబ్లాక్ తో కలిసి, పెకింగ్ ప్రభుత్వ విద్యాలయంవారి ఆహ్వానాన్ని పురస్కరించుకుని, చైనా వెళ్ళాడు రసెల్ 1920 లో. దీని ఫలితంగా "చైనా సమస్య" అనే గ్రంథం వ్రాశాడు. రాజకీయ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలంటే, పాత అలవాట్లను, సంప్రదాయాన్నీ విడనాడి, దేశ శక్తి కనబరుస్తూ సైనిక తత్వాన్ని పెంపొందించుకోవాలి చైనా, అని సూచించాడు ఈ పుస్తకంలో. కాని ఈ పురోగమనం, శిక్షణతో జరగాలి – లేకుంటే చైనీయులు, ఉద్రేకులై, బోల్షెవిక్కుల తత్వాన్ని అలవరుచుకునే ప్రమాదం వుంది. స్వాతంత్ర్య కాంక్ష పెరిగితే, సామ్రాజ్య కాంక్ష కూడా పెరగొచ్చు. చైనా వారి సమస్య రెండు విధాలైనది సైనిక నియంతృత్వం అలవరుచుకోకుండా, శక్తివంతమైన జాతిగా తయారవడం వొకటి; పాశ్చాత్యపారిశ్రామిక తత్వం సంక్రమింపజేసే అరిష్టాలు విసర్జించి, విజ్ఞానశాస్త్రం ద్వారా ఆకలి జయించడం రెండోది. మానవత్వపు విలువల్నీ, విజ్ఞానశాస్త్ర సాధననీ, సమన్వయపరిచే సూత్రాలని, డోరాబ్లాక్ తో కలిసి వ్రాసిన "పారిశ్రామిక నాగరికత భవితవ్యం" అనే గ్రంథంలో చర్చించాడు. సన్-యాట్ సెన్, రసెల్ ని మెచ్చుకున్నాడు. ఆయన భావాలను ప్రచారం చేసే నిమిత్తం, 'రసెల్ పత్రిక' ని వొకదాన్ని ప్రచురించారు. అక్కడి మత గురువులు మాత్రం ఆయన భావాలని విమర్శించారు. నాస్తికుడై వుండి కూడా, నీతిపరుడుగా, ఆదర్శ జీవిగా వుండొచ్చునన్న భావాన్ని ఖండించారు చైనాలో రసెల్ కి పెద్ద జబ్బు చేసింది. డోరాబ్లాక్ సపర్యలు చేసింది. కొన్ని రోజులు హాస్పిటల్ లో వుండి, తేరుకుని స్వదేశానికి చేరుకున్నాడు.

స్వదేశానికి రాగానే, డోరాబ్లాక్ ని వివాహమాడాడు. చెల్సీలో వొక ఇంట్లో స్థిరపడ్డాడు. ఈమె ద్వారా ఇద్దరు సంతానం కలిగారు.

1922, 1923 లో జరిగిన ఎన్నికలలో, లేబర్ అభ్యర్థిగా పోటీచేసి, వోడిపొయ్యాడు. ఓట్లు సంపాదించిపెట్టే వొక వ్యక్తి వ్యాధిగ్రస్తుడై వుండగా, అతన్ని హాస్పిటల్‌లో పువ్వులు తీసికెళ్ళి, సందర్శిస్తూ వుండగా ఫోటోతీయించు కోవాల్సిందని, స్నేహితులు సూచించగా, 'అతనంటె నాకిష్టంలేదు – వెళ్ళి చూడను' అన్నాడుట రసెల్.

గ్రంథ రచనతో డబ్బు గడించేవాడు. అమెరికాలో ఉపన్యసించి, డబ్బు గడించాడు. అక్కడ రైళ్ళు సకాలానికి రావడం, ఉపన్యాసాలకి జనం ఎగబడ్డం గమనించతగ్గవన్నాడు. అక్కడి పురుషులు డబ్బు గడించే పరిశ్రమలో నిమగ్నులై ఉండడంమూలాన; స్త్రీలే, సంస్కృతి, కళలను ఆరాధిస్తున్నారన్నాడు. లలిత కళలన్నిటిని గురించీ కాస్త కాస్త తెలుసుకోవాలన్న సరదా ఉన్నందున, ఏదీ క్షుణ్ణంగా రాక, అమెరికావారి సంస్కృతి - పైపై మెరుగేనన్న అభిప్రాయం వొకటి చలామణి అవుతోందన్నాడు

తీరని కోర్కెలపట్ల మనిషిలో అసంతృప్తి ఏర్పడుతుంది. అమెరికావారి తీరని కోరిక, విశ్రాంతి. అది లేనందువల్లనే అక్కడ నేరాలు అంత ఎక్కువగా జరుగుతాయన్నాడు. స్వలాభాపేక్ష లేకుండా, సౌందర్యాన్ని గురించి పట్టించుగోరు అమెరికావారు, రష్యావారిలాగానే – అని రసెల్ తీర్పు సారాంశం. ఆయన వెలిబుచ్చిన భావాలను, మనదేశ పరిస్థితులకు ఎంతవరకూ వర్తిస్తాయో, ప్రశ్నలు వేసుకుని తనకి తానే పాఠకుడు పరిశీలించుకోవాలని కోరాను ఉదాహరణకి అమెరికాలో స్త్రీలే కళలను గురించి పట్టించుకుంటున్నారన్న భావం చూడండి. ఇందుకు కారణం, పురుషులు ధనార్జనలో నిమగ్నులు కావడం, అని పేర్కొన్నాడు. మన దేశంలో, పురుషులు చాలామంది పదవుల్ని వేటాడ్డంలో, కొందరు ఉద్యోగాలలో అవినీతి పద్ధతుల ద్వారా డబ్బు చేసుకోడంలో, నిమగ్నులై వున్నందున, స్త్రీలే కళలని పెంపొందిస్తున్నా రనగలమా? ఈ కారణంగా ఈనాడు ఇందరు రచయిత్రులు బయలుదేరారనడం సమంజసమా? ఇల్లాంటి ప్రశ్నలు వేసుకుని సమన్వయం కుదుర్చుకోవాలన్న మాట అమెరికాలో, మానసిక శాస్త్రానికి ఎక్కువ ప్రచారం వుండేది ఆనాడు విశ్వవిద్యాలయాల వ్యవహారాలలో ధనికులైన పారిశ్రామికుల జోక్యం వుండేది ఇందుమూలంగా, వారికి ఇంట్లో స్వేచ్ఛ, బైట బానిసత్వం వుందన్న రసెల్ భావం, మన విద్యాలయాల విషయంలో, ఎంతవరకూ వర్తిస్తుంది?

పరమాణువు, ఐన్‌స్టీన్ 'రెలిటివిటి' సిద్ధాంతం, పదార్థం యొక్క నిజస్వరూపం గురించి మూడు పుస్తకాలు వ్రాశాడు రసెల్, ఈ సమయంలోనే.

ఐన్‌స్టీన్ రెలిటివిటి సిద్ధాంతం అతి కష్టమైనది. ఏ ఇద్దరి ముగ్గురికో తప్ప, అర్థం కాదంటారు. ఈ సిద్ధాంతం ఏమిటో విడమరిచి, అర్థమయ్యేలాగు చెప్పడంతో రసెల్ కృతకృత్యుడయ్యాడనిపిస్తుంది. 1919వ సంవత్సరం మే నెలలో జరిగిన సూర్య గ్రహణం, రెలిటివిటి సిద్ధాంతాన్ని బలపరిచింది. సూర్య గోళం వెనక వున్న నక్షత్రం కనబడ్డం మూలాన, కాంతి వొంపు తిరగగలదు, కేవలం తిన్నగానే ప్రయాణం చేస్తుంది అనుకోనక్కర్లేదన్న ఐన్‌స్టీన్ చెప్పిన దాన్ని ఋజువు చేసింది యీ గ్రహణం. స్థలం వొంపు తిరిగి వుంటుందనీ, పరిమితమైందనీ, (నారింజ పండుపై తిరుగాడే చీమ, ఆ పండు అనంతం అనుకుంటుంది. నిజంగా పండు పరిమితమైనదే) స్థలం కాలం విడివిడిగా కాక, రెండు కలిపిన నాలుగో పరిమాణం వొకటుందనీ, 'డైనమిక్' అన్న ఆంగ్ల పదానికి ఇదివరలో వున్న, 'ఉద్వేగమైన', అనే అర్థం ఇప్పుడు లేదనీ, మొదలైన విషయాలు రెలిటివిటి సిద్ధాంతం యొక్క ఫలితాలని రసెల్, రెలిటివిటి గురించి వ్రాసిన పుస్తకంలో విపులీకరించాడు.

రెండో వివాహం జరిగాక, రసెల్, మతాన్ని తిడుతూ, సంప్రదాయ విరుద్ధమైన స్వేచ్ఛా భావాలని ఘాటుగా వెలిబుచ్చసాగాడు. క్రైస్తవ మత సూక్తులను కొన్నింటిని మెచ్చుకున్నా; జ్ఞానం, నీతి, విషయాలలో సోక్రటీస్, బుద్ధుడు అంతటి ఘనుడు ఏసుక్రీస్తు కాదంటాడు తన వాదం అంగీకరించని వారిపై కోపగించుకుని, పగ సాధించే స్వభావం కలవాడు క్రీస్తు అంటాడు. నరకాన్ని సృష్టించి ప్రజలని హడలగొట్టాడంటాడు. "దయాదాక్షిణ్యాలు గల వ్యక్తి, ఇట్లాంటి భయాలని రేకెత్తిస్తాడనుకోను" అంటాడు. పాపం, నరకం — ఈ రెండూ మత ప్రవక్తలు కల్పించినవే. వీటి ఫలితం మానవుడిలో పాపాలు చేసి, నరకానికి పోతామన్న భయం ఏర్పడిపోవడం విద్యా విధానం ఈ భయాలకి దోహదమిచ్చేదిగా వుంది. కాబట్టి కొత్త విధానం నెలకొల్పి, పసి వాళ్ళని ఈ భయాన్నుండి విముక్తుల్ని చేసి స్వేచ్ఛాజీవులుగా రూపొందించాలన్న వుద్దేశంతో, 1927 లో డోరారసెల్, తనూ కలిసి, వొక పాఠశాల స్థాపించి, నడిపారు వారి సంతానం కూడా అందులో విద్యార్థులు. డోరారసెల్ తనకంటె స్వేచ్ఛగా, ఘాటైన భావాలు వెలిబుచ్చే స్వభావం కలదైనందున, ఈ పాఠశాల ఎక్కువగా, పత్రికల ద్వారా ప్రచారం పొంది, తీవ్ర విమర్శలకు గురైంది. ఒక కథ అమెరికాలో చెప్పుకునేవారు. ఒక రోజున ఆ ప్రాంతపు మత బోధకుడు పాఠశాలకు వెళ్ళగా వస్త్రాలు ధరించక నగ్నంగా వున్న పిల్ల తలుపు తీసి ఆహ్వానించే సరికి ఆయన చకితుడై 'హా దైవమా!' అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడుట. 'దైవం లేదుగా!' అందిట ఆ పిల్ల తలుపు మూస్తూ.

నా దేశం గొప్పదని పాఠశాలలో బోధిస్తారు. దేశభక్తి ఇతర దేశాలపట్ల అసహనంగా ప్రబలుతుంది పిల్లలు ఎదిగాక. యుద్ధానికి కాలుదువ్వే మనస్తత్వం ఏర్పడుతుంది. ఈ మనస్తత్వం స్థిరపడిపోతే, కొత్త భావాలు స్వీకరించడం వుండదు. సత్ప్రవర్తన ఒక అలవాటుగా వ్యక్తమవాలిగాని, కోర్కెలను అణగ ద్రొక్కుకుని, సహజశక్తులను చంపుకోడం ద్వారా కాకూడదని రసెల్ అభి ప్రాయం వ్యక్తిత్వాన్ని చంపుకోడం ద్వారా నీతి అలవరచుకొంటె, దానివల్ల కొన్ని ప్రమాదాలున్నాయంటాడు. క్రమశిక్షణ, మనం అనుకున్నంత ముఖ్యం కాదంటాడు. 'అల్లా చెయ్యి, ఇల్లా చెయ్యకు' అని కఠినంగా శాసించడం వల్ల, బాలుడు, తన కోపాన్ని, అసహనాన్ని తాత్కాలికంగా దిగమింగడం; ఆ దిగ మింగింది కొంత కాలం గడిచాక ద్వేషంగా రేగడం తప్పదంటాడు. మనశ్శాస్త్ర జ్ఞులు ఇదే చెప్తున్నారు. ఉద్రేకాలను బాగా మేపి, బుద్ధిని మాడ్చడం — ఇదీ సంప్రదాయ విద్యాబోధలోని లోటు ఈ అభిప్రాయాన్ని పూర్తిగా స్వీకరించడం కష్టం. క్రమశిక్షణ పొంది ఉద్రేకాన్ని అదుపులో వుంచుకోడం నేర్చుకున్న వారే ఘనకార్యాలు చెయ్యగలుగుతారు రసెల్, స్వార్థాన్ని అదుపులో వుంచి శిక్షణకి గురయ్యాడు కావుననే, ప్రజాహిత కార్యాలు చెయ్యగలిగాడు. బీకన్‌హిల్ వద్ద తాను నిర్మించిన ప్రాథమిక పాఠశాలలో - ఏదీ తప్పని దిగమింగకుండా వుండటం, స్వేచ్ఛగా — లోపలొకటీ, పైకొకటీ లేక - ప్రవర్తించడం — వీటికే ప్రాముఖ్యం వుంది.

"పిల్లలు ఇష్టమొచ్చినట్లు మాట్లాడవచ్చు, ప్రవర్తించవచ్చు, నిషేధాలు లేవు. అయ్యవార్లు దద్దమ్మలు అని తోస్తే, పిల్లలు ఆ విషయం మా మొహం మీదనే అంటారు పెద్దలపట్ల భక్తి గౌరవాలు చూపాలన్న నియమం విసర్జిం చాం" అన్నది వారి నియమావళిలో భాగం. ఒకర్ని ఒకరు హత్య చేసుకునే ఆటలు ఆడుకునేవారుట బాలబాలికలు. చివరికి అందర్నీ హత్య చెయ్యడం వారికి సరదాగా వుండేదిట. పదిపన్నెండేళ్ళ బాలబాలికలు పెండ్లి, ప్రేమలని వితర్కిస్తూ పాత్రలు ధరించి, నాటకాలు ఆడటం చూసి ప్రేక్షకులు ఆశ్చర్యపడే వారుట.

ఈ పాఠశాల తృప్తికరంగా కొనసాగినట్లు లేదు సరైన ఉపాధ్యాయులు దొరక్కపోవడం, ఒక కారణం. ఇళ్ళల్లో వాళ్ళ అల్లరితో వేగిపోయి భరించ లేక, కొందరు దంపతులు తమ సంతానాన్ని ఈ పాఠశాలకి పంపితే, వారు పెట్రేగిపోయి, గంద్రగోళమైన వాతావరణాన్ని నెలకొల్పగలరన్న భయం మరొక కారణం. తోటలో నిప్పు రాజెయ్యకండి అని నిషేధించారు రసెల్

దంపతులు. వెంటనే ఒక బాలుడు, బాలిక నిప్పురాజేసి, తగులబెట్టారుట. కుర్రవాణ్ణి పంపించి వేశారు. బాలికని గదిలో పెట్టి తాళం పెట్టారు. "తలుపు తెరిస్తే, వెళ్ళి మళ్ళా నిప్పుపెడతావు, అవునా?" అన్నాడుట బాలికతో. "అవును, పెడతానేమో" అందిట బాలిక. పాఠశాలవల్ల సాలుకు వెయ్యిపౌన్లు నష్టం కలిగింది రెండవ వివాహం భగ్నంకాగానే రసెల్ ఈ పాఠశాలతో సంపర్కం వొదులుకున్నాడు. డోరారసెల్, రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమయ్యేవరకూ పాఠశాలను నడిపింది.

విద్యాభ్యాసం గురించి రెండు పుస్తకాలు వ్రాశాడు రసెల్. బాలబాలికల విద్య గురించి వొకటి, సమాజ నిర్మాణం, విద్యా విధానము — అన్నది మరొకటి ఫ్రాయిడ్ మొదలైన మనశ్శాస్త్రజ్ఞులు 'సెక్స్'కి బాల్యంలో ఎంతో ప్రాముఖ్యం ఇచ్చారు. ఇది అందరి పిల్లల పట్లా నిజం కాదంటాడు రసెల్. పిల్లల పోషణ, తలిదండ్రులకు వప్పగించక, ప్రభుత్వం జరపాలన్న కొందరి వాదాన్ని ఖండిస్తాడు. పిల్లలకి బాల్యంలో తలిదండ్రుల ప్రేమ, ఆదరణ, చాలా అవసర మంటాడు. అన్ని రకాల పిల్లలతోనూ, బాలుడు కలిసిమెలిసి తిరగడం మంచిదన్న వాదాన్ని ఖండిస్తూ .

"అందరితోనూ కలిసిమెలిసి వుండడంవల్ల పిల్లలు ఎంతో మానసికమైన బాధపడతారు. ఇల్లా కలవడం వల్ల మేలు సమకూరుతుందనుకోడం వెర్రి. పెరిగాక, అందరూ మిగత అందరితోనూ, కలిసి మెలిసి తిరగరు. ప్రచురణ కర్తలు, మతగురువులతోనూ, మతగురువులు ప్రచురణకర్తలతోనూ కలిసి మెలగరు." అని వ్రాశాడు ఈ పుస్తకాలలోని భావాలు, చాలా వాటిని స్వీకరించ నక్కర్లేదు అన్నప్పటికినీ, ఇవి ఈనాటికీ తెలుసుకో తగ్గవే.

సెక్స్ పట్ల కొత్త దృక్పథం వొక తరం యువకులు అలవరచుకున్నారంటె, అందుకు కారణం, చాలావరకూ రసెల్ రచనలే. వెనకటి తరం వారు సెక్స్‌ని గురించి పట్టించుకోక, అదొక రహస్యమైన ఉదంతంగా దాచడం రసెల్, షా మొదలైన వారికి నచ్చలేదు. అందులో పెద్ద రహస్యం, మాయ, ఏమీలేవనీ, పిల్లలకి దాన్ని గురించిన భోగట్టా అంతా చెప్పివెయ్యాలనీ రసెల్ భావం దీన్ని గురించిన వివరాలు దాపరికం లేకుండా, పూర్తిగా కుర్రవానికి చెప్పివేస్తే, దానిపట్ల అసక్తి నశించి, విసుగెత్తి, 'ఇంక ఈ విషయం నాకు తెలియనక్కర్లేదు, బాబో' అంటాడు, కుర్రవాడు. ఇది చెప్పడం సులువే. సెక్స్‌లో మాయ ఏమీ లేదు, శిశువు పుట్టడం, మోటారు కార్ తయారీ రెండు వొకటేనంటే, నమ్మడం కష్టం సృష్టి, మరణం — వీటిల్లో వైచిత్రి లేదు.

విసుగు పుట్టించే విషయాలనన్నా కూడా నమ్మడం కష్టమే వీటిని రసెలే నమ్ముతాడనుకోలేం. సెక్స్, మృత్యువుల పట్ల మానవుడు ఆశ్చర్యం, భయం కనబర్చడం ఆధారంగా; మూఢనమ్మకాలు, ఆచార సంప్రదాయాలు, కట్టుబాట్లు మొదలైన వాటితో కోటగోడలు లేవదీశాయి మతం, సంప్రదాయం. పునాదుల్ని నిర్మూలించే ఉద్దేశంతో ఈ కోటగోడల్ని కూడా పడగొడతా నంటాడు రసెల్. ఇదంతా అద్భుతమైన మాయ అన్న దృష్టి, మూఢాచారాలకి ఆలవాలమైంది, సంప్రదాయమైన నీతి, బాధని కలగచేసింది కావున, సంప్రదాయమైన రీతిని కూకటివేళ్ళతో పెరికివెయ్యాలంటాడు బెర్నార్డ్‌షావీ కొన్ని ఇట్లాంటి అభిప్రాయాలే "మొగాడు ఆడదే, ఆడది మొగాడే - కొన్ని సందర్భాలలో, అవసరమయ్యే కొద్ది తేడా తప్ప." అంటుంది షా నాటకంలో పాత్ర. "వ్రాతలో చూపరాని వొక్క తేడా తప్ప, మగ ఆడలలో తేడా లేదు." అని రసెల్, ఇవన్నీ అనాడు, స్త్రీకి సమాన హక్కులు, ఓటు కావాలన్న అలజడి నుండి బయలుదేరిన అభిప్రాయాలు స్త్రీకి సమాన హక్కులు, ఓటు సమకూర్చాయి ఈనాడు శరీర నిర్మాణంలో, అంగాల కూర్పులో స్త్రీకి, పురుషుడికి తేడా వుండదని నేడు తెలుసుకున్నారు భౌతికమైన, శారీరక శక్తులనుబట్టి పురుషుడితో పోల్చిచూస్తే, స్త్రీ బలహీనమైనదే. కొన్ని మానసిక ప్రవృత్తులలో, స్త్రీ పురుషుడితో సమానం కాదని రసెల్. సెక్స్‌ని గురించి వారి కౌతూహలాన్ని, చిన్నతనంలో దిగమింగడమే ఇందుకు కారణం అంటాడు వెనకటి తరంలో స్త్రీకంటె, పురుషుడు ఎక్కువగా వ్యభిచరించడం గమనించాడు ఇల్లా వుండాలనుకోడానికి మానసిక, భౌతిక శాస్త్రాల దృష్ట్యా ఆధారం లేదంటాడు ఇద్దరూ సమంగా, వివాహం గీసిన గీతలు దాటి, కామకలాపం జరిపితే తప్పేమిటని ప్రశ్నిస్తాడు. పెండ్లయినంత మాత్రాన, ఇతరత్రా కామవాంఛ తీర్చుకోకూడదు — అని లేదంటాడు. భార్య అల్లా వ్యభిచరించినప్పుడు, భర్త అసూయతో బాధపడడం కూడదంటాడు. వ్యభిచారం ఋజువైతే తప్ప విడాకులు ఇవ్వకూడదన్న న్యాయ సూత్రం సమంజసం కాదంటాడు. "రాజకీయ ఆర్థిక, పరిస్థితి, ఎట్లాంటి అరిష్టాలకి దారి తీస్తుందో, ఏకపత్నీత్వం తూచా తప్పకుండా పాటించాలన్న నైతిక సూత్రం, అట్లాంటి అరిష్టాలకి దారి తీస్తుంది విచక్షణ, వివేకం, మంద గమనం — ఇవి ప్రేమలో కనపరిస్తే, మానవుడు ఆశించే సౌఖ్యం సాధ్యంకాదు." అని రసెల్. అంటే, 'ప్రేమని అరికట్టకు, అసూయని అరికట్టు — అన్నమాట. మనుషుల ప్రవర్తనపై ఆంక్షలు విధించడం సుఖవుకాదని, రసెల్ గ్రహించినట్లు లేదు. ఒక స్త్రీని గాఢంగా ప్రేమించిన వ్యక్తి, ఆమెతో సెక్స్ సంబంధం

పెట్టుకోకుండా వుండడం అసంభవం కాదు. అల్లాగే భార్య వ్యభిచరించినప్పుడు అసూయ చూపకపోవడమూ, అసంభవం కాదు. కాని, ఇది అందరికీ సాధ్య పడదు. యోగులకూ, రోగులకూ సాధ్య పడొచ్చునేమో. సామాన్య ప్రజకి ఇది సాధ్యం కానందున, పెండ్లిని గూర్చి రసెల్ ప్రకటించిన భావాలు ఆచరణలో నెగ్గవు. వెనకటి తరం ధనిక వర్గాలు, పాలకవర్గాలూ, శాసించిన శిక్షణ నుండి జనించినవే ఈ భావాలు అనుకోవాలి మామూలు మనిషికి ఉద్రేకం, వాంఛ ఎంత అవసరమో; బుద్ధి, విచక్షణ, తర్కబద్ధమైన సూక్ష్మ పరిశీలనా ఎంత అసాధ్యమో రసెల్‌కి తెలిసినట్లు లేదు ఒక పురుషుడికి వొక స్త్రీ అన్న ఏక పత్నీతత్వం. శిక్షాబద్ధమైంది గనుకనే, స్వేచ్ఛను కూడా సాధించింది. భార్యా భర్తలు, వొకర్నొకరు గాఢంగా ప్రేమించి, నమ్మినప్పుడు, ఇతరత్రా ఉభయులకూ స్నేహాలూ, అనుభవాలూ పెంపొందుతాయి — వాటిని హర్షిస్తారు కాని, బాధపడరు. ఈ స్వేచ్ఛ ఎరగనివారు, అసూయకీ, అనుమానాలకీ గురికాక తప్పదు.

రసెల్‌లో మెచ్చుకోదగ్గ నిజాయితీ ఒకటుంది. ఆయన ప్రచారం చేసిన భావాన్ని, అభిప్రాయాన్నీ ఆచరణలో పెట్టి చూపుతాడు. భర్త వుండగా, కోరినప్పుడు, మరొక ప్రియుడితో గడపమని, వొక స్నేహితురాలికి సలహా ఇచ్చాడు తాను అల్లా చేశాడు కూడాను. ఈయన్ని ప్రేమించిన కొందరు స్త్రీలను గురించి పట్టించుకోక, విస్మరించినప్పుడు, 'ఎందుకట్లా చేశావు, వారి మాటేంగాను?' అని ఎవరో అడిగితే, "మరొకరు వారికి దొరక్కుండా పోతారా ఏమిటి?" అని అడిగాడుట డోరా రసెల్‌తో కలిసి కాపురం చేస్తున్న రోజుల్లో, డోరా ప్రియుణ్ణి తనింట్లో వుంచుకోడానికి ఇష్టపడ్డాడు ఈయన.

1935 వ సంవత్సరంలో, డోరాకి విడాకు లిచ్చాడు రసెల్. వారివద్ద ఉద్యోగిగా వుంటున్న ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిని మార్జొరి స్పెన్స్ అనునామెతో భర్త రసెల్ వ్యభిచరించాడన్న కారణంగా డోరా, విడాకులు అడిగింది విచారణ జరిగింది. ఆమెకి రసెల్ ద్వారా ఇద్దరు సంతానం, మిగత ఇద్దరు సంతానం, మరొకరికి పుట్టినవారనీ, భర్త తనలాగే ఇతర సంబంధాలు పెట్టుకున్నాడనీ - ఇవన్నీ విచారణలో బైటపడిన సంగతులు. వీరి వివాహం రద్దైంది. 1936 లో మార్జొరీ స్పెన్స్‌ని (తర్వాత ఈమె 'పెట్రిషియా స్పెన్స్' అన్న పేరు పెట్టుకుంది) వివాహమాడాడు పెట్రిషియా రసెల్‌కి మరుసటి సంవత్సరం మొగ బిడ్డ కలిగాడు. ఆయన మొదటి రెండు పెండ్లిళ్ళూ భగ్నమయ్యాయి కనక, పెండ్లిని గూర్చిన ఆయన అభిప్రాయాలు తప్పు, అంచేత తెలుసుకోనక్కర్లేదు

అన్న నిర్ణయానికి రాకూడదు మనం. పెండ్లికి సంబంధించిన ఈ అభిప్రాయాలే కాక, పెండ్లికి పూర్వం దంపతులు ఉభయులకూ, సెక్స్ అనుభవం వుండా లంటాడు, రసెల్. చాలా దేశాల్లో ఈ భావాన్ని హర్షించినట్లు తెలుస్తుంది. ఫ్రాన్స్ దేశపు ప్రధాని లియన్ బ్లమ్ ఈ భావాన్నే వెలిబుచ్చాడు తన పుస్త కంలో. యౌవనంలో వైవిధ్యం కోరతాడు మనిషి రకరకాల రుచులు కావా లంటాడు. నడివయస్సులో ఏకపత్నీవ్రతుడౌతాడు – కాబట్టి, నడివయస్సులో పెండ్లి జరగాలంటాడు బ్లమ్. 'వృద్ధనారీ పతివ్రత' అన్న నానుడిని మన మెరుగుదుం. మనిషి ఏ వయస్సులోనూ కూడా స్వాభావికంగా ఏకపత్నీవ్రతుడు కాదంటాడు రసెల్. సంతానాన్ని అపేక్షించకుండా యువతీ యువకులు, తాత్కాలిక వైవాహిక సంబంధాలు పెట్టుకోవాలని ఈయన సూచన. దీన్ని ఎవ్వరూ ఆమోదించినట్లు లేదు సత్ఫలితాల నివ్వనందున పెండ్లిని గూర్చిన రసెల్ భావాలు పలుకుబడి తెచ్చుకోలేదు ఈ భావాలవల్ల కొంత మేలు జరక్క పోలేదు. సెక్స్‌ని గూర్చిన అజ్ఞానాన్ని ఈనాడు ఎవ్వరూ మెచ్చరు. ఈ మార్పుకు కొంత వరకు రసెల్ రచనలు కారణం అనొచ్చు యుక్తవయస్సులో శారీరకంగా వచ్చిన మార్పులు, ఏదో జాడ్యానికి చిహ్నాలుగా భావించదు, చదువుకున్న నేటి యువకుడు మాతృత్వం కోసం భరించవల్సిన బాధగా సెక్స్‌ని పరిగణించదు, చదువుకున్న నేటి యువతి నైతికంగా భార్యాభర్తలు, వొకర్నొకరు దగా చేసుకోడం తగ్గుతోంది. వ్యభిచారం ఋజువైతేకాని విడాకులు ఇవ్వడానికి వీల్లేదన్న శాసనం మూలపడింది. ఇవన్నీ రసెల్ రచనల ఫలితాలన లేం కాని, సెక్స్ పట్ల ఆధునిక దృక్పథం అనే భవనంకి పునాదులు వేసిన శక్తులలో, ఆయన రచనలని కూడా పేర్కొనాలి. ఓరిమి, సహనం – పెండ్లి నెగ్గాలంటే, ఎంతో అవసరం. ప్రధానమైన రసెల్ బోధ కూడా ఇదే. ఇవన్నీ 'వివాహము-నీతి' (Marriage and Morals) అనే గ్రంథంలో భావాలుగా అవతరించాయి. వీటిని తరువాత పరిశీలిద్దాం.

1930 వ ' సంవత్సరం నుండి, మనోవ్యాకులత, అనారోగ్యము, వున్నప్పటికీ, బెర్ట్రండ్ రసెల్ గ్రంథ రచనవల్ల డబ్బు గడిస్తూనే వున్నాడు. సుఖంగా జీవించడం ఎల్లాగు? సోమరితనం మంచిదే, విజ్ఞానశాస్త్ర దృక్పథం, మతము – విజ్ఞాన శాస్త్రము – వీటిని గురించిన నాలుగు పుస్తకాలూ, ఆ రోజుల్లో వ్రాసినవే. ఇవి మామూలు ప్రజల నుద్దేశించి, హాస్యపూరితమైన ఛలోక్తులతో, వినోదం కలిగిస్తూ లోతైన విషయాలను సులభమైన భాషలో, విశదపరుస్తూ, ఆసక్తితో చదివేలాగు వ్రాయబడినవి సుఖంగా ఉండాలంటే,

ఏం చెయ్యాలో చర్చించే (The conquest of happiness) పుస్తకం ఎంతో ఉపయుక్తమైనది, ప్రసిద్ధి చెందినది. స్వార్థపరులై, తమ సమస్యలను గురించే ఎప్పుడూ ఆలోచిస్తూ, చీకాకు పడేవారు; విశాల ప్రపంచం గురించీ బాహ్య జగత్తులో తనకి సంబంధించని విషయాలను గురించీ, కుతూహలంతో అవలోకించడం అలవాటు చేసుకోవాలని ఈ పుస్తకంలో సూచన. మనిషి, తన జీవితంలో వొక సమస్యని ఎదుర్కొన్నప్పుడు, దాన్ని గురించి మధనపడి, కలత చెందేలాగు, సగం సగం ఆలోచించి, సమస్యని ఆ కాసేపూ నెట్టివేసి, తోసేసి తప్పించుకు తిరుగుతాడు దాన్ని ఎదుర్కొనే ధైర్యం ఉండదు. అల్లా మనస్సు కల్పించిన అధోలోకంలోకి నెట్టివెయ్యబడ్డ సమస్య, అక్కడ ఎంతో కాలం ఉండదు మనస్సుని మరింత వ్యాకులపరిచి, కలుషితం చేసి, జిజ్ఞాసలో కొచ్చి, వేధించుకు తింటూనే ఉంటుంది ఇట్లాంటివే, బెంగ, దిగులు, వ్యాకులత, చిరాకు, — మనస్సు వొక్క సమస్యపైపే కాక, పరి వరి విధాల పోవడంవల్లనే, మనో నిబ్బరం, ఏకాగ్రత, సడలి, చెదిరి, మరింత కుంగిపోతుంది. అట్లాంటి సమస్య ఎదురైనప్పుడు, ఆ సమస్యని చివరిదాకా ఏం జరిగేదీ వూహించి, ఇంత కంటె జరిగే ప్రమాదం మరేమీ లేదు కదా అనుకునేలాగు, పర్యవసానం ఏమిటో గ్రహించి దాన్ని ఎదుర్కొని, సిద్ధపడేలాగు, మనస్సులో సమాలోచన జరుపు కోవాలని, రసెల్ సూచన. అవును, భార్యకి జబ్బుగా వుంది చికిత్స జరుగు తుంది. నయమవడం లేదు. ఏం జరుగుతుంది? చనిపోతుంది. అంతకి మించిన ప్రమాదం ఏముంది? 'చనిపోవడం' అన్న పరిస్థితికి సిద్ధపడు. ఆ వార్త బంధువులకు తెలియబరుస్తూ ఉత్తరాలు వ్రాస్తావు. ఆ పని ఇప్పుడే చెయ్యి. దహనక్రియలకి కావాల్సినవి సిద్ధం చేసుకో. చివరంటూ ఊహించి, మానసికంగా సిద్ధపడడంతో ఆ సమస్యలో సగం బరువు తగ్గిపోతుంది. రెండోది, ఆమె చనిపోయినందున, విశాల ప్రపంచంలో జరిగే మార్పు ఏమిటి? ఏమీ లేదు. అనంత విశ్వంలో, నువ్వూ, నీ భార్యా, మేలపడం, చావడం — ఏమంత పెద్ద విషయాలు! మహత్తర సృష్టి పోకడలో, ఒక మనిషెంత! సృష్టి వైచిత్రి — నడుమ చిక్కుకున్న అల్ప మానవుడి వ్యవస్థ — వీటిని గురించిన భావనతో సమస్య కోరలు పీకవొచ్చునంటాడు. ఇట్లాంటి భావనతో సమస్యలన్నీ తీరిపోతా యనుకోడం పొరబాటేమో పెద్ద పర్వతం ముందూ, వేగంగా సాగిపొయ్యే పెద్ద పెద్ద గోళాల ముందూ, మనిషి అల్పుడే కాని అల్పుడని గ్రహించగల వాడు కూడా మనిషే. డాక్టర్ రాధాకృష్ణన్ అన్నట్లు, విశ్వం, మనిషికంటె ఎన్ని రెట్లు పెద్దదో, పరమాణువుకంటె మనిషి అన్ని రెట్లు పెద్దవాడు.

పరమాణువు అల్పత్వాన్ని, విశ్వం వైశాల్యాన్నీ తిలకించి – ప్రేమించి బాధపడ గలిగేవాడూ మనిషే.

సోమరితనం కొన్ని సందర్భాలలో అవసరమేనని సోమరితనాన్ని మెచ్చుకుంటూ (In Praise of Idleness) అనే వొక గ్రంథం వ్రాశాడు రసెల్. కీనీస్ మొదలైన అర్థికవేత్తలు, సోమరితనాన్ని, మెచ్చుకుంటూ, దుబారా ఖర్చుని ఖండిస్తూ, ఇదివరలో వ్రాశారు. "మనం ఖర్చు పెడుతున్నా మంచె, మరొకడికి అన్నం పెడుతున్నా మన్నమాట. ఖర్చు చెయ్యక, కూడ బెట్టేవాడే శత్రువు. దీనివల్లనే నిరుద్యోగ సమస్య ప్రబలుతుంది" అంటాడు రసెల్. స్నేహితులకు పార్టీ లిచ్చిగాని, ఆఖరికి త్రాగుడు, జూదంద్వారా కాని - డబ్బు కూడబెట్టినవారు - ఖర్చుచెయ్యడమే మంచిదంటాడు. ఈ భావాన్ని ఆనాడు కొందరు వెక్కిరించినా, ఆదాయం ఎక్కువగా పెరిగితే, నిరుద్యోగ సమస్య పొడసూపుతుందన్న అర్థిక సూత్రం నేడు ఆమోదించక తప్పిందికాదు.

ప్రపంచ దేశాల చరిత్రలు పరిశీలించి, మానవుడి కృషిని ప్రేరేపించే శక్తులెవ్వి, అనే ప్రశ్నకు సమాధానంగా, "స్వేచ్ఛ–పొందిక పరిచిన సమాజము" (Freedom and organisation) అనే గ్రంథం వ్రాశాడు రసెల్ మార్క్సు పరిశీలనవల్ల తేలినది – డబ్బుని ఆశించే మానవుడు పని చేస్తాడు - అన్నది. ఈ విధంగా, ఇంత సూక్ష్మంగా సిద్ధాంతీకరించడానికి వీల్లేదంటాడు రసెల్. విజ్ఞానశాస్త్ర పరిశోధన చేసి, మానవుడు ఎన్నెన్నో కొత్త పరికరాలని కనుక్కొన్నాడు. ధనార్జన కోసం ఈ పనులు చేశాడనలేం. చౌకబారు పుస్తకాలు వ్రాసి, చౌకబారు చిత్రాలు గీసి, ఎక్కువ డబ్బు సంపాదించవచ్చు –అని తెలిసికూడా, రచయితలు, మంచి పుస్తకాలు వ్రాయడం, చిత్రకారులు మంచి బొమ్మలు గీయడం జరగడం లేదా? ప్రభుత్వోద్యోగిని, పని చెయ్యడన్న మిష మీద తీసెయ్యడం జరగదు కాబట్టి ఆ ఉద్యోగి ఏ పనన్నా చేస్తే, డబ్బు కోసం చేశాడు – అనలేం. గౌరవం, పేరు ప్రతిష్టలు, అధికారము – ఇవి కూడా మానవ కృషికి ప్రేరణే నంటాడు రసెల్ డబ్బు కాకపోతే, చరిత్ర వెనకవున్న శక్తి ఏమిటి? అర్థిక వ్యవస్థ, రాజకీయ సిద్ధాంతం, మహాపురుషులు–ఇవీ చరిత్ర గమనాన్ని శాసించే శక్తులు తాత్విక సౌమ్యం, మార్క్సు తత్వం, అమెరికాలో ప్రజాస్వామ్యం – వీటిని పురస్కరించుకుని, మాల్థస్, బెన్థమ్, మార్క్సు, జెఫర్సన్, రాక్ ఫెల్లర్, కార్నిజీ మొదలైన వారి కృషి ఫలితాలను ఈ పుస్తకంలో చర్చించాడు రసెల్ రాక్‌ఫెల్లర్ కృషి ఫలితంగా పోటీతత్వం ప్రబలి పారిశ్రామిక సంపత్తి అంతా కొన్ని కూటాల సొత్తైపోయిందని వ్రాస్తూ:

"నేటి సమాజంలో, పోటీ తత్వం దెబ్బతినక మానదు. సైనిక దళాలు ప్రభుత్వం యాజమాన్యాన కాక, వొకరి చేతుల్లో వుంటె ఎంత ప్రమాదమో పారిశ్రామిక సంపత్తి వొక్కరి చేతుల్లో వుంటె అంత ప్రమాదమూను. పెద్ద పెద్ద ఆర్థిక నిలయాలు ఈనాడు సమీకరింపబడి, బృందాల యాజమాన్యాన నిర్వహింపబడుతున్నాయి. అట్లాంటప్పుడు, పోటీ తత్వం, వృధాకాక తప్పదు. ఈ సంస్థ లన్నింటినీ, ప్రజలే నిర్వహించాలి" అని సూచించాడు. ఈనాటి ప్రభుత్వాలు, ఎక్కువగా ప్రజల నిర్మాణ కార్యకలాపాలలో జోక్యం కలుగ చేసుకొంటున్నాయి. ఒక విధంగా ఇది తప్పనిసరైనా ప్రభుత్వాల అధికార తృష్ణ పెరిగి, వ్యక్తి స్వాతంత్ర్యం సన్నగిల్లే ప్రమాదం ఏర్పడుతోందన్న విషయాన్ని, 'అధికారం' (Power) అనే గ్రంథంలో ముచ్చటించాడు రసెల్. అధికార వాంఛ, త్రాగుడు కంటె ఎక్కువ హాని చేస్తుంది. డబ్బు దాహానికి పరిమితి వుంది. కాని అధికార దాహానికి పరిమితి లేదు ఈ అధికారాన్ని అతికట్టి, శిక్షణలోకి తేవడం ఎల్లాగ అన్న విషయాన్ని, 'అధికారం' అన్న గ్రంథంలోనూ, పారిశ్రామిక నాగరికత భవితవ్యం (The Prospects of industrial civilisation) అనే గ్రంథంలోనూ విపులీకరించాడు. 'అధికారము – వ్యక్తి' (Authority and the Individual) అనే పుస్తకంలో కూడా ఈ ప్రసక్తి వుంది. వ్యక్తి స్వాతంత్ర్యం గూర్చిన ఈ పుస్తకాలన్నీ ముఖ్యమైనవి.

శాంతికి మార్గం ఎటు? అన్న గ్రంధాన్ని 1936 లో వ్రాశాడు రసెల్. యుద్ధాలు జరగకూడదనీ, జరిగితే, కలిగే నష్టం గురించీ వ్రాస్తూ, "ప్రజాస్వామ్యాన్ని సంరక్షించడం కోసం తలపెట్టిన యుద్ధం సైనికులైన నియంతల పరిపాలనతో అంతమౌతుంది" అంటాడు. మరొక చోట: "యుద్ధం ముగిసాక, జర్మనీలో వలెనే, ఇంగ్లండ్‌ని కూడా మరో హిట్లర్ లాంటి నియంత పాలించే స్థితి ఏర్పడుతుంది, యుద్ధ వీరులు నాజీల వలె తయారౌతారు. యుద్ధం గెలిచినప్పటికీ, కాఠిన్యం అలవరుచుకుంటారు." వ్యక్తులని యుద్ధంలో చేరవద్దన్నాడు. ఇష్టంలేనివారు తటస్థ దేశాలకు వలసపోయి తల దాచుకోవచ్చునన్నాడు. 1931 లో ప్రభువన్న బిరుదు తెచ్చుకున్న రసెల్, ప్రభువుల సభలో ఈ విషయంపై ప్రసంగించాడు 'బాగోగులు తెలుసుకున్న వారెవరూ, యుద్ధానికి దిగరు, పాలకులకంటె, తామె వివేకులమని చాటుతారు.' యుద్ధతంత్రం గురించి రసెల్‌కి అంత బాగా తెలియదు. సాంకేతిక నిపుణుడుగా కాక తత్వజ్ఞుడుగా చెప్పిన విషయాలివన్నీ. రెంతో ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది.

ఈ యుద్ధం ప్రారంభమయ్యే ముందు రసెల్ తన శాంతియుత ఆదర్శాన్ని పరిత్యజించాడు. సైనికుడి కుండవల్సిన వయస్సు, తనకి వుండివుంటే, తనూ యుద్ధంలో చేరి ఉండునన్నాడు. "ఇప్పటికీ నేను శాంతికామినే. ప్రపంచంలో శాంతి నెలకొనాలనే నా ఆశయం. కాని హిట్లర్ వర్థిల్లినంత కాలమూ ప్రపంచంలో శాంతి ఉండదు కావున, ముందు అతన్ని అంతం చెయ్యాలి. అందుకే ఈ యుద్ధాన్ని సమర్థిస్తాను." అని చెప్పుకున్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధం జరిగిన కాలంలో రసెల్ అమెరికాలో ఉన్నాడు. ఆ సమయంలో ఎంతో మనో వ్యాకులతకు గురైనాడు. పుస్తకాల మీద రావల్సిన రాబడి, యుద్ధకాలపు నిబంధనల వల్ల, అమెరికాకి చేరడంలేదు. ముగ్గురి పిల్లల చదువుకుగాను కొద్దిగా ముట్టేది.

1940 వ సంవత్సరంలో, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో పనిచేస్తూ ఉండగా, న్యూయార్క్ పట్టణ కళాశాలవారు అక్కడ చేరవల్సిందిగా ఆహ్వానించారు రసెల్‌ని. హార్వర్డ్‌లో ఎల్లానూ ఉపన్యాసాలివ్వదలిచాడు కావున న్యూయార్క్ ఉన్నత విద్యాశాఖవారు ఈయన్ని తత్వశాస్త్ర బోధకుడుగా 1941 ఫిబ్రవరి ఒకటవ తేదీన నియమించారు. ఆ పదవి 1942 జూన్ నెలాఖరు వరకూ నిర్వహించాలన్న ఒప్పందం కుదుర్చుకున్నారు. అప్పటితో ఆయనకు డెబ్బై ఏళ్ళు పూర్తవుతాయి. డెబ్భైకి రిటైరవాలి. కాలిఫోర్నియా పదవికి రాజీనామా యిచ్చి, న్యూయార్క్ విద్యాశాఖ పదవి స్వీకరించక మునుపే, ఈయన ఆ ఉద్యోగానికి తగడని అభ్యంతర పెడుతూ 'మానింగ్' అనే మత గురువు అలజడి ప్రారంభించాడు. మత సిద్ధాంతాలకి విరుద్ధమైన తత్వం ప్రచారం చేస్తాడనీ, నైతిక అరాజకత్వాన్ని బోధిస్తాడనీ, వ్యభిచారాన్ని, సమర్థిస్తాడనీ, రసెల్‌పై 'మానింగ్' ఫిర్యాదు. రసెల్ ఉద్యోగాన్ని రద్దు చెయ్యవల్సిందిగా జీన్‌కే అను నామె న్యూయార్క్ న్యాయస్థానంలో దావా వదేసింది. "బూతు, కామక్రీడ, చౌకబారుతనం, అసత్యం, నాస్తికత్వం — వీటిని ప్రచారం చేస్తాడు రచనలద్వారా, ఇంగ్లండ్‌లో నగ్న సంస్థని నడిపాడు, అమెరికా పౌరుడు కాదు. ఆయనదంతా తప్పుడు వాదం. మాటల గారడీచే అమాయక ప్రజని మోసగిస్తాడు," — ఇవీ ఆ దావాలో పేర్కొన్న విషయాలు. విచారణ జరిపిన న్యాయవాది 'మెక్ గీహన్' అనే కాథలిక్ మతస్థుడు, రసెల్ ఈ పదవికి తగడనీ, ఉద్యోగాన్ని రద్దు చెయ్యాలనీ తీర్పు చేశాడు అందుకు మూడు కారణాలు పేర్కొన్నాడు. రసెల్ అమెరికా పౌరుడు కాదు, ఈ పదవికి

అర్హుడని నిరూపించే పరీక్షకు కూర్చోలేదు. నైతిక సంప్రదాయానికి విరుద్ధమైన స్వేచ్ఛ, ప్రేమ తత్వం, కామ కలాపం ప్రచారం చేశాడు. ఆయన బోధించేది, తర్కం, తత్వశాస్త్రం ఐనప్పటికీ, పేరుపడ్డ వ్యక్తి ఐనందువల్ల ఆయన బోధలకి విలువ పెరుగుతుందని న్యాయవాది సూచించాడు. స్వేచ్ఛా జీవిత సిద్ధాంతాలను నమ్మిన వారెందరో నిరుత్సాహపడతారని, రసెల్, ఈ తీర్పు అన్యాయమని, న్యాయస్థానంలో దావా వెయ్య సంకల్పించాడు. వైట్‌హెడ్, జాన్‌డ్యూయీ, ఐన్‌స్టీన్ మొదలైన ప్రముఖులు, రసెల్‌ని సమర్థించారు. నగ్న సంస్థని నిర్వహించలేదన్నారు రసెల్. ఇంగ్లండ్‌లో తాను వ్యభిచరించిన మాట నిజమే కాని, వ్యభిచారం ఋజువు చేస్తే తప్ప, ఇంగ్లండ్‌లో విడాకులివ్వరు గావున, అట్లా చెయ్యాల్సి వచ్చిందన్నాడు.

అల్లా ఉద్యోగం లేక, అప్రతిష్టకు గురై రసెల్ బాధపడుతూ వుండగా, ఆల్బర్ట్ బార్నెస్ అనే కోటీశ్వరుడు, పెన్సిల్‌వేనియాలో తత్వశాస్త్రం గూర్చి ఉపన్యసించవల్సిందిగా ఆహ్వానించాడు కుటుంబంతో సహా, రసెల్ పెన్సిల్ వేనియా వెళ్ళాడు. అక్కడ తీవ్రమైన అనారోగ్యానికి గురయ్యాడు మూడురోజుల నోటీసిచ్చి 1943 జనవరిలో బార్నెస్ రసెల్‌ని పదవి నుండి తొలిగించాడు. రసెల్ ఉద్యోగ విధుల నిర్వహణపట్ల అసంతృప్తి వెలిబుచ్చాడు బార్నెస్. రసెల్ ఉపన్యసిస్తున్న భవనంలో బుష్‌షర్ట్ ధరించి ఆయన భార్య పెట్రిషియా, కుట్టుపని ప్రారంభించి, విద్యార్థుల శ్రద్ధాభక్తులు సడిలేట్లు చేసేదిట. మరొక కారణం కూడా ఉండొచ్చు. గాంధి జీవితం వ్రాసిన లూయీ ఫిషర్ అనే ఆయనతో రసెల్ వొక గోష్టి జరిపాడు. ఆ గోష్టిలో, యుద్ధంపట్ల ఇండియా చూపిన వైఖరిని నిరసిస్తూ, ఇంగ్లీషువారికి బదులు జపానీయులు ఇండియా స్వాధీనంచేసుకుంటె, భారతీయులు మరింత చిక్కుల్లో పడతారన్నాడు రసెల్. సామ్రాజ్యవాది అనడానికి ఇది నిదర్శనంగా పేర్కొన్నాడు బార్నెస్ ఎన్నో కష్టాలని ఎదుర్కొన్నాడు రసెల్, తను డెభై ఏళ్ళ ఏట, ఉద్యోగం లేదు. పిల్లల చదువుకి అంతరాయం, పత్రికలు, తన రచనలని ప్రచురించడం లేదు. తనని సమర్థించిన వొకరిద్దరు మిత్రులు, అమెరికాలో పెద్దల్ని, రసెల్‌కి సహాయం చెయ్యవల్సిందిగా కోరినప్పుడు, వారు నిరాకరించడమే కాక "ఏదన్నా చేస్తాము కాని, రసెల్‌తో ఏ సంబంధమూ పెట్టుకోలేము" అని బదులిచ్చేవారుట.

అక్రమంగా తనని పదవి నుండి తొలిగించాడు అన్న ఫిర్యాదుతో బార్నెస్‌పై దావా వేశాడు రసెల్. ఈ దావా గెల్చింది. న్యాయస్థానం తన వాదాన్ని సమర్థిస్తూ తీర్పు చేసింది. కాని దావా తాలూకు డబ్బు ఆయన చేతుల్లో పడేటందుకు మూడేళ్ళు పట్టింది. "ఇప్పుడు నా ఆదాయంకంటె, నే కట్టే

ఆదాయపువన్నే ఎక్కువ. ప్రభుత్వం ఈ వ్యవస్థని ఎట్లా సమర్థిస్తారో చూడాలి." అన్నాడుట పత్రికా విలేఖరులతో. తాను ముందు ప్రచురించబోయే రసెల్ పుస్తకాలకు ఎంత ముడుతుందో లెక్కలు కట్టి, ఆ మొత్తాన్ని ముందే అంద జేశాడు, ప్రచురణకర్త సర్ స్టాన్లే అన్విన్.

బార్నెస్ నిధి నిర్వహణ సంస్థలో పని చేసినప్పుడు, రసెల్ చెప్పిన పాఠాలే 'పాశ్చాత్య తత్వశాస్త్ర చరిత్ర' (A History of western Philosophy) అను గ్రంథంగా ప్రచురించబడ్డాయి. ఇది చాలా గొప్ప గ్రంథం. పాశ్చాత్య తత్వజ్ఞుల సిద్ధాంతాల విమర్శమట్టుకే కాక, వాటికీ, ఆయా కాలాల రాజకీయ, సాంఘిక స్థితిగతులకీ వున్న సంబంధాన్ని పరిశీలిస్తూ; విలువల ప్రతిపాదన కూడా వుంది ఈ గ్రంథంలో. ఇది వెయ్యి పుటల గ్రంథం. కొన్ని భాగాలను విజ్ఞులు విమర్శించారు జర్మన్ తత్వజ్ఞుడు కాంట్ గూర్చిన ప్రకర ణంలో దోషాలున్నాయన్నారు. ఒక పని మంచిపని అనుకుంటె, ఆ పనిని ప్రపంచంలో అందరూ చెయ్యాలని కోరతారా లేదా? అల్లా కోరితేనే అది మంచి పని అన్న కాంట్ నైతిక సూత్రాన్ని పరామర్శిస్తూ "కాంట్ చెప్పిన ఉదాహరణ ఇది అప్పు తీసుకోడం మంచిది కాదు, ఎందుకంటే ప్రపంచంలో అందరూ అప్పులు తీసుకోడం మొదలిడితే, తీసుకునేటందుకు డబ్బే మిగలదు" అని వ్రాశాడు రసెల్. ఈ ఉదాహరణ కాంట్ పుస్తకంలో లేదన్నారు విమర్శకులు.

1944 వ సంవత్సరంలో బెర్ట్రండ్ రసెల్ ఇంగ్లండుకి వొచ్చేశాడు. ట్రినిటి కళాశాలలో పని చెయ్యవల్సిందిగా, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంవారు ఆహ్వానించారు బి. బి. సి. వారు, ప్రసంగాలివ్వ వల్సిందిగా ఈయన్ని పిలవ డానికి జంకేవారు మొదట్లో. ట్రినిటి పదవిని స్వీకరించాడు. ఆయన ఇంగ్లండు కొచ్చినప్పుడు పేరు తెచ్చుకుంటున్న తత్వజ్ఞుడు సి. ఇ ఎమ్. జోడ్. ఈయన బాగా చదువుకున్నవాడు. తత్వశాస్త్రాన్ని విజ్ఞానశాస్త్ర పరిశోధనలతో సమన్వయ పరిచి, సాధారణ ప్రజకి అర్థమయ్యేలాగు, చక్కటి భాషలో వ్రాసి, ఈ రెంటినీ ఎంతో ప్రచారం చేశాడు. విశ్వవిద్యాలయాలలోవారికే కాక, అందరికీ ఇవి అర్థం కావాలన్న వుద్దేశంతో వ్రాసిన ఈయన పుస్తకాలు ఎక్కువగా అమ్ముడు పోయి, ప్రజల దృష్టిని ఆకర్షించాయి బి. బి సి వారు నడిపిన బ్రైన్స్ట్రస్ట్- అభిజ్ఞుల అభిప్రాయం - అన్న కార్యక్రమంలో శ్రోతలు పంపిన ప్రశ్నలకు ప్రజారంజకమైన సమాధానాలిచ్చి, చాలా పేరు గడించాడు. తత్వశాస్త్రంలో ఆయన వెలిబుచ్చిన సిద్ధాంతాలూ, స్వతంత్ర భావాలూ ఆయన రచనల్లో అంతగా లేకపోయినా, ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని నలుగురికీ ఎరుకపర్చడంలో

కృతకృత్యుడయ్యాడు. ఈ జోడ్ అంటే, రసెల్‌కి గిట్టలేదు. తనవీ షావీ, భావాలు దొంగిలించాడంటాడు. జోడ్ పుస్తకానికి పీఠిక వ్రాయమని కోరినప్పుడు "నమ్రత నిషేధించింది – వ్రాయలేను." అన్నాడుట రసెల్. కొన్నాళ్ళకి టికెట్ లేకుండా రైల్లో ప్రయాణం చేసి, పట్టుబడి, తాను ఏ స్టేషన్‌లో రైలెక్కిందీ అధికారులతో సరిగ్గా చెప్పక అప్రతిష్ఠ తెచ్చుకున్నాడు జోడ్. చివర రోజుల్లో, భౌతిక చింతన వాదాన్ని విడిచి, చర్చ్ ఆఫ్ ఇంగ్లండ్ మత శాఖలో చేరి ఆధ్యాత్మిక చింతన సాగించాడుట జోడ్. ఈ ఉదంతం విని "రైలు టిక్కెట్టు పోగొట్టుకున్నాక, దైవాన్ని కనుగొన్నాడు జోడ్" అని వ్యాఖ్యానించాడుట రసెల్.

ఇది కఠినమైన చలోక్తిగా తోస్తుంది నాకు అల్లాగే ఎలెక్షన్ రోజుల్లో ఓటిచ్చే రోగిని వెళ్ళి చూడవల్సిందిగా నలుగురూ సలహా చెప్పినప్పుడు, 'వాడంటే మంట. నే వెళ్ళి చూడను.' అన్న విషయం కూడా చూశాం. స్వేచ్ఛాజీవుల ఆరాధన అన్న రచనలో క్షమ, దయ చూపాలి. ఇబ్బందిలో వున్నప్పుడు తోటివారిని ఓదార్చి ప్రేమ కనపరచాలి – అదే మానవుడి అంతరంగ జీవిత పరమావధి– అని వ్రాసిన రసెల్, జోడ్‌ని ఆ సమయంలో అల్లా అవహేళన చేయడం హర్షించలేను. మతాలు, తత్వశాస్త్రాలూ చెప్పే పాఠమే 'ప్రేమించు' అని. ప్రేమ నిత్య జీవితంలో కనబడాలి ఆచరణలో, ప్రవర్తనలో వ్యక్తమవాలి. సిద్ధాంతాలూ, వ్యాఖ్యానాలూ, పుస్తకాలూ – వీటిల్లో మాత్రం కాదు.

యుద్ధానంతరం 1945 లో, లేబర్ పార్టీ గెలిచి పాలన స్వీకరించింది. ఈ పార్టీ పదవిలోకి రావాలని కోరిన రసెల్ సంతోషించాడు. కాని హిరోషిమాపై ఏటమ్‌బాంబు వెయ్యడం, అపార నష్టం కలగడం – ఇవన్నీ ఆయనకి బాధ కలిగించాయి. కొద్ది కాలంలోనే ఇంతకంటె శక్తివంతమైన బాంబులను రష్యా వారు కనుగొంటారు. ముందు రేగే యుద్ధం ముగిశాక గెలిచినవారూ, ఓడినవారూ అంటూ వుండక సర్వనాశనం అవుతుంది. అట్లాంటి పరిస్థితి రాకుండా మసులుకోవాలి ప్రభుత్వాలు –అని హెచ్చరించాడు రసెల్ ఆనాడు. యూరప్ పర్యటించి ఉపన్యసించడానికి అనుమతిచ్చారు ప్రభుత్వం. డెబ్భై ఆరవ యేట 1948 లో నార్వే వెళ్ళాడు. విమానంలో వెళుతుండగా చుట్ట కాల్చాలంటె, వెనక గదిలోకి వెళ్ళమన్నారు. చుట్ట కాల్చకపోతే బ్రతకలేను– అని, వెనక గదిలో కెళ్ళాడు. విమానం దిగుతుండగా చిన్న ప్రమాదం జరిగి, విమానం నీళ్ళల్లో కూలింది. రసెల్ నీళ్ళమీద దొర్లాడు. టోపీ కోసం వెదుకుతున్నాడు. వెనకభాగం గుండా ప్రయాణికుల్ని దింపి, సముద్రంలో దూరంగా వున్న పడవల మీదికి చేర్చ

వేశారు. ఇరవై గజాల దూరంలో వున్న పడవ దగ్గరకు ఈదాడు రసెల్. సురక్షితంగా పడవకి చేరాడు., హోటల్‌కి తీసుకెళ్ళారు. అక్కడ తెల్సింది ముందు భాగంలో వున్న పందొమ్మిది మంది మునిగిపోయినట్లు. హోటల్లో బ్రాండీ, కాఫీ పుచ్చుకుని తేరుకున్నాడు. బ్రాండీ మొదలైన పానీయాలు విసర్జించి ఆరోగ్యం కాపాడుకున్నందున రసెల్, ఈదగలిగాడని వొక స్నేహితుడు అనగా "కాదు, ఈదడం అయ్యాక పుచ్చుకున్న బ్రాండీయే బ్రతికించింది నన్ను" అన్నాడుట రసెల్.

ఈ సమయంలోనే భార్య పెట్రిషియా నుండి ఎడబాటు జరిగింది. విడాకులుచ్చుకున్నారు. రసెల్ కొడుకు ఎవరినో పెండ్లి చేసుకోబోతున్నాడని విని "మీకు పెండ్లంటే పడదుగా—మీ పిల్లవాడు పెండ్లి చేసుకుంటున్నా డేమిటి?" అని ఆశ్చర్యంతో అడిగినప్పుడు "ఎవడా అన్నది — చూడు నేను ఎన్నిమార్లు పెండ్లి చేసుకున్నానో!" అన్నాడుట.

1948 కి బెర్‌ట్రండ్ రసెల్ ప్రపంచ ఖ్యాతి ప్రబలి, వ్యాపించి స్థిరపడిందనొచ్చు ఆ ఏడే బి బి. సి. వారు 'రీత్' స్మారకోపన్యాసా లివ్వ వల్సిందిగా ఆహ్వానించారు. ఇవన్నీ 'వ్యక్తి అధికారము' అన్న గ్రంధంగా వెలువడ్డాయి. వ్యక్తి స్వాతంత్ర్యం ముఖ్యం — దాన్ని ప్రభుత్వాలు అరికట్ట కూడదు — అని ఈ పుస్తకంలో సూచన.

ప్రధానమైన పరిశ్రమలు ప్రభుత్వం అధీనంలోకి రావాలి - అంటే జాతీయం కావాలి. యుద్ధాన్ని నిరోధించే అధికారాన్ని ప్రపంచ ప్రభుత్వాని కివ్వాలి. ప్రాంతీయ యజమానులకు అధికారం వప్పగించే వికేంద్రీకరణ జరగాలి. ఇదీ ఆ పుస్తకంలో ముఖ్య విషయం.

రాజు ఇవ్వగల అతి వున్నతమైన ఆర్డర్ ఆఫ్ మెరిట్ - అన్న గౌరవం, బిరుదు, రసెల్‌కి 1950 జూన్‌లో లభించాయి. ఈ బిరుదునిచ్చే లాంచనం జరుపుతూ, ఆరవ జార్జి రాజు అన్నాడుట : "మీరు సాహసంతో కూడుకున్న జీవితం గడిపారుట. అందరూ అట్లాంటి పనులు చెయ్యకూడదేమో అవునా?"

ఇందుకు "అవునండీ, మీ సోదరుడు [1]విండ్సర్ ప్రభువు మీరు చెప్పింది నిజమే అని ఋజువు చేశాడు" అనాలనుకుని ఆ సమాధానం దిగమింగి "పోస్టు బంట్రోతు ఇంటింటికీ వెళ్ళి తలుపు కొడతాడు. అల్లా అందరూ చేస్తే కుదరదుగా" అన్నాడుట.

---

1. విండ్సర్ ప్రభువు, తను ప్రేమించిన స్త్రీని పెండ్లి చేసుకోవడం కోసం, సింహాసనాన్ని విడిచిపెట్టి వెయ్యాల్సి వచ్చింది.

1950 లో ఆస్ట్రేలియా పర్యటించాడు. ఎన్నో ఉపన్యాసాలిచ్చాడు. ఈ దేశం ఆయనకి నచ్చినట్లుంది. "నేను మళ్ళాపుట్టడం అంటూ వుంటే ఆస్ట్రేలియాలో జన్మించడానికి ఇష్టపడతాను. ఆస్ట్రేలియా వారి ఘనత భవిష్యత్తులో వుంది. యూరప్‌వారి ఘనత గతం లోనిది భవిష్యత్తు కోసం ఎదురు చూడ్డంలో ఉత్సాహం వుంటుంది కదా. ఇంగ్లండు, ఫ్రాన్స్ దేశాలలో, ఘనకార్యాలన్నీ ఇదివరలో జరిగిపొయ్యాయి. ఇంక చేసేటందుకు లేదనిపించే నైరాశ్యం ప్రబలింది. గొప్ప పుస్తకాలు, గొప్ప సంగీత విద్వాంసులు, గొప్ప చిత్రకారులు అన్నీ వెనకటివే. ఇంక సాధించేది ఏమీ లేదు అనిపిస్తుంది. ఆస్ట్రేలియా వారిలో ముందుచూపు వుంది. శక్తి సామర్థ్యాలున్నాయి. కాని శక్తికి సహనం జోడవాలి ఆస్ట్రేలియా వారిలో ఇది అంతగా లేదేమో! కళారంగంలో ఘన విజయాలు సాధించినవారు చాలామంది నైతిక అరాజకత్వాన్ని అలవర్చుకున్నవారే. వారి ప్రవర్తనని పక్కింటివారు మెచ్చరు. సంప్రదాయం ప్రతిపాదించిన సూత్రాలకి విరుద్ధంగా ప్రవర్తిస్తారు. అట్లాంటివారే కళాసృష్టి చెయ్యగలుగుతారు. కాబట్టి మనకున్న నాలుగు విధాలైన స్వేచ్ఛలకి తోడు, మరో స్వేచ్ఛ కూడా వుండాలి. విచ్చల విడిగా, వెర్రిమొర్రిగా ప్రవర్తించే స్వేచ్ఛ" అన్నాడు రసెల్, పర్యటన అనుభవాలు సింహావలోకనం చేస్తూ. ఇంగ్లండు తిరిగివచ్చాడు. కొన్ని రోజు లయ్యాక, 1950 లో నోబెల్ బహుమానం లభించింది రసెల్‌కి. డెబ్బై ఆరవ ఏట ఈయన వ్రాసిన ప్రసిద్ధ గ్రంథం — మానవుడు తెలుసుకోగల విజ్ఞానం దాని లోతు పాతులు, పరిమితి — అన్నది. స్వాతంత్ర్యం తెచ్చుకున్న ఇండియా పాకిస్తాన్ దేశాలను సందర్శించాడు. 1952 లో ఎడిత్‌ఫిన్‌చ్ అను రచయిత్రిని వివాహమాడాడు 1954 లో 'నీతి, రాజకీయాలు, మానవ సమాజం' అన్న గ్రంథం వ్రాశాడు. ఇందులో నైతిక చింతన వుంది. మరొకరికి అపకారం జరగనంత వరకూ నువ్వు ఏదిపడితే అది చెయ్యవచ్చునన్నది ఒక సూత్రం. మన పనిని ప్రేమ ప్రేరేపించాలి బుద్ధి ఆ పని ఎల్లా చెయ్యాలో చెప్పాలి. మనల్ని మనం ఓదార్చుకునేటందుకు కల్పించుకున్న అర్థరహితమైన భావనల కూర్పే మతం. "ఈనాడు మనందరం అలవరచుకోవల్సింది ఒకటుంది. క్రైస్తవ మతం నేర్పిన ప్రేమ, క్షమ, దయ" అంటాడు. ఇట్లాంటి పాతకాలపు నిర్వచనాలు చేసిన రసెల్, మర్యాదస్తుల చిట్టాలోకి చేరిపొయ్యాడన్నారు కొందరు "మర్యాదస్తులు దగాకోరులే కావున, నేనెంతవరకూ మర్యాదస్తుణ్ని అయ్యానో తెలుసుకోవాలని, లేవగానే అద్దంలో నా మొహం చూసుకునేవాణ్ణి" అని వ్రాశాడు. ఎనభయ్యోపడిలో పడ్డాక, రసెల్ పెద్దమనిషేనని తీర్పు

చేశారు ఇంగ్లండ్‌లో పెద్దలు. ఈ వయస్సులోనే, కొన్ని కథానికలు వ్రాశాడు రసెల్. ఎనభై ఒకటవ యేట శస్త్ర చికిత్స చేయించుకుని, ఆరోగ్యం సమకూర్చుకున్నాడు "ఈ డాక్టర్లంటూ లేకపోతే నాకే జబ్బూ లేదు." అన్నాడుట. ఆ రోజుల్లో చెప్పినవి కొన్ని :

"న్యాయం అనే సూత్రం సృష్టిలోనే లేదు." "కాస్తో కూస్తో ద్వేషం వుండాలి. అది మనుషుల పట్లే ప్రకటించనక్కర్లేదు. ద్వేషం లేకపోతే, శక్తివంతమైన కృషి జరగదు." "అమితమైన అపకారం చెయ్యడం కంటె, కాస్తంత మేలు చెయ్యడం మంచిది. "దేన్ని గురించీ, బల్లగుద్ది, ఖచ్చితంగా వక్కాణించకు."

హైడ్రొజన్ బాంబ్‌వల్ల కలిగే విపత్తునుగూర్చి, 1954లో వొక ప్రసంగం చేశాడు రసెల్. శ్రోతల్ని కదలించింది యీ ప్రసంగం తమ హర్షాన్ని తెలియపరుస్తూ ఎందరో జాబులు వ్రాశారు. అప్పుడు ఒక భావం ఉదయించింది ఆయన మనస్సులో - కమ్యూనిస్టు దేశాలలోనూ, కమ్యూనిజమ్ లేని దేశాలలోనూ వున్న విజ్ఞానశాస్త్రజ్ఞు లందరూ కలిసి, హైడ్రొజన్ బాంబు తెచ్చే ప్రమాదాన్ని తెలియపరుస్తూ వొక పత్రాన్ని విడుదల చెయ్యాలన్న భావం. ఐన్‌స్టీన్ ఇందుకు అంగీకరించాడు. మరెందరో విజ్ఞానశాస్త్రజ్ఞులు కూడా సమ్మతించారు. 1952లో కాక్స్‌టన్ హాల్‌లో పత్రికా ప్రతినిధుల సమావేశం ఏర్పాటుచేసి, ఈ అంశాన్ని విశదపరిచాడు.

బెర్ట్రండ్ రసెల్ జీవిత విశేషాలని, ఆలన్‌వుడ్ రసెల్‌నిగూర్చి వ్రాసిన గ్రంథం నుండి సేకరించాను. నిదర్శన, ఆధారం, దృష్టాంతరం లేకుండా దేన్నీ నమ్మనివాడు, సందేహశీలుడు, (స్కెప్టిక్). రసెల్ అట్లాంటి సందేహశీలుడు. కాని ఈ దృక్పథం వెనక ఉద్రేకం ఉంది. కావున, రసెల్ ఉద్రేకపూరితుడైన సందేహశీలుడు – (Passinate Sceptic). ఇదే 'వుడ్' వ్రాసిన పుస్తకం పేరు కూడా. ఈ పుస్తకం రసెల్ అనుమతితో వ్రాసిందే గనక ఇందలి విషయాలు, యదార్థాలుగా స్వీకరించవచ్చు. ఆ పుస్తకంకి ముగింపు వ్రాస్తూ, 'వుడ్' ఇల్లా అన్నాడు. "రసెల్ లాంటి వ్యక్తి ఎన్ని శతాబ్దాలకోగాని రాడు. లోకంలో ఏటమ్‌బాంబు ఉంటే, దాన్ని ఎదుర్కొనె మానవ శక్తికూడా ఉంది." చక్కటి ముగింపు.

బెర్ట్రండ్ రసెల్ జీవిత విశేషాలు తెలుసుకున్నాం గనుక, ఇంక ఆయన భావాల పరిశీలన మొదలుపెడదాం. అభిప్రాయానికీ, భావానికీ కొంత తేడా ఉందనీ; అభిప్రాయం వెనక, తాత్కాలికమైన ఉద్రేకమూ, స్వానుభవమూ

ఉంటుందనీ, ఆ రెంటినీ విడదీసి 'ఇది భావం' అని పేర్కొనడం కష్టమనీ మొదట్లో చెప్పి, ఒకటి రెండు భావాలని ఉదహరించాను. ఆ భావాన్ని మళ్లా ఉదహరిస్తాను: "మూఢులు బల్ల గుద్ది చెప్తున్నారు, విజ్ఞులు నోరు మూసుకుని కూర్చుంటున్నారు. ఈనాటి అరిష్టాలకి ఇదే కారణం" ఇది అభిప్రాయం, భావం కాదు. దీని వెనక ఉద్రేకం, స్వానుభవం ఉన్నాయి. ఈయన్ని పదవి నుండి తొలిగించినవారు అధికారులు. అధికారం ఉంది గావున, వారు బల్లగుద్ది చెప్తారు వారంతా మూఢులు. ఆచార్యుడుగా ఉంటున్న రసెల్, ఆయన్ని సమర్థించిన ఇతర తత్వజ్ఞులు, ఆచార్యులూ, — విజ్ఞులు. వీరికి అధికారం లేదు గావున, నోరు మూసుకుని కూర్చుంటున్నారు కాబట్టి పెద్ద పదవుల్లో ఉన్న అధికారులంతా మూఢులు. అవిలేని పండితులు, ఉపాధ్యాయులు– తెలివైనవారు, పైకి చెప్పలేకపోతున్నారు. అది, అందులో ధ్వని. దీన్ని విమర్శించడం సులువు. అధికారంలేని, ఉపాధ్యాయులు, పండితులు, తత్వశాస్త్రజ్ఞులూ,– అంటె విజ్ఞులన్న మాట. – వీరికి పెద్ద పదవులిచ్చి, అధికారంలో వుంచి, పాలకులుగా చేస్తే, వీరు మాత్రం బల్లగుద్ది చెప్పరా? అట్లా చెప్పినంత మాత్రాన, వీరందర్నీ మూఢులనగలమా? అధికారంలో ఉన్నవారు మూఢులా, మూఢులు కావున అధికారంలోకొచ్చారా? రసెల్‌ని పాలక వర్గంలో చేరిస్తే, బల్లగుద్ది చెప్పడా? చెప్పినంత మాత్రాన మూఢుడౌతాడా? వితర్కిస్తే ఈ భావం నిలబడదు.

'మారిపోతూ వున్న మన నైతిక విలువలు' అన్న వ్యాసంలో ఈ వాక్యం చూడండి,

"తన కింద పని చేస్తున్నవారిని ప్రేమతో, ఆదరణతో చూసే ఒక సంస్థ యజమాని, తన స్టెనోగ్రాఫర్‌ని ప్రేమిస్తే – అతన్ని దుర్మార్గుడంటారు జనం. ఏకపత్నీవ్రతుడుగా నలుగురూ చెప్పుకుంటున్న మరో సంస్థ యజమాని, తన కింద పనిచేసే వారిని ఎంత కఠినంగా చూసినా, మంచివాడుగా మెచ్చుకుంటారు జనం. ఇది దారుణం. ఇట్లాంటి ఛాందసాన్ని వెంటనే విడిచెయ్యాలి."

ఈ భావంతో నాకు పేచీ లేదు. ఇందలి ధ్వనిని స్వీకరిస్తాను స్వీకరించానుకూడ. ఈ భావాన్ని ఆధారంగా ఒక కథని వ్రాశాను కూడ–'మబ్బు మేకులు, చీర మడతలు' అన్న కథ. ఇతివృత్తం తెలియపరిచి, అనుమతి పొంది, రసెల్‌కి అంకితమిచ్చాను, ఆయన సంతోషంతో స్వీకరించాడు.

స్టెనోగ్రాఫర్‌ని – అంటె అంతరంగ కార్యదర్శి – ప్రేమించాడు గావున ఇతర విషయాల్లో ఎంత మంచివాడైనా ఆ యజమానిని, ప్రజలు చెడ్డవాడంటారు – అన్న ఈ రసెల్ ఉదహరణ వెనక స్వానుభవం ఉందనుకుని జీవిత

విశేషాలు తిరగవేస్తే ఈ వ్యాసం 1924 లో వ్రాసిందనీ, పెట్రిషియాతో వివాహం 1935 లో జరిగిందనీ తెలుసుకున్నాను. ఇందులో స్వానుభవం లేదన్న మాటేగా. లేక, ఇట్లా ప్రేమించిన స్నేహితుడెవరైనా ఆయన దృష్టిలో ఉన్నాడా? ఏమో చెప్పలేం. కాబట్టి భావం వెనకా, అది చెప్పే విధానం వెనకా వ్యక్తిత్వం, స్వానుభవం ఉంటాయన్నది మనస్సులో వుంచుకుని, మెళకువతో, పూర్తిగా ఉద్రేకంతో పెనవేసుగోని రసెల్ భావాల పరిశీలన ఇంక ప్రారంభించొచ్చు.

బెర్ట్రండ్ రసెల్ భావాల పరిశీలన రెండు విధాలుగా జరగాలనుకుంటాను. తాను నిర్మించుకున్న సమాజంలో ఆత్మ వికాసం కలిగి మానవుడు సుఖంగా జీవించడానికి ఉపకరించే భావాలు, ఏవో చెప్పడం ఒక పద్ధతి. మానవ శ్రేయస్సుకి అడ్డు తగులుతూ అనాదిగా ప్రచారం అవుతూ, చలామణిలో వున్న తుక్కు భావాలని పేర్కొనడం మరొక పద్ధతి కొత్త భావాన్ని స్వీకరించడం కోసం, పాత భావాలన్నింటినీ పాతెయ్యాలని కాదు; చెత్త భావాలకి పీడ్కోలిస్తే గాని, కొత్త భావాలని స్వీకరించే మనస్తత్వం, వాతావరణం ఏర్పడవు కావున, మానవుడి, ఆనందానికి అంతరాయాలుగా వుంటున్న భావాలేవో తెల్సుకుని, వాటి బాగోగులను గురించి ఆలోచించడం అవసరం. నిత్యకృత్యాలలో నిమగ్నులై, తమ స్వార్థం దెబ్బతిన్నప్పుడుగాని, మనుషులు 'భావాలను' గురించి పట్టించుకోరు; వారాని కో గంట స్వయంగా ఆలోచించే అలవాటు చేసుకుని, ప్రపంచ ఖ్యాతి తెచ్చుకున్నాను – అన్నాడు బెర్నార్డ్‌షా. ఇట్లా ప్రజలలో పాతుకుపోయి, మానవ వికాసానికి అడ్డుతగిలే చెత్త భావాల సంగ్రహచరిత్ర వ్రాశాడు రసెల్. వీటిని చెత్తబుట్టలో పడెయ్యాలంటాడు ఇట్లాంటివి మన వారిలోనూ కొన్ని వున్నాయి. కొన్నింటిని గూర్చి తెలుసుకుందాం.

మానవుడు బుద్ధిశీలుడు – మంచి, చెడ్డలు గ్రహించి, ఉద్రేకానికి లొంగక, నిదానంగా ఆలోచించగల బుద్ధిమంతుడంటారు కాని, నేను ప్రపంచమంతటా పర్యటించాను, దీనికి నిదర్శన నాకు కనబడలేదంటాడు, రసెల్. బుద్ధిని వాడకపోవడం సరికదా, సంస్కృతి నాగరికతల పెత్తందారులుగా, వక్తలు, నాయకులు, ఉద్రేకాలని రగులుస్తూ చేసే తుక్కుభావాల ప్రచారానికి లొంగిపోయి మనిషి, హింసాకాండకీ, మూఢ విశ్వాశాలకీ గురై ఉన్మత్తుడౌతున్నాడు. బుద్ధిమంతుణ్ణి, పాతకాలపు మనిషిగా పరిగణిస్తున్నారు. వెనుకటి యుగాలలో చలామణి అయిన తుక్కు భావాలేవో తెలుసుకుంటే, మనతరంలో వున్న చెత్త భావాలని ఎదుర్కోడం సులువంటాడు రసెల్. పాపభీతి తుక్కు భావాలలో ప్రధానమైంది భూకంపం, అగ్నిపర్వతం ప్రేలడం, ఉప్పెన,

వరదలు, కాలే అడవులు — మొదలైన భీభత్సాలు ప్రకృతి విజృంభించినప్పుడు జరుగుతాయి ప్రాచీన మానవుడు వీటికి భయపడేవాడు. ఇవి ఎందుకు జరుగుతాయో, వీటినుండి తప్పించుకుని ఎల్లా క్షేమంగావుండాలో తెలియక, ఆది మానవుడు, ఇదంతా దైవ నిర్ణయం అనుకునేవాడు. తన కర్మ; తాను చేసిన పాపాలకి, ఇది ఫలితం అనుకునేవాడు. దయ్యాలూ, భూతాలు, మాంత్రికుడు, బలులివ్వడం, రాయినీ రప్పనూ మొక్కడం, చేతబళ్ళు - ఇంద్రజాలం - వీటిని సృష్టించుకుని సమాధానపడేవాడు. పాపభీతివల్ల, 'ఇది కూడదు' - 'ఇది నిషేధం' - అని ఎన్నో అర్థశూన్యమైన అలవాట్లను, ఆచారాలనూ అలవర్చుకొన్నాడు. "ఎవరన్నా తుమ్మినప్పుడు, ఛాందసులు 'దైవం నిన్ను రక్షించుగాక' అంటారు. ఇల్లా అనడానికి కారణం వుండేది. తుమ్మినప్పుడు, తమ శరీరంలోని ఆత్మకూడా బైటకి వచ్చేస్తుందని వారి నమ్మకం. ఆత్మలేకుండా వున్న శరీరంలోకి భూతం ప్రవేశిస్తుందిట. దైవం పేరు చెప్పగానే, ఆ భూతం పారిపోతుందని వారి నమ్మకం." ఇట్లాంటి నిషేధాలూ, ఆచారాలూ మనలోకూడా ఎన్నోవున్నాయి రాత్రివూట భోజనం చేసేటప్పుడు తుమ్మితే ఆయుష్ష తగ్గిపోతుందని, నెత్తిన నీళ్ళు చల్లడం - ఒక ఉదాహరణ. తుమ్మినా, చీదినా, కాళ్ళు కడుక్కుని ఆచమనం చెయ్యమన్నారు మొదట్లో. దగ్గరలో నీళ్ళు లేనప్పుడు, చెవి, ముక్కు, చేతితో స్పృశించమన్నారు; ముక్కు చివర అగ్ని, చెవి చివర నీరు వుంటాయట.

గాలివానతో మెఋపు, ఉరుము వుంటాయి. ఈ మెఋపులో విద్యుత్‌శక్తి వుంది. నేలపై ఏ వస్తువుని మెరుపు తాకినా, అది దగ్ధమౌతుంది. భవనంని తాకితే, భవనం నాశనమౌతుంది. మెఋపువల్ల ఈ ప్రమాదం జరక్కుండా, బెంజమిన్ ఫ్రాంక్లిన్ అనే అమెరికా దేశీయుడు, ఒకకడ్డీ యంత్రం కనుక్కున్నాడు. లోహపు కడ్డీని ఇంటిపై పెడితే, మెఋపుని ఆకడ్డీ లాక్కుని, ఇంటికి ప్రమాదం జరక్కుండా, భూమిలోకి పంపిస్తుంది. పాపాలు చేసిన దుర్మార్గులని శిక్షించడం కోసం, దైవం, ఈ మెఋపుని పంపుతుంటే, అది జరక్కుండా కడ్డీని అడ్డువెయ్యడం, అపచారమని, ఆనాటి మత పెద్దలు తీర్పు చేశారు. మూడవ జార్జి చక్రవర్తి, వీరి వాదాన్ని బలపరిచాడు మంచివారికి మెఋపు హానిచెయ్యదు. చెడ్డవారిని శిక్షిస్తుంది. ఈ కడ్డీ పెట్టడంవల్ల చెడ్డ వాళ్ళు శిక్షింపబడక తప్పించుకుపోతున్నారు - అన్నారు వీరంతా. అక్కడ ఒక ప్రాంతంలో ఆ సమయంలో భూమి కంపించిందిట. ఈ కడ్డీలు చూసి దైవం ఆగ్రహించి భూకంపం కలగజేశాడన్నారు. రాను రాను, ఈ కడ్డీ

లను వాడుతూవచ్చారు జనం. భూమి కంపించిన ప్రాంతం, మళ్ళా భూకంపా నికి గురికాలేదు. "ఇండియాలో ఒకప్పుడు, భూకంపాలు జరిగినప్పుడు, వారు చేసిన పాపాలకు శిక్షగా భావించమన్నాడు మహాత్మాగాంధీ, తనతోటివారిని." అని రసెల్ పాపభీతికి తార్కాణని విపులీకరించాడు. అస్పృశ్యత, గాంధీ పేర్కొన్న 'పాపం.'

తాను చెప్పిన దాన్ని గాంధీ నిజంగా నమ్మి చెప్పాడనుకోను నేను. సామాన్య ప్రజలో, మతం పట్ల ఎంతో నమ్మకం వుంది. వారి మనస్సుకు నచ్చేలాగు చెప్పాలంటే, వారి కర్థమయ్యే భాషలో చెప్పాలి. అందుకోసం గాంధి ఇల్లా అన్నాడనుకుంటా.

మరొక ఉదహరణ: జీవకారుణ్య సంఘంవారు, తమ ఉద్యమాన్ని బలపరచమని, క్రైస్తవ మతాధిపతిని కోరగా, ఆయన బలపరచనన్నాడుట జీవహింస 'పాపం' కాదు, జంతువులకు ఆత్మలు లేవు, అన్నాడుట. "నేను పాపిని - కావుననే నాకు ఈ పాపభీతితో అంతరార్థం బోధపడదులెండి" అంటాడు రసెల్ తమాషాగా. చనిపోయిన వాడు మళ్ళా పుడతాడు - కావున శవాల్ని సమాధిచెయ్యాలి కాని దహనం చెయ్యకూడదట సమాధి చేసిన దేహానికి మళ్ళా ప్రాణం పొయ్యగలడు దైవం; దహనం జరిగితే, మళ్ళా అవయవాలన్నింటినీ సృష్టించి ప్రాణం పొయ్యడం, దేవుడికి అంత సుళువు కాదు. కాబట్టి సమాధి మంచిది "దహనం జరిగాక, ఆ వ్యక్తికి దేవుడు ప్రాణం ఇవ్వలేడు - అనడం దైవంపట్ల అపచారమేనంటాను." అంటాడు రసెల్. పూర్వకాలంలో, శవానికి ఎంతో మహత్తు వుండేది ఈజిప్టు దేశీయులు శవాన్ని భద్రంగా వుంచుతారు చైనాలో కూడా ఈ పద్ధతి వుంది. వైద్య రంగంలో పరిశోధన నిమిత్తం ఒక ఫ్రెంచి డాక్టరు, శవాలు ఇప్పించమని చైనీయులను కోరితే, వారు ఆశ్చర్యపడి ఆ పనిమట్టుకు చెయ్యం, కావాలంటే, బ్రతికున్న నేరస్తుల్ని ఇస్తాం, మీ పరిశోధనలకి - అన్నారుట!

కామక్రీడ అన్నింటినీ మించిన మహాపాపం. కాథలిక్కులు బ్రహ్మ చర్యం మంచిదన్నారు. అది సాధ్యపడకపోతే పెండ్లి చేసుకోవచ్చు. పిల్లలు కలగాలన్న కోర్కె వుంటే, దంపతులు కామక్రీడ జరపవచ్చు. సంతాన నిరోధకచర్య తీసుకుంటే, భార్యాభర్తలు కామక్రీడ జరపకూడదు వైద్యుల సలహా ప్రకారం, తల్లి ప్రాణం కాపాడాలంటే, గర్భస్రావం తప్ప వేరే మార్గం లేకపోయినా, కడుపు పోగొట్టకూడదంటారు. వైద్యులకేం తెలుసు, తల్చుకుంటే, చివరి ఘడియల్లో తల్లి ప్రాణం కాపాడగలడు దైవం. పాపం

చేసిన వారిని, దేవుడు సుఖవ్యాధుల ద్వారా శిక్షిస్తాడు. పాపం చేసిన భర్త ద్వారా, సుఖవ్యాధులు అమాయకులైన తల్లి బిడ్డలకు సంక్రమించినా, ఇది ఇల్లా ఎందుకు జరిగిందని మనం ప్రశ్నించకూడదు.

"స్త్రీ పురుష సంబంధం విషయంలో కాథెలిక్కు మత గురువులు నిర్దేశించిన దానికంటే కఠినమైన సూత్రాలుండాలంటారు కొందరు పెద్దలు. పిల్లలు కలగాలన్న కోర్కె వుంది కూడా, భార్యాభర్తలు కామక్రీడ జరపడం తప్పని, వార్ధక్యంలో, టాల్స్టాయ్, [2]మహాత్మాగాంధి సూచించారు.. పొగ పీల్చడం, కామక్రీడంతటి పాతకం అంటాడు టాల్స్టాయ్ ఆయన వ్రాసిన ఒక నవలలో ఒక పాత్ర, హత్యచేసేముందు, తగినంత క్రోధం తెచ్చుకో డానికి, సిగరెట్టు కాలుస్తాడు. మతగ్రంథాలలో, పొగాకు ప్రశంస లేదు. ఆనాటి వారికి పుగాకు విషయం తెలిసివుంటే, దాన్నికూడా నిషేధించి వుండేవారు." అని, ఈ విషయమై రసెల్ వ్యాఖ్య.

నేడు అమలులోవున్న నైతిక సూత్రాలు రెండు విధాలుగా ఉన్నాయి. సమాజంలో అందరం సుఖంగా వుండాలంటే, ఏవేంకావాలో కూడబలుక్కుని, బుద్ధిని వినియోగించి, ఏర్పరచుకున్న సూత్రాలు కొన్ని; క్రైస్తవ, మహమ్మదీయ, హిందూ బౌద్ధ మత గ్రంథాలలో నిర్వచించబడిన ప్రాచీనకాలపు సూక్తుల ననుసరించి, సంప్రదాయంగా, అమలు జరుగుచున్న సూత్రాలు మరి కొన్ని. హత్య, దొంగతనం - మొదలైన విషయాలపట్ల, ఈ రెండు నీతులకూ అంగీకారం కుదురుతుంది. పందిమాంసం తినకూడదన్నది కొన్ని మత గ్రంథాలలో మాత్రం వుంటుంది. ఆధునిక విజ్ఞాన శాస్త్రం పరిశోధించి తెలుసుకున్న పరిజ్ఞానాన్ని వినియోగించుకోక, ఏనాడో, మరో దశలో - వెనకటివారెవరో వ్రాసిన వెంటనే ప్రమాణాలుగా స్వీకరించడం ఆశ్చర్యంగా ఉందంటాడు రసెల్.

వెనక వ్రాయబడినవి మానవుడికి హానిచేసేవిగా వుంటే, వాటిని మనం ఎందుకు స్వీకరించి పాటించాలి? దయాదాక్షిణ్యాలు గలవారు, ఈ ప్రాచీన సూత్రాల వెనకవున్న చింతనని గుర్తించాలి గాని తూచా తప్పకుండా పాటించి తీరాలని లేదు.

'పాపం' అన్న భావంలో పేచీలున్నాయి. దేవుడు శాసించినదాన్ని అతిక్రమించడం, పాపం అంటారు. సరే. దీన్ని వితర్కిద్దాం. దేవుడు సర్వజ్ఞుడు; సర్వశక్తులూ గలవాడు. అట్లాగైనప్పుడు దైవం శాసించిన దానికి విరుద్ధంగా

---

2. సంతానం కోసం దాంపత్య విధులు నిర్వహించమని, గాంధీగారనడం ఎరుగుదును. మరి ఇల్లా ఎక్కడ అన్నాడో తెలియదు

ఏదీ జరగడానికి వీల్లేదు. కావున, పాపి, దైవాన్ని దిఃఖరిస్తే, ఇలా దిఃఖరించా లన్నదికూడా దేవుడే శాసించాడనుకోవాలి. మనుషులు పాపాలు చెయ్యాలి, అని శాసించాక, దేవుడు ఈ మనుషుల్ని, నరకానికి పంపడం ఏం బాగుంది? ప్రతిదీ దైవం శాసించినదే ఐతే, నీరో (క్రూరుడైన రోము చక్రవర్తి) తల్లిని హత్య చెయ్యడం కూడా దేవుడు శాసించివుండాలి దేవుడు మంచివాడు గావున, నీరో చేసిన హత్యకూడా మంచిదే అవాలి ఈ తర్కంనుండి మనం తప్పించుకోలేమంటాడు రసెల్.

'అహం' —— మనం అధికులమన్న భావం —— మతంద్వారా మనుష స్వీకరించిన నమ్మకాలలో చాలాభాగం ఈ భావంతో ముడిపడినవే. పాపం చెయ్యడం – 'నేను పాపిని' అన్న భావం కూడా, ఈ 'అహం' నుండి జనించినదే. ఇక్కడ వొక సంఘటన ఉదహరిస్తాడు రసెల్. ఒకాయన దిగులుగా వున్నాడుట. ఏడుస్తున్నాడుట. ఎందుకయ్యా నీకిబాధ అని ప్రశ్నిస్తే, 'నా చిన్నప్పుడు ఒక అపచారం చేశాను ' అన్నాడుట. 'నువ్వు బాధపడ నక్కర్లేదు. ఇట్లాంటి అపచారం ఎందరో చేశారు - నువ్వు ఒక్కడివేకావు ' అన్నాక, ఆ వ్యక్తి, దిగులు పోయి, సుఖంగా వున్నాడుట. "ఇంకెవ్వరూ చెయ్యనిది తనుచేశాడు గనక, ఆ వ్యక్తి అల్లా బాధపడటంలో అహం ప్రకటించి, ఆనందం పొందుతున్నాడు. అది అందరూ చేస్తున్నారు, అపూర్వమైంది కాదు, అని తెలిసేసరికి, పాపం చేశానన్న బాధలో ఆనందం లేకుండా పోయింది."

'అహం' – పెరగాలంటె, ఇతరులని హింసించడం ఒక పద్ధతి ద్వేష పూరితమైన ఈ ఉద్రేకం వెనక, అపోహలు, అద్భుత కల్పనా కూడా వుంటాయి. ఒక్క వ్యక్తి ఈ అపోహలు కల్పించుకుంటె, పిచ్చివాడనిపించుకోవచ్చు. కాని, సమాజంలో చాలామంది ఈ అపోహలు కల్పించుగుని ప్రచారం చేస్తే అద్భుత కల్పన, యదార్థమై, అందరిచేతా స్వీకరింపబడుతుంది, సాముదాయక ఉద్రేకం యుద్ధానికి పురిగొల్పినట్లుగా. అద్భుత కల్పన పురిగొల్పేది ద్వేషం, పగ, కసి- నరబలి ద్వారా.... జాకాండని యూదులు హత్య కావించారన్న కల్పనని, నాజీలు నమ్ముతూ వచ్చారు. ఈ నమ్మకాన్ని పురస్కరించుకుని, ద్వేషించేవారిని వారు హింసించవచ్చు. భూతాలు ఆవహించడం వల్ల పిచ్చెత్తుతుందని నమ్మేవారు, పదునెనిమిదవ శతాబ్దం వరకూ; పిచ్చివాణ్ణి కొడితే, అతనిలో వున్న భూతాలు కూడా దెబ్బలు తిని, వాణ్ణి వదలి వెళ్ళిపోతాయన్న నమ్మకంతో పిచ్చివాళ్ళని హింసించడం జరిగేది, మూడవ జార్జి రాజుగారికి పిచ్చెక్కినప్పుడు కొట్టి హింసించారట వైద్య వృత్తిలో, రోగిని హింసించడంతోనే చికిత్స ప్రారంభ మయ్యేది. క్రితం శతాబ్దిలో రోగికి బాధ తెలియకుండా వుండే ... మత్తుమందు

కనుక్కున్నారు. పురుడు పోసేటప్పుడు ఈ మత్తు మందు స్త్రీలు వాడచ్చు నన్నాడు డాక్టర్ సింప్సన్. ఛాందసులు వల్ల కాదన్నారు బాధపడి కనాలని దైవం శాసించాడన్నారు. ఆదిమ స్త్రీ 'ఈవ్' పాపం చేసింది కావున స్త్రీ బాధ పడాలన్నారు మత్తు మందు, బాధ తెలియనివ్వదు గావున, తప్పన్నారు. తొలి మానవుడైన ఆదమ్ నిద్రపోతున్నప్పుడు, అతని ప్రేగు తీసి స్త్రీని సృష్టించాడు దేవుడు – కావున పురుషులకి మత్తు మందిస్తే ఫరవాలేదన్నారుట! పాశ్చాత్య దేశాలలో స్త్రీలకు వోటింగు హక్కు వచ్చాక, ఇదంతా తప్పని గ్రహించారు. క్రైస్తవ మతంతో నిమిత్తంలేని జపానీయులు, ఈనాటికీ, -స్త్రీలకు బాధ తొలిగే మందు కూడదు అంటారుట

అల్లాగే, 'మాది ఉత్తమ జాతి' – 'మాది స్వచ్ఛమైన రక్తం' అనే నినాదాలు, సాముదాయక జాత్యహంకార సూచకములే. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో, గాయపడినవారికి, రక్తమిచ్చి సహాయ పడేది రెడ్‌క్రాస్ సంస్థ. అప్పుడు నీగ్రోల రక్తం వాడకూడదన్నారుట అమెరికా రెడ్‌క్రాస్‌వారు. నీగ్రోల రక్తం, నీగ్రోల కియ్యవచ్చునని మాత్రం అంగీకరించారు. హిట్లర్ కాలపు జర్మనీలో, యూదుల రక్తం, నాజీ సైనికులకు వాడకూడదన్నారు. జాతిని గూర్చి వింత వింత అభిప్రాయాలున్నాయి రాజులు, రాజ్యం ఏలిన కాలంలో, ప్రజ కంటే రాజు ఘనుడు. రాజు జాతి ఉత్తమ జాతి, స్త్రీలకంటే, పురుషులు తెలివైనవారు – అని నిన్న మొన్న వరకూ నమ్ముతూ వచ్చారు ఇతర జాతుల కంటె, తెల్ల జాతివారు అధికులు - ముఖ్యంగా నల్ల జాతులకంటె, జపాన్‌లో, పసుపుపచ్చరంగు జాతివారు అధికులు. హైటీలో, క్రీస్తుని నల్లగానూ, సాటన్‌ని (దైవాన్ని ధిక్కరించిన దుర్మార్గుడు) తెల్ల"గానూ చూపుతారు. గ్రీకుజాతి ఉత్తమ మైందని, ప్లాటో, అరిస్టాటిల్‌లు చెప్తూవచ్చారు గావున, బానిసత్వం నెలకొల్ప బడింది – ఎటొచ్చీ, గ్రీకులు ప్రభువులు, హూణులు బానిసలూ అవాలి. ఇదంతా పదవుల్లో వున్నవారు ప్రచారం చేసిన అభూత కల్పన కాని, ఏ మాత్రం యదార్థం కాదంటాడు రసెల్. "యూరప్ అంతటా, ఎక్కడా కూడా స్వచ్ఛ మైన జాతి అంటూ వొకటుందనుకోను. రష్యనులలో టార్టార్ రక్తం, జర్మనీ వారిలో స్లావనిక్ రక్తం, ఫ్రెంచ్‌వారిలో కెల్టు, జర్మనీయులలో మిశ్రమ రక్తం, ఇటాలియన్‌లలో రోముదేశపు బానిసల రక్తం వున్నాయి. బాగా మిశ్రమమైన జాతి ఇంగ్లీషువారు స్వచ్ఛమైన జాతికి చెందడంలో విశేషమైనమేలు కనబడదు. నిజానికి, స్వచ్ఛమైన జాతులను, ఆస్ట్రేలియా ఆదిమవాసులలోనూ, ఆఫ్రికాలో పిగ్మీల (పొట్టివాళ్ళు) లోనూ, హాటెన్‌టాట్ జాతులలోనూ చూస్తాం – అంటాడు రసెల్. ఈ జాతులు గొప్ప సంస్కృతిని నెలకొల్పాయనలేము,

జాతికి సంబంధం లేకుండా, రక్తం గురించి ఎన్నో మూఢ నమ్మకాలు ఉన్నాయి, బహిష్టు, రజస్వల విషయంలో పెట్టిన ఆంక్షలు చూస్తే, రక్తం మలినపరుస్తుందన్న నమ్మిక ఎంత దృఢమైందో తెలుస్తుంది. 'బిడ్డది తండ్రి రక్తం' అనుకోడం కూడా ఈ రకమైన ఆచారమే. నిజానికి బిడ్డలో ఉండేది తల్లి రక్తం కాని, తండ్రిది కాదు. మార్క్స్ సిద్ధాంతాల ఫలితంగా రూపొందిన రష్యాలో, జాతుల విభజన ఆర్థిక వ్యవస్థ ద్వారా జరిగింది. శ్రామికులు మంచి వారు; ఇతరులు చెడ్డవారు. కమ్యూనిస్టులు మంచివారు, ఇతరులు చెడ్డవారు. ఈ రెంటినీ సమన్వయ పరచాలంటె, మాటల అర్థాలని మార్చాలి. శ్రామికుడంటె, ప్రభుత్వ పక్షంవాడు. 'కులక్' అంటె మొదట్లో స్థితిపరుడైన కర్షకుడు – అని అర్థం, తర్వాత, సమిష్టి పద్ధతికి వ్యతిరేకుడన్న అర్థం వచ్చింది. ఘనకార్యం చేసిన నల్ల రంగు వ్యక్తిని మెచ్చుకోవాలంటె, అమెరికాలో 'అతను తెల్లవాడు' అంటారుట. ధైర్య సాహసాలు గల మహిళ 'మగతనం' కొనియాడతారు.

ఆర్థిక రంగంలో ఇట్లాంటి మూఢనమ్మకాలు కొన్ని ఉన్నాయి. బంగారం, వజ్రాలు - వీట్లకున్న విలువ వీటిల్లో ఒకటి. బంగారానికీ, వజ్రానికీ, ఒకప్పుడు మహత్తు ఉందని నమ్మేవారు. "ట్రాన్స్ వాల్ గనులలో బంగారం తవ్వి, అమెరికా బ్యాంకులలో ఉంచుతారు. అప్పు తీసుకున్న దేశాల వారివద్ద అప్పు చెల్లించేటందుకు డబ్బులుండదు; వస్తు రూపేణా ఇస్తే స్వీకరించరు గావున, దివాళా తీయాల్సి వస్తుంది. నలభై ఏళ్ళ క్రితం ఏర్పడిన ఆర్థికమాంద్యానికి కారణం, బంగారానికి మహత్తున్నదన్న నమ్మకంవల్లనే నంటాడు ఈయన.

మానవ స్వభావము, అన్ని చోట్లా, ఎల్లప్పుడూ ఒకేలాగుంటుంది, మార్చలేం — అన్నది మరొక తుక్కు భావంగా పేర్కొన్నాడు రసెల్. 'మనుషులు - అంతా ఒకచేనండీ, మారరు' అని ఎవరన్నా అంటే, ఆ వ్యక్తి తన గ్రామంలో తానెరుగున్న నలుగురైదుగుర్నీ దృష్టిలో పెట్టుకుని అంటున్నా డన్నమాట. ప్రాచీన సమాజాలలో మనుషుల్ని పరిశీలిస్తే, ఈ నిర్వచనం తప్పని తెలుసుకోవచ్చు.

ఒక భార్యని పోషించే ఆర్థిక స్తోమత లేనందున టిబెట్టుదేశంలో, స్త్రీకి నలుగురైదుగురు భర్తలుంటారు. మరి కొన్ని ప్రాచీనపు తెగలలో, అతిథికి భార్యని వప్పగించడం ఉండేది. జనాభా పెరిగిపోకుండా ఉండాలంటె, ఈ శిశు హత్య మంచిదే నన్నాడు 'ప్లేటో' (గ్రీకు తత్వజ్ఞుడు). కొన్ని ఆదిమవాసులలో, వ్యక్తిగతమైన ఆస్తిపాస్తులే లేవు. నాగరీక సమాజాలలో కూడా, మానవ ప్రకృతికి అతీతమైన ఏర్పాట్లు జరిగేవి. వీటికి కారణం, ఆర్థిక పరిస్థితి.

మాస్కోలో, ఇళ్ళు దొరకడం కష్టంగా ఉన్న కాలంలో, గర్భవతి అయిన స్త్రీకి కలగబోయే సంతానానికి, నేనే తండ్రినని, వ్యక్తులు ఎగబడేవారుట - ఎందుకంటె, గర్భవతికి ఒక గది ఇచ్చేది ప్రభుత్వం; తండ్రి అనిపించుకున్న వ్యక్తికి, ఆ గదిలో సగం వాటా దొరికేది. విద్య, శిక్షణ, - మానవ స్వభావానికి రూపం కల్పించే శక్తులు. తిండి, విద్య, తగు శిక్షణ - వీట్లతో మనుషుల్ని కఠినులుగా తయారు చేయవచ్చు; లేక అమాయకులుగా, బానిసలుగా రూపొందించవచ్చు. మానవ స్వభావం మారదు — అన్న నమ్మకంవల్ల ఏర్పడిన ప్రమాదం ఏమిటంటె; పోటీ పడటం మానవుడి స్వభావం గనక, యుద్ధాలు ఎప్పుడూ జరిగి తీరతాయన్న నమ్మకం, కోరినదాన్ని పొందలేక విఫలులైన వ్యక్తులు, యుద్ధానికి సిద్ధులౌతారనలేము. 1814 వరకూ స్వీడన్ దేశీయులు యుద్ధాన్ని ఎరగరు. వారు నిస్పృహులు కాలేదు. చాలా సంతోషంగా ఉండే ప్రజ. ఇతరులు జరిపే మరో యుద్ధంలో తాము ఇరుక్కుంటామన్న బెంగతప్ప, మరొక చింత లేదు, వారికి. "బలమైన ప్రభుత్వం, సైనిక దళం, ప్రచార సాధనాలు నాకు ఇవ్వండి, ముప్పై యేళ్ళల్లో, రెండు, రెండూ కలిపితే, మూడన్న భావాన్ని ప్రజలు స్వీకరించేటట్లు చేస్తాను. నీరు వేడెక్కినప్పుడు గడ్డ కడుతుందనీ, చల్లబడినప్పుడు, మరిగిపోతుందనీ — నమ్మేటట్లు చేస్తాను. ఇది నమ్మినంత మాత్రాన, నీళ్ళు కాచాలంటె, రెఫ్రిజిరేటర్లో పెట్టరనుకోండి కాని పైకి మాత్రం వారంతా ఆ పాటే పాడతారు. ప్రభుత్వం చెప్పినదానికి భళాభళీ అంటారు అట్లా అననివారిని, ప్రభుత్వం, ఉద్యోగం నుండి తొలగిస్తుంది. అధికార వర్గంలో, పెద్ద పదవుల్లో ఉన్న కొద్దిమంది ఉద్యోగులు మాత్రం ఒకర్నొకరు చూసుకుని, చెప్పుకుని, నవ్వుకుని, కన్ను గీటి - తమ పనుల్లో పడిపోతారు కొన్ని ఆధునిక ప్రభుత్వాలు, ఈ విధంగా కొనసాగుతున్నాయనడం అతిశయోక్తి కాదు." అని రసెల్, ఊహించిన ఉదాహరణ చమత్కారమైంది నేడు, ప్రచారానికున్న బలం, పలుకుబడి ఎంతటివో చూపేటందుకు, ఇది మంచి ఉదాహరణ ఎప్పుడన్నా రెండు రెండు కలిపితే మూడు అని నమ్మిన ఒక వూహా సామ్రాజ్యం చరిత్ర, కథగా, వ్రాయాలనిపిస్తుంది నాకు. కాని, ఈ ఉదాహరణలన్నీ 'మానవ ప్రకృతి మారదు' అన్నది తప్పుగా ఋజువు చేస్తాయనిపించదు నాకు. విద్య శిక్షణ వల్ల మానవుడి నమ్మకాలని వూహాలని మార్చవచ్చు - కాని ఇవి మానవ ప్రకృతిని మార్చలేవు. ఆకలేసినప్పుడు అన్నం తింటాడు మనిషి; అలిసినప్పుడు నిద్రిస్తానంటాడు. ఈ మానవ 'వ్యవస్థని' — తర్ఫీదు, విద్య — మార్చలేవు. కొందరు పెద్దలు కలిసి ఒక

సమాజాన్ని రూపొందిస్తారు ప్రజలు అందులో ఇమిడేలాగు, దాన్ని స్వీకరించేలాగు, విద్యద్వారా చెయ్యవచ్చు ఆర్థికస్థితి ఈ సమాజాల స్వరూపం నిర్ణయించవచ్చు. నిజమే. సంప్రదాయాన్ని స్వీకరించేటట్లు చెయ్యడం వేరు; అంత మాత్రంచేత మానవ ప్రకృతి మారిందనలేము. ఒక గ్రామంలో ఒకే విద్యాలయంలో విద్య నభ్యసించిన ఇరవైమంది, పెద్దయ్యాక, ఒకచోట గుమిగూడారనుకుందాం అట్లా ఉండగా ఎవరో 'పులి', 'పులి' అని అరుస్తాడనుకుందాం. ఏం జరుగుతుంది? వారందరూ భయపడి, చిందర వందరగా పారిపోతారు. భయం నుండి పారిపోవడం మానవ స్వభావం. దీన్ని ఎవ్వరూ మార్చలేరు. పారిపోక, మొండికెత్తి, తెగించి, పులితో దెబ్బలాడే వ్యక్తి ఉండొచ్చు ఇల్లా తెగించి, ధైర్యంగా ఎదుర్కొనడంకూడా మానవ స్వభావమే ఆ గుమిగూడిన ఇరవై మందిలో, ఒకడు పారిపోక నిలబడి దెబ్బలాడ్డానికి సిద్ధపడితే, ఆ వ్యక్తి విద్యా, శిక్షణవల్ల అలా తయారయ్యాడు, అనలేం. మిగతా పందొమ్మిదిమందీ, ఆ విద్యాలయంలో తర్ఫీదు పొందినవారే. వారంతా పారిపొయ్యారు, 'పులి' అనగానే. విద్య శిక్షణవల్ల అందరికీ పులి నెదుర్కొనే ధైర్య సాహసాలు నేర్పవచ్చు నన్న భావాన్ని స్వీకరించడం కష్టం. అందరికీ, పుష్టికరమైన ఆహారమిస్తే, ధైర్యసాహసా లబ్బుతాయనీ అనలేం. వారు బలంగా, ఆరోగ్యవంతంగా ఉండొచ్చు. మొండి ధైర్యం, సాహసం, త్యాగశీలం మొదలైనవి, మానవ ప్రకృతిలో భాగాలు. విద్యవల్ల, వాటిని ఉపయోగంలోకి తేవచ్చు – కాని మార్చలేం. జంతువు, ఆకలేసినప్పుడే వేటాడి తింటుంది. రేపటికి దాచుకోగలడు మనిషి దానికోసం ఈ పూట పస్తుండగలడు. రెండు రెండు మూడు కాదు, నాలుగని తెలుసుకున్న ఉన్నతోద్యోగులు కూడా తాము ప్రచారం చేస్తున్న 'రెండు రెండు మూడు' అన్న సత్యానికి, నప్పుకున్నట్టు రసెల్ వ్రాశాడు. ప్రచారం - ప్రభుత్వం వారి నమ్మకాలనీ భావాలనీ మార్చింది కాని - సహజ ప్రకృతిని కాదు. ఇంక ఆ ఇరవై మందికీ, చిన్నప్పటి నుంచీ పాఠశాలలో పులి చాలా సాదువైన జంతువు అని బోధిస్తే, 'పులి' అనగానే వారు పారిపోరు - అని రస్సెల్ అంటే, నేనేమీ చెప్పలేనుస్మాండి.

సంప్రదాయ సిద్ధమైన భావాలకు విరుద్ధంగా నడుచుకొన్న వ్యక్తులు గొప్పవారని, వారి భావాలు మంచివనీ అనుకోడం పొరబాటే నంటాడు రసెల్. పొరబాటుపడే అవకాశాలెన్నో ఉన్నాయి. ప్రజామోదం పొందని సత్యాన్ని అన్వేషించడం బదులు, కొందరు, వెర్రివాళ్ళు, ప్రజామోదం పొందని పొరబాట్లని అలవరుచుకుంటారంటూ రసెల్ ఇల్లా వ్రాస్తాడు:

"ఒకాయన, తనకి తత్వశాస్త్రంలో అభిరుచి వుందంటూ, నా పుస్తకాలు, చదివిస్తానని, తీసుకెళ్ళాడు. మర్నాడు నాదగ్గరకొచ్చి, ఆ పుస్తకం చదివాననీ, అందులో తనకి అర్థమైన వాక్యం ఒక్కటే వుందనీ, ఆ ఒక్క వాక్యమూ అబద్ధమనీ - అన్నాడు ఆ వాక్యం ఏదన్నాను. జూలియస్ సీజర్ రోము చక్రవర్తి చనిపొయ్యాడు' అన్న వాక్యం అన్నాడు ఆ వాక్యంలో వున్న అబద్ధ మేమిటో చెప్పమన్నాను 'వేరే చెప్పాలా. నేనే, సీజర్ చక్రవర్తిని!' అన్నాడు."

మంచి రోజు చూసుకుని ఒక పనికి ఉపక్రమించటం ప్రపంచం అంతటా ఉంది. ఇదొకతుక్కు భావం అంటాడు రసెల్. ఆదికాలంలో, సైనిక వీరులు, మంచి రోజు చూసుకుని యుద్ధానికి వెళ్ళేవారుట. పాశ్చాత్యులకు శుక్రవారం మంచిది కాదు. 'పదమూడు' సంఖ్య అమంగళమైంది. మేడ కడితే, 13 వ అంతస్థు ఉండదు ఇవన్నీ అపకారం చెయ్యని మూఢనమ్మకాలు రెండు వేల సంవత్సరాల తర్వాత, మనం ఈనాడు అలవరుచుకున్న నమ్మకాలు మూఢ నమ్మకాలుగా మూలపడొచ్చు. మానవుడు ఏదో ఒకటి నమ్మాలి. నమ్మకానికి నిదర్శనం దొరకనప్పుడు, తప్పుడు నిదర్శనాలతో తృప్తిపడతాడు. పాలకులు పదవులు స్వీకరించేటప్పుడు, మంచిరోజు చూసుకుంటారు. కాని ప్రభుత్వంలో ప్రధాన నాయకుడు చనిపోయినప్పుడు, అనువైన వ్యక్తిని వెంటనే ప్రధాన నాయకుడుగా పదవిలో వుంచాలి. వ్యవధి ఉండకూడదు. అట్లాంటి సందర్భంలో, మంచిరోజు, తిధి, వారం, నక్షత్రం చూసుకోరు. వెనక క్షురకర్మకి కూడా మంచి రోజు చూసుకోవాలి. ఇప్పుడు ఇది పోయింది.

సహజంగా, ప్రకృతిననుసరించి జీవించాలి - అన్నది కూడా మరొక చెత్త భావం. ఈ భావం చికిత్స విషయంలో బాగా చలామణీ అయింది. ఏమీ చెయ్యక, సహజంగా అల్లా వదిలేస్తే, కొన్నివ్యాధులు అవే కుదిరిపోతాయి - శరీరం కోలుకుంటుంది - అన్నభావం నిజమే. శరీరం సహజంగా తనకి తనే చికిత్స జరుపుకుంటుంది చిన్నగాయాలు వాటంతట అవే మానిపోతాయి జలుబు తగ్గిపోతుంది లంఖణం పరమౌషధం కాని ప్రకృతి సిద్ధమైన చికిత్సకి మనుష్య యత్నం కూడా కావాలి. క్రిమి నిర్మూలన ద్రావకం వాడకపోతే, పుండు విష మించొచ్చు జలుబు, న్యూమోనియాగా పరిణమించవచ్చు. దుస్తులు ధరించడం. స్నానం, తల దువ్వుకోడం - ఇవన్నీ ప్రకృతికి విరుద్ధమైన పనులే. టీకాలు వేయించుకోడం అసహజమనీ, ప్రకృతి విరుద్ధమనీ, అనేవారు ఈనాటికీ ఉన్నారు వండిన వంటకం, ప్రకృతి విరుద్ధం. క్రీస్తుపూర్వము, 600 సంవత్సరంలో వర్ధిల్లిన చైనాదేశపు తత్వశాస్త్రజ్ఞుడు, 'లవోట్సి' కోట్లు, వంతెనలు, పడవలు-

ప్రకృతి విరుద్ధాలైన పరికరాలుగా భావించి, చీదరించుకుని చైనాదేశం వదిలి వెళ్ళిపొయ్యాడు. నాగరికత తెచ్చిపెట్టిన ప్రతి కొత్త పరికరమూ, మొదట్లో, ప్రకృతి విరుద్ధమైందిగా పరిగణించబడటం, ఎప్పుడూ జరుగుతూనే ఉంది. బ్రహ్మచర్యం, ప్రకృతి విరుద్ధం అనరు, ఎందువల్లనో - కాని, సంతాన నిరోధక ప్రక్రియని మాత్రం ప్రకృతి విరుద్ధమైందిగా ఖండించి వేస్తారు పెద్దలు. పిల్లల్ని సృష్టించిన భగవంతుడు, వారిని పోషించలేకపోతాడా అంటారు వీరు. క్షామము తాండవించి వేలాది ప్రజ చనిపోయిన చరిత్ర మరిచిపోతారు వీరు. ఇహంలో తిండి లేక మాడి చస్తేనేం, పరంలో స్వర్గం అనుభవిస్తాడుగా, అంటారు వీరు.

అల్లాగే స్త్రీని గురించి ఎన్నో చెత్తభావాలు ప్రచారంలో వున్నాయి. ప్రతి మగవాడూ స్త్రీలని గురించి ఏదో ఒక నిర్వచనం చేస్తాడు. ఈ నిర్వచనాలన్నీ పోగుచేసి ఎవరన్నా ఒక చరిత్ర వ్రాస్తే బాగుండును. క్రైస్తవ మతం ప్రబలాక, స్త్రీ వగలాడిగా పేరు తెచ్చుకుంది, మరికొందరు ఆమె యోగిని కూడా కావచ్చు నన్నారు క్రితం శతాబ్దిలో స్త్రీచే వంచించబడటానికి ఇష్టపడని పురుషులు, స్త్రీని దేవతగా పరిగణించి, ఆమెకి రాజకీయాలలో ప్రమేయం లేకుండా చేశారు. స్త్రీకి వోటింగ్ హక్కు కోసం కృషి చేసినవారు, స్త్రీ ప్రవేశంతో రాజకీయాలు చక్క బడతాయన్నారు. ఇది భ్రమ అని తెలిసిపోగానే, చాలామంది పురుషులు స్త్రీని వగలాడిగానే ఎంచుతున్నారు. పురుషుడి దౌర్జన్య, దారుణాల నుండి రక్షించగల వారుగా, స్త్రీలు తమని తాము ఎన్నిక చేసుకున్నారు. పెద్ద నవలల్లో స్త్రీ ఏ స్థితిలో వుందో చూడొచ్చు మొగాడు వ్రాసిన నవలలో ప్రధాన నాయికను రచయిత ప్రేమిస్తాడు గావున, ఆమె అటులగా చిత్రించబడుతుంది. రచయిత స్త్రీ ప్రవర్తన, మనస్తత్వం, గమనించి వ్రాయడు. తన ఉద్రేకాలని పరోక్షమైన యదార్థాలుగా రూపొందిస్తాడు. ఇతర పాత్రల చిత్రణలో, పరిశీలన ఉండొచ్చు. స్త్రీలు వ్రాసిన నవలల్లో రెండు రకాల స్త్రీ పాత్రలు తటస్థపడతారు. అందం, తెలివి, ప్రేమ, వివేకము లాలన — ఇవన్నీ కలిగిన తమలాంటి పాత్రలు; లేదా అన్ని దుర్గుణాలూ గల వేటకత్తె లుంటారు. పురుషులకు గాని, స్త్రీలకు గాని, స్త్రీని సక్రమంగా చిత్రించడం సాధ్యం కానట్లుంది. అల్లాగే ఒక జాతిని గురించిన అభిప్రాయాలు కూడా, సత్యదూరాలంటాడు రసెల్. కండ్ల జోడు ధరించిన ఆచార్యులు, జర్మనీ వారు; ప్రేమ కలాపాలలో నిమగ్నులైనవారు ఫ్రెంచ్ వారు; దుకాణదారులు ఆంగ్లేయులు — మొదలైన అభిప్రాయాలన్న మాట ఆంధ్రుల ఆరంభ శూరత్వం లాంటి అభిప్రాయం.

ఇట్లాంటి భావాల, నిజానిజాలు కనుక్కోవాలంటె, పరిశీలన అవసర

మంటాడు. దృష్టాంతరాలు వెదకాలంటాడు. గ్రీకు తత్వజ్ఞుడు అరిస్టాటెల్, పురుషుడికున్నన్ని పళ్లు స్త్రీకి లేవంటాడు. ఆయన తన భార్యను నోరుతెరవమని నోట్లో పళ్ళు లెక్కించివుంటె, తీరిపోను అట్లా పరిశీలించక, గుడ్డిగా కొన్ని అసత్యాలు ప్రచారం చేసిన అరిస్టాటెల్ 'నాగరికతకు పట్టిన జాడ్యం' అని రసెల్. తెలియని విషయం, తెలుసుననుకోవడం మనం చేసే పొరబాట్లలో ప్రధానమైంది రూఢైన ఆధారాలు లేని విషయాల గురించే, వాదోపవాదాలు చెలరేగేది. ప్రయాణం చెయ్యి, మరో దేశంలో గడుపు, నీ భావాలకి విరుద్ధమైన భావాలని ప్రచారం చేసేవారి స్నేహం చెయ్యి, నీ పార్టీకి వ్యతిరేకులైన పార్టీ వారి పత్రిక చదువు. వారి భావాలు నీకు చెడ్డవిగా తోస్తే నీ భావాలు వారికి చెడ్డవిగా తోస్తాయనుకుని తృప్తిపడు. ఇట్లా చెయ్యడంవల్ల, ఉద్రేకం సమసి, నిదానంగా ఆలోచించే మనస్తత్వం ఏర్పడుతుంది అంటాడు రసెల్.

"రైల్వేలు, స్టీమర్లు, యంత్రాలు — ఇవి మహాత్మా గాంధీకి నచ్చవు. పారిశ్రామిక విప్లవం తెచ్చిన మార్పులు లేకపోతేనే బాగుండు నంటాడు ఆయన. పాశ్చాత్య దేశాలలో, ఇట్లాంటి అభిప్రాయం గలవారు దొరకరు వారంతా, పారిశ్రామిక విప్లవాన్ని స్వీకరించిన వారే నీకిష్టంకాని భావంలోని నిజానిజాలు తెలుసుకోవాలనుకున్నప్పుడు, గాంధీగారు, ఏ విధంగా ఈ భావాన్ని వితర్కరించివుందురో వూహించు. ఈ విధంగా వూహించి, అప్పుడప్పుడు నా అభిప్రాయాలు మార్చుకున్నాను. ఈ భావం కాక మరొక భావం వుండే అవకాశం వుందనీ, అది కూడా నా భావం అంతటి మంచిదై ఉండొచ్చునని గ్రహించడం వల్ల మూఢ విశ్వాసం నుండి జనించే మొండి పట్టు, — బల్లగుద్ది కచ్చితంగా చెప్పే, స్వభావం, క్షీణించిపోతాయి"

ముఖస్తుతి చేసే భావాలను స్వీకరించే ముందు జాగ్రత్తపడు, పురుషుడు అధికుడంటారు, స్త్రీ అధికురాలంటారు కవులంతా పురుషులేనంటే, నేరస్థులంతా పురుషులేనన్న సమాధానం వస్తుంది. ఇందులో ఏది నిజమో ఎవ్వరూ నిర్ణయించలేరు. మనం అనధికులం, మన జాతివారు అధికులు, మన దేశం గొప్పది, ఇతర దేశాలతో పోల్చి చూసినప్పుడు మన లోపాలని విడిచేసి, మంచి లక్షణాలను మాత్రం వక్కాణిస్తాం; మనిషి అధికుడో కాడో ఎవ్వడూ చెప్పలేడు. ఎందుకంటె మనిషిని మనిషితో కాక, నిర్జీవమైన బాహ్య జగత్తుతో పోల్చలేం. ఇట్లాంటప్పుడు, అతి విశాలమైన విశ్వంలో, భూగోళం ఎక్కడో మారు మూలగావున్న చిన్ని గోళం. అందులో మనిషి మహా అల్పుడు. ఇతర గోళాలలో, మనిషిని మించిన ప్రాణులుండొచ్చు. - ఇలా అనుకుంటే తప్ప, మానవుడి అల్పత్వం తెలిసిరాదంటాడు రసెల్.

మన పౌరబాట్లకి మరొక కారణం భయం. దయ్యాలంటే భయం. యుద్ధ సమయంలో, పుకార్లు, కల్పనా కథలు ప్రచారంలో కొస్తాయి ఇవన్నీ భయం కల్పించినవే. ఎక్కడో అమృతం ఉందనుకోడం, మనకి స్వర్గం, మన శత్రువులకి నరకం - యీ కల్పనలన్నీ భయం రూపొందించినవే చీకటంటె భయం. మరొక గుంపు అంటే భయం. మృత్యువంటే భయం. వారిలో వున్న అస్పష్టమైన భయాన్ని దాచెయ్యడానికి యత్నించేవారిలో రేకెత్తే భయం-ఈ భయాలకి లొంగ కూడదు. లొంగిపోతే మూఢాచారాలకు తల ఒగ్గినట్లే. మూఢ నమ్మకం కాఠిన్యానికి దారి తీస్తుంది. భయాన్ని జయించడమే జ్ఞానం, సత్యాన్వేషణకి ఇదే మార్గం.

కొన్ని తత్వ శాస్త్రాలు నేర్పింది, భయం జయించాలనే. శీలం కలిగి ఉండటమే జీవిత పరమావధి ఏ శత్రువూ, నా శీలాన్ని అపహరించలేదు, కాబట్టి, శత్రువులంటే భయపడనక్కర్లేదు. శీలం ఒక్కటే పరమార్థం అని నమ్మడం కష్టం. ఐహిక కష్టాల పట్ల విముఖత చూపడం ఒక్కటే పరమార్థం అంటాడు తత్వజ్ఞుడు స్పైనోజా. శారీరక బాధ చెడుగు కాదన్న వాదం మూఢ నమ్మకం నుండి జనించినదే నంటాడు రసెల్. ఎందుకంటె, ఇది నమ్మినవారికి వారి కష్టాలపట్ల విముఖత ఏర్పడడమే కాకుండా, ఇతరుల కష్టాలని గురించి పట్టించుకోని మనస్తత్వం ఏర్పడుతుంది. "మనిషి, ధైర్యంగా మృత్యువు నెదుర్కొని, ప్రాణాన్ని అర్పించగలడు, ఒక ఆదర్శం కోసం. కాని ఆ ఆదర్శం ప్రాణత్యాగం చెయ్యవల్సినంత ఘనమైంది కాదు-అని మాత్రం అంగీకరించడు. మృత్యువు కంటె బాధాకరమైంది, అవనింద. అందుకనే, ఒక సమాజంలో వారందరూ ఒక విపత్తుకి గురైనప్పుడు, సమాజం చెప్పిన దానికి విరుద్ధంగా చెప్పక, అందరివలే తామూ తలొగ్గి నడుచుకుంటారు." అని ఒక ఉదంతం చెప్తాడు రసెల్. 1820 లో, ఉత్తర న్యూయార్క్ ప్రాంతంలో చెరువుగట్టున ఒక యోగిని నివసించేదిట. ఫలానా రోజున, చెరువులో నీళ్ళపై నడిచి వెడతానని, తన అనుచరులకి తెలియచేసిందట. ఆ రోజుకి, వేలాదిగా జనం వచ్చారుట ఆ వింత చూడడానికి. "నేను ఈ నీళ్ళ మీద నడిచి వెళ్ళగలనన్న నమ్మకం మీ అందరికీ వుందా?" అని అడిగిందట. ఏక కంఠంతో వారంతా "ఓ, గట్టి నమ్మకం వుంది" అన్నారుట. "అట్లాగైతే, నేనింక ఈ నీళ్ళపై నడిచే అవసరమే లేదు" అందిట ఆమె. వారంతా తృప్తిచెంది ఇళ్ళకు పొయ్యారుట.

మానవుడు ఎదుర్కొనే దురదృష్టాలు రెండు రకాలు జీవంలేని బాహ్య జగత్తు తెచ్చిపెట్టేవి; తోటి మానవుడు తెచ్చిపెట్టేవి. విజ్ఞానశాస్త్రం ద్వారా

మొదటిదాన్ని ఎదుర్కోవచ్చు. రెండోరకంవి, హెచ్చిపోతున్నాయి. వెనక క్షామం సంభవించేది; అది బాహ్యజగత్తు కలగచేసిందే. మానవుడు ఎంతో యత్నంచేసి దాన్ని ఎదుర్కొన్నా, ఆకలి బాధచే జనం చనిపోతూవుండేవారు. ఈనాడు సంభవించే క్షామాలకి, మానవుడే కారణం —నొచ్చు ఐదారేళ్ళుగా యుద్ధం పేరిట, ఒకర్ని ఒకరు చంపుకోటంతో గడిపారు; ఇప్పుడు బ్రతికివుండడమే వారికి కొత్తగా ఉంది. మానవుడి శత్రువు, మానవుడే. మానవుడివల్ల కలిగే అరిష్టాలకి కారణం, భావాలూ నమ్మకాలూ కాదు; వీటిని ముసుగుగా కప్పుకుని తాండవించే ఉద్రేకాలే కారణం. క్రైస్తవ మత సూత్రాలని పాటించని వారిని బాధలు పెట్టేవారు మత విద్రోహులను అగ్నిలో కాల్చి చంపుతుంటే, జనం చూసి వినోదించేవారు. అల్లాగే వినోదక్రీడగా యుద్ధం కావాలనే వారుంటారు — ఓడించిన ప్రజని చెఱచి, కొల్లగొట్టే అవకాశాలుంచే వీటిని ధర్మయుద్ధాలుగా పరిగణించే వారున్నారు. డాక్టర్ ఆర్నాల్డ్ అనే ఆయన పేరుగాంచిన ప్రధానోపాధ్యాయుడు పిల్లల్ని కొట్టి శిక్ష గరిపేవారు. ఇది తప్పన్నవారిపై విరుచుకుపడే వాడు. ఇల్లా శిక్షించి హింసించడంలో ఆయన కాస్త వినోదిస్తున్నాడనుకోవాలంటాడు రసెల్. శిక్షించి, హింసించి బాగుచెయ్యడం అనేది మానవుడికి హాని కలిగించిన భావం. కుక్కనీ, భార్యనీ, దేవదారు వృక్షాన్నీ, కొట్టిన కొద్దీ బాగవుతాయన్న ఆంగ్ల సూక్తి వొకటుందట. "దేవదారు వృక్షం సంగతి నాకు తెలియదు కాని, భార్యని హింసించాలన్నదాన్ని నేడు ఎవ్వరూ హర్షించరు" బాగా వెనక ఇట్లాంటి భావాలన్నీ, ఒక సిద్ధాంతంగా రూపొంది, హానికలగ చేశాయి. నరబలివల్ల పంటలు మెరుగవుతాయన్న నమ్మకం వుండేది బలైనవారి రక్తం, దేవుడికి ప్రీతిట. శరీర సౌఖ్యాలని త్యజించిన వాడు యోగి. త్రాగుడు, మాంసభక్షణ, స్త్రీలోలత — అన్నీ త్యాగం చెయ్యాలి. మానసికమైన ఆనందాన్ని చూరగొంటాడు ఇది శరీర సుఖంకంటె, మంచిది, ఉన్నతమైంది మత విద్రోహులు నరకానికెళ్ళి అక్కడవారు పడే బాధల్ని తిలకించడంలో వీరు ఆనందం పొందుతున్నారు.

ఐహిక వాంఛనీ, శరీర సుఖాలనీ పరిత్యజించిన వారిలో దయాదాక్షిణ్యాలు కలుగుతాయనలేము తను బాధలు పడుతున్నాడు గావున, ఇతరులుకూడా బాధలు పడాలని కోరతాడు ఇట్లాంటి దృక్పధాన్ని బలపరిచే తత్వాన్ని స్వీకరించి ప్రచారం చేస్తాడు. కష్టపడాలి — అన్న 'నీట్‌షె' తత్వం స్వీకరించిన నాజీలు అధికారంలోకి రాకముందు, సుఖాలు వొదులుకుని కష్టపడేవారు. 'వెన్నకంటె తుపాకి' మెరుగన్నార. దీని పర్యవసానం యుద్ధం, నాజీల పతనం. విలాసము;

షోకు, దర్జా, భోగాలు విడిచేసి కష్టించడమే పరమావధన్నారు కమ్యూనిస్టులు. సర్వపరిత్యాగము, కాఠిన్యము – ఈ రెండూ కలిసే వుంటాయి. పాపులు, యోగులు, రెండు తెగలు. పాపపరిహారార్థమై శిక్ష అనుభవించడం అన్నది, బాల్యంలో ఏర్పడే మానసిక స్థితి. కాని ఈ శిక్ష మరొకరు పడాలన్న తాప త్రయం వుండిపోతుంది, ఎందుకో. ధనికులమో, బీదలమో, మన సంప్రదింపు లేకుండా, ఆర్థిక వ్యవస్థలో, మనం వొచ్చిపడతాం. ఒక దేశంలో ధనికులమైతే మేలు; మరొక దేశంలో బీదలమైతే మేలు. కారల్‌మార్క్స్, బాలుడుగా వున్నప్పుడు, ఆయన తండ్రి క్రైస్తవమతాన్ని స్వీకరించాడు. ఆయన అలవరుచు కున్న మనస్తత్వంలో కొంతభాగమైనా, మార్క్స్‌కి అబ్బి వుండాలి. మనం చాలా ముఖ్యులం, ఇతరులు ఏ కార్యాలు చేసినా, మనకే వర్తిస్తాయి – అనుకోడంవల్ల ఎన్నో ఇబ్బందులేర్పడుతాయని, రసెల్ వొక ఉదహరణ చెప్తాడు.

"మనం రైల్లో వెడుతుంటె, వొక పొలంలో వున్న ఆవులు, బెదిరి, చెదిరి పోయే దృశ్యం చూస్తాం. ఆ మందలో వొక ఆవు తత్వశాస్త్రజ్ఞుడై వుంటే ఇల్లా అనుకుంటుంది 'నాకోర్కెలు, నాకెంతో ముఖ్యం. ఈ జగత్తులో జరిగేవన్నీ నా కోసమే జరుగుతున్నాయి. ఈ రైలుబండి, నాకు అపకారం చెయ్యడానికో మంచి చెయ్యడానికో వొస్తోంది కాని దీని రొద, ఆర్భాటం చూస్తే, నాకు అపకారం చేసేటట్లుంది. అందుకని దీన్నుండి పారిపోతాను' అనుకుంటుంది. కాదు, నీదంతా వెఱ్ఱి, రైలుబండికి నువ్వు ఏమైందీ అక్కర్లేదు – నీ సంగతే దాని కక్కర్లేదు అంటే మీరు, ఆశ్చర్యపడి, మతిపోగొట్టుకుంటుంది. తనని గురించి పట్టించుగోని రైలుబండికంటె, తనకి కీడు చెయ్యాలని సంకల్పించిన రైలుబండే మెఱుగు, అట్లా అనుకుని, రైలుబండి వున్నా బాగుండిపోను అనుకుంటుంది. మనుషులూ అంతే. ప్రకృతి తమకి కాస్తంత మేలు, కాస్తంత కీడు సమకూరుస్తుంది."

ఇది ప్రమాదవశాత్తు జరిగిందనుకోలేడు మనిషి. ఇందాకటి ఆవు విషయం చూడండి. రైలు పట్టాలమీదికి వెళ్ళి రైలింజన్ కిందపడి చనిపోయిన మరొక ఆవుని చూసివుంటె, 'పాపం చేసింది గనక, రైలుబండి అనే దైవం దాన్ని శిక్షించింది' అనుకుంటుంది, ఆ ఆవు ఆవులమందలో పెద్దలు, రైలుపట్టాలకి ఇరుప్రక్కలా, అట్లాంటి ప్రమాదాలు జరక్కుండా వుండాలని, తడకలతో అడ్డు గోడలు లేపితే, సంతోషిస్తుంది. ఈ విధంగానే, మనుషులు తమకి సంభవించే ఆపదలను, తమ పరపతి దెబ్బతినకుండా, సమర్థించుకుంటారు పాపాలు చెయ్యని బుద్ధిమంతులు కొందరుంటారు. వారికీ ఆపదలు సంభవిస్తాయి – వారి మాటేమిటి? మనల్ని ద్వేషించే శక్తులు, కొన్ని వున్నాయి, మనం బాగుంటె సహించలేని

శక్తులు అపీ, పీరి ఆపదలకు, కారణం, అనుకుంటాడు మనిషి. ఇవే, దయ్యాలు, భూతాలు మొదలైన దుష్టశక్తులు. మంత్రం తంత్రం, చేతబడి, గారడి, ద్వారా యీ శక్తులను, ధ్వంసం చెయ్యాలనుకోడంతో, వీటి పట్ల నమ్మకాలు బైలు దేరాయి. నరబలులు, దీన్నుండి బైలుదేరినవే. పాశ్చాత్య దేశాలలో నిన్న మొన్న వరకూ మంత్రకత్తెలను వేటాడి చంపడం — ఇందువల్లనే. విజ్ఞానశాస్త్రం ప్రబలాక, ఈ మూఢనమ్మకాలు సమసిపొయ్యాయి. కాని, రేపిన భయం కాస్తో కూస్తో నిలిచిపోయి, ఇతర దేశీయులపట్ల ద్వేషంగా, పరిణమిస్తోంది.

అసూయ, మరొక తప్పుడు భావం, లేనివాళ్ళు గుమిగూడి, ఆ వూళ్లో వున్న ధనికుణ్ణి, పీనాసిగా చెప్పుకుంటారు స్త్రీలకి వొకరంటె వొకరికి, అసూయా అని చెప్పుకుంటారు పురుషులు కాని పురుషులలోనూ ఈ అసూయ ఉంది. ఒక ఆఫీసులో ఎవరికన్నా మేలుజరిగి, పైపదవి లభ్యమైతే, 'వాడికి, పెద్దవాళ్ళని పట్టడం బాగా చేతనౌనండీ — వాడిలాగా, చిత్రం చిత్రం అంటూ, చేతులు నలుపు కుంటూ ముఖస్తుతి చేసే నీచమైన అలవాట్లు తెచ్చుకుని వుంటె, ఆ పై పదవి నాకూ వొచ్చును. పైకి చటుక్కున నచ్చేవిధంగా పనిచెయ్యగలడనుకోండి — "నిజంగా పెద్ద శక్తిసామర్థ్యాలు వాడిలో లేవు పై అధికారులకి, రేపోమాపో వాడి బడాయి తెలిసిపోతుందిలెండి" అని, విశేషమైన సామర్థ్యంలేని రెండోరకం ఉద్యోగులందరూ ఆఫీసుల్లో చెప్పుకుంటారు. ఇట్లాంటి అసూయాభావం బైలుదేర కుండా ఉంచటం కోసమే, అందరికంటె ఎక్కువకాలం పనిచేసిన వ్యక్తికి పైపదవి ఇవ్వాలన్న సూత్రం చలామణిలో వుంది.

నా కులం, నా జాతి, నా భాష, నా ప్రాంతం, నా దేశం — గొప్పదన్న గర్వం, అహంకారం కూడా హానికరమైన భావమే నంటాడు, రసెల్ — ఆయన చిన్నప్పుడు, ఇంగ్లీషువారు, ఫ్రెంచ్ వారిని తక్కువగా ఎంచేవారుట ఫ్రెంచ్ వారు తిండిపోతులనే వారు. ఒక ఇంగ్లీషువాడు, ముగ్గురు ఫ్రెంచ్‌వారిని ఓడించ గలడనేవారుట. తర్వాత, జర్మనీవారు వారికి శత్రువులయ్యాక, ఫ్రెంచ్‌వారిని చులకన చెయ్యడం మానుకున్నారు. మన దేశంలో తమిళులంటె, తెలుగువారికి చులకన తెలుగు వారంటె, కన్నడంవారికి హేళన. అంతే కాదు తెలుగువారిలో, కోస్తా ప్రాంతంవారంటె, రాయలసీమ వారికి చులకన. ఒకరు, మరొకరికంటె అధికులమనుకోడానికి, ఆధారాలు లేవంటాడు రసెల్. ఇల్లా అనుకుని 'అహం'ని పెంచుకోవడం పొరబాటంటాడు. ఒక సమిష్టి కుటుంబంలో, తండ్రి అన్నయ్యకి ఎక్కువ డబ్బులిస్తున్నాడంటాడు తమ్ముడు. ఇరువురి ఆస్తులూ సమంగా పంచే వరకూ, ఈ తగాదాలు పోవు అన్నయ్యకీ, తమ్ముడికీ బాగానే జరిగింది నా

మాచేమిటంటుంది చెల్లాయి. ఆమెకి కూడా ఆస్తిలో సమభాగం వుంటే. ఈ అసమానం ఉండదు. తెగలలో, జాతులలో, ఆర్థిక సదుపాయాలుండి, సమాన అవకాశాలు ఉన్నట్లయితే, ఈ అసమానం పోయి, ఐక్యభావం ఏర్పడుతుంది. ఈ పనికి ప్రభుత్వం పూనుకున్నట్లే, దేశాల తరపున అంతర్జాతీయ సంస్థ పూనుకోవాలి చైనావారిది పసుపు పచ్చరంగు. అందుకని చాలామంది అమెరికా వారికి, వారంటె గిట్టదు. ఇండియా పాలించిన ఇంగ్లీషువారు, తాము అధికుల మన్న గర్వంతో, విజ్ఞులైన భారతీయులతో శత్రుత్వం తెచ్చుకున్నారంటాడు రసెల్. భారతీయులలో, ఉత్తరాది నుండి వొచ్చినవారు అధికులమనుకుని, చతుర్విధ వర్ణాలతో రూపొందిన సమాజం నెలకొల్పబడింది. తెల్లవారి అహం కారం ఎంత పెద్దదో, ఈ వర్ణ విభేధాలూ అంత పెద్దవేనంటాడు

మొగాడు అధికుడన్న భావం ఎంతో అపకారం చేసిందంటాడు. వివాహ సంబంధం, 'యజమాని – బానిస' బంధంగా పరిణమించింది. స్త్రీ మెప్పు పొందకుండానే, మొగాడు ఆమెను భార్యగా చేసుకోగలడు దీనితో ప్రేమ, శృంగార జీవితం దెబ్బతిన్నాయి. స్త్రీని బైటకి రానీయక, వేరుగా, మూలగా ఉంచడం వల్ల, వీరిలో శృంగార భావం లేకుండా పోతుంది, గౌరవ కుటుం బాలలో స్త్రీలు ఆకర్షణీయంగా ఉండక, పురుషుడు, పురుషుడితో అసహజమైన సంబంధం పెట్టుకోడం జరుగుతూంది నాగరీక దేశాలలో కొన్ని చోట్ల ఈనాడు చాలావరకూ ఇవన్నీ తగ్గిపోయినా, ఇరువురూ సమానులమన్న భావం పూర్తిగా నెలకొనడానికి చాలా కాలం పడుతుంది. ఎవరి కిందో పడి ఉండాల్సిన బానిస వ్యవస్థ నుండి, బైట పడగానే, మొదట్లో కొంత కీడు జరుగుతుంది. ఇదివరలో అధికులమనుకున్నవారు, కొత్త పరిస్థితికి తట్టుకోలేరు, ఇదివరలో అణగతొక్క- బడ్డామనుకున్నవారు, వెనకటి అధికులపట్ల ద్వేషాన్ని పూర్తిగా విస్మరించలేరు.

'నేను ఘనుణ్ణి' అన్న బావంవల్ల ఏర్పడిన దుస్థితిని గూర్చి రసెల్ ఇల్లా వ్రాశాడు :

"మనం మానవులం – కావున మానవుణ్ణి సృష్టించడమే పరమాత్మ ఆదర్శం; మేం అమెరికా వారలం; అమెరికావారలు గొప్పవారు – వీరంటే దేవుడి కిష్టం; మేం తెల్లవారం; నల్లవారంతా దేవుడి శాపానికి పుట్టారు మేం ప్రొటెస్టెంట్లం – కావున కాథెలిక్కులు పనికిరానివారు; మేం పురుషులం, స్త్రీలు తెలివిహీనులు, మేం స్త్రీలం, పురుషులు జంతు సమానులు. మేం ప్రాగ్ దేశీయులం, పాశ్చాత్యులు అవివేకులు; మేం పాశ్చాత్యులం; ప్రాగ్ దేశీయులు అనాగరీకులు; మేం మెదడుతో పని చేస్తాం, కావున కాయకష్టపడేవారు అధములు, మేం కాయకష్ట

పడతాం, కావున కష్టించడమే గౌరవం. ఇంతే కాదు; ఎవరికివారు, తాము అసాధారణమైన ప్రజ్ఞావంతులం; అనుకుంటూ, జీవిత సమరానికి దిగుతాం. అందరం సమానులమే, గొప్ప, తక్కువ లేవు.- అనుకోగలిగిననాడు, జీవితం యుద్ధంగా పరిణమించదు - పరిణమించినా కూడా, ఈ అపోహలు, దగా కల్పనలు, సాహసాలుగా స్తుతించం."

అల్లాగే ప్రజాస్వామ్యం ఒక్కటే అనువైన పాలనా పద్ధతి, అంతకు మించింది మరొకటి లేదు అన్న భావం పట్ల ఉన్మత్తత తగదంటాడు. అధిక సంఖ్యాకుల, తప్పకుండా, వివేకంతో చర్యలు తీసుకుంటారనుకో కూడదు. అధిక సంఖ్యాకుల తీర్పుని, స్వీకరించడం మంచిదన్న సూత్రాన్ని మాత్రం అంగీకరించాలి; ప్రజాస్వామ్యాన్ని అభిమానించినవారు, సామాన్య మానవుడిలో ఏదో మత్తు ఉందనుకుని ప్రజాస్వామ్యాన్ని అంగీకరించకూడదు. నిరంకుశ పాలన కంటె, పరిమిత శక్తుల ద్వారా, నిరంకుశాన్ని అదుపులోకి తేవాలన్న సూత్రం అన్నమాట. మనల్ని బలవంతంగా ఎవరో పాలించడంకంటె, మన కిష్టులైనవారి పాలన మెరుగన్న సూత్రం నిర్వహింపబడాలంటే, ప్రజకి శిక్షణ అవసరం. ప్రపంచం బాగవాలంటె, యుద్ధాలు రేగకుండా అమలుజరిగే రాజకీయ సూత్రాల సమీకరణ ఉండాలి: ఉత్పత్తి పెంచే ఆర్థికవ్యవస్థ నెలకొల్ప బడాలి. అంతర్జాతీయ దృక్పథాన్ని బోధించే విద్యావిధానముండాలి. నైతికంగా, సహనమూ, దయ, - పెంపొందాలి. ఇట్లాంటి స్థితి, హైడ్రొజన్ బాంబ్ వల్ల కాని ఏర్పడే సూచన లేదనుకుంటే, ఆ బాంబ్‌ని కనిపెట్టినవారిని అభినం దించాలి.

అన్ని యుగాలలోనూ, అన్నిదేశాలలోనూ కొన్ని పనులు చెయ్యొద్దు, కొన్నింటిని చెయ్యి - అన్న పెద్దల శాసనమే నైతిక సూత్రాలకి ఆధారమైంది. హత్య, దొంగతనము, వ్యభిచారము యీాదుల దృష్టిలో ఘోరమైన అపరాధాలు. కులపెద్ద కోసం పెట్టిన కంచంలో తినడంకి మించిన అపరాధంలేదు, 'సౌత్‌సీ' దీవులలో నివసించేవారి దృష్టిలో. అమెరికాలో కళాశాల విద్యార్థులు, 'హత్యని మించిన అపరాధం - వ్యభిచారం' అన్నారుట. పెద్దలని దిఃఖరించడం, అన్నింటినీ మించిన అపరాధమని - జపానీయులంటారు. ప్రాచీన సమాజాల అలవాట్లు, ఆచారాలు, మనకి ఈనాడు అర్థరహితమైనవిగా అగుపడతాయి. యుద్ధంలో గెలుచుకున్నవారిని చంపి తినెయ్యడం, అజెటెక్ జాతివారి నియమం. సంతానం కలగనప్పుడు, అన్నగారి భార్యని వివాహమాడటం, కొన్ని సమాజాలలో ఆచారం. దీని ఫలితంగా కలిగిన మొదటి సంతతి అన్నగారికి పుట్టినట్లే భావిస్తారు.

చైనీయులు, రోమనులు, సంతానం లేనప్పుడు, మరొకర్ని పెంచుకుంటారు. పెద్దల్ని పూజించే ఆచారం ఈ విధంగా ఏర్పడినదే. ఎవరో వొకరు, పూజించక పోతే, చనిపోయిన వ్యక్తి భూతమై, గొడవ చేస్తాడని వీరి భావన. ఇండియాలో, విధవావివాహం సహించరాని అపరాధం ఇవన్నీ చూస్తె ఈ ఆచారాలన్నీ దైవం శాసించినవి కావనీ, నైతిక సూత్రాలు మారుతూ వుండే అవకాశం వుందనీ, కొన్ని మార్పులు మంచి సమకూర్చొచ్చుననీ తెలిసొస్తుంది. ఈనాటి సమాజాలలో కూడా, ఇట్లాంటి మార్పులకు అవకాశముందనీ, ప్రతిమార్పూ, చెడ్డదే కానక్కర లేదనీ గ్రహించాలంటాడు రసెల్.

ప్రాచీన సమాజాల నైతిక సూత్రాలని పరిశీలించిన "ముల్లర్–లైయర్" అనే శాస్త్రజ్ఞుడు, నాగరికత పరిణామంలో మూడు దశలున్నాయని సూచించాడు. ఒక గుంపు అలవరుచుకున్న నీతి మొదటి దశ–కుటుంబం అలవరచుకున్నది రెండవ దశ; – చివరి దశలో, ఎవరికి వారు, వ్యక్తిగతమైన నైతిక ఆదర్శాలని పాటిస్తారు స్త్రీ పురుష సంబంధము, పెండ్లి – ఇవి ఆర్థిక పరిస్థితిని అనుసరించి నిర్ణీతమౌతాయి. ఒక్కొక్కదశలో, వొక్కొక్క రకం నీతి. వేటాడేదశ; తిండి కోసం వలసపోయి జీవించే దశ; వ్యవసాయ జీవనము, పారిశ్రామిక నాగరికత ఈ దశలలో నైతిక సూత్రాలు వేర్వేరుగా వుంటాయి. ఏకపత్నీ వ్రతమా? బహుభార్యాత్వమా? అనేక భర్తృకతా? ఏకపత్నీవ్రతమైతే, జీవితాంతం, విచ్ఛిన్నంకాని వివాహమా? – ఇవన్నీ వొక సమాజంలో వుంటున్న ర్థిక అస్థితి గతులపై ఆధారపడతాయి. ఆ సమాజం, తదనుగుణంగా కొన్ని నైతిక సూత్రాలను పాటిస్తుంది. వాటిని అతిక్రమించడం దుర్నీతౌతుంది ఆర్థిక పరిస్థితి మెరిగై, మారిన వెంటనే ఈ నైతిక సూత్రాలు మారిపోతాయని లేదు. నీతి – సంప్రదాయమై కిరడు కట్టడంవల్ల – వెంటనే మారదు. ఆ మార్పుకి మరికొంత కాలం పడుతుంది విధవ ఎవరి పోషణలోనో వుండాలి, అందుకని భోజనం పరిమితమైంది. ఆర్థిక స్థితి మారింది స్త్రీ చదువుకోవాలి; రాజకీయరంగంలో మార్పులు హర్షించిన పెద్దలు, నైతికరంగంలో మార్పు హర్షించకపోవడం శోచనీయమంటాడు రసెల్. మనదేశం విషయం చూద్దాం. అనాదిగా - రాజు - ప్రజ - వంశపారంపర్యంగా చక్రవర్తి - పాలకుడు, పాలితులు, ఈ రాజకీయ జీవనానికి అలవాటుపడ్డ మనం, ఈనాడు ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని అమలు జరుపుకుంటున్నాము ఇది చాలా పాశ్చాత్యదేశాలలో అమలులో ఉంది. ఇందులో మంచివుంది గనకనే, దీన్ని మనం స్వీకరించాం కాని పూర్వులు నెలకొల్పిన నైతిక సామ్రాజ్యంలో, మార్పులు జరిగితే హర్షించలేరు పెద్దలు. ఒక నైతిక

సూత్రం, మానవుడి సౌఖ్యానికీ, శ్రేయస్సుకీ దోహదమిచ్చేదిగా ఉన్నప్పుడు, దాన్నికూడా మార్చుకుని, కొత్త సూత్రాన్ని అమలు జరుపుకోడం మంచిదంటాడు రసెల్.

కొత్త నైతిక సూత్రాలు నలుగురూ ఆమోదించడానికి కొంతకాలం పడుతుంది - కొన్నిచోట్ల, శతాబ్దాలు పట్టొచ్చు. ముల్లర్ - లయర్ సూచించే సూత్రం బట్టి, ప్రభుత్వం బలంగా ఉన్నప్పుడు, కుటుంబంయొక్క ప్రభావం సన్నగిల్లుతుంది. అట్లాంటప్పుడు, స్త్రీల పరిస్థితి బాగుంటుంది, ప్రభుత్వం అంత బలమైంది కానప్పుడు, కుటుంబం ప్రభావం పెరిగి, స్త్రీల స్థితి హీనంగా పరిణమిస్తుంది. కుటుంబంపరపతి ప్రబలంగా వున్నప్పుడు, స్త్రీల స్థితి హీనంగా వుంటుందన్న విషయం చాలామంది గ్రహించగలుగుతారు. కాని, దీనికీ, ప్రభుత్వం యొక్క బలానికీ వున్న సంబంధం, అంతగా గ్రహించలేరు. వెనకటి తరం; చైనా, జపాన్ దేశాలలో, బలమైన ప్రభుత్వం లేక, కుటుంబం ప్రభావం అధికమై స్త్రీల స్థితి హీనమైంది. జపాన్‌లో కుటుంబం ప్రభావం సన్నగిల్లి, స్త్రీల పరిస్థితి మెరుగయ్యేటట్లుంది.

కుటుంబనీతిపరిణామంలో కూడా, మూడు దశలున్నాయి. ప్రారంభ దశ; మధ్య దశ; చివరి దశ. మధ్యదశ కుటుంబం నీతి, కాఠిన్యానికీ, హింసకీ దారి తీస్తుందంటాడు ఈయన. విడిపోడానికి వీలులేక, జీవితాంతం ఉండిపొయ్యే బంధంగా, వివాహబంధాన్ని పరిగణించడంవల్ల, భర్త త్రాగుబోతు, అనాగరికుడూ, అయినప్పుడు, భార్య నానాబాధలూ భరించాల్సి వొస్తోంది. అట్టి తలిదండ్రులు నిత్యమూ తగవులాడుతుంటె, పిల్లలు చూసి భరించాల్సి వొస్తోంది. ఇది వేశ్యాలోలతకీ, సుఖవ్యాధులకీ దారితీస్తోంది. కట్నాలిచ్చి పుచ్చుకోడం, పోషణకి అవసరమైన ఆర్థిక ఏర్పాటుగా ఉండిపోయి ప్రేమకి తావులేని వివాహంగా పరిణమిస్తోంది ఆకర్షణ, ప్రేమ లేనప్పుడుకూడా, భార్యాభర్తలు, వైవాహిక విధులను నిర్వర్తించాల్సి వొస్తోంది. వివాహానికి సంబంధించిన నైతిక నియమాలు, శాశ్వతంగా ఉండిపోవాలి, వాటిని మార్చకూడదు - అన్న భావాన్ని రెండు విధాలుగా ఎదుర్కోవచ్చు ప్రాచీన సమాజాలలో అమలు జరిగిన వివిధమైన ఆచారాలనూ, కట్టుబాట్లనూ తెలుసుకోవడం, వొక పద్ధతి. రసెల్ ఇట్లాంటివి కొన్నింటినిగూర్చి ప్రస్తావించడం చూశాం - "ఒక వ్యక్తి స్వీకరించే నైతిక నియమాలు, తన తాతగారి కాలంలో ఆర్థిక స్థితిపై ఏర్పడిన సమాజం అలవరచుకున్న నియమాలే బవుంటాయి. ఆర్థిక స్థితి మారిన, రెండుమూడు శతాబ్దాల పిదప, నైతిక విలువలు మారతాయి. ఇది గ్రహించినట్లైతే, ఇప్పుడు,

వొక సమాజంలో ఉన్న నైతిక విలువలు, శాశ్వతంగా ఉండనక్కర్లేదని తెలిసొస్తుంది. ఒకప్పుడు మరొక సమాజంలో ప్రబలిన విలువలు, తన వాటంత మంచివి కావనీ, తనవే మంచివనీ అనుకోడం జరగదు." సాధారణంగా ప్రజలు అంగీకరించే నీతి, జీవిత పరమావధికి సంబంధించినది కాక, ప్రవర్తనకి సంబంధించినదై ఉంటుంది. నిజానికి నైతిక సూత్రాలు, ప్రవర్తనకి సంబంధించక, జీవిత పరమావధిని సూచించేవిగా ఉండాలంటాడు రసెల్. ఎల్లా నడుచుకోవాలో చెప్పడంకంటె, మనకేం కావాలో చెప్పడం మంచిదంటాడు. "తన బంధువులను' స్నేహితులను, వీలైతే మానవులందరినీ ప్రేమించి వారి మేలు కోరేవాడు మంచి మనిషి; కళలు, విజ్ఞానశాస్త్రాన్ని ప్రేమించినవాడు మంచిమనిషి. అట్లాంటి మనిషి, వెనక ఎప్పుడో కొన్నివేల సంవత్సరాల క్రితం ఎవరో చెప్పిన విధంగా నడుచుకోవడం ముఖ్యంకాదు. అంతేకాదు, వెనక ఎవరో చెప్పిన విధంగా నడుచుకొని కూడా వొక వ్యక్తి చెడ్డవాడు కావచ్చు" నంటాడు రసెల్. ఈ బావాన్ని విపులీకరిస్తూ ఇల్లా వ్రాశాడు:

"నాకొక స్నేహితుడున్నాడు సాహసంతో కూడిన ప్రజాహిత కార్యాలు చేశాడు. ఇంటి వ్యవహారాలలో, ఎంతో నెమ్మదైనవాడు; దయ చూపుతాడు. అతని భార్య త్రాగుతూ, ఏ పనీ చెయ్యలేక, చికిత్స కోసం ఏ సంస్థలోనో ఉంటూ ఉండేది. అసహాయ ఐనందున భర్తకి విడాకులివ్వలేదు. తగిన కారణం లేనందున, అతను విడాకులివ్వలేదు అతను, ఆమె పట్ల నైతికబాధ్యత చూపలేదు గావు,న లోకం అతన్ని చెడ్డవాడుగా పరిగణిస్తోంది. మరో వ్యక్తి విషయం చూడండి. అతను త్రాగుబోతు, భార్యని హింసిస్తాడు. గర్భవతి ఐనాకూడా కొడతాడు; పదిమంది, పనికిరాని సంతానాన్ని కంటాడు. సమాజం అతన్ని అంత చెడ్డవానిగా పరిగణించదు అల్లాగే, క్రింది ఉద్యోగులపట్ల కరుణ చూపుతూ. ఆదరంతో చూసే వొక సంస్థ అధికారి, సెక్రటరీగా ఉంటున్న స్త్రీతో ప్రేమకలాపం జరిపితే, అతన్ని చెడ్డవాడంటుంది సంఘం. మరొక అధికారి, సంస్థలో ఉద్యోగులందర్నీ కఠినంగా చూస్తూ, నిరంకుశంగా నడుచుకుంటాడు. అతను ఏకపత్నీవ్రతుడు గనక, సంఘం మంచివాడంటుంది. ఇది ఘోరమైన పాతకాలపు దృష్టి. దీన్ని మనం మార్చుకోవాలి " కాబట్టి ఏం చెయ్యాలి? దగా, మోసము, హింసాకాండ, యుక్తవయస్కులు కానివారిపై దౌర్జన్యం చెయ్యడం, ఇట్లాంటి అపరాధాలని చట్టరీత్యా శిక్షించి, కట్టుబాటు చెయ్యాలి. యుక్తవయస్కులైన స్త్రీ పురుష సంబంధాలలో సమాజంలోని పెద్దలుగాని, న్యాయశాస్త్ర నిర్వాహకులుగాని, జోక్యం కలగచేసుకోకూడదు. వారికి సంతానం ఉంటె, వారి

పోషణ, విద్య, క్రమశిక్షణ, సక్రమంగా జరిగేలాగు ప్రభుత్వం చూడాలి. తండ్రి, వారి పోషణకై, కొంత డబ్బు ఇచ్చేలాగు నిర్బంధించి చెయ్యాలి. ప్రేమానురాగాలు లేని దంపతులు తప్పనిసరిగా కలిసే ఉండాలని నిర్దేశించకూడదు. పిల్లల దృష్ట్యా రోజూ అమ్మానాన్నా తగవులాడుకోడంకంటె, విడిపోవడమే మంచిది - అని రసెల్ సూచన.

చట్టాలు, ప్రజాభిప్రాయం - ఈ రెండూ ఏకపత్నీవ్రతం నిర్దేశిస్తాయి. వీటికి భయపడి, బలవంతంగా కలిసి వుండడం కంటె, స్త్రీ పురుషులు వొకర్నొకరు ప్రేమించుకుని, నిజమైన అనురాగం అన్యోన్యం కలవారై ఏకపత్నీవ్రతులుగా ఉండడం మంచిదంటాడు. "అనేకమంది పురుషులకు తన శరీరాన్ని అమ్ముకున్న స్త్రీని వేశ్య అంటున్నాం ప్రేమ లేకపోయినా, ఒక ధనికుడికి జీవితాంతం అమ్ముడు పోయిన స్త్రీ గౌరవింపబడి, సంఘంలో ప్రముఖురాలవుతోంది. ఆ ఇరువురు స్త్రీల చెడ్డతనం వొక రకందే. ఇట్లాంటప్పుడు ఆయా వ్యక్తులను నిందించ కూడదు మనం. అట్లాంటి చర్యకు దారితీయించిన సంస్థలని నిందించాలి. ప్రేమని సంస్థలు నలిపి చెయ్యడం ప్రపంచపు ఓనర్థాలలో వొకటి. వ్యభిచరించిన ప్రతివాడూ దుష్టుడని తీర్పు చేసిన వ్యక్తి, కవిత, సౌందర్యం - ఈ రెండూ బంధించబడిన జైలు భవనం లేవనెత్తడానికి వొక రాయి తగిలిస్తున్నాడు.

నైతిక విలువలు కాలానుగుణంగా మారతాయన్న రసెల్ సూచనలో యదార్థం మన దేశ పరిస్థితిలో కూడా చూడవచ్చు. భారతదేశ చరిత్రలో స్వర్ణయుగంలో, స్త్రీకి గౌరవం, ప్రాముఖ్యం ఉండేవి. చక్రవర్తి, ధర్మశీలుడై పాలించినప్పుడు, కుటుంబ నీతి ఉన్నతదశ నందుకుంది. రాజ్యాలు, రాజ్య కాంక్షతో పోటీబడి తగవులాడుకున్న రెండవ దశలో, కుటుంబం నిలబడినా, స్త్రీకి ప్రాముఖ్యం తగ్గింది క్రితం శతాబ్దిలో మరీ పాడైంది ఇరవయ్యో శతాబ్దిలో నూతన వికాసం, విద్యా వ్యాప్తి, పెరగడంతోపాటు ఆమె స్థానం మెరుగైంది ఉద్యోగం చేసి తన పొట్ట తాను గడుపుకోవాలి; సంసారం పరిమితం చేసుకోవాలి. పురుషుడితో సమంగా హక్కులొచ్చాయి, మొగాడి చేతికింద - ఆస్తిలో భాగంగా ఉండక; స్వతంత్రంగా, వొక సంపూర్ణమైన వ్యక్తిగా నిలబడగల ఆధునిక దశ ఏర్పడినప్పుడు, విధవా వివాహానికి ఎవ్వరూ ఆశ్చర్య పడరు. వివాహం చేసుకోవాలంటారు కూడ. ఈ మార్పుకి, పెద్దలెందరో కృషి చెయ్యాల్సి వచ్చింది అల్లాగే, యుద్ధంలో వోడిపోయి, పరరాజు చేతుల్లోపడ్డ స్త్రీలను, శత్రువులు చెరుస్తారన్న భయంవల్ల సహగమనం వొకప్పుడు, వుండేది,

రాజు, ధనికుడు అనేక మంది భార్యలను పోషించగలడు. పెరిగిపోతున్న సమాజాలలో కుటుంబ నియంత్రణ అవసరమైనట్లు, ఏకపత్నీవ్రతం కూడా, వొకప్పుడు, ఆర్థికంగా అవసరమై యుండాలి పూర్వాచార పరాయణులు, ఛాందసులూ, ఈ విషయంవల్ల మార్పు హర్షించరు. కొన్ని సందర్భాలలో విడాకులకు వీలున్నా మొత్తం మీద, మత గురువులు దీన్ని హర్షించరు.

పారిశ్రామిక విప్లవంతోబాటు పాశ్చాత్య దేశాలలో కూడా స్త్రీకి పురుడితో బాటు సమమైన స్థానం లభించింది. మన దేశంలో, స్వాతంత్ర్యోద్యమం ఈ మార్పుకి చేయూత నిచ్చింది. స్త్రీ ప్రాముఖ్యం, క్షీణిస్తూ - మెరుగవుతూ వచ్చినా, పాతివ్రత్యం వొక ఆదర్శంగా, అనాది నుండీ వొస్తూ వుంది. వెనక భర్త సమక్షాన, భార్య నిలబడే వుండాలి. బావగారు మొదలైన పెద్దల ముందు నిల బడాలి - తలుపు వెనక. పర పురుషుడి కంట బడకూడదు. ఆమె స్థానం ఇంట్లోనే. ఆస్తిలో వాటాలేదు. చదువు, ఉద్యోగం అసలే కూడదు, ఈ శతాబ్దిలో ఇవన్నీ మారిపొయ్యాయి. వెనక రంగస్థల నటుడు నీచమైనవాడుగా పరిగణింప బడేవాడు. డాక్టర్లు, ప్లీడర్లు రంగస్థలంపై ప్రవేశించగానే, ఆ వృత్తి పరపతి పెరిగింది. పతివ్రత - త్రికరణశుద్ధిగా - (మనస్సు, వాక్కు, కర్మ) భర్తనే కొలవాలి. మరిప్పుడు సినిమా నటి, పర పురుషుణ్ణి, వెండితెరపై కౌగలించు కుంటుంది - వొక పాత్ర నటిస్తూ. ఆమెకి భర్త, పిల్లలు వుంటారు. కథానాయ కుడికి కూడా భార్య, పిల్లలు ఉంటారు. తెరపై నటి, ఎదటి వ్యక్తిని, తన భర్తగా ఊహించి మనోవాక్కాయ కర్మలలో మొదటిది పాటించి - నటించినా, ప్రేమ. విరహం ప్రకటించే మాటలు, (వాక్కు) కలిసి నృత్యం చెయ్యడం, కౌగలించుకోడం (కర్మ) చూసిన ప్రేక్షకుడు ప్రాతివ్రత్యం గురించి పట్టించు కోడు, తాను చూస్తున్న చిత్రం, పాతివ్రత్యం యొక్క మహిమని చాటేదిగా వున్నా. వెనకటి శతాబ్ది భర్త, తన భార్య ఇల్లా పరాయి వ్యక్తితో నటిస్తే సహించలేడు. ఆమెని చంపడమో, ఆ మరో వ్యక్తిని చంపడమో. లేక తాను ఆత్మహత్య చేసుకోడమో జరుగుతుంది. ఈ అసూయా భావం, ఇప్పటికీ కాస్తో కూస్తో ఉందనుకోవాలి. పాశ్చాత్య సినిమా రంగంలో నటులు, పదే పదే పెళ్ళిళ్ళు చేసుకోడం ఈ అసహనం వల్ల నేమోననిపిస్తుంది. ఈ కారణంగా, మనం నటులను చులకనచెయ్యం. వారిని గౌరవిస్తాం. ప్రభుత్వం ఎవార్డులిస్తుంది వీరిని చూడడానికి వేలాదిగా జనం ఎగబడతారు. సన్మానాలు జరుపుతారు. ఇందుకు కారణం - కళ, సౌందర్యం - ఇవిచ్చే అనుభూతి, సంస్కృతిలో ప్రధాన అంగాలన్న నమ్మకమూ, ఈ అనుభూతి మన జీవితానికి మంచిదన్న భావం, మనలో ఉండడమే,

భార్యా భర్తల దాంపత్య జీవితంలో ప్రభుత్వం ప్రజాభిప్రాయం, జోక్యం కలుగచేసుకోకూడదన్న రసెల్ భావం - ఎంతవరకూ మన పరిస్థితులకు అనుకూలిస్తుందో చెప్పలేను. భార్యా భర్తలు చదువుకున్నవారై సంస్కృతి గలవారై, తగినంత ఆర్థిక స్థోమత కలిగి, ఒాకర్ని ఒాకరు గాఢంగా ప్రేమించు కున్నవారై, వివేకము, శీలము ఉండి బాధ్యతని గుర్తెరిగి ప్రవర్తించేవారలై నప్పుడు, ప్రభుత్వం, సంఘంలో పెద్దలు, జోక్యం కలగచేసుకోనక్కర్లేదు. అట్లాంటప్పుడూ, పోలీసులు, కోర్టులు, విచారణలు, ధర్మశాసనాలు ఉండ నక్కర్లేదు నిజమే — అందరూ, లిన్కన్, గాంధీ, రసెల్ లాంటి వ్యక్తులై, తాము స్వంతంగా పాటించే నీతి నియమాల శిక్షణకు బద్ధులైనప్పుడు ప్రభుత్వం శాసించనక్కర్లేదు కాని అంతటి నిగ్రహం గలవారు సంఘంలో ఎందరో ఉందరు. వివేకం, విద్య, ఆర్థిక సదుపాయాలు లేని వారే ఉంటారు ఎక్కువగా. ప్రభుత్వం వీరికి వీటినిచ్చి, జోక్యం కలగచేసుకుని శిక్షణలో పెట్టకపోతే, నైతిక అరాజకం ప్రబలుతుంది. అందరూ శీలంగల మహాపురుషు లయ్యేటంత వరకూ, ప్రభుత్వం తాడపాశం పెకుతూ ఉండాలి. పెద్దలు మొట్టికాయలు వేస్తూ వుండాలి ఎటొచ్చీ విద్య, ఉద్యోగం, ఆర్థిక సదుపాయాలు కల్పించిన పెద్దలకీ, ప్రభుత్వానికీ ఈ అర్హత ఉండాలన్న భావాన్ని ఖండించడం సుళువు కాదేమొ. అందుకే హాల్లో పొగ పీల్చడం నిషేధం, అందుకే స్త్రీలకు ప్రత్యేక స్థలం.

మతం గూర్చిన రసెల్ భావాలు కొన్నింటిని చూద్దాం. ఆయన నాస్తికుడు. మానవతావాద ప్రచారానికీ, విజ్ఞాన శాస్త్రాభివృద్ధికీ, మతం అడ్డు తగుల్తూ ఒాచ్చిందంటాడు. క్రితం శతాబ్ది వరకూ, పాశ్చాత్య దేశాలలో, వ్యాధులు పాపాలు చేసినవారికి సంక్రమిస్తాయనీ, అట్లాంటివారు బాధ అనుభవించి తీరాలనీ, కర్మఫలం మత గురువులు చెప్తూ, వైద్య శాస్త్ర పరిశోధన నిలుపు చేశారంటాడు. వెనక మత సిద్ధాంతాలు స్వీకరించనివారినీ, ప్రశ్నించినవారినీ శాసించి చంపేసేవారు. ఇప్పుడు అంతటి కఠినమైన చర్యలు తీసుకోకపోయినా, మత సూత్రాలని పాటించని వారిని ఏదో రకంగా, కాస్తంత నాజూకుగా, ఇబ్బంది పెడుతూనే ఉన్నారు మత ప్రభావాన్ని వ్యతిరేకించేవారు కొద్దిమందే ఉంటారు ఇట్లాంటి వారిని అధిక సంఖ్యాకులైన మతోన్మాదులు సహించగలిగితే విశేషమే. నాస్తికుడు తన అభిప్రాయాలని పైకి వెల్లడిస్తే అతనికి ఏదో రకమైన అపకారం జరుగుతుంది. సాంకేతిక నైపుణ్యం, విద్య, యోగ్యతా వున్నా, అతనికి ఉద్యోగం దొరక్కపోవచ్చు. ఇరుగు పొరుగువారు అతనితో మైత్రి

సలవక, దూరంగా ఉంచొచ్చు. మతంపట్ల పరిపూర్ణమైన స్వేచ్ఛ, సమానత, చూపాలన్నది ప్రజాస్వామ్యం ఆదర్శం. రెండు మతాలవారిని సమంగా చూడ్డం వొకటి; అసలు మతమే లేదన్నవారిని సహించడం మరొకటి

భక్తిమార్గాన్నీ, ఆధ్యాత్మికచింతన, అతీంద్రియ జ్ఞానం ద్వారా సత్యాన్ని అన్వేషించేవారినీ, తపస్వులనూ, వెక్కిరించడు బెర్ట్రండ్ రసెల్. మతాన్నుండి జనించే మూఢనమ్మకాలనీ, హానికరమైన అపోహలనీ హేళన చేస్తాడు. ఆయన భావాలు, చాలావరకూ, క్రైస్తవ మతాన్ని దృష్టిలో ఉంచుకొని చెప్పినవే. అన్ని మతాల ప్రధాన సూత్రాలు, ఇంచుమించు వొకే రకంవి ఐవుంటాయి గావున, ఈయన భావాలు మనదేశపు మత సంప్రదాయానికి అన్వయించి, పోల్చి చూసుకోవచ్చు. క్రైస్తవ మత ప్రచారం కొంత హింసాకాండతో జరిగింది. అట్లాంటిది హిందూ మతంలో అంతటి తీవ్రతతో జరిగిందనలేము. ఏ కొత్త సిద్ధాంతం వొచ్చిపడినా, హిందూ తత్వం దాన్ని స్వీకరించి తనలో వొక భాగంగా చేసుకుంటూ నిలబడింది. ఇతర మతాల పట్ల సహనం చూపింది. తప్పనిసరైనప్పుడు కొత్త సూత్రాన్ని స్వీకరించింది. కొన్ని సందర్భాలలో అబద్ధం ఆడొచ్చనంది. ఈ మతం తెచ్చిపెట్టిన ముప్పు, అంటారానితనం ప్రాచీనకాలంలో వొక స్థలంలో వొక బృందం వుండేవారు. ఆ ప్రాంతంలో కొన్ని లభ్యమయ్యేవి. పై ప్రాంతాలకి వలసబోయి, ఇతరులమీద ఆధారపడే అవసరం లేకుండా, స్వయంపోషకంగా ఉండాలనుకుని, 'నువ్వు ఈ పని చెయ్యి' 'అతను ఆ పని చేస్తాడు' 'నేనిది చేస్తాను' అని పనులు నిర్ణయించుకుని, వ్యక్తులు కేటాయించుకుని, స్వయంపోషకంగా వుండేవి. గ్రామాలలో బృందాలు పరమార్థచింతన, దాని కవసరమైన ఆధ్యాత్మిక సంపత్తిని, వొక కులం వారు తమ పనిగా స్వీకరించి, ఇతరులకు అందజేసేవారు. ఆ విధంగా వృత్తి ధర్మాలు, కులాలు ఏర్పడినవి. రానురాను స్వయంపోషకంగా ఉండటం సాధ్యంకాలేదు. ఆ భూమి బీడైంది; ఆ లోహం అక్కడ ఖర్చయిపోయింది. మరో ప్రాంతానికి వెళ్ళక తప్పిందికాదు. మరో ప్రాంతంవారు వీరిని రానిచ్చేవారు కాదు. యుద్ధాలు జరిగేవి. పోటీతత్వం ఏర్పడింది. రాజ్య విస్తీర్ణ కాంక్ష ఏర్పడింది. పరమార్థ చింతన సాగిస్తూనే ఉన్నాయి కొన్ని కులాలు. మరొక బృందం వొచ్చి వీరిని వోడించి వారి రాజ్యంలో కలుపుకునేవారు. దాస్యంచేసే వారి మనస్తత్వం ప్రబలింది. ఇహంలో లేని సుఖాలు పరంలో పొందవచ్చునన్న భావం ఏర్పడి, శరీరసుఖాన్ని ఖండించి, మానసిక ఆనందాన్ని, పరమాత్మతో ఐక్యమై జన్మరాహిత్యం

పొందాలనీ - కొన్ని సిద్ధాంతాలు ప్రచారంలో కొచ్చాయి. పరమార్థచింతన, కులతత్వాన్ని పాటించడంలోనూ, కర్మ జరపడంలోనూ, విధులను నిర్వర్తించ డంలోనూ ఉందనుకొని, కాండకి ప్రాధాన్యమిస్తూ వచ్చారు. ఈ ఆచారాలు కరడుగట్టి, కులతత్వం ఘనీభవించి, అంటరానితనంగా ప్రబలింది ఇదొక చెడుగు. దీన్ని నిర్మూలనం చెయ్యాలనే ప్రజాస్వామ్యం ఆదర్శం అన్ని కులాలూ, అన్ని మతాలూ సమమే. ఎవరి దైవాన్ని వారు కొలవవచ్చు. వీటితో నిమిత్తం లేక, వీటికి అతీతమైన ధర్మాన్ని నెలకొల్పాలన్న సంకల్పం, ఆధునిక తత్వం తాను నిర్మించుకున్న సమాజంలో మానవుడు సుఖంగా వుండటానికి అవసరమైన సదుపాయాలనూ, పరికరాలనూ సమకూర్చడమే ప్రజా ప్రభుత్వాల లక్ష్యం. ఇది మనస్సులో ఉంచుకుని రసెల్ భావాలు చూద్దాం.

1926 లో ఈయన ఇచ్చిన ఉపన్యాసం, గ్రంథరూపంగా వెలువడింది. దీని పేరు "నేనెందుకు క్రైస్తవుణ్ణికాను" అన్నది. పరిపాలనలో మతానికి ప్రమేయం ఉన్న దేశాలలో ఈ పుస్తకం ఎంతో సంచలనం కలిగించింది. ఎందరో దీన్ని ఖండించారు "రసెల్ ఎందుకు క్రైస్తవుడు" అంటూ ఈయనకి సమాధానమిస్తూ, టి. ఎస్. ఎలియట్ వొక వ్యాసం ప్రచురించాడు. ఇది నాకు దొరకలేదు. విజ్ఞాన శాస్త్రం విజయాలు సాధిస్తూ, అణువుని బ్రద్దలుకొట్టింది. బుద్ధిద్వారా, మానవుడు ప్రకృతిని జయించి, తనకి కావల్సిన వాటిని విజ్ఞాన శాస్త్రంద్వారా సమకూర్చుకోగలడన్న ధైర్యం, ప్రబలిన కొద్దీ, ఈ గ్రంథంపట్ల ద్వేషం తగ్గింది. ఇది క్రైస్తవమతం గురించింది గనక, ఈ గ్రంథంలో భావాలని ఇక్కడ ఉదహరించడంలేదు నేను. కోపతాపాలు తగ్గి, నిదానంగా దీన్ని పరిశీలించే వాతావరణం ఏర్పడింది. ఇట్లా ఉద్రేకం, కోపం, ద్వేషం లేకుండా, వొక విషయంలోని నిజానిజాలు, సత్యాసత్యాలు తెలుసుకోవాలన్న కుతూహలమే, ఆధునికతత్వం అనొచ్చు. మతం గూర్చిన కొన్ని రసెల్ భావాలు పొందుపరుస్తాను

"ప్రపంచంలో దేవుడంటె గురిలేనివారు, ఎందరో వున్నారు. వారు ఇందు మూలంగా కష్టాలకు, బాధలకు గురైనట్లులేదు ఒకవేళ దేవుడుంటే, 'వీళ్ళంతా నన్ను కొలవడంలేదు—వీరిపై పగ సాధించాలి' అనుకునేటంత, అహంకారం దైవానికుంటుందనుకోను. (కొన్నేళ్ళ క్రితం వరదలకి రైలుపట్టాలు కొట్టుకు పోయి, రైలు పెట్టె నీళ్ళల్లో మునిగిపోయింది సంతమాగలూరులో. అందులో ప్రయాణికులంతా పండరిపురం నుండి, తిరిగి వస్తున్న భక్తులె.) క్రైస్తవులు, తమ మతం మంచిదనీ, ఇతర మతాలు చెడ్డవనీ అంటారు. ముఖ్యంగా కమ్యూ

నిష్ఫల మతం, హానికరమైందంటారు. అన్నిమతాలూ అపకారమే చేస్తాయంటాను నేను. నిదర్శనం, దృష్టాంతరము, రూఢైన కారణం ఏ విషయమై లేవో, ఆ విషయంపట్ల విశ్వాసంకలిగి ఉండడమే — 'మతం' అంటె నిదర్శనం దొరికి నప్పుడు, విశ్వాసం గురించి ఎవరూ పట్టించుకోరు 'భూమి గుండ్రంగా ఉంది'— 'రెండు, రెండు నాలుగు' అన్నవి మనం నమ్మడంవల్ల ఏర్పడిన సత్యాలు కావు. నిదర్శనకి బదులు, ఉద్రేకాన్ని నెలకొల్పినప్పుడే, 'నమ్మకాలు' మతాలు ప్రబలుతాయి.

సృష్టి అంతటిలోనూ, మానవుడి పుట్టుకే పొరబాటుగా తోస్తుంది. అతను లేకుంటె, సృష్టి మధురంగా ఉంటుంది. ఉదయాన, సూర్యకిరణం తాకిడికి గడ్డిపోచపై మంచుకణం, వజ్రంలా మెరిసిన దృశ్యాన్ని, పాపిష్టి మానవుడు చూస్తున్నాడనుకోడంలో బాధవుంది. హేయమైన వాంఛలు, అహం, కాఠిన్యం కనబరిచే మానవుణ్ణి, తన 'అంశగా' పరమాత్మ సృష్టించాడని ఎల్లా అనుకోను? మనకి కావల్సిన వాటిని, ప్రార్థనవల్ల, ఆధ్యాత్మిక నమ్రతవల్లా, సాధించలేము. ప్రకృతి సూత్రాలని తెలుసుకుని, హేతువాదాన్ని స్వీకరించి, సృష్టిని గూర్చిన పరిజ్ఞానంతో కావల్సిన వాటిని పొందగలం. ఇది మన చేతుల్లో ఉన్నది. ప్రార్థన ఫలం మనచేతుల్లో లేదు. పరమాత్మ, మన ప్రార్థన విన్నాడో లేదో చెప్పలేం. పైగా, ప్రార్థనవల్ల తీర్చుకునే కోర్కెలకు పరిమితి వుంది. మరీ ఎక్కువ కోర్కెలు కోరకూడదు. విజ్ఞానశాస్త్రం సాధించేవాటికి పరిమితి లేదు. నమ్మకం వుంటె, పర్వతం కదిలి మన వెంటకొస్తుందంటే ఎవరూ నమ్మరు. ఏటంబాంబు, పర్వతాన్ని కదుపుతుందంటె అందరూ నమ్ముతారు.

చప్పటి నీ హేతువాదంవల్ల ముక్తి సాధకుడికి నువ్విచ్చే ఆనందం ఏమిటని అడుగుతారు నన్ను మూఢవిశ్వాసాలిచ్చే ఆనందం నే నివ్వలేను. త్రాగుడు, మత్తుమందులు, వితంతువుల్నీ అనాథల్నీ మోసగించి లక్షలు సంపా దించడంలో వున్న ఆనందం నే నివ్వలేను. నేకోరేది వ్యక్తి ఆనందంకాదు; మానవుల ఆనందం. మానవుల ఆనందం కోరినవారు, క్షుద్రమైన సుఖాలు కొన్నింటిని వొదులుకోవాలి నీ బిడ్డకి జబ్బుచేస్తే, ఎంత నిరుత్సాహకరంగా డాక్టరు చెప్పినా, ఆధునిక వైద్యశాస్త్రం సూచించిన చికిత్స జరుపుకోవాలి. బూటకపు వైద్యుడి చేత మందు ఇప్పించి, బిడ్డ చనిపోతే, బూటకపు వైద్యం పట్ల నాకు నమ్మకం వుందని తృప్తిపడితే, నీచర్య క్షమించరానిది

దేవుడున్నాడా లేదా అన్నదాన్ని వితర్కిస్తూ. ప్రతిదానికీ ఏదో కారణం ఉండాలి మూల కారణం లేకుండా కూడా ఏదన్నా ఉండొచ్చు ననుకుంటే,

ఆ 'ఏదన్నా' అన్నది దేవుడికి బదులు, భూగోళమే అనుకోకూడదూ? భూలోకం ఏనుగుపై నిలబడిందంటాడు హిందూ దేశీయుడు. ఆ ఏనుగు తాబేలుపై నిలబడిందంటాడు. ఆ తాబేలు దేని మీద నిలబడిందయ్యా అని ప్రశ్నిస్తే, ఈ ప్రస్తావన విడిచేసి మరో విషయం చెప్పుకుందాం అంటాడు - మూలకారణం దేవుడన్న వాదం, ఇట్లాంటిదే.

మనశ్శాంతి నిస్తాయని తెలిసే, మనిషి కొన్ని మూఢ నమ్మకాలని పాటిస్తాడు. కాని ఇల్లా దగా చేసుకుంటున్నాడన్నదాన్ని ఎదుర్కోలేడు. తన నమ్మకాలు పరామర్శిస్తే, నిలబడవని మానవుడికి తెలుసు - అందుకనే వాటిని ఎవరన్నా ఖండిస్తే మండిపడతాడు.

మన కర్మ ఇదివరకే దైవం నిర్ణయించాడు, దాన్నుండి తప్పించుకో లేము - అన్న నమ్మకం వల్ల, వ్యక్తిగతమైన కృషికి ఉత్సాహం లేకుండా పోతోంది. నే నింతే; - ఈ సంఘంలో వొచ్చి పడ్డాను. నా కిల్లా రాసిపెట్టి వుంది. నేనేం చేసినా ఈ సంఘం మారదు - నా కర్మ - అనుకుని నిరాశచెంది, ముందు జన్మలోనైనా కాస్త మంచి జరిగేలా చూడమని, దైవాన్ని కోరతాడు. ముందు జన్మలో మాత్రం నే బావుకునేదేముంది - అసలు జన్మే వొద్దు - జన్మ రాహిత్యం, కావాలి - పరమాత్మలో ఐక్యం ఐపోతాను మొర్రో అని దైవచింతన సాగుతుంది - సామాన్యుడు మన దేశంలో స్వీకరించే సిద్ధాంతం ఇదేనేమో. ఈ జన్మలో పాపాలు చెయ్యక, పుణ్యాలు చేస్తే, వొచ్చే జన్మలో నా పరిస్థితి బాగుం టుంది. అప్పుడు మరికొన్ని పుణ్యాలు చేస్తాను.

ఇట్లా పాపాన్ని మెల్లగా వొదుల్చుకుని, పుణ్యం చేస్తూ పోతే, చివరికి జన్మ లేకుండా, పరమాత్మలో ఐక్యం అయిపోతాను. ఇదీ సామాన్యుడు అర్థం చేసుకున్న తత్వం. లోకంపై, జీవితంపై రోత. ఈ చెట్లు, నదులు, కొండలు, మెరిసే తారకలు, అందమైన స్త్రీలు, రేడియోలు, బ్యాంక్ బాలెన్సులు, పిల్లలు, కళ, కవిత, నాట్యం, సినిమాలు — ఇవేవీ నాకు అక్కర్లేదా? నాక్కావాలి. పదేపదే పుట్టాలి. వొందేళ్ళ తరవాతైన నా పార్టీ ఎలక్షన్‌లో నెగ్గితే చూడాలని వుంది. పాపాలు చేసి, పదేపదే పుడతాను. కొన్నివేల జన్మలెత్తాక, పాపాలన్నీ పూర్తిగా పొయ్యాక, చివరలో దైవంలో కలుస్తాను. తొందరేం - అనుకుంచే తప్పా? కాదునాయనా, దైవాన్ని ప్రార్థిస్తివా, స్థిరమైన ఆనందం దొరుకుతుంది. కోర్కెలుకూడా తీర్చగలడు దైవం, అంటారు కొందరు. యుద్ధసమయంలో, ఇరుపక్షాలవారూ, తమదేశం నెగ్గాలనీ, అవతలదేశం నాశనమవాలనీ ప్రార్థనలు సల్పితే, దైవం ఎవరి మొఱ ఆలించాలి? ఎన్నికలలో రెండుపక్షాల అభ్యర్థులు

పోటీ చేస్తారనుకుందాం. ఒకపక్షం అభ్యర్థికి శీలం ఉంది, తెలివిలేదు. మరోపక్షం అభ్యర్థికి తెలివుంది, శీలం లేదు. శీలం ఉంటేగాని మంచిపనికి పూనుకోడు; తెలివుంటేగాని తలపెట్టిన పని నిర్వహించలేడు. ఇద్దరూ దైవాన్ని ప్రార్థిస్తే, ఎవర్ని నెగ్గిస్తాడు దేవుడు? ఎలక్షన్ సమయం, ప్రజాస్వామ్యంలో ప్రజలకేకాక దైవానికికూడా గడ్డుకాలమే. రసెల్ సూచించిన హేతువాదాన్ని స్వీకరిస్తే, ఇట్లా వితర్కించుకోవాలి, నేను, నాతోపాటు పాఠకుడూ.

మన కష్టాలను మతం తొలిగించగలదా? - అన్న మరో ప్రశ్నకు రసెల్ సమాధానం చూద్దాం. మతానికి సంబంధంలేని నైతిక నియమాల విషయంలోనే ఇబ్బంది లొస్తాయంటాడు. ఒక ఉదాహరణ, దొంగతనం. సమాజంలో వారందరికీ దొంగతనం లేకపోవడం మెరుగు నీతి, మతం, న్యాయ చట్టంలేని సమాజంలో, ప్రతివ్యక్తీ, ఆదర్శ సమాజం అంటె, తనొక్కడూ చోరుడు, మిగతా వారంతా బుద్ధిమంతులూ ఉన్న సమాజం అనుకుంటాడు. కాబట్టి తన ఆదర్శాన్నీ, ఇతరుల ఆదర్శాన్నీ క్రోడీకరించాలంటే, సంఘ నియమాలు అవసరం. నేరస్థులను శిక్షించే చట్టం, పోలీసు అవసరం అన్నమాట. కాని కొందరు నేరస్థులు పట్టుబడరు. ధనానికాశపడి, పోలీసు ఆరాలు తియ్యడు వొక్కొక్కప్పుడు. పోలీసు విధినిర్వహణలో అశ్రద్ధ చూపినా, దొంగతనాన్ని శిక్షించే దైవం ఉన్నాడనుకున్నప్పుడు, దైవాన్ని నమ్మడం మంచిదే. సమాజంలో అందరూ దైవంపట్ల నమ్మికగలవారైతే, దేవుడే దొంగతనాన్ని రూపుమాపాడను కుంటారు. రమణాశ్రమంలో రాత్రి దొంగలుపడి, పూజా సామగ్రి దొంగి లించారుట. అడ్డుకున్న రమణ మహర్షి ని కొట్టి తోశేసారుట. ఇది జరిగిన మరో గంటకి శిష్యులొచ్చి, 'పూజకిరండి' అన్నారుట. 'అయిందిగా పూజ' అన్నారుట రమణ. 'ఎప్పుడు?' "ఇప్పుడేగా అయింది బడితె పూజ" అన్నారుట. యోగికి కూడా ఇట్లాంటి హాస్యదృష్టి అవసరం. వెనకటి రోజుల్లో ఇట్లాంటి నమ్మకంవల్ల, కొంత మేలు జరిగివుండొచ్చు. కాని ఈనాడు అట్లాంటి నమ్మకంవల్ల కలిగే మేలుకన్నా చెడుగే ఎక్కువవుతోంది. నాగరికత ప్రబలినకొద్దీ, దైవశాసనం ప్రభావం తగ్గి, లౌకికశాసనాల ప్రభావం హెచ్చుతుంది దొంగతనం చేస్తే, దైవం శిక్షిస్తాడన్న భయం కంటె పోలీసులు పట్టుకుంటారన్న భయం ఎక్కువగా ఉంటుంది. దైవభక్తుడుకూడా దొంగతనం చేస్తే, నరకానికెడతా ననుకోడు, ఈనాడు నరకం, వెనకటివారు చెప్పినంత భయంకరంగా ఉండక పోవచ్చు ననుకుంటాడు — మెల్లిగా కూర్చుని పశ్చాత్తాపపడితే సరిపోతుందను కుంటాడు. నిజానికి ఇక్కడ, ఈ లోకంలో పట్టుకుని దండిస్తారన్న భయం

వల్లనే, దొంగతనాని కొడిగట్టరు జనం ఎక్కడో బంగారం గని ఉంది—ఊరికే వెళ్ళి తెచ్చుకోవచ్చునని తెలియగానే జనం అంతా అక్కడికి ఎగబడి, బంగారాన్ని దొంగిలించడం మొదలెడతారు దొంగతనం లేకుండాపోవడం మంచిదే కదా, మతం దొంగతనం కూడదని శాసిస్తే తప్పేమిటి అని అడుగుతారేమొ తప్పు లేదు నిజమే. కాని అల్లా శాసించడంవల్ల మరో ప్రమాదం ఉంది మతం అల్లా ఎందుకు శాసించింది అని ఎవరన్నా ప్రశ్నిస్తే. వారిమీద విరుచుకుపడతారు మతోన్మాదులు మానసిక స్వేచ్ఛ, కౌతూహలం దెబ్బతింటాయి అల్లా ఆడిగిన వారిని, నిప్పుగుండంలో పడేసి చంపారు, వెనక. నాగరికమైన దేశాలలో పార్య గ్రంధాలద్వారా, పిల్లలు మతసూత్రాలని స్వీకరించేటట్లు, వాటిని ప్రశ్నించే అవకాశం లేకుండా, నిర్బంధ విద్యద్వారా, సంకుచిత మనస్తత్వాన్ని రూపొందిస్తారు; - అదీ ప్రమాదం అంటాడు రసెల్

మన దేశంలోకూడా, మతం పేరిట హింసాకాండ బోలెడు జరిగింది నిన్న మొన్న వరకూ. హిందూ తత్వ శాస్త్రం, ఇతర సిద్ధాంతాలపట్ల సహనం చూపి, వాటిల్లో మంచిని స్వీకరించి ఉండొచ్చు. ప్రాచీన మతగ్రంధాలలో ఈ హింసాకాండ జరపమని వ్రాసి వుండకపోవచ్చు అయినా, మతప్రాబల్యం నుండీ, మతోన్మాదుల నిర్వచనాల నుండీ, బైలుదేరిన హింసాకాండ వుంది కొన్నింటిని ఉదహరిస్తాను ఒరిస్సాలో, కొండజాతులు, భోండ్ లు. వారు నరబలు లిచ్చేవారు. బలి కాబొయ్యేవాడు మెరయ. దర్భిచ్చి అతన్ని కొంటారు — పందులు, మేకలు, కోళ్ళు, ధాన్యం రూపేణ మిడతలదండుని చంపాలన్నా, భూమి సారవంతం అవాలన్నా అతన్ని బలి చెయ్యాలి చంపాక, అతని శరీరంలో మాంసపు ముక్కలని, భూమిలో నాటేవారుట. మెరయని చంపేముందు, కులపెద్ద ఎందుకు అతన్ని బలియ్యాల్సి వొచ్చిందో చెప్పి ఆ బలిలో పాపం ఏదన్నా వుంటే, అది అమ్మినవాడికే కాని, కొన్నవాడికి చుట్టుకోదని చెప్పేవాడుట, మతంన్నుండి జనించిన మూఢనమ్మకమే ఈ బలికి కారణమైంది. నీలగిరిలో తోడారులు, బంజరులు, నేలలో పూడ్చిన శిశువుల పైనుండి పశువుల మందను తోలేవారుట. ఈ ప్రాచీన సమాజాలు, హిందూతత్వానికి దూరంగా వున్నమాట నిజమే బనా, తంజావూరులో ప్రతి శుక్రవారం, వొక మొగ శిశువుని బలిచ్చే ఆచారం వుండేదిట బస్తర్ లో 1830 లో రాజాగారు, వొక్కసారి పాతికమందిని బలి పీఠానికి ఆహుతుల్ని చేశాడుట మతం ఆదేశించిన కర్మకాండ పేరిట, నర బలులు, అనేకప్రాంతాలలో, 1854 వరకూ జరుగుతూ వుండేవిట.

అల్లాగే సహగమనం — భర్త చావగానే, భార్య కూడా చావాలనడం —

బలవంతంగా విధవల్ని చంపడం, క్రితం శతాబ్దిలో జరిగిన హింసాకాండ. ఇహంలో స్త్రీకి, భర్తే దైవం. ఆమె విధవగా వుండిపోతే, పతివ్రతగా వుండలేదు. శీలం కాపాడుకోలేదు. మరెవరో ఆమెని అనుభవిస్తున్నారంటే, భర్తకి బాధగా వుంటుంది. నిరుపయోగమైన విధవని, పోషించడానికి డబ్బు కావాలి. వేదాలలో ఇల్లా చెయ్యమని లేకపోయినా, తర్వాత బైలుదేరిన, శాస్త్రాలలో, అల్లా చని పోయిన వితంతవు స్వర్గానికెడుతుందన్న మూఢనమ్మకంవల్లనే ఈ దురాచారం కొనసాగింది. టాడ్ రచించిన రాజస్థాన కథావళిలోనూ, 'స్లీమాన్' రచించిన గాధలలోనూ, భర్తలతో హతులైన స్త్రీల అద్భుత గాధలెన్నో వున్నాయి. రాజస్థాన్‌లో, భర్తలు, వీరమరణాన్ని చూరగొంటారు. అట్టివారి భార్యల సహగమనం, అద్భుతంగా వుండొచ్చు కాని బెంగాల్‌లో జరిగిన 'సతి' చర్య అతి ఘోరమైనది. అనాటి విధవలు, అయిష్టంగా భయంతో సహగమనం చేసి నట్లే కనబడుతుంది. భర్త శవానికి ఆమెని కట్టివేస్తారు. బలవంతంగా చంపే వారు. ఒక సందర్భంలో, వితంతువు తప్పించుకు పాఁరిపోతే, ఆమె కొడుకు. ఆమెని పట్టుకుని, బలవంతంగా నిప్పుగుండంలో తోశాడుట. **1806** లో బెనారస్‌లో జరిగిన ఉదంతం, చిత్రమైంది. 'స్లీమాన్' వివరించాడు; కాశీ మేజ స్ట్రేట్‌గా వుంటున్న హార్డింగ్ ఒక వితంతువు సహగమనం చెయ్యకుండా, నచ్చజెప్పి, నిలుపు చేశాడుట. కాని ఏడాదిగడిచాక, ఆమె బంధువులంతా, ఆమె చనిపోయి స్వర్గాని కెళ్ళడం మంచిదని, ఆమె మనస్సు మార్చి, ఒప్పించి, కాశీకి రెండుమైళ్ళ దూరంలో, గంగ ఆవలి ఒడ్డున చితిపేర్చి, అందులో పడ వేశారుట. తాళ్ళు గట్టిగా కట్టలేదో ఏమో, శగ తగలగానే, ఆమె లేచి గంగా నదిలో దూకిందిట. ఆమె బంధువులు, గట్లమీద పరుగెడుతూ వెళ్ళారుట. కొంత దూరం నీళ్ళలో వెళ్ళాక, పోలీసులు పడవలో వచ్చి, ఆమెని రక్షించి తీసుకు వెళ్ళారుట. బంధువులు, ఆమెని తమకి ఒప్పగించమని అడిగారుట. "ఈ త్యాగాన్ని దైవం హర్షించలేదు. చూడండి, గంగానది ఆమెని మీకు దక్కకుండా ఇటు తీసుకొచ్చింది. దాన్నిబట్టి, దైవం ఈమెని పరిత్యజించాడు, వద్దన్నాడు." అని మేజస్ట్రేట్ నచ్చచెప్తే, తృప్తిపడి బంధువులు వెళ్ళిపొయ్యారుట బెంటింక్ ప్రభువు సాహసించి, చట్టరీత్యా, 'సహగమనం' లేకుండా చేసినా; మతోన్మాదులు, తమ ఛాందసాన్ని విడనాడడానికి చాలాకాలం పట్టింది. **1911** లో కూడా, ఒక సహగమనం జరిగిందంటాడు ఎడ్వర్డ్ థాంప్సన్. పాతిక, ముప్పై సంవత్స రాల పూర్వంవరకూ ఈ హింసాకాండ జరిగిందంటే, మూఢ నమ్మకాలవల్ల సంక్రమించే కీడు ఎట్లాంటిదో తెలిసొస్తుంది.

అర్థంలేని నమ్మకాలూ, అలవాట్లూ కొన్ని మనలో ఈనాడూ వుండి పొయ్యాయి బస్‌లో వెడుతుంటే, సాయంత్రం రోడ్డు మీద విద్యుత్ దీపాలు వెలగగానే, బస్సులో సూటు ధరించిన వ్యక్తి, నమస్కారం పెట్టి, చెంపలు వేసుకోవడం నే చూశాను. వ్యాధి కుదరాలన్నా, సంతానం కలగాలన్నా, ముడుపు కట్టి, ఏ ఆలయానికో వెళ్ళడం, ఏ యోగినో దర్శించి, ఇంత విభూతి తెచ్చుగుని, తమ ఇబ్బందులు తొలిగించుకోవాలని, యాత్రలు చేసి వచ్చిన వారెందరో ఉన్నారు భర్త, విద్యాధికుడై, శాస్త్రీయ దృక్పథం కలిగినవాడైనా, భార్య పూర్వకాలపు మన స్తత్వంకలదై, ముడుపులు, మొక్కుబళ్ళవల్ల కోర్కెలు సిద్ధిస్తాయన్న, నమ్మకం కలదై వుండడంవల్ల, ఆమెని కష్టపెట్టడం ఇష్టంలేక, నొచ్చుకుంటుందేమోననుకుని, భర్త, పెట్టె, మూటా నెత్తిని పెట్టుకుని, యాత్రలకి బైలుదేరుతాడు. యోగుల్ని సందర్శిస్తాడు. విజ్ఞానశాస్త్రం ప్రబలి, శాస్త్రీయ దృక్పథం అలవడితే, ఈ వృధా యత్నాలు చెయ్యరు. సంతానం కలగకపోతే, పూర్మ జన్మలో ఏదో పాపం చేశామన్న భావం తొలగాలి. హాస్పటల్‌లో చేరి, భార్యా భర్త లిరువురూ పరీక్ష చేయించుకుని చికిత్స పొందాలి సిగ్గు, భయం వల్ల చాలామంది ఈ పరీక్షకు ఇష్టపడరు నూటికి తొంభై పాళ్ళు, చికిత్స ఉండి తీరుతుంది. పుట్టుకతో వచ్చిన అవకరమో, వైకల్యమో వుంటే తప్ప, చికిత్స ద్వారా ఫలితాన్ని పొందొచ్చునన్న భావం కలగాలి.

ఆధునిక విజ్ఞానశాస్త్రానికి, కొరుకుడుపడని సమస్యలు చాలా ఉన్నాయన్న మాట నిజమే. తేలు మంత్రం, పాము కాటు మంత్రం, మన కిష్టులైనవారు, దూరంగా మరో చోట ఆపదకు లోనైతే, మనకిక్కడ ఏ తలనొప్పో వచ్చి, ప్రమాదం జరగబోతోందన్న స్ఫురణ కలగడం; దయ్యాలు, భూతాలు దుస్వప్నాలు, క్రితం జన్మలోని స్మృతులు - వీట్లకి కారణాలు విజ్ఞాన శాస్త్రంలో దొరకవు పరిశోధనలు జరుగుతున్నాయి నిదర్శనం, దృష్టాంతరం, రూఢైన కారణం తెలిసేవరకూ, వీట్ల గూర్చి, తీర్పు చెయ్యక, బుద్ధి భవనం, కిటికీలు తెరిచి ఉంచడం మంచిది.

దేవుడు, అమరత, జన్మ రాహిత్యం - ఈ భావాలకు విజ్ఞాన శాస్త్రంలో స్థానం లేదంటాడు రసెల్. మతానికి, ఈ భావాలు పునాదులు లాంటివి అనలేం కూడా. ఎందుకంటే, బౌద్ధంలో ఈ రెండూ లేవు. - అమరత్వం పట్ల పూర్తిగా వర్తించకపోయినా స్థూలంగా చూస్తే బౌద్ధ మతంలో అమరత ప్రధాన సూత్రం కాదు - "ఈ రెండూ నేను నమ్మను. నమ్మేటందుకు తగిన ఆధారాలు లేవు. దేవుడు లేడని ఋజువుచెయ్యగలను అనడంలేదు నేను. క్రైస్తవ మతస్థాపకుడైన

క్రీస్తు, ఒకప్పుడు వర్ధిల్లి వుండవచ్చు; అనేక మతాలు పేర్కొన్న దేవుళ్ళు వర్ధిల్లి ఉండవచ్చు; ఇవన్నీ అనుకోడమే అవుతుంది. ఒకటి మరొక దానికంటె సంభవమైందనుకోడానికి ఆధారం లేదు. మానవుడు తెలుసుకోగల విజ్ఞాన జగత్తుకి అతీతమైనవి ఇవి. అమరజీవులు కావడం అన్న భావాన్ని మరోవిధంగా సమర్థించవచ్చు. మనిషి ఎల్లా పుట్టి, వర్ధిల్లి, నశింపవుతున్నాడో, విజ్ఞానశాస్త్రానికి అవగాహన అవుతుంది నీటి బిందువు, అమరజీవి కాదు. దాన్ని జల, ప్రాణ వాయు కణాలుగా మార్చవచ్చు. తానల్లా మారిపోయి కూడా, 'నాలో నీటి తత్వం - అనే అమరత ఉంది' అని ఆ నీటి బిందువు వాదిస్తే, 'ఆ, చెప్పొచ్చావు, పోదూ' అని త్రోసి పారేస్తాం. ఆ విధంగానే మెదడులో అమరత లేదు. శిక్షకు లొంగిన సజీవ కణాల సమీకరణ - మెదడు. మృత్యువుతో ఆ సమీకరణ అంత మౌతుంది. మనస్సు, ఊహ, — ఇవి కూడా, శారీరకమైన భౌతిక శక్తులతో ముడిపడినవే. కావున శరీరం అంతమవడంతో, మిగతా శక్తులన్నీ అంత మొందుతాయి. నిలబడి మరో శరీరంలో ప్రవేశించేది, ఒక్కటీ లేదు. కాని కొందరు మరో జన్మ ఉన్నట్లూ, తాము వెనకటి జన్మలో ఎవరైందీ తెలియడం, మొదలైన అద్భుత గాథలు వింటాము వీటిల్లో కొన్ని బూటకాలైనా, కొన్ని నమ్మతగినవిగా ఉన్నాయి వీట్ని గురించి పరిశోధనలు జరిగి, తగినంత నిదర్శన దొరికేవరకూ పునర్జన్మ సాధ్యమైందనీ, కాదనీ, నిర్ణయించకూడదు" -అంటాడు రసెల్.

మనిషి ఆశించే అమరత కాని పునర్జన్మ కాదు అమరత సాధ్యమని చెప్పేవారు, ఆత్మ శరీరం, వేరు, ఒకటి హతమైనా రెండోదానికి చావు లేదంటారు. ఇది అతీంద్రియ జ్ఞానం తెచ్చిపెట్టిన మూఢ విశ్వాసం. మనస్సు. పదార్థము - ఈ రెండూ విడి విడిగా ఉండే యదార్థాలు కావు. ఆత్మవలెనే, ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు కూడా శాస్త్రజ్ఞుల తార్కిక కల్పనలే. ఇవి కొన్ని దశల కూర్పు - వాటి కొక చరిత్ర ఉంది ఆత్మ విషయం చూడండి. మనిషి పుడతాడు — శిశువుగా — తర్వాత బాల్యం - యవ్వనం — ఇంకా పెరగడం- వార్ధక్యం — ఈ అన్ని దశలలోనూ, ఆత్మ ఒక్కటిగా ఉంటుందనలేము స్త్రీ పురుష సంయోగం వల్ల ఏర్పడ్డ స్థితి — మార్పు లేకుండా స్థిరంగా ఒకే స్థితి గల యదార్థం కాదు ఆత్మ. ఆత్మకి అమరత ఉందన్న తత్వజ్ఞులకు ఒక పరీక్ష పెట్టొచ్చు. ఆత్మ స్థలం అంతటా వ్యాపిస్తుందంటారు. మనం చాలా కాలం జీవించాలని కోరతాం గాని లావుగా అవాలని కోరం. తత్వజ్ఞులు ఈ విషయం గమనించి ఉంటే, ఇట్లాంటి కారణాలు చెప్పరు. మృత్యువంటే భయం. ఆ భయం నుండి జనించినదే 'అమరత'ని గూర్చిన చింతన.

మృత్యువుని కొంతవరకూ నిలుపు చెయ్యగలం కాని జయించలేము జయించగలమన్న భ్రమే, మత సిద్ధాంతమైంది. లోకాన్ని దేవుడు పాలిస్తున్నాడు. ప్రార్థన ద్వారా, దేవుణ్ణి మెప్పించి కోర్కెలను సాధించగలం - దీని ద్వారా, సర్వశక్తుడైన దైవంలో కొంత శక్తిని మనమూ పంచుకుంటున్నాం. మొత్తానికి మతం, భయాన్ని ప్రవేశపెట్టింది. కొన్ని భయాలు, మెచ్చుకోతగ్గవంటుంది. నిజానికి అన్ని రకాల భయాలూ చెడ్డవే. "చనిపోగానే, నే కుళ్ళి, నశింపవుతాను. నా తాలూకు ఏదీ మిగలదు. నేను వృద్ధుడను. జీవితం అంటే నా కిష్టం. కాని మృత్యువంటె భయంతో వణికిపోను. అన్ని సుఖాలూ అంతమొందుతాయన్నంత మాత్రాన, అవి సుఖాలు కాకుండా పోవు. నేను ప్రేమించినవారు, అమరజీవులు కారు, చనిపోతారు, అనుకుని వారిని ప్రేమించకుండా ఉండలేను. మానవుడు గొప్ప త్యాగాలు చెయ్యగలడు. సాహసించి ప్రాణం ఇవ్వగలడు. ఇంతటి శక్తి గల మానవుడు మృత్యువుకి ఎందుకు వణికిపోవాలో!"

ఇంక, 'ముక్తి', 'మోక్షం' పొందడం అన్న భావం గురించి రసెల్ ఏమన్నాడో చూద్దాం ముక్తి పొందడం అన్నది అన్ని మతాలలోనూ ఉంది. ఒక వ్యక్తి ముక్తి చెందుతాడు అన్నది, మత సంప్రదాయం తెచ్చిపెట్టిన లోపం అంటాడు రసెల్. ఆత్మకీ, దైవానికీ నడుమ జరిగే సంభాషణే, ఆధ్యాత్మిక జీవనానికి ప్రాతిపదిక దైవ శాసనానికి తల వొగ్గడం – నీతి. తను ఎట్లాంటి సమాజంలో ఉన్నా, వ్యక్తికి ఇది సాధ్యం ఒక దశలో ఇది కొంత మేలు సమకూర్చింది. కాని ఈనాటి ప్రపంచంలో, వ్యక్తుల ముక్తి కంటె, సమాజాల సాముదాయక ముక్తి ముఖ్యం అంటాడు రసెల్. రాజకీయ వ్యవస్థలో ఏ స్థానమూ లేక, బానిసలైన రోము సామ్రాజ్య ప్రజలలో క్రైస్తవ మతం అవతరించింది క్రైస్తవ మతం ప్రబలిన మొదటి మూడు శతాబ్దాలలోనూ, ఆ మతాన్ని స్వీకరించినవారు తాము సమాజాన్ని మార్చలేమని తెలుసుకున్నారు తాము ఉంటున్న సమాజం మంచిది కాదన్నారు. ఈ పరిస్థితిలో, ప్రపంచం చెడ్డదైనా, వ్యక్తి ముక్తి సాధించగలడన్న అభిప్రాయం ప్రచారమైంది. మోక్షకామి, ఈ ప్రపంచం ఎల్లా ఉన్నా పట్టించుకోనక్కర లేదన్నారు తత్వజ్ఞుడు ప్లేటో, హక్కులు, బాధ్యతలు ఎరుగున్న పౌరుడు కావున, సంఘ న్యాయాన్ని గురించి వ్రాసేటప్పుడు, వ్యక్తులని గురించి కాక, బృందాలను గురించి వ్రాశాడు. గ్రీకులు స్వాతంత్ర్యం కోల్పోయిం తర్వాత, నిస్సంగత్వం ప్రచారమైంది. క్రీస్తు కాలంలో 'జూడియా' ఏ దశలో ఉందో, ఇండియాలో రాజకీయ పరిస్థితి ఆ దశలో ఉంది. క్రీస్తు బోధించినవాటినే, ఇండియాలో గాంధీ బోధించాడు.

రోము దేశపు న్యాయమూర్తి పొంటియస్ పైలేట్ వారసులైన ప్రభువుల దండనకు గురైనాడు ఇండియాలో జాతీయవాదులు వ్యక్తిగతమైన ముక్తితో తృప్తిపడక, జాతి కంతటికీ ముక్తి కావాలన్నారు. పాశ్చాత్యదేశాల ప్రజాస్వామ్య సూత్రాన్ని స్వీకరించారు వారు. ఐనా కూడా, 'వ్యక్తి ముక్తి' అన్న సూత్రం తాలూకు ప్రభావం వారిలో కొంత ఉండిపోయి, తగినంత ధైర్యంతో, జిజ్ఞాసతో 'జాతీయ ముక్తి' అన్న భావం రూపొంది, సుస్థిరం కావడం లేదేమో— అంటాడు రసెల్. స్వత్వవర్తన అంటె, దైవం శాసించిన దానికి తలొగ్గడం — దైవం ఏమి శాసించాడో చెప్పేది అంతరాత్మ పర ప్రభువుల నిరంకుశపాలనకు తలొగ్గే మన స్తత్వం నుండి జనించిన భావం – ఇది అంటాడు. స్వత్వవర్తనలో కాస్తంత తెలివి కూడా ఉండాలి ఇంక అంతరాత్మ చెప్పింది అన్ని సమయాలలో నమ్మడానికి వీల్లేదు చిన్నప్పుడు దాది, అమ్మ, అమ్మమ్మ నేర్పిన పాఠాల సారాంశమే అంతరాత్మ దానికీ; వారికున్నంత తెలివే ఉంటుంది. నిండు జీవితానికీ, మంచి ప్రవర్తనకీ చదువు, స్నేహితులు, ప్రేమ, పిల్లలు, కొంత డబ్బు, ఆరోగ్యము, అనువైన వృత్తి అవసరం ఇవన్నీ సంఘ జీవనంలో తెచ్చుకోవల్సినవే మంచి సమాజంలో, మంచి జీవనం సాధ్యపడుతుంది — మరో విధంగా, దీన్ని పూర్తిగా ఎవ్వరూ సాధించలేరు.

మూఢాచారాలు, తప్పుడు నిర్వచనాలు, గుడ్డి నమ్మకాలు మతాన్నుండి జనించాయి గనక, మతం మొత్తం మీద అపకారం చేసింది గావున ఏ మతాన్నీ స్వీకరించ నక్కర్లేదు –అని రసెల్, మతాలలోని లోటుపాట్లని పరామర్శించాడు ఐతే, అనాదిగా ప్రపంచమంతటా వర్ధిల్లుతూ వచ్చిన మతాలన్నీ వృధాయే? వీటిలో మంచి ఏమీ లేదా? మతాలని నెలకొల్పిన మహా ప్రవక్తలూ, అనుసరించిన కోట్లాది ప్రజలూ – వీళ్ళంతా మూర్ఖులేనా? మతం ఏ ప్రయోజనమూ సాధించ లేదా? మతాలన్నీ బూటకాలేనా, ఏవీ అక్కర్లేదు అనడం సరిపోతుందా? ఇంతేనా?

ఈ ప్రశ్నలు రసెల్ అడగక పోలేదు మతంలో ఒక ప్రత్యేకమైన అనుభూతి ఉంది తిండి, బట్ట, ప్రేమ, ఇల్లు, ఉద్యోగం, ఆరోగ్యం, సంపద, స్నేహితులు, కళలు, వినోదాలు, న్యాయం, సత్యం, ధర్మం, నీతి, శీలం – ఇవన్నీ ఉంటే మనిషి ఇంకేమీ కోరడా? బుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్, లావొట్జీ, — వీటన్నింటినీ పరిత్యజించి, మర దేన్నో అన్వేషించారు అదేది? మానవుడి బుద్ధికి, తార్కిక అన్వేషణకి అతీతమైన సృష్టి వైచిత్రి. — ఒక 'మాయ' ఏదో ఉంది. ఆ వైచిత్రి అన్వేషణ ఫలితమే మత ప్రవక్త తొలి బోధ, యోగి దర్శన,

ఋషి వాక్కు; తపస్వి శోధించిన రహస్యం. ఇదే అన్ని మతాలలోని సారాంశమూ. ఈ సారాంశాన్ని, రసెల్ 1912లో హిబ్బర్ట్ పత్రికలో చర్చించాడు. సంశయశీలుడు, నాస్తికుడు, హేతువాది అయిన రసెల్, మతాలలోని ప్రధాన సూత్రాన్ని, దాని ప్రాముఖ్యాన్ని తృష్ణతో, ఉద్వేగంతో, విశదపరచడం చూసి నేను ఆశ్చర్యపడ్డాను. ఈ ఊహ, తృష్ణ, అతీంద్రియ జ్ఞానం (Mysticism) కలగచేసే కవితావేశము. కళా సృష్టిలో గల తపన – రసెల్ భావ ప్రపంచం పొలిమేరలో మాత్రం ఉన్నాయనుకునేవాణ్ణి. కాని ఈ వ్యాసం చదివాక, రసెల్ హృదయం ఈ ఆవేశంతో కొట్టుకోగలదని తెలుస్తుంది. అందులో కొన్ని భాగాలని పొందుపరచి, మతంగూర్చిన రసెల్ భావాల పరామర్శ ముగిస్తాను.

వెనకటి తరంవారిలాగు, మతం ఆదేశించిన నమ్మకాలు, కర్మకాండ, మహత్తు వీటిని ఈనాడు మనం విశ్వసించలేము. వీటిని విడిచేస్తే, మతంలో ఏముంది? మతాన్ని సమకూర్చేది – చిత్తవృత్తి (Feeling) లేక వాత్సల్యత, కాని నమ్మకాలు కావు. చిత్తవృత్తిని నమ్మకాల చిట్టాలో చేరిస్తే 'ఇది మంచిది', 'అది చెడ్డది' – అనిపించేటట్లు చేస్తుంది, కాని, మేధస్సుకి గురికానప్పుడు, వాత్సల్యతగానే వుండిపోయి, మన చర్యనీ, ప్రవర్తననీ రూపొందిస్తుంది. మన అల్పమైన వాంఛలు, స్వల్పమైన ఆలోచనలు — అనే జైలు నుండి మనల్ని విడుదలచేసి, స్వార్థరహితమైన పరిపూర్ణతనీ, అనంతత్వాన్నీ చవిచూసేటట్లు చేసే శక్తి మతంలో వుంది. మూఢనమ్మకాలతో ముడిపడని మతానికి, ఈ విముక్తి సాధ్యం.

మనిషిలో దైవత్వమూ, పశుత్వమూ కలిసి వుంటాయి – ఒకటి అనంతమైనది; రెండోది పరిచ్ఛిన్నమైనది. పరిచ్ఛిన్నమైన భాగం జంతుకోటిలో ఉన్నట్లే, శరీరానికి కట్టబడి – ఇక్కడ, ఇప్పుడు – తనకన్నీ కావాలంటుంది. స్త్రీ పురుషుల ప్రేమ, తల్లిబిడ్డల ప్రేమ – పరిచ్ఛిన్నమైన, ప్రవృత్తి, పశు ప్రకృతి, శత్రుత్వము, బంధుకోటి పట్ల వాత్సల్యము, గుంపులుగా నివసించే జంతువుల ప్రకృతి వంటివే. ఇవన్నీ ఉంటేనే మనిషి – తోటి వారినుండి, వేరైన మనిషి. మేఘావృతమైన సముద్రంపైనుండి మసకగా ప్రసరించే వెలుగు వలె, అనంతత్వమైన భాగం, లోకాన్ని ఒక్కకోణం నుండి చూడక, సదా వెలుగుతూవుంటుంది. ఇప్పుడు, ఇక్కడ ఎంతస్ఫుటంగా కనబడతాయో, అనంతత్వానికి, గతం, దూరప్రాంతం అంత స్ఫుటంగా, యదార్థంగా కనబడతాయి. వ్యక్తిక్షేమం దాటి, సర్వమానవుల క్షేమాన్ని కాంక్షించగల వొక భావన, అనంతత్వం.

నీ మంచి, నా మంచి అనికాక, అసలు "మంచిని" కోరుతుంది; నిష్పక్షపాతమైంది; ఈ నిష్పక్షపాతమైన సూత్రమే, భావనలో సత్యాన్నీ, ప్రవర్తనలో న్యాయాన్నీ, మనోధర్మంలో ప్రేమనీ శోధిస్తుంది. ఇక్కడ, ఇప్పుడు, నేను – వీటి మీద ఆధారపడక మానవులందరినీ, సృష్టినంతటినీ వెదికే యీ సూత్రం సమైక్యతని సాధిస్తుంది. ఈ రెంటికీ వైరుధ్యంలేదు. ఈ రెండూ కావాలి మనిషికి. పరిచ్ఛిన్నమైన భాగం జీవించాలంటుంది. పదార్థంపై అధిక్యతని కోరుతుంది; చుట్టూ గిరులు గీస్తుంది; జైలుగోడ లేవనెత్తుతుంది – తనే దైవం అనుకుంటుంది. చాలామందిలో పరిచ్ఛిన్నమైన భాగం, విశ్వాత్మకి కావలావానిలా వుండిపోతుంది; కొందరు, ఇందులోంచి పారిపోయి, కాసేపైనా, స్వేచ్ఛ పొందుతారు; కొందరు, ఈ గోడని పూర్తిగా పడగొడతారు. ఈ విముక్తి, అనంతత్వం మహావేదనలో క్షణంసేపు, సౌందర్యం సాక్షాత్కారమైనట్లు, అపారమైన ప్రేమ ముంచెత్తినట్లు చెట్లనడుమ చీకటిగాలులు వీచినట్లు, నిత్య జీవితంలో పడేబాధ, తగవు, పేచీ, జగడం నిలిచిపోయి, స్థిరమైన శాంతి మనస్సుని ఆవహిస్తుంది.

ఏదోక్షణంలో, ఒక్కసారిగా ఉత్పన్నమైన ఈ జ్ఞాన రేఖే మతాల సారం, క్షుద్రమైన దృష్టికి అగుపడే వస్తువులూ, పదార్థమూ – వీటినే తెలుసుకుంటుంది జ్ఞానరేఖ – కాని కొత్తకోణం నుండి తెలుసుకుంటుంది అవి, వాటి ప్రత్యేకత, స్థిరత్వము కోల్పోయి, అనంతమైన సుందర దృశ్యంగా కనబడతాయి. నేను రోజూ ఎరుగున్న జగత్తులో, నే చేసే పనిలో, ఇప్పుడు, ఇక్కడ, ఈ, సౌందర్యం నాకు లభ్యమవాలి. విశ్వాత్మని కౌగలించుకొన్న ఈ జ్ఞానరేఖవల్ల నాకివి దొరుకుతాయి.

ఇందుకు పరిచ్ఛిన్నమైన భాగాన్ని జయించి, విడిచేసి, అణగద్రొక్కి, పరిత్యజించాలి. ఆ స్థితిలో ఏదీ కోరను; వాంఛించను, నాదిగా చేసుకోవాలన్న తపనలేదు. ప్రత్యేకాత్మ, జీవాత్మ అవుతుంది. ఈ చింతననుండి, విశ్వప్రేమ జనిస్తుంది.

మతం కలుగజేసే అనుభూతి, మూఢనమ్మకాలు కలవారికి సాధ్యం కాదు. వారి ప్రకృతి పరిచ్ఛిన్నమైనది సత్ప్రవర్తన పేరు చెప్తే, సంప్రదాయమైన నీతి ఉండాలంటారు; అనంతాన్ని అన్వేషించే వారికి, ఈ వొక్క నీతిని గురించిన ప్రస్తావన తృప్తి నియ్యదు, చుట్టూ గూడు కట్టిన, సూత్రాలు, నమ్మకాలు, కాండ – వీటిని తొలగిస్తేనే, మతంలోని అనుభూతిని, నిజాయితీపరులు స్వీకరిస్తారు.

క్రైస్తవ మతంలో మూడు ప్రధానమైన సూత్రాలన్నాయి. (ఇవి అన్ని మతాలలోనూ ఉన్నాయనుకుంటాను. అందుకనే, క్రైస్తవ మతం సూత్రాల పరామర్శలో భాగాలని ఇక్కడ పొందుపరుస్తున్నాను.) ౧ ఆరాధన, ౨ విధికి తలొగ్గడం, ౩ ప్రేమ - ఇవి, ప్రధాన సూత్రాలు.

మతం నెలకొల్పబడిన తొలి దశలో, భయంనుండి జనించింది ఆరాధన- శక్తి కలిగి, మానవ యత్నాన్ని విధ్వంసంచేసే ప్రతిదాన్నీ మంచి చేసుకుంటూ, పూజించేవారు. రాను రాను ఈ పూజ, దైవంపట్ల కేంద్రీకృతమైంది. పర రాజులు, ఒక ప్రాంతం వారిని లోబరుచుకున్నప్పుడు, 'నిన్ను మించిన శక్తిగల దేవుడు, ఉన్నాడు లేవోయ్' - అనేటందుకు దేవుడు కావలిసొచ్చాడు. మరొక దశలో, దేవుడిపట్ల చూపిన భావం భయంగా కాక, ప్రేమగా రూపొందింది. ఆరాధనలో మహదానందాన్ని చూరగొన్నారు. ఆరాధనలో ఒక్క ఆనందమే ముఖ్యం కాదు, సృష్టి వైచిత్రిపట్ల వినయము, తన కర్థంకాని 'మాయ' పట్ల భక్తి భావము, - ఇవి, ఆరాధనలో ముఖ్యం తానెరుగున్న యదార్థ జగత్తులో, వ్యక్తి పట్లా, విషయంపట్లా, ఏర్పడే భక్తి భావము, ఒకటి. ఈ భావమే కళా రాధనగానూ, మహాపురుషులపట్ల గురు భావంగానూ రూపొందుతుంది. రెండోది, యదార్థ జగత్తులో కనబడని ఒక ఆదర్శంపట్లా ఆదర్శ పురుషుడిపట్లా, ఏర్పడే భక్తి భావము. ఇదే దైవ పూజ పరిపూర్ణమైన సౌందర్యము, సడలని సత్యమూ, తొణకని నీతీ - ఇవే, ఆదర్శమైన దైవాన్ని ఆరాధించడంలో తాను నెల కొల్పుకున్న, జీవితపు విలువలు కళలలో సౌందర్యము, మహాపురుషుల జీవితంలో నీతి, విజ్ఞానశాస్త్ర సాధనలో సత్యమూ - వీటిని నిష్పాక్షికంగా, మానవుడు ఆరాధించగలడు. వీటిని ఆరాధించడానికి, దైవంపట్ల నమ్మిక అక్కర్లేదు అంటాడు రసెల్. దైవంపట్ల నమ్మిక ఉంటే తప్ప, ఈ విలువల్ని మానవుడు స్వీకరించలేడు - అనుకోడం పొరబాటంటాడు. ఇల్లా అనుకోడానికి కారణం, సృష్టిలో వున్న ప్రతి విశేషమూ, ప్రతి ప్రాణీ, ప్రతి వస్తువూ, దైవంలో ఒక అంశమే దైవంలో అంశమైన ప్రతిదీ మంచిదే, ఆరాధించతగ్గదే- అనుకుని, ఉన్నదానికి విలువ కట్టి, ఈ దైవ పూజ తంతు అంతా కల్పించు కున్నాడు ఇది అవసరం లేదు, అంటాడు రసెల్.

రెండోది విధికి తలొగ్గడం - అంటే బ్రహ్మ రాసిన ధానికి తిరుగులేదు, ఇది దైవ శాసనం గనక, దీన్ని ధిక్కరించను - అన్న భావం అన్నమాట. సృష్టిలో మంచీ వుంది, చెడుగూ వుందీ మనం తొలిగించలేని 'చెడుగు' కూడా దేవుడు సృష్టించిందే గనుక, దాన్ని కాదనక, తలలొగ్గి; స్వీకరించాలి చెడుగుని

మానవుడు నిర్మూలం చెయ్యలేడు, అన్నది క్రైస్తవ మతం. ఈ చెడుగు, దైవం కల్పించింది గావున, చెడుగే కాదు, ఇదీ మంచేనంటుంది. ఈ భావంవల్ల మంచి చెడుగులకు మనం కట్టే విలువలకు అర్థం లేకుండా పోతుంది. కారణం ఏమిటంటే, లోకంలో వున్న చెడుగు, యదార్థంగా చెడుగే మనం దీన్ని ఉన్న దున్నట్లు స్వీకరించాలి. ఏమీ చెయ్యలేము — మానవుడు అసహాయుడు — అన్న మత సూత్రం వల్ల, నైరాశ్యం చెంది, పనికి, కార్యానికి పూనుకోక, స్తబ్దుడై, పురోగమించలేక పోతున్నాడు. మనం చేసిన పని వృధా అనిపిస్తుంది. వృధా కనక, చెయ్యనక్కర్లేదు. ఏ దెల్లా వుంటే నాకేం, ఎవరేమైతే నాకేం, నేను మాత్రం దైవాన్ని కొలిచి, తపస్సు ద్వారా, జన్మరాహిత్యం చెంది, అమరుడుగా దైవంలో ఐక్యమౌతాను — అన్న భావం ఈ భావాన్ని స్వీకరించకపోతే, దైవ శక్తికి హద్దుంది, పరమాత్మలో కాస్త చెడుగుంది అనుకోవాల్సి వస్తుంది. పరిమిత మైన దైవాన్ని, చెడుగున్న దైవాన్ని మనం కొలవనక్కర్లేదు మానసికంగా పెరిగి, వికాసం తెచ్చుకున్న, మానవుడు, ఈ తికమకని త్యజించి, కార్యానికి పూనుకోగలుగుతాడంటాడు రసెల్. మనకి జరిగే చెడుగుకి తలొగ్గడం ఒకటి — లోకంలో వున్న చెడుగుకి తలొగ్గడం మరి ఒకటి. తలొగ్గడం వల్ల, మనకి జరిగే చెడుగుని తొలిగించే యత్నం చెయ్యలేక పోతున్నాం. ఈ చెడుగు అందరికీ జరుగుతోంది గనక, ఇతరులపట్ల సానభూతి చూపి, 'ప్రేమించి' ఈ చింతనలో. మనకి జరిగే చెడుగుని మరిచి పోగలగడం—జరుగుతుందంటాడు. ఇల్లా లోకాన్ని ప్రేమించ గలిగితే, మనకి జరిగెడు చెడుగుకి, మండిపడి, ఎవరిపైననో విరుచుకు పడటం వుండదు. సమాలోచన, సమాధి, నిర్వాణం, తపస్సు, ఆధ్యాత్మిక చింతన, సాధించే ప్రయోజనం, ఇదే — విశ్వమానవ ప్రేమ ద్వారా, వ్యక్తిగత మైన బాధను మరిచి, ఎదుర్కోవడం. 'అహం'ని చంపుకుని సృష్టిని తిలకిస్తూ, లయ క్రమాలతో ఐక్యత పొందడానికి అవసరమైన శిక్షణ పొందాలి మూఢ నమ్మకాలు, ఆచారాలు, కర్మకాండ — వీటిని విడిచివేసినవారికి, ఈ మానసిక శిక్షణ సాధ్యం. ఈ శిక్షణకి గురయ్యే మనో నిబ్బరం లేని మతోన్మాదులు, ఆచారాలు, మూఢ నమ్మకాలు. కర్మకాండ, శాసించి, వాటి నిర్వహణలో పరిమిత జీవితాన్ని గడుపుతారు.

మూడవది ప్రేమ. రెండు విధాలైన ప్రేమవుంది. ఒకటి భౌతిక జగత్తుకి సంబంధించిన ప్రేమ — అందమైనదాన్ని, మంచితనాన్ని, ఆనందాన్ని చ్చేదాన్ని-ప్రేమించడం రెండోది స్వర్గతుల్యమైన విశ్వ ప్రేమ. భౌతికమైన ప్రేమ ద్వంద్వాలతో కూడివుంటుంది — శత్రువులు, స్నేహితులు, పాపులు, యోగులూ,

దేవుడూ, దయ్యం. సృష్టిలో ఈ విభిన్న ప్రవృత్తులు నిరంతరం పోరు సల్పుతూ వుంటాయి. కాని విశ్వ ప్రేమలో ఈ విభజన లేదు ఔన్నత్యాన్నీ, అల్పత్వాన్నీ· మంచినీ, చెడునీ, సజీవమైనదాన్నీ జీవంలేనిదాన్నీ—అన్నిటినీ ప్రేమించగలగడం. మన దయాదాక్షిణ్యాల వల్ల, బాధని నివృత్తి చేయలేని దాన్ని కూడా ప్రేమించ గలగడం అన్నమాట. బాధని తొలిగించే అవకాశం వుంటే, మనం కార్యానికి పూనుకుంటాం. ఈ అవకాశం లేనప్పుడు, ఆలోచనతో, చింతనతో తృప్తిపడతాం. ఆ చింతన వల్లనే, ఈ ద్వంద్వ ప్రకృతి, విభజన అపోహ కాని, యదార్థాలు కావని గ్రహిస్తాం. ఈ దివ్యమైన ప్రేమయే, విశ్వాత్మపట్ల వాత్సల్యతగా స్థిర పడుతుంది. విశ్వాత్మని తిలకించడంలో బుద్ధి పొందే అనుభూతి ఎట్లాంటిదో, మనోధర్మానికి, చిత్తవృత్తికి, విశ్వప్రేమ అట్లాంటి అనుభూతి నిస్తుంది. ఈ ప్రేమ, 'అహం' 'స్వార్థం' లేవనెత్తిన గోడలను పడగొడుతుంది; ఇవి గీసిన గిరులను తుడిచివేస్తుంది. దుఃఖం సమసిపోతుందని కాదు. మానవుడు విషాదజీవే, ఐనా కూడా, తాను వోడిపోయానన్న భావనలో నిస్పృహ సడలి, ఆశాజీవి కాగలడు. ఏకాకిగా వచ్చిన జీవి, అనేక ఇతర జీవుల జిజ్ఞాసతో కలిసి ఐక్యత చెంది వ్యక్తిగతమైన విషాదాన్నుండి విముక్తుడౌతాడు. ఈ ఐక్యత మూడు విధాలైనది. భావనలో, చిత్తవృత్తిలో, సంకల్పంలో – సాధించగల ఐక్యత.

నీతినిగూర్చి బెర్ట్రండ్ రసెల్ భావాలు కొన్నింటిని తెలుసుకుందాం. సాధారణంగా నైతిక పాఠాలు బోధించేవారి కంఠంలో అనుపేక్ష్యత ఉత్పాత మైన దృఢ నిశ్చయం, ఒక గంభీరత వినిపిస్తుంది. కాని రస్సెల్ నైతిక చింతనలో ఈరకం అక్కర, గాంభీర్యం అంతగా కనబడవు కళ్ళు పెద్దవి చేసి కంఠందించి చెప్పడం ఉండదు. కాస్తంత హాస్యం మిళితమై ఉంటుంది. విషయాన్ని స్పష్టంగా పొడిమాటల్లో, వచ్చిగా, ఉల్లాసంతో ఛలోక్తిగా చెప్పే యత్నం చేస్తాడు ఇల్లా చెప్పడమే ఆయన ప్రత్యేకత. ఇల్లా చెప్పడము వల్లనే అసలు విషయం చాలామంది తెలుసుకోగలగడం, తెలుసుకున్న విషయం వల్ల ఆకర్షింపబడటం జరిగాయన్నా, అతిశయోక్తి కాదేమో. ఏ కొద్దిమంది పండితు లకో తర్కజ్ఞులకో మాత్రమేకాక సామాన్య ప్రజకి అర్థం కావాలన్న తహతహ వల్లనే రసెల్ తత్వశాస్త్రాన్ని హాస్యంతో వితర్కిస్తాడు.

"దూరంగా ఉన్న పర్వతం మంచుతో కప్పబడి స్పష్టంగా కనబడదు. కొంచం దగ్గరగా వెళ్ళి చూసినా కూడా, ఏదో కొంత అస్పష్టంగా ఉండిపోతుంది. తత్వశాస్త్రంలో, పురోగమనం ఇల్లాంటిదే. ఆ మంచు వెనక విలువగల సత్యం ఒకటుందన్న భావాన్ని నేను స్వీకరించలేను. అపూర్వం, అరుదు, కావున

స్పష్టతని కొందరు హర్షించరు ఈ భావాన్ని ఖండించి పరిత్యజించడమే నా తత్వశాస్త్ర సిద్ధాంతాల ప్రధాన ఆశయం కంఠం దించి గంభీరంగా చెప్పేవన్నీ నాలో అక్కర ఉందనుకోకూడదు చెప్పతగ్గ ప్రతి మంచి విషయాన్నీ అనుపేక్ష్యతతో, గంభీరంగా చెప్పక పోవడం మంచిది. ఇల్లా ఉత్కృష్టమైన కంఠంతో నిగూఢమైన అక్కరతో చప్పేవారంతా తాము చెప్పిన విషయాన్ని ఎవ్వరూ నిశితంగా పరిశీలించకుండా చెయ్యాలన్న సంకల్పంతో చెప్పిన వారేనని నా అనుమానం. అతిపవిత్రమైన సత్యాలని నేను నమ్మలేను మాయ, నిగూఢత – లేకుండా 'సత్యాన్ని అన్వేషించవచ్చు ననుకుంటాను.' అని చెప్పు కున్నాడు రసెల్ తాను తత్వాన్ని పరిశీలించె విధానాన్ని సమర్థించుకుంటూ.

పచ్చిగా చెప్పివెయ్యడానికి ఉదహరణ:

"ఆ మధ్య ఒక మతాధిపతి, నేను ఏ విషయం గురించి అభిప్రాయం వెలిబుచ్చినా, అది నా కామతృష్ణ నుండి జనించిందే అన్నాడు. రెండో ప్రపంచ యుద్ధానికి, నే వెలిబుచ్చిన అభిప్రాయాలు, వొక కారణం, అన్నాడు."

"వీలైతే, ప్రతివాడూ దేవుడు కావాలనుకుంటాడు; అది అసాధ్యం అని చాలామంది ఒప్పుగోరు."

"కోతి నుండి ఆదిమానవుడు పుట్టాడు – అన్న భావాన్ని, విజ్ఞానశాస్త్రం బైటపెట్టినప్పుడు మానవుడు విస్తుపొయ్యాడు సృష్టిలో ఒక పురోగమన సూత్రం ఉందని, పరిణామవాదాన్ని నెలకొల్పి తన్ను తాను వోదార్చుకున్నాడు. ప్రాణి, ఏకకణజీవిగా (**Amoeba**, ప్రారంభించి, మానవుడుగా రూపొందిందంటె, సృష్టి తప్పకుండా పురోగమిస్తోందన్నమాటే నన్నారు తత్వశాస్త్రజ్ఞులు – ఈ అభిప్రాయంతో ఏకకణజీవి ఎంతవరకూ అంగీకరిస్తుందో మనకి తెలియదు."

"దుష్టశక్తులు, యువకుడిలో ప్రవేశించి, భోగలాలసుణ్ణిగా చేస్తాయి; ఆ దుష్టశక్తులే, వృద్ధుడిలో ప్రవేశించి, భోగలాలసతని ఖండించేవాడిగా చేస్తున్నా యని, ఎందుకనుకో కూడదు? ప్రతిదాన్నీ ఖండించడమే, వృద్ధుడి కాలక్షేపమూ, ప్రకోపమూను."

ప్రతి సమాజంలోనూ సంప్రదాయ సిద్ధంగా కొన్ని నైతిక సూత్రాలు ఏర్పడి వుంటాయి వీటి పునాదుల్ని గురించి రసెల్ ఏమంటాడో చూద్దాం

"అనేక కాలాలలో, అనేక చోట్ల, వేర్వేరు నైతిక సంప్రదాయాలు నెల కొల్పబడతాయి. పండుగ రోజున, తాము ఓడించిన శత్రువులని చంపి తినడం, అజ్టెక్కుల ఆచారం దచ్చివారి పాలనలోకి రాక పూర్వం, బోర్నియోలో

BV–22

నరహంతకులు, కొన్ని పుర్రెలను కట్నంగా ఇచ్చాకనే, కన్యాదానం జరిగేది తలిదండ్రులు జీవించి వుండగా, ప్రభుత్వం ఇచ్చిన ఉద్యోగాన్ని స్వీకరించి తీరాలి — అని కాన్‌ఫూషియస్ శాసించాడు; అలా స్వీకరించకపోతే, తలిదండ్రుల పోషణ బాగా జరగదన్న భయంవల్ల ఏర్పడిన శాసనం అన్నమాట. ఎవరన్నా కొట్టడంవల్ల, గర్భవతి అయిన స్త్రీ చనిపోతే; కొట్టినాయన కుమార్తెను చంపాలని శాసించాడు 'హమ్మురాబి' అనే నియంత యూదుల సిద్ధాంతం ప్రకారం, వ్యభిచరించిన స్త్రీని రాళ్ళతో కొట్టి చంపాలి. ఈ సిద్ధాంతాల మంచి చెడ్డలు ఎవ్వరూ నిర్ణయించలేరు నేను పాటించే నైతిక సూత్రాలు మంచివి; మరో విధంగా ఉన్నప్పుడు, ఇతర సమాజాల సూత్రాలను ఖండిస్తాను—అంటాడు ప్రతి వ్యక్తి. తాను పాటించే సూత్రాలు, మతంతో ముడిపడి, కేవలం భగవంతుడే ప్రసాదించాడు అనుకున్నప్పుడు, అట్లాంటి సూత్రాలని అతిక్రమించే ధైర్యం ఎవ్వరికీ ఉండదు సింహళంలో వర్ధిల్లిన క్రైస్తవ మత ప్రచారకులు, అక్కడి మనుషుల్ని తుచ్ఛమైనవారుగా పరిగణించేవారు, పనివాళ్ళ చేతకూడా పని చేయించి, లాభాలు గుంజి, ధనికులైన అంగ్ల ఉన్ని వర్తకులు, ఈ ప్రచారకుల ప్రచారాన్ని బలపరిచారు కారణం? సింహళంలో వారు, బట్టలు ధరించి, తమ వ్యాపారానికి లాభిస్తారు కావున.

ఎవరికి వారు, తమ సమాజం నిర్దేశించిన నైతిక సూత్రాలకు లోబడి ఉండాలి — అంటారు సాధారణంగా. అల్లా లోబడి వున్నవారిని ఎవ్వరూ నిందించరు, నిజమే కాని, లోబడి వుండక, ఆ సూత్రాలను అతిక్రమించిన వ్యక్తిని మెచ్చుకోవాలంటాను. ఒకప్పుడు, నరభక్షణ చాలా చోట్ల ఉండేది. ఈ ఆచారం, దానంతట అదే సమసిపోయింది అనలేము ఎవరో కొందరు, "ఇది తప్పు" అన్నవారు, ఉండి ఉండాలి తప్పు, ఒప్పు — అనే విలువలు ఎప్పుడూ ఒకేలాగు సమంగా వర్ధిల్లలేదు. 'తప్పు' — అన్న నిషేధాలు అతి ప్రాచీనమైనవి. హత్య, దొంగతనం, వ్యభిచారం, ప్రమాణంచేసి అబద్ధం ఆడటం, దైవ దూషణ, తలిదండ్రులను తూలనాడటం, మతం, రాజు—వీరిని దూషించడం ఇవి చెయ్యకపోతే ఏ ఒక్క మంచి పనీ చెయ్యకపోయినా సరే, ఆ వ్యక్తి సంప్రదాయందృష్ట్యా, మంచివాడు. ఈ మనస్తత్వం 'తప్పు' — అన్న ప్రాచీన నిషేధ కాండ నుండి ఏర్పడింది — ఇది ఎంతో అపకారం చేసింది"

చేసిన పని వల్ల ఏర్పడ్డ ఫలితాలను బట్టి, ఆ పని యొక్క తప్పొప్పులు నిర్ణయించాలన్న సూత్రం ముఖ్యమంటాడు రసెల్. ఫలితాలతో నిమిత్తం లేక కొన్ని పనులు, మంచివే — అని ఒప్పుగోడు. కాని ప్రాచీన సమాజాలు కొన్ని

మంచి పనులని దైవం శాసించాదని, ప్రచారం చేస్తూ వచ్చారు. ఇట్లాంటి దైవత్వం ఉండనక్కర లేదంటాడు. దైవత్వం ఉందన్న నీతి మూఢ విశ్వాసం అన్నమాట. కొన్ని నైతిక నిషేధాలని చూద్దాం. గో మాంసం తినడం పాపం; పంది మాంస భక్షణ పాపం; విధవ సహగమనం చెయ్యకపోవడం పాపం; భార్య చనిపోతే, ఆమె చెల్లెలిని పెండ్లాడడం పాపం; ఆత్మహత్య పాపం, వ్యభిచారం పాపం. రసెల్ పేర్కొన్న వీటితోపాటు మన ధర్మశాస్త్రంలో చెప్పిన వాటిని కూడా ఉదహరిస్తాను. విద్యావ్యాసంగం, ఇతరుల కోసం త్యాగం చెయ్యడం, దానాలు ఇచ్చి పుచ్చుకోడం – ఇవి బ్రాహ్మడు చెయ్యవచ్చు. కాని క్షత్రియుడికి తగదు – ముఖ్యంగా దానాలు పుచ్చుకోవడం సంతానం లేకపోతే భార్యని ఎనిమిదవ ఏట ఒదిలెయ్యవచ్చు; సంతానం కలిగి చనిపోతే, భార్యని పదవ ఏట విడిచెయ్యవచ్చు; కేవలం ఆడ సంతానాన్ని కన్న భార్యని పదకొండవ ఏట విడిచెయ్యాలి, గయ్యాళి అయిన భార్యని వెంటనే వొదిలెయ్యాలి. ఈనాడు వీటిని ఎంతవరకూ పాటిస్తున్నారో పాఠకుడే గ్రహించాలి.

తాను పేర్కొన్న సూత్రాలన్నీ చాలా దేశాలలో, న్యాయశాస్త్రంలో చట్టాలుగా స్థిరపడ్డాయంటాడు రసెల్ ఆదికాలంలో, నాగరికత ప్రబలని ప్రాచీన సమాజాలలో, ఇట్లాంటి సూత్రాలు ప్రచారం కావడానికి ఏవో కారణాలు ఉండి వుండాలి. మనకి ఆ కారణాలతో నిమిత్తం లేదు ఈనాడు ఆ కారణాలు లేకపోయినా, పూర్వులు నిర్దేశించారు గావున వాటిల్లో ఏదో మహత్తు ఘనత, ఉన్నాయనుకుని వాటిని పాటించడం పొరపాటు అంటాడు రసెల్.

"స్త్రీలని తక్కువ వేతనాలిచ్చి, ఎంతో కష్టపెడుతూ తన పనిలో వుంచుకుని, లాభాలు సంపాదించి, కోటీశ్వరుడైన వ్యక్తిని సంఘం గౌరవిస్తుంది; పార్లమెంటు సభ్యుణ్ణిగా ఎన్నుకుంటుంది. కాని తన వద్ద పని చేస్తున్న స్త్రీతో వ్యభిచరిస్తే సంఘం అతన్ని 'పాపి'గా పరిగణిస్తుంది. నీతులు చెప్పే పెద్దలు, దయాదాక్షిణ్యాలు, అసూయ, అసహనం లేకపోవడం – వీటిని గురించి పట్టించుకోరు. వెనక ఎవరో చెప్పిన వాటిని పాటిస్తున్నారా, లేదా, అన్నదే వారికి ముఖ్యం. నిజానికి ఇతరులను, కొన్ని "చెయ్యొద్దు" అని నిషేధించి హింసించి ఏడిపించడంతో, ఈ నీతిపరులు కాస్త సంతోషం పొందడంలేదా అనుకోవాల్సి వస్తుంది."

ఇంగ్లండ్‌లో 1936 లో దీర్ఘ వ్యాధి నుండి బాధ పడుతున్న రోగి, డాక్టర్ అనుమతితో, ఆత్మహత్య చేసుకునే హక్కు ఉండాలని ఒక చట్టం ప్రతిపాదించమంటె, ఆనాటి పెద్దలు కూడదని త్రోసిపుచ్చారట. "ఎవరు

ఎప్పుడు చావాలి — అన్న విషయాన్ని దేవుడే నిర్ణయించాలి — మనుష్యులు కాదు, అన్న తీర్పుతో, ఆ చట్టాన్ని త్రోసిపుచ్చారట.

"ఈ తీర్పు చేసిన పెద్దలకి, మరణ దండనకి, యుద్ధంకి ఏ అభ్యంతరమూ వున్నట్లు కనబడదు మరణదండన జరిపేదీ, యుద్ధాలు రేపేదీ, మనుషులే, దైవం కాదు. దైవం చెయ్యవల్సిన పని, తాము చేస్తున్నామన్న జిజ్ఞాస వీరికి, వీటిపట్ల లేదు 'చికిత్సలేక, బాధపడలేక, తొందరగా చంపి నా బాధ అంతమొందించండి' — అని మొఱపెట్టే రోగిపట్ల వీరికి దయ లేదు. ఆ రోగి అల్లా బాధపడుతూ ఉంటే దైవం చూసి వూరుకుని, ఆనందిస్తాడంటే నేను నమ్మలేను. ఆ బాధ కొనసాగకుండా, ఆ రోగి ఆత్మహత్య చేసుకునే హక్కుని దైవం సహించడంటే నేను నమ్మలేను. ఈ నైతిక సూత్రంలో రాజకీయాలు లేవు బీదలు, ధనికులు — వైరంలేదు. కులమత విచక్షణ లేదు. ఎన్నికల సమయంలో దీని ప్రసక్తి రాదు కరుణ, దయ — రహితమైన సంప్రదాయ బద్ధమైన ప్రాచీన నైతిక సూత్రాల మహిమ, ఈ దృష్టాంతంలో, వగ్నంగా చూడొచ్చు" అంటాడు రస్సెల్. ఇదంతా వెనకటి రోజుల్లో. ఈనాడు అట్లాంటి చట్టం అమలు జరిపితే, వొద్దు అనేవారు ఉండరు — అనుకుంటారా? ఇంతవరకూ, ఆ చట్టం ప్రవేశ పెట్టనేలేదు అట్లా ప్రవేశపెట్టదల్చిన వ్యక్తిని, సంప్రదాయాన్ని విడనాడాడని ప్రజలు, పార్లమెంటు అభ్యర్థిగా ఎన్నుకోరు.

దయ, ప్రేమ — వీటిని పెంపొందించే పనులే మంచి పనులు - అదే నీతి అనొచ్చు ప్రాచీన నైతిక సూత్రాలలో ఈ దయ, ప్రేమ అంతగా కనబడవు గొడ్రాలిని వదిలెయ్యాలా? ఆమె గతి ఏంకాను? చికిత్స ఎందుకు జరిపించకూడదు? సంతానం కలగకపోవడానికి భర్తలో లోపం ఉందేమో· అతను ఎందుకు చికిత్స చేయించుకోడు? ఆమెకి సంతానం, కావల్సి వొస్తే, భర్తలో లోపంవుంటె, ఆమె అతన్ని విడిచేసి మరొకర్ని చేసుకోకూడదా? వీల్లేదు. మనువు అల్లా శాసించాడు. పెద్దలు చెప్పారు గనక 'పాతివ్రత్యం'లో ఏదో మహత్తువుంది. సంతానం లేకపోతే పురుషుడు తరించడు. స్త్రీ తరించనక్కర్లేదు. ఆమెని విడిచేసి మరొకర్ని చేసుకో. స్త్రీని హింసించడంకాక ఇదేమిటి?

"సంతాన నిరోధం ఎందుకు పాపం? దేవుడు 'ఓనాన్'ని చంపాడు కావున. ఇరువురు పురుషుల అసహజమైన సంబంధం ఎందుకు పాపం? [3]సోడమ్,

---

3 వీరిరువురూ అసహజ కామ సంబంధం పెట్టుకున్నందున దైవం ఆగ్రహించి సోడమ్ నగరాన్ని దగ్ధం చేసినట్లు 'జెనిసిస్'లో గాథ.

గొమొరాలను దేవుడు చంపాడు కావున. వ్యభిచారం ఎందుకు పాపం? ఏడవ నైతిక నిబంధనలో పేర్కొనబడింది కావున. కేవలం ఇవి మటుకే కారణాలు, మరో కారణాలు లేవు అనడంలేదు నేను. కారణం ఏదైనా మన సమాజానికి వర్తించనప్పుడూ, మేలు కూర్చనప్పుడూ, వాటిని పరిత్యజించాలి" అని రసెల్. మనువు చెప్పిన ప్రకారం గయ్యాళిభార్యని వెంటనే విడిచేస్తే నిలబడే సంసారాలు ఎన్ని ఉంటాయి? ఆమె ఎందుకు గయ్యాళైంది? సమాజంలో తిరకాసేమిటి? బాల్యంలో ఆమె పొందిన అనుభవాలేవి? శిక్షణ ఎట్లాంటిది? ఈ ప్రశ్నలకి సమాధానాలు తెలుసుకుని గయ్యాళితనాన్ని తీసివేసి, ఆ దంపతులు సుఖంగా ఉండడం మంచిదికాదా? మొగసంతతి కలగకపోతే భార్యని విడిచెయ్యాలా? కలిగిన సంతతి చనిపోతే భార్యని విడిచెయ్యాలా? ఇవన్నీ దైవ నిర్ణయం అనుకున్నాక, ఈ అపచారాలకి భార్య ఎల్లా బాధ్యురాలు? ఆమె ఎందుకు కష్టపడాలి? భర్త విడిచేస్తే యవ్వనంలోవున్న భార్య గతి ఏంగాను? సహజమైన వాంఛలని అణిచివేసి ఏకాంతంగా గడపడంవల్ల వొచ్చే అనర్థాలేవో మనకి ఈనాడు తెలుసు అందరూ సుఖంగా వర్ధిల్లాలి – అదీ మనం కోరేది. దీనికి విరుద్ధంగా వున్న నీతిని – ఎవరో చెప్పారు గావున – మనం అనుసరించాలి – అందులో ఏదో మహత్తువుంది - అనడం పొరబాటని రసెల్ వాదం. సంప్రదాయమైన నీతిలో ఎవరో ఒకర్ని హింసించడమో – బాధపెట్టడమో ఉండితీరుతుంది. కొన్ని పనులు చేసినవారు పాపాత్ములనీ, వారికి కష్టాలు సంభవిస్తే 'మా బాగా జరిగింది' అనుకోడం జరుగుతుంది ఈ నీతిలో. "నేరస్థులులేరనీ, వారిని దండించనక్కర్లేదనీ అనడంలేదు నేను వారిని దండించినప్పుడు మనం సంతోషించనక్కర్లేదంటాను. ప్లేగ్ వ్యాధికి గురైన వ్యక్తిని దూరంగావుంచి, కొన్ని నిషేధాలు ఏర్పరిచి, సమాజంనుండి వేరుచేస్తాం కాని ఆ వ్యక్తిని పాపిగా మనం పరిగణించం వాడికి 'మా బాగా జరిగింది' అనుకుని సంబరపడం. సంప్రదాయమైన నీతిపరుడు 'పాపిని' ఇట్లా చూడడు 'పాపం' అన్న భావంపట్ల నమ్మకంవున్నవారందరూ పాపుల కష్టాలకి సంతోషించడం జరుగుతూంది. ఒక కులం, తెగ, జాతి దేశం - వీటిపట్ల ఈ ద్వేషభావం ఉన్నప్పుడు ఎంతో ప్రమాదం జరుగుతుంది. సాముదాయక వైషమ్యాలే ప్రపంచానికి అనర్థం" అంటాడు రసెల్. మరికొన్ని భావాలు చూద్దాం.

"అణుబాంబ్ ప్రయోగంవల్ల లోకంలో ప్రజ నాశనమై, అన్న చెల్లెలూ మాత్రం మిగిలారనుకుందాం వారు కలిస్తే మానవజాతి పూర్తిగా నశింపదు. అన్న చెల్లెలూ కలవకూడదు. ఏం చెయ్యాలి? వారు కలవడంతప్పు అయినా వారు కలిసి మానవజాతిని రక్షించడమే మంచిదికదా?"

"ఒక తెగకు చెందిన వారిలో వొకరిపట్ల వొకరికి స్నేహం, సహనం, అన్యోన్యం ఉంటుంది కాని తమ తెగకు చెందనివారిపట్ల ఇవి ఉండవు. రాబిన్ పక్షులలో, పెద్దపక్షిని మిగతావి పొడిచి చంపుతాయి ఇంగ్లీషువారిలో పురుషులు వృద్ధుడికి పింఛినీ యిచ్చి సంరక్షిస్తారు. తెగని విడిచేస్తే ఇతరులపట్ల ద్వేషమే చూపుతారు, సంప్రదాయ నీతిపరులు." ఇట్లాంటి పాతకాలపు నీతిపరులు మానసికంగా పొందే ఆనందం గురించి ఇల్లా వ్రాస్తాడు

"సుఖాలంటె శరీర సుఖాలే నన్నమాట, వారి ఉద్దేశంలో. నీతిపరులు ఇతరులపై ఆధిక్యతనుచూపి అధికారం చెలాయించడంలో పొందే సుఖాన్ని వారు సుఖంగా భావించరు. ఆ రకం సుఖాన్ని పరిత్యజించాలి – అని బోధించారు వీరు. ఈ మనస్తత్వంవల్ల, దైవంపట్ల, నమ్రతా కనపరచొచ్చు, మనుషులపై, అధికారమూ చలాయించవొచ్చు. మధ్యయుగం తర్వాత ఈ మనస్తత్వం క్షీణిస్తూ వొచ్చినా, పూర్తిగా పోక, మతగురువుల్లోనూ, మేజస్ట్రేట్లలోనూ, ఉపాధ్యాయులలోనూ, ఇప్పటికీ కనబడుతూనే ఉంటుంది." సామ్రాజ్యతత్వం వెనక ఉన్న నైతిక చింతనగూర్చి, రసెల్ చెప్పినది.

"ఉన్నివస్త్రాలు, ఇండియా, ఆఫ్రికా దేశాలలో విరివిగా అమ్ముడు పోతాయి. ఇది బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు ప్రోత్సాహకరమైంది. ఆఫ్రికా వెళ్ళి అక్కడ నివసించే అడవిజాతులవారికి, నగ్నంగా ఉండటం మంచిదికాదనీ, వస్త్రాలు ధరించాలనీ బోధించె అవసరం ఏర్పడింది ఈ బోధ క్రైస్తవమత ప్రచారకులు, చౌకగా, ఖర్చులేకుండా చేసేశారు ఉన్నివస్త్రాలే కాకుండా, క్షయ, సుఖవ్యాదుల్ని కూడా మనం ఎగుమతి చేశాం – దీనికేమీ ఖర్చు లేదు."

నైతిక నియమాలు, దైవ శాసనాలు కావనడానికి, రసెల్ చెప్పిన ఉదాహరణ

"ఆదివారం పని చెయ్యకూడదని దైవశాసనం అంటారు ప్రొటెస్టెంట్లు. శనివారం పని చెయ్యకూడదని దైవశాసనం అంటారు యూదులు. ఈ జగడం, పందొమ్మిది శతాబ్దాలు కొనసాగింది హిట్లర్‌లాంటి నియంత, వీరందరినీ విష వాయు బిలాలలో వేసి చంపితేకాని ఈ తగాదా పరిష్కారంకాదు. వైజ్ఞానిక విషయాలలో, ఇది మంచపద్ధతని ఎవ్వరూ అనరు పంది మాంస భక్షణ కూడదని దేవుడు నిర్ణయించాడంటారు యూదులు, మహమ్మదీయులు; గోమాంసభక్షణ నిషేధించాడంటారు హిందువులు. ఈ జగడం మూలంగా, వేలాది ప్రజ హతమయ్యారు ఇటీవల. కాబట్టి, దేవుడు చప్పినంతమాత్రాన నైతిక నియమం ఆమోదింపబడుతుం దనుకోవడం కల్ల."

"కోపతాపాలు, ద్వేషాలు – లాంటి విధ్వంసక ఉద్రేకాలే, ప్రపంచ పునర్నిర్మాణానికి అంతరాయాలు – ఉద్రేకాలన్నీ చెడ్డవేనా? అని నా విమర్శకులు అడుగుతారు నన్ను. నా విమర్శకుడు పేర్కొన్న ఆ గ్రంథంలోనే, 'ప్రేమ, కరుణ' – ప్రపంచ పునర్నిర్మాణానికి చాలా అవసరమని వ్రాశాను. ప్రేమ, కరుణ, ఉద్రేకాలే. నేను కేవలం బుద్ధి చాలు అనలేదు ఒక్క హేతువాదాన్నే వొక్కాణించలేదు నేను. కాని, 'ప్రేమ కరుణ', విధ్వంసకమైన ఉద్రేకాలు కానందున, నా విమర్శకులకు అవి అంతగా రుచించలేదు. హేతువాదాన్ని అధిక్షేపించేవారికి విధ్వంసక ఉద్రేకాలు తప్ప, రుచించవు" అన్న నిర్వచనంలో వాస్తవత ఉందనిపిస్తుంది. పొరుగువాడు మంచివాడు, వాణ్ణి ప్రేమించు అంటూ ఎంత సేపు గంభీరంగా ఉపన్యాసకుడు, ఉద్బోధించినా ప్రేక్షకులు చలించరు కాని, పొరుగువాడు చెడ్డవాడు, వాణ్ణి ద్వేషించు, హింసించు–అనగానే, ప్రేక్షకులు ఉద్రిక్తులై, ఉపన్యాసకుణ్ణి నాయకుడుగా స్తుతిస్తారు ప్రేమించడంలో మజా లేదు. విధ్వంసక శక్తిలేదు. చప్పటి హేతువాదం, వివేకం – అందుకని సామాన్య ప్రజని అకర్షించదు – అన్న రసెల్ భావంలో యదార్థం ఉంది.

"పిచ్చివాళ్ళను మినహాయిస్తే, చావడం కంటె బ్రదికి ఉండటం మంచి దనీ, మాడటం కంటె తినడం మేలనీ, బానిసగా ఉండటం కంటె స్వేచ్ఛగా ఉండటం మెరుగనీ, అందరూ అంగీకరిస్తారు మనకీ, మన స్నేహితులకీ ఇవన్నీ సమకూరాలి; మన శత్రువులు ఇవి లేక బాధపడితే మనం దిగులుపడనక్కర లేదు – అన్న వాదాన్ని విజ్ఞానశాస్త్రం ఫలితాలద్వారా ఖండించవచ్చు మానవజాతి ఈనాడు వొక కుటుంబంగా ఏర్పడింది. అందరూ సుఖంగా ఉంటేతప్ప, మనం వొకళ్ళమూ సుఖంగా ఉండలేము నువ్వు సుఖపడాలంటే, ఇతరులందరూ సుఖంగా ఉండితీరాలి, అన్న భావంతో నువ్వు పొత్తు కుదుర్చుకు తీరాలి"–

బలవంతులు, తమ శక్తి సామర్థ్యాల ద్వారా అధికారం తెచ్చుకుంటారు ఆదిలో వీరు ప్రతిపాదించిన సూత్రాలే, న్యాయశాస్త్రంగా రూపొందాయి. ఈనాడు ఇవి మనకి న్యాయమైనవిగా తోచకపోవచ్చు జర్మనీ దేశంలో, కొన్ని తెగలలో, హత్య చేసిన వ్యక్తికి జుల్మానా విధిస్తారు ఈ జుల్మానా, హత్య కాబడ్డ వ్యక్తి యొక్క, హోదానిబట్టి నిర్ణయమవుతుంది పలుకుబడి, హోదా గల వర్గాలు, ప్రతి చోట, కొన్ని హక్కులు, ప్రత్యేకాధికారాలూ తెచ్చుకుంటారు. అవి పాలింపబడ్డ వారికి లభ్యం కావు. [4]మీజీ శతాబ్దికి పూర్వం, ప్రతిష్ఠగల ప్రభువు

4. మీజీ టెన్నో 1852 – 1912 జపానుదేశపు చక్రవర్తి మంచి సైనికుడు, కవి. ఈయన్ని పదవి నుండి తొలిగించడంతో షోగన్ల ప్రాబల్యం తగ్గింది.

సమక్షాన నవ్వని జపానీయుణ్ణి, ఆ క్షణాన చంపివేసే ప్రత్యేకాధికారం, ప్రభువుకి ఉండేది. అందుకే, జపానులో పర్యటించే, పాశ్చాత్యులు, జపానీయులను సదా నవ్వుతూ కనబడే జాతిగా భావిస్తారు "

నిరుపయోగమైన నైతిక జీవనాన్ని గురించి మరో భావం "ఏ ప్రయోజనమూ సాధించని నైతిక జీవితాన్ని గూర్చి, ఆధునికులు ఉత్సాహపడరు. అంటువ్యాధులు చెలరేగిన ప్రాంతానికి వెళ్ళి, తనకు జరిగే ప్రమాదాన్ని గమనించక, చికిత్సలు చేసే వైద్యుణ్ణి మనం మెచ్చుకుంటాం కారణం? అంటు వ్యాధి చెడుగు, ఆ చెడుగుని మనం నిర్మూలం చెయ్యాలి, గనక అంటువ్యాధి 'చెడుగు'గా పరిగణించక పోయినట్లైతే ఆ వైద్యుడు ఇంటి దగ్గరే వుండిపోతే, మనకి పేచీ లేదు. కాని కొందరు నీతిపరులకు (5స్టోయిక్‌లకు) ప్రయోజనం సాధించినా సాధించకపోయినా, ఆ వైద్యుడు అంటువ్యాధి ప్రాంతానికి వెళ్ళి కష్టపడటం, 'నీతి'. — నీతికి నీతే ప్రయోజనం, వారి దృష్టిలో దానివల్ల మంచి సమకూరనక్కర్లేదు, ఇది నిరర్థకమైన దృక్పథం అంటాడు రసెల్

"అసలు మానవుడు సుఖపడటం — రెండువేల సంవత్సరాలుగా ప్రచారం చేస్తున్న నీతిపరులకు గిట్టదు కష్టంలో, బాధలో, ఏదో మహత్తు ఉందంటారు వీరు. 'సుఖపడండి' అని బోధించిన తత్వజ్ఞుడు 'ఎపిక్యూరస్'ని6 కొన్ని శతాబ్దాల వరకూ వెక్కిరిస్తూ వొచ్చారు ఛాందసులు. "అది, బురదగుంటలో పంది పొందే సుఖంగా, ఖండించి, ఎపిక్యురస్ గురించి ఎన్నో అసత్యాలు ప్రచారం చేశారు. 7కాపెర్నికస్ ప్రచారం చేసిన ఖగోళశాస్త్ర సిద్ధాంతంలాంటి దాన్నే ప్రచారం చేసిన 8అరిస్టార్కస్‌ను హింసించారు. క్రైస్తవులను హింసించాడు, ప్రాచీన రోమ్ చక్రవర్తి 9మార్కస్ అరిలియస్; రోమ్ నగరం, తగలడుతూంటె,

---

5 క్రీ పూ. 315 లో జీనో అనే గ్రీకు తత్వజ్ఞుడు నెలకొల్పిన సిద్ధాంతం_ ఎంత బాధనైనా భరించగలగాలి - అన్నది.

6. క్రీ పూ 300 లో వర్ధిల్లిన గ్రీకు తత్వజ్ఞుడు 'సుఖంకి మించిన మంచి మరొకటి లేదన్నాడు.'

7. పోలిష్ ఖగోళ శాస్త్రజ్ఞుడు (1473 - 1543) భూగోళం, సూర్యుడి చుట్టూ తిరుగుతుందని చెప్పాడు. అంతకుముందు, సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతాడని నమ్మేవారు.

8 క్రీ పూ. 280 లో, గ్రీకు ఖగోళ శాస్త్రజ్ఞుడు. భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతుందన్నాడు

9 రోమ్ సామ్రాజ్యపు చక్రవర్తి కష్టాలు భరించాలని, గ్రీకు భాషలో 12 పుస్తకాలు వ్రాశాడు. (క్రీ. పూ. 121 - 180 )

ఫిడేలు వాయించి వినోదించిన క్రూరుడు 'నీరో' రోమ్ చక్రవర్తి చర్యని మెచ్చుకున్నాడు, 'సెనెక' అనే రోమ్ దేశపు నాటక కర్త. మరో రెండువేల సంవత్సరాలతర్వాత చరిత్ర చూస్తే ఏం కనిపిస్తుంది? జర్మన్ విద్యాబోధకులు ప్రచారం చేసిన సిద్ధాంతాలు, జర్మనీ పతనానికి దారితీసినట్లు తెలుస్తుంది.

## పెండ్లి, ప్రేమ :

ఇప్పుడు, పెండ్లి, ప్రేమ, గూర్చిన రసెల్ నైతిక సిద్ధాంతాలేవో చూద్దాం. ఈ రంగంలోనే, ఆయన భావాలు కల్లోలం కలిగించాయి; వాదోపవాదాలకు దారితీశాయి 'పెండ్లి, నీతి' అనే గ్రంథం మొదట్లో ఈయనకు అప్రతిష్ట తెచ్చిపెట్టింది ఈ గ్రంథంలో ఉన్న భావాలను ప్రచారం జేసిన వ్యక్తికి, విద్యా బోధకుడుగా వుండే అర్హత లేదని, న్యూయార్క్ కళాశాలవారు, 1940 లో ఈయన్ని ఉపాధ్యాయ పదవి నుండి తొలిగించిన విషయం ఇది వరలో చెప్పుకున్నాం పెండ్లిని గూర్చిన రసెల్ భావాలు, 'పెండ్లి నీతి' అనే గ్రంథంలోనే గాక, ఐదారు ఇతర గ్రంథాలలో కూడా పొందుపరచబడి ఉన్నాయి. కొన్నిటిని ఉదహరిస్తాను

"భగవంతుణ్ణి ప్రేమించాలి అన్నది దైవ శాసనం; పొరుగువాణ్ణి ప్రేమించు అన్నది కూడా అట్లాంటిదే. పిల్లల్ని పోషించే సమయంలో తల్లి దగ్గర తండ్రి కూడా వుండాలి కావున వ్యభిచారం నిషేధించబడింది; ప్రకృతికి విరుద్ధం గనక, సంతాన నిరోధం కూడదు ప్రకృతి విరుద్ధమైనా, బ్రహ్మచర్యాన్ని, ఏ కారణం వల్లనో, నిషేధించలేదు ఈ పెద్దలు పిల్లల పోషణ, శిక్షణ, విద్యా బోధకు, తల్లి కంటె, వివేకి గనక, తండ్రి కూడా ఉండాలి—కాన పెండ్లి చేసుకున్నాక దంపతులు విడిపోకూడదు. పాతివ్రత్యం, ఏకపత్నీవ్రతం భంగం కాకూడదు కుటుంబ క్రమాన్ని చెడగొడుతుంది గనక, తండ్రి కూతురు తల్లి కొడుకు అక్రమ సంబంధాలు పెట్టుకోకూడదు అన్నా చెల్లెలు కామక్రీడ జరపకూడదు. ఎందుకో తెలుసా? భార్యాభర్తల నడుమ వుండే భౌతిక ఆకర్షణకీ, అన్నా చెల్లెలు నడుమ వుండే ఆకర్షణ జోడైతే, ఆకర్షణ ఎక్కువై, కామక్రీడ మరింత విరివిగా కొనసాగుతుంది గనక!'

ఈ నైతిక వ్యవస్థ ఈనాడు ఎల్లా పరిణమించిందో చూద్దాం.

"పెద్దలు నిర్దేశించిన ఈ నైతిక వ్యవస్థ ఈనాడు సక్రమంగా కొనసాగాలంటే, రెండు మూడు జరగాలి. ఆడపిల్లలకి చదువు సంస్కారం ఉండకూడదు. ఉన్నా, వారిని తెలివిహీనులుగా, అమాయకులుగా చేసేదిగా ఉండాలి. మత

గురువుల ప్రాబల్యం కింద వున్న పారశాలల్లో ఇది కొంతవరకూ జరుగుతూనే ఉంది కామక్రీడని గూర్చిన పరిజ్ఞానాన్ని ప్రచారం చేసే పుస్తకాలని నిషే ధించాలి. పోలీసుల చాకచక్యంవల్ల, ఇంగ్లండు, అమెరికా దేశాలలో ఈ నిషేధం బాగానే అమలు జరుగుతూంది. ఇవి ఉండనే ఉన్నాయి. కాబట్టి కొత్తగా ఏం జరగాలి? యువకులు, యువతులు, కలిసి వొంటిగా ఉండే అవకాశాలు కల్పించ కూడదు. యువతులు, బైట ఉద్యోగాలు చెయ్యకూడదు. వొంటిగా, బైటికి వెళ్ళకూడదు. యాభై లోపు వయస్సుగల స్త్రీకి మోటారు కారు ఉండకూడదు. ప్రతినెలా, అవివాహితులని పోలీసు డాక్టర్లచే, పరీక్ష చేయించాలి. కన్యాత్వం చెడినవారిని జైల్లోఉంచాలి సంతాన నిరోధక పరికరాలను ఎవ్వరూ ఉపయోగించ కూడదు. ఇవన్నీ వొక వంద సంవత్సరాలు కొనసాగితే, అవినీతిని అరికట్ట వచ్చు. ఇవి అమలు జరపడంలో, లోపాలు రాకుండా ఉండాలంటె, పోలీసుల్ని డాక్టర్లని కామక్రీడ జరిపే వీలులేని నపుంసకులుగా చెయ్యాలి. ఇంకా బాగా, చక్కగా అమలు జరగాలంటె, మతబోధకుల్ని మినహాయించి, పురుషులందరినీ, నపుంసకులుగా చెయ్యాలి. [10]'ఎల్మర్‌గాంట్రి' అన్న నవల చదివాక, వీరిని మినహాయించడం కూడా అవసరమేమోననిపించింది." పురుషుడికి కొన్ని నిబంధ నలు, స్త్రీకి కొన్ని నిబంధనలు, పూర్వీకులు ఏర్పరిచారు

"సూత్రప్రాయమైన ఆమోదం లేకపోయినా పురుషుడు అప్పుడప్పుడు వ్యభిచరించ వొచ్చునన్నది అనాదిగా వొస్తున్న ఆచారం. పెండ్లికిపూర్వం, పురుషుడికి స్త్రీతో సంబంధం ఏర్పడకూడదన్న నిబంధన లేదు. భార్యకీ, ఇరుగు పొరుగు వారికీ తెలియనంతవరకూ, మొగాడు మరో స్త్రీతో సంబంధం పెట్టు కుంటె, ఎవ్వరూ అంత పట్టించుకోనక్కర్లేదు. పడుపువృత్తి కొనసాగడంవల్లనే, ఈ వ్యవస్థ సాధ్యమైంది. వేశ్యావృత్తిని, ఆధునికులు సమర్థించలేరు. పాతివ్రత్యం పాటించక, పాటిస్తున్నట్లు పైకి కనబడితే చాలుననుకున్న స్త్రీల సౌకర్యం కోసం, కొందరి మొగాళ్ళని కూడా పడుపువృత్తిలో దింపి, స్త్రీలకి కూడా, పురుషులతో బాటు ఇతరత్రా కామక్రీడ జరిపే హక్కు కలగచెయ్యడం మంచిదని మనం ఈవాదు వొప్పుగోము. దీని పర్యవసానం ఏమిటంటె, పాతకాలపు నీతిపరులు ద్వంద్వమైన నైతికవిలువల్ని ప్రతిపాదించవలిస్వచ్చింది. అంటే, పురుషుడు ఎల్లా ఉన్నా ఫరవాలేదు, స్త్రీ మాత్రం పతివ్రతగా ఉండాలని ప్రతిపాదించవల్సి వచ్చింది. మొగాళ్ళు కూడా, ఏకపత్నీవ్రతు లవాలని పెద్దలు చెప్పలేదా? అని

---

10 1927 లో అమెరికా దేశపు నవలాకారుడు సిన్‌క్లేర్ లూయి ప్రచు రించిన నవల—మతం పేరిట వ్యక్తులు చేసే మోసాన్ని చూపుతుంది.

అరగొచ్చు. దీనికి సమాధానం ఏమిటంటె, పురుషుడు, తమ కామకాలాపాన్ని రహస్యంగా జరపే అవకాశం ఉంది – స్త్రీకి లేదు – అన్నది. ఈ విధంగా, నీతి విషయంలో, స్త్రీలకీ, పురుషులకీ తేడాలు ఏర్పరిచే అవస్థ వస్తోంది, నీతి పరులకు. ఇంతేకాదు పురుషుడు, తన తెగకి చెందిన స్త్రీతోకాక వేశ్యతో సంపర్కం పెట్టుకునే స్థితిని కూడా వీరు భరించవల్సి వస్తోంది. వారు శాసించిన దాన్ని ఉల్లంఘించినట్లైతే ఏం జరుగుతుందో, నీతిపరులకు అక్కర్లేదు. పడుపు వృత్తి కూడదని చెప్పడంతో తమ పని తీరిపోయిందనుకుంటారు. తాము చెప్పిన దాని పర్యవసానం, పడుపువృత్తి కొనసాగడమే అయినా దీన్నిబట్టి ఈనాటి నీతి పరుడు ఎంత మందబుద్ధో తెలుసుకోవచ్చు."

సంతానం కావాలనుకుంటేతప్ప, భార్యాభర్తలు శరీరసుఖాన్ని ఆశించ కూడదన్న సూత్రాన్ని గురించి రసెల్ చెప్పింది పొందుపరుస్తా.

"పిల్లలు కావాలని లేకపొతే, స్త్రీ పురుషులు కామక్రీడ జరపకూడదని కాథలిక్కుల శాసనం. పిల్లలు కావాలనుకుంటె మట్టుకు, ఎంత దారుణ కృత్యమైనా వారు చెయ్యవచ్చు. భార్యకి కామక్రీడ ఇష్టంలేకపోయినా, ఆమె మరో గర్భందాల్చి చనిపొయ్యే పరిస్థితి ఏర్పడినా, కలగబొయ్యే సంతతి మతిహీను డయ్యే అవకాశమున్నా, పిల్లల్ని పోషించే ఆర్థికస్తోమత లేకపోయినా, ఏది జరిగినాసరే - శరీరసౌఖ్యం తనకి ఇచ్చి తీరాలని భార్యని, శాసించగలడు భర్త."

కామశాస్త్రంలో విషయాలు పైకి చెప్పకూడదు. ఇది చెప్పడంవల్ల, యువతీయువకులు పాడైపోతారు వేరే వ్యాపకం కలిగించి, వారిని, ఈ విషయం గురించి ఆలోచించనీకుండా చెయ్యాలంటారు పెద్దలు. "కామక్రీడ గురించి వారు మాట్లాడుకోకూడదు. పెద్దలు అట్లాంటిది ఉన్నట్లు, వ్యవహరించ కూడదు. ఇల్లా అంధకారంలో కన్యని ఉంచితే కార్యం నాటిరాత్రి, పడక గదిలో కెళ్ళిన యువతి యదార్థానికి గాయపడి, కామక్రీడ పట్ల రోత ఏర్పడి సనాతన నీతిపరులు కోరినట్లుగా, శృంగార జగత్తునుండి వెలవుతుంది."

ఏకపత్నీత్వాన్ని పాటించే కుటుంబాలలో, ఎన్నో వ్యత్యాసాలున్నాయి. పైవారి ప్రమేయం లేకుండా, భార్యాభర్తలు, వొకర్ని వొకరు ఎన్నుకోవచ్చు; తలిదండ్రులు నిర్ణయించవచ్చు కొన్నిదేశాలలో కన్యని కొంటారు. ఫ్రాన్స్ దేశంలో, వరుణ్ణి కొంటారు. విడాకుల విషయంలో ఎన్నో పద్ధతులున్నాయి కాథలిక్కులు దంపతులు విడిపోకూడదంటారు; చైనాలో భార్య నసిగే స్వభావం కలదైతే, విడిచెయ్యవచ్చు ఒక స్త్రీతో ఉండటం ఉండకపోవడం పక్షిజాతులలో ఉన్నట్లుగానే, మనుషుల్లోనూవుంది సంతానాన్ని పోషించే నిమిత్తం, దంపతులు

కలిసుండాలి పక్షులు గుడ్లని పొదగాలి; బైటకెళ్ళి ఆహారం తేవాలి. ఈ రెండు పనులూ వొకే పక్షికి సాధ్యంకాదు. కావున, మగ, ఆడ కలిసుండాలి. అందుకనే ఆదర్శదాంపత్యం, పక్షులలో చూడొచ్చు. మానవ సమాజంలో గంద్రగోళమైన పరిస్థితి ఏర్పడినప్పుడు, పిల్లల పోషణకి, మొగవాడి సహకారం కావాలి. కాని ఈనాడు కొన్ని సమాజాలలో, పిల్లలపోషణ, ప్రభుత్వమే జరుపుతోంది. కాబట్టి, కూలినాలి చేసుకుని జీవించే కుటుంబాలలో, తండ్రి అంత ముఖ్యుడు కాడు ఇది జరిగినట్లైతే, సంప్రదాయమైన నీతి దెబ్బతింటుంది. 'బిడ్డ తండ్రి ఫలానా' అని నిర్ణయించే అవసరం పోతుంది." చైనాలో వొక సామెత ఉంది. కిరసనాయిలు కూడికం చెయ్యాలని దీపం ఆర్పి పెందరాళే పడుకుంటె కవల పిల్లలుపుట్టే ప్రమాదం ఉంది - అని.

భర్త కఠినుడు అని ఋజువు చెయ్యగలిగితే భార్య విడాకులు పొందే అవకాశమున్నా, "ఏది కాఠిన్యం?" అన్నదాని నిర్వచనం విపరీతంగా పరిణమించొచ్చు, నంటాడు రసెల్.

"ఒక ప్రసిద్ధ సినిమాతార, కఠినుడనీ ఋజువుచేసి, భర్తనుండి విడాకులు పొందింది. 'కాంట్' అనే తత్వశాస్త్రజ్ఞుణ్ణి గూర్చి చర్చించే స్నేహితులను భర్త ఇంటికి తీసుకొస్తున్నాడనీ, అదే అతని కాఠిన్యానికి తార్కాణ అనీ, ఈమె వాదించింది భర్త, భార్యముందు, కాస్తంత తెలివిగా సంభాషించ కలగడమే చాలు, భార్య విడాకులు పొందాలంటె - అని కాలిఫోర్నియాలో న్యాయమూర్తుల ఉద్దేశం అనుకోవాలి."

పడుపువృత్తి ఎందుకు ఏర్పడింది? అన్న ప్రశ్నకి రసెల్ సమాధానం ఇది:

పెండ్లికాని పురుషులుంటారు; పై ప్రాంతాలకి ప్రయాణం చేసే భర్తలుంటారు అట్లాంటివారు కోర్కెని అణగద్రొక్కుకోలేరు గౌరవమైన కుటుంబాలలో ఉండే స్త్రీలు వారికి లభ్యంకారు కోర్కె ఉన్నదని పైకి చెప్పుకోలేరు; దాన్ని అణగద్రొక్కనూలేరు వారికోసం సమాజం కొందరు స్త్రీలని ఈ వృత్తిలో ఉంచింది. ఈ వృత్తిలో ఉన్న స్త్రీ కావలసినప్పుడు లభ్యం అవడమేగాక తనతో గడిపిన పురుషుడి చర్యను రహస్యంగా ఉంచగలదు. కాని భార్య, ఆడపిల్లల శీలం సురక్షితంగా ఉంచగల అవేశ్యని, పాపం, సంఘం హేయంగా చూస్తుంది. వ్యాపారరీత్యా తప్పు, ఆమెతో సంబంధం వొప్పదు సంఘం. ఆమెను వెలివేస్తుంది. క్రైస్తవమతం ప్రబలింతర్వాత ప్రారంభమైన ఈ ఆచారం ఈనాటికీ కొనసాగుతోంది.

శృంగారం,కామక్రీడ, దాంపత్యసుఖం మొదలైన విషయాలని రహస్యంగా ఉంచే సంప్రదాయం ఉంది వీటిని బహిరంగంగా చర్చించకూడదు, బోధించకూడదు. వెనకబడిన దేశాలలో, జనాభా పెరిగిపోతూంది. కుటుంబ నియంత్రణ ఆవశ్యకతనీ, పద్ధతులనీ, వీరికి నేర్పడం కష్టమైపోతూ ఉంది

ఈ పరిజ్ఞానాన్ని రహస్యంగావుంచే సంప్రదాయం వల్లనే, మనదేశంలో కుటుంబ నియంత్రణ, విషయమై ప్రభుత్వం ఎంతగానో ప్రచారంచేసి నచ్చచెప్పాల్సి వొస్తూంది. శృంగారాన్ని బూతుగా పరిగణించి, వైద్య విద్య నభ్యసించే విద్యార్థులు పాఠ్య గ్రంథాలలో తప్ప, నిషేధించి, రహస్యంగా ఉంచడం వల్లనే, అజ్ఞానం, ప్రబలిందంటాడు రసెల్ కామక్రీడకు సంబంధించిన సాంకేతిక పదాలని మాత్రం పాఠ్యగ్రంథాలలో వాడొచ్చు. ఇతరత్రా కూడదు.

"దీనివల్ల ఎంతో హాని జరిగింది. సుళువుగా అందరికీ అర్థమయ్యే భాషలో చెప్పకూడదన్న నిషేధంవల్ల 'సాంజెర్‌సతి' పనివాండ్ర భార్యల నుద్దేశించి కుటుంబ నియంత్రణ పద్ధతులను గూర్చి వ్రాసిన గ్రంథం, వారికి సుళువుగా అర్థమౌతోందన్న మిషపై నిషేధింపబడింది. 'మేరీస్టోప్స్' అనే ఆమె సాంకేతిక పదాలతో, బరువైన భాషలో ఈ విషయం గురించి వ్రాసిన గ్రంథం నిషేధింపబడలేదు. చదువుకున్న వారికి అర్థమయ్యే గ్రంథం ఇది దీనివల్ల ధనికులకు సంతాన నిరోధక పద్ధతులు నేర్చే అవకాశం ఏర్పడింది; చదువుకోని, పనివాండ్రకు నేర్చే అవకాశం లేకుండాపోతూంది. నిజానికి దీన్ని గురించిన భోగట్టా తెలుసుకోవల్సిన వారు, పనివాండ్రే" ఎవరికి అవసరమో, వారికి బోధించే అవకాశం లేకుండాపోతుందని రసెల్ వాపోతాడు.

పాతకాలపు అలవాట్లకూ, సంప్రదాయమైన నీతికి గురైన స్త్రీ పురుషులు పెండ్లిపట్లా, ప్రేమపట్లా వివేకంతో వ్యవహరించలేకపోతున్నారు. దాపరికం, అసత్యాలు - నీతిగా, తలితండ్రులు, ఉపాధ్యాయులు పేర్కొంటున్నారు. శృంగారము, కామక్రీడ పశుత్వానికి తార్కాణగా ప్రచారంచేసి, సంతానంకోసం భరించాల్సిన వొక అరిష్టంగా భావించడంవల్ల, వాటినుండి, భార్యాభర్తలు సహజమైన అనుభూతిని పొందక, ఇంద్రియాలను కృత్రిమంగా అణిచివెయ్యడంవల్ల, కఠినులై, ఈ కాఠిన్యమే నీతిగా చలామణి అవడం జరుగతూందంటాడు రసెల్. సహజమైన శరీరవాంఛని అణిచి వెయ్యడంవల్ల కలిగే అనర్థాలను ఫ్రాయిడ్ మొదలైన మనశ్శాస్త్రజ్ఞులూ, లారెన్స్, వెంకటచలం మొదలైన నవలాకారులూ విపులీకరించి చూపడంవల్ల, ఆధునికుల దృక్పథంలో కొంత మార్పు వచ్చినా; మనదేశంలో, ఈ దృక్పథానికి, రావల్సినంత ప్రచారం

రాలేదు. ఇందుకు నిరక్షరాశ్యత కొంత కారణమైనా, వీటిని గురించిన పరిజ్ఞానాన్ని నలుగురికీ బోధించాలన్న యత్నం లేకపోవడం, విద్యాధికులైన వారిలో ఈ దృక్పథం మృగ్యమవడం కూడా, కారణాలుగా పేర్కొనాలి.

"జీవితకాలంలో, ఏదోవొక సమయంలో, స్త్రీపురుషులు, శృంగారపూరితమైన గొప్ప ప్రేమ భావానికి గురవుతారు. ఈ భావాన్ని, కామవాంఛ నుండి విడదియ్యడం కష్టం. ప్రేమించిన పురుషుణ్ణి తప్పు మొద్దిద కూడదన్న సంప్రదాయం అనుసరించి శిక్షణ పొందిన కన్యలు, ఈ రెంటికీ ఉన్న వ్యత్యాసాన్ని గ్రహించలేకపోతున్నారు. తాత్కాలికమైన వాంఛకు లోనై శరీరసుఖాన్ని పొందిన కన్య అదే ప్రేమ అనుకుంటుంది. కాని అనుభవంగల స్త్రీ ఈ పొరబాటు చెయ్యదు. వివాహం భగ్నం అవడానికి ఇదొక కారణం. భార్యాభర్తలు, ఇరువురూ ప్రేమించి పెండ్లి చేసుకున్నా, అవతల వ్యక్తి 'పాపం' చేశాదన్న భావంవల్ల అన్యోన్యత ఏర్పడ్డంలేదు" అని రసెల్ ఐర్లండు దేశపు నాయకుడు 'పార్నెల్' ఉదంతం ఉదహరించాడు పార్నెల్ వ్యభిచరించాడు. దీని ఫలితంగా ఐర్లండ్ దేశపు అభ్యుదయ ఉద్యమం, కొన్ని సంవత్సరాలు నిలిచిపోయిందంటాడు పరిపూర్ణమైన అజ్ఞానంతో దాంపత్య జీవితానికి ఉపక్రమించేటట్లు చెయ్యడమే, క్రైస్తవ బోధ సాధించిన విజయం — అంటాడు.

కె. పి. యస్. మీనన్ తమ ప్రపంచ పర్యటన అనుభవాలను గూర్చిన గ్రంథంలో వొక చమత్కారమైన గాథని వ్రాశాడు. 'ఇది మాస్కోలో ఉండగా విన్నాడుట. మతగురువు, పైలోకాని కెళ్ళి దేవుడితో ఫిర్యాదు చేశాడుట, భూలోకంలో మొగాళ్ళల్లో నూటికి తొంభైమంది తమ భార్యలతో తృప్తిపడక వ్యభిచరిస్తున్నారని. సరే, వాళ్ళందరికీ, ఇట్లాంటి తప్పుడు పని చెయ్యకండి అని మందలిస్తూ తలో ఉత్తరం వ్రాస్తానన్నాడుట దేవుడు. మీరు అట్లా ఉత్తరాలు వ్రాయడం మొదలెడితే పూర్తయ్యేసరికి ఆరువందల సంవత్సరాలు పడుతుంది అన్నాడుట మత గురువు. 'సరే అల్లాగైతే, చెడిపోక బాగున్న మిగత పదిమంది భర్తలకి తలో ఉత్తరం వ్రాస్తాను, మీరు చేస్తున్న మంచి పని మానెయ్యకండి, అని' అన్నాడుట భగవంతుడు!

వ్యవస్థ బట్టి ప్రవర్తన మారుతుంది. రెండో యుద్ధానంతరం, ఎందరో పురుషులు యుద్ధంలో చనిపోవడంవల్ల, స్త్రీల సంఖ్య హెచ్చుగానూ, మగవారి సంఖ్య తక్కువగానూ ఉన్నప్పుడు, వొక పురుషుడితో ఇద్దరు ముగ్గురు స్త్రీలు సంపర్కం పెట్టుకోక తప్పింది కాదు. ఆనాటి పెద్దలు చూసీ చూడనట్టు ఉండక తప్పిందికాదు మన సమాజంలో వొకప్పుడు ఆడపిల్ల పెండ్లవడం

కష్టంగా ఉండివుండాలి. అందుకనే, వొకటి రెండు అబద్ధాలాడి పెండ్లి జరిపించే మన్నారు

ప్రేమించి పెండ్లి చేసుకోవడమనేది మన సంప్రదాయంకాదు, పాశ్చాత్య విద్యా విధానంవల్ల, ఇటీవల కొందరు మధ్య తరగతి విద్యాధికులలో, ఏర్పడిన భావం ఇది. పాశ్చాత్య దేశాలలో కూడా, యాభై, అరవై ఏళ్ళ క్రితం ఈ భావం లేదు. మన సమాజంలో వలెనే అక్కడ కూడా, పెద్దలు ఏర్పరిచిన పెండ్లిల్లే జరిగేవి. "శృంగార భావంతో కూడిన ప్రేమలో గొప్ప ఆనందంవుంది. అది అనుభవించనివారు దురదృష్టవంతులే. ఇట్లాంటి ప్రేమ కొనసాగడానికి సంఘం అవకాశాలు కల్పించాలి. ఇది జీవితంలో ప్రధాన లక్ష్యం కాకపోయినా, వొక ముఖ్యమైన అంగంగా పరిగణిస్తాను. ప్రేమించి పెండ్లి చేసుకున్నంత మాత్రాన, ఆ పెండ్లి నెగ్గుతుందనలేము యౌవనదశలో, మొదటిసారి ప్రేమ అనుభవించినప్పుడు, అవతల వ్యక్తి, అపూర్వుడుగా కనిపిస్తాడు అతనికి అద్భుతమైన లక్షణాలు, సౌందర్యం, శీలం, తెలివి, ఆపాదించడం జరగొచ్చు. తీరా పెండ్లి చేసుకొని శరీర సుఖం పొందాక, తానూహించిన గుణాలు లోపించి నవని గ్రహించగానే, మనస్సు గాయపడుతుంది. ఆ గాయం మానక, పురుషుల పట్ల, మానవాళిపట్ల ద్వేషంగా పరిణమించొచ్చు పెండ్లికి శృంగారమయ ప్రేమ వొక కారణం కావచ్చు. కాని పెండ్లి నెగ్గడానికి అది అవసరం అనుకోకూడదు; పెండ్లి ద్వారా సాధించే విలువ అది కాదని గుర్తించాలి. భర్తకి దూరంగా వుంటూ, తన శరీరాన్ని పూర్తిగా లొంగదీసుకునే అవకాశం భర్తకి యివ్వక ఏదో మాయ, మహత్మ్యం వున్నదన్న భ్రమ కలగచేసేటట్లుగా, ప్రవర్తించిన కొందరు స్త్రీలు; ఈ శృంగారమయ ప్రేమని, పెండ్లయ్యాక కూడా నిలుపుకో గలరేమో; కాని అట్లాంటి అన్యోన్యం, పెండ్లి శాసించే ప్రయోజనాన్ని పూర్తిగా సాధించలేదు. ఒకర్ని వొకరు దగా చేసుకోడం, మోసగించుకోవడం, కల్పిత జగత్తులో విహరించడం — ఇవి పెండ్లి ద్వారా సంక్రమించే ప్రయోజనాలను సాధించలేవు సంతానం బైలుదేరాక భార్యా భర్తలు తమ ప్రేమ భావం, ముఖ్యం కాదని గ్రహించాలి." అంటాడు రసెల్.

ప్రేమించి పెండ్లి చేసుకోవాలి అన్నది ఆధునిక సూత్రం. పెండ్లి చేసుకున్నాక ప్రేమ జనించకూడదా? వెనకటికాలపు, బాల్య వివాహాలలో, దీనికి కొంత అవకాశం ఉండేదనుకొంటాను. యువకుడికి పదిహేను, పదహారు వయస్సున్నప్పుడు; పది పదకొండేళ్ళ బాలికను పెండ్లాడి వారు నాలుగైదు సంవత్సరాలు, కలిసి మెలిసి తిరిగి అన్యోన్యం, స్నేహం ప్రబలినప్పుడు, ప్రేమ

ఉదయించవచ్చు. ఒకర్ని వొకరు బాగా తెలుసుకునే అవకాశం వుంటుంది. దూరంగా వుండి పూజిస్తూ, శృంగారమయ ప్రేమ కల్పించిన ఊహలకి దాసు లవక, యదార్థంగా తెలుసుకున్నాక ఏర్పడిన స్నేహంలో, శాశ్వతమైన గాఢత వుండొచ్చు. శారీరక సుఖం పొందాక వచ్చే అనుభవం వున్నాకనే పెండ్లి చేసుకోవడం మంచిది అన్న రసెల్ భావం ఆచరణలో పెట్టడం, పారిశ్రామికంగా ముందుకు సాగిన పాశ్చాత్య సమాజాలలో సాధ్యమవుతుందేమో కాని; మన సమాజంలో సాధ్యం కాదు డబ్బున్న వ్యక్తి, ఏ స్త్రీని ప్రేమించినా, 'వుంచుకున్నాడనే' అంటారు మన సమాజంలో - ఆ స్త్రీ విద్యాధికురాలైనాసరే అట్లాంటి సంపర్కం ఏ స్త్రీయేనా, పెండ్లికి పూర్వం పెట్టుకుంటే, ఆమెకి పెండ్లి జరగడం కష్టం ఈనాడు, విద్యాధికురాలై శీలం గల కన్యకి పెండ్లి కావడమే కష్టంగా వుంది. అందువల్ల, చిన్నప్పుడే పెండ్లి చేసుకుని, వారికి స్నేహం ఏర్పడ్డాక, దాంపత్య జీవితానికి ప్రారంభించే పాతకాలపు ఆచారాన్ని పూర్తిగా త్రోసిపుచ్చనక్కర్లేదు పెండ్లయ్యాక, కార్యానికిముందు, భార్యా భర్తలు నిర్వర్తించవలసిన విధులను గురించి వాత్స్యాయనుడు (క్రీ శ. 400 - 500) తన కామసూత్రాలలో ముచ్చటించాడు. ఏ కారణం వల్లనో, ఈ గ్రంథానికి రావల్సినంత ప్రచారం రాలేదు.

"మొదటి మూడు రోజులు, భార్యా భర్తలు, నేల మీద పడుకోవాలి. కలవకూడదు. మత్తు పదార్థాలు ముట్టకూడదు. తరవాత, వారం రోజులపాటు సంగీతం వింటూ, అలంకరించుకుంటూ, కలిసి భోజనంచేస్తూ, చూడ వొచ్చిన బంధువులతో కబుర్లు చెబుతూ గడపాలి పదవనాటి రాత్రి, భార్య, భర్తతో ఏకాంతంగా గడపాలి. చల్లని కబుర్లు చెప్పాలి. ఆమె కుతూహలం రెచ్చకొట్టడానికి, మూడు రోజులు ఆమెతో మాట్లాడనే కూడదంటారు కొందరు - కాని నేను ఇది అంగీకరించను. మాట్లాడకపోతే, ఆమెలో నిస్పృహ బైలుదేరొచ్చు. మాట్లాడాలి కాని శరీరాన్ని తాకకూడదు. ఆమెలో కోర్కె వుదయించేవరకూ అతను తొందర పడకూడదు నిగ్రహం కావాలి నిగ్రహం చూపక తొందరపడితే, ఆమెకి పురుషజాతిపట్ల రోత పుట్టొచ్చు" వాత్స్యాయనుడు చెప్పిన ఈ సూత్రాలు, నేటి పాశ్చాత్య మనః శాస్త్రజ్ఞులు చెప్పిన వాటికి భిన్నంగా లేవు. తనలో నిజంగా కోర్కె రేగినప్పుడు, పుడిమిడితో చెప్పక, ఏడిపిద్దామన్న 'మాయ' తత్వం కృత్రిమంగా అలవరుచుకోకూడదు — అన్న రసెల్ భావాన్ని, వాత్స్యాయనుడు చెప్పినదానితో జతపరిస్తే, ఈ ప్రేమతో సత్యానికి పరిపూర్ణత సమకూరుతుంది.

పిల్లలు అడిగే ప్రశ్నలకు, పెద్దలు సూటిగా సమాధానం చెప్పక, ప్రేమ,

కామం గూర్చిన ప్రశ్న లడిగినప్పుడు వారిని కూకలేసి, దండించడంవల్ల పిల్లలలో కుతూహలం నశించిపోతోంది అంటాడు రసెల్. విమానం, మోటారు ఎల్లా తయారైంది? పిల్లలు ఎల్లా పుడతారు? అని పిల్లలు అడుగుతారు. రెండో ప్రశ్న నిషేధం. దీనితో, ఆ పిల్లవాడు ఏ ప్రశ్నా అడగడు. విజ్ఞానశాస్త్రంపట్ల అభిరుచి ఏర్పడక మూఢ నమ్మకాలకు గురై అజ్ఞానిగా తయారవుతాడంటాడు. ఇదే కృత్రిమ మనస్తత్వం. శరీరం మర్మం, రహస్య అవయవాలని గూర్చిన పరిజ్ఞానం, ఉద్రేక రహితంగా, పిల్లలకి చెప్పాలంటాడు. తప్పు, ఒప్పు, మంచి, చెడ్డ — అన్న గిరులు గీయకూడదంటాడు. శృంగారము ప్రేమ స్వేచ్ఛగా ప్రకటితమవక మరుగున పడటానికి ఒక కారణం, మతం, తద్వారా బైలుదేరిన తత్వ శాస్త్రం అంటాడు రసెల్ మతం తపసితనాన్ని బోధించింది. కామ క్రోధ మద మాత్సర్యాలు చెడ్డవన్నారు వీటి నడుమ ఇరుక్కున్న ప్రేమకి స్థానం లేకుండా పోతూంది. ప్రేమ నెరగని స్త్రీ గయ్యాళిగా అవతరించింది. అత్తగారై కోడల్ని బాధలు పెడుతుంది అత్తగార్లు, వెధవాడబడుచులూ పెట్టే బాధలు పడలేక ఆత్మహత్య చేసుకున్న స్త్రీల గాథలు ఎక్కువగా వెనకటి తరంలో వుండేవి. వాంఛలన్నీ తుచ్ఛమైనవనీ, వాటిని జయించాలన్నది తపసితనం చేసే బోధ. ఇది సహజమైన కోర్కెలు తీరడంవల్ల కలిగే ఆనందానికి అంతరాయంగా పరిణమించిందంటాడు రసెల్.

కష్టపడి పనిచేసి, డబ్బు గడించి సంఘంలో ప్రముఖస్థానం తెచ్చుకోవాలన్న పాశ్చాత్యుల ఆదర్శం ప్రేమని అణిచివేసే శక్తిగా పేర్కొంటాడు రసెల్. ప్రేమకోసం, హోదానీ, వృత్తినీ, ఉద్యోగాన్నీ త్యాగం చెయ్యకపోవడం, అమెరికాలో గమనించవచ్చు "ప్రేమకోసం, వృత్తిని త్యాగం చెయ్యడం పొరబాటే. కాని వృత్తికోసం ప్రేమని వొదులుకోడం కూడా పొరబాటె ఈ రెండూ అవసరమే వీటికి పొత్తు కుదరాలి. కెవలం కామేచ్ఛే ప్రేమ అనుకో కూడదు. మానవుడు ఏకాకి — ఈ ఏకాంతంనుండి పారిపోవడానికి ప్రేమ ప్రధాన సాధనం. సమాజం అన్నా, గుంపులన్నా మనుషులకి భయం, సంఘంలో కాఠిన్యం ఉంది దీన్ని తప్పించుకోడానికి, ఆపేక్ష, ప్రేమ, కోరతారు. ఈ తపన ప్రేమనెరగని పురుషుడిలో కాఠిన్యంగానూ, స్త్రీలో గయ్యాళితనంగానూ, పరిణమించవచ్చు శృంగార భావంతో కూడిన ప్రేమ, అహంచుట్టూ కట్టుకున్న గోడలను పగలగొట్టి, మరొక జీవితో కలిసి ఐక్యత పొందడంవల్ల, అతడు ఒక కొత్త జీవిగా రూపొందుతాడు. మనస్సు, శరీరం రెంటినీ పూర్తిగా వప్పగించి, వ్యక్తిత్వాన్ని, మరొక ప్రాణిలో కలిపివెయ్యడంలో, మానవుడు గొప్ప ఆనందాన్ని

పొందుతాడు. ఇది మానవ వికాసానికి ఎంతో అవసరం ఈ అనుభూతిని ఎరగనివారు, తమకి దొరకలేదన్న జిజ్ఞాసచే పీడితులై, కఠినులుగా తయారవుతారు." అంటాడు రసెల్ కామేచ్ఛను ప్రకటించి, స్వేచ్ఛగా శాసించి అనుభవించగల స్త్రీ శీలవతి కాదను అభిప్రాయం అనేక సమాజాలలో స్థిరపడింది. మన సమాజంలో బాగా ప్రబలి ఉంది సంభ్రమం కనబరిచి, ఉద్వేగమైన ప్రేమ వ్యక్తం చేసిన భార్య శీలవతి కాదనీ, ఆమె చెడిపోయి ఉండాలనీ, భర్త భావించడం. తన ఉద్వేగాన్ని అణగద్రొక్క కోడం జరిగి దాంపత్య జీవితం శృంగార కేళిలోని ఆహ్లాదాన్ని ఎరగక, చప్పగా. పేలవంగా, నిత్యకృత్యంగా తయారవడం, చాలామంది ఎరుగున్నదే.

వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలి – మరొకరికి ఇచ్చివెయ్యకూడదు – అన్న ఆధునిక తత్వం కూడా, కొంతవరకూ ప్రేమని మరుగు పరుస్తోందంటాడు రసెల్. ప్రేమ, పిల్లలు పని – ఈ మూడూ వ్యక్తిని సమాజంతో బంధిస్తాయి. ప్రేమ నెరుగున్న వ్యక్తి సమాజంలో సులువుగా ఇమడగలడు నిరుపయోగమైన, వ్యక్తిత్వాన్ని కాపాడుకో నక్కర్లేదు ఇతరులను ప్రేమించి, సృష్టిశక్తులను పూర్తిగా వినియోగించి, దీక్షతో కార్యానికి దిగిన నాడే 'వ్యక్తి' ముక్తిసాధన– సహజమైన ఇంద్రియ శక్తులను వినియోగించి, తద్వారా పరిపూర్ణత పొంది, సమాజానికి ఉపయుక్తమయ్యే పనులు చెయ్యడం, ముఖ్యం అంటాడు రసెల్.

పెళ్ళిళ్ళు ఎందుకు భగ్నమౌతున్నాయి? రసెల్ చెప్పిన కారణాలు మన సమాజానికి బాగా వర్తిస్తాయి.

"వెనకటి రోజుల్లో, భర్తకి అనుగుణంగా భార్య ప్రవర్తించడం జరిగేది భార్యని అనుసరించి భర్త తన ప్రవర్తన దిద్దుకునే అవసరం ఉండేదికాదు. ఈనాడు, స్త్రీకి పురుషుడితో సమానత ఏర్పడి, తన వ్యక్తిత్వం, తన వృత్తి వ్యాపకాలు కొనసాగించే పరిస్థితి ఏర్పడ్డాక, భర్తకి అనుగుణంగా వ్యవహరించడం తగ్గిపోయింది–కాని భర్త మాత్రం, వెనకటి వలెనె తన ఆధిక్యతను ప్రకటించుకోవడం మానలేదు. ఇతరత్రా ప్రేమకలాపం కొనసాగించడంలో, ఇది వ్యక్తమౌతుంది వెనక, భర్త మరొక స్త్రీతో సంబంధం రహస్యంగా పెట్టుకుంటె, భార్యకి తెలవదు. ఒకవేళ తెలిసినా, చివరలో పశ్చాత్తప్తుడై, క్షమించమనడంతో తీరిపొయ్యేది భార్య, ఇదంతా నమ్మి సరిపుచ్చుకుని, తను పతివ్రతగానే ఉండిపొయ్యేది. అట్లాలేక, మరొక పురుషుడితో ఆమె సంబంధం రహస్యంగా ఏర్పరుచుకుంటె, అది భర్తకి తెలిస్తే అప్పుడు వివాహం భగ్నం అయ్యేది. నేటి సమాజంలో ఇతర సంబంధాలు పెట్టుకున్నప్పుడు, అంతగా భార్యా

భర్తలు పట్టించుకోకపోయినా, దాని తాలూకు అసూయ, భావం మట్టుకు నిలిచి పోయింది ఈ అసూయ వారి అన్యోన్యాన్ని కలుషితం చేస్తోంది"

ఇది నిజమే. కాని చివరి వాక్యంలో చెప్పిన పరిస్థితి మన సమాజంలో ఏర్పడలేదు. ఇప్పటికీ మనవారు ఇతర సంబంధాన్ని నిరసిస్తారు

"వ్యభిచారం, ఆధునికులు కొత్తగా కనుక్కున్నది కాదు, అనాదిగా వొస్తున్నదే ఎటొచ్చీ ఆధునికులు దాన్ని మెచ్చుకుంటున్నారు" అన్న డాక్టర్ రాధాకృష్ణన్ గారి భావం, పాశ్చాత్య దేశాలలో ఆధునికులకు వర్తించవచ్చు. మనవారిలో కొందరు ఆధునికులు అట్లాగే మెచ్చుకోవచ్చు ఉపన్యాసాల్లో పుస్తకాలల్లో తప్పకుండా ఖండిస్తారు, మన సమాజంలో నిత్యజీవితంలో, భార్యాభర్తలు, పాతివ్రత్యాన్నీ, ఏకపత్నీ వ్రతాన్నీ శాసిస్తారు కట్టాలుచ్చుకోకూడదు. కాని కట్టాలుచ్చుకోని వాడు నూటికీ, కోటికీ వొకడు ఇదే, రెండు రకాల నీతి ఏర్పడింది - అన్న రసెల్ భావానికి దృష్టాంతం చెప్పేది జెయ్యరు; చేసేది చెప్పరు. 'తప్పు చేసి పట్టుబడకు' అన్న ఆధునిక సూత్రంలోని ధ్వని కూడా ఇదే

ప్రేమించడం — వొక విధిగా పరిగణించడం కూడా, పెండ్లి భగ్నం అవడానికి కారణం అంటాడు రసెల్. ప్రేమ, సహజంగా, స్వేచ్ఛగా కొనసాగాలి — వొక విధిగా 'తంతు'గా కాదు. ఇతరులను ప్రేమించడం, వారిచే ప్రేమించబడటం — ఈ స్నేహంలో కొంత ఆదర్శపూరితమైన ప్రయోజనం వుంది. ఇదొక 'విధి' అనగానే, పోలీసువాని మనస్తత్వం ఏర్పడుతుంది. అంటే, 'ఎవళ్ళనో, ఏదో చెయ్యొద్దు' అని నిషేధించే మనస్తత్వం. వివాహం తెచ్చిపెట్టే సమస్యలకు విడాకులు తప్ప వేరే మార్గం లేదన్నాడు రసెల్

"సంతానం లేనప్పుడు, విడాకులు వొక మార్గం కావచ్చు కాని సంతానం వున్నప్పుడు, విడాకులుచ్చుకుని; విడిపోవడం మంచిది కాదు. ఇరువురూ అన్యోన్యంగా ఉండాలి ఇది సాధ్యమవాలంటే, వారిలో ఎవరన్నా, వేరే సంబంధాలు పెట్టుకుంటే, పట్టించుకోకూడదు అట్లాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు, జుట్టు పీక్కుని గుండె బాదుకోక, తమ స్నేహం, పిల్లల కోసం కొనసాగాలనీ తాత్కాలికంగా, మరో ప్రేమ వాహినిలో కొట్టుకుపోయినా, వొడ్డుకు చేరుకుంటామనీ, ఆ విధంగా అన్యోన్యంగా వుండటంలో పిల్లల కోసం పీటిని పట్టించుకోకుండా ఉండటంలో గొప్ప ఆనందం పొందాలి అసూయ, ఈ ఆనందానికి అడ్డు తగల కూడదు అసూయ, అదుపులోకి తెచ్చుకోగల ఉద్రేకం, శీలం గలవారు ప్రకటించే కోపంగా, శాసనంగా కాక, దాన్ని వొక పెద్ద ఉద్రేకంగా జమ కట్టి,

అణిచి వెయ్యడం మంచిది." ఇట్లా చెయ్యగలిగితే మంచిదే. కాని అది ఇవ్వట్లో జరుగుతుందనుకోను. తర తరాలుగా వొస్తూ, ఎముకల్లో జీర్ణించిపోయిన ఈ అసూయ, అంత సుళువుగా నిష్క్రమించదు. నేటి కథల్లో, నవలల్లో, భర్త మరొక స్త్రీతో స్నేహం పెట్టుకుంటె, దాన్ని గురించి నలుగురూ చెప్పకోవడం, చివరికి భార్యకి తెలియడం అసూయతో భర్తని ఇదంతా ఏమిటని, తెలిసి అడగడం, భర్త, 'పాపం, కాదు ఆమెను చెల్లెలిగా ప్రేమిస్తున్నా'ననో లేక నే చిన్నప్పుడు ప్రేమించిన వొకామెని జ్ఞప్తికి తెచ్చింది-అ చిన్ననాటి ప్రేయసి చనిపోయింది — అని ఇట్లాంటి అబద్ధాలు చెప్పి తప్పించుకుపోవడం చిత్రిత మౌతుంది. 'అవును ఆమెను 'ప్రేమించాను' అనే ధైర్యం భర్తకి లేదు. అవ్యవస్థ చిత్రించే ధైర్యం రచయితకి లేదు; వొక వేళ చిత్రించినా దాన్ని హర్షించే పాఠకులూ లేరు అదొక బూతు కథగా సెక్సు నవలగా విమర్శకులు విలువ కడతారు యదార్థంగా వున్న వ్యవస్థకి కృత్రిమంగా రచయిత, కల్పించిన వ్యవస్థకీ పొత్తు కుదరడంలేదు ఈనాటి సాహిత్యంలో భర్త మరొకామెను ప్రేమించినప్పుడు, ఆమెకి ఇతని మీద ఇష్టం ఏర్పడ్డప్పుడూ ఏం జరుగుతుంది? ఏం జరగాలి? అల్లా జరిగితే పర్యవసానం ఏమిటి? వారికి సంతానం ఉంటే వారేంచేస్తారు? చెయ్యాలి? ఇవన్నీ నిత్యజీవితంలో యదార్థంగా ఎదుర్కొనే సమస్యలు. వీటిని చిత్రించగల ధైర్యం, నిజాయితీ రచయితలో లేకపోవడానికి కారణం సమాజంలో పాతుకుపోయిన ప్రాచీన నైతిక సంప్రదాయమే అనాలి.

"భార్యాభర్తలు పోలీసుల వలె వ్యవహరించకూడదు. న్యాయం, చట్టం ఎలా వున్నా తాము స్వేచ్ఛాజీవులమని భార్యా భర్తలు భావించి తదనుగుణంగా స్పర్థలను దిగమింగి ఉద్రేకాన్ని జయించి అన్యోన్యంగా ఉన్ననాడు పెండ్లి మహదానందాన్ని సమకూర్చే బంధం" అని రసెల్. ప్రేమలో సహజమైన కోర్కె మాత్రమే కాక అవతల వ్యక్తిపట్ల గౌరవం, ఆపేక్ష, ఆదరణ కూడా ఉండాలి. తన సౌఖ్యం కోసం, అవతల వ్యక్తిని వినియోగించుకోవాలన్న భావం దుర్నీతంటాడు రసెల్. సున్నిత హృదయుడు, వాంఛలకు లొంగి, ఈ విధంగా మరొకర్ని వాడుకుంటే, "అయ్యో, అపచారం చేశానే" అని బాధ పడతాడు. ఈ బాధ అతని నైతిక చింతనని భంగపరుస్తుంది. పడుపు వృత్తిలో ఇట్లాంటి చెడుగు ఉంది. నిజానికి ఈ బాధ పెండ్లిలో కూడా వుందంటాడు రసెల్. భర్త పోషణలో వున్న భార్య, భుక్తి కోసం భర్త వాంఛని భరిస్తుంది. పడుపువృత్తిలో వున్న స్త్రీ కూడా ఇంతగా భరించదేమో. ఈ విధంగా భార్యని తన సుఖంకోసం వినియోగించుకోవడం, దుర్నీతి కాదా? అని రసెల్ ప్రశ్న. అవతల వ్యక్తి

సౌకర్యం తెలుసుకోకుండా, తన సుఖం కోసం ఆమెను వాడుకొంటున్నాడు గనకనే, 'వేశ్యాలోలత' హేయంగా పరిగణింపబడుతూంది, ఆమె నుండి సుఖ వ్యాధి సంక్రమించకుండా చర్యలు తీసుకున్నా, ఆమెని గౌరవించినా, 'వేశ్యా వృత్తి'కి మనం సమ్మతించం.

ముందుగా సెక్స్ అనుభవం పొందిన తర్వాత కాని, పెండ్లి చేసుకో కూడదు — అన్న రసెల్ భావాన్ని సమర్థించడం కష్టం. ఈ భావాన్నే, ఆయన విమర్శకులు ఎక్కువగా ఖండించారు.

"సెక్స్ అనుభవం పొందినవారితో మొదటి సంబంధం ఏర్పరుచుకోవా లనడానికి బోలెడు ఆధారాలున్నాయి. కామ క్రీడ సహజంగా కొనసాగే చర్య కాదు. అదేమిటో తెలుసుకోకుండా, ఆ పనికి ఉపక్రమించడంలో ఏం న్యాయ ముంది? ఇల్లు కొనేవాడు ఇంటిని చూడకుండా కొనాలి అనడం లాంటిది ఇది. పెండ్లి యొక్క ఉద్దేశం సంతానం అట్లాంటప్పుడు, గర్భం దాల్చాకనే ఆ స్త్రీని వివాహం ఆడాలి. ఈనాడు కామ క్రీడ జరిగే అవకాశం లేని వివాహాన్ని రద్దు చేస్తున్నాం. పెండ్లి ఉద్దేశం, కామ క్రీడ కాదు, సంతానం అనుకున్నప్పుడు. కాబొయ్యే భార్య గర్భం దాలుస్తుందన్న ధీమా ఏర్పడ్డాకనే, పెండ్లి చేసుకోడం మంచిది కాదా! సంతాన నిరోధక పరికరాలు ప్రచారంలో కొచ్చాక, కామక్రీడలో సౌఖ్యానికీ; వివాహ బంధంలో సౌఖ్యానికీ, తేడా లేకుండా పోతోంది; వ్యభిచారం వేశ్యాలోలత్వం, ప్రేమ, అన్యోన్యం, తాత్కాలికానుభవం, పెండ్లి, సంతానం, కుటుంబం — వీటికున్న వ్యత్యాసాలు గమనించక, అన్నింటికీ వొకే నైతిక సూత్రం ముడెట్టడం, నేటి అనర్థం" అంటాడు రసెల్. స్త్రీ కోరేది మాతృత్వం కాని, కామం కాదు — అన్న విషయం గురించి రసెల్ చెప్పింది, నా కిష్టం. అది నిజమో కాదో నే చెప్పలేను కాని, 'నిజంస్మా' అనిపించేటట్లుంటుంది.

"మొగాళ్ళ నవలల్లో బిడ్డకి పాలివ్వడంలో స్త్రీ బౌలికానందం పొందు తుందని చదువుతాం, మీరెరుగున్న స్త్రీని అడిగి చూడండి ఇది నిజం కాదని తెలిసిపోతుంది. స్త్రీలకి వోటింగ్ హక్కు ఏర్పడ్డ తర్వాత, ఈ ప్రశ్న మొగాడు అడుగుతున్నాడు. తమ ఆధిక్యతని నిలబెట్టుకోడానికి మొగాళ్ళు కల్పించిన భావం ఇది. మాతృత్వం కాని, కామాన్ని స్త్రీ కోరదు, అన్న భావం మొగాళ్ళు ప్రచారం చేసిందే. ఈనాటికీ 'నాకు పిల్లలొద్దు, శరీర సౌఖ్యం కావాలి' అని ఏ స్త్రీ అన్నా అంటె, మొగాడు విస్తుపోతాడు. స్త్రీకి నీతిని కరువుతాడు. ఇట్లా అంటె పురుషుడు మెచ్చుకుంటాడని, భర్త అధీనంలో వున్న భార్య ఈ ప్రచా రానికి దోహదమిస్తూ వొచ్చింది. ఆర్థికంగా ఆమె స్వతంత్రురాలై, సమానత

కనపరుస్తూ, పూర్తిగా స్వేచ్ఛ తెచ్చుకున్నవాడు, నాకు మాతృత్వం, అక్కర్లేదు, అనడం ఎందుకు జరగదు? నాగరికత ప్రబలిన కొద్దీ, మాతృత్వంపట్ల విముఖత ఏర్పడవచ్చు మొగాడి వలెనె, ఆమె కూడా, కామానికే లొంగిపోవచ్చు. ముందు ముందు నాగరికత అమితంగా ప్రబలిన దేశాలలో, వేరే డబ్బు ముట్ట చెబితేతప్ప స్త్రీలు మాతృత్వానికి అంగీకరించరేమో. అప్పుడు, దాన్ని ఒక వృత్తిగా స్వీకరించి, బిడ్డకి ఇంత చొప్పున డబ్బు తీసుకుని, పిల్లల్ని కనడానికి కొందరు స్త్రీలు ఒప్పుకోవచ్చు అట్టి స్త్రీలు, ప్రభుత్వానికి ఋణపడి వుంటారు భర్తలకిది కాదు. ఎక్కువ పిల్లల్ని తేగల ప్రభుత్వాలపట్ల వైషమ్యాలు పెరిగి, యుద్ధాలు ఎక్కువవుతాయి కూడా"

విడాకు లివ్వుకోవడం, కొన్ని దేశాలలో అంత సుళువు కాదు. ఏ పరిస్థితిలో నైనాసరే, వివాహ బంధం తెగకూడదనే సంప్రదాయ నీతి శాసనం. అట్లాంటప్పుడు, నలుగురికీ తెలిసేలాగు, బాహాటంగా, వ్యభిచరించడం తప్ప దంటాడు రసెల్.

"ఇల్లా బాహాటంగా చెడిపోవడం, మిగతా పద్ధతులకంటె కొంత నయం, ఆర్థిక స్థితి బాగున్నవారికే ఇది సాధ్యమౌతుంది. కొందరికి సాధ్యం కాదు. డాక్టరు గాని, ప్లీడరు గాని, మరొకర్ని 'వుంచు' కున్నాడని తెలిస్తే, రోగులు, పార్టీలు వార వద్దకు వెళ్ళడం మానేస్తారు. విద్యాలయంలో పనిచేసే వ్యక్తి ఇట్లాంటి పని చేస్తే, అతని ఉద్యోగం వూడుతుంది. ధనికులై యుండి కూడా, సంఘంలో వారు ఏమనుకుంటారోనని భయపడి, దీనికి జంకుతారు. మొగాళ్ళకి క్లబ్బుల్లో సభ్యులుగా ఉండటం ఇష్టం. పొరుగు స్త్రీలు తనింటి కొచ్చి మర్యాద చెయ్యడం స్త్రీ కిష్టం. స్వేచ్ఛగా ప్రవర్తించేవారికి ఇవి జరగవు. కాబట్టి బాగా డబ్బున్నవారికీ, చిత్రకారులకీ, రచయితలకీ, కులాసా పురుషులకీ తప్ప సాధ్యం కాదు." ఈ జాబితాలో రసెల్ రచయితల్ని, చేర్చాడంటే, పాశ్చాత్య దేశాలలో రచయిత, తన రచన ద్వారా, డబ్బు గడించి, మరో ఉద్యోగం లేకుండానే, వర్ధిల్లగల పరిస్థితి వుందన్నమాట మన దేశంలో, రచన ద్వారా ధనం ఆర్జించే పరిస్థితి ఏర్పడలేదు కావున మన సమాజంలో చెడిపోగల వ్యక్తుల జాబితాలో నుండి, రచయితని, చిత్రకారుణ్ణీ తొలగించవచ్చునేమో 1966 లో ఒక మళయాళ కవికి లక్ష రూపాయలిచ్చి గౌరవించారు ఒక సంస్థ. కాని ఆ కవి డెబ్బైయ్యోపడిలో పడినందున, చెడిపోయ్యే అవకాశం అంతగా లేదు. సంతాన నిరోధక పరికరాలున్న ఈ రోజుల్లో వెనకటి తరంవారిచ్చిన ప్రాముఖ్యం, వ్యభిచారానికి ఇవ్వనక్కర్లేదంటాడు రసెల్ భార్యా భర్తా, చెరో చోటా

ముఖ్యమైన సంఘ సేవలో నిమగ్నులై ఉద్యోగాలు నిర్వహిస్తున్నప్పుడు వారిలో వొకరు, మరొకరి స్నేహాన్ని అభిలషించొచ్చు అట్టి పరిస్థితిలో విడాకులివ్వడం సుఖవుకాదు. ద్వేషం, అసూయ రేగుతుంది హత్య కూడా జరగొచ్చు. ఇట్టి సందర్భాలలో, రెండో వ్యక్తిపట్ల నేరారోపణ చెయ్యక, ఇద్దరి సమ్మతీ పొందాక, వారికి విడాకులివ్వడం మంచిదని ఈయన సలహా. సంతానం కలిగినప్పుడు, తమ వాంఛని త్యాగం చేసి, కలిసి మెలిసి ఉండడం మంచిదన్నాక, త్యాగం చెయ్య నక్కర్లేదు. ఇతరిత్రా వాంఛని తీర్చుకోవచ్చు అన్న సూత్రం అతకదు. "ఒకర్ని వొకరు ప్రేమించని భార్యా భర్తలు పిల్లల్ని కనడం కోసం ఏకమవరు. రసెల్ అనుకున్నట్లు" అని 'వాల్టర్ లిప్‌మన్' అనే ఆయన విమర్శించాడు

దీనికి రసెల్ సమాధానం :

"అవును ప్రేమ లేని దంపతులు పిల్లల్ని కనడంలో సహకరించరు. కాని కనడంతో తీరదు. పిల్లల్ని పోషించాలి, పెంచాలి. ప్రేమ సమసిపోయినంత మాత్రాన పిల్లల్ని పోషించడం మానుకోరు — సహజమైన ప్రేమ పిల్లల పట్ల ఉన్నప్పుడు. లిప్‌మన్‌కి, ఫ్రాన్స్‌లో పరిస్థితి తెలియదా? అక్కడ వ్యభిచరించే స్వేచ్ఛ బాగా వుంది. ఉన్నా కూడా, తల్లిదండ్రులు తమ విధులు నిర్వర్తిస్తారు. కుటుంబ సంప్రదాయం, సడలక స్థిరంగా వుంది. అమెరికాలో కుటుంబం ప్రభావం సన్నగిల్లింది — దాని ఫలితంగా విడాకులిచ్చుకోవడం జరుగు తూంటుంది" మరొక చోట "నేను మెచ్చే వివాహ సంబంధంలో భార్యా భర్తలు అవసరమొచ్చినప్పుడు వేరే సంబంధం ద్వారా వాంఛని తీర్చుకోవచ్చు. ఈ స్వేచ్ఛతోబాటు, అసూయని అణగదొక్కే నిగ్రహం కూడా వుండాలంటాను. ప్రేమ విలువైన ఉద్రేకం; అసూయ విధ్వంసక ఉద్రేకం. ప్రేమకోసం అసూయని అరికట్టే నిగ్రహం మంచిదంటుంది, సంప్రదాయమైన నీతి. నాకు దీనితో పేచీ లేదు. కాని అనవసరమైన దానిపట్ల ఈ నిగ్రహం చూపాలన్న సంప్రదాయంతోనే నా పేచీ."

శారీరక వాంఛని తుచ్ఛమైందిగా పరిగణించి దాన్ని అణిచివేసి, నిగ్రహం చూపాలని మన సంప్రదాయం శాసించడంవల్ల, వ్యక్తులు పూర్తి వికాసం పొందలేకపోతున్నారన్న భావం గమనించతగ్గది.

నిగ్రహం చూపడంతో గొప్ప విశేషమేమీ లేదు. దానివల్ల ఏదన్నా సాధిస్తే తప్ప దానికి విడిగా ప్రయోజనం లేదు నిగ్రహం, రైలుకి బ్రేక్ లాంటిది. తప్పుడు మార్గాన వెడుతున్నప్పుడు బ్రేక్ అవసరం. కాని సరైన మార్గాన వెడుతున్నప్పుడు బ్రేక్ అపకారం చేస్తుంది ఎప్పుడూ బ్రేక్ వేస్తూ

రైలు నడపాలని ఎవ్వరూ అనరు. ఇట్లాంటిదే నిగ్రహం కూడా. నిగ్రహం తెచ్చిన శక్తులు అంతరంగ శక్తుల నడుమ రేగే రాపిడిలో ఇరుక్కుని వృధా అవుతాయి భౌతిక వాంఛ, ప్రాచీన ఉద్రేకాలు, పిల్లలూ, ఆదిమవాసులూ చూపె స్వార్థం — వీటిని అణిచి వుంచడానికి నిగ్రహం అవసరమే అంతమటుకే."

మోహానికీ, కామానికీ, శృంగార తత్వానికీ, మానవుడు అన్వేషించే విలువలలో ఎట్లాంటి స్థానం వుందో 'పెండ్లి, నీతి' అనే గ్రంథంలో, చివరి అధ్యాయంలో రసెల్ చెప్పిన వాటిని కొన్నింటిని పొందుపరిచి, నీతిని గూర్చిన పరామర్శ ముగిస్తాను.

"తినడం, త్రాగడంకి మల్లేనే, కామం సహజమైన వాంఛ"

"అస్తమానూ వాంఛని గురించి ఆలోచించడం, చెడుగు. కాముకుడు, తపసి — అహంతో ఏకాకులైన వ్యక్తులే — ఇంకా కావాలని వొకరు, నాకేదీ వొద్దని మరి వొకరు" "కామేచ్ఛ లేకుంటే, శృంగారము, వివాహ సౌఖ్యం, కళ, ఉండవు. కళా సృష్టికి శృంగారము, ప్రేమ వెన్నెముక సంస్కృతి లేని మూర్ఖుడుగా తయారుచేసే నిర్బంధాలు పెట్టకూడదు. కళాకారుడికి — డబ్బిచ్చి గౌరవించకపోయినా ఫరవాలేదు" "సంప్రదాయమైన నీతికి లొంగిపోయిన సమాజాలు, గొప్ప కళని సృష్టించలేదు కళాకారుడికి కావల్సింది ప్రేమించే స్వేచ్ఛ అపరిచిత అయిన ఏ వేశ్య ద్వారానో వాంఛని తీర్చుకోడం కాదు అతనికి కావల్సింది. ప్రేమించే స్వేచ్ఛని, పాత కాలపు నీతివరులివ్వరు"

## విద్య :

విద్యా విభాగాన్ని గూర్చి రసెల్ భావాలు కొన్నింటిని తెలుసుకుందాం. విజ్ఞానశాస్త్ర పరిశోధనలో, పరిశీలన, కారణాలు వెదకడం; దొరికిన నిదర్శనాలు ఋజువయ్యాక, వాటి నాధారంగా సిద్ధాంతాన్ని నెలకొల్పడం, కొత్త నిదర్శనాలు-భిన్నమైనవి దొరికితే ఆ సిద్ధాంతాన్ని మార్చడం — ఇదీ పద్ధతి విద్యా విధానంలో, ఈ పద్ధతినే విద్యార్థులకు బోధించాలి గాని వెనకెప్పుడో, ఎవరో చెప్పిన సిద్ధాంతాలను, ఆధారం లేని నమ్మకాలను, మూఢ విశ్వాసాలను, జ్ఞాన సంపద పేరిట పిల్లల నెత్తిన రుద్దకూడదన్నది రసెల్ ప్రధాన భావం.

ప్రాచీనులు మన కిచ్చిన జ్ఞాన సంపత్తి, మతంతో, మంచి చెడ్డలతో, దైవ చింతనతో ముడిపడి వుంది ఆనాడు వారికి లభ్యమైన జ్ఞానమే, ఈనాటికీ విజ్ఞానంగా, తత్వం పేరిట, మతం పేరిట, గురువుల బోధన ద్వారా, నిలిచి పోయి, చలామణీ అవుతోంది. బుద్ధితో వితర్కిస్తే, నిదర్శనాలు వెదికితే, ఋజువు చెయ్య సంకల్పిస్తే, ఈ జ్ఞానం నిలబడదు. ఇదే పాఠశాలల్లో

నేర్పుతున్నారు. దీని ఫలితంగా ఎదిగాక విద్యార్థికి సంకుచిత మనస్తత్వం ఏర్పడి, అసహనం, కాఠిన్యం ప్రబలి – అహంకారాల సంఘర్షణ, యుద్ధానికి దారితీస్తుంది. పరిశీలించి, ఆధారాలు, నిదర్శనలు వెదికే అవసరం – పిల్లలకు నేర్పాలి. ఆ నిదర్శనల ఆధారంగానే, వారే సిద్ధాంతాల సత్యా సత్యాలను గ్రహించే మనస్తత్వం ఏర్పరచాలంటాడు దాపరికం లేకుండా, ప్రతిదీ చెప్పి వెయ్యాలంటాడు. తమకి తాము పరిశీలించి తెలుసుకునే కుతూహలం కలగ చెయ్యాలంటాడు. నాలుగైదొందల సంవత్సరాల క్రితం, పాశ్చాత్య దేశాలలో ఇది సంభవం కాలేదు అధికారులు బోధించినదే విద్య దాన్ని కాదన్నవారినీ ప్రశ్నించినవారినీ హింసించి, చంపేవారు ఇందు మూలంగా, విజ్ఞానశాస్త్రం పురోగమించక నిల్చిపోయింది.

పిల్లలు గురువుపట్ల వినయము, గౌరవమూ చూపాలంటాం మనం. ఈ వినయమూ, గౌరవమూ గురువు, పిల్లల పట్ల చూపాలంటాడు రసెల్.

విద్యార్థుల పట్ల ఈ భావం లేని పెద్దలు సామాజిక వ్యవస్థను ఘనీభవించిన సిద్ధాంతాలుగా విభజించి బోధిస్తారు – భూస్వామి తత్వము, సైనిక తత్వం, మొదలైన వాటిని. ప్రభుత్వ కార్యాలయాల నుండి ఉత్తరువులు జారీ అవుతాయి. ఉపాధ్యాయుల నుండి తగు వేతనాలుండవు పాఠ్యగ్రంథాలు నిర్ణీత మౌతాయి–సామాన్య మానవుణ్ణిగా విద్యార్థిని తయారుచెయ్యాలన్న ఉబలాటం– ఈ పరిస్థితుల్లో, పిల్లల పట్ల గౌరవం లోపించడం సహజం. పిల్లవాడు అసహాయుడు, బలహీనుడు. మాస్టరు బలం గలవాడు. బలహీనుడి పట్ల అసహనం ప్రబలి, తన ఇష్టం వచ్చినట్లుగా మట్టి ముద్దైన బాలకుడి మనస్సుని, రూపొందించవచ్చునన్న ధీమాతో, బోధించడం మొదలెడతాడు. అల్లా రూపొందించడం తన విధిగా భావిస్తాడు వినయం గల ఉపాధ్యాయుడు అల్లా భావించడు. పవిత్రమై, అస్పష్టమైన తపనతో ఎదిగే జీవంగా, బాలుణ్ణి భావిస్తాడు. ఈనాడు అన్ని ప్రభుత్వాలూ, కొన్నింటిని తప్పనిసరిగా నేర్పి తీరాలి. వ్రాయడం, చదవడం, వైద్య, న్యాయశాస్త్రం, విజ్ఞానశాస్త్రం – నేర్పాలి. ఉన్నత విద్యాదశలో కొందరికి ఇవి అవసరం. వీటి బోధ చాలినంతగా లేదు తప్ప హానికరమైంది మట్టుకు కాదు చరిత్ర, మతం – వీటి బోధ తృప్తికరంగా లేదు. ఇవి గతించిన సిద్ధాంతాలతో, కూడివున్నా, వాటి ప్రయోజనం ఏమిటో పరిశీలిస్తూ, బోధించబడాలి, కొద్దిగానో, గొప్పగానో.

"చరిత్ర, మతం – వీటి బోధ నేడు హానికరంగా పరిణమిస్తోంది పాఠశాలలను స్థాపించి పోషించేవారికి జరిగే మేలుని అనుసరించి ఈబోధ జరుగు

తోంది నా దేశం గొప్పది, నా దేశందే సరైన మార్గం, నా దేశం ఎప్పుడూ జయం పొందుతూనే వుంది, మా వారంతా గొప్పవాళ్ళు, ఇతర దేశాలకంటె నా దేశం గొప్పది – ఇవన్నీ నేర్పుతారు. అన్ని దేశాలలోను. ముఖస్తుతితో కూడి, అహంని పెంచేదిగా వున్న ఈ బోధ చటుక్కున స్వీకరింపబడుతుంది. పెరిగి జ్ఞానం తెచ్చుకుని, నిజం తెలుసుకున్నా కూడా బాల్యంలో బోధ ప్రభావం తొలిగిపోదు. జాత్యహంకారము బలిసి, యుద్ధాలకి దారితీస్తుంది ఈ రకం బోధ. ఒక జాతి అహంకారానికి దోహదమిచ్చేదిగాకాక వొక అంతర్జాతీయ సంఘం, ప్రపంచ చరిత్రని నిష్పాక్షికంగా తయారుచేసి, అన్ని దేశాలలోనూ పాఠ్య గ్రంథంగాచేస్తే, దేశాలనడుమ సహనం, స్నేహభావం పెంపొందుతాయి."

నిజమే, కాని ఇది జరిగే పనికాదు. చరిత్ర అనగానే, వొక దేశంలో జరిగిన రాజకీయ సంఘటనలు, రాజుల పట్టీలు, యుద్ధాల తేదీలు మట్టుకే కాదు. ఆ సంఘటనల వెనక వున్న శక్తుల పరామర్శ ఇది ఆయా దేశాలలో వున్న చరిత్రకారులకి సాధ్యంగాని, పైవారికి సాధ్యం కాదు అట్లాంటి శక్తుల పరామర్శలో కాస్తో కూస్తో ఉద్రేకం వుండక మానదు మన దేశ చరిత్రలో, కలకత్తా చీకటి కొట్టులో చనిపోయిన ఆంగ్లేయుల కథలో నిజా నిజాలు చరిత్ర కారుడి దృక్పథంతో దానికి బీజమైన ఉద్రేకంతో ముడిపడి వుండటం వొక ఉదాహరణ. ఒక చారిత్రక ఘట్టం మరీ పూర్వకాలపు దైనప్పుడు, దాన్ని గురించి వ్రాసే చరిత్రకారుడిలో ఉద్రేకం సమసి, సత్యాన్వేషణ నిజాయితీతో కొనసాగే అవకాశం వుంటోంది. అతి ప్రాచీనమైన హరప్పా, మొహెంజదారో నాగరికతల పుట్టు పూర్వోత్తరాలు, పతనంగూర్చి, నేటి పరిశోధకులు, పెక్కు విషయాలని, పక్షపాతం లేక, పరామర్శించగలగడం, ఇందుకు ఉదహరణ చిత్రం, చరిత్రలో, సంఘటనలు దూరమైనకొద్దీ స్పష్టంగా కనబడసాగుతాయి!

మత ప్రచారకులు నడిపే పాఠశాలల్లో, మతంపట్ల అభిరుచినీ, నమ్మికనీ నేర్పుతారు వీరికి సత్యంతో నిమిత్తం లేదు నేర్పిన నమ్మకాలలో నిజానిజాలు విద్యార్థులు తెలుసుకునే అవకాశం ఉండదు అసలు ఆ నమ్మకాలని సంశయించి, ప్రశ్నించాలన్న భావమే ఏర్పడదు ఫ్రాన్స్‌లో లౌకికసూత్రాలపై ప్రభుత్వం ఏర్పడిన రోజుల్లో, ప్రాథమిక పాఠశాలల్లో దేవుడు పేరెత్తకూడదట ఈ విధంగా, ప్రధానమైన అంశంపట్ల, విద్యార్థి కౌతూహలం సన్నగిల్లి, మూఢనమ్మకాలు ప్రబలుతాయంటాడు రసెల్.

స్వయంగా ఆలోచించేటట్లు చెయ్యక నిరాధారమైన కొన్ని నమ్మకాలని స్వీకరించేటట్లు చెయ్యడమే, విద్యావిధానం ఆశయం అయినప్పుడు స్వతంత్రంగా

ఆలోచించే శక్తులు మూలపడతాయి. సత్యం తెలుసుకోవాలన్న తృష్ణ ఏర్పడాలి. కొన్ని సిద్ధాంతాలే సత్యం అని కాదు కాని ఈ సిద్ధాంతాలే మనుషుల్ని ఏకం చేసేవి. ఒక సిద్ధాంతంపట్ల విశ్వాసం ప్రబలినకొద్దీ, దానికోసం దెబ్బలాడాలన్న పట్టుదల గాఢం అవుతుంది సత్యదూరాలైన నమ్మకాలపట్ల బాగా గురి కుదిరిన వారికే, యుద్ధంలో విజయం లభిస్తుంది కావున విద్యాధికారులు, ఈ గురిని, ఈ పట్టుదలని పెంపొందించడం జరుగుతోంది దీని ఫలితంగా మందబుద్ధుల మనస్సుని, పక్షపాతం పాలిస్తోంది. స్వతంత్రంగా ఆలోచించగలవారు నైరాశ్యులై, సంశయశీలురై జీవితం పట్ల నమ్మకం తగ్గి విముఖులౌతున్నారు. తమలో సమసిపోయిన శక్తులు ఇతరులలో ఉండకూడదన్న కసితో విధ్వంసక విమర్శకులుగా రూపొందుతున్నారు వెనకటి సంప్రదాయాన్ని పూర్తిగా స్వీకరించలేక ఆధునిక వ్యవస్థను పూర్తిగా జీర్ణించుకోలేక నేడు మనదేశంలో కొందరు విద్యాధికులు, బుద్ధిమంతులు ఇట్లాంటి దశలో వున్నారనిపిస్తుంది

చెప్పినట్లు చేసే శిక్షణ, ఎల్లాగైనాసరే ప్రపంచంలో పైకి రావాలన్న పోటీతత్వం, మరొక తెగవారిపట్ల ద్వేషం, చెప్పినవారి వెనక అండగా నిలబడగల మొండిపట్టు – ఆచార్యులు నేడు ఈ లక్షణాలని నేర్పుతున్నారు – అంటాడు రసెల్.

ఇవన్నీ జీవితవికాసానికి విరుద్ధం స్వతంత్రంగా ఆలోచించే శక్తి, ఎదుటి వారి పట్ల సహనం, కొత్తవాటిని సృష్టించేటందుకు అవసరమైన తృష్ణ – ఇవి నేర్పాలి. ఇవి నేర్పాలంటే, గురువులు విద్యార్థులపట్ల వినయము, గౌరవమూ చూపాలి

మంచి వ్యక్తులుగా రూపొందించడం విద్య యొక్క ఆశయం అనుకుంటే కొన్ని గుణాలు కళాకారులలో వుండాలి కళాకారుడిలో వుండేవి, కానివాటిలో ఉండకూడదేమొ. కవి, ప్రకృతి సౌందర్యం తిలకిస్తూ, ఊహలో విహరిస్తూ గడపొచ్చు – కాని ఈ పనులు పోస్టుబంట్రోతు చెయ్యకూడదు అందరిలోనూ ఉండవల్సిన నాలుగు గుణాలను పేర్కొంటాడు రసెల్ ఇంద్రియబలంతో వొచ్చే భౌతిక, మానసిక శక్తి, ధైర్యం, సున్నితము, బుద్ధిబలం ఈ నాలుగూను.

ఇంద్రియబలం ఉన్నవారికి, బైటజగత్తుపట్ల ఇష్టం ఏర్పడుతుంది ఊరికే బ్రతికి వుండడంలోనే, వారు ఆనందం పొందుతారు శారీరక, మానసిక అస్వస్థత కొన్ని సందర్భాలలో, కళాకారుడికి, వుపకరించొచ్చునేమో కాని మొత్తంమీద ఆరోగ్యం భౌతికబలం అందరికీ అవసరం. ఇవున్నవారిలో అసూయ, దిగులు అంతగా వుండవు రెండోది ధైర్యం నిర్భయుడుగా ఉండగలగడం వొకటి.

భయాన్ని అణిచిపెట్టగలగడం వొకటి. పెద్ద చప్పుడంటె భయం – ఇది సహజమైంది. కాని చీకటంటె భయం, ఇది ఇతరులు మనకి నేర్పిపెట్టిన భయం. స్త్రీలు ఎక్కువ భయాన్ని ప్రకటిస్తారు – అల్లా భయపడడం మొగాళ్ళకిష్టం అని. భయపడిన స్త్రీకి ధైర్యం చెప్పి ఆపద నుండి రక్షించి, తన ఆధిక్యతని ప్రకటించే అవకాశం వుంటుంది మొగాడికి అందుకు స్త్రీలు, భయాన్ని అమితంగా ప్రకటించడం. భయము క్రోధావేశము కలిపే ఉంటాయి. క్రోధావేశం గలవారికి ధైర్యం చూపడం సాధ్యంకాదు ధనికవర్గాలకి, తలనొప్పి కల్గించే నీగ్రో, కమ్యూనిస్టుల తిరుగుబాట్లని అణిచివెయ్యడంలో, వారు చూపే క్రోధావేశం; పిరికితనం నుండి పుట్టినదంటాడు రసెల్. ఇంతవరకూ ఋషులు, నాయకులు మాత్రం నిర్భయంగా జీవించగలిగారు ఇది విద్య ద్వారా అందరికీ సాధ్యపడా లంటాడు. వినయము, నమ్రత – అంత మంచిది కాదంటాడు తనపట్ల తనకుండే గౌరవభావాన్ని బలవంతంగా అణిచిపెట్టి అలవరుచుకున్న కృత్రిమభావం, నమ్రత, అతివినయం ధూర్తలక్షణం – అన్నది మన మెరుగుదుం ఇతరుల శాసనాలకి తలొగ్గడంగా పరిణమించి, బానిసత్వం ప్రబలుతుంది. ఇల్లా తలొగ్గ డానికి అలవాటుపడ్డవారు, పెద్దయ్యాక, మిగతావారంతా, తమకి తలొగ్గాలని ఉబలాటపడతారు. "ఎవ్వరూ తలొగ్గకూడదు. ఎవ్వరూ తలొగ్గమని శాసించ కూడదు."

మూడవది సున్నిత హృదయం. సుఖదుఃఖాల అంతర్యాన్ని గ్రహించి' తదనుగుణంగా ఉద్రేకపడగలగడం అన్నమాట తినడం, త్రాగడంలో బిడ్డ సుఖం ప్రకటిస్తుంది. ఈ దశ దాటాక, ఇతరుల భావం పొందాలన్న భావం ఏర్పడి, జీవితాంతం వుండిపోతుంది. దురాశని అరికడుతుంది యీ భావం. కాని ఈనాడు యుద్ధవీరులని మాత్రం మెచ్చుకోడం జరుగుతోందంటాడు రసెల్. మనదేశంలో వెనుకటి యుద్ధవీరులని మెచ్చుకున్నా, ఈనాడు ఆటగాండ్రని, సినిమా నటీనటుల్ని మెచ్చుకోవడం కూడా వుంది – వెనకటి యుద్ధాలని, వీరు తెరమీద సల్పడం చూస్తున్నాం గనక. సున్నితమనస్కుడై ధైర్యం – కలిగి వుండడం, ప్రధానంగా, నేర్పవలసిన గుణం ఇదే జవహర్‌లాల్ నెహ్రూ పదేపదే చెప్పిన సందేశం. ఆయన నేర్పిన ప్రధాన పాఠాన్ని వొక్కదాన్ని పేర్కొన మంటే దీన్ని పేర్కొంటాను.

సున్నిత మనస్తత్వానికి, ముఖ్యమైన అంగం సానుభూతి. అన్న, అక్క, ఏడిస్తే, బిడ్డ తనూ ఏడుస్తాడు. బాధపడే వ్యక్తి, మనకి సన్నిహితుడు కాక పోయినా కూడా, అతనిపట్ల సానుభూతి చూపగలగడం అవసరం. అట్లాగే మన

సమక్షంలో, మన కళ్ళముందు జరిగే బాధాకర విషయంపట్ల మాత్రమే కాకుండా, దూరంగా, ఎక్కడో, మనం ఎరగనిచోట ఆపత్తు జరిగినప్పుడు, సానుభూతి చూపగలగడం, ముఖ్యం అంటాడు రసెల్. నవల చదివినప్పుడు, అందలి పాత్రలపట్ల సానుభూతి చూపగలుగుతాడు పాఠకుడు. ఇంతటి సానుభూతి కేవలం అంకెలపట్ల కూడా చూపగలిగితే ఎంత బాగుంటుంది! మెక్సికోలో రైలుప్రమాదంలో పదహారుమంది చనిపోయారన్న వార్తలో, 'పదహారు' అన్న సంఖ్య వుంది ఇటలీలో అగ్నిపర్వతం రెండుమార్లు ప్రేలి రెండువందల మంది చనిపొయ్యారులో "రెండువందలు" సంఖ్య. ఉప్పెన రేగి అండమాన్ దీవులలో, 'ఐదు పడవలు మునిగాయి'లో 'ఐదు' సంఖ్య వియట్ కాంగ్ వారు తొమ్మిదివందలమంది చనిపొయ్యారన్న వార్తలో 'తొమ్మిది వందలు' సంఖ్య. ఈ సంఖ్యల వెనక మనుషులున్నారు. వీటి వెనక బాధ వుంది. వీరిపట్ల సానుభూతి చూపగలవా? నిరాకారమైన బాధపట్ల సానుభూతి చూపగలగడం, వొక విశేషం. దూరంగా వున్న వ్యక్తులపై విజ్ఞానశాస్త్రానికి ఎంతో ప్రభావం వుంది. ఎక్కడో ఎటామిక్ బాంబ్ పేలిస్తే, దూరంగా వున్న వ్యక్తుల ఆరోగ్యం దెబ్బతినే పరిస్థితి ఏర్పడింది. కాని దూరంగా వున్న తోటి మానవుడి పట్ల సానుభూతి చూపగల మానసిక పరిణామం రాలేదు. ఇది అలవడిననాడు, నేటి అనర్థాలని, సుళువుగా ఎదుర్కోగలం అంటాడు రసెల్.

"షాంగ్రై" పట్నంలో ఉన్ని తయారుచేసే కంపెనీలో నువ్వు భాగస్వామివి అనుకో. ఎవరి సలహామీదనో అందులో వాటా కొన్నావు నీకు 'షాంగ్రై' పట్లా, 'ఉన్ని' పట్లా శ్రద్ధ ఏమీలేదు. నీక్కావల్సింది, వొచ్చే లాభాలు. షాంగ్రైలో చిన్నపిల్లల్ని బలవంతంగా పనిలో చేర్పించి, కష్టాలు పెట్టి, ఉన్ని తయారీ పరిశ్రమ కొనసాగుతూంది. ఆ పిల్లలు పనిచెయ్యడం మానుకుంటె, నీ కంపెనీ దెబ్బతింటుంది. నీకు లాభాలు రావు కాని నీకు ఆ పిల్లలపట్ల, ఏ రకం సానుభూతి లేదు అతిగా వ్యాపించిన పారిశ్రామిక వ్యవస్థలో ఎంతో కాఠిన్యం ఉంది అందుకే, వెనుకబడిన జాతులను ఇతరులు కఠినంగా పాలించినా నువ్వు జాలిపడక, హర్షిస్తున్నావు"

సానుభూతితో పాటు బుద్ధికుశలతకి కుతూహలం కూడా ఉండాలి చీకటి వడ్డాక తెర తొలిగించి చూసే పల్లెటూరివారి కుతూహలం కాదు కావాల్సింది. పుకారు, వదంతి, వృధాపోక అపవాదులు వేసే కుతూహలం కాదు. అవతలవారి మంచిని గురించి రహస్యంగా వదంతులు ప్రచారం చెయ్యం. చెడుని గురించే చెప్పుగుంటాం. ఈ వదంతులు నిజమా కాదా — అని ఆలోచించి, నిదర్శనాలు

వెదకం ఇట్లాంటి కుతూహలం కాక, విజ్ఞానాన్ని సంపాదించాలన్న తృష్ణతో కూడిన కుతూహలం ఉండాలి పిల్లి కొత్తచోటికి రాగానే, అన్ని మూలలా పరిశోధిస్తుంది. డ్రాయర్ తియ్యగానే, పిల్లలు అంతటా గాలిస్తారు వయస్సు ముదిరినకొద్దీ, ఈ కుతూహలం సన్నగిల్లుతుంది ఒక దశలో దేనిపట్లా అభిరుచి కలగదు విముఖత ఏర్పడుతుంది ఈ దశలోనే "దేశం నాశనమైపోతోందండీ! మా చిన్నప్పుడు ఇల్లా వుండేదా!" అని వాపోవడం జరుగుతుంది పరిశీలన, నిదానం, పరిశ్రమ, పరిజ్ఞాన సముపార్జన సాధ్యమన్న విశ్వాసం — వీటి ఆధారంగా కుతూహలం, ఏర్పడాలి

సంఘంలో పదిమందినీ అనుసరించి నడుచుకోవాలా? లేక వ్యక్తిగా, ప్రత్యేకంగా అలవరుచుకున్న సిద్ధాంతాలని అనుసరించి నడుచుకోవాలా? కుటుంబం, పొరుగువారు, ఉద్యోగంలో తోటివారు, రాజకీయ పార్టీ, దేశం — ఈ విధంగా గుంపులుగా వెళ్ళే త్రోవలో వెళ్ళడమా? ఒక గుంపులో వున్నప్పుడు వారందరూ లోనైన ఉద్రేకానికే మనమూ లోనౌతాము మనం నేర్పే విద్య గుంపుని అనుసరించే ప్రవర్తనని పెంపొందించేదిగా వుండాలా? కొన్ని సందర్భాలలో నలుగుర్ని అనుసరించాలి. మరొక నిర్ణీతమైన రంగంలో వ్యక్తి స్వతంత్రంగా ప్రవర్తించాలి అందరూ మెచ్చుకున్న స్త్రీనే నేనూ మెచ్చుకుంటాను అని ఎవరన్నా అంటే, మనం నవ్వుతాం. భార్యని ఎన్నుకోడంలో స్వతంత్రుడైన వ్యక్తిని మనం మెచ్చుగుంటాం వ్యక్తుల మంచి చెడ్డలు విలువ కట్టడంలో తోటి వారితో ఏకీభవించక పోవచ్చు కాని ప్రేమించినప్పుడు తన అంతరంగాన్నే సంప్రదించాలి. వ్యవసాయాన్ని గురించి ప్రధానమైన పరిజ్ఞానం సంపాదించాక కర్షకుడు తన భూమి సత్తా తనే తెలుసుకుని నిర్ణయించగలగాలి. ఆర్థిక వ్యవస్థ గూర్చిన పరిజ్ఞానం ఆర్థికవేత్తకి అవసరం — కాని సామాన్య ప్రజ ఆర్థికవేత్తను అనుసరించడమే మంచిది తన వృత్తి వ్యాపారంలో, ప్రత్యేక నైపుణ్యం, సాంకేతిక పరిజ్ఞానం చూపవల్సిన రంగంలో స్వతంత్రుడై మసలడమే మంచిది. వీటిపట్ల ఇతరులకు కష్టం కలిగించే అభిప్రాయాలని మంచివని తెలిసినప్పుడు. అనారోగ్యము, భీవతనం, అసంతృప్తికరమైన కామ కలాపం – ఇవీ మన బాధకి కారణాలు వీటిని మనం జయించవచ్చు సున్నిత మనస్కులు వీటిని తొలిగించా లంటారు బుద్ధిశాలులు తొలగించే మార్గాలు తెలుసుకుంటారు. ధైర్యశాలులు ఈ మార్గాలను అనుసరించేటట్లు చెయ్యగలరు. కావున ఈ మూడు లక్షణాలనూ విద్యావేత్తలు నేర్పాలి. ఒక శతాబ్దిలో స్త్రీలంతా నిర్భయులైనప్పుడు భయంతో కూడిన సామాజిక వ్యవస్థని తొలిగించి మనకి అవసరమైన వ్యవస్థని నెలకొల్పుకోవచ్చు కార్య నిర్వహణలో దక్షత, పాలించే

కౌశల్యం – వీటిని నేర్పడానికి ప్రభుత్వాలు యత్నిస్తున్నాయి. ఆచార్యులుగా, విద్యా బోధకులుగా తయారు చెయ్యాలన్న సంకల్పం లేదు కార్యనిర్వహణ దక్షత కొంతవరకూ అవసరమే 'టెక్సాస్ ప్రాంతంలో ఉపాధ్యాయినిగా వుంటున్న ఒకామె పిస్తోలు లేకుండా బైటకి వచ్చేది కాదు" కాని చాలా భాగం కార్య నిర్వహణ తతంగం జరపడానికి శక్తి సామర్థ్యాలు అంతగా అక్కర్లేదు. బొత్తిగా పనికిరాని ఉపాధ్యాయులు ఈ పని చెయ్యగలరు. కాని అధికారులు పాఠం చెప్పడంలో నేర్పుకంటే, కార్య నిర్వహణలో నేర్పు ఘనమైందిగా భావిస్తారు వీరికే ఎక్కువ వేతనాలిస్తారు దీని ఫలితంగా. ఉత్తమ బోధకులు రావడంలేదు. రసెల్ వెలిబుచ్చిన ఈ భావం, మన స్కూళ్ళ విషయంలో బాగా నప్పుతుంది

"ఈనాడు మనం మూర్ఖత్వానికి దారి తీస్తోంది, ప్రేమ కామం గూర్చిన అసమగ్రమైన పరిజ్ఞానం మానసిక జాడ్యాలకి దారి తీస్తోంది జాతీయవాదం యుద్ధానికి దారి తీస్తోంది; కుల తత్వం, అసమానమైన ఆర్థిక వ్యవస్థకి దారి తీస్తోంది పోటీ తత్వం, సామాజిక సంఘర్షణకు దారి తీస్తోంది; ఉన్మాదం, మూర్ఖత్వం, క్రోధావేశం, ఆర్థిక అసమానత, నిర్దయ, పోటీ తత్వం – ఇవన్నీ పోవాలంటె; బుద్ధి కుశలత, దయ, న్యాయం, సహనం – వీటిని బిడ్డలకు నేర్పాలి. మరొక మార్గం లేదు

## మనశ్శాస్త్రం :

మానసిక శాస్త్రం తత్వ శాస్త్రం నుండి విడి వేరే ప్రత్యేకమైన శాస్త్రంగా ఈ శతాబ్దిలో తయారైనా, విశ్వశాంతిని నెలకొల్పేటందుకు, ఇది అంతగా ఉపకరించే ఫలితాలను సాధించలేదన్నది – నోబెల్ బహుమతిని స్వీకరిస్తూ 1950 లో ఇచ్చిన ఉపన్యాసంలోని సందేశం వ్యక్తుల 'అహం', గర్వాతిశయాలూ' జాతుల అధికార వాంఛగా మారి, శాంతి స్థాపనకు అడ్డు తగుల్తోంది – ఈ విషయాన్ని మానసిక శాస్త్రం ఋజువు చేస్తుంది – కాని ఈ అడ్డంకులని తొలిగించాలంటే ఏం చెయ్యాలో, చెప్పలేక పోతోంది. ఈ భావాన్ని విపులీకరిస్తూ, కొన్ని భాగాలు ఉదహరిస్తాను.

"తామసం శక్తివంతమైంది. పిల్లల్ని గమనిస్తే ఇది తెలుసుకోవచ్చు ఏదన్నా అల్లరి పని చేసిన పిల్లవాడు నాకేసి చూడండి' 'నాకేసి చూడండి' అని బాల్య దశలో కనబరిచే 'అహం' పెద్దయ్యాక వ్యక్తులని కార్యానికి పురిగొల్పుతుంది. తామసం – సర్కస్‌లో బఫూన్ వేషం నుండి, చచ్చాక ఖ్యాతి తెచ్చుకోవాలన్న వ్యక్తి కృషి వరకూ – అనేక రూపాలు దాలుస్తుంది వేరొక ఇటలీ

దేశంలో ఒక సామంతరాజు చావు బ్రతుకుల మధ్యవుండగా, మతగురువు ఆయన దగ్గరికి వెళ్ళి "నువ్వు, దేనికన్నా పశ్చాత్తాప పడుతున్నావా?" అని అడిగాడుట.

"తప్పకుండా పశ్చాత్తాపపడుతున్నాను ఒక సందర్భంలో మహారాజు, మతగురువు ఒకే సమయంలో నన్ను చూడడానికి వచ్చారు మా భవనం పై అంతస్థు మీదికి వారిని తీసుకువెళ్ళాను. వారి నిద్దర్నీ ఒకేసారి ఆ పై అంతస్థు మీదినుండి కిందికి తోసేసి వుంటే, నేను అమరజీవిని అవుండును. అల్లా చెయ్య నందుకు పశ్చాత్తాపడుతున్నాను " అన్నాడుట అహంగలవారు మజాగా బ్రతకా లంటారు అధికారం లేకపోయినా కూడా, మజాగా బ్రతకొచ్చు అమెరికాలో ఎక్కువ మజాతో జీవించేవారు సినిమా నటీనటులు అమెరికా తత్వానికి విరుద్ధ మైన చర్యలు సల్పేవారిని శిక్షించే కమిటీ సభ్యులు — వారిలో ఏ మజా లేదు — సినిమా నటీనటులని తమ తమ స్థానాలలో ఉండేటట్లు చెయ్యగలరు మానవు లలో — ముఖ్యంగా పురుషులలో — ఏదో వ్యాపకం, దాన్నుండి వచ్చే తహతహ, అహ్లాదంపట్ల ఎంతో కోర్కె — ఉంది వేటాడి గడిపిన ఆదిమ సమాజాలలో ఈ కోర్కెను తీర్చుకోడం సుళువయ్యేది తరమడం, అన్వేషణ, యుద్ధం, ప్రేయసి వేట — ఇవన్నీ మజాగా ఉండేవి భర్త పక్కన ఉండగానే అతని భార్యతో వ్యభిచరించే సాహసుడు ఆదిమవాసుడు (ఇట్లాంటి సాహసకృత్యాలు 'ముస్సొలినీ' కూడా చేశాడు.) దీన్నెవరూ విసుగు పుట్టించే వ్యాపకం అనరు. కాని వ్యవసాయం వచ్చాక జీవితంలో మజా తగ్గిపోయి చప్పబడింది — ధనికులైన ప్రభువులను మినహాయించి అనుకోండి — ఎందుకంటే, వీరింకా వేట సాగిస్తూనే వున్నారు; నాగరికతవల్ల జీవితం స్తబ్ధంగా, చప్పగా తయారవుతుంది. ఇది సుస్థిరం చెయ్యాలంటె, ప్రాచీనులు వేటాడే దశనుండి, నేటి మానవుడు తెచ్చుకున్న మజా తృష్ణని తీర్చుకునే, అవకాశాలు కల్పించాలి ప్రభుత్వం. ఆస్ట్రేలియాలో కుందేళ్ళు మెండు, మనుషులు తక్కువ. అక్కడివారు కుందేళ్ళ వేటలో మజా పొందడం చూశాను కాని లండన్, న్యూయార్క్ మొదలైన పట్నాలలో మనుషులు మెండు — కుందేళ్ళు తక్కువ. అక్కడివారు మరో విధంగా మజా పొందాలి. ఇట్లాంటి పట్నాలలో కృత్రిమ జలపాతాలని పెట్టాలి— స్నానానికి సరస్సు లుండాలి. వాటిల్లో యంత్రంచే నడుపబడే 'షార్క్' లుండాలి. యుద్ధం కూడదన్న మనుషులు చిన్న పడవలమీద జలపాతంమీదుగా జారి సరస్సులో పడి, షార్క్‌లతో రెండు గంటలు పోరు సలిపే ఏర్పాటుండాలి." మనదేశంలో రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో జరిగే కవాతులు, వినోదాలు ప్రజలు మజా పొందడం కోసం జరిగేవే.

అధికార వాంఛ ద్వారా జీవితంపట్ల వికట దృక్పథం అలవరచుకున్న వారు — పిచ్చాస్పత్రుల్లో వుంటారు ఒకడు, తాను బాంక్ గవర్నర్ అను కుంటాడు; ఒకడు, తనే చక్రవర్తి ననుకుంటాడు; మరొకడు తాను దైవం అనుకుంటాడు విద్యాధికులైనవారు, ఈ భ్రమలనే, ఎవరికీ సులువుగా అర్థమవని భాషలో వ్రాసి, తత్వ శాస్త్ర బోధకులుగా చలామణి అవుతున్నారు. ప్రజల్ని ఉద్రేకపూరితుల్నిగా చేసే గంభీరమైన భాషలో ఈ భ్రమల్ని ప్రచారం చేసిన వారు, నియంతృత్వాన్ని నెలకొల్పేటందుకు తోడ్పడుతున్నారు." సినిమాలు, నృత్య ప్రదర్శనలు, పోటీ ఆటలు — ఇవన్నీ సామాన్య ప్రజల నిగూఢమైన ఉద్రేకాన్ని పైకి తెచ్చి, వినోదించే అవకాశాలే. డిటెక్టివ్ నవలలు, టార్జాన్ సినిమా చిత్రాలు — అందుకే అంత ప్రచారం పొందాయి ఐనా, సినిమాల వల్ల, జనం చెడిపోతున్నారన్న నినాదం ఎందుకు బైలుదేరాలి? సినిమాకి వెళ్ళక, ఇంట్లో కూర్చుని చేసిన పాపాలకి పశ్చాత్తాప పడుతూ గడపమనా ఈ పెద్దల సందేశం?" "సినిమాలని చెడ్డవిగా ఖండించె తత్వం బైలుదేరింది—మరో రాజకీయ పక్షంవారినీ, ఆసియా దేశీయులనీ, పోర్చుగీసువారినీ — సీ క్లబ్బులో సభ్యుడిని మినహాయించి - అందరినీ ఖండించే తత్వం, అలవడడం సులువు. నృత్య ప్రదర్శన యుద్ధానికి దారితీసిన సంఘటన గురించి నేను వినలేదు," ఇది మన దేశానికి వర్తించదేమో బ్రిటిష్ ప్రభువుల కాలంలో 'రోషనార' నాటకం నిషేధించబడింది ఈ నాటకం ఇప్పుడు ప్రదర్శించినా, మత కలహానికి దారి తియ్యవచ్చు.

## ప్రజాస్వామ్యం :

తిండి, బట్ట, ఇల్లు, కామేచ్ఛ — ప్రధానమైన ఈ నాలుగు అవసరాలూ తీర్చుకున్నాక, మరి నాలుగింటికోసం తాపత్రయ పడతాడు — మానవుడు. ఆర్జించి వెనక వెయ్యడం, పోటీ పడటం, అహంకారం, అధికార వాంఛ. ప్రధానమైన అవసరాలు తీరాక, ఈ నాలుగింటినీ కాంక్షిస్తాడు — ఈ కాంక్షని నలుగురూ కూడబలుక్కుని, పంచుకోడం కోసమే రాజకీయ వ్యవస్థ ఏర్పరుచు కుంటారు కూడబెట్టాలన్న తహ తహ, భూస్వామి తత్వానికి వెన్నెముక. పోటీ తత్వం, శత్రుత్వం — ఆర్జనకంటె బలమైన గుణాలు ఒక సుల్తానుకి ముగ్గురు నలుగురు భార్యలకి కలిగిన సంతానం, తగవులాడుకుని రాజ్య వినాశం జరిగిన ఉదంతం, మహమ్మదీయ రాజ్యాల చరిత్రలో చూడొచ్చు నేటి యూరపులోను- ఇదే జరుగుతోంది. కైజరు, ఇంగ్లండొచ్చి, నౌకా శక్తుల కవాతు చూసి

"మా అమ్మమ్మకున్న వోడలు నాకూ వుండాలి." అనుకున్నాడు. ఆ భావంనుండి ప్రారంభమైనవే నేటి యుద్ధాలన్నీ. 'శత్రువులు నాశనం కావడం కోసం, ఎన్ని ఇబ్బందులేనా ఎదుర్కొంటారు మనుషులు అధికంగా పన్నులు గుంజడానికి ఇది కారణం."

అహంకారం, గర్వం - వీటిని తృప్తి పరచడం కష్టం. "అహం ప్రకటించే అవకాశం పెరిగినకొద్దీ అది పెరుగతూ వుంటుంది మన్ని గురించి నలుగురూ చెప్పుకుంటున్నారనగానే, ఇంకా చెప్పుకోవాలనిపిస్తుంది. ఉరిశిక్ష వేసి జైల్లో వర్ధ హంతకుడు, తను జరిపిన హత్యాకాండ వివరాలు, పత్రికల్లో సరిగ్గా పడకపోతే మండి పడతాడు పూర్తి వివరాలు ప్రచురించని పత్రికల్ని కోప గిస్తాడు. రాజకీయ వేత్తలు, సాహితీ వేత్తలు — ఇట్లా పరిమితిలేని కీర్తి దాహం గలవారే పనివాడు మొదలు, చక్రవర్తి వరకూ — మానవుడి కీర్తి దాహం అపరిమితమైంది. దేవుడికి కూడా ఈ అహంకారాన్ని ఆపాదిస్తాడు మానవుడు.

అధికారం చలాయించడానికి అలవాటు పడినవారి అధికార వాంఛకి అంతు లేదు ఈ అధికారం నిషేధించడం ద్వారా ప్రకటితమౌతుంది. 'ఒద్దు' 'కూడదు' అనడంలో అధికారులు ఆనందం పొందుతారు "మీ ఆఫీసులో అధికారిని శలవు అడిగితే 'ఇవ్వను' అనడంలో అధికారమిచ్చే, ఆనందం పొందుతాడు. కాని ఇందువల్ల అధికారం చెడ్డదని అనలేము. విజ్ఞానాన్ని సంపా దించాలన్న తృష్ణ, అధికార వాంఛ నుండి బైలుదేరేదే సంఘ సంస్కర్త, కృషికి ఇది అవసరం కొందరికి అధికారం వుండకపోతే సామాజిక వ్యవస్థ సాధ్యం కాదంటూ రసెల్ ఇల్లా అంటాడు

"అధికారం చెలాయించే, కొందరు అధికారులు వుండక తప్పదు. వీరి అధికారాన్ని అరికట్టే శక్తులు దూరంగా వుండి నెమ్మదిగా పని చేసేవి అవ్వచ్చు. పోస్టాఫీసులో స్టాంప్‌లమ్మే వ్యక్తి నుండి, ప్రధానమంత్రి వరకూ, ప్రతివారూ కాస్తో కూస్తో అధికారం కలిగే వుంటారు. స్టాంపులమ్మే వ్యక్తి మర్యాద చూపక పోతే నువ్వు ఫిర్యాదు చెయ్యవచ్చు; ప్రధాని పాలనా సూత్రాలు నీకు నచ్చక పోతే, ఎన్నికల సమయంలో నీ వోటు వెయ్యకపోవచ్చు — నీ అసంతృప్తి బైట పడేవరకూ, వారు తమ అధికారాన్ని చలాయిస్తూనే వుంటారు. అధికారుల వ్యవహారం, అందరికీ తలనెప్పి పుట్టిస్తూనే ఉంది. ఇంగ్లండులో వారికంటె మిగత దేశాలలో వారు తక్కువ నమ్రత చూపుతారు ప్రతి వ్యక్తీ తప్పకుండా నేరస్థుడై వుండాలి - అట్లా కాకపోతే విశేషమే ననుకుంటాడు అమెరికాలో పోలీసు ఉద్యోగి ఈ ఉద్యోగుల అధికార వాంఛని అరికట్టే సూత్రాలు, నేటి సమాజంలో నెలకొల్పుకోవాలి "

ఆహ్లాదం, తహ తహ, ఏదో పని చేస్తూ 'నిషా' పొందాలన్న ఉబలాటం, మానవుడిలో విధ్వంసక శక్తిగా పరిణమిస్తోంది. త్రాగుడు, జూదం, గుఱ్ఱం పందాలు – దీనికి నిదర్శనం. "రెడ్ ఇండియన్లు పొగాకు ప్రశాంతంగా తాగరు. పెద్దగా చప్పుడు చేస్తూ పొగ పీలుస్తారు తీవ్రంగా పీల్చి 'నిషా' కమ్మి మైకంలో పడిపోతారు అప్పటికీ 'నిషా' తీరకపోతే, ఒక ఉపన్యాసకుడు లేచి, పొరుగు బృందంపై పగ రగిల్చి యుద్ధానికి పురిగొల్పుతాడు. ఎన్నికల సమయంలో మనం పొందే మజా, ఆహ్లాదము వారు పొందుతారు ప్రసిద్ధమైన చైనా గోడ నిర్మాణంలో పనిచేసిన పనివాండ్రు, శీతాకాలంలో జూదమాడుతూ గడిపే వారుట. జూదంలో అన్నీ గోల్పోయేవారుట, – ఆఖరికి బట్టలు కూడా వోడిపోయి నగ్నంగా తిరిగి చలిలో చచ్చిపొయ్యేవారట. ఫుట్ బాల్ ఆట సమయంలో ప్రేక్షకుల 'నిషా' నినాదాలు, అల్లర్లు, యుద్ధం ప్రారంభమైనప్పుడు, వొక దేశం ప్రజల్లో బైలుదేరే 'నిషా' కల్లోలమూ ఇట్లాంటివే" ఈ 'నిషా' తృష్ణ, శాంతియుత క్రియల ద్వారా వ్యక్తమయ్యే అవకాశాలు, ప్రభుత్వాలు కల్పించాలంటాడు. అధికారం లేకుండా సమాజం లేదు కాని ఈ అధికారాన్ని, మితిమీరిపోకుండా లొంగదీసి, అరికట్టి 'మచ్చిక' చేసుకోవాలి. ఇదెల్లా సాధ్యం? - అన్న ప్రశ్నని 'అధికారము' అనే గ్రంథంలో చర్చించాడు రసెల్, అందులో కొన్ని భాగాలు ఉదహరిస్తాను.

"శ్మశానంలో ఏడుస్తున్న ముదుసలిని చూశాడుట కన్ఫ్యూషియస్. (చైనాదేశపు వేదాంతి). ఎందుకమ్మా నీకీ దుఃఖం అని అడిగాడుట. మా మామగార్ని పెద్ద పులి పొట్టనెట్టుకుంది. నా భర్తని చంపింది పులి, నా బిడ్డనీ చంపింది పులి అందిట అట్లాంటప్పుడు ఈ చోటు నుండి మరో చోటుకు ఎందుకు వెళ్ళిపోవు, అని అడిగాడుట వేదాంతి ఇక్కడ, నిరంకుశ ప్రభుత్వం లేదు – అందుకని ఇక్కడే వుంటాను, అందిట. వేదాంతి శిష్యులతో ఇలా అన్నాడు "శిష్యులారా, గమనించండి. నిరంకుశ ప్రభుత్వం, పెద్ద పులికంటె ప్రమాదమైంది. పులికంటె ప్రమాదకరమైన నిరంకుశ ప్రభుత్వాన్ని ఎల్లా అరికట్టాలి?" ప్రజాస్వామ్య ప్రభుత్వం ఒక పద్ధతి ప్రజా ప్రభుత్వం, మంచి పరిపాలన సాగిస్తుందనలేము – కాని, కొన్ని చెడుగులు జరక్కుండా, అడ్డుకుంటుంది. ప్రజాప్రభుత్వంలేకుండా వుండివుంటె, పశ్చిమ అమెరికా, ఆస్ట్రేలియా న్యూజిలాండ్ దేశాలు, అల్ప సంఖ్యాకులైన తెల్లవారి పాలన కింద బానిసల దేశాలుగా తయారయ్యేవి. అల్ప సంఖ్యాకులు, అమిత సంఖ్యాకుల కష్టసుఖాలను గురించి పట్టించుకోరన్నది చరిత్రలో చూడొచ్చు. అల్లాగే అల్ప

సంఖ్యాకులపై అధిక సంఖ్యాకులు నిర్దాక్షిణ్యంగా వ్యవహరించడమూ జరుగుతుంది ప్రజాస్వామ్యంలో. 1885 నుండి, 1992 వరకూ - స్త్రీల వోటింగ్ హక్కు మినహా - ఇంగ్లండ్ ప్రజాస్వామ్యం నిర్వహించినా, ఐర్లండ్ దేశస్థుల్ని కష్టాలు పెట్టింది మత, రాజకీయ అల్ప సంఖ్యాకులని - ఇల్లా ఇబ్బంది పెట్టడం జరగొచ్చు అందుకని అల్ప సంఖ్యాకుల శ్రేయస్సుకి అంతరాయాన్ని తొలిగించే సూత్రాలు రాజ్యాంగంలో పొందుపరుస్తారు.

భౌగోళికంగా, పెద్ద విస్తీర్ణంగల దేశమైతే, పౌరుడికి రాజ్యనిర్వహణలో ప్రమేయం తగ్గిపోతుంది. తను వోటు వేసినా వెయ్యకపోయినా, జరిగే మార్పు ఏమీ లేదని భావించడం జరుగుతుంది. యుద్ధం, పర రాజ్యాలపట్ల అవలంబించవల్సిన విధానం - ఇవి అతని నిర్ణయంపైన ఆధారపడవన్న భావం ధ్రువపడుతుంది.

"ప్రజాస్వామ్యంలో ఒక పేచీ వుంది. తన పార్టీవారి సంఖ్య స్వల్పమైనప్పుడు, తనకి పాలనా తంత్రంలో స్థానం వుందన్న భావం పౌరుడికి ఏర్పడుతుంది. తన పార్టీవారి సంఖ్య పెద్దదైనప్పుడు, ఈ భావం వుండదు. పార్టీ సంఖ్య పెద్దదైనప్పుడే, నిర్ణయించవల్సిన విషయాలు ముఖ్యమైనవిగా కనబడతాయి అతనికి అందుకనే వృత్తి వ్యాపార రంగాలలో వారంతా కలిసి బృందంగా ఏర్పడ్డం ప్రబలింది.

## న్యాయం :

నిరంకుశత్వం కొనసాగకుండా, అల్ప సంఖ్యాకుల శ్రేయస్సు దెబ్బ తినకుండా, ఆంక్షలు విధించి, సంరక్షించే అవకాశా లుండాలి. న్యాయశాఖని, పరిపాలనా శాఖని విడగొట్టడం సమానత సంరక్షించుకోడం కోసమే. "కొన్ని పనులు మాత్రం నిర్వహించే వారికి అధికారం చలాయించే అవకాశం పెరుగుతూ వుంటుంది —— పోలీసు శాఖ ఉదాహరణ నేరస్థుణ్ణి పట్టుకుంటె పోలీసుకి ప్రమోషన్ వొస్తుంది. నేరస్థుడు తన నేరాన్ని ఒప్పుకుంటే, కోర్టు అతన్ని శిక్షిస్తుంది కాబట్టి, నేరాన్ని వొప్పేసుకునేటంతవరకూ, పోలీసులు, అతన్ని శారీరకంగా హింసిస్తారు. ఇది అన్ని దేశాలలోనూ జరుగుతున్నదే. ఇండియాలో మరీను. ఒకప్పుడు స్పైన్‌లో, మతం పేరిట జరిగిన హింసాకాండకు ఇదే కారణం. ఒప్పుకున్నప్పుడు తప్ప, నేరస్థుణ్ణి శిక్షించకూడదన్న చక్రవర్తి శాసనం వల్ల, వెనకటి చైనాలో - తప్పనిసరిగా హింసాకాండ కొనసాగేది. పోలీసుల దౌర్జన్యాన్ని అరికట్టాలంటే నేరస్థుడు తన నేరాన్ని వొప్పుకోవాలన్న నిబంధనని తొలిగించాలి " ఇది గమనించతగ్గ భావం

నేరస్థుణ్ణి శిక్షించడం కంటే, నిర్దోషిని విడిచెయ్యడం ముఖ్యమని అందరూ గుర్తించినా పోలీసులు వెదికేది, నేరానికి నిదర్శనం, అమాయకత్వాన్ని కాదు.

"నువ్వు నేరం చేశావనుకో. నీకు వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చే సాక్షుల్ని వెదుకుతుంది ప్రభుత్వం; తెలివైన ప్లీడర్ని తెచ్చుకుంటుంది. నీ అమాయకత్వాన్ని ఋజువు చెయ్యాలంటే, నీ స్వంతడబ్బు ఖర్చుపెట్టాలి. ఏ సంస్థా నీకు సహాయపడదు నువ్వు బీదవాడివైతే ప్రభుత్వం నీకో లాయర్ని అప్పగిస్తుంది కాని అతను పబ్లిక్ ప్రాసిక్యూటర్ అంతటి తెలివైనవాడై వుండడు. నిర్దోషినని ఋజువై, నువ్వు శిక్షింపబడక తప్పించుకున్నా, నువ్వు దివాళా తీస్తావు. ఉపాధి దొరకక నాశనమవుతావు, సినిమాలు, పత్రికలు ఆదుకుంటె తప్ప." క్రిస్టీన్ కీలర్ని, ఇంగ్లండ్లో సినిమాలు ఎంతవరకూ ఆదుకున్నాయో తెలియదు – మన దేశంలో, ఇవి ఆదుకుంటాయనడానికి ఆధారాలు అంతగా లేవు. దీనికి మందేమిటి? రసెల్ సూచన నా కిష్టమైంది:

"పోలీసుల దురంతాన్ని అరికట్టాలంటే రెండు పోలీసు శాఖలు పని చెయ్యాలి. ఒకటి, ఇప్పుడున్న మాదిరిదే. నేరస్థుణ్ణి పట్టుకుని, నేరాన్ని ఋజువు చేసే శాఖ. ప్రభుత్వం పక్షాన, పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఉన్నట్టుగానే (శిక్షించే ప్రజా ప్రతినిధి) నేరస్థుణ్ణి సమర్థించి, కాపాడే పబ్లిక్ డిఫెన్డర్ – కాపాడే ప్రజా ప్రతినిధి) ఉండాలి. శిక్షించే పోలీసు దళంవారు సలిపే దారుణాలను పట్టి, శిక్షించేవని, కాపాడే పోలీసుదళం నిర్వహించాలి మరో మార్గం లేదు" ఖారీ పరిశ్రమల్ని ప్రజలే పోషించి నిర్వహించాలన్నదీ ఉద్యోగులు కలుగజేసే అంతరాయాలని తొలిగించే యంత్రాంగం బందోబస్తీ చెయ్యాలన్నదీ, రసెల్ చేసిన మరికొన్ని సూచనలు

"ప్రజాస్వామ్య సూత్రాలని విడనాడి, ప్రభుత్వం నెలకొల్పిన ప్రజాస్వామ్య పరిపాలనలో ఉన్న ప్రమాదం ఎట్టిదో, రష్యాలో సంఘటనల్ని పరిశీలిస్తే తెలుస్తుంది. రష్యాలో ఏది జరిగినా, మంచిదేననే మతోన్మాదులున్నారు – వీరు నిదర్శనాలనీ, దృష్టాంతాన్నీ పరిశీలించే స్థితిలో లేరు. బాధ్యతారహితులైన వారిలో అధికారం వుంచితే, ఎంత ప్రమాదిస్తుందో 'యూజీన్ లయన్స్' అనే ఆయన మాటలు వింటే తెలుస్తుంది. 'ప్రభుత్వ మొక్కటే ఉద్యోగాలు పంచి పెట్టే స్థితి ఏర్పడినప్పుడు, డబ్బుకోసం ఏది చెప్తే అది చేసేటందుకు సిద్ధపడని వారు మనలేరు. రహస్యంగా పట్టి, గూఢచారుల శిక్షించి, వోటింగ్ హక్కులేక, కాల్పులు జరిపి, వసతి, తిండి – ప్రభుత్వమే జరిపినప్పుడు వారి అడుగులకు మడుగులొత్తడం తప్పదు తను స్వయంగా పండించిన ధాన్యంలో కాస్త

భాగాన్ని సమిష్టి వ్యవసాయ వ్యవస్థలో కష్టించే కామందు తీసుకుంటె మరణశిక్ష విధిస్తారు కరువు తాండవించిన రోజుల్లో లక్షలాదిమంది తిండిలేక మలమల మాడి చస్తున్న సమయంలో అమలు జరిగిన మరణశాసనం ఇది" ఈ వ్యాసం రసెల్ 1938 లో ప్రచురించింది

మన ఇబ్బందులేవో పైకి చెప్పుకునే స్వాతంత్ర్యం వుంటేగాని అధికార దుర్వినియోగాన్ని అరికట్టలేము ఇల్లా చెప్పుకోడానికి ప్రచార విధానం, సాధనాలు అవసరం. అది ప్రజాస్వామ్యం అనికాని, కమ్యూనిజం అనికాని పేరుమార్చినంత మాత్రాన అధికారాన్ని అరికట్టగలం అనుకోడం పొరబాటు

"చెడ్డరాజుని తొలిగించి మంచిరాజుని సింహాసనం ఎక్కిస్తే తీరిపోతుందా? ఆ రాజు మంచివాడని పూజించడం లేదు; చెడ్డవాడైతే చిక్కుల్లోపడే పరిస్థితిలో ఇరుక్కున్నాడు కావున అతన్ని భరిస్తున్నాం ఇల్లా భరించవల్సిన వ్యవస్థ ఏర్పడినంతకాలం అధికారం కోరలు తీసేస్తున్నాం మనం మంచివాడనుకున్న వ్యక్తికి అధికారం ఇచ్చి నిరంకుశ వ్యక్తిగా మారే అవకాశం వున్నంతకాలం అధికారం తన కోరలు చూపుతూనే ఉంటుంది. ప్రభుత్వం జోక్యం కలిగించుకున్నా స్వేచ్ఛా ప్రచారం ఎల్లా కొనసాగగలదో బి బి.సి. సంస్థలో చూడొచ్చు దేశంలో పెద్ద సమ్మె జరిగినప్పుడు బి.బి సి. నిష్పాక్షికంగా వుండదు, నిజమే. మిగతా సమయాలలో అన్నిరకాల భావాలనీ, దృక్పథాలనీ, వాటి బలాలనిబట్టి ప్రచారం చేసే అవకాశాలిస్తుంది ఆ సంస్థ. ప్రజాస్వామ్య ప్రభుత్వంలో సమావేశానికి హాలు కావాలన్నా, వివాదంతో కూడిన సాహిత్యాన్ని ప్రచారం చెయ్యాలన్నా నిష్పాక్షికమైన యంత్రాంగాన్ని రూపొందించాలి. అట్లాంటప్పుడు వేర్వేరు ఆదర్శాలు ప్రచారం చేసే వేర్వేరు పత్రికలుండటం కంటె, ఒకే పత్రిక ఉండి, అందులోనే, వేర్వేరు ఆదర్శాలవారు, తమ భావాలని ప్రచారం చేసుకోడం మంచిదేమో అట్లా వుంటె, పౌరుడు అనేక పత్రికలు కొని చదివే అవసరం ఉండదు ఒక పత్రికలోనే విరుద్ధభావాలు చూడొచ్చు. ఒకే భావంపట్ల పక్షపాతం అలవరుచుకోక, నిష్పాక్షికంగా విమర్శించె దృక్పథం అలవడుతుంది కళ, విజ్ఞానశాస్త్రం, రాజకీయాలు — వీటిల్లో అందరూ వొకేలాగు ఆలోచించడం, సమానత — సాధ్యం కావు. సాధ్యం కాకూడదు కూడా. వీటిల్లో పోటీపడటం తప్పదు వీటిల్లో విభిన్నతనీ, వైవిధ్యాన్నీ, భరించగలగాలి, వీటిపట్ల సహనం చూపడమే, ప్రజాస్వామ్యం సాధించే ప్రధాన ప్రయోజనం."

## ప్రపంచ శాంతి :

బెర్ట్రండ్ రసెల్, డెభ్భై పుస్తకాలు వ్రాశాడు. తత్వశాస్త్రం, విజ్ఞాన

శాస్త్రం, ఐరోపా రాజకీయాలు, చరిత్ర — వీటిని వొదిలేసి, ముప్పై పుస్తకాలలో, మనకి తాస్తో కూస్తో సంబంధం వుండి, మనం తెలుసుకోతగ్గ కొన్ని భావాలను మాత్రమే ఈ వ్యాసంలో పొందుపరిచాను 1950 నుండి, రసెల్ ప్రపంచ శాంతి స్థాపనకై కృషి చేస్తున్నాడు రసెల్ [11]శాంతి స్థాపన ఉద్యమాన్ని నెల కొల్పాడు. నిధిని సేకరించాడు ప్రపంచంలో పేరుపడ్డ విజ్ఞాన శాస్త్రజ్ఞుల సహకారాన్ని, పొందగలిగాడు. అన్ని దేశాల ప్రభుత్వాలకీ, యుద్ధం విరమించ వల్సిందనీ, మారణ యంత్రాల తయారీ నిలిపి వెయ్యవల్సిందనీ, విన్నపాలు, విజ్ఞప్తులూ, పంపుతూ వున్నాడు ఈ దశలో, రచనలు, ఉపన్యాసాలు, ప్రసంగాలు, విజ్ఞప్తులు, లేఖలూ ఇవన్నీ ప్రపంచంలో శాంతి నెలకొల్పే ఆవశ్యకతను గూర్చినవే. శాంతియుత మార్గానికి పేరు పడింది భారతదేశం బుద్ధుడు, అశోకుడు, అక్బర్, గాంధీ శాంతి ప్రియులె ఇతర దేశాల పట్ల మధ్యస్థతని స్వీకరించాము నెహ్రూ నెలకొల్పిన 'పంచశీల' అలీన విధానము, తటస్థ పద్ధతులు, ప్రపంచ శాంతికి దోహదమిచ్చేవే ఇటొచ్చీ వెనకబడిన దేశాలు, ఇప్పుడిప్పుడే రాజకీయ స్వాతంత్ర్యం తెచ్చుకున్నవైనందున, స్వయంపోషకంగా వుండలేక, ధనిక దేశాల సహాయాన్ని స్వీకరించాల్సి వొస్తోంది సహాయంచేసే స్థితిలో వున్న ధనిక దేశాలు, ఇతరత్రా ఏదీ ఆపేక్షించకుండా, స్వార్థపరత్వం చూపకుండా, ఈ దేశాలకి సహాయం చెయ్యగలవా?! అన్న ప్రశ్న వుంది తటస్థంగా వున్న దేశాలే, ప్రపంచ శాంతికి దోహదం ఇవ్వగలవని రసెల్ నమ్మకం. అందువల్లనే శాంతి స్థాపన గూర్చి, కొన్ని రసెల్ భావాలను ఉదహరించడం సమంజస మనుకుంటాను.

"చిన్న చిన్న విషయాలే, పెద్ద పెద్ద పరిణామాలకు కారణమౌతాయి. జర్మనీ దేశస్థుడైన వొక చిన్న ఉద్యోగి 1917 లో లెనిన్ రష్యా వెళ్ళాలి అని నిర్ణయించకపోయినట్లైతే రష్యా దేశంలో కమ్యూనిస్టు ప్రభుత్వం నెలకొల్పబడి వుండేదికాదు ఒకరిద్దరు రిపబ్లికన్ శిష్ట సభికులు, వెర్సేల్స్ ఒడంబడికను సమర్థిస్తూ వోటు చేసి వుంటె, అంతర్జాతీయ సంస్థలో అమెరికాకి అభ్యర్థిత్వం సమకూరి వుండేదికాదు. అమెరికా, ప్రపంచ శాంతిని నెలకొల్పి ఉండేది చిన్న విషయాలు పెద్ద హానిని కలగచేసినట్లే, పెద్ద మంచిని కూడా కలగచెయ్య వచ్చు. ఈనాడు అన్ని దేశాలవారూ, యుద్ధం ప్రమాదకరమైందనీ, నెగ్గేవారూ, ఓడిపోయేవారూ అంటూ లేక, అందరూ నాశనమౌతారన్న విషయాన్ని

---

11 రసెల్ శాంతిస్థాపన ఇండియా విభాగం కార్యాలయం చిరునామా, శ్రీమతి త్రిష్ణాసుంద్ర, 'షంగ్రిలా' ఫరీదాబాద్, పంజాబ్

గ్రహించాను. యుద్ధం అంటే భయపడుతున్నారు. నేను రాజకీయ దురంధరుణ్ణి అయివుంటె, అన్ని దేశాలవారినీ సమావేశపరిచి, యుద్ధం ఎట్లాంటి వినాశాన్ని తెస్తుందో సమాలోచన జరిపేటట్లుచేస్తాను ఈ సమావేశం, నిష్పాక్షికంగా ప్రగల్భం విస్మరించి, పీరు వారికంటె గొప్ప అనకుండా అందరూ యుద్ధంవల్ల ఎట్లాంటి చిక్కులకు గురవుతారో వొక చిట్టా వెయ్యమంటాను. హైడ్రోజన్ బాంబ్ ప్రస్తావన వొచ్చినప్పుడు, అది విజయాన్ని సమకూరుస్తుంది అనడం బదులు, వినాశాన్ని కలగచేస్తుందని అనుకుంటాను. 'మేం హైడ్రోజన్ బాంబే తయారు చేశాం' అంటున్నారు వొక పక్షం 'మేమూ చేశాం' అంటున్నారు మరో పక్షం. 'ప్రయోగించేటందుకు మీరున్నారుగా' అని మొదటి పక్షం. సరే ఇదంతా ఎందుకు, దాన్ని పేల్చి చూద్దాం అని రెండో పక్షం. ఈ దబక్కులు ఆత్మ హత్యకు నాంది ఒక పక్షంవారు సాధించే సాంకేతిక పురోగమనం రెండోవారికీ సాధ్యమని గుర్తించాలి క్రెమ్‌లిన్‌ని మసి చెయ్యగల శక్తి పెంటగన్‌కి వుంటే వాషింగ్‌టన్‌ని మసి చెయ్య గల శక్తి మాస్కోవారిక్కి వుంది. తటస్థ విధానాన్ని అలవరుచుకున్న దేశాలు, ముందు కొచ్చి, తంతు జరిపించాలి వారొక విజ్ఞప్తి తయారుచేసి ఇరుపక్షాలవారి సూచనలూ సేకరించాలి తటస్థులకు, మనసిచ్చి మాట్లాడగల దేశాలు, వారి శత్రువులకు మనసిచ్చి మాట్లాడ్డం నేర్చుకుంటారు. ప్రపంచం అంతటికీ వొకే ప్రభుత్వం వుండాలంటూ రసెల్ ఈ సూచనలు చేశాడు.

## ప్రపంచ ప్రభుత్వం :

"యుద్ధ సామగ్రిని, ఆయుధాలనీ, ప్రపంచ ప్రభుత్వం తన అధీనంలో వుంచుకోవాలి వారి యాజమాన్యాన సైనిక బృందం వుండాలి. సైనిక దళం, ఆ ప్రభుత్వం పట్ల భక్తి కలిగి వుండాలి. రెండుదేశాలవారు తగవులాడు కుంటె, ఆ తగవు ప్రపంచ ప్రభుత్వం ముందు పరిష్కారం అవాలి. వారి అనుమతి లేనిదే ఏ దేశమూ, మరొక దేశంతో కయ్యానికి దిగకూడదు. తగవు తీర్చేటందుకు ప్రపంచ న్యాయమూర్తుల సిబ్బంది ఏర్పడాలి సైనిక దళంతో పాటు, ఇవన్నీ సమకూరుతాయి '

అట్లాంటి ప్రపంచ ప్రభుత్వం సాధ్యపడాలంటె, అన్ని దేశాలలోనూ, పెరిగిపోక, జనాభా స్థిరంగా వుండే పరిస్థితి ఏర్పడాలంటాడు రసెల్. వెనుక బడిన దేశాలలో జనాభా పెరిగిపోతోందని, పాశ్చాత్యులు భయపడటం అనవసర మంటాడు.

"ఇది పొరబాటు నెహ్రూ చెప్పినదాన్నిబట్టి చూస్తే ప్రాక్ దేశాలలో,

అమెరికాలో కంటె, ఎక్కువ వివేకము, తక్కువ ఛాందసం వుందని స్పష్టమౌతుంది. ఇండియా, చైనా, జపాన్ దేశాలలో, సంతాన నిరోధక పరికరాల పరిజ్ఞానం ప్రచారమైతే, ఆ దేశాల జనాభా పెరుగుదల నిలిచిపోతుందనడంలో, నాకే సందేహమూ లేదు. ఆసియాలో గాని, ఆఫ్రికాలో గాని తెల్లవారు ఏ మంచి పని చెయ్యాలన్నా, వొక చిక్కుని ఎదుర్కొంటున్నారు తెల్లవారి సామ్రాజ్య కాంక్షకి వారు భయపడతారు చైనా అంతటి పెద్ద దేశాన్ని రష్యావారు, తమ చుట్టూ ఉపగ్రహం కింద తిప్పుకొనడం చూసి కూడా, ఏ కారణం వల్లనో, రష్యా వారిని, సామ్రాజ్య వాదులుగా పరిగణించరు, ఆసియావారు. కాలం జరిగినకొద్దీ, ఈ భావం తొలిగిపోతుందని ఆశిద్దాం. అమెరికావారు గాని, బ్రిటిష్ వారు గాని, ఫ్రెంచ్‌వారు గాని, ఆసియాలో మంచి పని తలపెట్టాలంటె, వారి కేదో సామ్రాజ్య కాంక్ష వుందన్న అనుమానం అడ్డు తగుల్తూ వుంటుంది. నచ్చజెప్పి ఈ శంకను మాపి, పాశ్చాత్య దేశీయులు కొందరు, ఆసియావారికి సహాయం చెయ్యడానికి దీక్షాబద్ధులు కావాలి బీదతనాన్ని మాపడం, వ్యాధి నిర్మూలన, విజ్ఞానశాస్త్రంకి సంబంధించిన విద్యా బోధ, ఇవి పాశ్చాత్యులు ఇవ్వగలిగినవి ఈ మంచి అంతా, ఇంతవరకూ సామ్రాజ్య తత్వంలో ముడిపడి వున్నందున, ఆసియావారు వీటిని స్వీకరించలేకపోతున్నారు." ఇందుకు కారణం. జాత్యహంకారమూ, మత సంబంధమైన ఆధిక్యతా అంటాడు రసెల్.

## అంతర్జాతీయ వ్యవహారాలు :

"కాశ్మీర్ సమస్యని ఎదుర్కొన్నప్పుడు, భారతీయుల ఆదర్శ తత్వం సడలిపోవడం చూస్తే విచారం కలుగుతుంది యూదులు, అరబ్బులు కనపరిచే అసహనం చూస్తే విచారం కలుగుతుంది తమ భావాన్ని ప్రభుత్వం బలపరచనప్పుడు, కమ్యూనిస్టుల సహాయం అర్థించడం జరుగుతోంది. 'అల్‌స్టర్' సమస్య పట్ల ఐర్లండువారూ ఇట్లాగే ఉంటున్నారు. పాశ్చాత్య నాగరికత, మానవజాతి సంరక్షింపబడటం కంటె, 'అల్‌స్టర్' సమస్య ముఖ్యమనుకుంటారు ఇరాన్ స్వతంత్రం కావాలంటుంది. రష్యా, పాశ్చాత్య దేశాల నడుమ వున్న వైరం సమసిపోతే గాని, అందు గెలిచినవారు, ఇరాన్‌కి స్వాతంత్ర్యం ఇవ్వడం జరగదు: మనదేశం దానికి ప్రపంచంలో వున్న స్థానం ఈ రెంటి అవసరాలనీ గుర్తిస్తేగాని జ్ఞానోదయం కాదు. మంచికో చెడుకో, ప్రపంచం అంతా వొక కుటుంబంగా రూపొందింది. కుటుంబంలో కలహాలుంటాయి. ఈ కలహాల కంటే, కుటుంబం అంతటినీ సంరక్షించడం ముఖ్యంగా భావించాలి అందరూ."

ఇవన్నీ ప్రస్తుతం కొనసాగుతూ వున్న అంతర్జాతీయ వ్యవహారాలపై

రసెల్ వ్యాఖ్యలు. ప్రస్తుత రాజకీయాలను ముచ్చటించ కూడదనుకున్నాను. కాశ్మీరు, ఇండియాలో భాగం కాదనీ, అదొక సమస్య ఐందనీ, దానిపట్ల ఇండియా వైఖరి ఆదర్శమైంది కాదనీ రసెల్ అనుకోడం చూస్తే, ప్రస్తుత రాజకీయాలలోని సిద్ధాంతాల దృష్ట్యా పరామర్శించడంలో గల ఇబ్బంది ఎట్టిదో తెలిసొస్తుంది.

ప్రపంచ శాంతి స్థాపనకు, శాస్త్ర విజ్ఞాన పరిశోధకుల సహకారం అవసర మని నమ్మి, ప్రఖ్యాత శాస్త్రజ్ఞుల సంతకాలతో, ప్రభుత్వాలకు విజ్ఞప్తులు పంపు తున్నాడు రసెల్ పంశోధకులు రెండు విషయాలు గుర్తించాలి. యుద్ధం రేగినప్పుడు, ఇరుపక్షాలవారు, తెల్మో న్యూక్లియర్ - మారణ యంత్రాలని వాడి తీరుతారన్నది వొకటి; అట్లాంటివి వాడిన పక్షంలో, వొకరు నెగ్గడం, వొకరు ఓడటం అంటూ వుండక, సర్వనాశన మౌతుందన్నది, రెండోది. వీటిని వాడితే కమ్యూనిజమ్ నెగ్గుతుందనలేము పాశ్చాత్యులుకోరే విజయం సమకూరు తుందనలేము; ఆసియా, ఆఫ్రికా దేశాలు స్వతంత్రంగా, హాయిగా ఉంటాయన లేము; రేడియో ప్రేరితమైన మేఘాలు, సరిహద్దులనీ, తటస్థ రాజ్యాల హక్కులని గమనించవు.

"మానవుడిగా నీ విధి - యుద్ధానికి చేయూత నియ్యకపోవడం. ప్రాక్ పాశ్చాత్య దేశాల ప్రభుత్వాలు మారణ యంత్రాలు శత్రువులని మాత్రమే నాశనం చేస్తాయన్న తప్పుడు ప్రచారం చేస్తున్నారు. వాటి బారి నుండి తప్పించు కోడానికి తీసుకోవల్సిన చర్య లేవో, రష్యా ప్రభుత్వం తమ పత్రికలో ప్రచు రించడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది అమెరికా, బ్రిటన్లలో కూడా, మారణ యంత్రాల ఆపదను తొలిగించే, పద్ధతులు తెలియపర్చడం కూడ ఇట్టి అవివేకమే తెలిసుండి వీరిట్లా చేస్తున్నారనుకోను అజ్ఞానం వల్ల ఈ ప్రచారం చేస్తున్నారు "

## విజ్ఞాన శాస్త్రజ్ఞులకు విజ్ఞప్తి :

హైడ్రొజన్ బాంబ్‌లతో యుద్ధం ఎంతటి ప్రమాదకరమైందో ప్రజలు గుర్తించలేకపోతున్నారు నగరాలు నాశనమౌడం మట్టుకే ననుకుంటున్నారు. ఎటామిక్ బాంబ్ హిరోషిమా పట్నాన్ని దగ్ధం చేసింది కాని హైడ్రొజన్ బాంబ్, లండన్, న్యూయార్క్, మాస్కో వంటి పట్నాలను రూపం లేకుండా చెయ్యగలదు. యుద్ధం జరిగి, లండన్, న్యూయార్క్, మాస్కోల వంటి పట్నాలు నాశనమవడం మట్టుకే కాదు, జరిగే ఘోరం బికినిరలో జరిగిన శోధన ఫలితంగా, ఈ బాంబ్ యొక్క విధ్వంసక ప్రభావం, దూరంగావున్న ప్రాంతాల పైకూడా ప్రసరింపగలదని తెలుస్తుంది. హిరోషిమాని ధ్వంసం చేసిన బాంబ్

కంటే, 25 వేల రెట్ల శక్తి గల బాంబ్‌ని తయారు చేయవచ్చునట. దాన్ని పేల్చినట్లయితే, రేడియో ప్రేరణ కణాలు వర్షంగానో, నుసిగానో, భూమిపై వ్యాపిస్తాయి. ప్రమాదం సంభవించే పరిసర ప్రాంతాలలో లేరనుకున్న జపాసీయ బెస్తవాళ్ళకి, వారి చేపలకీ, ఈ యంత్రం పేల్చగా రేగిన నుసి అంటువ్యాధల్లే పాకింది. ఈ బాంబ్‌ని ప్రేలిస్తే. సర్వనాశనమై మానవ జాతే పరిసమాప్త మౌతుందని, అందరూ అంగీకరిస్తున్నారు. "యుద్ధాన్ని మానేద్దామా? కొనసాగించి, మానవ జాతిని నిర్మూలిద్దామా? ఇదే మన సమస్య ఈ గోళంపై మానవుడు వది లక్షల సంవత్సరాలు వర్ధిల్లాడు గత ఆరువేల సంవత్సరాలలోనూ అద్భుత మైన పనులను చేశాడు. అంతకు ముందు, యుగ యుగాలుగా, సూర్యోదయం, అస్తమయం, చంద్రోదయం, అమావాస్య, తారకలు మెఱవడం కొనసాగుతూ వున్నా; మానవుడు వొచ్చాకనే వాటిని అర్థం చేసుకోడం సాధ్యపడింది. ఒహు విశాలమైన ఖగోళ శాస్త్రంలోనూ బహు చిన్నదైన అణువులోనూ వున్న రహస్యాలని మానవుడు శోధించాడు. కళ, సాహిత్యం మతం, వీటిల్లో మహోన్నత శిఖరాలని అందుకున్నాడు, గావున, మానవ జాతిని వుంచొచ్చు అనిపిస్తుంది. ఈ మనిషి ఆ మనిషి గురించి ఆలోచించి, అసలు మనిషిని గురించి ఆలోచించలేని వారికోసం ఇదంతా నశింపు కావల్సిందేనా! కమ్యూనిస్టులు, వారిని వ్యతిరేకించే వారూ – ఎవ్వరూ మిగలరు కమ్యూనిజమ్ అంటే ఏమిటో తెలియని, జంతు కోటీ మిగలదు "

ఈ వ్యాసంలో మరికొన్ని భాగాలు :

"ఇంగ్లీషువాణ్ణిగా కాక, యూరప్ దేశస్థుణ్ణిగా కాక, మనిషిగా మాట్లాడు తున్నాను. ఈనాడు ప్రపంచం కలహాలతో నిండి వుంది. యూదులు, అరబ్బులు, ఇండియావారు, పాకిస్తానీయులు, తెల్లవారు, నీగ్రోలు, కమ్యూనిస్టులు, వారి వ్యతిరేకులు, మనందరం నశింపవుతాం గావున, స్పర్థలు దిగమింగి, కలిసి, సహకరించి ఈ ఆపదను తొలగిద్దాం మనిషిగా కోరుతున్నాను మీ మానవత్వం విడనాడకండి, విడనాడితే సర్వనాశనం. విడనాడకపోతే, స్వర్గం "

## వివిధ విషయాలు :

అపురూపమైనవీ, అసాధారణమైనవీ వివిధ విషయాలపై రసెల్ ప్రకటించిన భావాలు ఛలోక్తులు, సూక్తులు ఎన్నో వున్నాయి వాటిలో నా కిష్టమైన కొన్నింటిని మాత్రం వ్యాఖ్యానం లేకుండా పొందుపరచి రసెల్ భావాల పరామర్శ ముగిస్తాను.

"దృఢనిశ్చయంతో, అక్కరతో చెప్తున్నాను, పని చెయ్యడం ఒక పవిత్ర

మైన విధిగా భావించడంవల్లనే ఆధునిక ప్రపంచంలో ఎంతో హాని జరుగుతోంది; అందరూ కూడబలుక్కుని పనిచెయ్యడం తగ్గిస్తే సౌఖ్యం సమకూరుతుంది."

"చారిత్రికంగా చూస్తే తమ శ్రేయస్సుకోసం పాలకులు ఇతరులను పని చెయ్యమంటూ వచ్చారు."

"యువకులు సినిమాలు చూసి పాడైపోతున్నారు అన్న పెద్దలే సినిమా రంగంలో జరిగే పనిని, లాభం తెస్తుంది గావున, మెచ్చుకుంటున్నారు "

"లాభం సమకూర్చక, నిరుపయోగమైన పరిజ్ఞాన సముపార్జనలో ఎంతో ఆనందం వుంది. 'ఆప్రికాట్' పండ్లు మొదట చైనాలో పండించేవారుట కనిష్క చక్రవర్తి వాటిని ఇండియాలో పండించాడుట. అవి, ఇండియా నుండి పర్షియా వెళ్ళాయిట. అక్కడనుండి కీశ. మొదటి శతాబ్దంలో రోమ్ సామ్రాజ్యం చేరాయిట. 'ఆప్రికాట్' అన్న పదం, త్వరితంగా పండుతుంది గావున – లాటిన్ భాషలో 'ప్రికోషన్' అనే పదాన్నుంచి వచ్చిందిట. భాషాపరిణామంలో తప్పుడు సూత్రంవల్ల ఆ మాటకు 'ఏ' అనే అక్షరం చేర్చారుట. ఈ విషయాలు తెలుసుకున్నాక ఆ పండు మరీ తియ్యగా వుందిస్మాండి?"

"ఎంతవరకూ తెగించి చెయ్యగలరో అంత అపకారమూ, ఎంతవరకూ తప్పనిసరిగా చెయ్యాల్సివొస్తుందో, అంతటి మంచిపీ, చేస్తారు మనుషులు."

"నువ్వు ఒక విషయాన్ని పూర్తిగా నమ్మనంతవరకూ నువ్వు ఏ విషయం నమ్మినా ప్రమాదం లేదు."

"ఎబ్బే, వీడికి లోకజ్ఞానం లేదురా! అని నిన్ను గురించి నలుగురూ చెప్పుకోవాలంటే, కాస్తంత లోకజ్ఞానం వుండాలి నీకు "

"తమని గురించిన నిజం ప్రజలు సహించరు. ఉత్తప్పుడు ఆ సత్యాలని ఎవరేనా బయటపెడితే వారిని మంచీ చెడ్డా తెలియని అవివేకి అంటారు. యుద్ధ కాలంలో బయటపెడితే అది మహా అపరాధం."

"ఆధునికులు కుబేరుణ్ణి పూజిస్తున్నారు. ఇది మంచిదికాదు ధనికవర్గాలు పాలించిన శతాబ్దాలలో ధనిక కుటుంబంలో పుట్టడమే గొప్ప. పారిస్‌లో చిత్రకారుడు ఘనుడు. జర్మనీలో పండితుడికే గౌరవం. ఇండియాలో యోగి ని ఆరాధిస్తారు చైనాలో గురువులను. వీరెవ్వరిలో డబ్బు కాపీర్నం వున్నట్టు కనబడదు."

"సంఘంలో మంచివారుగా చలామణి అయ్యే వ్యక్తులవల్ల ఎంతో అపకారం జరుగుతుంది యువకుడుగా, వర్డ్సువర్త్ కవి, ఫ్రెంచి విప్లవాన్ని మెచ్చుకున్నాడు. ఫ్రాన్సుదేశం వెళ్ళి అక్కడ ఒకామెతో కామకలాపం జరిపి, బిడ్డను

పొంది, గొప్ప కావ్యాలు వ్రాశాడు. అంటే యవ్వనదశలో అతను చెడ్డవాడు తర్వాత మంచివాడయ్యాడు. ఆ ప్రేయసినీ, బిడ్డనీ పరిత్యజించి, స్వదేశం వచ్చి, మంచి రాజకీయ సిద్ధాంతం అలవరుచుకుని, తుక్కు కావ్యాలు వ్రాశాడు."

"అధికారంలో వున్నవారికి వచ్చే భావాలు గలవాడే మంచివాడుగా చలామణి అవుతున్నాడు."

"మనం పడే బాధలకి ఎవరో కారకుడు అవాలి. ద్వేషించేటందుకు వాడు మనకి కావాలి. ధరలు పెరిగినందుకు కారకుడు నల్లమార్కెట్టు వ్యాపారి; ధరలు తగ్గినందుకు కారకుడు భూస్వామి."

"నమ్మకకు అవసరమైన దృఢ విశ్వాసం కాదు, మనకు కావల్సింది: అసలు విషయం ఏమిటో కనుక్కోవాలన్న తృష్ణే కావాలి. ఇది మొదటిదానికి విరుద్ధం."

"కళాకారుణ్ణి మనం గౌరవిస్తాం — కాని దూరంగా అట్టే పెడతాం "

"మొనకి కత్తి తగిల్చిన తుపాకీపై కూర్చోడం తప్ప ఏదిపడితే అది చెయ్యవచ్చునన్నాడు నెపోలియన్. ఆ మినహాయింపు అక్కర్లేదని ఋజువు చేశాడు లెనిన్."

"రాత్రి నిద్ర పట్టనివాడు అదో 'గొప్ప'గా పైకి చెప్పుకున్నట్లు సుఖంగా లేని వాళ్ళు తమ అసౌఖ్యాన్ని గర్వంతో ప్రకటిస్తారు."

"అన్ని గొప్ప గ్రంథాలలోనూ విసుగు పుట్టించే భాగాలు వుంటాయి. ఏ మహా వ్యక్తి జీవితంలోనూ అన్నీ రసవత్తర ఘట్టాలు కానట్టు."

"మొదటి పేజీ నుంచి చివరి పేజీ వరకూ అద్భుతంగా సాగిపోయ్యే నవల, గొప్ప నవల కాదు."

"విషయము, నమ్రత అంత మంచి లక్షణాలు కావు. అవి గలవారికి అస్తమానూ నచ్చచెప్పి, ధైర్యం చెబుతూ వుండాలి ఈ విషయం వల్ల, చేసే పనులు కూడా వారు చెయ్యలేకపోతున్నారు."

"ఎక్కడో నువ్వొక ఉపన్యాసం చేస్తావు. అక్కడ ఫోటోగ్రాఫులు తీసి పత్రికలో వేస్తారు. ఆ ఫోటోలో నువ్వు ఉండవు. మిగతావాళ్లు అంతా ఉంటారు. దీనికి కారణం ఏమిటి? ఆ మిగతావాళ్లు నీకంటే ప్రముఖులు కారు. ఆ పత్రికా సంపాదకుడు నీ ఫోటో వెయ్యడానికి వీలు లేదు అని చెప్పి వుంటాడు. ఎందుకల్లా చెప్పాడు? నువ్వు చాలా ముఖ్యుడవు — నువ్వంటే వారికి బెదురు ఈ విధంగా నిన్ను కించపరిచిన ఘట్టాన్ని, నీకు జరిగిన మర్యాదగా, ఊహించి ఆత్మవంచన చేసుకుంటున్నావు."

"ఇరుగుపొరుగువారి మెప్పుపొందడంకోసం నీకున్న డబ్బుతో నీకొవల్సిన వస్తువులు కాక, వారు మెచ్చుకునే వస్తువులు కొంటావు ఉదాహరణకి మోటార్ కారు. కాని నీకు, కావల్సింది, మోటారు కారు కాదు పుస్తకాలు బెంగపడద్దు, చివరికి ఇరుగు పొరుగు వారు, పుస్తకాలు కొన్న నిన్నే మెచ్చుకుంటారు."

"రైలు అందక వెళ్ళిపోతే విసుక్కుంటారు కొందరు వంటకం పాడైతే ఎగిరి పడతారు కొందరు. పొగచూరు మూసుకుపోతే క్రోధిస్తారు కొందరు. స్టీము యంత్రంలో శుభ్రపరిచిన బట్టలు రాకపోతే మొత్తం పారిశ్రామిక వ్యవస్థనే ఆడిపోస్తారు కొందరు. ఇట్లాంటి స్వల్ప విషయాలపై ఆగ్రహించిన శక్తులతో ఒక సామ్రాజ్యాన్ని నిర్మించవచ్చు – కూలదోయవచ్చు.

"మానవుడి జీవితం ఒక నది లాంటిది. మొదట ఒక చిన్న నీటిపాయగా బయలుదేరి గట్ల నడమ ప్రవహిస్తుంది. పెద్ద రాళ్ళ మీద నుంచి పడుతుంది. జలపాతాలు జరిగాక నది వెడల్పు అవుతుంది గట్లు ఎడమవుతాయి నీరు ప్రశాంతంగా ప్రవహిస్తుంది తన వ్యక్తిత్వాన్ని గోల్పోయి సముద్రంలో కలిసి పోతుంది . ఇల్లా జీవితాన్ని దర్శించిన వ్యక్తికి మృత్యువు పట్ల భయం వుండదు అతను తలపెట్టిన పనులు మరొకరు పూర్తి చేస్తారు నేను చెయ్యలేని పని మరొకరు చేస్తారు చెయ్యగలిగిన దాన్ని చేశానన్న సంతృప్తితో నేను నిష్క్రమించడానికి సిద్ధంగా వున్నాను "

రసెల్ తలపెట్టిన విశ్వశాంతి అనే యజ్ఞం ఆయన జీవించి ఉండగానే ఫలిస్తుందని ఆశిద్దాం.

# సోమర్‌సెట్ మామ్ - ఆయన కథాప్రపంచం

'నాకేమన్నా వాంఛలూ, కోర్కెలూ వుంటె, అవి ఏనాడో తీరాయి. నేను చెప్పదల్చుకున్నదంతా చెప్పివేశాను - తప్పుకుని మరో తరంవారికి చోటివ్వడం మంచిది. నేను చెయ్యదల్చుకున్నవన్నీ చేసేశాను - ఇంక నోరు మూసుకుని వుండటం మంచిది. ఈ రోజుల్లో ఏదో ఒక రచన చేస్తూ పాఠక లోకంతో బంధం ఏర్పరుచుకోకపోతే ఆ రచయితని మరిచిపోడం జరుగుతుం దంటారు. ఇది నిజమే. అందుకు నేను సంసిద్ధుడనే. నే చనిపొయ్యాక, టైమ్స్ పత్రికలో పడ్డ వినుతివాక్యం చదువుకుని, ఎవరన్నా "ఈయన ఇంకా బ్రతికే వున్నాడా - ఎప్పుడో చనిపొయ్యాడనుకున్నానే!" అన్నప్పుడు, "భూతంగా మారిన నేను, మెల్లగా నవ్వుకుంటాను.' అని సోమర్‌సెట్ మామ్, 'రచయిత నోట్‌బుక్' అనే గ్రంథానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో చెప్పుకున్నారు. అది వ్రాసి నప్పుడు ఆయన వయస్సు డెబ్బైఐదు. అది వ్రాసి పదహారు సంవత్సరాలైంది. 1965 డిశంబరు పదహారవ తేదీని ఆయన తనువు చాలించాడు ప్రపంచమంతటా శ్రద్ధాంజలులు అర్పిస్తున్నారు. భూతంగా ఆయన మెల్లగా కొనసాగించే నవ్వే నాకు వినబడుతూనే ఉంటుంది నోబెల్ బహుమానం ఆయనకు రాలేదు మరి!

ఆయనకి ఆ గౌరవం జరగలేదని బాధపడేవారిలో నే నొకణ్ణి కథా రచనలో, ప్రపంచ రచయితలలో మామ్ అగ్రగణ్యుడనడానికి సందేహించను నేను. ఆయన జీవిత విశేషాలను గురించి, ఇతర రచనల్ని గురించి క్లుప్తంగా చెప్పి, కథారచనా విధానాన్ని పరామర్శించడానికి ఈ వ్యాసం తలపెట్టాను.

విలియమ్ సోమర్‌సెట్ మామ్, 1874, జనవరి 25 వ తేదీన పారిస్‌లో జన్మించాడు ఆయన తాత ముత్తాతలకిమల్లె, ఆయన తండ్రికూడా న్యాయవృత్తినే స్వీకరించి, బ్రిటిష్ రాయబారి కార్యాలయంలో సలహాదారుగా పనిచేసేవాడు ఆయన ఎన్నెన్నో దూరదేశ యాత్రలు చేశాడు. దిష్టి తగలకుండా, అరిష్టాన్ని వారించే ఒక గుర్తుని - ఒంపుతిరిగి ఏసు సిలువను స్ఫురింపచేసే గుర్తు -

మొరాకో నుండి తెచ్చాడు. ఈ గుర్తునే తన పుస్తకాలపైనా, ఇంటిముందూ, వాడుతూ వొచ్చాడు మామ్ మామ్ తండ్రి కురూపి; తల్లి సౌందర్యవతి. వారిని ఇరుగు పొరుగువారు 'మృగము — సౌందర్యము' అని ఛలోక్తిగా వ్యవహరించే వారుట. మామ్ తల్లి ఆరుగురు పిల్లల్నికని, ముప్పైఎనిమిదవఏట చనిపోయింది. అప్పుడాయన వయస్సు ఎనిమిది. రెండేళ్ళతరువాత, ఆయన తండ్రి చని పొయ్యాడు ఇంగ్లండ్‌లో మతగురువుగా ఉంటున్న మామయ్య — హెన్రిమామ్ — దగ్గర చదువుకుంటూ ఆరేళ్ళు గడిపాడు మామ్. సరైన ఆదరణ, పోషణ లేక, ఆయన బాల్యం, కష్టాలతో కూడివుంది. ఆయనకి నత్తివుండేది — పెద్దయ్యాక, చికిత్సవల్ల అది తగ్గిందట — తోటి బాలురు దాని అదనుగా వెక్కిరించి హేళన చేస్తూ ఉండడంవల్ల స్నేహంలో మాధుర్యం ఆయనెరుగడు.

పదమూడవఏట కాంటర్‌బరీ పాఠశాలలో చేరాడు. కాని క్షయవ్యాధి చిహ్నాలు పొడసూపడంతో, చదువునిలిపి, చికిత్సకై ఫ్రాన్సులో తొమ్మిది నెలలు గడిపాడు పదిహేడవఏట హీడెల్‌బర్గ్‌లో ఒక జర్మన్ కుటుంబంవారితో వుండి, చదువుకున్నాడు. విశ్వవిద్యాలయంలో చేరకపోయినా, క్యూనోఫిషర్ తత్వాన్ని గూర్చిన ఉపన్యాసాలు శ్రద్ధతో వినేవాడు. మతంపట్ల గురితగ్గడం ఇప్పుడే ప్రారంభమైంది. మామయ్య కఠినుడు, పీనాసి, సోమరి మతగురువులో వుండవల్సిన, ఔదార్యం, ప్రేమ ఆధ్యాత్మిక చింతన ఆయనలో లేకపోవడం మూలాన, మతగురువులంతా ఇంతేననుకున్నాడు. నత్తి పోగొట్టమని ప్రతిరాత్రీ దైవాన్ని ప్రార్థించేవాడు మామ్ దైవం ఇవ్వలేదు. దైవంలో నమ్మిక పోడానికి ఇదొక కారణం.

1892లో లండన్ సెంట్‌థామస్ హాస్పిటల్ నిర్వహించే వైద్య విద్యాలయంలో విద్యార్థిగా చేరాడు మామ్. ఆంగ్ల, ఫ్రెంచ్, ఇటాలియన్ సాహిత్యాలు, చరిత్ర, విజ్ఞానశాస్త్రం చదువుతూ, ఏకాంకికలు వ్రాస్తూ గడిపేవాడు ఆ రోజుల్లో ఆ నాటకాలను, రంగస్థల నిర్వాహకులు స్వీకరించలేదు. రెండు, మూడు నవలలు వ్రాసి, పేరు తెచ్చుకుంటే తప్ప, నాటకాలు చలామణి కావని భావించి, రెండు నవలికలు వ్రాశాడు. ఫిషర్ అన్విన్ అనే ప్రచురణకర్త వీటిని స్వీకరించలేదు. ఏదన్నా పెద్ద నవల వుంటే, ఇవ్వమన్నాడు వెంటనే నవల ప్రారంభించాడు మామ్. హాస్పిటల్ ప్రసూతిశాఖ గుమాస్తాగా, మురికిపేటలు సందర్శించి, అరవై మూడు పురుళ్ళు పోసిన అనుభవం గడించాడు. బీదల జీవితాన్ని జాగ్రత్తగా పరిశీలించే అవకాశమూ అప్పుడే కలిగింది. కాయకష్టంపై బ్రతికే బీదల్ని గురించి ఆరర్ మారిసన్ అనే ఆయన వ్రాసిన నవల — 'చైల్డ్ ఆఫ్ ది జోగో'—

జనాన్ని ఆకర్షించింది. కల్పన చెయ్యకుండా, తను విన్నదీ, చూసినదీ – డాక్టరు రోగిని పరిశీలించే విధంగా – వ్రాసి పూర్తిచేసిన మొదటి నవల 'లిజ ఆఫ్ లాంబెత్'. 1897 అక్టోబర్‌లో ఈ నవల వెలువడింది.

లిజా అనే బీద కన్య పాపకార్యాలు చేసి చనిపోతుంది. పశ్చాత్తాప పడదు. పాపానికి ఫలితం మృత్యువు అన్న ధ్వని ఈ నవలలో లేదు నీతి పాఠాలు లేవు. పాత్రల అంతరంగ భావాల చిత్రణ లేదు. భావగర్భితమైన ఉద్రేక ప్రకర్ష లేదు. పాత్ర చెప్పేదీ, చేసిందీ – పైకగపడే వీటిని మాత్రం వర్ణించడం జరిగింది ఇందులో – పైకి అగుపడే చిహ్నాలని బట్టి, వ్యాధి ఏదైందీ వైద్యుడు నిర్ణయించే ధోరణిలో వాడిన భాష, ఆ పాత్రలు నిత్యమూ మాట్లాడే వ్యావహారికమే – ప్రాంతీయంలో వుండే వైవిధ్యానూ, వేగమూ, సంభాషణలకి పదును కల్పిస్తాయి ఆనాటివారు, 'కడుపు' అన్న పదానికి అభ్యంతరం చెప్పడం, ఆ మాటని తీసివెయ్యడం జరిగిందిట. ఈ నవల పాఠకుల్ని ఆకర్షించింది. సమీక్షలు కూడ మొత్తం మీద ప్రోత్సాహకరంగానే ఉన్నాయిట సంప్రదాయ సాహితీవేత్త ఎడ్మండ్ గాస్ కూడా ఈ నవలను మెచ్చుకున్నాడుట. పదేళ్ళు జరిగి చాలా రచనలుచేసి పేరు తెచ్చుగున్న మామ్‌ని కలుసుకున్నప్పుడు "ఆ ఒక్క మంచి నవలా వ్రాసి ఊరుకోడం బాగుండదబ్బాయ్!" అన్నాడుట గాస్.

ఆ రోజుల్లోనే, తాను గమనించిన వింతలనూ, విన్న చమత్కార భావాలనూ, నోటుబుక్కులో వ్రాసుకోడం మొదలెట్టాడు మామ్. ఆయన డెబ్బై ఏడవ ఏటికి, యివి పదిహేను నోటుబుక్కులయ్యాయి. వీటిని సంక్షిప్తపరచి 'రచయిత నోట్‌బుక్'గా వెలువరించాక ఆయన కొత్త రచనలేవీ చెయ్యలేదు.

వైద్య విద్యాలయంలో ఐదేళ్ళు చదివి, 1897 లో వైద్య వృత్తి పట్టా పుచ్చుకొని డాక్టర్ మామ్ అయ్యాడు కాని వైద్య వృత్తిని విడిచేసి, సాహిత్య రంగంలో విజయం సాధించాలని నిర్ణయించుకుని, నవలారచన కొనసాగించాడు. 'యోగి పుట్టు పూర్వోత్తరాలు' అన్న నవలలో, తనే 'నేనుగా' కథ చెప్పడం జరుగుతుంది. 'నేను'గా కథ చెప్పడమే. కథా రచనకి మామ్ సమకూర్చిన ప్రత్యేకత

స్పెయిన్ దేశంలో ఏడాది గడిపి, రోమ్‌లో ఉండగా, 'ఎ మాన్ ఆఫ్ ఆనర్' అన్న మొదటి రంగస్థల నాటకం పూర్తి చేశాడు మామ్ ఇంగ్లండ్ వొచ్చాడు ఆయన నవలలు ప్రజామోదం పొందకపోయినా, విమర్శకులు,

'ఫరవాలేదు, బాగున్నాయి' అనడం, ధనిక వర్గాలవారు ఆదరం చూపి, పార్టీలకి ఆహ్వానించడం జరిగింది. 'మిసెస్ క్రాడక్' అనే నవల 1902 లో వెలువడింది. ఇందులో డబ్బుండి, పెద్ద కుటుంబానికి చెందిన క్రాడక్ అనే ఆమె. తక్కువ అంతస్తు వాడైన ఒక పంటకాపుని ప్రేమించి పెండ్లిచేసుకుంటుంది ఆ వివాహం నెగ్గదు. ప్రేమ నశిస్తుంది. శక్తులన్నీ ఉడిగి ప్రేమ చావడంలో విషాదం వున్నా, మానసిక స్వేచ్ఛని పొందాను కదా అన్న అహ్లాదంతో ఆమె సంతృప్తి చెందుతుంది. మొగుడు, గుర్రం మీద నుండి పడి చనిపోతాడు.

1903 లో రంగస్థల సమాజంవారు, మామ్ వ్రాసిన 'ఏ మాన్ ఆఫ్ ఆనర్" (గౌరవనీయుడు) అనే నాటకాన్ని స్వీకరించి ప్రదర్శిస్తారు; తన సంపర్కంవల్ల పని మనిషి గర్భం ధరిస్తుంది. కాబట్టి ఆమెను వివాహమాడతాడు గౌరవనీయుడు - ఇదీ ఈ నాటకంలో ఇతివృత్తం తర్వాత రెండేళ్ల పారిస్‌లో గడిపాడు మామ్ పారిస్‌లో చాలామంది చిత్రకారులతో, రచయితలతో పరిచయం ఏర్పడుతుంది. 1905 లో స్వదేశానికి తిరిగి వొస్తాడు. ఏ కొద్దిమంది తెలివైనవారో మెచ్చుకోడం మినహా, రచనల ద్వారా తానాశించిన డబ్బు రావడంలేదు. డబ్బు ఆరవ ఇంద్రియం లాంటిది. అది వుంటేనేగాని మిగత పంచేంద్రియాలూ పని చెయ్యవని తెలుసుకని, హాస్యపూరితాలైన సుఖాంత నాటకాల రచన సాగించాడు. నిర్వాహకులు, నటులు సూచించిన ప్రకారం, మార్పులు చేసేవాడు. ఒక నాటకం 'లేడి ఫ్రెడెరిక్' అనేది చింతామణి నాటకం చివరి రంగంలో తన నిజ స్వరూపం చూపినట్లు ఇందులో లేడి ఫ్రెడెరిక్, యువకుడైన ఒక ప్రియుడి ముందు, తన వేషం, "మేకప్' తీసేసి, అసలు వాలకం బైట పెడుతుంది అనాటి నటీమణులు, ఈ వేషం వెయ్యడానికి ఇష్టపడలేదు. మరి రెండు నాటకాలని వ్రాశాడు వీటినీ ఎవ్వరూ ఆడలేదు. మధ్యలో అనువైన నాటకం దొరక్క, ఓథో స్టూవార్ట్ అనే మేనేజర్ 'లేడి ఫ్రెడరిక్' నాటకాన్ని 1907 లో ప్రదర్శించాడు ప్రధాన పాత్ర మేకప్ తీసేసి నిజ స్వరూపం బైట పెట్టిన ఘట్టమే ప్రేక్షకుల్ని ఆకర్షించింది. దిగ్విజయంగా ఏణ్ణర్థం ప్రదర్శించబడింది ఈ నాటకం. మరొక ఆరు మాసాలలో, మరో నాలుగు నాటకాలు ప్రదర్శించబడ్డాయి. మామ్ ఆశించిన ఒక ఫలితం సిద్ధించింది. నాటకాల వల్ల చాలా డబ్బు సంపాదించాడు డబ్బుతో స్వేచ్ఛ

మామ్‌కి దేశాటనంటే ఇష్టం. వచ్చిపడ్డ ధనంతో తన కిష్టమైన పనులు చెయ్యకలిగాడు. 1908 లో గ్రీస్ దేశం పర్యటించాడు. 1911 లో మే ఫేర్‌లో సొంతిల్లు కట్టుకున్నాడు. పదిమందినీ పిల్చి పార్టీ లివ్వసాగాడు ఆయన

నాటకాల్లో ప్రధాన పాత్ర ధరించిన బిల్లీబర్క్ అనే నటీమణి; అతిథిగా వొచ్చి ఇంటిని మెచ్చుగుంది. "నీకు నచ్చి తీరాలి – నీ డబ్బుతో కట్టిందే" అన్నాడుట మామ్. ఆయన 1893 – 1933 మధ్య ముప్ఫై నాటకాలు వ్రాసినా, పద్దెనిమిది మాత్రమే గ్రంథాలుగా వెలువడ్డాయి.

ఇవి అమెరికాలోనూ, ఇంగ్లండ్‌లోనూ ప్రదర్శించబడి, ప్రేక్షక జనం మన్ననల నందుకున్నవి. 'ది సర్కిల్' అనేది ఆయన ఉత్తమ నాటకంగా ఎన్నిక చేస్తారు విమర్శకులు. ఈయనవన్నీ వినోదాన్ని కలిగించేవే; గంభీరంగా, బరువుగా సాగి, పది కాలాలపాటు నిలబడే నాటకాలు వ్రాయలేడనుకుంటారని కాబోలు, కొన్ని విషాదాంత నాటకాలు వ్రాశాడు. ఒకటి యుద్ధానికి సంబంధించినది యుద్ధంలో గాయపడి ఇంటి కొచ్చిన ఒక సైనికుడు కుంటివాడై, బైటకి వెళ్ళలేక, ఎప్పుడూ కుర్చీలో గడుపుతూ, భార్య సపర్యలవల్ల, పైకి సంతోషంగా వున్నట్లు కనబడినా, తన స్థితి భార్య వినోదాలకి అంతరాయమని గ్రహించి బాధ పడతాడు ఆమెను స్వేచ్ఛగా తిరగమని కోరతాడు. ఆమె అల్లా చెయ్యే లేదు; తిరగకుండా ఉండనూ లేదు. ఈ పరిస్థితి గమనించి, అతని తల్లి అతనికి విషం పెట్టి చంపుతుంది ప్రేక్షకులు ఈ నాటకాన్ని హర్షించలేదు. మనకి అసలే నచ్చదు. ఉదాత్తంగా సాగిన 'షెప్పీ' అనే నాటకం కూడా దెబ్బతింది. ధనం సంపాదించిపెట్టినా, నాటక రచన మామ్‌కి తృప్తి నివ్వలేదు. కథా రచన లోనే నిజమైన ఆనందాన్ని పొందానంటాడు. మొదటి ప్రపంచ సంగ్రామం ప్రారంభమైన ఏడాదికి "ఆఫ్ హ్యూమన్ బాండేజ్" అనే పెద్ద నవల మొదలెట్టి రెండేళ్ళలో పూర్తి చేశాడు 1915 లో ఇది ప్రచురితమైంది. యుద్ధ కాలంలో ఈ నవలని గురించి ఎవరూ అంతగా పట్టించుకోకపోయినా, కాలం గడిచినకొద్దీ పాఠకులని ఎక్కువగా ఆకర్షిస్తూ, యీనాటికీ ఆంగ్ల సాహిత్యంలో మహోన్నతమైన నవలగా, దాని ఖ్యాతి స్థిరపడిపోయింది.

"నన్ను బాధించే కొన్ని సంఘటనలు, కుంగదీసే అంతరంగం – వీటి నుండి విముక్తుణ్ణవడానికి వ్రాశాను ఈ నవల వ్రాశేసాక బాధ తొలిగింది అంతరంగిక కల్లోలం అధోలోకంనుండి బైటపడ్డాను మానసిక జాడ్యానికి మందులా పనీ చేసింది" అని చెప్పుకున్నాడు మామ్, ఈ నవల్ని గురించి - మానవుడి వ్యవస్థ ఎంతో సానుభూతితో చిత్రితమైంది ఈ నవలలో. ఏ ఇతర రచనలోనూ సాధ్యపడని ఆదర్శతత్వం ఇందులో వ్యక్తం చెయ్యగలిగాడు. ఆయన స్వీయ చరిత్ర ఛాయలున్నాయి ఇందులో చిన్నప్పుడు తను పడ్డ కష్టాలు; బాధలు, నడివయస్సులో స్మరించి, వూహా జగత్తులో సాంకేతికాలుగా వాటిని మార్చి,

కళాసృష్టికి అనువైన సంఘటనలుగా మలచి ఆ అనుభూతిని ఇతరులతో పంచు కోడంలో కృతకృత్యుడయ్యాడు రచయిత. స్వీయ గాథని స్మరించే కల్పనకి పరిపూర్ణత సమకూరదు. తన గతాన్ని, వ్యక్తిత్వాన్ని దిగవిడచి, దూరంగా పారిపోయి, తటస్థంగా తిలకించి, వాటిని భరించగల జగత్తుని కల్పించి, నిజంగా జరిగిన వాటిని, వూహించిన వాటితో పూర్తిగా సమన్వయ పరచగలగడం, చాలా కష్టం, నిజంగా జరిగినవి తమ నీడల్ని ప్రసరింపచేస్తూనే ఉంటాయి. కథని సాగనివ్వవు. అడ్డుకుంటాయి. వాటిని మరిచిపోలేడు రచయిత. ఈసంఘర్షణలో, యదార్థ సంఘటనే నెగ్గుతుంది. కళాసృష్టి కుంటుపడక తప్పదు.

'ఆఫ్ హ్యూమన్ బాండేజ్ – అంటే అర్థం మానవత్వానికి దాసులవడం అన్నమాట. "స్పయినోజా" అనే డేనిష్ తాత్వికుడి రచనలో ఉదహరించిన వాక్యమే ఈ నవల పేరు. మానవుడు, ఉద్రేకానికి బానిస. అతని జీవితాన్ని పాలించేది ఉద్రేకాలే బుద్ధివల్ల, తార్కిక జ్ఞానంవల్ల, మన ప్రవర్తనని నిర్ణయిం చుకోగలమనుకుంటే అది భ్రమ తార్కిక జ్ఞానం నిర్దేశించిన దోవలో నడుచు కోమని పెద్దలు, పిన్నలకి బోధిస్తారు. పెద్దయ్యాక, ఇది అసంభవమని పిన్నలు తెలుసుకుంటారు, అసత్యాలు బోధించిన పెద్దలను నిందిస్తారు.

ఇందులో ప్రధాన వ్యక్తి ఫిలిప్ కేరి. మామ్ వలెనే వైద్య విద్య నభ్య సించి, డాక్టరవుతాడు. తక్కువ అంతస్తుకు చెందిన, మిల్డ్రెడ్ అనే కులటను వాంఛిస్తాడు. ఆమె ఇతన్ని తృణీకరిస్తుంది. బాధపడేటట్లు, ఇతని ముందే నలుగురితోనూ స్వేచ్ఛగా తిరుగుతుంది. ఇతన్ని దగ్గరకు రానివ్వదు ఆమె కులటని, నీచమైన స్త్రీ అని ఇతనికి తెలుసు. తెలిసి కూడా, ఆమెపై వాంఛను వొదులుకోలేడు. ఆమెను పొందడం కోసం, ఎన్ని కష్టాలైనా భరిస్తాడు. శరీర చాపల్యం వల్ల, మనిషి, మరొక వ్యక్తికి బానిస కావాల్సిరావడం, ఇందలి విషాద కథనం. మామ్‌కి నత్తి ఉన్నట్లుగానే, ఫిలిప్ కేరికి ఒంకర పాదం ఉంటుంది. కోపగించినవారంతా, అతన్ని బాధ పెట్టడానికి, 'కుంటి వెధవా' అని తిడుతూ ఉంటారు. భౌతికమైన ఈ లోటు, తోటివారి నుండి అతన్ని దూరం చేస్తుంది. అతనికి ఆదరణ, ప్రేమ, ఆప్యాయత కావాలి. వాటిని అన్వేషిస్తాడు. అవి దొరకవు అతనికి కావల్సినప్పుడు అవి దొరక్కపోవడం విశేషం

మామ్ చిన్నతనంలో ఒకామెను ప్రేమించాడుట. ఆమె మెప్పు పొందా లంటే, డబ్బు గడించాలి. అందుచేత డబ్బు గడించే కృషి చేశాడు కొంత కాలం గడిచి, పేరూ, డబ్బూ సంపాదించాక, ఆమెపట్ల ఇష్టం పోయిందట మామ్‌కి, ఫ్రెంచి నవలాకారుడు మార్సెల్ ప్రూస్ట్ రచనలంటె చాలా ఇష్టం.

"మనకి ప్రేమ లభ్యం కావడంమట్టుకే కాదు ముఖ్యం; అది కావాల్సినప్పుడు దొరకడం ముఖ్యం" అంటాడు ప్రూస్ట్. ఈ నవలలో, తన జీవితాన్ని పాడు చేసుకున్న మిల్‌డ్రెడ్, తనని వెనక ఆరాధించిన ఫిలిప్ కేరి దగ్గరకు చేరుతుంది. ఇప్పు డతనికి ఆమె అక్కర్లేకపోతుంది. ఆదరిస్తాడు కాని వాంఛించడు. ఇందులో కరుణరసం ప్రస్ఫుటమౌతుంది. ఇంక అతనికి కావల్సిన ఆప్యాయత, అనుభూతిని, చిత్రలేఖనంలో పొంద యత్నిస్తాడు. చిత్రకళ అతనికి అలవడదు. స్త్రీ సంపర్కంలో వెదుకుతాడు; తన వంకర పాదం అడ్డు తగుల్తుంది. పుస్తకాలు, సంస్కృతి, కళలు — ఇవేవీ అతనికి కావల్సిన దాన్ని ఇవ్వలేవు. ఆధ్యాత్మిక చింతనలో శాంతిని చూరగొంటాడు "నా కాలుని బాగుచెయ్యి" అని దైవాన్ని ప్రార్థిస్తాడు, మామ్‌కి మల్లె బాగవదు దైవంపై గురి తప్పుతుంది. మత బోధకుడైన మామయ్య చెప్పు చేతల్లో వుంటూ, మామయ్యని ద్వేషిస్తాడు. మామయ్యకి జబ్బు చేస్తుంది — చావడు. చంపాలనుకుంటాడు ఆయన చనిపోతే, ఆయన ఆస్తి తనకే సంక్రమిస్తుంది విరక్తుడై జీవితానికి అర్థం లేదను కుంటాడు, చివరకి, నాగరికతకి దూరంగా వున్న, ఒక సామాన్య కుటుంబం ఇతన్ని చేరదీసి ఆదరిస్తుంది. ఆ కుటుంబంలో ఒకమ్మాయి, ఇతనిపట్ల ప్రేమ చూపెడుతుంది. ఆమెను పెండ్లాడి, శాంతిని పొంది, జీవితంతో సమాధానం కుదుర్చుకుంటాడు.

ఇది చాలా పెద్ద నవల — వెయ్యి పుటలుంటుందేమో నవలగా సంతృప్తి కరంగా లేకపోయినా, ఇది గొప్ప గ్రంథం, ఫిలిప్ కేరీలో మానసిక ఆవేదన మినహా, ఇతర పాత్రలకి అంతరంగ జీవితం ఉన్నట్లు తోచదు. ముందుకుసాగే బలం లేదు కథలో. సామాజిక శక్తుల రాపిడివల్ల ఉత్పన్నమైన సంఘర్షణలేదు. ప్రధాన వ్యక్తి తప్ప, పాత్రలు మానసికంగా పెరగవు. యుద్ధంలో చిక్కుకున్న పాశ్చాత్య దేశాల హాహాకారాలు వినబడకుండా, ప్రశాంతతని అన్వేషించడం, అది ఏదో విధంగా ఒక సామాన్య వ్యక్తికి లభ్యం కావడం, — ఈ గ్రంథంలో విశిష్టత ఆదర్శ తత్వం, అంతరంగ చిత్రణ, ఉద్రేకంతో ఊగిపొయ్యే దైన్యం. ఈ నవలలో దర్శనమిచ్చే యీ లక్షణాలేవీ, మామ్ ఇతర రచనలలో అంతగా కనబడవు. ఇతర రచనలలో వున్న 'మామ్ తత్వం' — విరక్తుడై (cynic) వెక్కిరించే ఉద్దేశంతో జరిపే నిశిత బాహ్య పరిశీలన, మురికి గుంటలో నక్షత్రాల ప్రతిబింబాన్ని చూడాలన్న ఉబలాటం, శిఖరానికి చెయ్యి చాచే వ్యక్తిని లోయ లోకి త్రోసివెయ్యడం, నగ్న సత్యానికి బట్టలు తొడక్క పోవడం — ఈ నవలలో అంతగా కనబడదు అందుకే ఈ గ్రంథం నిలబడుతుంది,

1915 లో విడాకులు పొందిన 'సిరివెల్‌కమ్' అనే ఆమెను పెండ్లాడాడు మామ్ వీరికి ఒక కుమార్తె కలిగింది మొదటి నవల ప్రధాన పాత్ర లిజ — 'ఎలిజబెత్‌కు' సంక్షిప్త నామం — ఎలిజబెత్ అని ఆమెకి నామకరణం చేశారు. వారి యీ దాంపత్యం పన్నెండు సంవత్సరాలు సాఫీగా సాగి, విడాకులు పొంది విడిపొయ్యారు. భార్యకు కొన్ని వేల పౌనులు ఇచ్చాక, వివాహం రద్దైంది. గృహాలంకరణ వృత్తి కొనసాగిస్తూ, భార్య 1955 లో చనిపోయింది కుమార్తె. తల్లితో వుంటూ వొచ్చింది. విన్‌సెంట్ పరపసిని అనే అతన్ని వివాహమాడింది. ఆమె కిద్దరు సంతానం. అమెరికాలో నివాసం ఏర్పరుచుకుంది మొదటి యుద్ధం కొనసాగే రోజుల్లో, మామ్, రెడ్‌క్రాస్ సంస్థలో పని చేస్తూ, ఫ్రాన్స్, బెల్జియమ్ దేశాలలో గడిపాడు. ఈ సమయంలో వ్రాసిన 'మన పెద్దలు' — Our Betters — అనే నాటకం న్యూయార్క్‌లో ప్రదర్శించారు. అక్కడ సంచలనం కలిగింది. పనీ పాటా లేకుండా, ఆస్తుల్ని అనుభవించి, పూసుపోక ప్రేమ కలాపం జరుపుతూ, వ్యభిచరిస్తూ నైతిక పతనం చెందే స్త్రీ పురుషులు ఇందలి పాత్రలు. బాధ్యతారహితులైన వారి జీవితాలు నైతిక అరాజకత్వంలో అంత మొందుతాయన్న గుణపాఠం ఇమిడివుంది. కాని ఆ పాఠం చెప్పివెయ్యడు నాటక కర్త.

శత్రు రాజ్యాల భోగట్టా సేకరణ శాఖలో, గూఢచారుడుగా కొంతకాలం పనిచేసి ఇటలీ, స్విట్జర్లండ్, దేశాలు పర్యటించాడు మామ్ అప్పటి అనుభవాలని పురస్కరించుకొని 'ఎ షెండెన్' అను పేరిట కొన్ని కథలు, గాథలు, వ్రాశాడు.

కల్పితాలైనా, ఈ కథలు యదార్థ సంఘటనలేనని అప్పటివారు నమ్ముతూ, గూఢచారుల శిక్షణ పాఠ్య గ్రంథంగా స్వీకరించారు,దీన్ని. యదార్థ సంఘటనలకి మరీ దగ్గరగా వుండటంవల్ల కాబోలు, కథలుగా ఇవంత ముఖ్యమైనవి కావు తర్వాత, అమెరికా, రష్యా దేశాలు పర్యటించాడు మామ్. దక్షిణ పసిఫిక్ దీవులలో — హవై దీవులు — ఆరు మాసాలు గడిపాడు. ప్రసిద్ధ చిత్రకారుడు పాల్‌గొగెన్ టహిటి దీవిలో వుండి, అక్కడి స్త్రీని పెట్టుకుని, చిత్రలేఖనంలో నిమగ్నుడై, కుష్ఠువ్యాధికి గురై, చనిపొయ్యాడు. టహిటిదీవిలో, యీ చిత్రకారుణ్ణి గురించిన వివరాలు సేకరించి, 'ది మూన్ ఎండ్ సిక్స్ పెన్స్'- చందమామ, ఆరు పెన్నీలు — అనే నవల వ్రాశాడు. ఇందలి ఇతివృత్తం, ఫ్రెంచ్ చిత్రకారుడు పాల్‌గొగెన్ జీవిత విశేషాలను అనుసరించి ఉంటుంది. చిత్రకారుడికీ, తను తలపెట్టిన కళాసృష్టి ముఖ్యం. స్త్రీకి ప్రేమ ముఖ్యం. భర్తని

చీరకొంగుకి కట్టిపడేస్తానంటుంది అల్లా లొంగిపోయినవాడు, కళాసృష్టి చెయ్యలేడు కాబట్టి ఈ నవలలో చిత్రకారుడు, భార్యని, పిల్లల్ని, వొదిలేసి, నాగరిక ప్రపంచాన్ని విస్మరించి, మారుమూలైన దీవిలో వుండిపోయి చిత్రలేఖనం సాగిస్తాడు. చదువు సంస్కారం లేని ఆ ప్రాంతం కన్యతో గడుపుతాడు. అతిశయోక్తితో, ప్రచండ వేగంతో సాగుతుంది ఈ నవల శైలి. అనుమానం వున్నవాడు, గట్టిగా బల్లగుద్ది చెప్పినట్లు, వాక్యాలు, పాదాలకి పొడుగాటి కర్రలు తగిలించుకొని వాటి మీద నడిచినట్లు సాగుతాయి. చివరలో కొన్ని భాగాలు విసుగుపుట్టించినా, శక్తివంతమైన రచనవల్ల, చివరంటా చదవకుండా వుండలేము. చందమామకై చేతులు చాచి, పాదాల దగ్గరున్న 'అరణా'లను ఒదులుకుంటామన్న ధ్వని వుంది, ఈ నవల పేరులో.

పాశ్చాత్య నాగరికతలో దగా, కుతంత్రం, అసహజమైన విలువల అన్వేషణ, వున్నాయనీ, మానవుడు పూర్తిగా వికసించి తన శక్తులన్నింటినీ వినియోగించి ప్రయోజనాన్ని సాధించాలంటే అది యీ నాగరికత కప్పిన ముసుగులో పడిపోయిన వారికి సాధ్యం కాదన్న భావం వుంది ఈ నవలలోనూ, మామ్ ఇతర రచనలలోనూ. ప్రకృతిలోకి పారిపోయి, సహజంగా, స్వేచ్ఛగా జీవిస్తూ ఆనందాన్ని పొందడమే పరమావధి అన్న పాఠం డి. హెచ్. లారెన్స్ నవలల్లోనూ కనబడుతుంది. ఇది అప్పటివారికి రుచించినట్లు లేదు. లారెన్స్ వలసపోయి, ఇల్లూ వాకిలీ లేక దేశ దేశాలు తిరుగుతూ, వ్యాధిగ్రస్తుడై, చనిపొయ్యాడు. మామ్ రచనలకి స్వదేశమైన ఇంగ్లండులో పలుకుబడీ, ఆదరణా లేవు.

దక్షిణ దీవుల పర్యటన చేస్తూనే, మామ్, 'పొగొ పొగొ' అనే చోట, ఒక వారం గడపాల్సి వచ్చింది అట్లమ్మ చెలరేగిందిట. అది తగ్గేవరకూ ఎవరూ ఓడలోకి పోకూడదన్నారట. అందుకని యాత్రీకులు అక్కడ వారం గడిపారు. ఆ యాత్రీకులలో, ఒక మత ప్రచారకుడు, ఆయన భార్య, వేశ్య వృత్తిలో వున్న ఒకామె, వున్నారు. ఈమెను గురించి మామ్ వ్రాసిన 'వర్షం' (Rain) అన్న కథ ప్రసిద్ధి పొందింది. ఆయన కథలన్నింటిలోకీ ఉత్తమమైందిగా దీన్ని ఎన్నిక చేశారు, విమర్శకులు. దీన్ని నాటకంగా ప్రదర్శించారు. సినిమా చిత్రంగా తీశారు.

క్షయ వ్యాధికి గురై రెండు మూడు సంవత్సరాలు చికిత్స నిమిత్తమై నర్సింగ్ హోమ్‌లో గడిపి, బాగైనాక, 1920 లో మామ్ చైనాదేశ యాత్ర చేశాడు. 1921 లో, మలే స్టేట్స్, ఇండో చైనా తర్వాత, జావా దీవులు,

ఆస్ట్రేలియా దేశాలు, 1923 లో దక్షిణ అమెరికా, 1924 లో బోర్నియో, సయామ్‌లు, 1935 లో ఇండియా దేశాలు పర్యటించాడు ఆయా దేశాల నుండి కథలకి, నవలలకీ అనువైన వస్తువు సేకరించాడు. తాను చూసిన వాటిని వర్ణిస్తూ, కొన్ని యాత్రాగ్రంథాలు వ్రాశాడు మామ్ మొదటిది అండలూసియా ప్రాంతం గురించినది. ఆంగ్ల గద్య రచయితలైన హాజ్‌లిట్, బర్క్, న్యూమన్, మాత్యు ఆర్నాల్డ్ రచనలు ఈయనకి ఇష్టం. వారి శైలిని బాగా పరిశీలించి, తన శైలి ధోరణి ఎట్లాంటిదో తెలుసుకునేందుకు యీ పుస్తకం వ్రాసినట్లు తోస్తుంది. రెండోది స్పెయిన్ దేశం గూర్చినది. వారి చరిత్ర, సాహిత్యంపట్ల ఆయనకి ఎంతో అభిలాష. పరిశోధనదృష్ట్యా, చాలా సంగతులు సేకరించి, వ్యాసాలుగా కూర్చిన గ్రంథం – 'డాన్ ఫెర్నాన్‌డో' అన్నది ఇందులో పొందుపరిచిన కొన్ని విషయాలు ఆధారంగా, రెండు నవలలు వ్రాశాడీయన. మూడవది చైనా దేశంలో యాత్రల వర్ణన – 'అన్ చైనీస్ స్క్రీన్' – అన్నది చైనాలో అయన చూసిన వింత దృశ్యాలు, కలిసిన వింత వ్యక్తులు, వారు చెప్పే కథలు కొన్ని విషాదకరమైనవి, కొన్ని హాస్య పూరితములైనవి – అవన్నీ రచయిత వ్యక్తిత్వం తయారుచేసి ఇచ్చిన అద్దం ద్వారా చూస్తాం

చైనా యాత్రా గ్రంథం నుండి కొన్ని ఉదహరిస్తాను.

దూర దేశాలలో వుండే వారి అవస్థ వర్ణిస్తూ – "తనకి చాలా ఇష్టమైన ఇంటిని చూసి తట్టుకోలేదన్న భయంతో స్వగ్రామానికి వెళ్ళలేడు; పుస్తకాలు చదవడు – చదివితే వెనకటి జ్ఞాపకాల్ని భరించలేడు. ఏ జగత్తుని మనసారా వాంఛిస్తాడో, ఆ జగత్తుతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవాలన్నట్లు. దూర ప్రాంతంలోని వొక అధమురాల్ని కట్టుగుంటాడు"

చైనాలో అడుగడుక్కీ తగిలే దుర్వాసన్ను గురించి: "ప్రాక్ దేశాలలో మానవ సమానత పాశ్చాత్య దేశాలలోకంటె ఎక్కువగా కనపడ్డానికి కారణం, దుర్వాసనలే. పాశ్చాత్య దేశాలలో, కష్టించి పని చేసేవాడే పాలకుడవుతున్నాడు. కష్టించి పని చేసేవాడు వాసనేస్తాడు. వాళ్ళతో కలవలేము ... చైనాలో అందరూ ఈ దుర్వాసనలకి అలవాటు పడి ఉండటంవల్ల వారు వాటిని గమనించరు - కాయకష్టపడేవాడూ, పడనివాడూ - అందరూ సమానులే. ప్రజాస్వామ్య సంస్థలు వర్ధిల్లాలంటె మురికిగుంట అవసరం."

మూడవ యాత్రా గ్రంథం – ది జెంటిల్‌మెన్ ఇన్ ది పార్లర్ – అరుగు మీద కూర్చున్న పెద్దమనిషి - అన్నది. ఇందులో రంగూన్ నుండి, హైఫాంగ్ వరకూ చేసిన ప్రయాణం వర్ణన లున్నాయి. మామ్ యాత్రా గ్రంథాలన్నింటి

లోకి ఇది బాగుంటుంది ఇందులో మంచి కథలున్నాయి. ఒకటి మేబెల్ అనే ఆమెను గురించికది మేబెల్, జార్జి – తాంబూలాలు పుచ్చుకున్నారు ఇంక పెండ్లి జరగాలి కాని ఏదో ఆటంకం ఏర్పడుతూనేవుంది. మేబెల్ తండ్రి చనిపోతాడు; యుద్ధం వస్తుంది; జార్జిని దూర దేశానికి ట్రాన్స్‌ఫర్ చేస్తారు అది మన్య ప్రాంతం. స్త్రీలు ఉండలేరు ఏడేళ్ళు గడిచాయి. చివరికి జార్జిని కలిసి పెండ్లి చేసుకో నిశ్చయించి ప్రయాణమైంది. జార్జి పెండ్లి ఏర్పాట్లన్నీ చేసి, ఆమెను కలుసుకునేందుకు, ఎవరిదో కారు తీసుకుని వోడరేవుకి బైలుదేరాడు మధ్యలో సంశయించాడు. ఆమెను చూసి ఏడేళ్లైంది ఆమె వరాయిదానిలాగ కనబడ సాగింది ఎట్లా పెండ్లి చేసుకోడం? కలుసుకున్నాక, 'నిన్ను చేసుగోను" అనగలడా? మొండి ధైర్యం తెచ్చుగుని, ఆమెనుండి పారిపోడానికి నిశ్చయించు గుని, సింగపూర్ వెళ్ళడానికి సిద్ధంగా వున్న ఓడలో ఎక్కి వెళ్ళాడు మేబెల్‌కి ఇవ్వవల్సిందిగా, రెండు ముక్కలు వ్రాసి, ఎవరికో ఇచ్చి వెళ్ళిపొయ్యాడు. "హఠాత్తుగా పనిమీద వెళ్ళాల్సి వచ్చింది ఎప్పుడొస్తానో తెలియదు. నువ్వు తిరిగి స్వదేశం వెళ్ళిపోవడం మంచిది. ముందు నేను ఏం చెసేదీ తెలియకుండా వుంది" అని వ్రాశాడు ఆ జాబులో

సింగపూర్ చేరగానే, మేబెల్ వద్ద నుండి వొచ్చిన టెలిగ్రామ్ చూశాడు. "అంతా తెలిసింది బెంగ పడొద్దు ప్రేమతో మేబెల్" అని టెలిగ్రాం రంగూన్ యాత్రికుల జాబితాలో మేబెల్ పేరు ఉన్నట్లు తంతి ద్వారా తెలుసుకున్నాడు. ఆమె వెంట వస్తోందని గ్రహించి, మరో ఓడ మీద సైగాన్ వెళ్ళాడు

ఐదు రోజుల తర్వాత సైగాన్ చేరుకున్నాడు హోటల్‌కి వెళ్ళగానే, మేబెల్ వద్ద నుండి వొచ్చిన టెలిగ్రాం సిద్ధంగా వుంది. రెండే మాటలు. "ప్రేమతో మేబెల్" అని. ఏం చెయ్యాలి? హాంగ్‌కాంగ్ వెళ్ళాడు. అక్కడ నుండి మనిలా వెళ్ళాడు. తర్వాత షాంగై ఒక్కటే మార్గం, యొకహోమా వెళ్ళాలి అక్కడ హోటల్‌కి చేరగానే మేబెల్ టెలిగ్రాం సిద్ధం. "మనిలాలో కల్సుకోలేకపోయినందుకు చింతిస్తున్నాను. ప్రేమతో మేబెల్" అని. వెనక్కి వెళ్ళి, ఆమెని గంద్రగోళపరచడం మంచిదని తిరిగి షాంగై వెళ్ళాడు. "త్వరలో వచ్చి కలుస్తున్నా ప్రేమతో మేబెల్" అని టెలిగ్రాం అక్కడ నుండి హాన్‌కో, వెళ్ళి, పడవ మారి చుంగ్‌కింగ్ వెళ్ళి, అక్కడనుండి చెంగ్ టూకి బైలుదేరాడు. అది మారుమూల గ్రామం - అతి కష్టమైన రోడ్డు ప్రయాణం, డోలీల మీద వెళ్ళాలి అక్కడికి చేరుకున్నాడు. అక్కడికి ఎవ్వరూ రాలేరు. దూరంగా టిబెట్ కొండలు కనపడతాయి ఒక ఉదయం, డోలీలోంచి దిగింది

మేబెల్. "నువ్వు ఏమీ మారిపోలేదే! జుట్టంతా వూడి, బోడిగుండు చూపుతావను కున్నానుస్మా పట్టు పెండ్లి చేసుకుందాం" అని పెళ్ళి చేసుకుతీరింది మేబెల్. ఇది నిజంగా జరిగిన వృత్తాంతం అని తెలిసాక, మరీ చిత్రంగా తోస్తుంది.

సాధారణంగా మామ్ వర్ణనలలో వూహాబలం, ఉపమానాలు, కవితావేశం కనబడవు. కాని ఈ గ్రంథంలో, కొన్ని అద్భుతమైన వర్ణన లున్నాయి. నాకు నచ్చిన వర్ణన :

"సంధ్యాసమయంలో, అడివినుండి విడిపోయి ప్రాణం పోసుకుని బ్రతికిన వ్యక్తులైనట్లు కనబడతాయి చెట్లు చెట్లేవో అడివేదో విడిగా చూడలేము. ఆ క్షణంలో ఒక ఇంద్రజాలం వుంది దానిప్రకారం, ఆ చెట్లల్లోకి వనకన్యలు జొరబడి స్థావరం ఏర్పర్చుకుని, తెల్లారగానే మాయమైపోతారు. ఏదో జరిగి ఏ క్షణంలోనైనా అవి మారి, మరో ఆకృతిని తెచ్చుకునేటట్లుగా తొణికిసలాడతాయి- ఊపిరి బిగపెట్టి, ఆ క్షణాన్ని నిరీక్షిస్తాం. చీకటి అలుముకుని, రాత్రి ప్రవేశిస్తుంది. ఆ మధురక్షణం గడిచిపోయి, అడివి ఆ చెట్లని తనలోకి తీసుకుంటుంది — ప్రతిభతో విర్రవీగే యువకుణ్ణి, ఆ క్షణం గడిచాక; ప్రతిభపోయి, యవ్వనం క్షీణించి, మామూలు గుంపులోకి ప్రపంచం లాక్కున్నవిధంగా అడివి, చెట్లని తనలో కలిపేసుకుంటుంది — ఆ చెట్లకి, అడివి నుండి సంక్రమించిన జీవం తప్ప, వేరే కదలిక, ప్రాణం ఉండవు"

ఈ ప్రయాణంలో, వంటచేసి పెట్టేందుకు మామ్ ఒక తెలుగువాణ్ణి తనతో తీసుకెళ్ళాడు. ఎడ్లబండి ప్రయాణాలూ, పడవ ప్రయాణాలూ, అంగ్‌కోర్‌వాట్ శిథిలాల వర్ణన, అక్కడ ఉద్యోగాలుచేసే ఆంగ్లేయుల అగచాట్లు - వీటన్నింటి తోనూ, విసుగు పుట్టించకుండా, ఆహ్లాదంతో సాగే మంచి గ్రంథం ఇది.

ఇండియా పర్యటనగూర్చి ప్రత్యేకంగా గ్రంథం వ్రాయలేదుగాని రమణ మహర్షి గూర్చిన ఒక వ్యాసం వుంది. ఆయన ప్రచురించిన వ్యాస సంపుటంలో. "ఏకైక సత్యంలోకి ప్రవేశించాడు మహరిషి ఆయన చనిపోగానే, ఒక తోక చుక్క ఆకాశంలో మెల్లగా కదులుతూ, పవిత్రమైన అరుణాచలం కొండ శిఖరానికి చేరుకుని, దాని వెనక అంతర్థానమైంది. ఈ వింత దృశ్యాన్ని ఎందరో చూసి, ఒక మహావ్యక్తి నిర్యాణానికి చిహ్నమన్నారు" అన్న వాక్యంతో ముగుస్తుంది ఈ వ్యాసం. ఇందులో "అంతర్థానమైందిట" — అని, వాక్యం చివర 'ట'ని తగల్చకపోవడం గమనించతగ్గది.

ఇండియా పర్యటన జ్ఞాపకాలని మామ్ తన 'రచయిత నోట్‌బుక్' అనే గ్రంథంలో పొందుపరిచాడు. హైదరాబాద్‌లో అనేక రోగుల వ్యాధులను కుదిర్చిన

యోగి ఉదంతం, తాత్విక చింతన మొహంలో తాండవించే సూఫీని కలుసుకున్న ఉదంతం. సర్ అక్బర్ హైదరీగారింట్లో యోగితో జరిపిన గోష్టి, తేలుమంత్రం, టికెట్ లేకుండా రైలెక్కనీయకపోయినప్పుడు, రైల్ని నిలిపివేసిన యోగి ఉదంతం. భూమిలో వారం కప్పడి, సజీవుడైన యోగి ఉదంతం. కాశీపట్నం, తాజామహల్ వర్ణనలు, మధురలో ఆలయాలు — ఇవన్నీ చదవతగ్గవి. హిందూ తత్వాన్ని అనేకులు ఒకే విధంగా విశదీకరించడం విని, విని ఇల్లా వ్రాస్తాడు. "హిందూ తత్వజ్ఞులతో వున్న చిక్కు ఇది పదేపదే, అవే విషయాలు చెప్తారు. సత్యం ఒకటే కావున, పదేపదే చెప్పడం సబబే ఐనా వినేవారికి ఇబ్బందిగానే వుంటుంది. ఉపనిషత్తులలో నుండి అవే ఉపమానాలు కాక మరి వేటినన్నా చెప్తే బాగుండుననిపిస్తుంది. త్రాడు, సర్పము — ఈ ఉపమానం రాగానే గుండె జారుతుంది " మామ్ హిందూ తత్వశాస్త్రాన్ని మరింత శ్రద్ధతో పరిశీలించివుంటే బాగుండుననిపిస్తుంది కాని అది అసంభవం చిన్నతనంలో హేతువాదాన్ని స్వీకరించి, నాస్తికుడుగా, చెప్పుకుంటూ, ఆధ్యాత్మిక అనుభూతులను చొరనీయకుండా, హృదయ ద్వారాలు మూసేశాడు ఆయన. పాశ్చాత్య తత్వంలో, చీకటి గదిలోలేని నల్లపిల్లి, తత్వజ్ఞుడి నంటి సలుపు —— త్రాడూ, పామూ ఉపమానం లాగే పదే పదే ఎదురౌతాయన్న సంగతి మామ్ గ్రహించలేక పొయ్యాడనుకోలేను.

ఈ పర్యటనలోనే చిత్రమైన వృత్తాంతం విన్నాడు మామ్. కాని దాన్ని కథగా వ్రాయలేదు. అందుకు కారణం, ఆ కథకి తుది మొదలు లేకపోవడంట. ఒకాయనుంటాడు. ఆయన్ని 'ఎ' అందాం. ఆయనకి రోజూ బోలెడు ఉత్తరాలు వస్తూంటాయి ఆయన మిత్రుడు — 'బి' అందాం — తనతోబాటే దూర ప్రాంతంలో పని చేస్తున్న మిత్రుడు —'బి'కి ఒక్క జాబు కూడా రాదు అతనికి 'ఏ' పట్ల అసూయ పొడసూపుతుంది. 'నీకొచ్చిన ఉత్తరాలలో ఏదన్నా ఒక దాన్ని నాకియ్యి — ఐదు రూపాయలిస్తాను' అంటాడు 'ఏ'తో. 'ఎ' సమ్మతించి, తన కొచ్చిన జాబుని 'బి'కి ఇస్తాడు 'బి' ఆ ఉత్తరం చదువుతాడు. అందులో ఏముందో చెప్పమని అడుగుతాడు 'ఎ'. 'బి' చెప్పడు 'ఎ'కి వెర్రెత్తిపోతుంది— ఆ ఉత్తరంలో ఏముందో తెలుసుకోవాలన్న కుతూహలాన్ని అణగద్రొక్కుకోలేకపోతాడు. ఐదు రూపాయలు తిరిగి ఇచ్చివేస్తాను, నా జాబు నా కియ్యమంటాడు 'బి' ని 'బి' ఇయ్యనంటాడు అదీ కథ. ఆధునిక కథకులు ఆ కథని అల్లా గాలిలో ఒదిలెయ్యడానికి వెనుదీయరు. అది నా వల్ల కాదు, మనస్సుకి నచ్చే ముగింపు లేని కథని వ్రాయలేను, అని వ్యాఖ్యానిస్తాడు

టాజ్‌మహల్ సందర్శనం ఆయన కొక అపూర్వమైన అనుభవం. అది ఒక గొప్ప కళాఖండమన్నాడు. ఆ సౌందర్యానికి వూపిరి నిల్చిపోయిందన్నాడు. గుండెకాయ పెరిగినట్లు, దాస్య శృంఖలాలు వీడిపోయినట్లు అనిపించిందిట. మతాలన్నీ పరమాత్మలో అంతమొంది విమోచన పొందుతున్నట్లు కళ ద్వారా కూడా తాత్కాలికమైన విమోచన పొందడం సాధ్యమన్న సాంఖ్య సిద్ధాంతం అప్పుడే చదివాడుట. మరో మారు చూశాడు తాజుమహల్‌ని. రెండోమారు, అంతటి ఆనందం పొందకపోయినా, ఒక వింత అనుభూతి కలిగిందిట అదిల్లా వర్ణించాడు. "నే వొంటిగా ఉన్నాను విడి విడిగా అమర్చిన ఆ గదులు చూస్తూ ఉంటే, అదంతా శూన్యమైనట్లు, నిశ్శబ్దం ఆవరించినట్లు తోచి కాస్త బెదిరాను. అర్థరహితమైన మాటల్లో చెప్పాలంటె, చప్పుడు చెయ్యని అనంతం వేసిన అడుగుల చప్పుడు విన్నట్లనిపించింది." ఇండియా వొదిలి వెళ్ళినప్పుడు, అక్కడి విశేషాలేవో చెప్పమంటారుట 'మీకేది నచ్చింది?' అని అడుగుతారుట. అట్లా అడిగినవారికి ఏం సమాధానం చెప్తే నచ్చుతుందో అదే చెప్పాను నేను - అని తన అనుభవాల సారాంశాన్ని ఇల్లా ముగించాడు మామ్.

"నన్ను నిజంగా కదిల్చింది టాజ్‌మహల్, కాశీ, మధురలో ఆలయం, తిరువాన్నూర్ పర్వతాలు - ఇవేవీ కావు నన్ను కదిల్చింది భారతీయ కర్షకుడు. చిక్కి శల్యమై తను దున్నే నేల రంగుగల గుడ్డపేలికను నడుం చుట్టూ ధరించి, తెల్లారగట్ల చలిలో వొణుకుతూ, ఎండకి చెమట్లు కారుస్తూ, ఎండిన పొలంపై ఎర్రటి సంధ్య పడేవరకూ శ్రమించే కర్షకుడు — ఉత్తరాన, దక్షిణాన, తూర్పున, పడమట, విశాలమైన ఇండియా అంతటా, తన తండ్రివలె, తాతవలె, ముత్తాతవలె, మూడువేల సంవత్సరాల వెనక ఆర్యులు యీ దేశాని కొచ్చిన కాలంనుండీ కష్టించి, ఆ కొద్ది పంటతో పొట్ట నింపుగునే కర్షకుడు. ఇండియాలో ఉద్రేకంతో నన్ను కదిల్చివేసిన దృశ్యం ఇదే"

ఇది చదివాకనే నాకు మామ్‌పట్ల గౌరవం ఏర్పడింది. అంతకుముందు ఆయన చమత్కృతిని మెచ్చుకోడం మటుకే.

చైనా పర్యటన ఫలితంగా ఆయన వ్రాసిన నవల 'ది పెయింటెడ్ వీల్' అనేది. ఇది తాను తటస్థుడుగా వుండి, సర్వజ్ఞుడుగా, సంప్రదాయ పద్ధతిలో వ్రాసిన నవల. చాలాకాలం ఆయన నవలల్లోకి ఇది తృప్తికరమైన నవల అనుకునేవాణ్ణి.

మొదటినుండి చివరివరకూ, విసుగు పుట్టకుండా, ఆతృతతో చదువుకు పోతాం. అనవసరమైన వివరాలూ, ఉపకథా, కథకు దోహదమివ్వని వ్యర్థ

పాత్రలూ - ఇవేవీ లేవు. మామ్‌కి అభిమానమైన కథావస్తువు — వ్యభిచారం. హాంగ్‌కాంగ్‌లో డాక్టర్ ఫేన్ అనే ఆయన వైద్యశాఖలో పనిచేస్తూ వుంటాడు. ఈ పాత్రలో మామ్ వ్యక్తిత్వం వుంది. లోపల ఏమనుకొంటున్నదీ పైకి తెలియదు. ఉద్రేకాన్ని కనపర్చడు. స్థితప్రజ్ఞుడికి మల్లే కనబడతాడు. ఆంత ర్యాన్ని ఇతరులతో పంచుకోడు. విజ్ఞాన పరిశోధనలో నిమగ్నుడై వుంటాడు. ఆయన భార్య "కిట్టి" మరొక వ్యక్తితో అక్రమ సంబంధం ఏర్పరుచుకుంటుంది. ఊరు నడుమ ఒక చైనావారి దుకాణం గదిలో కలుసుకుంటారు వారిద్దరు. భర్త ఇంటికి రాడని తెలిసున్న సందర్భాలలో, ఆమె ఇంటికే రప్పించుకుంటుంది ప్రియుణ్ణి. ఒకనాడు ఆమె ప్రియుడితో గడుపుతుండగా, భర్త ఇంటికొస్తాడు. ఆమె ఏం చేస్తున్నదీ తనకి తెలిసినట్లు, గది గొళ్ళెం చప్పుడుచేసి, లోనికి రాక వెళ్ళిపోతాడు. కిట్టి, ప్రియుడు ఆవేదన పడతారు. నవల ఈ ఘట్టంతో ప్రారంభ మౌతుంది కొంతకాలానికి ఆమె ప్రియుడు, మరొకామెని పెండ్లి చేసుకుంటాడు. మారుమూల ప్రాంతంలో ప్లేగ్‌వ్యాధి ప్రబలుతుంది డాక్టర్ ఫేన్ అక్కడికి వెళ్ళాల్సి వస్తుంది. భార్యని కూడా తనతో తీసుకెడతాడు. అల్లా వెళ్ళడం దండనగా భావిస్తుంది. అక్కడ భర్త చనిపోతాడు. అక్కడివారు భర్తనీ, ఆమె అక్కడ చేసిన మంచి పనినీ అభినందిస్తారు. ఆమె వ్యాధి రేగిన ప్రాంతానికొచ్చి, రోగులకు సపర్యలు చెయ్యడం గొప్ప విషయమని కొనియాడతారు ఆమెకి ఆశ్చర్యం కలుగుతుంది. తాను వ్యభిచారిణి అని ఆమెకు తెలుసు కాని వాళ్ళంతా ఏదో ఘనకార్యం చేసిందనడం చూసి, ఆమెలో పశ్చాత్తాపం బయలుదేరి, మార్పొస్తుంది అక్కడి మతాలయంలో నన్స్ — సన్యాసినులు ఆమెని వోదార్చి ఆధ్యాత్మిక చింతనకి కారకులవుతారు.

డాక్టర్ ఫేన్ చక్కటి పాత్ర; కిట్టిలో వచ్చిన పరివర్తన, సహజంగా, అందంగా వుంది. మంచి నవల అనుకున్నా. కాని కిట్టి ఇంటికి తిరిగి రాగానే, వెనకటి ప్రియుణ్ణి కలిసి, పేజీ అవకుండానే వ్యభిచరిస్తుంది. శిఖరాని కెక్కిన వ్యక్తి లోయలో కూలిపోతుంది. ఆమె అల్లా చెయ్యడం, మామ్‌కి ఇష్టం. మానవత్వం ఋజువు చేస్తుందంటాడు జీవితంలో అల్లా జరగొచ్చునేమొ. కాని కళలో జరిగితే, సాహితీ ప్రయోజనం దెబ్బతింటుందేమొ కిట్టితో పాటు నవల కూడా పతనం చెందినట్లనిపిస్తుంది

యాత్రలు ముగించుకుని 1928 లో మామ్ ఫ్రెంచ్ రివియెరా ప్రాంతంలో 'నీస్'లో — మాంట్‌కార్లో నగరాల నడుమ కాప్‌ఫిరాట్ అనేచోట ఇల్లు కొనుక్కుని స్థిరపడ్డాడు దానిపేరు విల్లామారెస్క్. నౌకర్లు, కార్లు, స్విమ్మింగ్

పూల్, మాటిస్, రెన్వాయిర్ల చిత్రపటాలూ – సిరిసంపదలతో వైభవంగా జీవితం గడపడాని కనువైన పరికరాలని సమకూర్చుకుని, విండ్సర్ దంపతులు, ఆగాఖాన్, చర్చిల్ మొదలైన ప్రముఖ వ్యక్తులకు ఆతిథ్యమిస్తూ గడిపాడు. కొత్త భవనంలో స్థిరపడ్డాక ఆయన వ్రాసిన నవల 'కేక్స్ ఎండ్ ఏల్' అన్నది. అంటే, 'రొట్టెలు – సారా'. దీనికి మొదట పెట్టిన పేరు భోషాణాలలో దాచిన అస్థిపంజరం. ఆంగ్ల విమర్శకులు చాలా మంచి నవలగా విలువ కట్టారు. ఇందలి ప్రధాన పాత్ర 'రోజీ' గొప్ప పాత్రన్నారు.

డ్రిఫీల్డ్ అనే నవలాకారుడుంటాడు. పేరుప్రతిష్టలు తెచ్చుకుంటాడు. వార్థక్యంలో చనిపోతాడు ఆయన రెండవ భార్య, భర్త జీవితం వ్రాయమని భర్తని ఎరుగున్న ఒక రచయిత నడుగుతుంది ఆ రచయిత పేరు ఎషెండెన్. అతనే కథ చెప్తాడు అతనే మామ్. ఈ ఎషెండన్, అతని స్నేహితుడైన 'కిర్' అనే ఒక విమర్శకుడు, డ్రిఫీల్డ్ చిన్నప్పుడు ఎరుగున్నవారిని పరామర్శించి ఆయన యౌవనపు జీవితం, మొదటి భార్య వృత్తాంతం సేకరిస్తాడు మొదటి భార్య రోజీ సౌందర్యవతి. డ్రిఫీల్డ్‌ని ఉత్తేజపరిచింది ఆమెయే భర్త స్నేహితుల్ని ఆదరించేది ఆమెను ఆరాధించే ఒక ధనికుడైన వ్యాపారి, ఎషెండన్, ఒక ప్రముఖ నటుడు వీరంతా ఆమె స్నేహితులే. ఆమెని ప్రేమించి వాంఛిస్తారు. కోరిన వారందరికీ ఆమె శరీరాన్ని ఇచ్చివేస్తుంది. కాదనలేదు వారిని సంతోష పెట్టడంకోసమే వారితో వ్యభిచరిస్తుంది వ్యాపారి బోలెడు ఆభరణాలు, ఖరీదైన దుస్తులు ఇస్తాడు, ఆమెకి. వీటినిచూసి వ్యాపారితో సంపర్కం ఏర్పరుచుకున్నం దుకు ఎషెండెన్ అసూయపడతాడు "నువ్వు ఇంత ఖరీదైనవాటిని ఇవ్వలేవు· అతనిస్తాడు. అతనికి ఆనందం కలిగిస్తే ఏం తప్పు? నీ కెందు కీ బాధ – అన్నీ క్షణికమేగా" అని మందలిస్తే అతను తృప్తిపడి ఆమెను అనుభవిస్తాడు. ఆమెను అనుభవించిన వ్యక్తులందరూ, ఉత్తేజితులై, తమ తమ రంగాలలో పేరు తెచ్చు గుంటారు రోజీ ఆస్పత్రిలో బిడ్డని కంటుంది ఆ బిడ్డ చనిపోతుంది ఆ బాధని మరిచిపోవడంకోసం, ఆ రాత్రి ఇంట్లోంచి వెళ్ళి ఒక ప్రియుడితో వ్యభిచరిస్తుంది· భర్త డ్రిఫీల్డ్ ఈ ఘట్టాన్నే ఒక నవలలో వాడుకుంటాడు. చివరికి భర్తని వొదిలేసి వ్యాపారితో లేచిపోయి అమెరికాలో ఉండిపోతుంది 'రోజీ' సూర్యుడు తన కాంతినిచ్చి, ప్రాణాల కాధారమైనట్లు, ఆమె తన సౌందర్యాన్ని నలుగురికీ పప్పజెప్పి, ఉత్తేజపరుస్తుంది. రచయిత చెప్పదల్చుకున్నది ఇదే. ఆమె అమా యకమైందిట పవిత్రమైన ఆత్మ కలదిట శరీరం ఇవ్వడానికీ, ఇవ్వకపోడానికీ తేడా తెలియనంతటి సున్నిత మనస్తత్వం గలదిట. నలుగుర్నీ ఆ విధంగా సంతోషపెట్టడం ఒక రకం సమాజ సేవేనట.

ఆంగ్ల విమర్శకులు, ఈ పాత్రని ఇంతగా పొగిడి, ఈ నవలని గొప్ప నవలగా ఎల్లా ఎన్నిక చేశారో నా కర్థం కాదు. నిజమే కథ చెప్పడంలో, మెళకువ, చమత్కారం వున్నాయి. ప్రస్తుతంలో డ్రిఫీల్డ్ రెండవ భార్య పరిస్థితి, గతంలో మొదటి భార్య జీవిత విశేషాలూ, ఇద్దరు ముగ్గురుచేత చెప్పిస్తూ, ముందుకీ, వెనక్కీ ప్రయాణం చేస్తూ, రెంటినీ వంతెనవేసి కలుపుతూ, కథ నడవడంలో నైపుణ్యం వుంది. కాదన్ను, కాని వస్తువూ, ఆ పాత్ర—ముఖ్యంగా బిడ్డ చనిపోగానే, మరొకర్ని కలవడం — ఆ తత్వం — నేను హర్షించలేను. చౌకబారు వృత్తాంతానికి సాహితీ దక్షత వుందనుకోను.

మరి, ఆంగ్ల విమర్శకులు దీన్ని గురించి ఇంతగా ఎందుకు పట్టించు కున్నారు? ఆ కారణాలు, నవల విలువలతో నిమిత్తం లేనివి థామస్ హార్డీ అనే ప్రసిద్ధ నవలాకారుణ్ణి దృష్టిలో పెట్టుగుని డ్రిఫీల్డ్ పాత్రని సృష్టించడం ఒక కారణం. ఈ నవల వ్రాసేటందుకు ముందే హార్డీ చనిపొయ్యాడు. రెండోది 'కీర్' అనే పాత్ర 'హ్యూవాల్పోల్' అనే ప్రముఖ అంగ్ల విమర్శకుణ్ణి దృష్టిలో ఉంచుగుని సృష్టించాడుట. హ్యూవాల్పోల్, ప్రతిభ, పెద్ద తెలివి—ఏమీ లేకుండానే నలుగుర్నీ, పార్టీలిచ్చి మంచి చేసుకుని, వారిచేత తన రచనలపై మంచి విమర్శలు వ్రాయించుగుని, పైకొచ్చిన రచయిత. ఆయన్ని హేళనచేస్తూ సాగిన యీ 'కీర్' పాత్ర, సాహితీ రంగంలో సంచలనం కలిగించిందిట పేరుకోసం 'కీర్' చేసిన యత్నాలను గురించి, నవలకి ప్రస్తుతం కాకపోయినా, సుదీర్ఘంగా వ్రాయడం, హ్యూవాల్పోల్‌పై, తనకున్న ద్వేషాన్ని, కసిని వెళ్ళబోసుకోడం కోసమే అని తెలుస్తుంది. ఈ నవలలో 'కీర్' పాత్ర వృత్తాంతం చదువుకుని, బెంగతో, వాల్పోల్ కుంగిపొయ్యాడుట. ఈ నవలకి విలువ కట్టడానికి, యీ సమకాలీన తగాదాలు మనకి ముఖ్యం కావు. ఇందలి చౌకబారు ఇతివృత్తాన్ని ఇవేవీ రక్షించలేవు.

మొదట్లో లేదన్నా, తర్వాత, వొప్పుకున్నాడుట మామ్ వీరిని మనస్సులో ఉంచుగుని వ్రాసినట్లు. ఎలినార్ మార్డెంట్ అనే ఆమె, మామ్‌ని వెక్కిరిస్తూ, ఒక పాత్రను కల్పించి నవల వ్రాసిందిట. మామ్ బాధపడ్డాడుట. ఇంగ్లండ్‌లో యీ నవల ప్రచారం కాకుండా యత్నించాడుట. దావా వేశాడుట ఈ వృత్తాంతం స్మరిస్తూ, జె బి ప్రీస్లే "హై హార్స్" అని వ్యాఖ్యానించాడు. 'హై హార్స్' అన్న మాటలో "మా బాగా అయిందీ. లేకపోతేనూ - కుక్క కాటుకి చెప్పుదెబ్బ" - అన్న అర్థం ఉంది.

ఈ గొడవల్ని జ్ఞాపకం చేసిన మిత్రుడితో మామ్ ఇల్లా అన్నాడు.

వ్యక్తులలో ఉండే మంచిని తీసుగుని పాత్రల్ని సృష్టించినప్పుడు, ఆ పాత్రల వెనక ఉన్న మనుషుల్ని ఎవ్వరూ గుర్తుపట్టరు వారిలో చెడుగుని చిత్రించినప్పుడు మాత్రం వెంటనే గుర్తు పట్టేస్తారు " దీనిపై వ్యాఖ్యానం అనవసరం.

తన రచనల ద్వారా, నాలుగు మిలియన్ డాలర్లు పైగా సంపాదించాడు, సోమర్‌సెట్ మామ్ రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది ప్రభుత్వం వారి కోరికపై, యుద్ధం గురించిన నవల, 'ది అవర్ బిఫోర్ ది డాన్' **The Hour before the Dawn** వ్రాశాడు డబ్బు కోసం వ్రాసింది కాదు మామ్ గడుసువాడు లోకజ్ఞానం, కలవాడు ప్రభుత్వానికి వ్యతిరేకమైన అభిప్రాయాలు ప్రకటించిన, బెర్నార్డ్ షా, బెర్ట్రండ్ రసెల్, ఎజ్రా పౌండ్లకు ఏం జరిగిందీ ఆయనకి తెలుసు. పాలకులతో పేచీ పెట్టుకోడు ఈ నవల ఆయనకే నచ్చ లేదు దీనికి ముందే, 'ది నారో కార్నర్,' 'థియేటర్', అనే నవలలూ, 'ది సమింగ్ అప్' అనే రచయితగా తన జీవితపు విశేషాలను సింహావలోకనం చేసే గ్రంథమూ వ్రాశాడు 'ది నారో కార్నర్' లో, కథ స్వల్పమైనది కాని చెప్పే ఆయన ఛలోక్తులతో జీవితపు పరామర్శతో ఉదాత్తంగా సాగుతుంది. 'థియేటర్' ఒక రంగస్థల నటిని గూర్చిన కథ పేరుపడ్డ నటి, భర్తతో తృప్తిపడక, ఒక యువకుణ్ణి ప్రియుడుగా చేసుకుంటుంది అతను ఆమె చెప్పు చేతుల్లో మసలుతాడు డబ్బు కోసం, ఆమెకు ప్రియుడుగా ఉండటానికి ఇష్ట పడినా తన వయస్సుగల మరొకామెని ప్రేమించి, ఈమెని విడిచి వెళ్ళిపోతాడు. చమత్కారమైన నవల మామ్‌కి ఇది చాలా యిష్టంట.

యుద్ధకాలం అమెరికాలో గడిపాడు మామ్ అప్పుడే 'ది రేజర్స్ ఎడ్జ్' అనే నవల వ్రాశాడు. 1945 లో సినిమా చిత్రానికి అనువైన వ్రాత ప్రతి వ్రాస్తూ, హాలివుడ్‌లో గడిపాడు. సినిమా చిత్రంగా ఈనవల 32 లక్షల డాలర్లు సంపాదించిందిట

'ది రేజర్స్ ఎడ్జ్' — పదునైన కత్తి అంచు - అని అర్థం. అన్నివిధాలా తృప్తికరమైన నవల కఠోపనిషత్తులోని ఒక వాక్యం యీ నవలకి మకుటంగా (Motto) ఎన్నుకున్నాడు మామ్. 'పదునైన కత్తి అంచుమీదుగా వెళ్ళడం ఎంత కష్టమో, ముక్తి సాధన అంత కష్టమంటారు విజ్ఞులు' — అన్నది, దీక్షా వాక్యం 'లేరీ' అనే యువకుడుంటాడు. అతన్ని జీవితం కలవరపెడుతుంది. జీవిత రహస్యం తెలుసుకోవాలంటాడు. సత్యాన్వేషణ సాగిస్తాడు. ధనిక కుటుంబానికి చెందిన 'ఇసబెల్' అనే అమెను ప్రేమిస్తాడు. 'గ్రే' అనే మరో యువకుడు కూడా ఆమెను ప్రేమిస్తాడు. అమె 'లేరీ'ని ప్రేమిస్తుంది. అతన్ని

చదువు ముగించి వ్యాపారంలో చేరి, డబ్బు గడించమంటారు, ఆమె కుటుంబం వారు. వారు, అమెరికాలో వ్యాపారస్తులు. ధనికులు. అతను కూడా డబ్బు గడించి, అల్లుడు కమ్మంటాడు. కాని లేరీకి డబ్బంటే ఇష్టం లేదు. డబ్బుతో ముడిపడ్డ, హోదా, పలుకుబడి, గౌరవం ఇవన్నీ అతనికి గిట్టవు. ఇదంతా పారిశ్రామిక నాగరికతలోని కృత్రిమ విలువలంటాడు. ప్రశాంతమైన మనస్సు, శాంతి, మహదానందం — ఈ నాగరికతలో లేదంటాడు. వ్యాపారంలో చేరక, దేశాలంట తిరుగుతాడు. ఇండియా వస్తాడు. అక్కడ ఒక యోగి అతనికి కావల్సిన తత్వాన్ని బోధించి, మనశ్శాంతిని సమకూరుస్తాడు. విశ్వాన్ని తిలకించడంలో ఆనందం పొందుతాడు. కోర్కెలు విడిచిపెడతాడు. నిష్కామకర్మ చూరగొంటాడు బంధుకోటి అతనిపై ఆశ వొదులుకుంటారు ఎలియట్ అనే ఒక చుట్టం, హోదానీ పలుకుబడినీ అన్వేషిస్తూ గడుపుతాడు. ఇసబెల్‌ని ప్రేమించిన 'గ్రే' వ్యాపారంలో ప్రవేశించి డబ్బు గడిస్తాడు. ఇసబెల్‌కి ఆస్తి సంక్రమించి సంఘంలో పలుకుబడి పెరుగుతుంది లేరీ పెండ్లి చేసుకోడు. ఏ ఉద్యోగంలోనూ కుదరడు పరమాత్మని వెదుకుతూ తిరిగేవాడికి మళ్ళీ, పర లోకచింతతో, దేన్నో వెదుకుతూ, లారీ డ్రైవర్‌గా, లారీ నడుపుకుంటూ గడుపుతాడు. పాశ్చాత్య దేశాలలో పాతుకుపోయిన పారిశ్రామిక నాగరికతపై గొడ్డలిపెట్టు ఈ నవల. దైవచింత, తపస్సు, సాధన — మొదలైన హిందూ మత తాత్విక సూత్రాలను జీవితంలో అనుసరించి, ఇహంలోనే ముక్తిని సాధించడం ఉత్తమమైందని యీ నవల సారాంశం. ప్రాక్ పాశ్చాత్య విభిన్న దృక్పథాలపై మామ్ కట్టిన వంతెన. ఆయన అరవై తొమ్మిదవ ఏట వ్రాసిన నవల ఇది అద్భుతమైన పాత్ర చిత్రణ. ఎలియట్ పాత్ర ఆధునిక సాహిత్యంలో గొప్ప పాత్ర. విభిన్న సంస్కృతులకు సమన్వయం కుదిరి, దాన్నుండి ముందు జనించే కొత్త పౌరుడికి తార్కాణ 'లేరీ' పాత్ర పరిపక్వమైన శక్తులన్నీ కూడదీసుకుని, దీక్షతో వాటిని క్రోడీకరించి, జీవిత రహస్యం సాక్షాత్కారం అయితే స్వీకరించేటందుకు సిద్ధపడిన మధుర ఘడియల్లో కూర్చిన ఈ నవల, కట్టిన ఈ వంతెన — శాశ్వతంగా ఉండిపోతుందనుకుంటాను.

ఇది కాకుండా ఇంకా, 'క్రిస్టమస్ హాలిడే', 'అప్ ఎట్ ది విల్లా', 'దెన్ ఎండ్ నౌ'. 'కాటలైనా' అనే నవలలు వ్రాశాడు మామ్. దెన్ ఎండ్ నౌ — అప్పుడు, ఇప్పుడు — అన్నది చారిత్రాత్మక నవల ఇందలి నాయకుడు మెకియవెలి అనే ఇటలీదేశపు రాజకీయ వేత్త. ఫ్లారెంటైన్లకూ, ఫ్రెంచివారికీ పొత్తు

కుదిర్చేటందుకు సిజర్ బోర్జియాకు రాయబారిగా వెడతాడు. వ్యక్తులకంటే రాజ్యాంగమే ముఖ్యమని నిరూపిస్తూ, వ్రాసిన గ్రంథం ప్రసిద్ధి చెందినది చాలా తెలివైనవాడు, చాకచక్యం గలవాడు, కానీ ఇతను కోరిన స్త్రీలను పొందలేక పోతాడు. ఆ స్త్రీ లందరినీ, ఇతని నౌకరు పొందగలుగుతాడు. స్త్రీలని ఆకర్షించేది, హాస్య దృష్టిగాని తెలివితేటలు కావని రచయిత చెప్పదల్చుకున్నట్లు తోస్తుంది ఈ నవలలో. తాను తాసుగా కథ చెప్పే అవకాశం లేదు మామ్‌కి ఇందులో. చప్పగా, నిర్జీవంగా తయారైంది యీ నవల. డెబ్బైమూడవ ఏట వ్రాసిన నవల కాటెలైనా అన్నది. స్పెయిన్‌దేశ చరిత్రచదివి ఎన్నో విషయాలు సేకరించి, నలభై ఏళ్ళుగా వ్రాద్దామనుకుని ఈనాటికి పూర్తిచేసిన నవల ఇది. దైవ సాక్షాత్కారం జరిగి, సంసారాన్ని వొదిలేసి, యోగినిగా మారిన వొక వనిత కథ ఇది. జీవిత చరిత్రగా ఉంటుంది కాని, నవలగా కాదు.

ఎన్నో కథానికా సంపుటాలే కాకుండా, నాలుగు వ్యాస సంపుటాలుకూడా ప్రచురించాడు. 'పది గొప్ప నవలలు — వాటి రచయితలు', కథానిక, తోటి రచయితల్ని గురించిన వ్యాసాలు, వెనకటితరం గద్య రచన పరామర్శ, తత్వజ్ఞుడు కాంట్, రమణ మహర్షి, బర్క్ - వీరిని గురించిన వ్యాసాలు ప్రచారంలో కొచ్చాయి.

యుద్ధం ముగిసాక, మామ్ స్వగృహమైన మారెస్క్ చేరుకున్నాడు. 75 వ పుట్టిన రోజు పండుగ, సాన్‌ఫ్రాన్‌సిస్కోలో జరుపుకున్నాడు. సినిమా చిత్రాలుగా తీసిన కొన్ని కథానికల కథకుడుగా సినిమాలలో దర్శనమిచ్చాడు. 1952 లో ఏథెన్స్ వెళ్ళొచ్చాడు. 80 వ ఏట లండన్ వెళ్ళాడు ఆయన్ని గురించి పత్రికలు ఎక్కువగా వ్రాశాయి. ఎలిజబెత్ రాణి జన్మదినోత్సవ సందర్భంలో 'నైట్' బిరుదు స్వీకరించాడు - ఆయనతో గౌరవ సూచకమైన — కంపానియన్ ఆఫ్ ఆనర్ - బిరుదు చర్చిల్ మొదలైన 65 మంది ప్రముఖులకే లభించింది. లీజియన్ ఆఫ్ ఆనర్ బిరుదుతో ఫ్రాన్స్ దేశం గౌరవించింది. ఉత్తమ కథకి బహుమానం యిచ్చే ఒక ఎవార్డుకై ధనమిచ్చాడు ఎందరో ఆయన జీవిత చరిత్ర వ్రాయదల్చి అనుమతి కోరారు; వివరాలడిగారు ఆయనకి అది ఇష్టం లేదు. తనని గురించి ఎవ్వరూ వ్రాయకూడదని, తను ఇదివరలో స్నేహితులకు వ్రాసిన ఉత్తరాలను తగులపెట్టమని కోరాడు. వార్ధక్యంలో ఒకటి రెండు వెర్రి పనులు చేస్తారంటారు. ఇది అట్లాంటిదిగా తోస్తుంది. బ్రిడ్జ్ ఆడుకుంటూ, ప్రముఖులకు పార్టీలిస్తూ, ప్రపంచంలో జరిగే వింతల్ని తిలకిస్తూ, లోలోన నవ్వుకుంటూ, 91 వ ఏట కన్ను మూశాడు మామ్. ఆ కనురెప్ప వెనుక కాస్తంత

తడి వుండి తీరుతుంది — లోకం పట్ల ఆయనకున్న అనురాగానికి చిహ్నమైన తడి — ఆ వార్త విన్న లోకం కనురెప్ప వెనుక వున్న తడి లాంటిది — పరస్పరానురాగబంధం

ఇప్పుడు మామ్ కథానికల్ని పరామర్శిద్దాం.

మామ్ స్నేహితులలో ఒకడైన కారల్ ఫీఫర్ అంచనా ప్రకారం, మామ్ నూటయాభై కథలు వ్రాసినా, 1951 లో వెలువడిన మూడు కథల సంపుటాల లోనూ వున్న కథల సంఖ్య తొంభై వొకటి చిత్రం ఆయన తొంభై వొక్క యేళ్ళ జీవితంలోనూ, తొంభై ఒక్క కథలు! 'నా జీవితంలో ఒక క్రమం, ఆకృతి ఉన్నాయంటా' డాయన - అదే కాబోలు. ఈ కథలలో సంఘటనలు అనేక దేశాలలో జరిగినవి. మలయ, బోర్నియా, ఇంగ్లండ్, టహిటి, మెక్సికో, సమోఆ, ఇటలీ, స్పైన్, ఫ్రెంచ్, గయానా, మొదలైన దేశాల ప్రకృతి సంపదతో కూడుకున్నవి ఆయన కథల సంపుటాలకి వ్రాసిన ఉపోద్ఘాతంలో అవన్నీ యుద్ధానికి ముందు వ్రాసినవి ఆనాటి స్థితిగతులు ఇప్పుడు లేవు. చాలా మారిపొయ్యాయి అన్నప్పటికీ. ఆ మార్పుల వల్ల, కథల విలువ తగ్గిందనుకోను. ఏ వొక్క తత్వానికీ, రాజకీయ, జాతీయ సిద్ధాంతానికీ, జాతి మతాలతో ముడి పడ్డ దృక్పథానికీ కట్టుబడిపోక, కేవలం మానవ ప్రకృతిని విశదపరిచే కథలవడంవల్ల, అవి చారిత్రిక మార్పులతో వెనకబడిపోవు. ఆయనకి స్వదేశీయులైన ఆంగ్లేయుల పట్ల ప్రత్యేకమైన అభిమానం లేదు. ప్రపంచమంతా రెండు మూడు మార్లు చుట్టి రావడంవల్ల మానవ ప్రకృతిలోని ప్రధాన లక్షణాలను, నిశితంగా పరిశీలించి, అవగాహన చేసుకొని, అన్ని రకాలవారికీ నచ్చే కథా వస్తువుని ఎన్నుకోగలిగాడు. అదొక అంతర్జాతీయ దృక్పథం అనను నేను. మానవ వ్యవస్థ వ్యక్తికరణ అంటాను.

ఈ కథలను మూడు తెగల కింద విడగొట్టవచ్చు. మామ్ వ్యక్తిత్వపు ముద్ర పడిన కథలూ. మంచి కథలూ, గొప్ప కథలూ — అనొచ్చు స్థూలంగా.

మామ్ వ్యక్తిత్వపు ముద్ర పడిన కథలంటే, నా ఉద్దేశం, యీ ముద్ర మిగత కథలలో లేదనికాదు. రచయిత వ్యక్తిత్వపు ముద్ర, ప్రతి రచనపైనా వుంటుంది. రచయిత జీవితంలో కొన్ని బాధలు పడతాడు; కొన్ని వాంఛలు తీరవు. ఆశయాలు సిద్ధించవు. మనస్సు ఎక్కడో గాయపడుతుంది. అది ఎవ్వరితోనూ చెప్పకోలేడు తాను వాటిని ఎదుర్కోలేడు కూడా. అవి కళలో అవతరిస్తాయి. వాటికి ఆకృతి కల్పించి స్పష్టపరిచి, బహిర్గతం చేసేందుకు, సన్నివేశాలు, పాత్రలు కల్పిస్తాడు ఆ పాత్రలు పుట్ట బొమ్మలు—లోపల ఏమీ ఉండదు వాటికి ధారాలు కట్టి, కదుపుతాడు, నడుపుతాడు - తన 'కసి' వాటిపై

చూపి, ధ్వంసం చేస్తాడు. అట్లాంటి కథ కూర్చడంలో ఆనందం పొంది, తన అంతరంగాన్నుండి విముక్తుడౌతాడు. ఒక ప్రత్యేకమైన అవస్థ విశ్వాని కన్వయించే సూత్రంగా రూపొందింప చేస్తాడు. ఉదాహరణకి, మామ్ వొకప్పుడు ఒకామెను గాఢంగా వాంఛించాడు. ఆమె తృణీకరించింది మామ్ కురూపి కాడు. ఎగదువ్విన క్రాఫింగ్, నిండైన కోల మొహం, మరీ పొట్టి కాడు, మరీ ఎత్తరి కాడు; వెక్కిరించినట్లుగా కాస్త ముందుకు చొచ్చుకొచ్చిన గడ్డం, కాస్తంత పెద్ద చెవులు; రచయిత; సౌందర్య పిపాసి; సంస్కారం గలవాడు, — అందంగా ఉండడం తప్ప, ఆమెలో మరో విశేషం ఏమీ లేదు. ఆమెకి సంస్కారం లేదు, కళాతపన లేదు; తెలివి, జ్ఞానం మొదలే లేవు తనని తృణీకరిస్తుందా? ఆమెకేం కావాలి? ధనం; ధనంతోబాటు సంక్రమించే హోదా, గౌరవం, పలుకుబడి— ఇవిస్తే - ప్రేమించినట్లు నటించి, పెండ్లి చేసుకోడానికి సిద్ధం ఆమె మృగ్యం- బాగా తిండి తింటుంది; బాగా తినేవారికి కామం జాస్తి. దాన్ని తృప్తి పరచడం కోసం. యువకుణ్ణి వెదుకుతుంది; వ్యభిచరిస్తుంది. పాశ్చాత్య దేశాలలో, నాగరికత ప్రబలి, యీ విధమైన కృత్రిమ వాతావరణంలో ఉన్న, ఇలాంటి వారిలో శీలం, నీతి లోపిస్తాయి. ఇదీ ఆయన గొడవ.

ఇది, వొక ప్రత్యేకమైన వ్యవస్థ లేవదీసిన ఆలోచనా పరంపర కళలో, విశ్వాని కన్వయించే సూత్రంగా, ప్రత్యక్ష మవుతుంది.

ఒక కథలో, వొకామె, ధనికుడైన భర్తతో వుంటూ సంస్కారం గల వొక యువకుడిపై అప్యాయత కనపరుస్తుంది. ఆ యువకుడు రచయిత; పెద్ద ఉద్యోగి. ఆమె మెప్పు కోసం, కథలు వ్రాస్తాడు; శెలవుల్లో ఆమెను కలుసు కుంటాడు. కాని అతన్ని దూరంగా ఉంచుతుంది — ఆశ మాత్రం వొదులుకో నివ్వదు. భర్త చనిపోయ్యాక, బోలెడు ఆస్తి సంక్రమిస్తుంది. దూర దేశంలో పెద్ద భవనం ఒంటిగా ఉంటుంది. భర్త లేడు కనక, తనని స్వీకరిస్తుందన్న ఆశతో, అతను శెలవలకి ఆమె వద్దకు వొస్తున్నానని వ్రాస్తాడు. రమ్మంటుంది. వొచ్చేటప్పుడు ఫలానా రకం పుగాకు తెమ్మంటుంది. అతను ఆ వూళ్ళో దిగుతాడు స్టేషన్‌కి కారు పంపుతుంది. ఇంటి కెడతాడు. పుగాకు తెచ్చావా? అని ప్రశ్నిస్తుంది. ఆ రకం దొరకలేదంటాడు. ఆమె చిరాకు పడుతుంది. ఆ పుగాకు కార్ డ్రైవర్ కోసం రెండు రోజులు స్నేహితుల పార్టీలతో గడుపు తాడు. ఇతనిపట్ల స్నేహ భావం తప్ప వాంఛ చూపదు. ఆమె పడక గదిలో, పుగాకు, పైప్ పరికరాలు చూసి ఆశ్చర్యపడతాడు. రాత్రి నిద్ర పట్టదు. ఏ ఘెండో అయింది నిద్ర పట్టక, మేడ మీద వరండాలో కొచ్చి, సముద్రంకేసి

చూస్తాడు. ఇసకలో దూరంగా ఆమె కనబడుతుంది. దుస్తులుండవు. మరి డ్రైవర్ ఆమె శరీరాన్ని తువ్వాలుతో తుడుస్తున్న దృశ్యం చూస్తాడు. కార్ పోతుంది. మర్నాడు వెళ్ళిపోతాడు. ఆమెకు కావల్సింది సంస్కారం, సాహిత్యం, కళా కావు. యువకుడైన కార్ డ్రైవర్; అతని ఆదర్శ తత్వం గాయపడుతుంది.

ఇదీ, మామ్ వ్యక్తిత్వం ముద్రపడ్డ కథ అనడంలో నా ఉద్దేశం.

'శీతాకాలపు నౌకాయానం' అన్న కథలో ఓడ ప్రయాణీకులలో, పెళ్ళి పెటాకులు లేని నడి వయస్సురా లుంటుంది. ఆమె తెగవాగుతూ ఉంటుంది, ఎవ్వరనీ మాట్లాడనివ్వదు. అర్థం లేకుండా, ఏదో చెప్తూ పోతుంది, తోటి యాత్రికులు నాలుగైదు రోజులు భరిస్తారు. తర్వాత తట్టుకోలేకపోతారు. ఒక డాక్టర్ని సంప్రదించి, ఆమె నోరు కట్టడానికి మందు కనుక్కుంటారు. ఓడలో పనిచేసే ఒక యువకుణ్ణి రాత్రి ఆమె గదిలోకి పంపుతారు. మొర్నాడు ఆమె వాగుడు నిలిచిపోతుంది. శరీర వాంఛ తీరనప్పుడు కలిగే అరిష్టాలని ఆనాటి మన శాస్త్రజ్ఞులు ప్రచారంలోకి తెచ్చారు. వాటిని పురస్కరించుగుని ఈ కథ వ్రాసినప్పటికీ, దీన్ని చౌకబారు కథ అనక తప్పదు తృప్తికరంగా లేవని, మామ్ కొన్ని కథలను సంపుటాలలో ప్రచురించకుండా విడిచేశారు. ఈ కథను కూడా విడిచేసివుంటే బాగుండుననిపిస్తుంది.

మామ్ బాల్యం, మత బోధకుడైన మావయ్య దగ్గర గడిచింది. ఆయన పీనాసి; కఠినుడు. ఆయన చెప్పు చేతల్లో మామ్ బాధలు పడ్డాడు. పెద్దయ్యాక నాస్తికుడయ్యాడు. మత బోధకుల్ని హేళనచేస్తూ చిత్రించడం, అట్లా చిత్రించిన నాటకాన్ని ప్రదర్శనకుగాను స్వీకరించని వుదంతం, ఇదివరలో చూశాం మత ప్రచారకుల్ని వెక్కిరించే ధోరణి, కొన్ని కథలలో కనిపిస్తుంది. నీతిని గురించి గొప్పగా ఉపన్యాసా లిచ్చేవారూ పెద్ద పెద్ద గొప్పలు చెప్పేవారూ, నిత్య జీవితంలో దొంగలనీ, వారి చేష్టలకీ, మాటలకీ పొత్తు కుదరదనీ, యీ ధోరణి సారాంశం చేసేవి గంగాస్నానాలన్న ... మన నానుడిని విడమర్చి చెప్పిన కథ లన్నమాట.

'ది వెసల్ ఆఫ్ రాత్' అనే కథ, ఒక తుంటర్ని గూర్చినది. అలాప్ దీవులలో 'బారు' అనే దీవిలో వుంటాడు ఆ తుంటరి. అతని పేరు 'రెడ్' త్రాగుబోతు. స్త్రీ లోలుడు; జూదం ఆడి దొంగ వ్యాపారం చేసుకుని పొట్ట పోసుకుంటాడు. పోలీసులు పట్టుకుని శిక్షిస్తూ వుంటారు ఆ 'బారు'ని పాలించేది ఒక డచ్ కంట్రోలర్. రెడ్ చేసే దురంతాలు, అక్కడుండే తెల్లవారికి తల

వొంపుగా వుందని, ఏదో నేరంమోపి మరోచోటికి పంపెయ్యమని కంట్రోలర్ని కోరతాడు, 'బారు'లో వుంటున్న మతప్రచారకుడు 'ఓవెన్' ఆఖరికి అట్లాంటి అవకాశం వచ్చి, 'పెడ్'పై నేరాలు ఋజువైనాక, ఆరునెలలు శిక్ష విధిస్తాడు కంట్రోలర్. ఆ ఆరుమాసాలు కొంతదూరంలో వున్న మరొక దీవిలో గడప మంటాడు. జైలు ఆ దీవిలోవుంది.

"తిరిగొచ్చాక మా ఇంటికిరా — ఇద్దరం కలిసి త్రాగుదాం" అని, పెడ్కి చుట్టల నిమిత్తం కాస్త డబ్బిచ్చి, పక్కదీవికి పంపుతాడు కంట్రోలర్. 'పెడ్' అక్కడ గడుపుతాడు. మరో వారానికి శిక్ష గడువు పూర్తవుతుందనగా, ఆ దీవిలో, తెల్లవాడైన కరణానికి మలేరియా వ్యాధి తగుల్తుంది. చికిత్స నిమిత్తం 'బారు' నుండి ఎవరినన్నా పంపమని కబురు చేస్తారు. బారులో మతప్రచారకుడు 'ఓవెన్' వైద్యుడు కూడా. కాని మలేరియా తగిలి వెళ్ళలేడు. ఆయన చెల్లెలు జోన్స్, నే వెడతానంటుంది నలభై యేళ్ళు, సన్నగా వుంటుంది. చదునుగావుండే వక్షం. అజీర్ణవ్యాధితో బాధపడుతూంటుంది ఆమె వెళ్ళి, కరణానికి చికిత్స చేస్తుంది. అక్కడ 'పెడ్'ని చూస్తుంది. 'బారు'లో దుండగీడుగా గుర్తుపడుతుంది శిక్ష ముగిసి, ఆ లాంచిలోనే పెడ్ కూడా బారుకి తిరిగి రావల్సివుంది జోన్స్ ఎక్కిన లాంచిలోనే తనూ బైలుదేరుతాడు. లాంచ్లో మరో ఇద్దరు మొగాళ్లుంటారు. ఆమె భయపడుతుంది లాంచ్ బైలుదేరి, మధ్యలో చెడిపోతుంది. వారు తిరిగి వెళ్ళి, ఆ రాత్రి ఆ దీవిలో గడిపి, మర్నాడు బాగుచేసుకొని బారు వెళ్ళడానికి నిశ్చయించుగుంటారు

"ఈ రాత్రి వొంటిగా, ముగ్గురు మొగాళ్ళతో, ఇక్కడ గడపనా?" అని అడుగుతుంది, జోన్స్ విసుక్కుంటూ.

"అట్లాంటి అవకాశానికి, ఎందరో ఆడవాళ్ళు ఎగిరి గంతేస్తారు" అంటాడు పెడ్.

గత్యంతరంలేక, ఆ రాత్రి అక్కడే గడుపుతుంది. నిద్ర పట్టదు. 'పెడ్' తనపైబడి దురంతం చేస్తాడని, భయంతో వొణికిపోతూ వుంటుంది జోన్స్. పెడ్ తర్వాత, ఆ మిగత ఇద్దరూ. ఎల్లాగ? ఏం చెయ్యడం? ప్రార్థిస్తుంది. కాని ఏమీ జరగదు. వాళ్లు ఏమీ చెయ్యరు. అందరూ 'బారు' చేరుకుంటారు. కొన్నాళ్ళ తర్వాత, మరో దీవిలో కలరా వ్యాపిస్తుంది. అక్కడివారి సపర్యలకై వెడతానంటాడు పెడ్ అతనితో నేనూ వెడతానంటుంది జోన్స్. 'మేమిద్దరం పెండ్లి చేసుగోబోతున్నాం' అంటుంది జోన్స్.

మత ప్రచారకులను ఆ విధంగా చిత్రిస్తాడు మామ్. కథానికా సంపు

టాలలో మొట్ట మొదటి కథ, 'రైన్' (వర్షం) అన్నది కూడా మత ప్రచారకుణ్ణి గూర్చినదే. మామ్ కథలన్నింటిలోకీ, ఇదే గొప్ప కథనంటారు విమర్శకులు, పాఠకులూ.

ఆయనకి కథకుడుగా ప్రపంచ ఖ్యాతి తెచ్చిపెట్టిన కథ ఇదే.

డాక్టర్ మెక్‌ఫైల్ యుద్ధంలో గాయపడి, గాయం బాగై, రిటైరై పసిఫిక్ దీవులలో ఏపియా అనే వూర్లో స్థిరపడిపోదామని, భార్యతో ఓడలో బయలుదేరాడు. ఆ దీవులలో మత ప్రచారకుడుగా వుంటున్న డేవిడ్‌సన్, ఆయన భార్య కూడా ఆ ఓడలోనే వెడుతున్నారు. మెక్‌ఫైల్ దంపతులకు, డేవిడ్‌సన్ దంపతులకు ఓడలో పరిచయం ఏర్పడింది. క్లబ్బుల్లో పేకాట లాడుతూ, తాగుతూ వ్యర్థ జీవితం గడిపేవారంటే ఆ ఇద్దరికీ గిట్టదు. ఓడలో, తాగుతూ, పాడుతూ, నాట్యంచేస్తూ గొడవచేసే ఇతర ప్రయాణీకులకు దూరంగా గడిపేవారు. డేవిడ్‌సన్‌కి యీ సరదాలు అసలు గిట్టవు అట్లా చెడిపోతున్న వారిని ఉద్ధరించడమే అతని పని; ఆదర్శం కూడా.

ఓడ 'పాగో పాగో' అనే చోట నిల్చింది. వారు దిగారు. అదొక చిన్న వూరు. రేవులో పనిచేసే వాళ్ళ నాలుగైదిళ్ళు, గవర్నర్‌గారిల్లు, రెండు మూడు హోటళ్ళు వుంటాయి. అక్కడ మసూరిక (చిన్నాట్లమ్మ) వ్యాధి చెలరేగడంవల్ల, అది తగ్గేవరకూ ఓడ బైలుదేర దనడంవల్ల ఆ వూళ్ళో గడపాల్సి వచ్చింది అతి కష్టంమీద, ఒక వర్తకుడి ఇంట్లో పై భాగంలో వారికి చోటు చూపించారు. వారితో ప్రయాణం చేసిన మరొకామె, 'థాంప్సన్' కి కూడా, ఎక్కడా జాగా దొరకనందున, ఆ ఇంట్లోనే కింది గదిచ్చారు. ఆడంబరమైన దుస్తులు ధరిస్తుం దామె. వెకిలినవ్వు. చౌకబారు కబుర్లు తుంటరిది. సాయంత్రం అయ్యేసరికి, నలుగురైదుగురు మొగాళ్ళు ఆమె గదిలో పోగై, గ్రామ్‌ఫోన్ సంగీతం వింటూ, పాటలు, అల్లర్లు సల్పుతూ వుంటే, పైనున్న మెక్‌ఫైల్ దంపతులు, డేవిడ్‌సన్ దంపతులు చిరాకు పడతారు. విపరీతమైన దోమల బాధ, నిలవకుండా వర్షం. కింది గదిలో అల్లర్లు. ఆమెది పడుపువృత్తి అని తెలిసిపోతుంది.

డేవిడ్‌సన్ ఆమె గదిలోకెళ్ళి గ్రామఫోన్ ప్లేట్ వూడలాగి, గిరవాటెట్టి చివాట్లు పెడతాడు. థామ్సన్, తాగుతున్న గ్లాస్‌లో ద్రావకాన్ని అతని మొహాన కొడుతుంది. మర్నాడు ఉదయం డేవిడ్‌సన్ సతినిచూసి, "ఎల్లావుం దాయనకి?" అని అడుగుతుంది థామ్సన్. "నాతో మాట్లాడకు నన్నేమన్నా అన్నావంటె, ఇక్కడనుంచి నిన్ను తరిమేయిస్తాను" అంటుం దావిడ. ఇంటి ఆసామీ ఐన హారన్‌ని పిలిచి, ఆమెను బైటికి పంపించమంటారు ముందుగానే అద్దెడబ్బులిచ్చి

నామెను వెళ్ళిపొమ్మనలేనంటాడు. తనే వెళ్ళి మాట్లాడతానని, ఎప్పుడు ఆమెకి వీలో కనుక్కురమ్మని నౌకర్ని పంపుతాడు డేవిడ్‌సన్

"వృత్తివేళలప్పుడు తప్ప, ఇంకెప్పుడొచ్చినా పరవాలేదు" అని కబురంపుతుంది థామ్సన్.

డాక్టర్ మెక్‌ఫైల్‌కి నవ్వొస్తుంది. కోపంతో నిండిన డేవిడ్‌సన్ మొహం చూసి, నవ్వుని మింగేస్తాడు. డేవిడ్‌సన్ ఆమె గదిలో కెడతాడు. ఉపన్యసిస్తాడు. పాడువృత్తి వొదిలెయ్యమంటాడు. పశ్చాత్తాపపడమంటాడు. ఆత్మను రక్షిస్తానంటాడు. అల్లాగ రెండు మూడు రోజులు ఆమెతో మాట్లాడి, కొంత మార్పు తీసుకొస్తాడు. ఆమె ఆత్మకోసం, రాత్రిళ్ళు ప్రార్థనలు సల్పుతాడు డేవిడ్‌సన్. అతనితో కలిసి, అయిష్టంగా మెక్‌ఫైల్ కూడా ప్రార్థిస్తాడు.

అంతటితో తృప్తిపడక, డేవిడ్‌సన్, గవర్నర్‌తో మాట్లాడి ఆమెని స్వదేశమైన సాన్‌ఫ్రాన్సిస్కోకి పంపించి వెయ్యవల్సిందిగా చెప్తాడు. గవర్నర్ అమెరికా దేశస్థుడు. మత ప్రచారకుడైన, డేవిడ్‌సన్‌కి అక్కడ పలుకుబడివుంది. అతన్ని మంచి చేసుగోవడం ఉచితమని, థామ్సన్‌పై వారం రోజుల్లో రానున్న ఓడలో, సాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళవల్సిందిగా ఉత్తరువు జారీ చేస్తాడు.

ఆమె గోల పెడ్తుంది అక్కడికి పంపొద్దు అంటుంది. అక్కడ తనవాళ్ళున్నారు. ఈ వృత్తిలో వున్న తనని వాళ్ళు క్షమించరు. జైల్లో పెట్టిస్తారు. అక్కడికి తప్ప, ఇంకెక్కడికైనా వెళ్ళడానికి తను సిద్ధం. అక్కడున్నంత కాలం, మొగాళ్ళతో సంపర్కం పెట్టుకోను – యీ కాస్త సాయం చెయ్యండని మెక్‌ఫైల్‌ని బ్రతిమలాడుతుంది. ఆయన గవర్నర్‌తో మాట్లాడతాడు కాని లాభం లేదు. ఆయన, ఉత్తరువు రద్దు చెయ్యడు. ఆమె మొర్నాడు ప్రయాణమవాలి మేడమీదికొచ్చి డేవిడ్‌సన్ కాళ్ళమీదపడి, తనకే ప్రమాదం జరక్కుండా కాపాడమని ఏడుస్తుంది; మొత్తుకుంటుంది క్షమించమంటుంది. ఇంక జాగ్రత్తగా మసులుకుంటానంటుంది. అతను కరగడు. మొర్నాడు ప్రయాణం కమ్మంటాడు. ఆమె బాగుపడాలని, ప్రార్థనలు సల్పుతాడు

తన గదికెళ్ళి ఏడుస్తుంది థామ్సన్. మెక్‌ఫైల్ వెళ్ళి వోదార్చి, మందిచ్చి విశ్రమించమంటాడు. డేవిడ్‌సన్‌ని రమ్మనమనండి అని కబురెడుతుంది. ఆయన వస్తాడు. "చూశావా, పరమాత్మ నా ప్రార్థన విన్నాడు. నీ ఆత్మ వికసిస్తోంది" అంటాడు.

"అట్లా బాగుపడిన స్త్రీని జైలుకి పంపుతాననటావెందుకు?" అని ప్రశ్నిస్తాడు మెక్‌ఫైల్.

"తప్పనిసరి. ఆమెకోసం నే పరితపించననుకోకండి. భార్యగా, సోదరిగా ఆమెని ప్రేమిస్తాను. ఆమె జైల్లో వుండి బాధపడిన అనుక్షణమూ, నేనూ ఆమెతో సమంగా బాధపడతాను" అంటాడు డేవిడ్‌సన్.

"గాడిదగుడ్డు" అంటాడు మెక్‌ఫైల్. (ఇంగ్లీషులో 'బంకమ్')

"నువ్వు అంధుడవు సత్యాన్ని తెలుసుకోలేవు. ఆమె పాపి. పాపం అనుభవించి తీరాలి. బాధపడి, కృశించి, ఎండి చావాలి. అప్పుడు దైవం కరుణిస్తాడు. కరుణామయుడు దైవం" అంటాడు. ఆమెని ఉద్ధరించడానికి, ఆ రాత్రంతా ఆమె గదిలో గడుపుతాడు డేవిడ్‌సన్.

అమ్మయ్య, ఉదయానికి థామ్సన్ వెళ్ళిపోతుంది – ఇంక ఆదుర్దా పడనక్కర్లేదనుకుని, ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోతాడు మెక్‌ఫైల్. తెల్లవారగానే, ఇంటియజమాని అతన్ని లేపి బైటకి రమ్మంటాడు ఇద్దరూ కలిసి, రోడ్డు మీది కొస్తారు. కాస్త దూరం వెళ్ళాక సముద్రపుటొడ్డికి చేరుకుంటారు. అక్కడ డేవిడ్‌సన్ శవాన్ని చూస్తాడు మెక్‌ఫైల్. పీక తెగి వుంది. డేవిడ్‌సన్ చేతులో కత్తి వుంది ఈ వార్త డేవిడ్‌సన్ భార్యకి తెల్పుతాడు. ఆమె శవాన్ని చూపించమంటుంది చూపిస్తారు. ఆమె ఏమీ మాట్లాడదు. రెప్పవాల్చకుండా, నిశ్చలంగా చూస్తూ తిరిగి వొస్తుంది ఇంటికి చేరుకుంటారు థామ్సన్ గుమ్మంలో నిలబడి వుంది. మొదట్లోకిమల్లె ఆడంబరంగా ముస్తాబై · కులాసాగా, ఉల్లాసం చూపెడుతూ నిలబడింది. డేవిడ్‌సన్ సతిని చూడగానే వెకిలిగా నవ్వింది. ఆమె మొహాన వూసింది. ఈ దృశ్యం చూసిన మెక్‌ఫైల్ వొళ్ళు మండిపోయింది. థామ్సన్ గదిలోకెళ్ళి–

"ఏమిటీ వేషం, వాగుడు? ఆ గ్రామ్‌ఫోన్ నిలుపు" అని గర్జించాడు. గ్రామ్‌ఫోన్ రికార్డు లాగేసి, గిరవా టెట్టాడు.

"డాక్టర్‌జీ, ఈ దాబులు చెయ్యకు నా ముందు అసలు నా గదిలో ఏం పని?" అంది.

"ఏమిటి నువ్వనేది?" అన్నాడు డాక్టర్.

ఆమెలో వున్న కసిని, కోపాన్ని కళ్ళల్లో చూపెడుతూ, "మొగాళ్ళు – మీ మొగాళ్ళందరూ పందులు అందరూ అంతే – మురికి పందులు. పందులు!" అంది. డాక్టర్ మెక్‌ఫైల్ వూపిరి బిగపెట్టాడు. అతనికి అర్థమైంది.

ఇదీ ఇందలి కథ. నలభై పుటల కథను ఇల్లా టూకీగా పొడి మాటల్లో చెప్పడం అన్యాయమే. స్పష్టమైన పాత్రలు, ఆ ప్రాంతం వర్ణనలు, అద్భుతమైన ముగింపు – ఒక్క వృధా వాక్యం వుండదు చదివాక ఒక అపూర్వ అనుభవం

మనదై పోతుంది. మానవ ప్రకృతి అనంతమైన చీకటి గుహలలో, ఒకదాన్ని వెలిగించినట్లవుతుంది మామ్ కథలు 3 భాగాలుగా పేర్కొన్నాను. ఆయన ముద్రవర్ధ కథలు, మంచి కథలు, గొప్ప కథలు. ఈ కథని మొదటిభాగం నుండి విడదీసి గొప్ప కథల జాబితాలో వుంచాలనిపిస్తుంది. విమర్శకులు అలా వుంచారు కూడా. శంకలు, అనుమానాలూ మిగలక, సూటిగా మనస్సుకి హత్తుకిపోయి తృప్తి కలిగిస్తేనేకాని, అది ఉత్తమ కథ కాదన్న మామ్ సిద్ధాంతం ప్రకారం నాలో శంకలు, అనుమానాలు వుండటం మూలాన ఇది గొప్ప కథగా పేర్కొనలేదు. డేవిడ్‌సన్ క్రైస్తవమత ప్రచారకుడు – పతితను ఉద్ధరించాలని, ఒక్క మత ప్రచారకులకే వుండనక్కర్లేదు. ఈ ఉదంతం, దూరప్రాంతంలో కాక, ఏ ఐర్లండులోనో, స్కాట్లండ్‌లోనో జరిగినట్లు చూపితే, ఆంగ్ల పాఠకులు హర్షిస్తారా? పర ప్రాంతాల్లో మత ప్రచారకుణ్ణి కూలదొయ్యాలన్న సంకల్పంతో డేవిడ్‌సన్ పాత్ర చిత్రణ కొంచం అతిగా సాగిందేమోననిపించింది. ఆయన మాటలు, ధోరణి, అతిశయోక్తిగా, వికటంగా, అక్కడక్కడ అసహజంగా తోస్తాయి. ఈ కారణాలవల్ల ఈ కథను మంచి కథల జాబితాలో వుంచుతాను. ఆ జాబితాలో మొదటి కథగా వుంచడానికి అభ్యంతరంలేదు. మామ్ ముద్రపడిన కథలలోనూ, మంచి కథలలోనూ, ఏదో ఒక పాత్ర ద్వారా వ్యాఖ్యానిస్తాడు. అతను అలవర్చుకున్న దృక్పథమే, పాఠకుడూ అలవర్చుకుంటాడు. ఈ కథలో డాక్టర్ మెక్‌ఫైల్ పాత్ర వెనక మామ్ ఉన్నాడు డేవిడ్‌సన్ పెద్ద పెద్ద కబుర్లు చెప్పి అట్టహాసంగా ఆదర్శ ప్రకర్ష సల్పుతూంటే, ఒకచోట మెక్‌ఫైల్ "గాడిద గుడ్డు" అంటాడు. ఇది మామ్ కంఠం. ఈ సోమర్‌సెట్ మామ్‌లో కాస్తంత - ఒక పావు పాలు - ఆంధ్రత్వం వుందనిపిస్తుంది. ఆడంబరంతో, పెద్ద పోకిళ్ల పోయి, డాబులు, డబుక్కులుచెప్తూ, ఉత్ప్రేక్షతో కూడుకున్న భావవ్యాయామం, భాషా కసరత్తులు సల్పేవార్ని చూసి, 'పోదూ, మహ చెప్పొచ్చావ్!' అని వారిని కిందికి లాగెయ్యడంలో ఆంధ్రత్వం ఉందనుకుంటే, అది మామ్‌లో వుంది. తోటి వారిపట్ల ఆరాధనా భావం అంతగా ఉండదు శిలా ప్రతిమని లేవదీసి స్తంభంపై నిలబెడితే, దాన్ని కాస్త కదిపి, వీలైతే పడగొట్టి భూస్థాపితం చెయ్యాలని పించడం అన్నమాట. అందర్లాగే మామూలుగా వుండి, కడుపులో చల్ల కదలకుండా, ఎవరి పని వారు చేసుకుపోతూ, కులాసాగా జీవిస్తూ, పెద్ద ఆదర్శాలకోసం దీక్ష, పెనుగులాట కనబర్చకపోవడం - ఈ ధోరణి ఛాయ. ప్రజాస్వామ్యానికి సన్నిహితమైంది. అందుకే ఆంధ్రులకి, మామ్ రచనలంటే అంత ఇష్టం అనుకుంటా.

మామ్ ముద్రవద్ద కథలలో మూడవ లక్షణం - పాశ్చాత్య నాగరికత నుండి పారిపోయి ప్రాక్ దేశాలలో, దూరంగా, ఏకాంతంగా, ప్రశాంతంగా గడపాలని ఉండడం ఒక కథలో మెడికల్ విద్యార్థి మరో దేశం పారిపోయి, హోటల్లో వైటర్‌గా, తర్వాత ముష్టివాడుగా తయారవుతాడు సముద్రపు టొడ్డున, ఇసుక తిన్నెల నడుమ, పర్వత శిఖరాల సందుల్లోంచి, సూర్యోద యాన్ని చంద్రోదయాన్ని తిలకిస్తూ, తిండి లేక మాడి చనిపోతాడు. "సౌందర్యం ఆస్వాదించి, పట్టలేక చచ్చిపోయ్యాడు" అని మామ్ వ్యాఖ్యానం. పాశ్చాత్య నాగరికతలో కుళ్ళు, కుతంత్రం, ప్రకృతికి విరుద్ధమైన విలువలు ప్రతిపాదించిన అలవాట్లూ, ధనాన్వేషణ, పోటీ తత్వం-ఇవన్నీ వ్యక్తి వికాసానికి విరుద్ధాలనీ-యీ గంద్రగోళంలోంచి పారిపోయి, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుని సహజంగా జీవించడమే, పరమార్థమనీ-యీ తత్వం సారాంశం మామ్ వ్రాసిన చాలా కథలలో ఇదే వస్తువు. ఈ తత్వాన్ని విశదీకరిస్తూ వ్రాసిన కథ 'ఎడ్వర్డ్ బెర్నార్డ్ పతనం' అన్న కథ. ఇట్లాంటివి ఒక పాతిక కథలున్నాయి. వాటన్నిటి సారం, యీ కథలో వుంది గనక, దాన్ని గురించి చెప్తాను.

షికాగో పట్నంలో ధనిక కుటుంబానికి చెందిన కన్య ఇసబెల్. ఆమెకు ఎడ్వర్డ్ బర్నార్డ్, బేట్‌మన్ అనే ఇద్దరు స్నేహితులుంటారు ఇద్దరూ ఆమెని ప్రేమిస్తారు. కాని ఆమె ఎడ్వర్డ్ బర్నార్డ్‌ను ప్రేమిస్తుంది బేట్‌మన్, ఉదారతతో సరిపెట్టుకుంటాడు. ఒక ఆపద సంభవిస్తుంది. బాంక్ దెబ్బతిని, బర్నార్డ్ తండ్రి దివాళ తీస్తాడు. పేల్చుకుని, ఆత్మహత్య చేసుకుంటాడు. బర్నార్డ్‌కు డబ్బు లేదు లేకుండా ఇసబెల్‌ని వివాహమాడలేడు తండ్రి స్నేహితుల సహాయంతో, దూర ప్రాంతమైన టహిటీ దీవిలో వ్యాపారసంస్థ నెలకొల్పి, తగినంత ధనం ఆర్జించి, తిరిగొచ్చి ఆమెను వివాహమాడతానంటాడు తిరిగి వచ్చేవరకూ వేచి ఉంటానంటుంది ఇసబెల్.

"అంతవరకూ వేచి ఉండగలవా?" అంటాడు.

"అంత త్యాగానికి నువ్వు అర్హుడవు కావా?"

"నవ్వుతాలు కాదమ్మాయి."

"బెంగపడకు. నిన్ను ప్రేమించాను తిరిగి రాగానే చేసుకుంటాను" అంటుంది.

బర్నార్డ్ టహిటికి ప్రయాణమౌతాడు. వెళ్ళే ముందు, ఇసబెల్ తండ్రి అతన్ని దూరంగా తీసుకెళ్ళి జాక్సన్ అనే వారి బంధువు - జాక్సన్, ఇసబెల్‌కి మామయ్య అవుతాడు - టహిటిలో వున్నాడనీ, అతన్ని కలవకుండా, దూరంగా

ఉండటం మంచిదనీ సలహా ఇస్తాడు. ఎందుకంటే 'జాక్సన్' డబ్బు విషయంలో మోసం చేసిన నేరంపై, ఏడేళ్ళ జైలు శిక్ష అనుభవించి, టహిటిలో వుండి పొయ్యాడు. ఆ అపవాదు వల్ల, ఇసబెల్ కుటుంబ గౌరవం చెడకుండా, జాక్సన్ కుటుంబాన్ని యూరప్‌లో ఉండమని, డబ్బు పంపుతూ పోషించాడు, జాక్సన్ ఒకప్పుడు ధనికుడు. బోలెడు దానాలు చేశాడు. అక్రమంగా డబ్బు గడించడం వల్ల జైలు కెళ్ళాడు. అందుకని అతన్ని తప్పించుకు తిరగమని సలహా ఇస్తాడు.

బర్నార్డ్ టహిటిలో వ్యాపార సంస్థలో చేరాడు. వారం, వారం ఇసబెల్‌కి ప్రేమ లేఖలు వ్రాసేవాడు. తర్వాత, నెల కొకటి వ్రాసేవాడు ఆ తర్వాత వ్రాయడమే మానేశాడు ఇసబెల్‌కి ఆశ్చర్యమేసింది. బర్నార్డ్ ఏమయ్యాడు? ఎట్లా ఉన్నాడు. వ్రాయడేం? స్నేహితుడు బేట్‌మన్‌కి కబురుపెట్టి అతనితో సంప్రదించి, బర్నార్డ్ ఎట్లా ఉన్నదీ, ఎక్కడున్నదీ కనుక్కురమ్మని, బేట్‌మన్‌ని టహిటికి ప్రయాణం కట్టించింది. బేట్‌మెన్, ఆమె మాట కాదనలేక, టహిటికి వెళ్ళాడు. బర్నార్డ్ పని చేస్తున్న సంస్థ పేరు తెలుసుకుని అక్కడి కెళ్లాడు. ఇప్పుడక్కడ పని చెయ్యడంలేదు, మానేశాడన్నారు అలా రోడ్డు మీద వెడుతుండగా, చిన్న దుకాణంలో, దారం అమ్ముతూ కనబడతాడు బర్నార్డ్. చినిగిన బట్టలు ధరించి బీదస్థితిలో వుంటాడు. బేట్‌మన్ ఆశ్చర్యపడతాడు.

"కంపెనీవాళ్ళు నన్ను ఉద్యోగంలోంచి తీసేశారు ఈ చిన్న పనిలోచేరి, పొట్ట గడుపుకుంటున్నాను. నా కిది బాగానే ఉంది." అన్నాడు బర్నార్డ్. తనింటికి తీసుకెడతాడు. అక్కడ జాక్సన్‌ని పరిచయం చేస్తాడు - జైల్లోంచి వొచ్చిన జాక్సన్‌ని—బేట్‌మన్ ఇబ్బందిలో పడతాడు. ఈ జాక్సన్‌కి దూరంగా ఉండమనే ఇంటి దగ్గర చెప్పి పంపారు. జాక్సన్, వారిద్దర్నీ రాత్రి తనింటికి భోజనానికి ఆహ్వానిస్తాడు. అతను వెళ్ళాక, బేట్‌మన్ అంటాడు.

"వాడు దొంగ, జైలు శిక్ష అనుభవించాడు. వాడితో స్నేహం ఏమిటి నీకు?"

"నా కతనంటే చాలా ఇష్టం. నన్ను మేనల్లుడుగా స్వీకరించాడు. అతను ఒకప్పుడు చోరుడే. కాని నేను జీవితంలో తెల్సుకున్నవన్నీ అతని వద్దనుండే."

"అతను నీకు నేర్పిందేమిటి?"

"జీవించడం."

రాత్రి ఇద్దరూ, జాక్సన్ ఇంటికి వెళ్ళారు కొండ మీద ఇల్లు. జాక్సన్ భార్య - టహిటి దేశపుది - వారిని ఆహ్వానించింది. ఆమె పేరు లవీన. స్నానానికి బట్టలిచ్చింది. అవి ధరించి సముద్ర స్నానం చేశారు. హాయిగా

నవ్వుకుంటూ, చిన్న పిల్లలల్లే ఈదుకుంటూ, స్నానం చేశారు. ఇంటి కొచ్చారు. జాక్సన్, బర్నార్డ్ - ఇద్దరూ, ఆ ప్రాంతపు బట్టలు ధరిందారు — గూడకట్టు పంచి, జుబ్బా, పూలతో కూర్చిన టోపి: బేట్‌మన్‌ని పిల్చి-

"అటు చూడు — బాగా చూడు " అన్నాడు. వరండాలోంచి చూస్తే దూరంగా కనబడుతోంది సముద్రం - మసగగా అలలు, ఆకాశంలో మేఘాల నడుమ కలిసిపోయ్యే సముద్రపుటంచు, మహా కవి కల్పించిన కావ్యం వలె - అందంగా, మాయగా కనబడే ప్రకృతి దృశ్యం కనబడింది

"ఇది సౌందర్యం. ముఖాముఖిని కల్సుగున్న సౌందర్యం. ఈ క్షణమే తర్వాత కరిగిపోతుంది. నువ్వు జన్మలో మరెప్పుడూ చూడని సౌందర్యం; అనంతంలో అడుగు పెడుతున్నావు యిది చూడగానే" అన్నాడు జాక్సన్.

తన పిల్లల్ని పరిచయం చేశాడు జాక్సన్. వింత వింత పూల మాలలు వేశారు బేట్‌మన్ మెడలో. వారి దుస్తులు వేసుగోమని గొడవ చేశారు. వేసుగున్నాడు. పాటలు, ఆటలు సాగించారు. ఆనందంగా గడిచిపోయింది ఆ రాత్రి.

మొర్నాడు బర్నార్డ్ ఇంటికొచ్చేశారు. జాక్సన్ సంపర్కం మంచిదికాదని సోది మొదలెట్టాడు బేట్ మెన్.

"మొదట్లో నేనూ అల్లానే అనుకున్నాను. అతడు అసాధారణ వ్యక్తి. జైలు కెళ్ళిన ఉదంతం దాచడు. చెప్పేవేస్తాడు. నువ్వే విన్నావుగా—అతను తనకి జరిగిన వాటిని విమర్శించాడు. జీవితాన్ని అంగీకరిస్తాడు. నైతిక చింతనకి అతీతుడు" అన్నాడు బెర్నార్డ్.

"నువ్వన్నది నిజమైతే, మంచి, చెడూ, అంటూ ఉండనే వుండవు" అన్నాడు బేట్‌మన్.

"మంచి చెడూ మారవు. అవి స్ఫుటంగానే ఉంటాయి. కాని ఎవడు మంచి, ఎవడు చెడ్డ అన్న విచక్షణ అస్పష్టమౌతుంది, జాక్సన్ మంచి పనులు చేసే చెడ్డవాడో, చెడ్డ పనులు చేసే మంచివాడో ఎవరు చెప్పగలరు? మనందరం కాస్త పాపులం, కాస్త యోగులం" అన్నాడు బర్నార్డ్. ఈ విధంగా చాలా సేపు వాదించుకుంటారు.

"నువ్వు జీవితంలో ఆశించేది ఏది?" అని అడుగుతాడు బేట్‌మన్.

"నవ్వకపోతే చెప్తాను. సౌందర్యం, సత్యం, మంచితనం."

"ఇవి షికాగోలో దొరకవా?"

"కొందరికి. నాక్కాదు,"

ఇసబెల్‌ని వివాహమాడవల్సిందిగా కోరి, బేట్‌మన్‌కి పీడ్కోలిస్తాడు.

షికాగో వెళ్ళి ఆమెతో జరిగిందంతా చెప్తాడు బేట్‌మన్. ఇసబెల్ బేట్‌మన్‌ని పెండ్లి చేసుకుంటుంది.

"మొదటి నుంచీ, నేను నిన్నే ప్రేమించాను?" అంటాడు బేట్‌మన్.

"మరి ఇన్నాళ్ళూ చెప్పలేదేం?" అంటుంది

నాగరీకులు, ఆ విధంగా సమాధానం కుదుర్చుకుంటారంటాడు మామ్. కావల్సినదానికోసం ఏ త్యాగమూ చెయ్యరు. గౌరవం, కుటుంబ మర్యాద, ధనం-వీటి కోసం, సత్యాన్ని, సౌందర్యాన్ని వదులుకుంటారు. దొరికిన దానితో సమాధానపడతారు.

సంప్రదాయం శాసించిన జీవిత విధానంపై తిరుగుబాటు చేసి, కొత్త దోవ తొక్కిన వ్యక్తులంటే మామ్‌కి యిష్టం. ఎటొచ్చీ ఆ కొత్త దోవ, వారికి ఆనందాన్నివ్వాలి. సహజ వ్యక్తిత్వాన్ని ఋజువు చెయ్యాలి. పంచేంద్రియాలూ వినియోగంలో కొచ్చేటట్లు జీవించాలి. దేన్నీ విసర్జించకూడదు. సంప్రదాయ సమాజంపై తిరుగుబాటు చేసినవారు, సమాజాన్ని తమ వైపు తిప్పుకుంటారు. కావున పురోగమనానికి వారే కారకులౌతారంటాడు బెర్నార్డ్ షా. పెద్దమనుషులు లోకం అంతటా ఒకలాగే ఉంటారు. రౌడీలలోనూ, తుంటరులలోనూ వైవిధ్యం వుంటుందంటాడు షా మామ్ తత్వమూ ఇదే. చాలా కథలు, ఇల్లా సమాజం కూర్చిన నైతిక నమూనాలో ఇమడక, పారిపోయి, సమాజం దృష్టిలో పతనం చెందినవార్ని గురించినవే.

'మా అబ్బాయి రచయిత కావాలంటున్నాడు. మీ సలహా ఏమిటి?' అని అడిగిందట ఒకామె మామ్‌ని.

'నెలకి రెండొందలో, మూడొందలో ఇచ్చి, నరకానికి వెళ్ళమని చెప్పు.' అన్నాడుట. ఇక్కడ 'నరకం' అంటే ఇష్టమొచ్చినట్లు, తిరిగి, చెడిపొమ్మని, అనుభవించమని. ఈ ధోరణి కథ లన్నింటిలోకీ నా కిష్టమైంది 'చీమ, గొల్లభామ' అన్న కథ. ఇది ప్రథమా విభక్తిలో, మామ్ 'నేను'గా వ్రాసిన కథ. కథ చెప్పడమే కాకుండా, ఆయన కథలో పాత్ర కూడ ఈ 'నేను' కథ నడపడంలో మామ్ అద్వితీయుడు ఇంత చమత్కృతి, గడుసుదనం, చూపిన మరొక రచయితని నే నెరగను తనుగా పాఠకుడితో ఒక బంధం ఏర్పరుచుకోడంలో వుంది - ఇందలి కళ దీన్ని దృష్టిలో వుంచుకునే కథా రచనలో మామ్ అగ్రగణ్యుడని యీ వ్యాసం ప్రారంభంలో చెప్పడం జరిగింది.

'నేను' గా చెప్పిన కథా ప్రారంభం, వ్యాసంలా నడుస్తుంది చెప్పే ఆయన, అలవాట్లు, అభిరుచులు, చెప్పగుంటాడు, అవి పాఠకుడికి అందుబాట్లో

వున్నవై వుంటాయి. చాలా మంది సిగరెట్లు కాలుస్తారు. "సిగరెట్లు మానేశానన్న వాళ్ళంటే నాకు అమిత భయం" అని కథ ప్రారంభిస్తే కాల్చే పాఠకులందరూ తృప్తిపడి, చివరిదాకా చదవడం సాగిస్తారు. సామాన్యులలో వుండే లోటుపాట్లు, తెలివి తేటలు, అభిరుచులు, ఆదర్శాలు — వీటికి అనుగుణంగా ఉన్నవాటినే రచయిత బైట పెడతాడు. స్వగతంలో ఇల్లా బలహీనతలు పంచుకోడంవల్ల మనకి ఇష్టుడౌతాడు. మరీ తెలివైనవాడుగా అగపడకూడదు. తెలివిహీనుడుగా ఉండకూడదు. పాఠకుడు, రచయిత కూడా తనలాంటివాడే అనుకోవాలి. ఇవన్నీ వ్యాసంలోవుండే లక్షణాలు. కథలో వీటిని వాడుకోడం మామ్ ప్రత్యేకత. 'చీమ — గొల్లభామ' కథ ఇల్లా ప్రారంభమౌతుంది.

చిన్నప్పుడు పిట్ట కథల్ని చదివించేవారు నాచేత. చదివాక, అందులో నీతి ఏమిటో జాగ్రత్తగా చెప్పేవారు. అల్లా చదివిన కథల్లో 'చీమ—గొల్లభామ' కథ ఒకటి. సోమరితనానికి శిక్ష, కష్టించినవాడికి మేలు సమకూరుతాయని ఇందులో పాఠం. ఈ పిట్టకథ అందరూ చదివే వుంటారు — తెలిసినదాన్ని గురించి చెప్పినందుకు నన్ను క్షమించాలి. ఈ కథలో చీమ, శీతాకాలానికి కావల్సిన వాటినన్నిటినీ, కష్టపడి, వేసంగిలో సమకూర్చుకుంటుంది. గొల్లభామ హాయిగా ఆకు మీద కూర్చుని పాడుకుంటుంది శీతాకాలం వస్తుంది చీమకి బోలెడు మేత వుంది. గొల్లభామకి ఏమీ మిగల్దు నాకేమన్నా పెట్టమని అడుగుతుంది చీమని. అప్పుడు చీమ అడుగుతుంది :

"వేసంగిలో ఏం చేశావ్?"

"రాత్రి, పగలు, పాడుకున్నాను."

"సరే! పాడుకున్నావుగా. ఇప్పుడెళ్ళి నాట్యం చెయ్యి" అంటుంది చీమ వెటకారంగా. నేనేదో మొండి ఘటాన్ననుకోకండి, బాల్యంలో ఇట్లాంటి వాటిని గురించి పట్టించుకోం — అప్పుడు అంత నైతిక చింతనా ఉండదూ — కాని, యీ పాఠం బొత్తుగా నాకు రుచించదు స్మాండి. ఆ గొల్లభామపట్లే నా సాను భూతంతా. చీమని చూసినప్పుడల్లా, కాలేసి తొక్కేవాణ్ణి. పొదుపరితనం వ్యవహారిక జ్ఞానంపట్ల నాకున్న అసంతృప్తిని యీ విధంగా ప్రకటించేవాడిని.

ఆ మధ్య మిత్రుడు రామ్‌సేతో మాట్లాడుతున్నప్పుడు యీ పిట్ట కథ జ్ఞాపకం వచ్చింది." అల్లా ప్రారంభమౌతుంది కథ. చాలా చిన్న కథ. రెండు మూడు పుటలే. అయినా, నవలకి సరిపడ్డంత ఉదంతాన్ని యీ చిన్న కథలో — యీ పేజీ వ్యాసంలో ఇమడ్చగలిగాడు.

రామ్‌సే ప్లీడరు. భార్య పిల్లలు గల పెద్ద మనిషి. ఏకపత్నీవ్రతుడు.

ఆఫీసుకెళ్ళడం, రావడం, తోట పని చూసుకోడం అంతే. కాస్తంత నిలవ చేసుగుని, రిటైరై ఇల్లు కట్టుకుని స్థిరపడాలని చూస్తున్నాడు. అతని తమ్ముడు టామ్ రౌడీ, తుంటరి. జూదం, తాగుడు, స్త్రీలోలత్వం, బదుళ్ళుచ్చుకోడం, ఏదో నేరం చెయ్యడం, పోలీసుల చేతుల్లో పడ్డం – ఇదీ వరస. అప్రతిష్ఠమాపు చెయ్యడానికి, టామ్‌కి డబ్బిచ్చి, దూరంగా యూరపులో గడుపు, ఇక్కడికి రాకు అని పంపించివేశాడు రామ్‌సే. పై పెచ్చు టామ్‌కి భార్య, ఇద్దరు పిల్లలు. వాళ్ళని వదిలేసి పారిస్‌లో జూదం ఆడుతూ గడుపుతాడు. ఒకడిదగ్గర-క్రోన్‌షా అనే వాడిదగ్గర – అప్పు తీసుకుని తీర్చలేదు వాడు కోర్టు కీడుస్తానని బెదిరించాడు టామ్ అన్నగారికి వ్రాశాడు. ఇదొక గొడవవుతుందని, డబ్బిచ్చి, కేసు లేకుండా పరిష్కారం చేశాడు ఆ డబ్బుతో టామ్, క్రోన్‌షా మళ్ళా జూదం మొదలెట్టారు. అల్లా ఇరవై యేళ్ళు తాగుతూ, స్త్రీలతో గడుపుతూ, జూదం ఆడుతూ, శుభ్రమైన బట్టలు ధరించి, పెద్ద పెద్ద హోటళ్ళలో గడిపాడు టామ్.

యాభయ్యోపడిలో పడ్డాడు. ఇంక టామ్ వెర్రి వేషాలెయ్యడు అనుకున్నాడు రామ్‌సే. అనుభవిస్తాడు పనీ పంగూ లేకుండా తిరిగినందుకు తగిన శాస్తి జరుగుతుంది టామ్‌కి, అనుకుంటాడు.

"ఏం జరిగిందో తెలుసా?" అన్నాడు రామ్‌సే తమ్ముడి గొడవల్ని వర్ణిస్తూ.

"ఏం జరిగింది?"

"వాడికి తల్లిగా ఉండవల్సినంత వయస్సు గల అవిడను పెండ్లాడాడు. ఆమె చచ్చింది. ఆస్తంతా వీడికి రాసి చచ్చింది. రెండిళ్ళు, భూములు, మిలియన్ పౌనులు, ఇదేం న్యాయం? న్యాయం కాదు – క్షణం తీరకుండా, కష్టించి పని చేశాను. భార్యని విడవకుండా ఉన్నాను పిల్లల్ని పెంచాను. నాకు కానీ మిగిలింది లేదు, ఆ టామ్‌గాడు .. "

"నేను, నవ్వి, నవ్వి, పక్కలు పగిలేటట్లు నవ్వి, కుర్చీ మీద నుండి కూలిపొయ్యాను రామ్‌సే నన్ను క్షమించడు కాని టామ్ అప్పుడప్పుడు నన్ను పార్టీలకి రమ్మని ఆహ్వానిస్తూ వుంటాడు. పెద్ద బంగ్లా. వెడతాను. పార్టీ ముగిసి వచ్చేస్తూ ఉంటే కాస్తంత చేబదులడుగుతాడు – అలవాటు చొప్పున. ఒక సావరిన్ మాత్రమే ననుకోండి!"

అదీ కథ ముగింపు.

రెండో విభాగం – మంచి కథలు. 'వర్షం' అనే కథ ఎట్లాంటిదో

చూశాం. మామ్ ముద్ర ఉన్నప్పటికీ, మంచి కథలలో మానవ నైజం పరిశీలనలో, చిత్రణలో, తన వ్యక్తిత్వాన్ని మరిచిపోయి, వూహా జగత్తులో లీనమైపోయి, కళా సృష్టికి అనువైన ఒక స్థాయిని అందుకోడం జరుగుతుంది – ఇది మామ్ కథ అని తెలియకపోయినా మనం చదివి రసానుభూతి పొందుతాం. 'లేఖ' అన్నది మంచి కథ. కాని అది చాలా పెద్దది. శైలితో నిమిత్తం లేకపోయినా కేవలం కథలుగా బాగున్న కథలూ ఉన్నాయి. 'కలెనెల్స్ లేడి' అట్లాంటిది. ఆయన ఆర్మీ నుండి రిటైరై, భూములు తోటలు చూసుకుంటూ వుంటాడు. ఆయన భార్య పల్చగా, సన్నగా ఉంటుంది. ఆమె ఒక కావ్యం వ్రాసి ప్రచురిస్తుంది విమర్శకులు మెచ్చుగుంటారు. అంత మంచి కావ్యం ఇటీవల రాలేదంటారు. లండన్ పట్నం అంతా దాన్ని గురించే మాట్లాడతారు. ఒక కాపీ భర్త కిస్తుంది. ఆయనకి, సారస్వతం, కళలు అంటే పట్టదు. భార్య సంతోషిస్తుందని చదువుతాడు. ఏమీ అర్థం కాదు. 'బాగుంది' అంటాడు భార్యతో. ఆవిడ గౌరవార్థం లండన్‌లో సాహిత్య ప్రియులు ఒక పార్టీ యిస్తారు. భర్త కూడా వెడతాడు. అతన్ని అక్కడ అందరూ వింతగా చూస్తారు ఆ కావ్యాన్ని తెగ మెచ్చుకుంటారు. ఇంత మెచ్చుగుంటున్నారు, ఏమిటో చూద్దామని, మళ్ళా ఆ పుస్తకం చదువుతాడు. చదవడం పూర్తవగానే ఆయన మొహాన చెమట్లు పోస్తాయి. మొహం ఎర్రబడుతుంది. ఆ కావ్యంలో కథుంది ఒకామె ఒక యువకుణ్ణి ప్రేమిస్తుంది. ఆమెకి భర్త వున్నాడు; నడి వయస్సు. ఆ యువకుడు కూడా ప్రేమిస్తాడు. తనతో రమ్మంటాడు. ఆమె భర్తని వొదిలి వెళ్ళలేదు.

ఆమె వయసులో పెద్ద, అతను చిన్న. ఏం లాభం? వెళ్ళలేదు. వారిద్దరూ రహస్యంగా కలుస్తారు. కొంత కాలం సుఖంగా గడుపుతారు. ఆమె ప్రేమ గీతాలు వ్రాస్తూ వుంటుంది. అతని అందమైన శరీరాన్ని ఆరాధిస్తూ వ్రాసిన గేయాలు. కొంత కాలానికి ఆమె ప్రియుడు చనిపోతాడు. ఆ కొద్ది రోజులైనా అతనితో ఆనందంగా గడపగల్గినందుకు దైవానికి కృతజ్ఞత చెపుతూ వ్రాసిన విషాద కావ్యం మిగతాది.

భర్త వొళ్ళు మండిపోయింది. భార్య వ్యభిచరించింది. అది అందరికీ ఆ కావ్యం ద్వారా తెల్సిపోయింది. అందరూ అతన్ని హేళన చేస్తున్నారు. భరించలేడు. మానసిక శాస్త్రజ్ఞుడి సలహా అడుగుతాడు ఆమెను వొదిలెయ్యనా? ఏం చెయ్యను? అదంతా ఎప్పుడో జరిగిపోయింది – పైగా అది కావ్యం. నిజం కాదేమో ఊరుకోడం మంచిదని సలహా ఇస్తాడు. ఎల్లాగో సమాధానపడి వూరుకుంటాడు. స్నేహితుడితో అన్న చివరి మాట ఇది.

"నా పెళ్ళాంలో దేన్ని చూసి ఆ యువకుడు ప్రేమించాడో నాకు చస్తే అర్థం కాదు."

'శానటోరియమ్' అన్న కథలో ఇద్దరు క్షయ రోగులు నర్సింగ్‌హోమ్‌లో ఉంటారు మంచి గది కోసం ఇద్దరూ తగవులాడుకుంటూ వుంటారు చదరంగం ఆటలో దెబ్బలాడతారు. ఒకాయన వయొలిన్ వాద్యం, రెండో ఆయన భరించ లేడు. తగవులాడి కొన్ని రోజులు మాట్లాడుకోరు కొంత కాలానికి ఇద్దరిలో వొకాయన చనిపోతాడు. ఆయన గది రెండో ఆయన కిస్తారు కాని అతనిలో సంతోషం లేదు. దెబ్బలాడే స్నేహితుడు లేడు. దిగులుతో కుంగిపోతాడు. ఆ నర్సింగ్‌హోమ్‌లో ఇద్దరు ప్రేమించుగుంటారు. వారి క్షయ వ్యాధి ముదిరింది. డాక్టర్ పెండ్లి చేసుకోవద్దంటాడు. చేసుకుంటే నెలకంటె బ్రతకరంటాడు. దానికి సిద్ధపడి పెండ్లి చేసుకుంటారు మానవ ప్రకృతి చీకటి గుహల్ని, ఈ కథ వెలిగిస్తుంది. మనలో జీవితంపట్ల ఆశ తృష్ణ పెంచుతుంది. మామ్ రచన లలో నైరాస్యం, విముఖత, వెక్కిరింపు ఉంటాయి ఆదర్శం, గాంభీర్యం లేవు. మనుషుల్లో చెడునే చూసి చిత్రిస్తాడు మంచిని గురించి పట్టించుకోడు – అన్న ఒక విమర్శ వుంది మామ్‌ని గురించి ఇట్లాంటి విమర్శ చేసేవారు యీ కథని చదివితే, ఆ విమర్శ మరో రూపం దాల్చునేమో. 'సర్వజ్ఞుడు' (Mr Know-All) అన్నది మరో మంచి కథ. కొందరు ఓడలో ప్రయాణం చేస్తూవుంటారు. వారిలో వజ్రాలని విలువ కట్టడంలో ఆరితేరినాయన వొకడుంటాడు ఆయన పేరు కెలాడా. ప్రపంచం అంతా తిరిగాడాయన ఆయనకి తెలియని విషయం లేదు. ప్రతి విషయంలోనూ అతనిదే పై మాట దాన్నెవ్వరూ ఖండించలేరు. మిగతావారికి వొళ్ళు మండిపోతూంటుంది. ఒక్కసారైనా, వీరు చెప్పింది తప్పు అని ఋజువైతే బాగుండునని, అట్లాంటి సమయం కోసం కనిపెట్టుకుని వుంటారు. ఆ సమయం దొరుకుతుంది. వారిలో ఒక దంపతులుంటారు ఆమె అందమైంది. మెడలో ముత్యాలహారం ఉంటుంది సంభాషణ వజ్రాలని గురించి సాగుతూ వుండగా ఆమె మెడలో హారంకేసి చూసి "ఉదాహరణకి ఆమె మెడలో హారం చూడండి – అది పదిహేనువేల డాలర్లన్నా వుంటుంది. మంచి ముత్యాన్ని ఇట్టె పసికట్టెయ్యొచ్చు" అంటాడు కెలాడా. భర్త విరగబడి నవ్వుతాడు.

"పొరబాటు" అంటాడు అందరూ నవ్వుతారు. మా బాగా అయిందను కుంటారు

"ఎంత పందెం?" అంటాడు కెలాడా.

"నేను కొనలేదనుకో. మేం ప్రయాణం అయ్యే ముందు, మా ఆవిడ, పద్దెనిమిది డాలర్లకి కొంది ఆ హారాన్ని" అంటాడు భర్త.

"క్షమించాలి. అవి ఇమిటేషన్ ముత్యాలు కావు అసలైనవి పదిహేను వేల డాలర్లు తక్కువ ఉండదు." అంటాక కెలాడా కాదని పర్త. పందెం వేస్తారు. గెలిస్తే, కెలాడాకి వంద డాలర్లిస్తాడు ఓడిపోతే అతనివ్వాలి. ఆమె ముత్యాలహారం తీసి, చూడమని చేతికిస్తుంది. కెలాడాకేసి, సన్నగా కన్ను మెదుపుతుంది. అతను పది నిమిషాలు పరీక్ష చేసి,

"అవును. నేనే వోడిపొయ్యాను. ఇది ఇమిటేషన్ ముత్యం. ఇదుగో వంద డాలర్లు" అని డబ్బు ఇచ్చివేస్తాడు. జనం సంతోషిస్తారు. సర్వజ్ఞాడి రోగం చప్పగా కుదిరిందనుకుంటారు.

ఆ మొర్నాడు, అతని గది తలుపు సందులోంచి ఎవరో ఒక కవరు లోపల పడేస్తారు అందులో వంద డాలర్ల నోట్ వుంటుంది ఆమె పంపింది.

"అందమైన పెళ్ళాన్ని ఇంటి దగ్గర వొదిలేసి నేను ఉద్యోగానికి పైదేశాలకు వెళ్లాను స్మా" అంటాడు సర్వజ్ఞుడు. ఆ క్షణంలో కెలాడా నాకిష్టుడయ్యాడని మామ్ కథ ముగిస్తాడు.

మంచి కథలలో మరొకటి 'అంటిబీస్‌లో ముగ్గురు లావాటి మహిళలు' అన్నది. హాస్యపూరితమైంది ఆ ముగ్గురూ స్నేహితులు. స్నేహానికి కారణం, వారి స్థూలకాయాలు ఒకర్నిమించి ఒకరు, విపరీతమైన లావు అంటిబీస్ ప్రాంతం మంచిది – అక్కడ నర్సింగ్‌హోమ్‌లో చేరి, తను చెప్పిన వాటినే తింటూ 'డయెట్' విధులు గమనిస్తూ వుంటె, కాస్త లావు తగ్గొచ్చునన్న డాక్టర్ సలహాపై, ఆ ముగ్గురూ అక్కడకుపోయి వుంటారు. వంటవాణ్ణి తీసుకెడతారు, కాని వాడు మంచి మంచి పదార్థాలు వండే అవకాశం లేదు. ఏది తిన్నా కొవ్వే డాక్టర్ అన్నీ నిషేధించాడు ఆకుకూరలు – వండకుండా – ఇంత గంజి, పాలు, రొట్టె ముక్క. అంతె అవే తింటూ, ప్రతి రోజూ బరువు చూసుకుంటూ, 'నీకంటె నేను సన్నం, నాకంటె అది లావు' అని దెప్పుకుంటూ, పరాచకాలాడుకుంటూ, పేకాడుకుంటూ గడుపుతారు. బ్రిడ్జ్ ఆటకి ఒక చెయ్యి తక్కువ. వారి స్నేహితురాలైన 'లీనా' అనే ఆమెను రమ్మంటారు ఆమె వొస్తుంది. బ్రిడ్జ్ ఆడుకుంటారు. కాని లీనా చాలా సన్నటిది ఎముకలు కనబడుతూ వుంటాయి పల్చటి చర్మం కాని ఆమెకి ఆకలి జాస్తి. తెగ తింటుంది. వంటవాడికి కొత్త కొత్త వంటకాలు పురమాయిస్తుంది వాడి మూలపడిన పాక చక్యాన్ని ప్రదర్శిస్తూ, బోలెడన్ని వొండుతాడు ఆమె తినేస్తుంది ఒక్క పౌను బరువు పెరగదు ఆమె తింటోంటే వాళ్ళ నోరూరుతుంది లోపల కోపగించుకుంటారు, ఇది ఎప్పుడు పోతుందా అనుకుంటారు. ఆఖరికి లీనా ప్రయాణ

మౌతుంది ఆమెని రైలెక్కించడానికి ముగ్గురూ స్టేషన్ కెడతారు. రైలు అటు వెళ్ళగానే, ఒకర్కి తెలియకుండా ఒకరు తలో హోటల్‌కి వెళ్ళి ఇష్టం వచ్చిన వన్నీ తింటారు డాక్టర్ నిషేధాలని పాటించక, అందరూ కలిసి హాయిగా కడుపు నిండా తింటారు. 'లీనా బ్రిడ్జ్ మట్టుకు బాగా ఆడుతుంది స్మా' అని స్నేహితురాల్ని స్మరిస్తూ, మనిషికి కావల్సింది తిండి హాయిగా తిని తిరక్క ఎందుకి వేషాలు! సన్న పడాలి అన్న ఆదర్శం కోసం మానవత్వం త్యాగం చెయ్యకపోవడం – ఇదీ ఆంధ్రత్వమే. అందుకే మామ్‌లో కాస్త ఆంధ్రత్వం ఉందన్నాను.

ఇంక గొప్ప కథలు. గొప్ప కథ చదివాక, ఒక జీవిత రహస్యం మనకి తెలిసిపోయిందనిపిస్తుంది మనం మారతాం. మన దృక్పథానికి మరో కొత్త పరిమాణం సంక్రమించినట్లవుతుంది. మానసికంగా ఎదుగుతాం. జీవిత సమరం సాగించేటందుకు మరో కొత్త పరికరం, మరో ఆయుధం తెచ్చుకుంటాం.

కథ పరమావధి సంతోషపెట్టడం, వినోదం కల్గించడం మటుకే అంటాడు సోమర్‌సెట్ మామ్ ఆయన కథలు యీ లక్ష్యాన్ని సాధిస్తాయి. వినోదం, సాహితీ ప్రయోజనమైతే, జీవితానుభవం, పరమ సత్యాన్ని తెలుసుకున్న మహదానందం, అంతకంటే ఉన్నతమైన ప్రయోజనాన్ని సాధించేటందుకు ఉపకరించింది గొప్ప కథ సంస్కృతీ సాహిత్యాల ప్రయోజనం, వూరికే కబుర్లు చెప్పుకునేటందుకు, వాదించేటందుకూ మటుకుకాదు. వాటి ప్రాబల్యం శీలంపై, ప్రవర్తనపై కనబడాలని మామ్ మరో సందర్భంలో అన్నదానితో నే నంగీకరిస్తాను. సర్వ మానవ వ్యవస్థ మనం గుప్పెట్లోకి లాక్కుని, మనదిగా చేసుకోడానికి ఉపకరించిందే ఉత్తమ కళ అనుకుంటే, అట్లాంటి కథలు కొన్ని వ్రాశాడు మామ్. రెండింటిని గురించి చెప్తాను

మొదటిది 'వెర్జర్' అనే కథ. ఇతర భాషల కథలు మనకి చటుక్కున నచ్చకపోవడానికి కారణం, ఆ పేర్లు, కొత్తగా ఉండటం. ఆ పేర్లనీ, స్థలాలనీ, మన ప్రాంతంలో వున్న పేర్లుగా, స్థలాలుగా, మనస్సులో తర్జుమా చేసుకుంటే ఈ అర్థంకు తొలుగుతుంది. చర్చిలో బాగుచేసి, ప్రార్థనకి అన్నీ సిద్ధంగా వుంచే నౌకరు, 'వెర్జర్' అంటే. మన ఆలయాలలో పూజారి వుంటాడు. అతనికో అసిస్టెంట్ పూజారుంటాడు తలుపులు తియ్యడం, చెట్లకి నీళ్ళు పొయ్యడం, పూజా ద్రవ్యాలు సేకరించి సిద్ధం చెయ్యడం – ఇట్లాంటి పన్లు చేసే పూజారి లాంటివాడు, వెర్జర్.

అతని పేరు ఫోర్‌మన్ – 'పంతులు' అనుకోండి. చదవడం, వ్రాయడం

రాదు అతనికి. నౌకర్‌గా, వంటవాడుగా, బట్లర్‌గా — అనేక వృత్తులు చేసి, చివరికి వెర్జర్‌గా చేరి, పదిహేనేళ్ళు ఆ చర్చిలో పనిచేసి, మంచి పేరు తెచ్చు గున్నాడు. కాలం మారింది. కొత్త రూల్సు వొచ్చాయి. వాటి ప్రకారం 'వెర్జర్'గా వున్న ఉద్యోగికి చదవడం, వ్రాయడం వొచ్చి తీరాలన్నారు. అవి లేనివాణ్ణి పీకేసి, అవి తెల్సినవాడికి ఆ ఉద్యోగం ఇవ్వాలన్నారు చర్చి అధికారులు, ఫోర్‌మన్‌ని పిలిచి, యీ విషయం చెప్పారు.

"నన్ను ఇదివర్లో తీసుకున్నాయన, సతుకొద్దన్నాడండి. బోలెడంత సతుకుందంట - ఆయనకి అంత సతుకు గిట్టదంట" అన్నాడు ఫోర్‌మన్. మరిప్పుడు పరిస్థితులు మారాయి. చదవడం, వ్రాయడం వచ్చి తీరాలన్నారు అధికారులు. మూడు నెలల గడువులో, చదవడం, వ్రాయడం నేర్చుకోకపోతే, అతన్ని ఉద్యోగంలోంచి తీసెయ్యక తప్పదన్నారు

"ఇంకిప్పుడు సతుకేందండి — పెద్దోణ్ణయ్యాను. ఇసయాలన్నీ పేపర్లలో బొమ్మలు చూసి తెలుసుకుంటా ఇంటికాడ, అది ఉత్తరం రాసి పెడుద్ది. నా మొహం ఇప్పుడేం సతుకు!" అంటాడు. ఉద్యోగం వూడుతుంది. దిగులుగా రోడ్డు మీద నడుస్తూంటాడు. తోచక, సిగరెట్ కాల్చాలని బుద్ధి పుడుతుంది. ఆ వీధిలో సిగరెట్టు కొట్టు వొక్కటీ ఉండదు వెంటనే నిశ్చయించుకుంటాడు పుగాకు, సిగరెట్లు, పత్రికలు - అమ్మకం కొట్టు పెట్టాలని. అల్లాగే ఆ వీధిలో చిన్న సిగరెట్ల దుకాణం పెడతాడు మరో వీధిలో మరో కొట్టు పెడతాడు — పత్రికలు, పుగాకు. అవీ లాభిస్తుంది. అల్లాగ, లేనిచోటల్లా ఒక కొట్టు పెడుతూ, బోలెడు డబ్బు గడిస్తాడు. అనేకమందిని దుకాణదార్లుగా నియమిస్తాడు. పదేళ్ళలో ధనికుడౌతాడు

ఒక రోజున డబ్బు కట్టడానికి తనే బాంక్‌కి వెడతాడు. మేనేజర్ మాట్లాడుతూ-

"బాంక్‌లో ఎంత మొత్తం వుందో మీరెరుగుదురా?" అని ప్రశ్నించాడు.

"అణా పైసాల్లో చెప్పలేను గాని, తెలుసు" అంటాడు ఫోర్‌మన్ "

"ముప్పైవేల పౌనులుంది. కొంత డబ్బుని, షేర్లలో వేస్తే బాగుంటుంది" అంటాడు మేనేజరు.

"షేర్లూ గీర్లూ మన కెందుకయ్యా. అయ్యన్నీ గిట్టుబాటవుతయ్యా, సత్తయ్యా ప్రమాదం, దివాళాలు తియ్యడమేగా" అంటాడు మేనేజర్ నచ్చ చెప్తాడు. మంచి వడ్డీ వస్తుంది లాభిస్తుంది తను పూచీ పడతానంటాడు. ఫోర్ మన్ సరే నంటాడు.

"షేర్లు కాగితాల మీద సంతకం పెట్టండి" అంటాడు మేనేజరు.

"అందులో ఏముందో నా కెట్టా తెలుసుద్ది?" అనడుగుతాడు.

"మీరు చదవలేరా?"

"లేనుగా సంతకాలు పెట్టడం మటుకె" నంటాడు.

"ఇంత డబ్బూ చదవడం, వ్రాయడం రాకుండానే గడించారా? అవి లేకుండానే ఇంత గడించి, ఇంత వారయ్యారు; చదువుకునివుంటె, ఈనాడు మీరేమై వుందురో?" అంటాడా మేనేజర్ ఆశ్చర్యంతో.

"దానికిమటుకు సెప్పగల్ను సతకడం వొచ్చుంటే ఆ చర్చిలో వెర్జర్‌గా ఉందును" అంటాడు ఫోర్‌మన్.

రెండో కథ 'మాకింటాష్' అన్నది ప్రపంచ సాహిత్యంలో గొప్ప కథలు, వో పాతిక వుంటాయేమో ఆ పాతికలో యీ కథ ఉండి తీరుతుంది. మామ్ కథలలో తప్పకుండా చదవవలసినది ఏదన్నా ఒక్క కథను పేర్కొన మంటే, ఈ "మాకింటాష్' అన్న కథను పేర్కొంటాను.

మాకింటాష్ – అన్నది ఒక ఉద్యోగి పేరు. చదువుకున్నవాడు 35 ఏళ్ళ వయస్సు క్షయ వ్యాధి చిహ్నాలు పొడసూపడం వల్ల ఆరోగ్యంకొరకు, పశ్చిమ పసిఫిక్ దీవులలో గడపమన్నారు. సమోవా దీవిలో ఒక గ్రామమైన టాలువా లో ఉద్యోగిగా వొచ్చాడు టాలువా పౌరుల సంక్షేమ కార్యకలాపాలు నిర్వహించే అధికారి 'వాకర్', కలెక్టర్ లాంటి వాడన్నమాట. 'వాకర్‌ని' వెంకయ్య కిందా, టాలువా ప్రాంతాన్ని భద్రాచలం దగ్గర అటవికులుండే ప్రాంతం కిందా, వూహించుగుంటె, యీ కథలో పస సుళువుగా తెలుస్తుంది. కథలో సముద్ర స్నానం ఉంటుంది. దాన్ని గోదావరిగా వూహించుకోవచ్చు. వాకర్ తెలుగువాడనుకోండి – మాకింటాష్ తమిళుడనుకోండి. తమిళనాడులో పారకుడైతే, వాకర్‌ని తమిళుడి కిందా, మాకింటాష్‌ని తెలుగువాడి కిందా, వూహించుకోవచ్చు. మీ ఇష్టం వాకర్, మాకింటాష్‌ల మధ్య రేగిన వైరమే ఈ కథలో ప్రధాన వస్తువు.

మాకింటాష్ వాకర్‌కి అసిస్టెంట్, కింద ఉద్యోగి. వాకర్ టాలూవా ప్రాంతం ప్రజల్ని, నిరంకుశంగా పాతిక సంవత్సరాలుగా పరిపాలిస్తాడు. పెద్ద వాడయ్యాడని, ఇప్పుడో అసిస్టెంట్‌ని పంపిస్తారు. ఆ అసిస్టెంట్ మాకింటాష్‌పై అధికారులకి పంపవల్సిన కాగితాలన్నీ సిద్ధం చేస్తాడు. వాటిని తను తయారు చేసినట్లుగా సంతకాలు పెట్టి పైకి పంపుతాడు వాకర్. వాకర్ అంత చదువు కున్నవాడు కాడు భాష వ్రాయలేడు. అల్లా కాదు, ఇల్లా వ్రాస్తే బాగుంటుందని అసిస్టెంట్ సూచిస్తే మండిపడతాడు.

"నాకు వ్యాకరణం దేనికోయ్ వెర్రి మొహమా. నే చెప్పదల్చుకున్నదదీ-అల్లా చెప్తాను" అంటాడు. వాకర్ కచ్చేరీ దర్బారు లాంటిది. గ్రామీణులంతా, తమ తమ వివాదాలతో ఫిర్యాదులతో వస్తారు లుంగీ ధరించి, బనీనుతో చక్కా-వస్తాడు వాకర్. అందర్నీ నోరు మూసుకునుండమంటాడు. అరిస్తే బైటకి తరిమేస్తా నంటాడు. తర్వాత, మాకింటాష్, కాగితాలు తీసుకొస్తాడు.

"అప్పుడే వొచ్చావా – సోమరి పక్షి. ఇంత అందమైన రోజు మంచం మీద ఎల్లా గడుపుతావురా!" అని ఆహ్వానించి, రెండు మూడు గ్లాసులు సారా పుచ్చుగుంటాడు. పోగైన జనాన్కికూడా ఇచ్చి తాగమంటాడు. అప్పుడు పనికి ఉపక్రమిస్తాడు ఎత్తరి కాడు చాలా లావు. మొహమంతా కందపట్టి, దిగ జారింది. మూడు గడ్డాలు – కొవ్వు పట్టిన చర్మంమడతలలో ఇరుక్కుని అతని అవయవాల స్వరూపం కనబడదు ఒకటి రెండు తెల్ల వెంట్రుకలు తప్ప. బట్టతల అతన్ని చూస్తే నవ్వొస్తుంది కాని చిత్రం, అతనిలో కాస్త దర్జా. రీవి లేకపోలేదు. బంగారు ఫ్రేమ్‌లో కళ్ళజోడు, అరవై యేళ్ళ వయస్సు, స్థూల కాయుడైనా చురుకుగా నడుస్తాడు పెద్ద బొంగురు కంఠంతో మాట్లాడతాడు. మాకింటాష్ కురూపి. పొడుగ్గా, సన్నగా ఉంటాడు. సన్నటి ఛాతి, వంగిన భుజాలు, లోతు కళ్లు, చవ్పు దవడలూ – పెద్ద కళ్ళు, భయంకరంగా మెరుస్తాయి. పుస్తక ప్రియుడు పుస్తకాల పార్సెళ్ళు వొస్తాయి నగరం నుండి. వాటిని విప్పడం చూసి–

"ఎందుకురా ఈ పెంటంతా" అంటాడు వాకర్.

"చదవడానికి."

"చదివేటందుకు ఏమన్నా డిటెక్టివ్ గ్రంథాలున్నాయా."

"నే నవి చదవను."

"అవుతే, వెర్రి వెధవ్వి అన్నమాటే;"

సాయంత్రంపూట ఇద్దరూ పేకాడతారు. పేకాటలో దెబ్బలాడతాడు. అరుస్తాడు. తనాడిందే రైటంటాడు పొరపాట్లని చూపిస్తే-

"మునిలాణ్ణి కదూ. బాగా కనబడవ్‌రా ముక్కలు" అని తప్పించేస్తాడు. రాత్రి, బాగా తిని, తాగి వెనకటి కబుర్లు సాగిస్తాడు. పెండ్లినాడు తాగి పడి వుంటే, భార్య హడలి పారిపోయి మళ్ళా రాలేదుట. టాలువా లో వున్న స్త్రీలతో తాను జరిపిన ప్రేమ కలాపాలు వర్ణిస్తాడు. ఇవేవీ మాకింటాష్‌కి గిట్టవు. మాకింటాష్, ఆదర్శ జీవి. తప్పుడు పనులు చెయ్యడు.

పని చెయ్యడంలో క్రమము, పద్ధతి వుండాలంటాడు మాకింటాష్. అక్కర్లేదని వాకర్.

"ఒరేయ్ — గవర్నమెంట్ ఆఫీసుల్లో పనిచేసి, ఇలా తయారయ్యావురా. ఇక్కడ నా కింద ఏడాది పని చేస్తివా, ఇదంతా వొదిలేస్తాను నువ్వు — మంచి వాడవే — కాని ఒకటే లోటురా — నువ్వు త్రాగవు" అని మందలిస్తాడు. మాకింటాష్ మనస్సులో ఎంతటి ద్వేషం, అసూయ రేగుతుందో వాకర్‌కి తెలియదు. వాకర్ బూతులు మాట్లాడతాడు మాకింటాష్ స్కాట్లండ్ దేశీయుడు ఆ జాతి లక్షణాలను వెక్కిరిస్తూ, అశ్లీలాలు పలుకుతాడు వాకర్.

"నవ్వమంటారా?" అని అడుగుతాడు మాకింటాష్.

"స్కాట్లండ్ దేశం వాళ్ళని, నవ్వించాలంటె, ఆపరేషన్ జరపాలిరా" అని, విరగబడి నవ్వుతాడు, వాకర్ మాకింటాష్‌ది అర్థరహితమైన, గుడ్డి ద్వేషం కాదు. అతనికి, వాకర్‌లో మంచి గుణాలు బాగా తెలుసు వాకర్ డబ్బు విషయంలో నిక్కచ్చిగా వుంటాడు. స్వలాభాపేక్ష లేదు, కానీ మిగుల్చుకోలేదు. ప్రభుత్వాన్ని, పెద్ద సిబ్బంది అడగకుండా, చాలా లాభం చేసిపెట్టాడు. నేరస్థులను శిక్షించేందుకు, ఒక జైలు కట్టించుకోమంటే వొద్దన్నాడు వాకర్.

"జైలెందుకూ? ఈ వెధవలు తప్పు చేస్తే, ఏం చెయ్యాలో తెలుసు" కోర్టులకి పంపకుండా తనే తీర్పు చెప్పి, పరిష్కారం గావిస్తాడు. గుర్రం మీద, గ్రామం అంతా తిరిగి, ప్రతింటికీ వెళ్ళి మంచి చెడ్డలు కనుక్కుంటాడు. ప్రజలకి జబ్బు చేస్తే, తనే స్వంత మందులిస్తాడు, కాలమెల్ పొట్లాలు. ఒకడొచ్చి నా పెళ్ళాం లేచిపోయిందని ఫిర్యాదు చేస్తే-

"అదృష్టవంతుడివిరా, తమ పెళ్ళాలు ఎప్పుడు లేచిపోతారా అని కనిపెట్టుగున్న మొగాళ్ళు ఎంతమందో వున్నార్రా," అన్నాడు వాకర్.

అక్కడ కొబ్బరి సాగు ప్రధానమైన వృత్తి కొబ్బరిని పై దేశాలకు ఎగుమతి చేస్తారు ఓడరేవుకు మంచి రోడ్లు లేవు. ఆ గ్రామం చుట్టూ, ఓడ రేవు వరకు వెళ్ళే రోడ్డు వేయించాలని వాకర్ సంకల్పం; ప్రభుత్వంవారు, రోడ్ల నిమిత్తమై వెయ్యి పౌను లిచ్చారు క్రితం సంవత్సరం కూలీలకి, వంద పౌనులే ఇచ్చాడు వాకర్, పట్టుదలకోసం, తాను ఇతర ఉద్యోగులకంటె చౌకలో పనులు చెయ్యించగలనని బడాయి చెప్పుకోడం కోసం, రోడ్డు కూలీలకి, చాలా తక్కువ వేతనాలిస్తాడు. కూలీలు ఎక్కువ చెయ్యమంటారు. ఇందుకు మాకింటాష్ కొంత కారకుడౌతాడు.

"ఇస్తే పీడి సొమ్మేం పోయింది. ఇదంతా గవర్నమెంటు డబ్బు" అని కూలీలతో, తనపై అధికార్ని గురించి మాట్లాడుతాడు. వారు, ఇతని అండ చూసుకుని, వేతనాలు పెంచితేనే కాని పని చెయ్యమంటారు. వాకర్‌కి వాళ్ళ

మండిపోతుంది. ఒక వన్నాగం పన్నుతాడు పై ఊరి నుండి కూలీలని పిలిపిస్తాడు. వారికి అడిగినంతా ఇచ్చి పని చెయ్యమంటాడు. ఆ ప్రజలలో ఒక ఆచారం వుంది తోటివారు తమింటి కొచ్చినప్పుడు, వారే ఆతిథ్యమిచ్చి, వారి కయ్యే ఖర్చులన్నీ భరించాలి. దాంతో ఆ గ్రామీణులు హడలిపోతారు. పై ఊరివాళ్ళు తమ కొంపల్లో వుంటారు తామే తిండి పెట్టాలి. చివరికి, వారికి ఏమీ లేకుండా పోతుంది. ఆ వూరివారు కూడా రోడ్డు పనికి సిద్ధపడి, మొదలెడతారు. కానీ ఇప్పుడు వాకర్. ఏ వేతనం లేకుండా పనిచేసే గత్యంతరం ఏర్పడుతుంది. ఈ కబురు విన్న పై ప్రాంతాలవారు, తెగ నవ్వి, వాకర్ సాహసం గూర్చి ఏంతగా చెప్పుకోడం సాగించారు అతనొక కథానాయకుడైనాడు. పురాణ పురుషుడయ్యాడు.

కాని, పై వూరు వాళ్ళు తమ గ్రామానికి తిరిగిపోవడంలేదు. అక్కడే వుండి రోడ్డు పని చేస్తున్నారు. వాళ్ళకేం, హాయిగా జరిగిపోతోంది. ఈ గొడవ భరించలేక టాలూవా పనివాండ్రు వారిని పంపించి వెయ్యవల్సిందిగా వాకర్‌ని బ్రతిమలాడారు అది చేస్తే, కానీ పుచ్చుకోకుండా రోడ్డు పని పూర్తి చేస్తామని వాగ్దానమిచ్చారు.

"ఓరి వెర్రి వెధవల్లారా — నా కోసమా యీ రోడ్డు. మీ కోసమేరా. మీ రోడ్డుకి మీకు వేతనాలేమిటి వెంగళప్పల్లారా. సరే మీరంతగా ఏడుస్తున్నారు గావున, ఒక పని చెయ్యండి పై ఊరి వాళ్ళకివ్వవల్సిన వేతనాల సొమ్ము మీ రిచ్చుకోండి అట్లా ఇస్తిరా, మిమ్మల్ని పని చెయ్యనిస్తాను" అంటాడు వాకర్.

మాకింటాష్ మందలించబోతాడు.

"చాలా అన్యాయం వాళ్ళని వేతనాల ఖర్చు భరించమని అడిగే హక్కు మీకు లేదు"

"నీ అభిప్రాయం కావల్సినప్పుడు అడుగుతాలే" అంటాడు వాకర్.

ఆ రాత్రి, కూలీలలో ఒక యువకుడు — మనూమా — అనేవాడు మాకింటాష్ గదికొస్తాడు. మాంకిటాష్ గదిలో బల్లలు సర్దుకుంటూ, రివాల్వర్‌ని, డ్రాయర్‌లోంచి తీసి, బల్ల మీద వుంచుతాడు మనూమా, వొంట్లో బాగాలేదు, మందిమ్మంటాడు. మాకింటాష్ లోపలికెళ్ళి మందు తెచ్చి ఇస్తాడు. మేము ఆ ఖర్చులు భరించలేం ఏం చెయ్యం? మీ సలహా ఏమిటని అడుగుతాడు. అతనేమీ చెప్పడు. మందు తీసుకుని మనూమా వెళ్ళిపోతాడు. మొర్నాడు, వాళ్ళింటి కెడతాడు మాకింటాష్. గ్రామ పెద్ద ఇల్లా అంటాడు

"వాకర్ పెద్దాయనైపొయ్యాడు రేపో మాపో రిటైరైతే, మీరేగా వారి

స్థానంలో కొచ్చేది తపరు వూ అంటిరా పైవారికి పిటిషన్ పంపిస్తాం" అని మాకింటాష్‌కి చెమట్లు పోస్తాయి. ఏమీ మాట్లాడడు. గబ గబ తన గదికి వెళ్ళి పోతాడు డ్రాయర్లో, బల్ల మీదా చూస్తాడు. రివాల్వర్ కనబడదు.

"ఏం చేస్తున్నావురా, వెంగళప్పా" అంటూ గదిలో కొస్తాడు వాకర్. బల్ల మీద ఏదో వున్నట్లు, వున్నదాన్ని దాచినట్లు నటిస్తాడు

"గది బాగు చేసుకుంటున్నావట్రా. నేను స్నానానికి పోతున్నా. నువ్వూ రా" అంటాడు. ఇద్దరూ స్నానానికి బైలుదేరుతారు గుర్రాల మీద వెడతారు. అంగవస్త్రం ధరించి వాకర్ ఈదులాడుతాడు. అతనితో కొందరు ఆడపిల్లలూ, మరో డజను మగపిల్లలూ స్నానాలకి దిగుతారు. ఆడపిల్లల్ని ఏడిపిస్తూ, బూతులు మాట్లాడతాడు. ఏగతాళి చేస్తాడు మాకింటాష్ కోపంగా చూస్తాడు.

"ఒరేయ్, వీళ్ళు నా బిడ్డలురా" అంటాడు వాకర్. చప్పున ఇంటికిపోదాం. అన్నం చల్లారిపోతుందంటాడు మాకింటాష్.

"ఒరేయ్ నువ్వు వెర్రి వాడివి — మంచివాడవే అనుకో ఒక పని చేసే టప్పుడు, మరో పని గురించి ఆలోచిస్తావురా" అంటాడు. ఇంటికెడతారు. రాత్రి భోజనం చేశాక, అల్లా చుట్ట కాలుస్తూ షికారెళ్ళే అలవాటు ప్రకారం, వాకర్ బైలుదేరతాడు. ఒంటిగా వెళ్ళడం మంచిది కాదు, ఖాలీలు కసిగా వున్నారు అని మాకింటాష్ వారించబోతాడు కాని వాకర్ మానడు.

"ఊరికే అంటార్రా. వాళ్ళు నన్నేమీ చెయ్యరు. తండ్రిలా చూస్తార్రా" అని బైలుదేరుతాడు. నేను రానా అని అడుగుతాడు మాకింటాష్. వద్దని, ఒక్కడే షికారెడతాడు వాకర్, షికారయ్యాక నవ్వుతూ తిరిగొస్తాడు.

"చూశావా భయపెట్టేశావ్. ఏమీ జరగలేదు. నిక్షేపంలా ఉన్నాను" అంటాడు. ఇద్దరూ చీట్లాడతారు. ఆవులించి లేస్తాడు వాకర్.

"పోయి పరుంటా" నంటాడు

"రేపటి కార్యక్రమం ఏమిటి?"

"తెల్లారగట్ల గుర్రం మీద, అల్లా వెళ్ళి రోడ్డు తనిఖీ చేసి వస్తాను" అంటాడు .వాకర్

"నేనూ రానా?"

"ఒద్దు."

"నీకేమన్నా జరిగితే.. "

"అట్లాంటప్పుడు నువ్వెందుకు పనికొస్తావురా అర్భకుడివి" అని, వెళ్ళి పరుంటాడు వాకర్. తెల్లారింది. ఏడైంది తెల్లారగట్ల వెళ్ళిన వాకర్ తిరిగి

రాలేదు మాకింటాష్ ఏమీ తోచక తన గదిలో కెళ్ళాడు అక్కడ బల్ల మీద రివాల్వరుంది. నాలుగు గుండ్లు లేవు. ఎవరో పేల్చేశారన్నమాట. చేతులు వొణుకుతున్నాయి. ఎనిమిదైంది. ఇంటి ముందు జనం పోగయ్యారు. గాయపడ్డ వాకర్ని మోసుగొచ్చి మంచంపై వడేసి, డాక్టర్కి కబురంపి, సపర్యలు చేస్తున్నారు

"ఆఖరికి చంపేశార్రా" అన్నాడు వాకర్.

డాక్టర్కి కబురంపానంటాడు మాకింటాష్

"వాడొచ్చేటప్పటికి నేను చావనే చస్తాను. ఇంత ద్రావకం పొయ్యరా. నువ్వు చెప్పింది నిజంరా మాక్. అంత పనీ చేశారు నువ్వు మంచివాడివిరా. ఎటొచ్చీ తగవ్ క్రితంసారి వెళ్ళినప్పుడు ఆ వెధవలతో చెప్పానురా నీ సంగతి. నువ్వు చాలా మంచివాడివని. నా ఉద్యోగం నీ కిస్తార్రా. రోడ్డు పూర్తి చేయించు. అది జరిగేతే నా కింకేమీ వొద్దు, వీళ్ళని బాగా చూడు వీళ్ళు నా బిడ్డలు. కఠినంగా ఉండు – కాని దయ చూపు."

జనం చుట్టూ పోగై, అతనికి వూపిరాడదని, వాళ్ళందర్నీ బైటకి పొమ్మంటాడు మాకింటాష్.

"ఉండనీరా వాళ్ళు నా బిడ్డలు. నా దగ్గరే ఉండాలి దగ్గరగా రా. మరో సారి ద్రావకం పొయ్యి జరిగిన దాన్ని గురించి గొడవ చెయ్యకు. తెల్లవాడికి ఏదన్నా జరిగితే, ఇక్కడి ఈ నల్లవాళ్ళకి చాలా అపకారం జరుగుతుందిరా అసలు ఊరే లేకుండా, కాల్చివేస్తారు అధికారులు. వాళ్ళు తప్పు చెయ్యనివాళ్ళని దండిస్తార్రా ఎవ్వడినీ దండించకూడదురా – ఇదేదో ప్రమాదవశాత్తు జరిగిందని చెప్పు ఎవరి తప్పూ కాదు. చేతిలో చెయ్యి వేసి ప్రమాణం చెయ్యి."

"అట్లాగే వేస్తాను." అంటాడు మాకింటాష్

"ఒరేయ్, నాకు మతం అంటే ఇష్టం. మత గ్రంథాలు చదువుతూ ఉంటావు. క్షమని గురించి ఏదో ఉందే, అదేమిట్రా."

"అవును 'వారు చేసేదేమిటో వారికి తెలియదు కావున క్షమించు' అని" అంటాడు మాకింటాష్.

"అద్ది గదిరా. క్షమించు వారిని నేను క్షమించాను. నా బిడ్డలురా. నీ చెయ్యి ఇల్లా గియ్యి. .." అని కళ్ళు మూస్తాడు వాకర్. చెయ్యి లాక్కొని, ద్రావకం తాగి. బైటకి నడిచిపోతాడు మాకింటాష్. సముద్రంలో దూకి చచ్చి పోతాడు శవాన్ని షార్కులు తింటాయి అదీ కథ చివరి భాగం చదివేటప్పుడు కళ్ళంట నీళ్ళు తిరుగుతై విషాద నాటకాలలో షేక్స్పియర్ మెక్బెత్ ఎంత

గొప్ప నాటకమో విషాద కథలలో, ఇది అంత గొప్ప కథ. మెక్‌బెత్ కూడా మాకింటాష్ వలె స్కాట్లండ్ దేశీయుడే నన్నది గమనించదగ్గది!

ఈనాటి ఆంగ్ల రచయితలలో, సామర్‌సెట్ మామ్ కున్నంతటి ప్రచారం, మరే రచయితకీ లేదంటా. పి. జి వోడ్‌హౌస్ అగాథాక్రిస్టీ, మామ్ — ప్రపంచంలో అన్ని దేశాలవారూ వీరి పుస్తకాలే ఎక్కువగా చదువుతున్నారు. ముఖ్యంగా మామ్‌కి, ప్రాక్ దేశాలలోనే కాకుండా, అమెరికా, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో ఇంగ్లండ్‌లో కంటె, ఎక్కువ మంది పాఠకులున్నారు. సారస్వతంపట్ల అభిరుచి లేనివారు కూడా ఈయన పుస్తకాల్ని ఆసక్తితో చదువుతారు వెనకటి తరం వారిలో, బెర్నార్డ్ షా, వెల్సుని మినహాయిస్తే మామ్ కున్నంత ప్రపంచ ఖ్యాతి మరే రచయితకీ లేదనుకుంటా. ఇంత డబ్బు మరెవ్వరూ గడించలేదు.

ఐనా, స్వదేశమైన ఇంగ్లండ్‌లో మామ్‌కి బొత్తుగా పలుకుబడి లేదు. ఆధునిక నవలని గురించి వ్రాసే గ్రంథాలలో ఈయన నవలల్ని గురించి పట్టించుగోరు. నవలలపై నవలాకారుల అభిప్రాయాలు అన్న పేరుతో ఆ మధ్య వెలువడ్డ నాలుగొందల పేజీల గ్రంథంలో ఈయన పేరే లేదు. ప్రూస్ట్, లారెన్స్, ఫార్‌స్టర్, హార్డీ. హెమింగ్వే కాఫ్కా, జాయిస్, కామ్యు, సార్‌త్ర్, వర్జీనియా, వూల్ఫ్‌ల రచనల్ని పరిశీలిస్తూ వ్రాసినవారు, మామ్ రచనల్ని ఒక్క పేరాలో పేర్కొని, మరో విషయంలోకిజారిపోతారు. సంప్రదాయ సాహిత్యంలో పేరొందిన విమర్శకులు ఈయన్ని విరక్తుడని (Cynic) రెండో తరగతి రచయితల కింద జమకట్టారు.

"నా ఇరవయ్యో ఏట, వివేకంలేని క్రూరుడన్నారు నన్ను; ముప్పైయ్యో ఏట అలక్ష్యంగా వ్రాస్తానన్నారు; నలభై య్యో ఏట, విరక్తుడన్నారు; యాభైయ్యో ఏట తెలివిగా వ్రాస్తానన్నారు; అరవయ్యో ఏట గాంభీర్యం, లోతు లేని అల్ప జ్ఞానినన్నారు." అని వాపొయ్యాడు మామ్. రచయితగా తన అనుభవాలని సింహావలోకనం చేస్తూ, వ్రాసిన గ్రంథంలో. ఈ పుస్తకంలో ఆయన అంతరంగ జీవితానికి సంబంధించిన విషయాలేమీ ఉండవు. పోనీ, రచనలో మెళకువలు పాటించవల్సిన సూత్రాలన్నీ ఏమన్నా చెప్తాడేమో ననుకుంటె అవీ ఉండవు. పాఠకుణ్ణి, రచయిత కార్ఖానాలోకి తీసుకెళ్ళడం ప్రమాదం అంటాడు మామ్. మరి ఈ పుస్తకం ఎందుకు వ్రాసినట్లు? విమర్శకులు ఏమన్నదీ నేపట్టించుగోను, అంటాడు కాని, నేననుకోడం ఈ పుస్తకాన్ని తన విమర్శకులకు సంజాయిషీగా వ్రాశాడని.

"జీవితాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రిస్తాను. చెడుగుని విమర్శించను. మంచిని

పైకి ఎత్తెయ్యను. సుఖ దుఃఖాలను సమంగా చూస్తాను . మనుషుల్లో మంచి చెడూ కలిసివుంటాయి. వారిని అట్లాగే చిత్రిస్తాను - కాబట్టి విరక్తుణ్ణి అంటె, కాదనను" అంటాడు. చెడ్డ పాత్రలపట్ల నిరసన ప్రకటించక పోవడంవల్లనే, విమర్శకుల కి అభిప్రాయం కలిగిందని మామ్‌కి తెలుసు. మూడో సంపుటిలో చివరి కథ 'నీల్ మకడమ్' అన్నది. 'నీల్' స్కాట్లండ్ దేశపు యువకుడు. మలయ అడవుల్లో జీవశాస్త్ర పరిశోధకుడైన మన్రో దగ్గర అసిస్టెంట్‌గా ఉంటాడు. మన్రో భార్య, రష్యా దేశపు స్త్రీ. నడివయస్కురాలు. నీల్‌ని ప్రేమిస్తుంది. నీల్‌కి, స్త్రీలు, ప్రేమ తెలియవు. శరీర వాంఛంటే తెలియదు. గిట్టదు. ఆమెని కాదంటాడు ఆమె చివరిదాకా అతన్ని వేటాడుతూనే ఉంటుంది. బలాత్కారంగా పైన బడుతుంది. అతను ఒప్పుకోడు. తనే ఆమెని చెరచ బొయ్యాడని భర్తతో ఫిర్యాదు చేస్తానని బెదిరిస్తుంది - చిత్రాంగిలా. అతను లొంగడు. తరుముతుంది. అడవిలోకి పారిపోతాడు. తనూ వెంటబడుతుంది. అతను తిరిగి తిరిగి అడివిలోంచి బైటకొస్తాడు. ఆమె దోవ తప్పి, అడివిలో చనిపోతుంది. సారంగధరుణ్ణి మెచ్చుగుంటాం - నీల్‌ని మెచ్చుకోం. కాదని, ఆమెని నిష్కారణంగా చంపాడంటాం చాలామంది నీతి అంటె స్త్రీ పురుషుల మధ్య గల అక్రమ సంబంధమే ననుకుంటారు. లంచగొండితనం, నిజాయితీ లేకపోవడం, అసత్యాలాడటం, దగా, మోసం, దబ్బు, బంధుకోటిపట్ల పక్షపాతం- వీటిని గురించి, వ్యభిచారం గురించి పట్టించుగున్నంతగా, పట్టించుగోం. దీని కంతటి ప్రాధాన్యం ఇవ్వనక్కర్లేదన్నది ఆధునిక తత్వం 'నీల్' కథలో ఈ ధ్వని ఉంది. సంప్రదాయ విమర్శకులు, దీన్ని హర్షించరు.

మామ్ పట్ల ఉండవల్సినంత గౌరవం వారికి లేకపోవడానికి కారణా లూహించగల్ను. ఇంగ్లీషువారు ఘనులుగా కనబడరు మామ్ పుస్తకాల్లో; ముఖ్యంగా సామ్రాజ్యవాద ప్రచారకులుగా, ఇతర దేశాల్లో పనిచేసేవారిని మామూలు మనుషులుగా చూసి, చులకన చెయ్యడం వల్ల జాతి గౌరవానికి భంగం కలిగిందని భావించారేమో దేశాభిమానంవల్ల వారిని మంచిగా చూపాలన్న ఉద్దేశం మామ్‌లో లేదు. మంచి చెడ్డల్ని - రెండూ సమంగా చిత్రించి అందరు మనుషులులాగానే చూస్తాడు.

రెండో కారణం, ఆయన రచనలు చాలామందికి రుచించడం. అందరికీ నచ్చింది. చౌకబారురదై ఉండాలి సాహిత్యం, గాంభీర్యం, లోతు, అంతర్గత మైన వైచిత్రితో నిండి ఏ కొద్దిమందికో అర్థమవాలి. అందలి అర్థాన్ని అంద చందాలనీ చెప్పేటందుకు విమర్శకు లుండాలి. ప్రతివాడికీ తెలిసిపోతే అది

సాహిత్యం కాదన్న పాత భావం, చాలా మందిలో ఉండిపోయింది. వైరూప్య చిత్రకళ (Abstract Painting) అందరికీ అర్థమవదు కాబట్టి అది గొప్ప కళ. అల్లాగే, సాహిత్యంలో, సుళువుగా బోధపడని విలువలూ, నిగూఢత, మాయ, ధ్వని, సాంకేతికాలు ఉండాలి. కవిత్వం, వూహాబలం ఉండాలి. మంచి శిల్పం, భాష, పదాలు ఉండాలి. అప్పుడుకాని ఏ రచనకి సాహితీ దక్షత సమకూరదు — అని సంప్రదాయ సాహిత్య వేత్తల వాదం.

మామ్ రచనలు, సుళువుగా అర్థమౌతాయి. మరొకరు పరామర్శించి వ్యాఖ్యానం చెయ్యనక్కర్లేదు. స్పష్టత, ఆయన రచన ప్రధాన లక్షణం రెండర్థాలుగల వాక్యం మచ్చుకైనా దొరకదు అంతరార్థాలు, ధ్వనులు వుండవు జె బి. ప్రీస్ట్లీ రచనలు కూడా ఇట్లాంటివే! అందుకే ఆయన్ని కూడా తగిన స్థానం ఇవ్వక మూలకి తోసేశారు. ఇది అన్యాయమనుకుంటాను. ప్రజాస్వామ్యంలో లలితకళలు నలుగురికీ అందాలన్న ఈ రోజుల్లో ఈ పాత సిద్ధాంతాన్ని తిరిగి పరిశీలించి ఖండించాల్సిన అవసరం ఉంది నిత్య జీవితం వొకటి; సాహిత్య జగత్తు మరొకటి జీవితంతో సంబంధం లేని సాహిత్య జగత్తు ఉందనుకోడం జరుగుతూనే వుంది జీవితాన్ని చిత్రించడం, ముఖ్యం కాని, (వస్తువు) అది చెప్పే విధం — సాహిత్యం ధోరణిలో — అంత ముఖ్యం కాదంటాడు మామ్. ఈ ఉదాహరణ చూడండి ఒక యువకుడుంటాడు ఒకామెని ప్రేమిస్తాడు. కాని రాత్రుళ్ళప్పుడే ఆమెని జ్ఞాపకం చేసుకుంటాడు "

అదీ చెప్పదల్చుకున్నది దాన్ని ఇల్లా చెప్పవచ్చు.

"నిశీధ కరాళచ్ఛాయ ఎల్లుకోగానే అతనికి ఆమె అరాళకుంతలాలు దిగంతాలను కప్పివేస్తూన్నట్లు తోస్తుంది కేశరాశి విప్పారిన పాయల్లో తన ముఖాన్ని కప్పుకొంటె వినీల విచలన్మేఘాలింగనంలో మైమరచిన తారానాథుడే తాననిపిస్తుంది."

ఆమె రాత్రిపూటే జ్ఞప్తికి రావడానికి కారణం ఏమిటో ఇల్లా చెప్పవచ్చు.

"ఇరులు ఆమె కురులు, మెరుపుతీవలామె నవ్వులు, తారకలామె తలలో పువ్వులు ఆమె వూర్పు చందన ధూపం; ఆమె కౌగిలి రస రాజ్య గేహాళి. అందుకే రేయి యిరుల రాకతో ఆమె అతని మదిని తాకు "

ఇల్లాగా చెప్పవచ్చు.

"ఆ యువకుడికి పని లేదు. కాని తన కేపనీ లేదన్న విషయం ఎదుర్కోలేదతను. పగలల్లా ఏదో పని ఉందనుకుని దగా చేసుకునేందుకు గాను, పగలు ఆమెని స్మరించక, రాత్రిపూటే జ్ఞాపకం చేసుకుంటాడు " చాలా

మంది, ఈ రెంటిలో, గంభీరమైన భాషలో సాగిన ఆ మొదటి భాగాల్నే సారస్వతం అంటారు. మామ్‌ది రెండో భాగం ధోరణిలో సాగే రచన కవిత్వం, వూహ ఆయనలో తక్కువ. ఎంతో ఉద్రేకం వస్తే, "ఆ! అల్లాగా," అన్నవి తప్ప, దాన్ని ప్రకటించే మాటలు ఆయనకి దొరకవు. అది ఆయనకి తెలుసు. ఉన్న శక్తుల్నే పరిపూర్ణంగా వినియోగించుకుంటాడు నిజాయితీతో వినియోగించుకుంటాడు ఇది చాలా ప్రశంసనీయమైన నిజాయితీ, సమకాలీనుడై, మామ్ అంతటి ప్రజామోదాన్ని పొందగల్గిన నాటక రచయిత ప్రీస్ట్లే మామ్‌ని ఇల్లా మెచ్చుకున్నారు.

"చాలా మందిని మెప్పించే రచన ఆయనకి సాధ్యం. అనేక జాతుల వారినీ, వివిధ మనస్తత్వాలు గల వారినీ రంజింప చెయ్యగలడు స్ఫుటంగా కనబడే పాత్రయూ, చక్కటి కథనం ఉండడమే కాకుండా, పరిపూర్ణమైన నిజాయితీతో కూడిన రచన ఆయనది వీరందరి తరఫునా, నా తరఫునా, జోహారులర్పిస్తున్నా."

కవితావేశం, ఉద్రేక ప్రకర్ష కాస్త లోపించడంవల్ల ఆయన రచనల్లో అంతరంగ జీవిత చిత్రణ అంతగా ఉండదు. నాటకంలో పాత్ర, చెప్పినదాని వల్లా, చేసినదానివల్లా మనకి ఎల్లా విశదమౌతాడో ఈయన కథల్లో కూడా, పైకగపడేవాటినీ, బాహ్య రంగంలో సంభవించినవాటినీ పురస్కరించుకుని, వ్యక్తులు చిత్రించబడతారు. సాధారణంగా పాఠకుడు కూడా వీటినిబట్టి వ్యక్తులకి విలువ కడతాడు కావున, ఈ రకం చిత్రణ. వారికి నచ్చుతుంది. లోతు, గాంభీర్యం లోతు లేకపోవడం అంటే ఇదే మనం పరిశీలించిన రెండు గొప్ప కథలలోనూ ప్రధాన వ్యక్తులు, సంస్కారం లేనివారు. పల్లె ప్రాంతపు భాయీలు. వారిలో కల్ల, కపటం, తికమకమనస్తత్వం ఉండదు. పెద్దగా చిత్రించేటందుకు తగినంత అంతరంగ కథనమూ ఉండదు. మామ్‌కి అట్లాంటి వారే అభిమానులు.

చరిత్రలో వ్యక్తులు, పురాణ పురుషులు, మహానుభావులు—వీరిని చిత్రించే శైలిలో గాంభీర్య ముండాలి. ఉదాత్తమైన పదజాలం కావాలి, నిజమే. కాని ఈనాటి సమాజాన్నీ, మన మెరుగున్న మామూలు వ్యక్తుల్నీ చిత్రించడానికి మామ్ అలవరుచుకున్న శైలి సరైందే ననుకుంటాను. అల్లా వ్రాయడం—విసుగు లేకుండా, అర్థం కోసం వెనక్కీ ముందుకీ వెళ్ళకుండా, భాషని గురించి పట్టించుకోక, విషయంలో లీనమైపోయి, మానసిక అనుభూతిని పొందేటట్లూ — వ్రాయగల్గడం, అనుకున్నంత సులువు కాదు. సాధనవల్లకాని అది అలవడదు. సహజమైన ప్రతిభ ఉంటేగాని, అలవడినా, నిలబడదు.

రచించడం బదులు, మాటలు చెప్పినట్లుగా రచించడం — అది ఈయన శైలి విశిష్టత. బొడ్డులోంచి సంగీతం రావడం లాంటిది కదూ. వ్రాయడు — చెప్తాడు. కలంతో రచన కాదు, భుజం మీద చెయ్యి వేసి, కళ్ళల్లోకి చూసి చెప్పడం. నిలబెట్టేటట్లు మాటలు చెప్పడం — ఆ మాటల్నే కలంతో కాగితం మీద పెట్టడం. ఇది కూడా ఎందుకు ఉత్తమ సాహిత్యం కాదో నాకర్థంకాదు. భాషతో ఆసనాలు, మాటల ఇంద్రజాలం, పాండిత్య ప్రకర్ష ముఖ్యమా? తోటి మానవుణ్ణి, మన మనస్సుల్ని అర్థం చేసుకుని, జీవితపు వైచిత్రిని కాంక్షతో పరిశీలించి, మరుగుపడ్డ మానవత్వపు కోణాలని వెలిగించి, రసానుభూతిని కలిగించడం; పాఠకుడు ఆ పొందిన దానితో తన దృక్పథాన్ని సరిదిద్దుకుని, శీలాన్ని పెంపొందించుకుని, నైతికచింతనని విస్తృతం చేసుకుని, జీవిత సంగ్రామానికి సంసిద్ధుడు కావడం ముఖ్యమా?

"కోట్లాది జనం కడుపు నిండా తిండి లేక వస్తులుంటూ వుండే అనేక ప్రాంతాలలో రాజకీయ స్వాతంత్ర్యం అంతరించిపోతూ ఉంటే, యుద్ధాల అనంతరం, వేలాది మందికి సుఖం దూరమైపోతూంటే, ఇన్నాళ్ళూ ఆశ పెట్టుకుని బ్రతుకుతూ వొచ్చిన ప్రజకి జీవితపు విలువలపై నమ్మకం సడలిపోతూవుంటే, ఈ కథలు, నాటకాలు, నవలలు వ్రాయడం వెట్టి కాక, మరేమిటో నాకు తెలియదు మేం ఇంకేమీ చెయ్యలేం గనక, ఇవి వ్రాస్తున్నాము—అని నా సమాధానం. ఇవి వ్రాస్తూ కూర్చోడం కంటే ముఖ్యమైన పనులెన్నో ఉన్నాయి, నాకు తెలుసు. కాని నాకు చేతనైన పని ఇదొక్కటే. ఇల్లు తగులబడుతూవుంటే, చేదెడు నీళ్ళు పొయ్యనందుకు మమ్మల్ని కసురుకుంటారు చేదతో నీళ్ళు తోడడం మాకు చేతకాదు. ఆ రేగే మంటల్ని చూస్తూ వుంటే, వర్ణించేటందుకు మంచి మంచి మాటల్ని వెదుకుతూ అద్భుత రసాన్ని చూరగొంటాం."

ఇది వ్రాసిన మామ్‌ని రెండో తరగతి రచయితల జాబితాలోంచి తీసేసి, మొదటి తరగతి రచయితల జాబితాలో వెయ్యడానికి వెనుదీయను. కావలిస్తే ఆ జాబితాలో మొదటి ఇరవై మంది అయ్యాక ఆయన పేరు చేర్చండి. ఇది త్వరలోనే జరుగుతుందనుకోడానికి నిదర్శనాలున్నాయి. తెలుగువారికి కథలంటే అభిమానం ఆ రంగంలో నేడు మంచి కృషి జరుగుతూ ఉంది విజయం సాధిస్తున్నారు. ఈ కథలు ఇంగ్లీషులో లభ్యమైతే పై దేశాలవారిని రంజింప చేస్తాయి. వీరు సాధిస్తున్న ఫలితాలకి ఇప్పుడిప్పుడే ఆదరణ లభిస్తోంది. ఈ ఆదరణ పూర్తిగా లభ్యమైననాడు మామ్ మొదటి తరగతి కథకుల జాబితాలో చేరతాడని నా ఆశ. ఆంధ్రులలో కాస్త మామ్ తత్వం ఉంది. మామ్‌లో కాస్త ఆంధ్ర తత్వం వుంది. ఉభయులూ చెప్పదల్చుకున్న పాఠం కూడా వొకటే; తోటి మానవుణ్ణి కరుణించు, వీలైతే ప్రేమించు. దూషించకు, ద్వేషించకు, తీర్పుచేసి శిక్షించకు. తోటి మానవుణ్ణి తీర్పుచేసి శిక్షించే అర్హత మానవుడికి లేదు.

# టి. ఎస్. ఎలియట్

ఎలియట్ రచనలలో నేను మొట్ట మొదట చదివిన గ్రంథం 'కవిత్వ ప్రయోజనం, విమర్శ ప్రయోజనం' అన్నది. 1942 లో ఎమ్ ఎ. డిగ్రీ పరీక్షకి సిద్ధమవుతున్న రోజులు. పాఠ్యభాగం, ఆంగ్ల సాహిత్యం – రొమాన్‌టిక్ కవులుగా ఎంచబడే, వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్స్‌ల కవితారీతులు ప్రధాన విషయం. ఈ కవుల గురించి, ఎందరెందరో విమర్శకులు వ్రాసిన వాటిని చదివాను. ఆ చిట్టాలో టి. ఎస్ ఎలియట్ లేడు పాఠ్య గ్రంథాలలో, సజీవులైన సమకాలీనపు విమర్శకుల ప్రస్తావన లేకపోవడం ఉన్నతవిద్య సంప్రదాయం. ఈ రొమాన్‌టిక్ కవుల ప్రభావం, ఆనాడు భావ కవిత్వాన్ని ప్రచారంలోకి తెస్తున్న తెనుగు కవులపై చాలా ఉందని విన్నాక, వీరిని గురించి సమకాలీనులైన విమర్శకు లేమంటున్నారో తెలుసుకోవాలన్న కుతూహలం హెచ్చింది అదృష్టవశాత్తు ఆ సమయంలో ఈ ఎలియట్ గ్రంథం నాకు దొరికింది చదివి ఉక్కిరి బిక్కి రయ్యాను. ఆనాటికి నాలో పాతుకున్న భావాలెన్నో తారుమారైనాయి. షెల్లీ చాలా గొప్ప కవి అనీ అతని ప్రతిభ, ఊహాబలం, భావాలు అపూర్వమైనవనీ, ఒక అభిప్రాయం ఉండేది నాలో. ఎలియట్ విమర్శ చదివినప్పుడు, ఆ అభి ప్రాయం మార్చుకోవాలనిపించింది.

అదివరలో నాకు పరిచితులైన విమర్శకుల ధోరణి వేరు, ఎలియట్ ధోరణి వేరు వెనకటి తరం విమర్శకుల దృష్టిలో, రొమాన్‌టిక్ కవులు అసాధారణ వ్యక్తులు, శిఖరాలపైననే వారి మకాం. ఎలియట్ విమర్శ చదివాక, వారు మామూలు మనుషులుగా, కనబడసాగారు. 'షెల్లీ' అన్నది అంతవరకూ ఒక మధురమైన ధ్వనిగా ఉండేది ఎలియట్ రచన చదివాక, ఆ ధ్వనికి, ఆకృతి. రక్తమాంసాలు, నాడి, మెదడు, వొచ్చాయి.

"షెల్లీపట్ల మక్కువ ఏర్పడ్డం, యవ్వనదశకు చిహ్నం నూనూగుమీసాల సమయంలో షెల్లీ చెలికాడు, నడివయస్సులో కూడా అంతటి సన్నిహితుడన గలమా?" అని ఎలియట్

ఇంకా చూడండి.

"షెల్లీ భావాలంటే నాకు అసహ్యం. అతని జీవితంలో ఘట్టాలు స్మరించకుండా అతని కవితని ఆస్వాదించలేం. ఆ జీవితం పరిశీలిస్తే, నాకు కనబడే షెల్లీలో హాస్యం లేదు. స్వార్థపరుడుగా, దగాకోరుగా కనబడతాడు .... అతని లేఖలు విసుగు పుట్టిస్తాయి షెల్లీ భావాలంటే నాకు రోత ఈ రోతవల్ల అతని కవితని ఆనందించలేకపోతున్నాను .... ... గుణపాఠం చెప్పే కవిత తనకి గిట్టదన్నాడు షెల్లీ — అతని కవితంతా గుణపాఠాలతో నిండి ఉంది." అని ఎలియట్.

షెల్లీ కవిత్వం అప్పుడప్పుడు చదువుతూ - ఉంటాను అతనంటే గౌరవం ఇంకా కాస్త మిగిలింది. అయినా, ఈ ఎలియట్ విమర్శ మెదడులో ఒక మూల మసలుతూ చెయి చాపనిచ్చినా, కరస్పర్శ జరగకుండా అడ్డుకుంటూనే ఉంది.

మరొక అభిప్రాయాన్ని కూడా తారుమారు చేసింది ఎలియట్ గ్రంథం. ఆ రోజుల్లో కవిత్వాన్ని ఆస్వాదించాలంటే, ఒక రకం మానసిక స్థితి అలవరుచుకోవాలనుకునేవాణ్ణి. మానవుడు ఏకాంత జీవి, ఒంటిగా వొస్తాడు, ఒంటిగా పోతాడు; చావు పుట్టుకలే పరమ సత్యాలు, అనంత విశ్వంలో మానవుడు అల్పుడు - ఈ భావాలని జీర్ణించుగున్నాక తటస్థపడే మానసిక స్థితిలో, ఒక దైన్యం ఉంటుంది. కవిత్వాన్ని ఆనందించడానికి ఈ దైన్యం అవసరం—అనుకునేవాణ్ణి. దీని ప్రస్తావన ఈ గ్రంథంలో ఉంది. నేను అవసరమనుకున్న మానసిక స్థితిని గూర్చి, ఇదివరకే ఐ. ఎ రిచర్డ్స్ (I. A Richards) అనే విమర్శకుడు వ్రాశాడుట. నాట్లో నేను ఊహించుకున్న ఒక స్థితిని గూర్చి ఎవరో అంతకు ముందే వ్రాశారని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాను.

మానవుణ్ణి రక్షించే శక్తి కవిత్వానికి ఉంది. ఈ ప్రయోజనం సాధించాలంటే, మనం ఒక మానసిక స్థితిని అలవరుచుకుని, ఆ మనస్సుతో కవిత్వాన్ని ఆనందించాలి. ఇదీ రిచర్డ్సు అనే విమర్శకుడు చెప్పినది. ఈ స్థితి అలవడాలంటే, కళ్ళు మూసుకుని, కొన్ని పరమ సత్యాలను ధ్యానం చెయ్యాలిట! ఆ పరమ సత్యాలూ, వాటిని గూర్చి ఎలియట్ వ్యాఖ్యానం పొందుపరుస్తాను.

ముందు రిచర్డ్సు సూత్రం, దిగువ ఎలియట్ వ్యాఖ్యానం.

1. మానవుడు ఏకాకి.

ఒంటిగా కూర్చుని, పరిస్థితులు వక్రించినప్పుడు, దిగులు పడతాం. ఎక్కడికో దూర తీరాలకు పారిపోయి, ఏకాంతంగా గడపాలన్న తృష్ణ రొమాంటిక్ కవులలో కనిపిస్తూ ఉంటుంచి. దేన్నుండి విడగొడితే మానవుడు ఏకాకి

అవుతాడు? మానవుడి ఏకాంత జీవితం అంటే ఏమిటి? దైవాన్నుండి మనిషి విడిపోయినందువల్ల అతను దుఃఖిస్తున్నాడన్న క్రైస్తవమత సూత్రమా ఇది?

2. జనన మరణాలు - అందలి వైచిత్రి.

మరొక విధంగా, మానవుడు జనిస్తాడు, మరణిస్తాడు — అని తెలిసి ఉంటే తప్ప, ఇందులో వైచిత్రి ఏముందో నాకు తెలియదు.

(ఇది మనం అనుకునే స్మశాన వైరాగ్యం – ప్రసూతి వైరాగ్యాలు )

3. అనంత విశ్వం.

పాస్కల్ (Pascal) అనంతమైనస్థలానికి భయపడలేదు. అందలి అనంత నిశ్శబ్దానికి హడలిపోయ్యాడు. ఆధ్యాత్మికానుభూతి గల వారిలో ఈ అనుభూతిని అర్థం చేసుకోవచ్చు. జీన్స్ (Jeans) మొదలైన ఖగోళ శాస్త్రజ్ఞులు అనంత విశ్వాన్ని గురించి ప్రజారంజకంగా వ్రాసినప్పుడు, నాకు గుర్తొచ్చేది ఖాళీ స్థలాలే.

4 కాలవాహినిలో మానవుడి స్థానం.

చరిత్రలో మానవుడి స్థానం ఏమిటి అని ప్రశ్నిస్తే తప్ప, ఇందులో వూహని రగిల్చేది ఏమి కనబడలేదు. వెల్స్ (Wells) ప్రపంచ చరిత్ర పురి గొల్పిన వైజ్ఞానిక తృష్ణ లాంటిదానికి యిది దారితీస్తుంది.

5. మానవుడు చూపే అవధిలేని అజ్ఞానం.

దేనిని గురించిన అజ్ఞానం? నాకు కొన్ని విషయాలని గురించి ఏమీ తెలియదని తెలుసు. కాని, ఇందులో సూచితమైంది మానవుడి అజ్ఞానం - వ్యక్తుల అజ్ఞానం కాదు.

ఈ ఐదు సూత్రాలు రగిల్చే ఉద్రేకాన్ని నేను పంచుగో అంటే కవిత్వాన్ని ఆస్వాదించాలంటే ఈ రకం మానసిక స్థితి అలవరుచుకోనక్కర్లేదని ఎలియట్ వాదం.

ఈ గ్రంథం ముగింపు చదివాక కొన్ని కొత్త విషయాలు తెలుసుకున్నాను. యోగి తపస్సు వల్ల పొందే అనుభూతికీ, కృత్యాద్యవస్థలో కవి పొందే అనుభూతికి సామ్యం ఉంది అన్నది వొకటి. నన్ను ఆకర్షించిన కొన్ని భాగాలు :

"ఒక రకం రచనకి, అనారోగ్యం వల్ల సంక్రమించే మానసిక స్థితి తోడ్పడుతుంది."

"కొన్ని క్షణాలలో, ఏదో బరువు తొలిగి ఒక కొత్త స్వేచ్ఛని తెచ్చుగున్నస్థితి ఏర్పడుతుంది ఇది కేవలం 'ప్రేరణ' - 'తన్మయత' అనుకోను. నిత్య జీవితంలో స్థిరపడిన కొన్ని మానసిక అలవాట్లు, ఆఛారాలూ విడిపోయి,

కొత్త ఆకృతి తెచ్చుకుని, వ్యూహ కదలికకు అంతరాయం తొలిగినట్లుండడం జరుగుతుంది. బ్రహ్మానందం పొందుతాడు కవి. ఉద్రేకం పొంగి, తనకి సుపరిచితంకాని భాష, ఒక క్రమంలో అమరుతుంది."

ఉదాత్తమైన కవితావేశంతో కొనసాగిన మరొక భాగం.

"గతంలోని మన అనుభవాలు, మనం చదివిన గ్రంథాలలో భాగాలు - వీటిల్లో కొన్ని మాత్రమే ఉత్తేజ స్మృతులుగా ఎందుకు తటస్థపడాలి? ఒక పిట్ట అరుపు, ఒక చేప ఎగరడం, ఫలానా చోట పరిమళించిన పుష్పం, జర్మనీలో కొండ మలుపులో ఒక ముదుసలి నడిచిపోవడం, రైలు నిలిచినప్పుడు ప్రక్కన ఒక గది కిటికిలోంచి ఆరుగురు తుంటరులు చీట్లాడుతున్న దృశ్యం - ఇట్లాంటివే ఎందుకు స్మరణకు రావాలి? మనం శోధించలేని అంతరంగ అధోలోకంలో దాగిన అనుభూతుల ప్రతినిధులు - యీ జ్ఞాపకాలు. గతించిన ఉద్రేకాలకు సాంకేతిక చిహ్నాలు; మనం ఉద్వేగంతో జీవించిన మధుర క్షణాలు, మాసిపోయిన ఛాయా చిత్రాలుగా చరిత్ర నుండి తొంగి చూస్తాయి."

ఎలియట్ విమర్శలన్నీ చదవాలన్న ఉత్సాహం బయలుదేరింది ఈ గ్రంథంతో. 1936 - 47 లో ఎలియట్ కావ్యాలు, 'సెలెక్టెడ్ ఎస్సేస్' అన్న విమర్శ గ్రంథం చదివే అవకాశం కలిగింది. ఎలియట్ ఆధునిక సాహితీ రంగంలో ప్రథమ శ్రేణి విమర్శకుడన్న అభిప్రాయం స్థిరపడిపోయింది. ఆయనకి నోబెల్ బహుమానం ఒచ్చాక 'అమ్మయ్య' అనుకుని లోలోన సంతోషపడినవారిలో నే నొకణ్ణి.

ఎలియట్ విమర్శలో, ఇంకెవరిలోనూ లేని ప్రత్యేకత ఒకటుంది. లోతులకి వెళ్ళి కొత్త కోణాల ద్వారా పరామర్శించి లౌకికజ్ఞానాన్ని విస్మరించక, ఒక చమత్కృతితో, వొయ్యారంతో ఉదాత్తమైన ప్రయోజనాన్ని సాధించడం ఈయన పద్ధతి ప్రత్యేకత

నాకు కొత్తగా కనిపించిన భావాలు కొన్నిటిని ఉదహరిస్తాను.

" 'మంచి శైలి' అనిపించే స్థితిని ఎరగకుండానే ఆయన శైలి ఉత్కృష్ట స్థితిని అందుకుంది."

"అమితమైన ఉద్రేక ప్రకర్ష అంత్యదశ చిహ్నం."

"ఉద్రేకు లైనప్పుడే మనుషుల నిజ స్వరూపం బైట పడుతుందనుకునేందుకు ఆధారం లేదు. భౌతికంగా ఉత్పన్నమైన ఉద్రేకంబట్టి చూస్తే, మనుషుల్లో తేడా కనబడదు, అందరూ ఒకలాగే కనబడతారు. ఉద్రేకులైనప్పుడు కాక, ఇతర అవస్థలలోనే వారి భావ ప్రకర్షకి విలువ ఉంటుంది. బలిష్ఠమైన

ఉద్రేకం, బలం గల మనుషుల్లోనే హర్షించతగ్గది బుద్ధిని గోల్పోయి, ఉద్రేకానికి లొంగిపోయినప్పుడు మానవత్వాన్ని గోల్పోతాడు మనిషి. నైతిక సంఘర్షణా, తిరగబడి ఎదుర్కొనే శక్తి ఉన్నప్పుడే అతను ఎన్నతగిన మనిషవుతాడు. కాని, జన సామాన్యంలో, యీ బలమైన ఉద్రేకం గాని, దాన్ని ఎదుర్కొని లొంగదీసుకునే శక్తిగాని లేనందువల్ల, ఎవరన్నా ఉద్రేకం చూపితే మెచ్చుగుని చప్పట్లు గొడతారు ప్రజ - చేతనత్వము, సజీవత్వము లోపించిన వారే, ఉద్రేకాన్ని, జీవానికి చిహ్నంగా భావిస్తారు."

నా కథలపైనా, నాటకాలపైనా. ఈ సూత్రాల ప్రభావం కాస్తో కూస్తో లేకపోలేదు. ఉద్రేకం కనబరచక, శిక్షణ ద్వారా అదుపులోకి తెచ్చుగుని ప్రవర్తించే నాయకులు, నాయికలు, నా రచనలలో కనబడతారు. వీరిని పాఠకుడు మెచ్చుకుంటాడా లేదా అన్నది వేరే విషయం. పైన ఉదహరించిన ఎలియట్ సూత్రాలు ప్రచారంలోకి వొస్తే ఈ రకం పాత్రలను మెచ్చుగునే అవకాశాలు పెరుగుతాయని మాత్రం అనంటున్నాను.

మరి కొన్ని భావాలు.

ఒక కవిని గురించి "అతనిలో చాలా శక్తి ఉంది కాని బాధపడేందుకే ఆ శక్తి ఉపకరిస్తుంది."

ఆనాటి భావ కవిత్వంలో ఒక విషాదం, దైన్యం, దుఃఖం ఉండేవి. ఇవి రొమాంటిక్ కవిత్వపు ఛాయలు ఈ విచారానికి కారణమేమిటి?

"మానవుడి కోరికలకి అనువైన సంబంధ బాంధవ్యాలు మనుషులలో లేవన్న జిజ్ఞాస - కవితా వస్తువవడం ఒక కారణం. మానవుడికి లభ్యమవని వాంఛలు కాక, మరో రకం వాంఛలున్నాయని గుర్తించకపోవడం మరొక కారణం. మనంతట మనం స్వయంగా అనుభవించి కొన్ని సత్యాలని కనుకోవ్డంలో ఉంది ఈ బాధ."

మరొక చోట :

"మనుషులం అనందుకు మనం మంచో, చెడో, ఏదో ఒకటి చెయ్యాలి. ఓ విధంగా, ఏమీ చెయ్యకపోడం కంటె చెడు చెయ్యడమే మంచిదనిపిస్తుంది — ఏదో చెయ్యడం వల్ల మనం సజీవులైనట్లు తెలుస్తోంది ముక్తి పొందడంలో ఉంది మానవుడి ఘనత. వినాశం చెందడంలోనూ అంతటి ఘనతా ఉందేమో."

థామస్ స్టేరన్స్ ఎలియట్ అమెరికాలో మిస్సూరి ప్రాంతంలో సెంట్ లూయీ గ్రామంలో 1888 సెప్టెంబర్ 26వ తేదిని జన్మించాడు. ఆయన పూర్వీకులు 17 వ శతాబ్దంలో ఇంగ్లండు నుండి వలసపోయి బోస్టన్‌లో స్థిరపడిపోయినవారే. తండ్రి వ్యాపారస్తుడు. హార్వార్డ్ విశ్వవిద్యాలయంలో నాలుగేళ్ళ

విద్యాభ్యాసం చేసి, 1909 లో పట్టా పుచ్చుకున్నాడు, ఎలియట్. తత్వశాస్త్రం పట్ల శ్రద్ధ చూపాడు 1910 లో సార్‌బాన్‌లో తత్వము సాహిత్యము చదివి తిరిగి హార్వార్డ్‌లో మరి కొంత కాలం చదువు సాగించాడు. 1913 లో విశ్వ విద్యాలయ శాఖలో పనిచేసి జెర్మనీలోనూ తర్వాత ఆక్స్‌ఫోర్డ్‌లోనూ ఉన్నత విద్య నభ్యసించాడు. 1915 లో వివాహానంతరం ఇంగ్లండులో నివాసం ఏర్పరు చుకుని ఉండిపోయ్యాడు కొంత కాలం ఉపాధ్యాయుడుగా, తరువాత బ్యాంకు లోనూ పని చేశాక, 1917 లో 'ఇగొయిస్ట్' అనే పత్రిక సహాయ సంపాద కుడుగా, పిమ్మట 'క్రైటీరియన్' పత్రిక సంపాదకుడుగా పదేళ్ళు పని చేశాడు, 1917 – 1920 ల మధ్య రచన మొదలెట్టి ఖండకావ్యాలు ప్రచురించాడు. 1922 లో 'బీడు నేల' (The waste land) అనే గద్య కావ్యం వెలువడింది. దీనితో ఆదునిక కవితా ఉద్యమానికి మార్గదర్శకుడుగా నాయకుడుగా ఆయన కీర్తి, ప్రభావమూ పెరుగుతూ వచ్చి ఈనాడు ప్రపంచ సాహిత్యంలో అగ్రశ్రేణి కవిగా ఆయన స్థానం స్థిరపడింది. 1927 లో బ్రిటీషు పౌరుడుగా, పౌరసత్వపు హక్కులు పొందాడు. 1925 నుండి ఫేబర్ ప్రచురణకర్తల సలహాదారుడుగా ఉన్నాడు 1930 నుండి ఆయన గేయ నాటకాలు రచించడం మొదలుపెట్టాడు. 'మర్డర్ ఇన్ ది కెతెడ్రల్' ను 1935 లో కాంటర్ బరీలో ప్రదర్శించారు. ఈ నాటకం ప్రేక్షకుల్ని ఆకర్షించింది మరి నాలుగు గేయ నాటికలు వ్రాశాడు. 1944 లో 'ఫోర్ క్వార్‌టెట్స్' (Four Quartets) అనే గేయ సంపుటి వెలువడింది. గతంతో సమన్వయం కుదుర్చుకోడానికి సాగించిన నాలుగు యాత్రల కథనం ఇందలి వస్తువు. అధునిక విశ్వ కవితారంగంలో, ప్రముఖ విమర్శకులు ఈ కావ్యాన్ని మహా కావ్యంగా యెన్నిక చేశారు.

1920 నుండి సాహిత్య విమర్శ సాగిస్తూ, యెన్నెన్నో వ్యాసాలు వ్రాశాడు. సాహిత్యమే కాక, ఇతర సాంఘిక సమస్యలను పరిశీలిస్తూ గ్రంథాలు వ్రాశాడు. 1948 లో ఆర్డర్ ఆఫ్ మెరిట్ – బిరుదు, నోబెల్ బహుమానం పొందాడు. యెన్నో విశ్వవిద్యాలయాలు, డాక్టరేట్ బిరుదునిచ్చి ఎలియట్‌ని గౌరవించాయి. మొదటి భార్య చనిపోయిన కొన్ని సంవత్సరాలకి 1957 లో 'వాలెరీ ఫ్లెచ్చర్' అను నామెను వివాహమాడాడు 1956 లో ప్రచురించిన "కవులు, కవిత్వం" (On poetry and poets) అనే వ్యాస సంపుటిని ఈ వాలేరీకి అంకితం చేశాడు. 1965 జనవరి 4 వ తేదీని కీర్తిశేషుడైనాడు. సాహిత్యంపట్ల ప్రేమానురాగాలున్న వ్యక్తులెందరో కంట తడి బెట్టుకున్నారు– ఎలియట్ అస్తమించినప్పుడు.

కాని చిత్రం, 1949 లో ఎడిన్‌బరోలో అంతర్జాతీయ ఉత్సవాల సందర్భంలో ఎలియట్ వ్రాసిన నాటకాన్ని ప్రదర్శించినప్పుడు, "ప్రతివాళ్ళూ చెప్పుకుంటున్న ఈ ఎలియట్ ఎవరండి?" అన్నారుట ప్రేక్షకులలో ఒకరు—ఎలియట్ రచనలు చదవకపోయినా కూడా. ఆయన పేరుకి, ఎంతో చలామణి ఉంది. 1930 నుండి వెలువడుతున్న ప్రతి గ్రంథంలోనూ ఎలియట్ ప్రస్తావన ఉండి తీరింది. సాహిత్యం గురించి ఎవరు ఏది వ్రాసినా, ఎలియట్ నిర్వచనాన్ని ఉదహరించకుండా ఉండలేరు. ఆయనతో సమాధానం కుదుర్చుకోకుండా ఏ పాశ్చాత్య రచయితకి జరగడం లేదు ఒక్క సాహిత్య రంగంలోనే కాక, విజ్ఞాన శాస్త్రం, తత్వం. మతం, తర్కం, నాగరికత, చరిత్ర, కళలు, విద్యావిధానం — వీటిల్లో దేన్ని గూర్చి చర్చ జరిగినా, ఎలియట్ పేరు పేర్కొనడమో జరుగక తప్పదు. అంతర్జాతీయ సాహితీవేత్త ఎవరంటే, 'ఎలియట్' అని సమాధానం తడుముకోకుండా చెప్పొచ్చు.

నోబెల్ బహుమానం, ఎలియట్‌కి కవిగా ఇచ్చారు గావున, ఆయన కవిత్వం గూర్చి ముందుగా తెలుసుకుందాం.

ఆయన వ్రాసిన ఖండ కావ్యాల పేర్లు తెలుగులో చిట్టాగా వ్రాసి విసిగించడం నా కిష్టంలేదు. ఇంగ్లీషు పేరు తెలుగులో అవతరించగానే అచ్చయిన మిగతా భాగం నాకు చదవ బుద్ధి పుట్టదు. దానివల్ల ప్రయోజనమూ లేదు. ఆంగ్ల సాహిత్యంతో గాఢమైన పరిచయం లేనివారికి ఎలియట్‌ని గూర్చి తెలుసుకోవాలన్న కుతూహలం ఉంటుంది. వారిని ఉద్దేశించే నేను వ్రాస్తున్నది కూడా. కాని, ఆంగ్ల సాహిత్యంతో పరిచయం లేనివారికి ఎలియట్ కవిత్వాన్ని గూర్చి చెప్పడం సాధ్యం కాదనుకుంటా. ఎందుకంటే. ఆయన కవిత నిండా ఇతర పాశ్చాత్య కవుల నుండి సూచనలు, ఉదాహరణలూ ఉంటాయి. అన్యదేశీయ సాహిత్యాల నుండి కొన్ని వాక్యాలూ, భావాలూ పొందుపరచబడి ఉంటాయి. వాటి విశిష్టత తెలిస్తేగాని, ఈయన కావ్యం పూర్తిగా అవగాహన అవదు. టీకా తాత్పర్యం లేకుండా, తెలుగులో అనువదించి చూసినా ప్రయోజనంలేదు. కావున, అన్య సాహిత్యాల నుండి సేకరించిన అట్లాంటి సూచనలు, ధ్వనులు, ప్రయోగాలు లేని భాగాలలో కొన్నిటిని మాత్రం మచ్చుకి ఉదహరిస్తాను.

ఈయన కావ్యంలోని వస్తువేది? సంఘంలో ఉత్తమ తెగకి చెందిన ధనిక వర్గాలవారి అహంభావం; ధనార్జనకోసం సలిపే కుతంత్రాలు; కాలక్షేపం అవక వెర్రి పోకడలు పోయిన స్త్రీల మనస్తత్వాలు, నాగరికతకో తాత్కాలిక భౌతిక,

లౌకిక పురోభివృద్ధిని అన్వేషించేవారి హృదయాల్లో కరుడు కట్టుగుపోయిన నైరాశ్యం, అసంతృప్తి; మనశ్శాంతి, ఆధ్యాత్మికానుభూతి ఏమిటో తెలియక పట్నాల నాగరికత పెంపొందించడం కోసం ప్రబలిన సంకుచిత ప్రాంతీయ తత్వం, స్వార్థాల సంఘర్షణ నుండి బైలుదేరే యుద్ధాలు; మానవత్వం పతనం– ఇవీ కావ్య వస్తువులు.

'కాఫీ చెంచాలతో నా జీవితాన్ని కొలిచివేశానులే.'

ఎలియట్ కవితాశైలి లక్షణాలేవి; ఒకే పాదంలో అందమైనదాన్నీ, వికృతమైనదాన్నీ కుదించడం; ఉదాత్తమైన భావాన్నీ, చౌకబారు మాటలనీ వొకే చోట ప్రవేశపెట్టడం - వూహాబలంతో ఉద్వేగంతో భాష సాగి అద్భుతమైన కవితావేశం రేకెత్తే సమయంలో దానితోబాటు ఒక సాధారణ చమత్కృతిని విసరడం - ఇవీ లక్షణాలు.

"నేను ముసిలివాణ్ణైపోతాను
పంట్లాం చివరులు మడిచి తొడుగుతానులే."

*　　　*　　　*

"నాలుగైంది.
నీ గది తలుపుమీద నెంబరుంది.
జ్ఞాపకం లేదా?
తాళంచెవి నీ దగ్గరే వుంది.
మెట్లమీద ఆ దీపం, ఒక గుండ్రని వెలుగుని మోవుతుంది.
మెట్టెక్కు.
పరుపు సిద్ధంగా వుంది; గోడని టూత్‌బ్రష్.
తలుపు దగ్గర జోళ్ళు వొదిలెయ్యి, పడుకో.
జీవితానికి సిద్ధపడు.
చివరిమారు కత్తిని గుచ్చి తిప్పడం."

ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానానికి సంబంధించిన ఉపమానాలు ఉదాహరణలు, సంప్రదాయ కవితా రీతులలో మిళితమై వుంటాయి. బస్తీల వీధుల్లో లేచే పొగను గూర్చిన యీ వర్ణన నా కిష్టం.

"కిటికీ అద్దాలపై తన మూతిని రాస్తుంది పసుపుపచ్చ పొగ.
సాయంత్రపు మూలలమీద తన నాలుకను ప్రసరింపచేస్తుంది.
మురుగునీటి సరస్సుమీద క్షణం నిలిచి,
వంటింటిపై చూరునుండి మసిని తన వెన్నుమీద సోకనిచ్చి

ప్రాకారందాటి, వొక్కసారి గెంతి
అది అక్టోబరు మాసంనాటి చల్లటి రాత్రని గ్రహించి
ఆ ఇంట్లో ముడిచి పెట్టుకుని నిద్రపోతుంది "

పొగ నిద్రపోయింది, అది లేచేటందుకు బోలెడు వ్యవధి వుంది, తొందర పడకండి అని హెచ్చరిస్తూ.

"హత్యకీ, సృష్టికి బోలెడు వ్యవధుంది.
తింటున్న పళ్ళెంలో ఎత్తివడేసే చేతులకు
తగినంత పనుంది.
నీకు నాకు బోలెడు వ్యవధి——
వంద అనిశ్చయాలకీ,
వంద దృశ్యాలకీ, పునర్విమర్శలకీ——
అది 'టోస్టు టీ' తీసుకునేముందు జరహొచ్చులే."

* * *

"ఆ గదిలో మహిళలు మైకెల్ ఎంజిలో (ఒక శిల్పి) గూర్చి మాట్లాడుతూ.
వొస్తూ, పోతూ వున్నారు."

* * *

కొన్ని వింత ప్రయోగాలు.

"మూలలకి నవ్వింది." "చందమామ జ్ఞాపకశక్తి పోయింది." "రాత్రుళ్ళు పరిభ్రమించే పరిమళం ఆమె వొంటిగా వుంది." "మూసిన గదులలో ఆడవాసనలు." "బాధ్యత నెరగని గర్భంలోని పిండములాగ అతను నవ్వుతున్నాడు," "సూర్యరశ్మిని నీ జడలో అల్లుకో." "వైహాయసమిచ్చి బల్లమీద పడుకోబెట్టిన రోగికిమల్లె ఆకాశం కింద పరున్న సాయంత్రపువేళ షికారుపోదాము " "నూనెనీ, తారునీ, చెమట్లుగా కారుస్తున్నది."

ఎలియట్ కావ్యాలన్నింటిలోకీ గొప్పది కాకపోయినా 'బీడునేల' (**The waste land**) అన్న కావ్యం పొందిన ప్రచారం మరే కావ్యమూ పొందలేదు. ఇది వెలువడినప్పుడు, మాకేమీ అర్థంకాలేదన్నారు. ముప్పైయేళ్ళుగా వ్యాఖ్యానాలు వెలువడ్డాక, అందలి ప్రాశస్త్యాన్ని విపులీకరించగలుగుతున్నారు. ఈ కావ్యం నిండా, ఇతర సాహిత్యాల నుండి భాగాలు, మాటలు, సూచనలు వుండడం మూలానా, వస్తువు ప్రాచీన మానవజాతుల గూర్చిన గాథలను పురస్కరించుకుని సమకూర్చబడినందునా, ఎలియట్, ఈ కావ్యం చివరలో, ఆయా భాగాలలో వాడిన పదాలకి అర్థం చెపుతూ వొక వివరణ పట్టిక కూర్చాడు — 17 పుటల

కావ్యానికి 7 పుటల వివరణా పట్టిక. అందులో ఇల్లా చెప్పుకున్నాడు ఎలియట్.

"ఈ కావ్యం ఆకృతి, సాంకేతిక పదజాలం చాలా భాగం, జెస్సీ వెస్టన్ (Jessie Weston) అనే ఆమె వ్రాసిన 'ఫ్రమ్ రిట్యుఆల్ టు రొమాన్స్' (From Ritual to Romance) నుండి సేకరించబడింది. నా వివరణా పట్టిక కంటె, ఆమె పుస్తకమే ఈ కావ్యంలోని అర్థాలని స్ఫుటంగా పరామర్శించ గలదు కాబట్టి ఇందలి అర్థం పూర్తిగా అవగాహన చేసుకోదల్చినవారు ఆ గ్రంథాన్ని చదవమని కోరుతున్నాను."

కావ్యం స్వయంప్రకాశంగా ఉండాలి. అందలి అర్థాన్ని గ్రహించడానికి మరేవో చదివే అవసరం రాకూడదనీ, ఈ పద్ధతిని ఆనాటి విమర్శకులు దుయ్యబట్టారు. కొందరు అందలి మాటల అర్థాలూ, వాటి వెనక వున్న గాథలూ వెదుకుతూ పరిశోధనలు ప్రచురించారు ఇవేవీ ఆ కావ్యం అందచందాల అవగాహనకి తోడ్పడనందున ఈ పద్ధతిని నిరసించారు

ఈ కావ్యం మొదటిసారి 'డయల్' పత్రికలో ప్రచురించబడినప్పుడు వివరణ పట్టిక లేదుట. పుస్తక రూపంగా ప్రచురించినప్పుడు మరీ చిన్నదైంది. కొంత విషయం చేర్చి గ్రంథం పరిమితి పెంచాలన్న ఉద్దేశంతో ఇది వ్రాసినట్లు ఎలియట్ తర్వాత చెప్పుకున్నాడు. అంతకు ముందు వ్రాసిన కావ్యాలలో ఇల్లాంటి భాగాలుంటే ఎందులోనుంచో దొంగిలించాడన్నారుట విమర్శకులు. ఇప్పుడూ విమర్శకులు అల్లా అనకుండా ఈ వ్యాఖ్యానం వ్రాసినట్లుకూడా చెప్పుకున్నాడు ఎలియట్. ఇంకా ఇల్లా వ్రాశాడు తన పట్టికను గూర్చి–

"దీనివల్ల కొంత అపకారం జరిగింది. ప్రతివాడూ సాహితీ పరిశోధకున్నంటూ, చలామణి అవడం జరిగింది. ఇప్పుడు నేను వాటిని తొలగించినా లాభం లేదు. ఆ వివరణ చిట్టాకున్న ప్రచారం, పలుకుబడి అసలు కావ్యానికి కూడ లేదేమో. ఈ కావ్యాన్ని కొని అందులో వివరణ చిట్టా కనబడకపోతే పాఠకుడు ఆ పుస్తకాన్ని ఇచ్చివేసి సొమ్ము తిరిగిమ్మంటాడు." అని.

అనేక దేశాల సాహిత్యాలకు సంబంధించిన రీతులు ధ్వనులు, పదజాలం ఇందులో ఇమిడి వున్నాయి గనుక, ఇల్లాంటివి లేని ఒకటి రెండు భాగాలని మాత్రం ఉదాహరిస్తాను.

గోల్డుస్మిత్ అనే ఆంగ్ల కవి పతితని గూర్చి ఒక ఖండ కావ్యం వ్రాశాడు. ఒక అందమైన కన్య ఒకణ్ని ప్రేమిస్తుంది. అతనికి లోబడుతుంది. తర్వాత అతడు ఆమెని పరిత్యజిస్తాడు. ఆమె గతి ఏం కావాలి? ఆత్మహత్య

తప్ప మార్గం లేదు. అదీ ఆ గేయంలో విషయం. ఈ సమస్యనే ఎలియట్ 'బీడు నేల' లో ఇలా చిత్రిస్తాడు; పరిత్యజించబడిన ఆధునిక స్త్రీ ఏం చేస్తుంది?

"అటు తిరిగి అద్దంలో క్షణం చూసుగుంటుంది—
ప్రియుడు తనని విడిచి వెళ్ళినట్లు తెలియదు.
ఒక్క అసంపూర్ణ భావం ఆమె మెదడులో మసలుతుంది.
'అమ్మయ్య, అది కాస్తా ఐపోయింది — ఇంక బెంగ లేదు.'—
సుందరాంగన పతనం చెందినప్పుడు
గదిలో, ఒంటరిగా అటూ ఇటూ పచార్లు చేసి
స్వయం ప్రవర్తకమైన చేత్తో జుట్టుని సరిజేసుకుని,
గ్రామఫోను రికార్డు వేసుగుంటుంది."

సామ్రాజ్య వాదుల దుండగాలకు గురై బీడువడిన నేల స్వరూపం చిత్రిస్తూ గంగానదీ ప్రాంతాన్ని ఇల్లా వర్ణిస్తాడు—

"గంగ దిగజారింది,
వాన కోసం వేచివున్నాయి మెత్తటి ఆకులు—
హిమవత్ శిఖరాలపై నల్ల మేఘాలు గుమికూడాయి
అడివి, నిశ్శబ్దంతో ఒంగి, పొంచి చూస్తోంది
అప్పుడు పలికింది పిడుగు;
దా—
దత్తా, మనం ఏమిచ్చాము?
రక్తం గుండెని కదుపుతోంది మిత్రమా.
ఆ క్షణంలో మనం లొంగిపోయి కనబఱచిన సాహసాన్ని—
ఒక యుగంపాటు జాగ్రత్తగా మసలి తెచ్చుగున్న వివేకం
తుడిచి వెయ్యలేదు.

దాని కోసమే మనం జీవించాం—
ఇది మన మరణానంతరం పత్రికల శ్రద్ధాంజలి చిట్టాలో పడదులే

'బీడు నేల' అన్న కావ్యం, ఆధునిక కవితా పద్ధతిని నెలకొల్పింది అనేకులు ఈ పద్ధతిలో వ్రాస్తున్నారు. నిజమే ఐనా ఇది గొప్ప కావ్యం అనుకో లేదు నేను. అనేక సాహిత్యాలు చదివి, వాటిని ఆధారంగా కృత్రిమంగా కూర్చ బడిన కావ్యం ఇది — జీవితపు అనుభవం నుండి, ఒక తృష్ణతో, తపనతో సహజ మైన భావన, ఉద్రేకంతో సృష్టించబడ్డ కావ్యం కాదు. నాగరికత ప్రబలినకొద్దీ కవిత్వం సన్నగిల్లుతుందన్నాడు మెకాలె. ఆధునిక పాశ్చాత్య నాగరికతని

ప్రతిబింబించే ఒక చమత్కారమైన రచన ఇది. వినోదం కల్గిస్తుంది. చక్కిలిగింత పెడుతుంది. ఇతర కావ్యాల స్మృతుల వైచిత్రిని అందజేస్తుంది. నవ్వు పుట్టిస్తుంది. క్రాస్‌వర్డు పజిల్‌ని విడదీయడంలో వున్న బుద్ధి కౌశలాన్ని రేకెత్తిస్తుంది. స్థిరపడిన ఆదర్శాన్ని వెక్కిరిస్తుంది. త్రోసివుచ్చిన వ్యాకులతకి విపరీతార్థం కల్పిస్తుంది. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత పాశ్చాత్యుల మనస్సులలో ప్రబలిన నైరాశ్యాన్ని వ్యక్తం చేస్తుంది. అందరూ చదవదగ్గదే - అయినా గొప్ప కావ్యం అనలేను.

నిస్సందేహంగా ఎలియట్ గొప్ప కవి, ప్రతిభాశాలి. 'ది రాక్' అనే కావ్యంలోనూ అద్భుతమైన కవిత్వ ఖండాలున్నాయి.

"మలుపు తిరగ్గానే కనిపిస్తుంది ఎడారి,
రైల్లో ఇరుక్కుని కూర్చుంటే నీ పక్కనే వుంది యెడారి
నీ సోదరుడి మనస్సులో వుంది యెడారి."

నిరుద్యోగుల్ని గూర్చి ;

"ఖాళీ స్థలాల్లో నిలబడతాం,
దీపం లేని గదిలో గజ గజ వొణుకుతాం."
"ఇద్దరు మనుషులికి ఒకటే సిగరెట్
ఇద్దరు స్త్రీలకి అరగ్లాసు పానీయం "

"ఫోర్ క్వార్ టెట్స్" అనేది మంచి కావ్యం, ఇందలి వస్తువు-మానవుడి అంతరంగిక పరిశోధన. 'బరంట్ నార్టన్' (**Burnt Norton**) ఇల్లు ఖాళీ-దూరంగా తోటలో పిల్లలు ఆడుకుంటూ వుంటారు. గనక, మరి కొందరు సజీవులైన మనుషులున్నట్టు గ్రహిస్తాడు 'ఈస్టు కోకర్' (**East Coker**) లో పల్లె ప్రజలు, అర్ధరాత్రి పొలంలో నాట్యం చేస్తుంటారు 'డ్రై సాల్వేజస్' (**Dry Salvages**) లో బెస్తవాళ్లు చేపలు పట్టడంలో నిమగ్నులై వుంటారు. తిరిగిరాని భర్తల కోసం ఎదురు చూస్తూ ఉంటారు, బెస్తవాండ్ర భార్యలు 'లిటిల్ గిడ్డింగ్' (**Litle Gidding**) లో గతం నుండి మిల్టన్, చార్లెస్, మొదలైన ప్రముఖ వ్యక్తులు దర్శనమిస్తారు. ఈ కావ్యం నుండి మచ్చుకి కొన్ని :

"వర్తమానం, గతం
భవిష్యత్తులో ఇమిడి ఉన్నాయి."

* * *

"నా ముగింపు నా ప్రారంభంలోనే ఉంది."

* * *

"దేన్నీ ఆశించకని కోరాను నా ఆత్మని
అది తప్పి దాన్నే ఆశించవొచ్చు.
ప్రేమించవొద్దన్నాను, కూడనిదాన్నే ప్రేమించవొచ్చు:
ఆశ, ప్రేమ వేచివుండడంలోనే."

* * *

గాయపడ్డ శస్త్ర వైద్యుడు ఉక్కుని నడుపుతాడు
గాయపడ్డ భాగాన్ని ప్రశ్నిస్తుంది ఆ చేష్ట.
రక్తం ద్రవించే ఆ చేతుల క్రింద
వైద్యుని అనురాగం స్పృశిస్తాం
వ్యాధిగతిని సూచించే పటంలోని రహస్యాన్ని
ఛేదించటం అంతటితో సమాప్తం.

* * *

మన జబ్బే మనకున్న ఆరోగ్యం-
బాగవాలంటే వ్యాధి ముదరాలి.
ఈ లోకం
నాశనమైన కోటీశ్వరుడు కట్టించిన
ఆసుపత్రి
ఇక్కడ మనం బాగుంటే
ఆపేక్షతో ఉక్కిరిబిక్కిరై చస్తాము.

* * *

పద్యనాటికలను ప్రచారంలోకి తీసుకురావడానికి కృషిచేసినవారిలో ఎలియట్ ముఖ్యుడు. ఇదివరలో చారిత్రక, పౌరాణిక విషయాలని గురించి కవితా శైలిలో నాటకాలను వ్రాసే సంప్రదాయం వుంది. వీటిల్లో పాత్రలు మహానుభావులు, ప్రముఖ వ్యక్తులు, పురాణ పురుషులు ఐనందువల్ల వారికి వ్యవహారిక భాష నప్పదనీ, ఉదాత్త సాహిత్యబద్ధమైన శైలి వుండితీరాలనీ, వారి వాదం. అన్ని దేశాలలోనూ ఈ సంప్రదాయాన్ని ఆమోదించారు. కాని, సమకాలిక సమాజాన్ని చిత్రించే నాటకాలలో పాత్రలు సామాన్యప్రజలైనప్పుడు ఈ కావ్యధోరణి తగదనీ, మామూలుగా నిత్యజీవితంలో వారు వాడే భాషే వాడాలనీ చాలామంది అభిప్రాయం ఎలియట్ మొదట వ్రాసిన పద్యనాటిక, 'మర్డర్ ఇన్ ది కెథడ్రల్' (Murder in the Cathedral) ఇందులో పాత్రలు చారిత్రక వ్యక్తులు. ఇక్కడ గంభీరమైన కవితాశైలి రాణించింది.

ఇది గొప్ప పద్యనాటకం. తర్వాత ఈయన వ్రాసిన నాలుగు పద్యనాటకాలూ సాంఘికాలు. పాత్రలు ఈనాటి సంఘంలో మనమెరుగున్న వ్యక్తులు. గేయంగా, పద్యంగా వీరి సంభాషణ మలచడం యెంతవరకూ సమంజసం. ఈ పద్ధతిని సమర్థిస్తూ చెప్పిన కారణాలలో రెండు ముఖ్యమైనవి.

అపూర్వమైన చిత్త ప్రవృత్తిని పొంది బలమైన ఉద్రేకాన్ని ప్రకటించినప్పుడు, మానవుడు కవిత్వంలోకి జారతాడన్న వొక సూత్రం. నాటకం అట్లాంటి అపూర్వ సన్నివేశాల కూర్పు గావున, ఉద్రేక ప్రకర్షకి, కవిత్వమే శరణ్యం.

సాంఘిక నాటకంలో పాత్రలకీ, తిలకిస్తున్న ప్రేక్షకులకీ, కాస్తదూరం ఏర్పడాలన్నది రెండో సూత్రం. సాంఘిక నాటకంలో పాత్రలు, ప్రేక్షకజనంలో వారిలాగే ఉంటారు, వేషధారణలో సహజమైన సన్నిహితం ఇందువల్ల ఏర్పడుతుంది కాని, ఈ సన్నిహితం మరీ ముదిరితే ప్రమాదిస్తుంది. ఇది కళ — 'ఇదొక నాటకం' — అన్న మాయ, భ్రమ సడలి – రంగస్థలంపై 'ఎవరో ఎవరిపైననో కోపగించి కొట్టబోతుంటే, ప్రేక్షకులలో కొందరు రంగస్థలంపైకి ఉరికి 'తన్నండి' అనో, 'ఆగండి' అనో తాము కూడా ఆ పాత్రలతో కలసిపోయి, కార్యానికి పూనుకొనే ప్రమాదం ఏర్పడుతుంది.

కార్యంతో నిమిత్తం లేకుండా, కాస్త దూరంగా ఉండి, నాటకం అల్లిన వాతావరణంలోకి జారిపోడానికి కవిత్వం అవసరం అని ఎలియట్, ఫ్రై (Fry) మొదలైనవారి సిద్ధాంతం. ఇది నాకూ సమ్మతమే. ఎటొచ్చి, వాడే భాషలో బిగి, గాంభీర్యం, చిత్తప్రవృత్తులను అతిక్రమించకుండా ఒక అదుపులోకి తెచ్చి నడిపే జిజ్ఞాస పోగొట్టుకోకూడదు. ఈ నైపుణిని ఎంతవరకూ ఆచరణలో పెట్టొచ్చో పరిశీలిస్తూ ఎలియట్ నాలుగు పద్యనాటికలు వ్రాశాడు. మామూలుగా బైట మర్యాదగా జీవితం గడిపేవారి అంతరంగంలో రగిలే సంఘర్షణ, వీటిల్లో ఇతివృత్తమైనందున; యీ పద్యనాటికలు సంస్కారంగల ప్రేక్షకజనం మన్నన లందుకున్నాయి. పిన్నలు సంప్రదాయంపై తిరుగుబాటు చేసి, గతాన్నుండి తప్పించుగుని వేరే కొత్త జీవిత విధానాన్ని అనుసరించడం అసంభవం — అని చూపడం ఒక నాటక ఇతివృత్తం ఇందులో పెద్దలు, తాము చిన్నప్పుడు చేసిన తప్పిదాలు తమ సంతానంపై నీడలుగా ప్రసరించి ఇబ్బంది కలుగజేస్తాయి. చెడుగంతా గతంలో దిగవిడిచాను. ఇంక నిశ్చితంగా ఉండొచ్చు అనుకోడానికి వీల్లేదు. గతంలోని ఉదంతాన్ని బైటపెట్టేవాడు ఎప్పుడో తటస్థపడతాడు. అప్పుడు, అది బైటపడకుండా ఉండాలంటే ఆ వ్యక్తిని హత్యచెయ్యాలి. మన

చేష్టల ఫలితాలనుండి మనంగాని,, మన సంతానం కాని పారిపోలేమన్న నీతి మరొక నాటకంలో వస్తువు.

'ది ఫామిలీ రీ యూనియన్' అనే నాటకంలో నాయకుడు హారీ. ఏదో అపచారం చేసినవాడల్లే బాధపడుతూ ఇంటికి తిరిగి వొచ్చినప్పుడు ఆ బాధ తెరలు విడిపోతాయి. అపచారం తను చేసింది కాదు. తన తండ్రి చేసింది. తన తండ్రి తన తల్లిని హత్యచేయాలన్న 'కసి' తనలో తనే తన భార్యని హత్య చేసిన భ్రాంతిని నెలకొల్పింది.

హారీ : నా జీవితం వొక కల.
ఇతరుల మనస్సులు కన్న కల.
ఆమెను తో సేసినట్లు కలగన్నానేమొ.

అగాతా : నేనూ అదే అనుకున్నాను.
అవుతేనేం ?
మనం వ్రాసినది డిటెక్టివ్ కథ కాదు –
హత్య, నేరం, పాపం, పశ్చాత్తాపాల ఉదంతం కాదులే.
నీ దౌర్భాగ్యపు కుటుంబీకుల సంస్కృతి నీవు
ఆ కుటుంబంలోంచి వొక పక్షివై,
ఈ నిప్పులో కాల్తున్నావు.

పద్యనాటకాలలో ఉత్తమమైంది 'ది కాక్టైల్ పార్టీ' అన్నది. మామూలుగా జరిగే 'పార్టీ' సందర్భంలో మనుషుల మనసుల్లో రేగుతున్న నైతిక సంఘర్షణ, ప్రదర్శితమౌతుంది ఇందులో.

ఎలియట్ చివరి నాటకం 'ది ఎల్డర్ స్టేట్సుమన్' (**The elder statesman**) అనేది ఇందులో నాయకుడు పెద్ద పదవినుండి విరమించి, తన సంతానం నుండి తన కలవాటైన శ్రద్ధాభక్తులను అమితంగా కోరతాడు. తను శాసించినదాన్ని వారు ఇవ్వలేరు. చివరికి తన తప్పిదాన్ని తెలుసుకుంటాడు అందులో వొక స్వగతం.

"నా బిడ్డలపై ఎందుకు చలాయిస్తానో అధికారం?
(కొడుకు) మైకెల్‌కి ఇరుకు మార్గం ఎందుకు నిర్దేశించానో?
ఎందుకంటే – అతనిలో నేనింకా తాండవించాలని.
(కూతురు) మోనికా, ఎప్పుడూ నా దగ్గరే ఉండాలంటాను.
యెందుకో తెలుసా?
నా లాంటి మనిషి ఆమెకి తటస్థ పడేవరకూ

నా దగ్గరే ఉండాలి.
నే నెట్లాంటి మనిషిని కావాలనుకున్నానో
అట్లాంటి మనిషి ఆమెకి దొరకాలి—
అని అనుకోడంలో నా ఘనత ఎల్లాంటిదో
ఎదుర్కొని దగా చేసుకుంటాను."

మొదట్లో చెప్పినట్లు, నన్నెక్కువగా ఆకర్షించింది ఎలియట్ విమర్శ గ్రంథాలు. కవిగా, నాటకకర్తగా కంటె విమర్శకుడుగా, ఎలియట్ ఖ్యాతి చివరిదాకా నిలిచిపోతుందనుకుంటా. మహాకవులను గురించి, పాశ్చాత్య సాహితీ వేత్తలను గురించీ చాలా విమర్శలు వ్రాశారు. డాన్, డ్రైడన్, బాడ్లేర్ బ్రామాల్, లాన్సిలట్ ఏండ్రూస్, మార్స్టన్, టూర్నర్, ఫోర్డ్ మొదలైన మరుగుపడ్డ రచయితల విశిష్టతను సోదాహరణగా చూపి వారిపట్ల అభిరుచి పెంచే యత్నం చేశాడు. శిఖరాలపై నున్న కొందరు కవుల కీర్తి ప్రతిమల్ని కదిపి చూశాడు. ఒకటి రెంటిని కూలదోశాడు కూడా ఆంగ్లకవులలో మహాకవిగా మిల్టన్ స్థానం ఏర్పడిపోయింది. నేటి కొందరు తెలుగు రచయితలు ఇంగ్లిషు పయోగాలు, శైలి రీతులు, భావాలూ తెలుగులో ప్రవేశపెట్టి భాషని కలుషితం చేస్తున్నారని పెద్దలు వాపోతున్నట్లే, మిల్టన్ కవి లాటిన్ ప్రయోగాలు, పదాలు తెచ్చి ఆంగ్లభాషని కలుషితం చేశాడన్న ఫిర్యాదు వేశాడు ఎలియట్. మిల్టన్‌ది కృత్రిమమైన భాష. ఎవరూ అనుకరించ వీలుకానిది ఆంగ్ల కవితా సాంప్రదాయాన్ని రాజబాట నుండి మళ్ళించి ఎవరూ నడవలేని సందులోకి మళ్ళించాడుట. ఆయన భాష చైనా గోడలా కవితామ తల్లికి అడ్డంగా వుందిట!

ఇదంతా ఎలియట్ మొదట్లో మిల్టన్‌పై వ్రాసిన వ్యాసంలో వుంది. పెద్దయ్యాక తన అభిరుచుల్ని నిర్ణయాల్ని సింహావలోకనం చేస్తూ, మిల్టన్‌పై మరొక వ్యాసం వ్రాసి అందులో చిన్ననాటి తన వైఖరికి పశ్చాత్తాపం వెలిబుచ్చి, పొరపాటు వొప్పుగుని, ఆ మిల్టన్ ప్రతిమను మళ్ళా శిఖరంపైన స్థాపించాడు.

కవులపై ఎలియట్ చేసిన విమర్శ జోలికి పోను ఈ వ్యాసంలో. ఎందుకంటే, ఆ కవుల కావ్యాలతో పరిచయం వుంటేతప్ప, ఆ పరామర్శకి ప్రయోజనం వుండదు. ఇవికాక ఆయన కవిత్వంగూర్చి, విమర్శగూర్చి ఎన్నెన్నో కొత్త కోణాలను తరిచి చూచాడు. నూతన సూత్రాలని ప్రతిపాదించాడు. వీటిల్లో మనకి సుళువుగా అర్థమై అన్వయించే కొన్నింటిని గూర్చే వ్రాస్తాను.

గొప్ప గ్రంథాలు చదవడంవల్ల కలిగే అనుభూతి, ఆనందమూ మన వ్యక్తిత్వాన్ని యెట్లా మార్చివేసేది, జీవిత వికాసానికి తోడ్పడేదీ విశదపరుస్తూ ఇట్లా అంటాడు :

"ఊహాబలంతో కూడుకున్న గ్రంథం వ్రాసిన ప్రతి రచయిత మనలో యిమిడిన మనిషిని మొత్తంగా కదవడానికి యత్నిస్తాడు. మనకి ఇష్టం వున్నా, లేకపోయినా, మొత్తం మనుషులుగా ఆ ప్రభావానికి లొంగిపోతాము"

కవిత్వంపట్ల అభిరుచి ఏర్పడడమూ, కాలంతోపాటు ఆ అభిరుచి అభివృద్ధి చెందడమూ, మనం పెరగడంతో ఆ కావ్యం కూడా పెరగడమూ గురించి ఎలియట్ చెప్పినవి, మనందరి అనుభవంలోనివే.

"కవిత్వంపట్ల కాస్తో కూస్తో అభిరుచిగల ప్రతివ్యక్తి యౌవనదశలో ఒక కవి ప్రభావానికో, ఒక కావ్యం ప్రభావానికో పారవశ్యంతో లొంగిపోయిన క్షణాలు జ్ఞప్తిచేసుకోగలడు ఒకరి తర్వాత ఒకరు – అనేక కవుల ప్రభావాలకి లొంగిపోయి వుండొచ్చు నడివయస్సులోకంటె యౌవన దశలో మన అనుభూతులు, గ్రాహ్యశక్తులూ తీక్షణం అవడమే ఇందుకు కారణం అనుకో నక్కర్లేదు. ఇదంతా ఇల్లా జరుగుతుందనుకుంటూ చిన్నప్పుడు మన వ్యక్తిత్వాలు పూర్తిగా వికసించి. స్థిరపడవు – వూడ్చి శుభ్రంచేసిన ఖాళీ గదిలాంటివి ఆనాటి మన వ్యక్తిత్వాలు. ఈ గదిలోకి యెదిగిన కవి వ్యక్తిత్వం ప్రవేశిస్తుంది. ఎక్కువగా చదివే అభ్యాసం లేనివారిలో కూడా, పెద్దయ్యాక ఇలాంటిదే జరుగుతుంది. ఏదో వొక రచయిత ప్రభావానికి పూర్తిగా లొంగిపోతాము – కొన్ని రోజులు. తర్వాత మరొక రచయిత ప్రభావానికి లొంగిపోతాము. మన మనస్సులో ఆ రచయితలు, ఒకరిపై ఒకరు వొత్తిడిచేస్తూ మారుతూ వుంటారు. వీరిని మనం తూచి, పోల్చిచూస్తాం. ఒకరిలో ఉన్న లక్షణాలు, రెండోవారిలో వుండవు. అంటే, మనం విమర్శనా దృష్టి అలవరుచుకున్నామన్నమాట. ఈ వృద్ధిచెందే మన విమర్శనాశక్తే, ఏ ఒక్క రచయితకి పూర్తిగా లొంగిపోకుండా మనల్ని కాపాడుతుంది. అనేకమంది రచయితలతో పరిచయం వుండడంవల్ల ఇదే ప్రయోజనం. ఒకరి తర్వాత ఒకరు – ఆ రచయితల ప్రభావాలకి గురై ఏ ఒక్కరికీ లొంగిపోకుండా వుంటామన్న మాట."

నవలలు మొదలైన కల్పనా సాహిత్యం చదవడంవల్ల కలిగే ప్రయోజనం గూర్చి ఎలియట్ అభిప్రాయాలు చూద్దాం.

"నవలల్లోని సన్నివేశాలు, పాత్రలు, చేష్టలూ, ఉద్రేకాలూ – వీటిద్వారా జీవితాన్ని గూర్చిన మన పరిజ్ఞానం సూటిగా పెరుగుతుందనుకోడం కల్ల; మన మెరుగున్న మనుషులూ, జీవితమూ వీటికీ మనకీ వున్న సంబంధమూ – ఈ రకం పరిశీలనతో, స్వయంగా అనుభవించి తెలుసుకోడంతో పెరుగుతుంది కాని, కల్పిత జగత్తు ద్వారా కాదు. నవలల ద్వారా మనకి లభించిన పరిజ్ఞానం, ఇతరుల ద్వారా

మనం తెలుసుకున్నదేకాని స్వంతం కాదు. ఇవన్నీ జీవితాన్ని గూర్చికాని, జీవితం కాదు. కల్పిత సాహిత్యంలోని సంఘటనలను, మన కళ్ళముందు, జరిగినవిగా భావించిననాడు, నిజంతోబాటు, కాస్తంత అబద్ధం కూడా, ఎదురౌతుంది."

ఈ జగత్తు మరొక వ్యక్తి కల్పించింది — ఆ వ్యక్తి ఒకరకం మనిషి. అతనికి ఇవి ప్రధానమైనవిగా తోచినవి — కొన్నింటికి విలువకట్టాడు కొన్నింటిని విసర్జించాడు — అన్న జిజ్ఞాసతో చదివినప్పుడే, కవిత, సాహిత్యం మనకి ఉపకరిస్తుందని ఎలియట్ వాదం. మనం పెరిగి పెద్దవాళ్ళమై, అనేక నవలలు చదివాక, వివిధమైన దృక్పథాలు, జీవితపు విలువలు మనలో ఇమిడివుంటాయి. ఉత్తమ గ్రంథాలు చదవడంవల్ల మనం పొందే ప్రయోజనం కూడా ఇదేనన్న కొందరి వాదాన్ని ఖండిస్తున్నాడు ఎలియట్

"మన అభిరుచిని సరిదిద్దుకునే ఉద్దేశంతో శ్రద్ధగా చదివినప్పుడుకంటె, కాలక్షేపానికి, వినోదానికీ చదివిన కల్పిత సాహిత్యాన్నుండే నిజమైన ప్రయోజనాన్ని పొందుతామని నా నమ్మకం. శ్రమ లేకుండా, కులాసాగా చదివి పారేసే గ్రంథమే మనపై స్థిరమైన ప్రభావాన్ని మోపుతుందేమో" అంటాడు. దీని పర్యవసానం ఏమిటి? కాలక్షేపానికి, వినోదానికీ, మనం ఎక్కువగా సమకాలిక సాహిత్యం చదువుతాం గనుక, సమకాలిక రచనలనే మనం జాగ్రత్తగా పరిశీలించి, పరామర్శించాల్సి ఉంటుందన్న 'షరా'తో ఈ అభిరుచిని గూర్చిన ప్రస్తావన ముగిస్తాడు.

సాహితీ సంప్రదాయానికీ, వ్యక్తిగతమైన ప్రజ్ఞకీ ఉన్న సంబంధాన్ని వివరిస్తూ ఎలియట్ చేసిన కొన్ని నిర్వచనాలు అద్భుతమైనవి. ఆయన తన 'వేస్టలాండ్' అనే కావ్యాన్ని ప్రచురించినప్పుడు, అది ఆంగ్ల సాహితీ సాంప్రదాయానికి విరుద్ధమైనదిగా ఎన్నికచేసి, ఆనాటి విమర్శకులు విరుచుకుపడటంతో ఎలియట్ సాహితీ సంప్రదాయం అంటే తనేమనుకుంటున్నాడో విశదపరుస్తూ వ్యాసరచనకి పూనుకున్నాడు

"పెడసరమైన కొన్ని విశ్వాసాలని ప్రతిపాదించటం మట్టుకే సాంప్రదాయంగా ఎంచడంలేదు నేను సహజమైన అలవాట్లు, పనులు, ఆచారాలు — మత సంబంధమైన కర్మకాండ నుండి అపరిచితుణ్ణి ఆహ్వానించే విధానం వరకూ ఏదైనా సరే — ఒకే స్థలంలో ఉండే వ్యక్తుల రక్తసంబంధాన్ని సూచించే ప్రక్రియలూ — ఇవన్నీ సంప్రదాయంలో ఇమిడి ఉంటాయి. సంప్రదాయంలో నిషేధింపబడినవి ఎన్నో ఉంటాయి. నిషేధింపబడినవన్నీ చెడ్డవనీ, నేడు వాటిని పరిత్యజించాలనీ కొందరు అభిప్రాయపడుతున్నారు. ఇది నాకు ఆశ్చర్యంగా ఉంది.

శరత్కాలపు గాలికి ఆకులు ఊడిపోగా, మిగిలిన చెట్టు మన దృష్టిని ఆకర్షించినట్లు కొన్ని ఆచారాలు, అలవాట్లూ నిషేధింపబడినప్పుడే మన దృష్టిని ఆకర్షిస్తాయి హైరాణతో ఆ రాలిన ఆకుల్ని ఏరి, మళ్ళా కొమ్మలకు అతికించే యత్నం చెయ్యొచ్చు — కాని ఆ చెట్టులో ఇంకా చేవవుంటే, కొత్త ఆకులు అందులోంచి ఎల్లానూ పుడతాయి గావున ఆ ఎండిన చెట్టుని నరకడం మేలు.

మార్పులేక స్థిరంగా నిలచిపొయ్యేది సంప్రదాయమని మనలో మరొక అభిప్రాయం ఉంది. ఇది పొరబాటు. తమ ఆధిక్యతని ప్రకటించుకోడానికి, కొందరు సాంప్రదాయాన్ని పట్టుకు ప్రేళ్ళాడతారు. ఇదీ పొరబాటే. ఒక సమయంలో, ఒక సమాజానికి, సాంప్రదాయం ఎంతవరకూ ఉపకరిస్తుందో పరిశీలించి, మంచిని స్వీకరించి, ఆనవసరమైనదాన్ని పరిత్యజించడం జరిగినప్పుడే మనం ఆశించిన సమాజం తటస్థపడొచ్చు."

ఆస్తి సంక్రమించినట్లుగా సాంప్రదాయం మనకి సంక్రమించదు దాన్ని మనదిగా చేసుకోవాలంటే మనం ఏంజెయ్యాలి అన్న ప్రశ్నకి, ఎలియట్ సమాధానం ఇది.

"పాతికేళ్ళు దాటింతర్వాత కూడా కవిత్వం కొనసాగించదలిచిన ప్రతి వ్యక్తి, చరిత్రపట్ల ఒక దృక్పథం అలవరుచుకోవాలి. భూతకాలం యొక్క గతాన్ని మాత్రమే కాక, వర్తమాన కాలంలో దాని ఉనికిని గ్రహించగల జిజ్ఞాస కలిగి ఉండాలి. గతంపట్ల ఇట్లాంటి మమత ఉన్నవాడు, సమకాలిక జగత్తునంతా మన ఎముకల్లో జీర్ణించుకొని రచన సాగించడమే కాకుండా, ప్రపంచ సాహిత్యం లోతుపాతులతో పరిచయం కలిగి, ఆ విశ్వ సాహిత్యం, తన జాతి సాహిత్యం యొక్క అవధులేవో తెలుసుకోడం, ఈ రెంటి ఏకకాలీనతలో ఒక అంతరం వున్నదన్న చైతన్యంతో కలం పట్టిన రచయిత, సాంప్రదాయాన్ని వదులుకో లేడు. కాలానికి లొంగని విలువల్ని గురించి పట్టించుకునేవాడు, తన కాలానికి ముడిపడ్డ ప్రయోజనాలని సాధించి తీరుతాడు."

రచయిత ఏకాంతజీవి. సాంప్రదాయం లేవదీసిన గోడల మధ్య వుండ లేడు. వాటిని పడగొట్టి, విముక్తుడు కావాలి — అన్న వాదం ఒకటి ప్రచారంలో ఉన్న రోజుల్లో, ఆ వాదాన్ని త్రోసిపుచ్చ సాహసించిన కొద్దిమంది విమర్శకులలో ఎలియట్ అగ్రగణ్యుడనే చెప్పాలి. "ఏకాకిగా వున్న ఏ రచయితా పూర్తిగా అర్థమవడు. గతించిన కవులమధ్య అతని స్థానం తెలుసుకున్నప్పుడే, అతని కవిత్వానికి ప్రయోజనం ఏర్పడుతుంది. ఒక కొత్త రచన వెలువడగానే, వెనకటి రచన విలువలన్నీ మారి, మరొక క్రమం ఏర్పడుతుంది " ఎంతటి అధునికుడైనా,

ప్రాచీన కవులను కొలిచిన కొలతబద్దలతోనే, కొలవబడాలి అంటూ వెనకటి కవులు నెలకొల్పిన సాంప్రదాయాన్ని విస్మరించకూడదని హెచ్చరిస్తాడు ఎలియట్ గతాన్ని గూర్చిన జిజ్ఞాస కవి తన జీవితాంతం పెంపొందించుకోవాలంటాడు. ఈ సందర్భంలోనే ప్రతి కళాకారుడూ వల్లెవేయవల్సిన నిర్వచనం చేశాడు ఎలియట్.

"ఆ క్షణంలో తనని మించిన విలువలకి అధీనుడైపోవాలి కళాకారుడు. అనుక్షణమూ, ఆత్మత్యాగం చెయ్యడంలో, తన వ్యక్తిత్వాన్ని అంతమొందించడంలో ఉంది కళాకారుడి పురోగమనం. ప్రత్యేకమైన తన వ్యక్తిత్వం విచ్ఛిన్నమైననాడు, అతని రచన సాంప్రదాయంలో ఒక భాగంగా స్థిరపడిపోతుంది ఆ స్థితిలో కళ కూడా, విజ్ఞానశాస్త్రానికున్న హోదాని తెచ్చుకుంటుంది." కళాకారుడి వ్యక్తిత్వం – ఒక ఉద్యమంగా చలామణి అవుతున్న ఈ రోజుల్లో, వ్యక్తిత్వాన్ని త్యాగంచేసి, పరోక్షమైన విలువ సాధించి, విజ్ఞానశాస్త్రానికున్న స్థూలమైన పరిమాణాన్ని కళాజీవి అందుకోడంలో వున్న సౌందర్యాన్ని పరిచయం చేసిన ఎలియట్ నిజంగా అభినందనీయుడు.

"కళాకారుడు పరిపూర్ణుడైనకొద్దీ, అతనిలో బాధపడే వ్యక్తి, సృష్టిచేసే మనస్సూ విడిపోయి, దూరమౌతాయి. ఈ ఎడబాటువల్లనే అతను సృష్టించిన రచనకి పుష్టి సమకూరుతుంది."

అపూర్వమైన అనుభవాలు, వాటినుండి జనించే అసాధారణమైన ఉద్రేకాలు కవికి లభించినప్పుడే అతని కవితకి ఒక విశిష్టత సమకూరుతుందన్న వాదాన్ని ఖండిస్తాడు ఎలియట్ కవి పొందే రాగము, భావము, సర్వసాధారణమైనవే కావచ్చు కాని అతని కవితలో ప్రత్యక్షమయ్యే మనస్తావము, సంక్లిష్టమైనది కావచ్చు – కాని అది అసాధారణమైన అనుభవం పొందిన వ్యక్తిలో కలిగే మిశ్రితమైన చిత్తక్షోభ అవనక్కర్లేదు. చాలామంది కవులు రాగంలో, భావంలో కొత్తదనం అన్వేషించడం పొరబాటంటాడు ఎలియట్. కొత్తదనాన్ని అన్వేషించడం, వక్రమార్గాన్ని కనుక్కోడంలో అంతమొందొచ్చు.

"కొత్త చిత్తప్రవృత్తులను కనుక్కోడం కవి పనికాదు. యదార్థమైన ఉద్రేకంలో లేని చిత్తవృత్తులను వ్యక్తంచేసి, కవితలో అవతరింపచెయ్యడం మట్టుకే అతని పని. తాను నిత్యజీవితంలో పొందని అనుభూతులు కూడా, ఇందుకు ఉపకరిస్తాయి" అంటాడు.

ఐతిహ్యాన్నిగూర్చిన ఈ వ్యాసం ముగింపు మరపురానిది.

"విచ్చలవిడిగా ఉద్రేకాన్ని పైకి ఉబికించడం కవిత్వం పనికాదు –

ఉద్రేకాన్నుండి పారిపోవడమే కవిత్వం సాధించేది. వ్యక్తిత్వ ప్రకర్ష కాదు' వ్యక్తిత్వాన్నుండి పారిపోవాలి వ్యక్తిత్వమూ, ఉద్రేకాలూ వున్నవారికే ఇల్లా వీటి నుండి పారిపోవడం అంటే ఏమిటో తెలిసొస్తుంది."

కవిత్వాలకీ, తత్త్వశాస్త్రానికీ, మతానికి దగ్గర సంబంధం వున్నదని ప్రపంచ సాహితీపరులు ఆమోదించిన విషయమే. ఈ నమ్మికని పురస్కరించుకుని, మహాకవుల కావ్యాలలో లీనమైన తత్త్వజ్ఞానాన్ని విడగొట్టి పరామర్శించడం జరుగుతూనే వుంది. మతం ఆదేశించిన నైతికచింతన, ఆధ్యాత్మిక విలువలు షేక్స్పియర్ నాటకాలలో లేవుగనక, షేక్స్పియర్ని గొప్ప కవిగా అంగీకరించ లేనన్నాడు టాల్స్టాయ్. వాల్మీకి, సోఫాక్లీస్, డాంటె, గెదె, కాళిదాసు, టాగూర్ — వీరి కావ్యాలలోని తత్త్వజ్ఞానాన్ని పరిశీలించి, తాత్త్విక చింతనని కవితతో ముడిపెట్టే సంప్రదాయం ఉంది మతంలో నమ్మిక, రాజకీయవాదం పట్ల సానుభూతి, ఏదో ఒక తత్త్వం, సామాజిక పరిజ్ఞానం — ఇవేవీ కవికి అవసరం లేదనడు ఎలియట్. వీటిపట్ల అతనికి గురి, విశ్వాసము వుండితీరాలి. సమాజం అతనికున్న స్థానాన్ని గూర్చిన జిజ్ఞాస పోగొట్టుకోకూడదు. కాని, తన వ్యక్తిగతమైన నమ్మకాలు, భావాలు, విశ్వాసాలు, కవిత్వంలో దర్శనం ఇవ్వడం వేరు. సమాజం సిద్ధంచేసి అమర్చి యిచ్చిన తాత్త్విక స్వరూపాన్ని విడనాడి, స్వంతంగా తానొక వూహా సామ్రాజ్యాన్ని, తత్త్వాన్ని కల్పించుగుని అర్థంకాని కవిత వ్రాసినందుకు, బ్లేక్ కవిని దుయ్యబట్టాడు ఎలియట్. సమాజ స్వరూపంతో అన్వయం కుదరదని ఒక సొంత తత్త్వం కల్పించుకుని చిత్రిస్తే ఆ చిత్రణ ఎవరికీ అర్థం కాకుండా పోతుంది. కవి, తన కావ్యంలో ఎంతవరకూ తాత్త్విక చింతన కొనసాగించాలి అన్న విషయం గూర్చి నిర్దేశించే హక్కు మనకి లేకపోయినా, విమర్శకుడు, ఈ తాత్త్విక చింతనతో ఎంతవరకూ నిమిత్తం పెట్టుకోవాలో నిర్ణయించుకుని కొన్ని గిరులు గీసుకోవాలంటాడు ఎలియట్. కవితలో తాత్త్వికచింతనపట్ల అభిరుచిగల విమర్శకులు, అసలు కవితని విస్మరించి తమ స్వంత తత్త్వాన్ని కవికి ఆపాదించి విపరీత వ్యాఖ్యానం చెయ్యడమన్నా జరుగుతుంది. లేదా ఏ తత్వం జోలికీ పోక, స్వచ్ఛమైన కవిత ఒకటున్నదంటూ, ఆ కవి వెనకవున్న సంస్కృతినీ, చరిత్రనీ, సమాజాన్నీ విస్మరించి సంప్రదాయబద్ధమైన విలువలతో నిమిత్తం ఒదులుకుని, గాజుమేడలో ఏకాంత జీవనానికి పూనుకోడమేనా జరుగుతుంది. ఈ రెండూ ప్రమాదకరమైన దృక్పథాలే నంటాడు ఎలియట్. ముఖ్యంగా ఆధునిక యుగంలో విజ్ఞానశాస్త్రం ప్రబలి, మతంపట్ల విశ్వాసం సన్నగిల్లుతూంది. ఆధ్యాత్మిక చింతన, సంప్రదాయం

నెలకొల్పిన ఆరాధనాభావం, అతీంద్రియ జ్ఞానాన్వేషణ మరుగుపడుతున్నట్లు గ్రహించి వాటిని విడనాడలేక, ఏ కొత్త తత్వంలోకో జారి, ఓదార్పు పొందు తున్నారు జనం. మతంలోని ఉద్రేకాన్ని మాత్రం తీసుకుని దానితో మిళితమైన కర్మకాండని విసర్జించాలని కొందరి యత్నం కావల్సిన మనశ్శాంతి కవిత్వంలో చూరగొంటామని మరికొందరి యత్నం. విజ్ఞానశాస్త్రంలో కవిత్వం లేదా అని కొందరి ప్రశ్న ఈ గంద్రగోళంలో కవితా ప్రపంచం సరిహద్దులు తారుమారై, అదే మతంగా, తత్వంగా తటస్థపడుతూండడం గమనించి ఎలియట్ మళ్ళీ సరిహద్దుల్ని గీసి సుస్థిరం చెయ్యాలని గట్టియత్నం చేశాడు కొన్ని వాక్యాలను ఉదహరిస్తాను.

"ఉద్రేకానికి ప్రస్ఫుటమైన స్వరూపం లేదనీ, భావానికి స్ఫుటమైన ఆకృతి ఉందనీ చెప్పుకుంటూ వుంటాము. నిజానికి, ఉద్రేకంలో కూడా స్పష్టమైన ఉద్రేకం, అస్పష్టమైన ఉద్రేకం అంటూ ఉంటాయి. స్పష్టమైన భావ ప్రకర్షకి ఎంతటి బుద్ధి కుశలత అవసరమో, స్పష్టమైన ఉద్రేకాన్ని ప్రకటించడానికి అంతటి బుద్ధి కుశలతా అవసరమే."

షేక్స్పియర్ నాటకాల్లో తత్వాన్ని వెదికేవారిని ఆక్షేపిస్తూ ఇల్లా అంటాడు ఎలియట్.

"షేక్స్పియర్ నాటకానికి అర్థం లేదు అనడం పొరబాటైనా, షేక్స్పియర్ ఏ ఒక నాటకానికీ అర్థం' అంటూ ఒకటుందనుకోను. 'ఇది జీవితం' అని భ్రమింపచేసేదే గొప్ప కవిత్వం. షేక్స్పియర్, డాంటె, వర్జిల్ హోమర్, సోఫక్లీస్‌లు కల్పించిన జగత్తులోకి ప్రవేశించినప్పుడు, బుద్ధి బలంవల్ల గ్రహించి ప్రకటించగలదేదో ఆ జగత్తులో ఉందనుకుంటాం – ఇందుకు కారణం? స్పష్టమైన ప్రతి ఉద్రేకమూ బుద్ధి ద్వారా ప్రకటితమవడానికి అనువైందిగా వుంటుంది" ఈ వ్యాసం ముగింపులో ఇల్లా అంటాడు, "తత్వానికీ, మతానికీ బదులుగా ఎంచడానికి వీలు లేదు కవిత్వాన్ని. దాని పని వేరు. ఆ ప్రయోజనం రసానికీ ఉద్రేకానికీ సంబంధించినది గనక బుద్ధి కుశలతకి తెలిసిన రీతిలో దాన్ని వ్యక్తం చెయ్యడం సాధ్యం కాదు."

మరొక చోట;

"పరిశోధనకీ, పాండిత్యానికీ లొంగని ఉదంతం గొప్ప కవిత్వంలో కాస్తంతైనా ఉండి తీరుతుంది - మనకి ముఖ్యమైనది కూడా అదే. కావ్యం సృష్టించబడగానే, ఏదో ఒక క్రొత్త వస్తువు తటస్థపడుతుంది. దాని పుట్టుకనీ, పూర్వం ఏం జరిగిందో శోధించినంత మాత్రాన ఆ రహస్యం బైటపడదు. బైట పడనప్పుడే దాన్ని సృష్టిగా భావిస్తాను."

కవిత్వం కంటె జాతీయమైన కళ మరొకటి లేదంటాడు ఎలియట్. తన ప్రాంతంలో, తన ప్రజలో కవి ప్రభావం తగ్గి, కవిత్వం వెనకబడినప్పుడు, ప్రతి ఒక్కరూ బెంగపడటం చాలదు. తన చుట్టుప్రక్కల ప్రాంతాలలో, ఇరుగు పొరుగువారిలో కవిత్వం ప్రాముఖ్యాన్ని గోల్పోయినా కూడా మనందరం ఖేద పడాలంటాడు. ఈ వాక్యాలు ప్రతి ఒక్కరూ గమనించ తగ్గవి.

"మతంపట్ల నమ్మకం తగ్గిపోతోందని ప్రతివారూ అంటున్నారు. మతంతో ముడిపడ్డ సున్నితమైన అనుభూతి దిగజారిపోతోందన్న విషయం పీ రెవరూ గుర్తిస్తున్నట్లు లేదు. మన పెద్దలు నేర్పిన దైవారాధనాభావం, కొన్ని విశ్వాసాలు మనలో లేకపోవడంలో విశేషం లేదు. వారికున్న ఆధ్యాత్మిక చింతన, తత్సం బంధమైన ఉద్రేకమూ మనలో లోపించడమే ఆధునిక యుగంతో నాకున్న పేచీ. ఇప్పుడు మనకి ఒక నమ్మికలో, విశ్వాసం కుదరకపోయినా, ఆ నమ్మిక ఏమిటో అర్థం చేసుకోగలం కాని మత సంబంధమైన అనుభూతి మాయ మైనప్పుడు, చరిత్ర ప్రారంభం నుండీ మానవుడు సృష్టించిన భాష, భావాలూ అర్థరహితమైనవిగా కన్పడతాయి. కవితా భావము, రసము, దేశదేశానికీ, యుగ యుగానికీ మారినట్లుగానే మత సంబంధమైన అనుభూతి కూడా మారుతూ ఉంటుంది అది గ్రంథం మారకపోయినా అది పురిగొల్పే అనుభూతి మారుతుంది. ఇది మానవ జీవితం తప్పించుకోలేని అవస్థ ఇవి జీవించడం గురించి కంటె, మృతిచెందడం గురించి నేను ఆదుర్దా పడతాను. ఏమొ ముందు ముందు కవిత్వం ప్రేరేపించే ఉద్రేకం, భావం అన్ని దేశాలలోనూ మాయమవుతాయేమో – అట్లా జరిగిననాడు చాలా మంది కోరుతున్నట్లుగా ఈ ప్రపంచం అంతా ఒకటేనన్నది యదార్థమై పూరుకుంటుందేమొ."

1944 లో 'ఏది మహాకావ్యం?' అన్న విషయమై ఎలియట్ ఇచ్చిన ఉపన్యాసం ఉత్కృష్టమైనది. ఆయన వ్రాసిన సాహితీ వ్యాసాలలో, గొప్పదిగా పరిగణించదగ్గ ఒక్క వ్యాసాన్ని పేర్కొనమంటె, దీన్నే ఎన్నుతాను. ఆయన పూహాబలం, శైలి పటిమ, పాండిత్యము, విమర్శనా కౌశలము, హాస్యము పుదాత్తభావ ప్రకర్ష, గంభీర భావాలను సోదాహరణంగా అమర్చి, తర్క బద్ధంగా ముందుకు తీసుకు వెళ్ళగల చమత్కృతి, విశ్వ సాహిత్యం వర్ధిల్లాలన్న ఆవేదన, అంతర్జాతీయ దృక్పథం, ఒక ప్రత్యేకమైన సూత్రాన్ని ప్రపంచ సాహిత్యానికి అన్వయింపచేసే తృష్ణని పాఠకుడిలో రేకెత్తించగల వైచిత్రి, విషయం ఏది కాదో పరామర్శించి, అదేదో తేల్చడం, స్వల్ప విషయాలపట్ల శ్రద్ధాభక్తులు, కవిత్వం పట్ల, విమర్శ పట్ల అనురాగం, ఉద్రేకాన్ని ఉలికించి,

పొంగి పొర్లకుండా నొక్కివక్కే మానసిక శిక్షణ, నిజాయితీ, చెప్పిన విషయాన్ని. ఎవరికివారు, వారి వారి దేశాల కవిత్వానికీ కవులకి అన్వయించి, పోల్చి చూసుకునేవటిమను రగల్చడం – ఎలియట్ విమర్శలలో ప్రత్యక్షమయ్యే ఈ లక్షణాలన్నీ యీ వ్యాసంలో దర్శనమిస్తాయి. ఇప్పుడు ఆ వ్యాసంలో విశేషాలను విపులీకరించడానికి పూనుకోవడంలేదు నేను

ఏది మహాకావ్యం అన్న ప్రశ్నకి, ఆయన చెప్పిన సమాధానం మాత్రం ఇక్కడ చెప్తాను

ఒక దేశపు నాగరికత పరిపాకము చెందినప్పుడూ, కవి మనస్సు పరిపక్వం చెందినప్పుడూ మహా కావ్యం అవతరిస్తుంది. 'పరిపాకం' అంటే ఏమిటో పరిపాకము చెందనివారికి తెలియచెప్పడం సాధ్యం కాదు. మనం ఎదిగి, పరిపక్వత కలిగివుంటే, ఆ లక్షణాన్ని వెంటనే గుర్తిస్తాము. పరిపక్వమైన భాషతోపాటు, పరిపక్వమైన వేష భాషలు, చేష్టలు, అలవాట్లు కూడా వుండాలి. గతాన్ని గూర్చి విమర్శాత్మకమైన జిజ్ఞాస వుండాలి ప్రజలలో – వర్తమానం పట్ల విశ్వాసం కుదుర్చుకోవాలి; భవిష్యత్తు గూర్చి అనుమానాలు కూడదు. కవికి పూర్వ కవులను గూర్చి తెలిసుండాలి, అతని వెనుక వున్న సంప్రదాయంతో మనకి పరిచయం వుండాలి. ప్రజామోదం పొందిన శైలిలో ఆయువుపట్లు కవి స్వంతం చేసికోవాలి. సిద్ధమైన మనస్సు ఉండాలంటే చరిత్ర – దాన్ని గూర్చి జిజ్ఞాస మాత్రమే కాకుండా మరొక దేశపు నాగరికత చరిత్రలని గూర్చిన పరిజ్ఞానం సంపాదించాలి. ప్రాంతీయ భావం సమసి విశాల దృక్పథం అలవడడానికి ఈ రకంగా ఎదిగిన ప్రజ కావాలి. ప్రజామోదం పొందిన సామాన్య శైలి అంటే, అట్లాంటి శైలి తటస్థపడగానే "ఇదొక ప్రతిభాశాలి వాడిన భాష" అని ఆశ్చర్యం ప్రకటించక "ఇది ఈ భాషలోని ప్రతిభని పూర్తిగా వ్యక్తం చేసింది" అనగలగాలి

"ఈనాడు వొస్తు సముదాయాన్ని గూర్చిన భోగట్టా జ్ఞానంగా చలామణీ అయి, జీవిత సమస్యలను సాంకేతిక నిపుణుల ద్వారా పరిష్కారం చేసుకుంటున్నాం ఈ పరిస్థితులలో మరో రకం ప్రాంతీయ తత్వం ప్రబలుతోంది. ఇది కాలానికి గాని, స్థలానికి సంబంధించింది కాదు. ఇది ప్రచారంలోకొస్తే, అందరం కలసి ఒక రకం ప్రాంతీయ తత్వం అమలు జరపడం జరుగుతుంది. ఈ ప్రమాదం తప్పాలంటే, ఆదర్శ గ్రంథం లక్షణాలను గురించి మనం పట్టించుకోవాలి."

తాను నిర్వచించిన సూత్రాల ననుసరించి వర్జిల్ కవిని (Virgil)

మహా కావ్య కర్తగా పేర్కొన్నాడు ఎలియట్. మన పూర్వ కవులలో వాల్మీకిని మహాకవిగా ఎన్నిక చెయ్యొచ్చు.

ప్రథమంలో తాను రచించిన విమర్శలూ, కావ్యాల వల్ల ఆధునిక సాహితీ కృషికి మార్గదర్శకుడుగా ఎంచబడినా ఒక దశలో, ఎలియట్ చేసిన నిర్వచనం కారణంగా అమితమైన ప్రచారం పొందింది. ఆయన్ని అంతవరకూ మెచ్చుకుంటూ వొచ్చిన వారంతా పెదవి చప్పరించి, అసంతృప్తి విముఖత కనబరచసాగారు. "సాహిత్యంలో నాది సాంప్రదాయకమైన మార్గము; రాజకీయంలో రాజపక్షావలంబిని, మతంలో, రోమన్ కాథలిక్‌ని." ఇదీ నిర్వచనం. ఈ ఆదర్శం చాలా మందికి నచ్చినట్లు లేదు ఇందుకు కారణం లేకపోలేదు. మొదటి ప్రపంచ సంగ్రామానంతరం, ప్రజలకి రాజులపట్ల, నియంతల పట్ల, విశ్వాసం సడలింది, విజ్ఞాన శాస్త్రాభివృద్ధితో పాటు, మతం పట్ల విశ్వాసం సన్నగిల్లింది. సాంప్రదాయకమైన మహా కావ్యాలు, పార్యగ్రంథాలైన ఆదర్శ గ్రంథాలు, ఈ విలువలచుట్టూ అల్లబడి ఉండటంవల్ల సాంప్రదాయ సాహిత్యం పట్ల గురి తప్పింది. సామాన్య మానవుడు ప్రధాన వ్యక్తయ్యాడు; గుంపు సంస్కృతి ప్రచారంలో కొచ్చింది. విజ్ఞానశాస్త్రం, సాధించిన ఫలితాలని మానవులందరూ సమంగా పొంది, జాతి విచక్షణ లేకుండా, ఒక సర్వ మానవ సమాజం నెలకొల్పబడాలన్న నినాదాలు బైలుదేరాయి ఈ ప్రవాహంలో ఎలియట్ వెలిబుచ్చిన పద్ధతి ఎదురీతలా తోచింది.

తన ఆదర్శాలనీ మార్గాన్నీ విపులీకరించి, సమర్థిస్తూ ఎలియట్ ఎన్నో రచనలు చేశాడు. 1939 లో 'క్రైస్తవ సమాజం గూర్చి ఒక అభిప్రాయం 'అన్న శీర్షిక నిచ్చిన ఉపన్యాసాలని గ్రంథంగా వెలువరించాడు సంస్కృతీ సాహిత్యాలకూ కళలు, నాగరికతకు మతం పునాది. ఒక ప్రాంతంలో అవతరించిన మతం నిర్దేశించిన సూత్రాలని, జీవితవిధానాన్ని సంస్కృతి, నాగరికతలను విడగొట్టలేం. అది మంచిది కూడా కాదు. మతం వెనుకవున్న ఆవేదన, తృష్ణ, ఉద్రేకం, కళలకి వెన్నెముకలాంటివి ఆ ఆవేదన, ఉద్రేకం విస్మరించి, స్వచ్ఛమైన కళని ఆరాధించాలనుకోడం వెర్రి — అదీ ఎలియట్ ఈ గ్రంథంలో చెప్పదల్చుకున్నది. ఇదంతా పాశ్చాత్య దేశాలలోని క్రైస్తవ సమాజాన్ని గురించి చెప్పినప్పటికీ, ఇతర దేశాల వారు కూడా తమ మతాన్ని గురించి ఆలోచించుకునే అవకాశం కలగచేస్తాడు ఎలియట్. క్రైస్తవ సమాజం బదులు, హిందూ సమాజం, బౌద్ధ సమాజం—గూర్చి ఆలోచిస్తే ఈ సూత్రాలన్నీ ఎంతవరకూ ఆ యా మతావలంబులకు వర్తిస్తాయో తెలిసొస్తుంది.

"మతాన్ని బుద్ధిబలంతో అంగీకరించి గౌరవించాలి, వాక్కు ఉద్రేకంతో అంగీకరిస్తే చాలదు."

" 'నేను క్రైస్తవ మతావలంబకుణ్ణి' అని చెప్పుకున్న వ్యక్తిని దండించక విడిచేసే సమాజాన్ని నెలకొల్పామని తృప్తి పడాలి. కాని మనం నిజంగా పాటిస్తున్న జీవితపు విలువల్ని గూర్చిన పరిజ్ఞానం యొక్క స్వరూపాన్ని యెదుర్కోక దాచివేస్తున్నాం. ఇతర సమాజాలని ఆక్షేపిస్తూ, మనకీ వారికీ వున్న సన్నిహితత్వాన్ని మరుగుపరుస్తున్నాం. ఈ పోలికల్ని గుర్తిస్తే ఇతరులు మన కంటే ఉన్నత దశలో ఉన్నారని అంగీకరించాల్సి ఒస్తుంది. నియంతృత్వాన్ని అధిక్షేపించడంలో, వారు చూపే శక్తి సామర్థ్యాల పట్ల గౌరవం కూడా వుండేమొ."

"మతభూయిష్టమైన సమాజం మా కక్కర్లేదు అంటె, మనకి సిద్ధమయ్యేది 'నియంత ప్రజాస్వామ్యం'. ఈ సామాజిక వ్యవస్థలో, అందరూ వొకేలాగు కనబడాలి, ప్రవర్తించాలి వ్యక్తిగతమైన ఆవసరాలకు ఇందులో చోటులేదు. చాకచక్యం పేరిట, ఆరోగ్యసూత్రాలకి సంబంధించిన నీతినియమాలు తలెత్తుతాయి. ప్రచారంద్వారా, అందరిఖావాలూ వొకటవుతాయి. పాలకులకు నచ్చిన సిద్ధాంతాలను పురస్కరించుకుని 'కళ' కొనసాగుతుంది. 'ఇది మాకొద్దు బాబో' అన్నవారికి, మతం నేర్పిన శిక్షణ; ఓరిమి సమానతలే శరణ్యం."

ప్రజాస్వామ్యంలో కళల భవిష్యత్తు గురించి ఇల్లా వ్రాస్తాడు ఎలియట్.

"పాలకులు కళలో మంచి, చెడుగులను విడదీసి, పనికిరానిదాన్ని నిషేధించాలి అనను నేను. ఈ నిషేధంకంటె ప్రమాదకరమైన నిషేధం ఒకటుంది. వ్యాపారదృష్ట్యా గుంపులు ప్రచారంలో తెచ్చే చౌకబారు కళ ఒక ప్రమాదకరమైన నిషేధం. గుంపులుచేసే ప్రచారం విధానాలు కళాభివృద్ధికి ఆటంకాలు. ఆర్థికస్థితి కళకి అంతరాయం; విద్యావిధానం మరొక అంతరాయం; బాధ్యత గుర్తెరింగిన కళాపోషకులు లేకపోవడం అంతరాయం. తమ స్వంత కళలు క్షీణిస్తున్నా ప్రతి ప్రాంతంవారు తమ కళ ఉత్తమమైందని ఇతర ప్రాంతాలకి ఎగుమతి చెయ్యడం జరుగుతోంది. మత ప్రచారంలో నిమగ్నులైనవారు, కళలని గురించి పట్టించుగోరు. ఆ యా కళలలో, కృషి చేస్తున్నవారు. మతం గురించి పట్టించుగోరు. ఈ రంగాలపట్ల నేను అభిరుచి కనబరచకపోతే సిగ్గుపడ నవసరంలేదని, పాలకులు వీటిని గురించి పట్టించుగోరు. దీని ఫలితం ఏమిటి? ఉత్తమ సాహితీ వరుడి కృషిని ఏ కొద్దిమందో తన ప్రాంతంలోవారు తెలుసుకుంటారు. చలామణీ అవుతున్న రచయిత కృషిని విమర్శదృష్టి, అక్షరాస్యతాలేని గుంపులు తెలుసుకుంటున్నారు."

మత ప్రచారకులు యువకులకు మతంపట్ల విశ్వాసం కుదిరేలాగు చేసుకోవాలని యత్నాలు జరుపుతూ ఉంటారు ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధకులు బైటపెట్టిన విషయాలవల్ల నాస్తికతత్వం ప్రబలుతోంది. ముఖ్యంగా యువజనులలో – కావున ఇట్లాంటి పరిశోధకుల రచనలలో, మత ప్రాబల్యానికి దోహదమిచ్చే వాక్యాలేమన్నా వుంటే వాటిని పైకిలాగి యువకులకు నచ్చచెప్పి ప్రమాణాలు చూపి మతాన్ని స్వీకరించేటట్లు చెయ్యాలని మత ప్రచారకుల యత్నం. ఆ మధ్య జరిగిన 'లాంబెత్' సమావేశం ఇట్లాంటి యత్నం. వారొక నివేదికని సమర్పించారు. ఆ నివేదికని పరామర్శిస్తూ ఎలియట్ ఒక సమీక్ష ప్రచురించాడు. మత ప్రచారకులు గుర్తైన సాధకబాధకాల్ని, హాస్యంతో చమత్కారంతో విపులీకరించాడు.

"కొత్తగా బైలుదేరుతున్న యువకతరం వారిలో ఒక నూతన మానసిక వికాసం, సంచలనం బైలుదేరింది" అన్న నివేదికలో వాక్యంలో ఎలియట్ వ్యాఖ్యానం ఇది.

"మొత్తంగా ఒక తరంవారిలో సంచలనం బైలుదేరడం అసంభవం అన్నిచోట్లా, ఎప్పుడూ, ఆ విధమైన వివేకం ప్రకటించేవారి సంఖ్య చాలా తక్కువ రెండువేల సంవత్సరాలుగా కొనసాగి, సిద్ధించిన చర్చ ప్రాబల్యంపట్ల కొద్దిమంది చదువుకున్నవారికి అక్కడక్కడ గౌరవం ఏర్పడింది అని ఉండొచ్చు ఈ నివేదికలో. తత్వంపట్ల అభిరుచి గలవారు చాలా కొద్దిమందే ఉంటారు మతంపట్ల నేటి యువకులకు నమ్మిక పెరగకపోయినా, దానిపట్ల విముఖత పెరగలేదనొచ్చు.

వార్తాపత్రికలవారు ప్రముఖుల అభిప్రాయాలని పురస్కరించుకుని, 'మతప్రాబల్యం పెరుగుతోంది' అన్న నినాదాలు ప్రచురించడం గురించి ఎలియట్ వాక్యాలు : "మతప్రాబల్యం పెరిగిందీ అనడంలో అర్థంలేదు – ఎందుకంటే అది క్షీణించడం జరగదు. మతప్రాబల్యం తగ్గడం ఎవరికీ మంచిది కాదు. అది మంచిదైతే ముద్రణాలయంలో చాలామందికి పనుండదు. విజ్ఞానశాస్త్రాన్ని ప్రజలలో వెదజల్లుతూ ప్రజామోదం పొందిన రచయితలకు పాఠకులు కొదవవుతారు. హక్స్లీ సోదరుల టైపురైటర్లు చప్పుడు చెయ్యవు. మతం లేకుంటే విసుగుతో మానవజాతే నశిస్తుంది.

తమ తమ శాస్త్రాలలో పరిశోధనలు సాగిస్తూ, అందలి పరిజ్ఞానాన్ని పురస్కరించుకుని, వొక కొత్తతత్వాన్ని ప్రచారం చేస్తున్న కొందరు ప్రసిద్ధ శాస్త్రజ్ఞుల కృషిని గురించి ఎలియట్ వ్యాఖ్యానం ఇది .

"ఇట్లాంటి తత్త్వాలు వ్యక్తంచేస్తున్న వారందరూ ఇంగ్లీషువారే అని నా అనుమానం, ఐన్‌స్టీన్, ష్రాడింగర్. ప్లాన్క్ మొదలైనవారి నోటంట కూడా ఇల్లాంటి అభిప్రాయాలు విన్నాను. కాని "మమ్మల్ని ప్రశ్నలడిగింది 'సల్లివన్' అని వీరు సమర్థించుకోవచ్చు మనందరిలోనూ. హెచ్. జి వెల్సుకున్నలాంటి 'ప్రథమ పాపం' వుందనుకుంటాను. ఒక ప్రత్యేకమైన శాఖలో మనం తెలుసుకున్న విజ్ఞాన సూత్రాల నాధారంగా అన్నింటికీ సమన్వయం కుదిరే ప్రమాణాలు వెదగడంలో మనకెంతో సంతోషం వుంది. వ్యక్తిగతమైన తత్త్వాన్ని బహిర్గతం చెయ్యడం మనకి సరదా. ఈ రంగంలో శాస్త్రజ్ఞుణ్ణి వొదిలిపెడితే తను నిత్య వ్యవహారాలలో తెల్సుకున్న అనుభవాలనే, తాత్విక సూత్రాలుగా స్వీకరించమంటాడు" యువకులలో మతం నెలకొల్పాలంటే అందులోని సుఖమైన మార్గాలని ఎత్తిచూపాలనీ, కఠినమైనవాటిని వొదిలెయ్యాలనీ, లాంబెత్ నివేదికలో పేర్కొన్నప్పుడు – దాన్ని ఎలియట్ ఖండించాడు. మతం కష్టమైందనీ, శిక్షణతో కూడుకున్నదనీ గ్రహించినప్పుడే, యువకులకు దానిపట్ల అభిమతం ఏర్పడుతుందని ఈయన నమ్మకం

మతంపట్ల విశ్వాసం కుదరనివారు, మతంలోని విశిష్టమైన అనుభూతి వొదులుకోలేక, మరొక కొత్త తత్వంతో ముడిపెట్టి, తృప్తి పెందడం చాలా కాలంగా జరుగుతూ వుంది ప్రకృతిని ఆరాధించడం, కళోపాసన, సమాజసేవ - మొదలైనవి యీ విధంగా అవతరించిన ఉద్యమాలే, సమాజసేవనే, మానవతావాదం (**Humanism**) అంటున్నారు. ఈ వాదానికి చాలా పలుకుబడీ ప్రచారమూ వుంది విజ్ఞానశాస్త్రం అభివృద్ధితో దీనికి మరింత బలం చేకూరింది. మానవసేవే మాధవసేవ అన్న తత్వం అములుకొచ్చింది. **1940-45** ప్రాంతంలో, కొందరు యువకులలాగు, నేనూ ఈ వాదాన్ని స్వీకరించినవాణ్ణే. కాని మానవతావాదం గూర్చి ఎలియట్ వ్రాసిన రెండు వ్యాసాలు చదివాక, ఈ తత్వంలోని ప్రయోజనాన్ని గ్రహించినప్పటికి మతానికి బదులుగా దీన్ని లేవనెత్తి తృప్తి పడడం ఆత్మవంచన అని అంగీకరించక తప్పింది కాదు.

మానవతావాదాన్ని ప్రచారంలోకి తెచ్చిన ప్రముఖులలో ఇర్వింగ్ బాబిట్, (**Irving Babbit**), ఫార్‌స్టర్ (**Foerster**)లు ముఖ్యులు. మతంలో నమ్మికలేని వారికి మానవతావాదమే శరణు అని వారు నమ్మి, కారణాలు చూపుతూ గ్రంథాలు వ్రాశారు. ఇవి ఎంతవరకూ సమంజసమైనవో విమర్శిస్తూ, ఎలియట్ వ్రాసిన రెండు వ్యాసాలూ ఉత్కృష్టమైనవి. అందరూ చదవతగ్గవి. వాటిల్లో విశేషాలను నే నిప్పుడు పేర్కొనడం లేదు. దానికి మరెవరన్నా పూనుకోవాలి. మానవతా

వాదాన్ని గూర్చిన అభిప్రాయాలని, సింహావలోకనం చేసి సూత్రాలుగా చివరలో పొందుపరిచాడు ఎలియట్. వాటిని మాత్రం ఇక్కడ ఉదహరిస్తాను.

1. తాత్త్విక సూత్రాలని ప్రతిపాదించడం, మానవతావాదం పనికాదు. సాధారణ సంస్కృతికి సంబంధించింది కావున, దీనికి తాత్త్విక సిద్ధాంతాలు పునాదులతో నిమిత్తం లేదు. లోకజ్ఞానంతో కాని - కారణాలతో దీనికి పనిలేదు. దీని స్వరూపం ఫలాన అని ప్రస్ఫుటంగా నిర్వచించడానికి యీ తత్త్వం దిగితే, అది మరొక స్వరూపం తెచ్చుకుంటుంది.

2. ఔదార్యము, సమానత, విశాలదృక్పథము - వాటిని పెంపొందించి, ఉన్మత్తుల బారినుండి కాపాడుతుంది.

3. సంకుచితదృష్టి, మూర్ఖత్వం ఎంత అవసరమో; విశాలదృక్పథము, ఔదార్యము అంత అవసరం.

4. దేనినీ ఖండించడం దీని పనికాదు, సంస్కృతినీ, అభిరుచిని ఆధారం చేసుకుని, నచ్చచెప్పడమే దానిపని. కొత్తదాన్ని సృష్టించదు, వున్నదాన్ని విమర్శిస్తుంది. రాజకీయ, సామాజిక జీవితానికి, సిద్ధాంతాలకి ఇది అవసరం.

5. తత్త్వాన్ని గూర్చి, గట్టి సిద్ధాంతాలేవీ ప్రతిపాదించదు మానవతా వాదం. "ఈ మతం, ఈ తత్త్వం నాగరీకమైనవా? కావా?" అన్న ప్రశ్న అడగడం మట్టుకే దీని పని.

6. మానవతావాదంతో తృప్తిపడే వ్యక్తులు కొందరున్నారు. అట్లాంటి వారు, అవసరం.

7. పెడతోవని వెడుతున్నప్పుడు, మనల్ని అప్రమత్తతతో మెలగ మంటుంది కాని, మతం బదులు నన్నే స్వీకరించమనదు.

8. కొద్దిమందికి మాత్రమే యీ వాదం ఉపకరిస్తుంది.

సాహిత్యేతర సమస్యలను లోతుగా పరిశీలించి ఎలియట్ వ్రాసిన ప్రసిద్ధ గ్రంథం సంస్కృతిని గూర్చినది. దీని పేరు **notes towards definition of culcture** — అన్నది. సంస్కృతి అన్నదానికి అర్థం ఏమిటి? సంస్కృతి స్వభావం ఎట్లాంటిది ఏ సందర్భంలో వర్ధిల్లుతుంది. ఏయే సమయాలలో క్షీణిస్తుంది? దీని అభివృద్ధికి జరగవల్సిందేమిటి? — ఈ ప్రశ్నలను గూర్చి గాఢంగా ఆలోచించి, అనేక దేశాల సంస్కృతులను దృష్టిలో వుంచుకుని విపులంగా చర్చించిన గ్రంథం ఇది. సంస్కృతిపట్ల తృష్ణ, అభిమానం గల వారందరూ చదవాల్సింది. ఇది కఠినమైన గ్రంథం. అంత సుళువుగా అర్థం కాదు. లోతులకి దిగడంలో, కొత్త కోణాలను పరామర్శించడంలో, అస్పష్టనమై భావనారీతులతో నిండి; మధ్యలో ఎలియట్టే "నేను చెపుతున్నది నాకే అంత

స్పష్టంగా లేదు" అనడం కూడా జరిగింది. ఈయన చెప్పదల్చుకున్నదేమిటో తెలుసుకుందామని, నాలుగైదుసార్లు శ్రద్ధగా చదివాక, విషయం కొంత విశద మైంది చాలామంది అనుకుంటున్నదానికి, యీ కొత్తభావం వింతగా, విరుద్ధంగా కనబడటంవల్ల; నన్ను ఇది ఆకర్షించడం, దీన్ని గురించి ఆలోచించడం జరిగింది.

ముందు, ఎలియట్ గ్రంథంలోని కొన్ని భావాలను ఉదహరిస్తాను. సంస్కృతులు మూడు రకాలు; వ్యక్తికి సంబంధించినదీ, వొక తెగకి సంబంధించినదీ, మొత్తంగా వొక సమాజానికి సంబంధించిందీ – ఈ మూడు రకాల సంస్కృతులూ, వొక దానిపైన వొకటి ఆధారపడతాయన్నది మొదటి భావం.

సత్ప్రవర్తన, మర్యాద – సంస్కృతి లక్షణాలుగా భావిస్తే ఒక తెగకి ప్రతినిధిగా వున్న ఒక ఉత్తమ పురుషుడు మన దృష్టిలో సంస్కారి అన్న మాట విద్య. విజ్ఞాన సముపార్జన సంస్కృతి లక్షణాలనుకుంటే, సంస్కృతి గల వ్యక్తిగా పండితుణ్ణి ఎంచుతాము. తాత్త్వికచింతన ముఖ్య లక్షణం అనుకుంటే. మేధావిని ఎన్నుతాము. లలిత కళల పట్ల అభిరుచి ప్రధాన లక్షణం అనుకుంటె కళాభిజ్ఞుణ్ని ఎంచుతాము ఇవన్నీ కలిసి ఒక ముద్దగా వుండాలన్న సంగతి పట్టించుకోము. దానినిబట్టి, వీటిల్లో, మిగతావి విడిచేసి ఏదో ఒక్క రంగంలో ప్రాముఖ్యం పొందినంత మాత్రాన ఆ వ్యక్తిని సంస్కారిగా యెంచలేము విద్య లేకుండా, మంచి నడవడి, అలవాట్లు రాణించవు. మంచి నడవడి లేని విద్య డాంబికానికి దారి తీస్తుంది యెంత మేధావి అయినా, మంచితనం లేకుంటే, రాణించడు సత్ప్రవర్తనకి దారి తియ్యని, కళావటిమ వృధా వీటిల్లో ఏ వొక్క దాన్నీ విడదీసి, 'ఇదే సంస్కృతి' అని యెట్లాగ అనమో, ఏ వొక్క వ్యక్తి అన్నింటిలోనూ ఆరితేరినవాడై ఉంటాడనలేము. పరిపూర్ణమైన సంస్కారి వుండడం అనేది మిథ్య. కాబట్టి, వొక్కదానికి కావల్సిన మన సత్వాన్ని, సాహితీ పరికరాలనీ సమకూరుస్తాడు. సాహిత్యాన్ని పరామర్శిస్తూ, జీవితాన్ని గూర్చి, మనుమల్ని గూర్చి, అద్భుతమైన పరిశీలనా శక్తుల్ని వ్యక్తంచేసే నిర్వచనాలు చేస్తాడు. నా కిష్టమైనవి కొన్ని.

"అతను తన జీవితాన్ని ధ్వంసం చేసుకున్నాడు. అట్లా ధ్వంసం చేసుకోడం కూడా వొక రకం వ్యాపారమే."

"రచయితలో లేని లక్షణాలని ఎత్తి చూపడం అతనిలో మంచి లక్షణాల పట్ల ఆదరణని పెంచడమే అవుతుంది."

"మంచి వసతి, దుస్తులు, తిండి సమకూరినా, గుంపు గుంపే."

"ఆధునిక యుగంలో మతం పట్ల సహనం చూపడమే సహించరానిదిగా పరిణమించొచ్చు."

"ఏ మార్పునైనా అంగీకరించేటంతటి దుస్థితి పడితే తప్ప సమాజంలో మార్పు తేవాలంటే, అబద్ధాలతో నచ్చచెప్పాలి."

"పాలకులు ఏ నమ్మకాలని స్వీకరిస్తున్నారన్నది ముఖ్యం కాదు, ఏ నమ్మకాలని స్వీకరించాల్సి వొచ్చింది — అన్నది ముఖ్యం."

హామ్లెట్ నాటకం గురించి ఎలియట్ చేసిన తీర్పు నన్ను కలవర పెట్టింది. ఆ నాటకం గొప్ప కళాఖండం కాదంటాడు నాయకుడైన హామ్లెట్ అంతరంగంలో వున్న ఉద్రేకాన్ని బహిర్గతం చేసేందుకు అనువైన పరిస్థితి బాహ్య జగత్తులో లేకపోవడం వల్ల, అతను కార్యదూరుడవడం, నాటకం వృధాగా కొనసాగడం జరిగిందంటాడు. షేక్స్పియర్ అంతరంగలో ఏదో పైకి చెప్పుకోలేని బాధ వుంది. ఆ బాధని లోకంతో చెప్పుకునే ఉద్దేశంతో, తగిన పాత్రగా హామ్లెట్ని ఎన్నుకున్నాడు. కాని హామ్లెట్ ఎదుర్కొన్న సంఘర్షణ, సన్నివేశం, షేక్స్పియర్లో ఉద్రేకాన్ని, బాధనీ వ్యక్తం చెయ్యడానికి అనువైనవి కావు. పరిస్థితిని మించిన 'గొడవ' — ఉద్రేకం ఉంటం మూలాన ఈ నాటకం కళానుగుణంగా కొనసాగక దెబ్బతిందన్న ఎలియట్ వాదాన్ని, కొంతవరకూ 'చివరికి మిగిలేది' — నవలలో 'చీకటి సమస్య' అన్న అధ్యా యంలో ముచ్చటించాను ఇది సాహిత్యానికి సంబంధించిన విషయమే అయినా, సాహిత్యం — జీవితం రెండూ ఒకటేనన్న ఎలియట్ తత్వంలోని తపన నన్ను ఈ అధ్యాయానికి పురిగొల్పింది.

సాహిత్యం ద్వారా జ్ఞానాన్ని తెచ్చుగున్న విశ్వసాహితీ వేత్త ఎలియట్. ఎలియట్ సాధించిన ఫలితాలు సింహావలోకనం చేద్దాం రచయిత వ్యక్తిత్వము, 'అహం', ప్రత్యేకత — ఇవి సాహిత్యానికి ముఖ్యం అనుకున్న వాదం ప్రచారం లోకి వొస్తూవుంటే, రచయిత తన 'అహం'ని వ్యక్తిత్వాన్ని త్యాగంచేసి, ప్రత్యేకతని నశింపు చేసుకోగలిగినప్పుడే, సాహిత్యం ఉత్తమస్థాయిని జేరుతుం దన్న అభిప్రాయాన్ని ప్రచారం చేశాడు. మన దేశంలో ప్రాచీన కళాభిజ్ఞులు ఈ సూత్రాన్ని పాటించినట్లు తోస్తుంది. అజంతా, ఎల్లోరా, అమరావతి. కళా ఖండాలను సృష్టించిన కళాభిజ్ఞులు చిత్రాలపై తమ పేర్లు వ్రాసుకున్నట్లు గాని, శిల్పాలపై తమ పేర్లు చెక్కుకున్నట్లు గాని లేదు.

విజ్ఞాన శాస్త్రాభివృద్ధి వల్ల, ప్రజలలో మతం పట్ల గురి తగ్గుతున్న రోజుల్లో మతం లేకుండా, కళలు, సాహిత్యమూ, సంస్కృతీ లేదు — ఏదో వొక మతం యొక్క ప్రాబల్యాన్ని ప్రతి ఒక్కరూ స్వీకరించి తీరాలన్న భావాన్ని ప్రచారం చేశాడు ఎలియట్. "నే నెందుకు క్రైస్తవుణ్ణి కాను" అను విషయంపై బెర్ట్రండ్ రసెల్ 1926 లో ఉపన్యాసాలిచ్చాడు ఇందుకు సమాధానంగా "రసెల్ ఎందుకు క్రైస్తవుడు" అనే వ్యాసం వ్రాశాడు.

మానసిక శాస్త్రం పెంపొంది, ఫ్రాయిడ్ సిద్ధాంతాలు ప్రచారంలోకి రాగానే చాలా మంది విమర్శకులు, రచయిత జీవిత విశేషాలు బైటపెట్టి ఆ పరిశోధన ఫలితంగా బైటపడ్డ విషయాలను పురస్కరించుకుని అతని రచనలను పరామర్శించడం, విలువకట్టడం జరుగుతున్న రోజుల్లో; కావ్యాన్ని అనుభవించ డానికి, కవి జీవిత విశేషాలు ముఖ్యం కావని ధైర్యంగా చెప్పగలిగాడు ఎలియట్. షేక్స్‌పియర్ చాకలి పద్దు బైట పెట్టినంత మాత్రాన, ఆయన 'లేర్' నాటకంలో కొత్త వెలుగు చూసామనుకోడం వెర్రి అంటాడు ఎలియట్.

కృత్రిమమైన ప్రపంచ సంస్కృతిని నెలకొల్పడం యెవ్వరి తరమూ కాదంటాడు ఎలియట్.

సాంఘిక, మత, రాజకీయ, తాత్విక రంగాలపై దాడులుచేసి గాయపడ కూడదు సాహితీ విమర్శకుడు - అని ఎలియట్ హెచ్చరిక. తన చుట్టూ గిరులు గీసుకుని, వాటి మధ్యనే మసలాలంటాడు.

ప్రజాస్వామ్యంలో గుంపు సంస్కృతి పెరగడం జరుగుతుంది తప్పదు. ఇదే నిజమైన సంస్కృతి అనుకుని కళాభిజ్ఞుడు, ఆ ప్రవాహంలో పడి కొట్టుకు పోకూడదు — సంప్రదాయబద్ధమైన తన ప్రతిభని విస్మరించక, ప్రతి ఒక్కరూ సాహితీ కృషి సల్పినప్పుడే నాగరికత వర్ధిల్లుతుంది.

గెథేని గురించి ఆయన ఇల్లా వ్రాశాడు.

"గొప్ప కవికున్న జ్ఞానం, అతని రచనలలో ఇమిడి ఉంటుంది. దానిని గ్రహించడంతో, మనం కూడా జ్ఞానులం అవుతాము" ఈ వాక్యాలు, ఎలియట్ రచనలకు పూర్తిగా వర్తిస్తాయి

'ఫోర్ క్వార్‌టెట్స్' కావ్యం ముగింపులో కొంత భాగం :

"చనిపోయినవారితో మనమూ చనిపోతాం.
వారితో మనమూ పోతాం
మనం వారితో పుట్టాం .
చరిత్ర లేని ప్రజ
కాలాన్నుండి విముక్తి చెందరు,
కాలాతీతమైన అద్భుత క్షణాల సమీకరణ చరిత్ర.
నిరాడంబరులమై పరిపూర్ణంగా జీవిస్తే
అన్నీ బాగుంటై.
నిప్పు, జ్వాలా కిరీటంగా అల్లుకుని
నిప్పు, గులాబీ ఒకటవుతై."

ఒకటైన 'అగ్ని - గులాబీ' లాంటి జ్ఞాని టి ఎస్ ఎలియట్.

# ఆల్డస్ హక్స్లీ

చిన్నతనంలో ఒకరు మనిషికి ఇష్టులయ్యారంటే అందుకు కారణం వారు మన కంటికి బాగుండడమే అంటే నాతో ఎందరు ఏకీభవిస్తారో చెప్పలేను. మనం అభిమానించిన ఆ వ్యక్తి, గొప్ప తత్వజ్ఞుడుగానో, గాయకుడుగానో రాజకీయవేత్తగానో పేరుపడి ఉండొచ్చు. ఈ కారణంవల్లనే మనకి ఆ వ్యక్తంటే అభిమానం ఏర్పడిందని తర్వాత సమర్థించుకున్నా, నిజానికి మనకి ఆ వ్యక్తి పట్ల మొదట్లో అంత ఇష్టం ఏర్పడ్డానికి కారణం ఆ వ్యక్తి మన చూపుని ఆకర్షించడమే అనిపిస్తుంది. రవీంద్రుడు, స్వామి వివేకానంద, జిడ్డు కృష్ణమూర్తి; ఇంగ్లీషువారిలో మిల్టన్, షెల్లీ, బైరన్‌లను ఇల్లాంటి వ్యక్తులలో కొందరుగా ఉదహరించొచ్చు.

ఆల్డస్ హక్స్లీ చిన్నప్పటి ఫోటో చూడగానే నా కాయనపట్ల అభిమానం ఏర్పడింది. అది 1938. కళాశాలలో విద్యార్థిగా ఉంటున్నాను. అంతకుముందు హక్స్లీ గురించి నాకేమీ తెలియదు. పెన్‌గ్విన్‌వారు ప్రచురించిన, హక్స్లీ నవల పేరు 'క్రోమ్ ఎల్లో' (Crome - Yellow) ఆ నవల వ్రాసినప్పుడు ఆయన వయస్సు 27 ఫోటోలో ఆయన వయస్సు కూడా అంతే ఉంటుంది. పల్చటి కోల మొహం, పొడుగాటి నాజూకైన ముక్కు, తీర్చిదిద్దిన నోరు, నుదురు, వంకులు తిరిగి ఎగదువ్విన క్రాపింగ్, నల్లరంగు ఫ్రేమ్‌లో కండ్లజోడు, మెడ కొంచెం వంచిన భంగిమ — తెలివైన, చురుకైన మొహం, విజ్ఞానాన్ని, సంస్కారాన్ని సూచిస్తుంది. ఆ ఫోటోలో మొహం బాగుంది గనుకనే ఆ పుస్తకాన్ని చదివాను.

ఆ నవల పూర్తిగా అర్థమైనట్లు గాని, రుచించినట్లు గాని జ్ఞప్తి లేదు. అందులో కొన్ని భాగాలు చక్కిలిగింత పెట్టి, కవ్వించి, నవ్వించినట్లు జ్ఞాపకం. నాగరికుల పోకడలను అధిక్షేపించే భాగాలెన్నో వున్నాయి అందులో చమత్కారంతోకూడుకున్న హేళన ధోరణి, శ్రుతిలా మ్రోగుతూ వుంటుంది. కాని, హేళన హాస్యం — వీటిని సాహిత్యంలో హర్షించే స్థితి నాలో ఆనాడు ఏర్పడ

లేదు. ఈ రెంటినీ నిత్యజీవితంలో ఎరుగుదును. అప్పటికి, రవీంద్రనాథటాగూర్, హార్డీ నవలలు మాత్రమే చదివి వున్నాను శృంగారం, భగ్న హృదయాలు, తెగిన తీగెలు, విధి దౌర్జన్యం, కన్నీరు — వీటితో నిండిన నవలలవి. అందుచేత విఫలమైన ప్రేమ, దాన్నుండి జనించిన బాధని, చిత్రించేదే మంచి నవల అన్న అభిప్రాయం అప్పట్లో నిల్చిపోయింది. ఆ రోజుల్లోనే పి. జి. వుడ్‌హౌస్ (P G. Wodohouse) ది 'చిక్కుల్లో పడ్డ చక్కని చుక్క' (A Damsel in distress) అన్న నవల పేరు చూసికొని చదువుతూ అదంతా భగ్న హృదయం చిత్రణగా ఊహించుకుని కన్నీరు కార్చడానికి సిద్ధపడేవాడిని. నిజానికి అది హాస్యపూరితమైన నవల. కాని, హాస్యాన్ని సాహిత్యం ద్వారా స్వీకరించే స్థితి ఆనాడు నాలో ఏర్పడలేదు. ఫోటోలో హక్స్‌లీ నన్ను దగా చేసినట్లు భావించాను.

హక్స్‌లీ మొదటి నవల క్రోమ్ ఎల్లో — చివరిది 'ది ఐలెండ్' (The Island) 1962 లో చదివాను పరదేశీయుల పాలన నుండి విముక్తి పొంది, స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న ఒక ప్రాక్ దేశం ఎట్లా అభివృద్ధి చెందుతున్నదీ, దాన్ని చూసిన పాశ్చాత్యులు, ఆ ఆదర్శ సమాజం నుండి నేర్చుకోవలసినవీ హక్స్‌లీ అరవై ఐదో ఏట వ్రాసిన ఈ నవలలో చిత్రితమైనాయి. ఆయన శక్తులు వార్థక్యంలో సన్నగిలలేదు. పరిశీలనాశక్తి, ఆశయాల విమర్శ గంభీరమైన భావాలను, నిర్మొహమాటంగా, స్ఫుటంగా తేలికగా వితర్కించటం, సున్నితమైన హాస్యం, పైకి పెద్ద కబుర్లు చెప్పి, ప్రవర్తనలో నిజాయితీ కనబర్చని వ్యక్తులని వ్యంగ్యంగా హేళన చెయ్యడం, అసాధ్యమైన ఆదర్శాల గాలి బుడగకి కంత పెట్టడం - ఆత్మ వికాసాన్ని పెంపొందించాలన్న తృష్ణ - ఈ రెండు నవలల్లోనూ, మిగత నవలల్లోకి మల్లేనే సమంగా కనబడతాయి. మిగత నవలలలో పోకడలు 'క్రోమ్ ఎల్లో' లో దర్శనమిస్తాయి. కావున అందు లోంచి కొన్ని వాక్యాలు ఉదహరిస్తాను. *

"మనం అనుభవించే ప్రతి దానికీ ఆదర్శంతో కూడుకున్న కారణాలు వెదకాలి. ఏదో కథ అల్లి, దాన్ని సత్యంతోనూ మంచితోనూ ముడెట్టితే గాని సౌందర్యాన్ని ఆస్వాదించలేము. అరాజకమైన మహా గంద్రగోళంతో నిండిన జీవితంలో ఒక క్రమాన్ని వెదకి చూపిన ప్రక్రియనే 'కళ' గా స్వీకరిస్తాము.

---

* తెనుగుచేసిన హక్స్‌లీ వాక్యాలన్నీ చటుక్కున భావం అర్థమవాలన్న ఉద్దేశంతో చేసిన స్వేచ్ఛానువాదాలు మాత్రమే — ముక్కకి ముక్క, చేసిన తర్జుమా కావని గుర్తించాలి.

త్రాగుడు, సెక్స్, ప్రేమ — వీటిత్లో ఆనందం వున్నా, ఆనందాన్ని అనంతంలో ఐక్యం అవడంగా సిద్ధాంతీకరిస్తాము. శక్తి స్వరూపిణి స్త్రీ ద్వారా పరమాత్మని తెలుసుకోవాలి."

నిలబెట్టి ఆలోచించేటట్లు చేసే ఇట్లాంటి చర్చలు చాలా ఉన్నాయి ఆ నవలలో. కాని, పాఠకుడు నవలలో కోరేవి ఆలోచన, తర్కం కావు. ఆలోచనతో నిమిత్తం లేని, ఉద్రేక పూరితమైన ఒక మానసిక స్థితిని కోరతాడు పాఠకుడు. తన్ను తాను మరచిపోయి, నవలాకారుడు చిత్రించిన వింత జగత్తులో ఉద్రేకంతో లీనమైపోవాలి. అందుకు, కథ, సన్నివేశాలు, పాత్రలు. వారి అంతరంగాలు తోడ్పడతాయి. కాని హక్స్లీ నవలలలో ఇవి అంత ప్రధాన మైనవి కావు పెద్దలు ప్రతిపాదించిన జీవితపు విలువల్ని పరామర్శించడం తప్ప, అందలి పాత్రలకి వేరే పనున్నట్లు తోచదు హక్స్లీలోని స్త్రీత్వం, పురుషత్వం విడిపోయి వేర్వేరు పాత్రలుగా అవతరించి జీవితంతో సమాధానం కూర్చుకునే ఉద్దేశంతో, ఈ విమర్శలు, తాత్విక చింతనలు కొనసాగిస్తున్నాయా అని అనిపిస్తుంది. ఆ పాత్రలకి మెదడే గాని హృదయం ఉన్నట్లు కనబడదు. అంతమాత్రంచేత ఈ నవలలలో ప్రేమ ఘట్టాలు లేవనుకోకూడదు. అందులోనూ నాయికా నాయకులున్నారు, వారు ప్రేమించుకుంటారు. కాని 'ప్రేమించుకోవాలి గనక ప్రేమించుకుంటున్నాం' అన్న జిజ్ఞాసతో ఆ పనికి పూనుకున్నట్లని పిస్తుంది ఇందలి నాయకుడు డెన్నిస్. ప్రేయసితో అతని సంభాషణ కొనసాగిన విధానం చూద్దాం :

'ఆమెను ముద్దిడుకున్నాడు. ఆమె మొహం పక్కకి తిప్పేసింది - ఆ వంగిన మెడని ముద్దెట్టుకున్నాడు.

"వద్దు" అంది ఆమె.

"ఏం?"

"మన స్నేహం చెడిపోతుంది."

"పోదూ ..." అన్నాడు హేళనగా.

"అవును. ఇది మనం చేయకూడని పని." ఆమె చెప్పింది, నిజమేనేమో అనిపించింది ఆమె తనని, ప్రియుడుగా అంగీకరించలేదు అతను చిన్నవాడనా? మరి కాకపోతే ఎట్లా వర్తించాలి?

"మనం ఈ పని ఎందుకు చెయ్యకూడదూ?" అన్నాడు డెన్నిస్.

"ఇప్పుడొద్దు, మరొకసారి - ఇప్పుడు నా పాదం నొప్పెడుతోంది. వెళ్ళి వేడి నీళ్ళతో కాచాలి" అన్నదామె.

అస్వస్థత, శరీరంలో ఒక అవయవానికి ఏదో పేచీ వచ్చిందనగానే అతని నోరు మూత పడింది. ఆమెను లేవదీశాడు.

"నిన్ను మోసి కెళతాను" అన్నాడు. ఇట్లాంటివి సినిమాలో నాయకుడు ఇట్టే చేసేస్తాడు.

"నన్ను మొయ్యలేవు" అన్నదామె.

"మొయ్యగలను" అంటూ ఎత్తుగున్నాడు. అబ్బో! ఎంత బరువు! ఐదారడుగులేసి, ఆమెని ఒక మూటలా పడేశాడు.

"నీవల్ల కాదన్నానుగా - అమాయకుడవు" అంది.

అతను చిన్నబుచ్చుకున్నాడు. ఆమె అతని చేతుల్లో పసిదానిలాగుంది.

అతని చేతి పట్టు సడలి నేలమీదకి దిగగానే, ఆమె తన ఆధిక్యతని ప్రకటించింది దూరమైందిగా, అందరానిదానిగా కనబడసాగింది. ఎత్తుకుమోసు కెళ్ళడం లాంటి విన్యాసాలకి ఫీట్లకీ తనెందుకు పూనుకోవడం?

ఈ విధంగా ఆదర్శ తత్వదృష్ట్యా ప్రేమని శిఖరానికి తీసుకెడుతూ, శిఖరం చేరకముందే, క్రింద లోయలోకి గెంటేసి, తాత్కాలికమైన ఒక భౌతిక ప్రయోజనంతో ముడెట్టి పాత్రలని, పారకుణ్ణి, స్థూల జగత్తులో ఒక గదిలో పడేసి, తలుపు గడియవేసే తంతు, హక్స్‌లీ నవల లన్నింటిలోనూ జరుగుతూ వుంటుంది. "ఐలెస్ ఇన్ గాజా" (Eyeless in Gaza) అనే నవలలో ప్రేయసీ ప్రియులు, ఒక ఇంటి కప్పుపైన కలుసుగుని, హృదయాలు వెళ్ళబోసుకుని ప్రమాణాలు చేసుకుంటూ వుండగా, పై వెళ్ళే ఒక విమానంలోంచి జారిపడిన కుక్కపిల్ల వారిమీద పడి ఆ శృంగారమయ వాతావరణాన్ని కలుషితం చేసిన ఘట్టం వుంది.

ప్రేమని గురించి పుస్తకాల్లో చదవకపోతే, చాలా మంది జీవితాల్లో ప్రేమించడం అనేదే ఉండదన్నా రెవరో పుస్తకాలల్లో, ఉపన్యాసాలలో, వ్యక్తుల ఊహాలో మాత్రం మసులుతూ ఉన్న ఆదర్శ ప్రేమ తత్వాన్ని పరామర్శించి, చులకన చెయ్యడం, హక్స్‌లీ నవలల ద్వారా సాధించిన లక్షణాలలో ప్రధాన మైంది. ధనం, తీరిక, ఆరోగ్యం — ఈ మూడూ లభ్యమైనవారికే ఆదర్శ ప్రేమ సాధ్యమంటాడు. చాలా మందికి ఈ మూడూ ఉండవు గనక, ఆదర్శ ప్రేమని ఊహించుకుని కళ ద్వారా దాన్ని రుచి చూసి తృప్తిపడే కృత్రిమ పరిస్థితి ఏర్పడినది, ఈనాటి నాగరిక సమాజాలలో. 'సెక్స్' వీరి మెదడులో మాత్రం వుంటుంది. ఇదే ఆదర్శ ప్రేమ అనుకోవడం ఆత్మ వంచన. ఆదర్శ ప్రేమ ఈనాటి సమాజంలో వ్యభిచారంగా అంతమొందక తప్పదేమో. అట్లా అయివుండి

ఆదర్శ ప్రేమంటే ఏమిటో తెలియని ప్రతివాడూ వ్యభిచారాన్ని ఖండించడం ఎందుకు? అదీకాక, శరీరంతో నిమిత్తంలేని ప్రేమ ఎక్కడో వుందనుకుని దానికోసం ఎగురుతూ వడి మోకాళ్ళు గాయపరుచుకోటం ఎందుకు? మానవుడు నిత్యజీవితంలో కనబరచలేని నైతిక విలువలు, సామాన్యులకి సాధ్యమవని ప్రేమ తత్వం, ఆధునికులు పాటించకపోతేనే మానవుడు సుఖపడతాడన్న అభిప్రాయాన్ని ఋజువు చెయ్యడం కోసం, ఒక కథ, పాత్రలని కూరుస్తాడు హక్స్లీ. పెద్దలు ప్రతిపాదించిన నైతిక విలువల్ని, వైజ్ఞానిక దృష్ట్యా సమాజ వికాసం దృష్ట్యా చమత్కారంగా, విపులంగా, సోదాహరణంగా అధిక్షేపించిన నవల క్రోమ్ ఎల్లో.

అప్పటి కింకా రవీంద్రుని 'గోరా' చదవలేదు జీవితపు విలువలని నవల ద్వారా వ్యంగ్యంగా పరామర్శించడం అదివరలో నే నెరగను. అందుకనే ఆ నవల ఆనాడు నాకు రుచించలేదు. సమాజపు పునాదుల పరిశీలన నవలలో ప్రధాన లక్ష్యంగా స్వీకరించే సాహితీ ప్రయోజనాన్ని హక్స్లీ మొదటి నవల 'క్రోమ్ ఎల్లో' సాధించిందనొచ్చు అంతకుముందు నాటక రంగంలో ఈ ప్రయోజనాన్ని సాధించిన పాశ్చాత్య రచయిత బెర్నార్డ్ షా. "ఎవడు ఎవత్తిని పెళ్ళి చేసుకుంటే ఎవడిక్కావాలి? ఇది తెలుసుకోడం కోసం, టిక్కెట్టు కొనుక్కుని నాటకం హాల్లో మూడు గంటలు కూర్చోవాలా?" అని వాదించి, తన నాటకానికి, శృంగారం కాక, సమాజ స్థితిగతుల పరిశీలన వస్తువుగా స్వీకరించి, విజయాన్ని సాధించాడు షా. వ్యభిచారం, వేశ్యావృత్తి, ప్రేమ, పెండ్లి, విడాకులు — వీటి వెనుక వున్న ఆర్థిక, చారిత్రక స్థితిగతులను గూర్చి సుదీర్ఘమైన చర్చలతో నిండి వుంటాయి, షా నాటకాలు ఈ పద్ధతికి పునాదులు వేసింది ఇబ్సెన్ భావాలతో నిండిన నాటకాన్ని ప్రచారంలోకి తెచ్చింది షా. ఈ రకం నాటకాన్ని ఆకర్షకంగా జేసింది, కేవలం భావాల చర్చ అనుకోకూడదు. ఆ నాటకాల్లో, షా నాటకీయత, ప్రతిభ ఉన్నాయి ఆ ప్రతిభ లోపించినప్పుడు, భావాలు ఎంత గొప్పవైనా, నాటకం చప్పగా తయారవుతుంది. భావాలతో కూడుకున్న నవలకి ప్రచారం తెచ్చింది హక్స్లీ అనొచ్చు. షా రహదారి సిద్ధం చేశాడు. మైలురాళ్లు వేస్తూ వచ్చిన రచయిత హక్స్లీ. ఏ ఊరో సూచించే సైన్ బోర్డులు వేస్తూ వచ్చింది. హెచ్. జి వెల్స్. కనకనే తన ఇరవయ్యో ఏట వ్రాసిన ఈ నవలతో, ఆంగ్ల సాహితీ రంగంలో ముఖ్యస్థానం సంపాదించు కున్నాడు హక్స్లీ. నవల ఎక్కువమంది చదువుతారు గావున, నవల ద్వారా, భావాలు కూడా ప్రచారంలోకొచ్చాయి. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత,

పెద్దలు ప్రతిపాదించిన సూత్రాల పట్ల, చేసిన నిర్వచనాలపట్ల, ప్రజల విశ్వాసం సడలింది. తాము మోసపోయినట్లు భావించసాగారు. వాటిని మనం ఎందుకు పాటించాలి? అని ప్రశ్నించసాగారు, అక్కడి ప్రజ. ఆ సమయంలో హక్స్లీ నవల వారిని ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు. ఇంచుమించు హక్స్లీ చర్చించిన విషయాలనే బెర్ట్రండ్ రసెల్ కూడా అనేక వ్యాసాలద్వారా చర్చించి ప్రచారం లోకి తెచ్చాడు. కాని రసెల్ తత్వజ్ఞుడు — నవలాకారుడు కాడు నవల ద్వారా ప్రజా బాహుళ్యానికి సులువుగా భావాలని అందజెయ్యవచ్చునన్న నమ్మకంతో, జార్జి ఆర్వెల్ (George Orwell), హక్స్లీలు నవలా రచనకి పూనుకుని కృతకృత్యులయ్యారు.

1923 లో హక్స్లీ రెండవ నవల 'ఏంటిక్ హే' (Antic Hay) వెలువడింది. 1928 లో 'పాయింట్ కవుంటర్ పాయింట్' (Point Counter Point) వెలువడింది. 1932 లో 'బ్రేవ్ న్యూ వరల్డ్' (Brave New World) అన్న నవలతో యూరోప్ సాహితీ రంగంలో హక్స్లీ ప్రముఖ రచయితగా ఖ్యాతి పొందాడు.

1932 నాటికి అంతర్జాతీయ రచయితగా స్థిరపడిపొయ్యాడు హక్స్లీ. ఏ కొత్త గ్రంథం వెలువడినా, అందులో హక్స్లీ భావాలను పేర్కొని ఖండించడమో, ఆమోదించడమో జరిగితీరవల్సినదే. ఉపన్యాసాలలో ఆయన భావాలనీ, విమర్శలని వితర్కించి తీరవల్సిందే అంతేకాదు. ఈ భావాలే ఆధునిక తత్వానికి ప్రాతిపదికగా పేర్కొనచ్చు 1930 లో ఇంగ్లండులో మతగురువులు కొందరు మత ప్రచారానికి అంతరాయాలేమిటో పరిశీలించే నిమిత్తం జరిపిన గోష్ఠి సారాంశం ప్రచురించారు. అందులో ఒకచోట ఇల్లా ఉంది.

"పలుకుబడిగల కొందరు ప్రఖ్యాత రచయితలు స్త్రీ, పురుష సంబంధాన్ని గూర్చి ప్రచారం చేస్తున్న భావాలు క్రైస్తవమత సూత్రాలకి విరుద్ధంగా వున్నందుకు చింతిస్తున్నాము" అని. ఈ వాక్యంపై వ్యాఖ్యానిస్తూ, టి. ఎస్. ఎలియట్ (T. S. Eliot) చెప్పినవి చూస్తే, హక్స్లీ ప్రతిష్ఠ ఎంతటిదో తెలిసొస్తుంది. కొందరు దాన్ని అప్రతిష్ఠ (Notoriety) గా భావించవచ్చు.

"ఈ మతగురువులు ప్రఖ్యాత రచయితలుగా పరిగణిస్తున్న వ్యక్తులెవరు? డి. హెచ్. లారెన్స్ (D. H. Lawrence), జేమ్స్ జాయిస్ (James Joyce) లా? వీరికి ఇంగ్లండులో అధికారరీత్యా పలుకుబడిలేదు. లేక బెర్ట్రండ్ రసెల్ (Bertrand Russell), ఆల్డస్ హక్స్లీలా? అట్లాగైతే వీరు భయపడ నక్కర్లేదు. జీవితశక్తి ఒకటుందంటూ ఒక చక్కటి తత్వాన్ని ప్రచారంలోకి

తెస్తూవున్న ఈ యిద్దరి అభిప్రాయాలనీ నేటి యువకులు స్వీకరిస్తారనుకోనక్కర్లేదు. హక్స్లీ భావాలూ, రసెల్ భావాలూ ఒకేరకంవి కావనుకోండి. ఏ తత్వమూ లేకుండానే ఈ ప్రపంచం ఎంత అధోగతిలో ఉందో నిరూపించటం మినహా హక్స్లీలో నాకే తత్వమూ కనబడలేదు - అని ఎలియట్ వ్యాఖ్య. సంప్రదాయ విరుద్ధమైన వైజ్ఞానిక తత్వం అనే భవనం, దానిమీద ఎగరవేసిన ఆధునిక తత్వం అనే జెండా ఆనాటి యువకులని ఎంతగా ఆకర్షించినవో తెలుస్తుంది ఈ వ్యాఖ్యవల్ల ఈ తత్వసారం ఏమిటి? పొడిమాటల్లో చెప్తాను.

మతాలు బోధించే సూత్రాలని యదార్ధమైనవిగా ఋజువుచేసే ప్రక్రియలు లేనందున మనం ఏ మతాన్నీ స్వీకరించనక్కర్లేదు. అన్నింటిలోనూ కొంత మంచి ఉంది. మంచిని స్వీకరించి ప్రవర్తనలో ఆ మంచిని చూపెడదాం. వైజ్ఞానిక దృష్ట్యా ఆధారం లేనివన్నీ మనం నమ్మకూడదు స్వీకరించకూడదు. స్వేచ్ఛకీ, ఆనందానికీ అంతరాయాలుగా ఉంటున్న ప్రాచీన తత్వాన్ని త్రోసిపుచ్చాలి. మంచిచెడ్డల ఫలితాలకి పరమాత్మ బాధ్యుడు కాడు. సమాజాన్ని నిర్మించుకున్న మానవుడే బాధ్యుడు. అసలు పరమాత్మ వున్నాడనుకున్నా ఈ లోకం పోకడని అరికట్టే శక్తి, శాసించే శక్తి దైవానికి లేదు. మానవుడికే వుంది. పైకి చెప్పే నీతి ఒకటి - అనుసరించే నీతి మరొకటి. ఇట్లాంటి దగాచేసే నీతి మనకొద్దు. మానవుడికి ఆనందాన్నిచ్చేవి, మానవుడికి సాధ్యమయ్యేవి, ప్రకృతిసిద్ధంగా సంక్రమించిన శారీరక అవయవాలలో దేన్నీ మరుగుపరచకుండా, విసర్జించకుండా, అన్నింటికీ పనికల్పించి, వికసింపజేసే నైతిక స్థితులను తటస్థింపజేసి అనుభవించగలగాలి. ఈ ఆధునిక తత్వం నీడలు హక్స్లీ మొదటి నవలలో కూడా కనిపిస్తాయి. ఈ వాక్యాలు చూడండి :

"నాగరీకుల వెనక ఘోరాలు, హత్యాకాండలు జరుగుతాయి. ఈ క్షణంలో టాన్స్-ఐర్లండును కలవరపెడుతున్నాడు. సైలీసియన్లను పోల్స్ హింసిస్తున్నారు. ఫాసిస్టులు ప్రజల్ని హత్యచేస్తున్నారు నేను వీటి నన్నింటినీ స్వీకరిస్తాను, దేనికీ ఆశ్చర్యపడను" అంటాడు, నవలలో ఒక పాత్ర. ప్రపంచంలో అన్ని దేశాల వారూ ఒకే మానవ కుటుంబానికి చెందినవారనీ, యుద్ధాలుండకూడదనీ, ప్రాంతీయ, జాతీయ అభిమానాలస్థానే విశ్వమానవ సౌభ్రాతృత్వంపట్ల అభిమానం ఏర్పడాలనీ, విజ్ఞానశాస్త్రం పరిశోధించి యదార్థాన్ని ఋజువుచేస్తే తప్ప, ఏ మత సూత్రాన్నీ, సత్యాన్నీ విశ్వసించనక్కర్లేదనీ - మొదలైన ఈ భావాలు ఇప్పుడు కొంత పాతవిగా కనపడినా, 1920-1940ల మధ్య అధునాతనమైనవిగా పరిగణించబడి, పూర్వాచార పరాయణుల విమర్శలకు గురై మరింత ఎక్కువ

ప్రచారాన్ని పొందాయి. ఈ భావాలకు ఇంగ్లండులో కంటె, యూరప్‌లో ఎక్కువ ఆదరణ లభించింది. ఇందుకు రసెల్ వ్యాసాలు, హక్స్లీ, జార్జ్ ఆర్‌వెల్‌ల నవలలు తోడ్పడ్డాయనొచ్చు ఈ ప్రచారం విజయవంతంగా కొనసాగి, ఫలితాన్ని సాధించింది గనుకనే సాహితీ ఖండాలుగా వీరి నవలల ప్రాముఖ్యం సన్నగిలిందనొచ్చునేమో కూడా

హక్స్లీ నవలలన్నీ నిజానికి వ్యాసాలే కొద్ది మార్పులు చేస్తే నవల' వ్యాస సంపుటంగా తయారవుతుంది ఇదివరలో నవలలు చదవడంలో మనం పొందిన అనుభూతి నివ్వవు ఈ నవలలు. ఇందలి వస్తువు మెదడుకి మేత. తాత్విక చింతనపట్ల, వైజ్ఞానిక విమర్శనపట్ల అభిరుచిని పెంపొందిస్తాయి ఈ నవలలు.

హక్స్లీ 1894 లో జన్మించాడు. ఈయన అన్నగారు జూలియన్ హక్స్లీ ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు. 1946 నుండి 48 వరకూ యునెస్కో సంస్థ డైరెక్టర్ జనరల్‌గా పనిచేశాడు. హక్స్లీ - ఈటన్, ఆక్స్‌ఫర్డు కళాశాలల్లో విద్య పూర్తిచేసి, వైద్యం చదివాడు. కాని, కంటిజబ్బువల్ల ప్రాక్టీస్ చెయ్యలేదు. 1919 లో మారియానైస్ (Maria Nys) అనే బెల్జియన్ కన్యను వివాహ మాడాడు. అథినేయమ్ పత్రికలో పనిచేశాడు కొంతకాలం. మరికొంతకాలం నాటకాల విమర్శకుడుగా పనిచేశాడు. 1923 నుండి 1930 వరకూ ఇటలీలో వున్నాడు. 1947 నుండి కాలిఫోర్నియాలో ఉండిపొయ్యాడు. 1963 నవంబర్‌లో కాన్సర్ వ్యాధికి గురై చనిపోయాడు.

1945 లో కాలేజీలో పనిచేస్తూ వుండగా, హక్స్లీ నవల 'బ్రేవ్ న్యూ వరల్డ్' చదివాను. ఆయన రచనలన్నింటిలోనూ ఉత్తమమైందిగా ప్రసిద్ధికెక్కిన నవల యిది అనేక భాషలలోకి అనుసరింపబడింది. ఓ విధంగా చూస్తే ఇది నవల కాదు విజ్ఞానశాస్త్రం సాధించిన ఫలితాలను, పాలకులు వినియోగించుకుని తమ ఆదేశం ప్రకారం అవతరింపజేసిన ఒక కృత్రిమ సమాజం చిత్రణ ఈ గ్రంథంలో ప్రధాన అంశం రష్యన్ శాస్త్రజ్ఞుడు (Pavlov) పౌలావ్, అమెరికా శాస్త్రజ్ఞుడు డాక్టర్ వాట్సన్ (Dr. Watson) కొన్ని పరిశోధనలు చేసి, వాటి ఫలితాలను మానసిక శాస్త్రానికి అన్వయించి ప్రచారం చేశారు. శరీరానికి లొంగక, స్వేచ్ఛగా పనిచేసే మనస్సు అంటూ ఒకటి లేదు. ఆత్మ అంటూ వేరేలేదు. మెదడులో వున్న జిజ్ఞాసారహితమైన అదోలోకం శారీరకమైన అవసరాల సృష్టి కాని, శరీరంతో నిమిత్తంలేక మరో జన్మనుంచి వచ్చి, మరో జన్మకి తరలిపోయే అసాధారణ శక్తి కాదు, ఆత్మ. సమాజం నేర్పిన నియమాలను అతిక్రమించ కుండా శరీరాన్ని కాపాడే అంతరాత్మ కూడా శరీరానికి బానిసే.

ఇవీ, వీరు ప్రచారం చేసిన కొన్ని మానసిక శాస్త్ర సూత్రాలు. పసిబిడ్డను ఈ సూత్రాల ననుసరించి, శిక్షణలో పెడితే, మనం ఎల్లాంటి మనిషి కావాలని కోరుతామో, అట్లాంటి మనిషిగా తయారు చేయవచ్చు. పసిబిడ్డకి ఆహారం ఇచ్చే ముందు, పెద్ద చప్పుడు చెయ్యి ఆ చప్పుడుకీ, ఆహారానికి ఆ బిడ్డ మెదడులో సమన్వయం కుదురుతుంది చప్పుడైనప్పుడల్లా ఆహారంకోసం గోలపెడుతుంది. అల్లాగే ఆహారానికీ, మనం ఆశించిన మరో పరికరానికీ బిడ్డ మెదడులో ఒక లంకె ఏర్పరచొచ్చు - అల్లాగే పుష్పాలు, బొగ్గు, తుపాకులు, పుస్తకాలు, వీటికి ఆహారానికి ముడిపెడితే, బిడ్డ ఎదిగాక వాటినే అభిమానిస్తాడు. ఉదాహరణకి, బొగ్గు, తుపాకీలకి ఆహారంతో లంకె ఏర్పరిస్తే అతను సైనికుడవుతాడు. పుస్తకాలు, పుష్పాలు, వీటితో ముడిపెడితే కవో చిత్రకారుడో అవుతాడు ఈ విధంగా చిన్నతనంలో తర్ఫీదిచ్చి, మనం కోరిన 'మనిషిని' కృత్రిమంగా కర్మాగారంలో సృష్టించవచ్చు నన్నమాట

'బ్రేవ్ న్యూ వరల్డు' అనే నవలలో ఇట్లా కృత్రిమంగా పరిశోధనాలయంలో తయారైన వ్యక్తుల సమాజం స్వరూపం చిత్రితమైంది. అందులో 'టెస్టు ట్యూబ్'ల ద్వారా, పిల్లలు సృష్టించబడతారు వారి ఆలోచనలు, అభిరుచులు పాలకులు ఆదేశించినవిగా రూపొందుతాయి. అందరివీ ఒకేరకం ఆలోచనలు, అభిరుచులు. వైవిధ్యం వుండదు వ్యక్తిత్వం ప్రకర్షద్వారా సంక్రమించే తికమకలు, రహస్యమైన ఊహాలు మానసిక సంఘర్షణలు — యివేవీ వారిలో వుండవు. ఇంద్రియ సౌఖ్యం కోసం కావల్సినప్పుడల్లా 'సోమా' బిళ్ళలు తీసుకుంటారు కులాసాగా గడపాలంటే (ఫీలీస్) పుచ్చుగుంటారు. సెక్స్ ప్రకర్ష తాత్కాలికం - శాశ్వత బంధం కాకూడదు. పరిశోధనాలయం ఏదో పొరపాటు జరిగిన ఫలితంగా, ఒక వ్యక్తి, స్త్రీ నుండి శాశ్వత స్నేహం ఆసిస్తే, అతన్ని పరాయివాణ్ణిగా వెలివేస్తారు, హింసిస్తారు, దూషిస్తారు. వీలైతే మరమ్మతు చేస్తారు. ఎవరూ, దిగులుగా వుండకూడదు. రహస్యమైన ఆలోచనలు సాగించకూడదు. తాత్కాలికావసరానికి తప్ప స్నేహ భావం, ప్రేమ చూపకూడదు. ప్రమాణం చెయ్యాల్సివొస్తే 'ఓ దైవమా' (Oh God!) అనడం బదులు, 'ఓ ఫోర్డు' (Oh Ford!) అంటారు, ఆ సమాజంలో వ్యక్తులు — 'ఫోర్డు' ధనిక వర్గానికి చెందిన పాలకులలో ముఖ్యుడన్నమాట — అతనే దైవం, ఈ కృత్రిమ సమాజంలోకి, మన మెరుగున్న సమాజంలో మనిషి ఒకడు ప్రవేశిస్తాడు. అక్కడివారు అతన్ని అడవి మనిషిగా వ్యవహరించి, వింతగా చూస్తారు. అతని అలవాట్లు, అభిరుచులు, అభిప్రాయాలు, ఆదర్శాలు వారి సమాజాన్ని తారుమారు

చేస్తాయి ఈ విధంగా చమత్కారమైన సన్నివేశాలతో, హాస్య ధోరణితో, బుద్ధిగ్రాహ్యమైన వినోదాన్ని కలిగించే గొప్ప గ్రంథం ఇది విజ్ఞానశాస్త్రం సమకూర్చిన ఆయుధాలని వినియోగించి, ఒక కృత్రిమ సమాజాన్ని తయారు చేస్తే అది ఎట్లా పరిణమిస్తుందో, హేళనతో విమర్శించడం ఈ నవల సాధించిన ప్రయోజనం. ఇట్లాంటి ప్రయోజనాన్ని సాధించిన మరొక గొప్ప నవల, ఆర్వెల్ రచించిన '1984' అన్నది. నియంతల పాలనలో విజ్ఞానశాస్త్రం పునాదులపై లేచిన పోలీస్ సమాజం ఎల్లా తయారవుతుందో '1984' చిత్రిస్తుంది. 'బ్రేవ్ న్యూ వరల్డు' వ్రాసిన పాతిక సంవత్సరాలకి, ఆ కృత్రిమ సమాజాన్ని మళ్లా సందర్శిస్తే, అది ఎట్లా మారిందీ, వ్యాఖ్యానిస్తూ హక్స్లీ, 'బ్రేవ్ న్యూ వరల్డు రీ విజిటెడ్.' (Brave New World Revisited) అనే మరో గ్రంథం వ్రాశాడు, బ్రేవ్ న్యూ వరల్డు తెలుగులోకి అనువదించాల్సిన మంచి గ్రంథం కాని, అందలి విషయాలు పూర్తిగా అర్థమవాలంటే, విజ్ఞానశాస్త్రం బైటపెట్టిన వాటిని గూర్చి కొంత వ్యాఖ్యానం – టీకా తాత్పర్యం పొందుపరచాలి

చాలామంది విమర్శకులు, హక్స్లీ నవల లన్నింటిలోకి 'పాయింట్ కవుంటర్ పాయింట్' ఉత్తమమైందిగా పరిగణిస్తారు.

నవలలో మనం ఆశించే అనుభూతి ఇందులోనూ దొరికేదేమో. పాశ్చాత్య భావ ప్రపంచాన్ని కూకటివేళ్ళతో పెకలించి పరామర్శించి, అందలి లోపాలను ఎత్తి చూపుతుంది ఈ నవల. ఈ రకం పరామర్శలో పేచీ లేకపోలేదు. రచయిత ఏది మంచిదంటున్నాడో మనకి తెలియదు ఇవన్నీ బాగాలేవు సరే! మనం చెయ్యాల్సింది ఏమిటి? ఏ విలువల్ని స్వీకరించాలి? అంటే స్పష్టమైన సమాధానం దొరకదు. ఏకపత్నీవ్రతం మంచిదా? అంటే సమాధానం: "పాటించ కలిగితే మంచిదే పాటించకపోతే, దానికోసం ఏదో త్యాగంచేసి, శరీరాన్ని హింసించడం మంచిది కాదు." స్వచ్ఛంద ప్రేమ మంచిదంటారా హక్స్లీ స్వాములూ? అని ప్రశ్నిస్తే, సమాధానం : అనను ప్రతి సృష్టికి పూనుకున్న కళాకారులకి కొన్ని శక్తు లవసరం వారికి మనోబలం, దీక్ష, ధ్యానం కావాలి. బ్రహ్మచర్యం పాటించేవారికిగాని అవి సాధ్యం కావు" అంటాడు.

బస్తీలు విడిచేసి హాయిగా ప్రకృతి మధ్య మనిషి ఏకాంతంగా నివసించడం మంచిదా?

'మనిషి స్నేహాన్ని కోరతాడు పైగా అడవుల్లో పురుగు పుట్ర, క్రూర జంతువులు ఉంటాయి. ఆకు అలములు తిని నిలబడలేడు' అని సమాధానం.

కావల్సిన పనులన్నింటినీ, యంత్రాల ద్వారా చేయించుకుని బస్తీలో ఉండేనే మెరుగేమో?

"కాని యంత్రాల మధ్య జీవితం అసహజం. ప్రకృతి విరుద్ధం. ఈ గంద్రగోళం నుంచి పారిపోయి, ఏకాంతంగా పరమాత్మని సాక్షాత్కారం చేసుకోండి "

పరమాత్మని సందర్శించడం అందరికీ సాధ్యమా? అంటే "మెస్కలిన్-డ్రగ్గుని వాడండి సోమపానం, అద్భుతమైన కళాఖండం, సమాధి, సెక్సు అనుభవం, ధ్యానం ఇవి చవిచూసినవారు పొందే ఆనందం 'మెస్కలిన్' పానీయంతో లభ్యమవుతుంది "

ఏ ఒక్క దృక్పథానికి ఉద్రేకంతో లొంగిపోకుండా ప్రతిదాన్నీ, అన్ని కోణాల నుండి పూర్తిగా పరామర్శించి చూస్తే, సహజమైన ఉద్రేకం నీరసించొచ్చు. మనిషిలో ఒక ప్రధానమైన అనుభూతి దూరమవచ్చు హక్స్లీ సిద్ధాంతం ప్రకారం అట్లాగవకూడదు. మరెలా? 'పాయింట్ కవుంటర్ పాయింట్' లో యీ వాక్యాలు చూడండి :

"మన చుట్టూ జరిగే దురంతాలను సహించలేం. మనకి ప్రాప్తించే బాధనీ సహించలేం సహించలేక వాటి నుండి తప్పించుగుని పారిపోడానికి కొన్ని పరికరాలు ఉపకరిస్తాం - త్రాగుడు, కళ, పుస్తకాలు, నాట్యం, సినిమాలు, రేడియోలు లాంటివి సత్యాన్వేషణ కూడ ఇట్లాంటిదే, ఎటొచ్చీ కాస్త సంస్కారంతో కూడుకున్నది. త్రాగుబోతు కళాకారుడు, గ్రంథకర్త నటుడు - వెర్రిలో పడి అంతమొందినట్లుగానే, సత్యాన్వేషి కూడా వెర్రిలో పడి అంతమొందుతాడు నిజాయితీతో, శీలంతో ప్రవర్తించడం కంటె సత్యాన్వేషణ సాగించడం సుళువుగా మరి! జీవించాలి గాని, దాన్నుండి పాఁటపోకూడదు."

"అల్లాగే, 'ఆఫ్టర్ మెనీ ఎ సమ్మర్' (**After many a summer**) అనే నవలలో ఒక పాత్ర ఇల్లా ప్రశ్నిస్తాడు "యోగులు, ఋషులు చెప్పేవి అర్థంలేని మాటలంటావా?"

దానికీ సమాధానం : "వారికి తెలిసిన విషయాలే చెప్తారు కాని, వారికి తెలిసింది చెప్పుకోతగింది కాదు. ఎందుకంటే వారికి తెలిసింది అనుభూతి తాలూకు సాహిత్యం కాని; అనుభవం కాదు," అని.

**1930** కి ముందు హక్స్లీ వ్రాసిన నవల లన్నింటిలోనూ, శరీరాన్ని ఆరాధించడం, ఆత్మని త్రోసిపుచ్చడం కనబడుతుంది విజ్ఞానశాస్త్రంపట్ల అమితమైన గురి కుదరడమే ఇందుకు కారణం అనిపిస్తుంది హక్స్లీ గొప్ప పండితుడు. ప్రపంచంలో చలామణీ అవుతున్న తత్వాలన్నింటినీ తెలుసుకున్నవాడు, మహా మేధావి, అన్ని శాస్త్రాలూ, అన్ని దేశాల చరిత్రలూ బాగా చదివిన

వాడు అతడొక విజ్ఞాన సర్వస్వంలాంటి వాడు. అయినా, విజ్ఞాన శాస్త్రంపైననే అతనికి నమ్మకం ప్రబలింది. హేతువాదం, మానవతావాదం, బుద్ధి గ్రాహ్యం- వీటిపై తన చూపుని నిల్పినప్పుడు, శరీరం ప్రధానమైందిగా తోచడంలో ఆశ్చర్యం లేదు. అ పరోక్ష జ్ఞానానికీ (Intuition) బుద్ధికీ జరిగే సంఘర్షణ 'దోజ్ బేరన్ లీవ్స్' (Those Barren leavee) అన్న నవలలో బహు శక్తి వంతంగా చిత్రించబడింది. అందులో ప్రధాన పాత్ర కార్టన్ ఇల్లా వాపోతాడు, వార్ధక్యాన్ని తలుచుకుంటూ :

"చివరికి ఆలోచనలూ; అనుభూతి ద్వారా బ్రహ్మ సాక్షాత్కారాలూ లేవు. బాధ, మైకం, డోకులు వుంటాయి. శరీరంతోపాటు ఆత్మ కూడా నశింపవు తుంది. దేవుడు, దయ్యం, అనంతం — అంతా మాయ శరీరం ఆత్మని పీడించి చంపేస్తుంది మూలుగుతో చస్తాడు - మనిషి అనే జంతువు"

**1932** తర్వాత, హక్స్లీ పరమార్థ చింతనలోపడి, తత్వజ్ఞుడయ్యాడు. భౌతిక శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన థెర్మో డైనమిక్స్ రెండో సూత్రం, (**The second law of Thermo Dynamics**) తోనూ, ఐన్‌స్టిన్ రిలెటివిటీ సిద్ధాంతాలతోనూ, భావ ప్రపంచంలో సంచలనం బైలుదేరింది. విజ్ఞానశాస్త్రానికి అతీతమైన జీవిత రహస్యం ఒకటుందనీ, దాన్ని తెలుసుకోడానికి భక్తి జ్ఞానయోగ వైరాగ్యం తప్ప మరో మార్గం లేదనీ, హేతువాదులు కూడా గ్రహించసాగారు. హక్స్లీ వేదాలు, గీత, బౌద్ధ తత్వం శ్రద్ధగా చదవడమే కాకుండా, అవి చెప్పిన వాటిని తన నిత్య జీవితంలో అనుకరించసాగాడు. ఆయనలో వచ్చిన ఈ మార్పు **1932** తర్వాత వ్రాసిన నవలల్లోనూ, వ్యాసాల్లోనూ కనబడుతుంది. అన్ని తత్వాలలోని సారాంశాన్నీ, మహాపురుషుల నిర్వచనాలపై వ్యాఖ్యానంతో 'పెరిన్నియల్ ఫిలాసఫీ' (**Perennial Philosophy**) అనే గ్రంథాన్ని వ్రాశాడు, **1939** లో ఆయన వ్రాసిన 'ఆఫ్టర్ మెని ఎ సమ్మర్' అను నవలలో ఆయన చెప్పిన సారం 'అన్నింటికీ అహం శత్రువు' అన్నది ఈ వాక్యాలు చూడండి : "ఏమిటి నాగరికత? వస్తువుల సంఖ్య పెరుగుదల. కొత్త రుచులు, కొత్త పదార్థాలు, కొత్త కోరికలు — వీటిని సంతృప్తిపరిచే ప్రతి వస్తువూ, బాహ్య జగత్తులోంచి రావాలి బాహ్య ప్రపంచానికి దాసులం మనం. వాటిపై ఆధారపడకపోతే దాస్యం తొలుగుతుంది రెండుగా విభజించబడని జిజ్ఞాసలోనూ బాహ్య జగత్తులో కలిసిపొయ్యే మనస్సులోనూ, ఎంతటి ఆనందం వుంది."

నేను చెప్పినదాన్ని బట్టి హక్స్లీ నవలల్లో సాహితీ విలువలు లేవనుకో కూడదు. వాటిల్లోనూ కథ, పాత్రలూ, సన్నివేశాలు, కాలం వ్యక్తులపై

తెచ్చే మార్పులు ఉంటాయి. భావాలతో కుస్తీ పట్టడాలు అంతగా లేని మంచి నవల 'జీనియస్ అండ్ ది గాడెస్' (Genius and the Goddess) చమత్కృతి, హేళన, హాస్యమే కాకుండా హక్స్లీ శైలిలో కవితావేశం, ఊహా బలం కూడా వుంటాయి. అద్భుతమైన సన్నివేశం చిత్రించేటప్పుడు, విషాదాన్ని నాలుగో పరిమాణానికి అనువైన దైన్యాన్నీ ప్రస్ఫుటం చేయగల శైలి ఆయనది. ఆ శైలి ఎట్లాంటిదో ఈ వాక్యాలు చూస్తే తెలుస్తుంది :

"ఒక బొట్టు, అందులో కదిలే సూక్ష్మ క్రిములు — వానపాములో వెయ్యో భాగం లాంటివి - ఆమె గర్భంలో కదిలి, ఎప్పుడో మనిషవుతుంది. ఎదిగిన మనిషి ఏడుస్తాడు, నవ్వుతాడు, ప్రేమిస్తాడు, ద్వేషిస్తాడు, ఆలోచిస్తాడు స్మరిస్తాడు. ఆమె గర్భంలోంచి జిగురు ముద్ద బైటపడి, దైవాన్ని సృష్టించి ఆరాధన సాగిస్తాడు. ఒక చిన్న చేపపిల్లలాంటి ప్రాణి, సృష్టికి పూనుకుంటుంది. మంచి చెడ్డల సమరానికి అనువైన యుద్ధ రంగాన్ని సృష్టిస్తుంది. ఆ చీకటి గర్భంలో కళ్ళు కనబడక, దేవుళ్లాడే ఆ పసి పురుగు నక్షత్రాల కేసి చూస్తుంది. సంగీతం వింటుంది. కవిత్వం చెబుతుంది — ఒక మనిషై, శరీరమై, మనస్సవుతుంది."

తాను సృష్టించుకున్న సమాజంలో మానవుడు ఎల్లా ఉన్నాడో చూపడమే నవల వుద్దేశ్యం. బాహ్య జగత్తులో శక్తులతో ఎల్లా సమాధానం కుదుర్చుకున్నాడు? తన అంతరంగ జగత్తులో జరిగే సంఘర్షణని ఎల్లా పరిష్కారం చేసుకున్నాడు. ఈ రెంటినీ — బాహ్య, అంతరంగ జగత్తులు - సమగ్రంగా ప్రదర్శించిన గొప్ప నవల. హక్స్లీ నవలల్లో బాహ్య జగత్తులోని శక్తులతో సమన్వయం కుదుర్చుకోడం అద్భుతంగా చిత్రితమైంది అంతరంగ జగత్తులోని లోతులూ శిఖరాలు, మెళుకువలు, సంఘర్షణలు అంతగా కనబడవు. ఆ జగత్తులో ప్రవేశించే శక్తులు హక్స్లీలో లేకపోలేదు. ఇవి 'ఐలెస్ ఇన్ గాజా' (Eyeless in Gaza) అనే నవలలో బాగా కనబడతాయి. కాని, ఎందుచేతనో ఆ శక్తులని అంతగా వినియోగించినట్లు తోచదు. మధ్య ఏదో అడ్డు తగులుతూ వుంటుంది. తనతో తాను సమాధానం కుదుర్చుకోడం కోసం తాపత్రయ పడతాడు రచయిత. "నన్ను నేను తెలుసుకోడం కోసం వ్రాశాను ఈ గ్రంథాలన్నీ" అని చెప్పుకున్నాడు హక్స్లీ ఒక గ్రంథానికి పీఠిక వ్రాస్తూ.

తన అంతరంగంపై రచయిత దృష్టి కేంద్రీకరించినప్పుడు, బాహ్య జగత్తులో పాత్రలు స్పష్టంగా కనబడకపోవడం అసహజం కాదు. ప్రతి నవలలోనూ, తీవ్రమైన ఆవేదన గోచరిస్తుంది అందుకనే 1959 లో అమెరికన్

సాహిత్య ఎకాడెమీ ఆయనకి 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' (Order of Merit) సమర్పించి సన్మానించారు. కాని, స్వయం ప్రకర్షలో ఉత్పన్నమైన ఆవేదన, ఉద్రేకం, కళా స్వరూపంలో అవతరించక, విమర్శగా మారి అల్లానే ఉండి పోయ్యాయా! హక్స్‌లీవి అన్నీ మంచి నవలలే, కాని గొప్ప నవలలు కావేమో ననుకుంటా.

కథానికకి తీవ్రమైన జిజ్ఞాస, శిక్షణ అవసరం భావాల చర్చకి, స్థితి గతుల వ్యాఖ్యానాలకి యిందులో వీలులేదు రచయిత వ్యక్తిత్వ ప్రకర్షకి, స్వీయపరిశీలనకి తావు లేదు. అందుచేతనే హక్స్‌లీ చాలా మంచి కథలు వ్రాయ గలిగాడు. ఆయన తొలి రచన గేయ సంపుటి రెండోది కథల సంపుటి మొత్తం ఐదు కథానికా సంపుటాలు ప్రచురించాడు. 'గియొ కొండా స్మయిల్' (The Gioconda Smile) అనే కథ ఉత్తమమైందిగా విలువ కట్టారు విమర్శకులు. ఇది డిటెక్టివ్ కథలాగుంటుంది. నా కిష్టమైంది 'రెస్ట్ క్యూర్' (Rest cure) అనే కథ. ఇది గొప్ప కథ, ఇందలి వస్తువు కొత్తది కాదు – పాత చింతకాయ పచ్చడి. వ్యభిచారం చాలా మంది రచయితలకి అభిమాన మైన వస్తువు ఈ వస్తువుతో జాగ్రత్తగా మసలాలి. లేకపోతే కథ చౌకబారుగా తయారయ్యే ప్రమాదం వుంది. కాదని ఋజువయ్యే వరకూ, గేయం సాహిత్యంగా పరిగణింపబడుతుంది. అవునని ఋజువయ్యే వరకూ నవల సాహిత్యం కాదు ఈ వస్తువుని తీసుకుని వ్రాసిన ఎన్నో కథలు, సాహిత్యంగా కాక, బూతుగా తయారవడం జరిగింది – మొపాసా, బాల్జాక్, జోలా, మామ్, లారెన్సుల కథలు ప్రజామోదాన్ని పొందినా, వాటిపైన సాహితీ ముద్ర పడిందా? అన్న ప్రశ్న విమర్శకులు అడుగుతూనే వున్నారు

'రెస్టు క్యూర్' లో కథ ఏమిటో చెప్తాను 'మొయిరా' తల్లీ, తండ్రీ చిన్నతనంలో చనిపొయ్యారు. తాతగారి చేతుల్లో అతి గారాబంగా పెరిగింది టార్విన్ అనే శాస్త్రజ్ఞుడికిచ్చి పెండ్లి చేస్తారు. టార్విన్ ధనికుడు. బాగా చదువు కున్నవాడు. ప్రపంచం అంతా తిరిగొచ్చాడు. వయస్సు ముప్పై అయిదు విజ్ఞానశాస్త్ర పరిశోధనకి జీవితం అంకితం చేసుకున్నవాడు విజ్ఞానశాస్త్ర పరిశో ధకుడు అనగానే మొదట్లో నేను భయపడ్డాను. జీవశాస్త్రం గురించి, రచయిత కసరత్తు, గారడీ సాగిస్తాడేమోనని కాని, అల్లా జరుగలేదు అప్రస్తుతమైన వ్యాఖ్యానాలు లేవు ఇందులో పాత్రలు వ్యక్తులుగా ఉండిపోతారు పరిణితి చెందుతారు, వారికి శరీరాలు, ప్రత్యేకమైన మనస్సు, మెదడూ, శీలం వుంటాయి. హక్స్‌లీ తన్ను తాను మర్చిపోయి, ఆ పాత్రను సానుభూతితో చిలకించాడు.

మొయిరా భర్తతో ఐదేళ్లు కాపురం చేసినా, భర్తపట్ల గాఢమైన అనురాగం ఏర్పడలేదు. ఆమెకి మొదటినుంచీ మనుషులంటే భయం. యువకుడు పెండ్లి చేసుకోమని పదే పదే అడిగాడు సరేనని – పెండ్లి చేసుకుంది. తాను చేసిన పరిశోధనలు ఫలితాలు గురించి చెప్తాడు. వినమంటాడు. వ్యాసాలు చదువుతాడు భర్త. ఆమెకి విసుగు ఇది నిజమైన జీవితం కాదు, 'చచ్చిన కప్ప కాలుని, విద్యుత్ ప్రసారం ద్వారా కదపడం లాంటిది' అనుకుంటుంది. నరాలు నీరసించి కృశించింది మొయిరా. డాక్టరుకి చూపెట్టారు.

ఆమె నరాలు చెడ్డాయి. విశ్రాంతి కావాలన్నాడు డాక్టర్. భర్తతో తన ఆరోగ్యం విషయం ముచ్చటించింది. తన మోకాలుపై ఆనించిన భర్త తలని చూసి జాలి పడింది అస్తమానమూ చదువు, ఆలోచన తలమీద వెంట్రుకలన్నీ ఊడిపోయ్యాయి. గెథే కవిత్వం వినమంటున్నాడు. గెథే గేయాలంటే ఆమెకి తలనొప్పి.

"ఏదో అస్తమానూ మాట్లాడుతూనే వుంటావు. నువ్వు ఎవ్వరినీ ప్రేమించ లేవు. ఎప్పుడూ నిన్ను గురించే ఆలోచించుకుంటూ ఉంటావు. సౌందర్యం అంటే ఏమిటో ఎరగవు. ఆ గెథేకి ఎంత తెలుసునో నీకూ అంతే. అందమైన స్త్రీ దగ్గరున్నప్పుడు, ఎల్లా ప్రవర్తించాలో తెలుసు గానీ, సహజమైన కాంక్ష నీకు తెలీదు." అంటుంది మొయిరా.

"అంతేనా, నన్ను గురించి నువ్వేరుగున్నది?" అంటాడు భర్త బిత్తర పోయి.

"అవును. నే చెప్పిందే నిజం. నీవన్నీ తలదాటిన ఊహలు - ఆ తలమీద ఒక్క వెంట్రుకా లేదు" అంటూ వెర్రిగా నవ్వుతుంది.

ఇటలీ వెళ్ళి విశ్రాంతి తీసుకోడానికి ఏర్పాటైంది ఆమె వెడుతుంది. ఒక పెద్ద బంగళాలో వంటిగా విశ్రాంతి తీసుకుంటూ గడుపుతుంది. అక్కడ 'టోనినో' అనే ఒక ఇటలీ యువకుడితో స్నేహం ఏర్పడుతుంది అతను హోటల్లో పనిచేసేవాడు కారు నడుపుతాడు చిన్న చిన్న ఇంటి మరమ్మత్తులు చేసి జీవితం గడుపుతాడు. ఇంటి సరుకులు కొనడంలోనూ, తోట పెంచడం లోనూ, మొయిరా దగ్గర కూలిపనికి వుంటుండగా ఒక రోజున గాలివానకి ఆమె భయపడిపోయి, టోనినోని రమ్మని కబురు చేస్తుంది. ఆ స్నేహం గాఢమైందిగా ప్రబలి, ఆమె వ్యభిచరిస్తుంది. అతను లేనిదే ఆమెకి క్షణం గడవదు. అస్తమానూ అతన్ని రమ్మంటుంది ఖరీదైన దుస్తులు, వాచీలు, సిగరెట్ కేసులు బహూక రిస్తుంది.

ఒకసారి ఏదో మీటింగ్‌కి వెడుతూ ఆమెని చూడ్డానికి వస్తాడు భర్త. భార్య టోనినోపట్ల చూపుతున్న చనువుని మందలిస్తాడు. 'వాడు అల్పుడు, నీచుడు - పోరంబోకు. డబ్బు కాజేస్తాడు జాగ్రత్త' అని చివాట్లు పెడతాడు భార్యని. భర్త వెళ్ళిపోతాడు. 'అమ్మయ్యా,' అని నిట్టూర్చింది. ఆమె మనస్సు ఆనందంతో నిండింది — ఆ సమయంలో భర్తని తల్చుకుని జాలిపడసాగింది. ఒకవిధంగా అతనికి కృతజ్ఞత చూపాలి. అతనివల్లనే నిజమైన ప్రేమంటే ఏమిటో తెలుసుకో గల్గింది. టోనినోని మరింత గాఢంగా ప్రేమించ సాగింది. అతన్ని చూడకుండా ఒకరోజు కూడా గడపలేకపోతోంది.

టోనినో పైకి ఇష్టంగా వుంటున్నా, ఆమెని తప్పించుకు తిరగడం మొదలెట్టాడు. మరొక యువతితో స్నేహం ఏర్పడింది. ఏదో పనుందని సాకు చెప్పి, ఆ క్రొత్త ప్రియురాలితో రహస్యంగా విహరించడం సాగించాడు డబ్బు చిక్కుల్లో పడ్డాడు. మాయమాటలు చెప్పి, ప్రేమ చూపి, మొయిరా వద్దనుండి, పెద్దమొత్తం తీసుకెడతాడు. వెళ్ళి తన ప్రియురాలితో వినోదిస్తుండగా మొయిరా కంటపడతాడు. మొయిరా మనస్సులో గొప్ప ఆవేదన రేగుతుంది. తన భర్త మందలిస్తూ అన్న మాటలు జ్ఞప్తికొచ్చాయి. "వాడు పోరంబోకు — డబ్బు కాజేస్తాడు" అన్న మాటలు. నిస్సందేహంగా టోనినో నీచుడు. అతన్ని కేకేసి నాలుగూ పెడుతుంది. ఆమెను ముద్దిడబోతాడు — మూతిమీద కొడుతుంది. రక్తం కారుతుంది. అతను వెళ్ళిపోతాడు. అతన్ని వెదుకుతూ కార్లో వెడుతుంది. మళుపు తిరగడంలో కారు రాళ్ళకి తగిలి బోల్తాపడుతుంది. ఆమెకు గాయాలు తగల్లేదు మళ్ళా ఇంటికొచ్చేస్తుంది. అద్దంముందు అలంకరించుకుంటూండగా, ఇందాక టోనినోతో మాట్లాడేటప్పుడు, మంచంమ్మీద పడేసిన పర్సు జ్ఞాపకం వస్తుంది. పర్సు కనబడదు. ఇది టోనినో పనే అనుకుంటుంది పిస్తోల్ పేల్చు కుని చనిపోతుంది. నలుగురూ పోగై ఆమెను మంచంపై నుండి కిందకు దించు తారు పర్సు మంచంమీదనే వుంటుంది.

ఇది గొప్ప కథ సహజమైన పాత్రలు, అద్భుతమైన సన్నివేశాలు. అనవసరమైన వాక్యం ఒక్కటి కూడా లేదు. ముగింపుకి పాఠకుడు చకితు డవుతాడు — అతనిలో ఏదో మార్పొస్తుంది — అదెట్లాంటిది? ఎందుకొచ్చింది? అని ప్రశ్నించుకునే వ్యవధి దొరకనీయని ఉత్తమ కళాఖండం.

హక్స్‌లీ ప్రాక్ పశ్చిమ దేశాలు పర్యటిస్తూ 1926 లో ఇండియాలో కొన్ని ముఖ్య పట్టణాలను సందర్శించి, తన అనుభవాలను, 'ది జెస్టింగ్ పైలేట్' (The Jesting Pilate) అనే యాత్రా గ్రంథంలో పొందుపరచాడు. తాను

సందర్శించిన స్థలాల వాతావరణం- చిత్రించడంలో నార్మన్ డగ్లస్ (Norman Douglas), టామ్ లిన్సన్ (Tam Linson), డి. హెచ్. లారెన్సు (D. H. Lawrence) లు నిపుణులు. హక్స్లీ రచనా నైపుణి స్థలాల వర్ణనలోకంటె, మనుష్యుల్ని వారి వేషభాషలని వర్ణించడంలో ప్రబలంగా ప్రకటితమౌతుంది. సెకండ్‌క్లాస్ పెట్టెలో లాహోర్ వెడుతుండగా, ఒక బైరాగి తన పెట్టెలో ప్రయాణం చేస్తాడు. అతను గమనించిన వాటిని ఈ విధంగా వర్ణిస్తాడు.

"ఆయన భక్తుడే కావచ్చు, యోగీ కావచ్చు. కాని ఆ మురికి దుస్తులు, ఆ వాసనా భరించలేకపోయాను. ఆయనతో ఉన్న అనుచరులు కూడా వాస నొచ్చేవారు. అతి పరిశుభ్రతని టాల్‌స్టాయ్ అధిక్షేపించాడు. అతి శుభ్రత ఒక తెగకి చిహ్నంట. డబ్బున్నవాళ్ళకే అంత శుభ్రంగా ఉండటం సాధ్యమట. కాయకష్టం చేసి పొట్ట పోసుకునేవాడు వాసనెయ్యడం తప్పదు పని ప్రార్థనతో సమం. పనంటే వాసన, కాబట్టి వాసన ప్రార్థనతో సమం."

హక్స్లీ తాజ్‌మహల్‌ని సందర్శించాడు, దాన్ని ఎల్లా మెచ్చుగుంటాడో నని ఆతృతతో చదివాను. ప్రపంచ వింతలలో ఒకటైన తాజ్‌ని చూసి అసంతృప్తి చెందాడు. సంధ్యలో చూచినా ఆయనకి నచ్చలేదు. ఎక్కువ ఖరీదైన కట్టడాల అందానికి తట్టుకోలేక పోవడం వల్ల అతనికి నచ్చదని కారణం చెప్పుకున్నాడు-

"అంత ఖరీదైంది కాబట్టి దాన్ని అందరూ మెచ్చుకుంటున్నారు – దాని నిర్మాతల ఊహాబలాన్ని శంకిస్తాను— ఆ నాలుగు బురుజులూ బొత్తుగా బాగా లేవు – మార్బుల్ రాతి కట్టడం కాబట్టి గొప్పదంటే ఒప్పుగోలేను – పాపా లన్నింటినీ మార్బుల్ కప్పివేస్తుంది కాబోలు." ఇవీ ఆ వ్యాసంలో ఆయన వ్రాసినవి తాజ్‌మహల్ సందర్శించినప్పుడు హక్స్లీ యువకుడు ప్రాచీనులు చెప్పినవాటినీ, చేసినవాటినీ యువకులు ఖండించి తమ ఆధునిక తత్వాన్ని నెల కొల్పాలన్న దృక్పథాన్ని ప్రచారం చేసిన ఆ రోజుల్లో హక్స్లీ అల్లా వ్రాశా డంటే ఆశ్చర్యపడ నక్కర్లేదేమో. అందరూ మెచ్చుగున్నదాన్ని నే నెందుకు మెచ్చుగోవాలి? టాల్‌స్టాయ్, షేక్స్పియర్ విషాదాంత నాటకాలని మెచ్చుగో లేకపోవడమూ; షెల్లీ గేయాలని, మాథ్యు అర్నాల్డ్ మెచ్చుగోలేక పోవడమూ; పాశ్చాత్య సంస్కృతి జగత్తులో ఇట్లాంటి వింతలే.

హక్స్లీ వారణాసి వెళ్ళినప్పుడు సూర్యగ్రహణం జరిగింది. అది పూర్తి గ్రహణం కాదు. హక్స్లీకి కనబడనేలేదుట. సర్పాలు సూర్య బింబాన్ని భక్షిం చడంవల్ల గ్రహణం ఏర్పడుతుందన్న నమ్మకం గూర్చి వ్రాస్తూ :

"నేను కోటీశ్వరుణ్ణయితే, నాస్తిక తత్వ ప్రచార కేంద్రానికి ఆ దబ్బంతా వినియోగిద్దును" అని వ్రాశాడు.

మిగతా దేశాల అభిరుచులపైనా, ఆచారాలపైనా ఆయన అభిప్రాయాలు ఇంత మాటుగానూ, నిర్మొహమాటంగానూ ఉంటాయి. ముప్పై యేళ్ళవాడు ఒక మేధావి దృష్టిలో ప్రపంచంలో కొన్ని దేశాలు ఎట్లా ఉండేవో తెలుసుకో దల్చినవారికి హక్స్లీ యాత్రా గ్రంథాలు ఉపకరిస్తాయి.

పన్నెండు నవలలు, రెండు జీవిత చరిత్రలు, ఐదు కథల సంపుటాలు, మూడు యాత్రా గ్రంథాలు, గేయ సంపుటాలు కాకుండా; హక్స్లీ పది హేను పైగా వ్యాస సంపుటాలు ప్రచురించాడు. నన్నెక్కువగా ఆకర్షించింది నిజానికి ఆయన వ్యాసాలే తన అంతరంగాన్ని శోధించదల్చుకున్న రచయితకి వ్యాసం ఉపకరించినట్లుగా మరే సాహితీ ప్రక్రియా ఉపకరించదు ప్రతి వ్యక్తి. అహాన్ని పెంపొందించుకుంటూ ఒకటిగా ఉన్నప్పుడు తనని గురించే ఎక్కువగా ఆలో చించుకుంటూ గడిపినా పది మంది 'నిన్ను గురించి చెప్పవయ్యా' అనగానే, తబ్బిబ్బై, సిగ్గుపడి. నోట మాట రాక, మౌనం వహిస్తాడు. పది మంది మధ్య లోను, దుస్తులు తీసేసి నగ్నంగా నిలబడటం లాంటిది స్వీయ గాథ చెప్పుకోద మంటే. అందుకనే చాలా మంది రచయితలు, తమ వ్యక్తిత్వాన్ని, ప్రత్యేక సమస్యలనూ, నవలగా అల్లి, అందులో పాత్రలతో తమ అహాన్ని పంచుగుని, సమన్వయానికి పరిష్కారానికి పూనుకుంటారు. అందుచేతనే ప్రథమ నవల, కళాదృష్ట్యా తృప్తికరంగా ఉండదు. టి. ఎస్. ఎలియట్ అన్నట్లు, వ్యక్తిత్వ ప్రకర్ష, అంటే - వ్యక్తిత్వ నిర్మూలనమే. ఇదే ఉత్తమ కళకి గీటురాయి.

అంతరంగంలో పేచీలు లేక, బాహ్య జగత్తులో మార్పులు తెద్దామని' సంఘ పరిష్కారానికి పూనుకున్న మరి కొందరు; స్వీయ చరిత్రలు వ్రాసు గుంటారు బాల్యంలో యవ్వనంలో తమకి సంక్రమించిన అపూర్వ అనుభవాలని, ఇతరులతో పంచుగుంటారు. కాని ఆ అనుభవాలు గాంధీ, టాల్స్టాయ్ల అనుభవాలకి మల్లే చాలా అపూర్వమైనవైతే తప్ప, పాఠకులకి విసుగు పుట్టించడం జరుగుతుంది. చిన్ననాటి జ్ఞాపకాలు వ్రాసుగుని పాఠకుడికి ఆనందాన్నిచ్చిన రచయిత గోర్కీ, (Gorky), ఆంద్రెజీద్ (Andre gide), అస్కసావ్లు (Askasav) లు కృతకృత్యులు కాలేదు. నవల, స్వీయచరిత్రల ద్వారా సాధించ లేని ఆత్మ పరిశోధన - వ్యాసం ద్వారా కొందరికి సాధ్యపడుతుంది. ఈ రకం రచనలో ఉత్తీర్ణుడైన పాశ్చాత్య రచయిత మంటైన్ (Montaigne) తన సమస్యలను ఇతరుల సమస్యలుగా భావించి, రచన ద్వారా వాటిని పరిష్కరించ

దానికి ఈయన వ్యాసాలలో యత్నం జరుగుతుంది. ఈ రకం వ్యాస రచనలో ఛార్లెస్ లాంబ్, (**Charles Lamb**), స్టీవెన్సన్ (**Stevenson**), ఈ శతాబ్దిలో మాక్స్ బీర్ బోమ్, (**Max Peer bohm**), రాబర్ట్ లిండ్, (**Roberd Lynd**), జె. బి. ప్రీస్ట్లీ, (**J B Priestley**), మనవారిలో ఎస్. వి. వి. (**S V. V.**); ఆర్ కె. నారాయణ్‌లు అగ్రగణ్యులు. మరొకరకం వ్యాసంలో వ్యక్తి ప్రకర్ష ప్రధానం కాదు. ఇందులో రచయితకి ప్రత్యేకమైన మానసిక తికమకలు, పేచీలూ ఉన్నట్లు కనబడదు. జీవితాన్ని అందంగా చేసుకోడం ఈ రచయితకి తెలుసు. ఎట్లాంటి మనస్తత్వాన్ని అలవరచుకుంటే, జీవితం సాఫీగా, నిండుగా, సుఖంగా సాగిపోతుందో ఇతనికి తెలుసు. తాను తెలుసుకున్నదాన్ని నలుగురికీ చెప్పి, వారి జీవితాలు కూడా ధన్యం చేయాలన్న ఒక తృష్ణతో వ్యాస రచనకి పూనుకుంటాడు లోకజ్ఞానం సంపాదిస్తాడు. తనకి ఉపయోగ పడుతుందా లేదా అన్న ప్రశంస లేకుండా సమాజ వికాసానికి, మానవాభ్యుదయానికి తోడ్పడుతుందనుకున్న ప్రతి విషయం గూర్చి, ఈ వ్యాసకర్త సమగ్రంగా, తీవ్రంగా ఆలోచించి, కొన్ని నిర్ణయాల కొస్తాడు. నిర్ణయానికొచ్చేముందు ఆ విషయం గురించి ఇతరులు చేసినవాటిని తెలుసుకుంటాడు. విజ్ఞాన సర్వస్వం తిరగవేస్తాడు. ఆయా ప్రాంతాలకి స్వయంగా వెళ్ళి తెలుసుగుంటాడు.

ఈ కృషి ఫలితంగా వ్రాసిన వ్యాసంలో, కొంత విషయ సమీకరణ ఉంటుంది. బోధ ఉంటుంది. బోధించడం అందంగా వినోదం కల్గించేదిగా ఉండడానికి యత్నం జరుగుతుంది. ఇట్లాంటి వ్యాసకర్త హాజ్‌లిట్; (**Hazlitt**), ఈ శతాబ్దిలో రసెల్, (**Rusell**), జె బి ఎస్ హాల్డేన్, (**J. B S. Haldane**) హక్స్లీలు – అమెరికాలో హెచ్. ఎల్. మెంకెన్‌లు (**H L. Mencken**). ప్రథము లనుకుంటాను.

హక్స్లీ వ్రాసినన్ని వ్యాసాలు, మరే రచయితా వ్రాశాడనుకోను ఒక్క సంఖ్య విషయంలోనే కాదు. ఆయన వ్రాసినన్ని విషయాలు మరెవ్వరూ వ్రాశారనుకోను మానవుడు ఆలోచించతగ్గ ప్రతి విషయం గురించీ వ్రాశాడు. మతం రాజకీయాలు, విద్య, న్యాయశాస్త్రం, సాహిత్యం, చిత్రలేఖనం, సంగీతం, శిల్పం జీవశాస్త్రం, ఖగోళ శాస్త్రం, పట్టణ నిర్మాణం, వైద్యం, నీతిశాస్త్రం, ప్రభుత్వ నిర్వహణ, దుస్తులు, తిండి, సినిమాలు, నాటకాలు, నృత్యాలు, అలవాట్లు, ప్రాచీన మానవుడి ఆచారాలు, చరిత్ర, మానసిక శాస్త్రం, తత్వం గోళ్ళు, గిల్లుకోవడం, పిల్లలు, ఎలుకలు, కామ సూత్రాలు, బూతు, దయ్యాలు, చేతబళ్ళు,

తపస్సు, కండ్లజోడు, కాలిజోడు — ఒకటేమిటి, ఇట్లా వ్రాసుకుంటూపోతే, ఎన్ని పేజీలేనా నింపొచ్చు. నాకు తోచనప్పుడు, హక్స్లీ ఏ విషయం గురించి వ్రాయలేదో చూద్దామని, ఆ విషయాల పట్టీ- వేస్తే 'తుమ్మపూడిలో వందాయితి ఎలక్షన్ రాచారంలో పాలమ్మి వేలు గడించిన రంగమ్మ ఉదంతం' లాంటివి — ఏ నాలుగైదుంటాయో! షా కూడా ఇట్లాంటి విషయాలపై వ్యాఖ్యలు చేశాడు నిజమే. కాని వాటిని వ్యాసాలనలేం. తన నాటకాలకి ఉపోద్ఘాతాలవన్నీ.

ఈ వ్యాసాలలోని విషయాలని పరామర్శించడం నా ఉద్దేశం కాదు. డాక్టరేట్ డిగ్రీ కోసం, థీసిస్ వ్రాసేవారు, యీ పనికి పూనుకుంటూనే ఉన్నారు. ఎట్లాంటి భావాలను ఏ ధోరణిలో చర్చిస్తాడో కొన్ని ఉదాహరణలు మాత్ర మిస్తాను.

వైవిధ్యంలో ఐక్యతని గురించి : చెట్లు, బల్ల, కాగితం, కృత్రిమ సిల్కు— వీటి తయారీలో కర్ర వాడతారు. కాని అన్నీ వేర్వేరు వస్తువులు.

అభిప్రాయాలు మార్చుకోడం గురించి. మార్పులేకుండా ఎప్పుడూ ఒకేలాగుండడం ఒక్క చచ్చిపోయినవారికే సాధ్యం. అనేక సమయాల్లో అనేక పద్ధతుల్లో జీవితం కొనసాగించాలి. ఆధునికయుగంలో నిష్పేచీగా బ్రతకాలంటే, ద్వంద్వ వ్యక్తిత్వాన్ని అలవరుచుకోవాలి.

వర్డ్స్వర్త్ కవి యవ్వనంలో ఫ్రెంచి విప్లవాన్ని హర్షించాడు. ఫ్రెంచి కన్యను ప్రేమించాడు ఆమెకు బిడ్డ పుడుతుంది. ఆ రోజుల్లో గొప్ప కవిత వ్రాశాడు. తర్వాత మర్యాదస్తుడై వివాహం చేసుకుని సదాచారాలని పాటించే కుటుంబీకుడుగా చప్పటి కవిత్వం వ్రాశాడంటూ, రసెల్ 'మంచివారుచేసే హాని' అనే వ్యాసంలో పేర్కొన్నాడు. హక్స్లీ కూడా యీ విషయం గురించి ఇట్లా వ్రాశాడు.

“చిన్నప్పుడు చేసిన తప్పుడు పనులకు పశ్చాత్తప్తుడై వర్డ్స్వర్త్ని క్షమించనేలేను ”

ఏకాంతాన్ని గురించి : వంటిగా యావజ్జీవ కారాగారం అనుభవించడం అన్నమాట మన జీవితం నిజంగా మనం ఇతరులకి ఏమీ చెప్పుకోలేము. మన ఉద్రేకాల సారం భావాల పుట్టుపూర్వోత్తరాలు బైటపడక, ఆత్మ అనబడే తాళంవేసిన కొట్టు గదిలో భద్రంగా ఉండిపోతాయి

సఫలమైన ఆదర్శాల గురించి : తమాషా! మనం అడిగింది ప్రాప్తిస్తుంది. కాని, చిత్రం! చేతికొచ్చేవరకూ మనం అడిగిందేమిటో మనకే తెలియదు.

అనుభవం గురించి : మనకి జరిగిందల్లా అనుభవం అనుకోకూడదు. జరిగిందాన్ని ఏ విధంగా వాడుకున్నామో అదే అనుభవం.

విజ్ఞానాన్ని గూర్చి : తెలుసుకోవడం యిష్టంలేదు గనుకనే ఆ విషయం తెలియదు.

అజ్ఞానం గురించి : జ్ఞాన సముపార్జనలో ఎంత ఆనందం ఉందో, అజ్ఞానంలో అంతా ఉంది.

స్వేచ్ఛ గురించి · పరిస్థితులను ధిక్కరించాలంటే వెర్రి పనులు చెయ్యాలి. అల్లా చెయ్యడం ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాన్ని ప్రతిపాదించడం అన్న మాట బుద్ధిశాలి ఎంతోదూరం ప్రయాణంచేసి, తనకి తెలిసున్న సత్యాలనే మళ్ళా తెలుసుకుంటాడు. చివరికి పరోక్ష జ్ఞానం ద్వారా బుద్ధిహీనుడు చేరుకున్న శిఖరానికే చేరుకుంటాడు

పనిని గురించి : అందరి మంచివారికి మల్లె నాకూ పని అంటే తల నొప్పి.

హక్స్లీ సాహిత్యం గురించి వ్రాసిన వ్యాసాలలో 'విషాదము – సంపూర్ణ సత్యము' అన్నది గొప్ప వ్యాసం. గ్రీకు పౌరాణిక గాథ – హోమర్ వ్రాసిన 'ఒడిస్సీ' (Odessey) లో ఒక సన్నివేశాన్ని వర్ణిస్తాడు హక్స్లీ. సిల్లా అనే రక్కసుడు ఒడిసియస్ అనుచరులలో ఆరుగుర్ని చంపుతాడు. మిగిలినవారు వెనక్కి మరలుతారు. చనిపోయిన అనుచరులను తల్చుకుని వారెల్లా శోకించారో వర్ణిస్తాడు హోమర్. "ఆకలి దప్పులు తీర్చుకున్నాక, చనిపోయిన మిత్రులను గూర్చి దుఃఖించి కన్నీరు కారుస్తూ మధ్యలో అల్లానే నిద్రపోయ్యారు" అని.

దానిపై హక్స్లీ వ్యాఖ్యానం : "ఎంత దుఃఖం వచ్చినా మనిషి తినాలి. త్రాగాలి అని హోమర్‌కి తెలుసు కడుపు నిండాక –దుఃఖించడానికి మానవుడు సిద్ధం. పరిపూర్ణ సత్యం తెలిసిన మహా రచయిత హోమర్" అని హక్స్లీ.

లారెన్సు గురించి వ్రాసింది మరొక గొప్ప వ్యాసం. లారెన్స్ రచనలని బూతు పురాణం క్రింద జమకట్టి, వాటిని నిషేధించి అతన్ని దుయ్యబట్టిన మొదటి రోజుల్లో లారెన్స్ ప్రతిభని కనుక్కొని, అతని రచనలోని విశిష్టతని పది మందికి తెలియజేసి, ఉత్తమ సాహితీ విలువల ప్రతిపాదనకి పూనుకున్న వ్యక్తులలో ప్రథముడు హక్స్లీ. ఎన్నో జరిగాక, ఎందరో పూనుకున్నాక ఈనాడు యూరోపా సాహితీ జగత్తులో లారెన్సుకి, ప్రధాన స్థానం స్థిరపడింది,

ముప్పై యేళ్ళ క్రితం లారెన్సును గురించి, హక్స్‌లీ వ్రాసిన వ్యాసంలో కొన్ని వాక్యాలు చూడండి.

"నేను మనసారా గౌరవించి, మెచ్చుగునే కొద్ది మందిలో లారెన్స్ ఒకడు ... మృత్యువుని సందర్శించి బ్రదికి, వెనక్కొచ్చి అద్భుతమైన ప్రపంచపు వెలుగును చూసి కళ్ళు తుడుచుకున్న వ్యక్తి లారెన్స్ .. అతను ఎల్లప్పుడూ జబ్బు తగ్గి కోలుకుంటున్న వ్యక్తిలా జీవించాడు. ప్రతి రోజూ ఆ గండం గడిచి బైటబడి, కొత్త జీవితానికి పూనుకోవడం లాంటిది అతని జీవితం . చెట్టుగా, పువ్వుగా, చందమామగా, కెరటంగా ఉండటం అంటే ఏమిటో అతను స్వయంగా అనుభవించి తెలుసుకున్నట్లుంది. ఒక జంతువు చర్మం వెనక్కి వెళ్ళి, అక్కడి వింతలను చెప్పి నమ్మిస్తాడు .... మానవుడు చూడవల్సిన దానికంటె ఎక్కువ చూస్తాడు ... అందుకనే అతను మానవుణ్ణి ద్వేషిస్తాడు ప్రేమిస్తాడు కూడా."

"నాకు లారెన్స్ రచనలంటే రోత. హక్స్‌లీ వ్యాసం చదివాక, లారెన్స్‌ని గౌరవించాను, అతని రచనలు తిరిగి చదవడం ప్రారంభించాను" - అని 'నన్ను మార్చిన పుస్తకం' అనే వ్యాసంలో దిలీప్‌కుమార్ ఛార్ చెప్పుగున్నాడు.

'టెక్స్టట్స్ అండ్ ప్రిటెక్స్టట్స్' (Texts and Pretexts) అన్న మరో గ్రంథంలో 'ప్రేమ' 'మృత్యువు' 'వివాహం' 'నిద్ర' 'వార్ధక్యం' 'జ్ఞాపకాలు' 'స్వప్నాలు' - ఇల్లా అనేక విషయాలపై, కవులు, తత్వజ్ఞులు, యోగులు చెప్పిన వాక్యాలను సుదీర్ఘమైన వ్యాఖ్యానంతో ఉదహరిస్తాడు హక్స్‌లీ. తెలుగులో కూడా ఈ రకం రచనకి ఎవరన్నా పూనుకోవాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

1940 తర్వాత సాగిన హక్స్‌లీ రచనలు, ఎక్కువగా తత్వ పరిశీలనతో నిండి ఉంటాయి. మెస్కలిన్ (Mescalin) అనే ఓషధితో తయారుచేసిన ద్రావకం పుచ్చుగుంటే ఎట్లా ఉండేదీ, తాను స్వయంగా పుచ్చుగుని తన అనుభవాన్ని 'డోర్స్ ఆఫ్ పెర్సెప్షన్' (Doors of Perception) అనే వ్యాసంలో వర్ణించాడు. అది పుచ్చుగున్నాక, చూపుకి కొత్త తీక్షణత కలుగుతుందిట. వస్తువులు మరింత ప్రస్ఫుటంగా కనబడతాయట సమాధి, నిర్వాణం, యోగ సాధన — వీటివల్ల పారమార్థిక చింతన సాగించినవారికి సాక్షాత్కారమయ్యే సత్ చిత్ ఆనందానుభూతితో సమమైన అనుభూతి పొందొచ్చుట ఆ ఓషధివల్ల.

ఆయన యాభై రెండోయేట వ్రాసిన గొప్ప గ్రంథం 'పెరెన్నియల్ ఫిలాసఫీ' అనే తాత్విక చింతన గూర్చిన వ్యాసాల సంపుటి. 'పరోక్షజ్ఞానం

ద్వారా జీవిత రహస్యాన్ని ఆత్మని శోధించిన మహాయోగులున్నారు. వారిమాటలే మనకి ప్రమాణం. అందుచేత, తత్వాన్ని బోధించే ఆచార్యుల నిర్వచనాలని కవులు చెప్పినవాటిని విడిచేసి, దైవ సాక్షాత్కారం పొందిన బ్రహ్మజ్ఞుల మాటలను ఎక్కువగా ఉదహరించాను ఈ గ్రంథంలో ' అని పీఠికలో చెప్పుకున్నాడు హక్స్లీ భగవద్గీత, ఉపనిషత్తులు, బైబిల్, జైన్ కథావళి మొదలైన మహా గ్రంథములనుండే కాక, కిర్కిగార్డు, ఎకార్ట్ (Eckhart), కబీర్, జలాలుద్దీన్ రుమీ, పాస్కల్, శంకర, అరవిందలు, అగస్టిన్, లవోట్జు (Laotze), బ్లేక్, బొహిమ్ (Boehme) మొదలైన యోగిపుంగవుల నిర్వచనాలెన్నో యిందులో ఉదహరించబడ్డాయి.

ఏదో ఒకదానిపై దృష్టి కేంద్రీకరించి, దాని రహస్యం తెలుసుకున్నంత మాత్రాన, చరితార్థు లయారనుకోకూడదు. పరోక్షజ్ఞానం, ప్రార్థన, సాధనల ద్వారా 'బ్రహ్మన్'ని తెలుసుకున్నవారే ధన్యులంటూ తన జీవితాన్నంతా జీవశాస్త్ర పరిశోధనకి వినియోగించిన డార్విన్; వార్ధక్యంలో కళ, మతం, కవిత్వంపట్ల ఎట్లాంటి కుతూహలమూ చూపలేకపోయిన సంగతిని ఉదహరిస్తాడు హక్స్లీ. బ్రహ్మన్‌ని దర్శించినవారికి విముక్తి సాధ్యమవుతుంది. అట్టివారు కర్మ, ధ్యానం — కాలమూ, అనంతమూ, సంసారం, నిర్వాణం, అనబడేదీ, కనబడేదీ - అంటూ ద్వంద్వాల వ్యత్యాసం విస్మరించి, ఏకాగ్రత సాధిస్తారు - అన్న దానిపై వ్యాఖ్యానం ఈ గ్రంథం. ప్రపంచంలోని బ్రహ్మజ్ఞుల అనుభవాలసారం అంతా ఇమిడ్చిన ఈ గ్రంథం, ఆంగ్లభాష ఉన్నంతవరకూ ఉంటుంది.

కొన్ని సంవత్సరాల క్రితం హక్స్లీ ఇల్లు పరశురామ ప్రీతైంది. ఎన్నెన్ని దేశాల పర్యటనలలోనో పోగుచేసిన గ్రంథాలు, బొమ్మలు, శిల్పాలు, కళాఖండాలు దగ్ధమైపోవడం చూసి హక్స్లీ కంట నీరెట్టుకున్నాడుట హిందూమత గ్రంథాలని బాగా చదివి, అందలి తాత్విక సూత్రాలని నిత్యజీవితంలో ఆచరిస్తూ వచ్చిన హక్స్లీ విచారించాడంటే అతనికి సౌందర్యంపట్ల ఎంతటి కాంక్ష వుందో తెలిసొస్తుంది. మానవాభ్యుదయానికి కృషిచేసిన హక్స్లీ చివరివరకూ నిండు మానవుడుగా వర్ధిల్లాడు.

హక్స్లీ రచనల్లో మానవతావాదం స్ఫుటంగా కనబడుతుంది. కాళిదాసు నాటకం చూశాక, దాన్ని గురించి తన అభిప్రాయం చెప్పవల్సిందిగా పత్రికా విలేఖరులడిగితే, హక్స్లీ సంభాషణ ఎట్లా సాగుతుందో అప్పుడప్పుడు ఊహిస్తూ ఉంటాను :

హక్స్లీ. దుష్యంతుడు ఆమెను ఎందుకు గుర్తించడు? ఒకామెని

ప్రేమించి, గర్భందాల్చిన ఆమె దగ్గరకొస్తే నీకూ నాకూ సంబంధం లేదు, నువ్వెవ్వరివో నే నెరుగను పో, అని నేనూ నువ్వూ అంటే జైల్లో పెడతారు. దుష్యంతుడు అంత చెడ్డవాడు కాడు ఆమెని అతను గుర్తించకపోవడానికి కారణం దృష్టి సరిగ్గా ఆనకపోడమే. ఆ రోజుల్లో కళ్ళజోళ్ళు లేవు కాబోలు. అవుంటే ఈ పొరబాటు జరక్కపోను విజ్ఞానశాస్త్ర పరిశోధనలో వెనకబడ్డ దేశాలలో యిట్లాంటివి జరగడానికి ఆశ్చర్యపడను

పత్రికా విలేఖరి. "క్షమించాలి ఒక శాపానికి గురై దుష్యంతు డట్లా చేశాడు. మీకు తెలీదేమొ "

హక్స్‌లీ: తన పనికి తాను బాధ్యుడు కాదన్నమాట! అది నిజమైతే నైతికంగా అతని ప్రవర్తనని విమర్శించే అర్హతే లేదు మనకి. అట్లాంటప్పుడు కాళిదాసు యీ నాటకం ఎందుకు వ్రాసినట్లు? కణ్వుడు, తన తపోబలాన్ని కొంత కూతురికి ధారబోసి, అల్లుడు కూతురికి వసుడయ్యేటట్లు చేసుకోవచ్చుగా.

కాళిదాసు కేరళ వెళ్ళాడో లేదో తెలియదు. కేరళలో ఇట్లాంటి మంత్రాలు ఎన్నో వున్నాయని విన్నాను. ఇట్లాగై యుండికూడా, కాళిదాసుని జాతీయకవిగా మీ రెట్లా పరిగణిస్తారు?

పత్రికా విలేఖరి: ఉన్న కథని నాటకంగా అల్లాడు – మార్పులు చెయ్యకుండా .. దుష్యంతుడికి శాపం ...

హక్స్‌లీ: శాపం, మంత్రాలు అని చెప్పకండి కాళిదాసు సంపూర్ణ మానవుడు. గర్భిణిగా వున్న భార్య పుట్టింటికెళ్ళినప్పుడు, భర్తల అవస్థ ఎట్టిదో కాళిదాసుకి తెలుసు. దుష్యంతుడు మరొకామెని ప్రేమించాడు. అలా ప్రేమించడం తప్పని అతనికి తెలుసు. అపచారం చేసినవాడి మనస్తత్వం (Guilt Complex) ప్రదర్శించాడు తన నేరానికి, తాను ప్రేమించిన స్త్రీ శిక్ష పొందాలి. ప్రేమించిన దాన్ని హింసిస్తాడు మానవుడు – యూంగ్ (Jung) గారి పరిశోధనలు తెలుసుకోండి – కాబట్టి భార్యని తిరస్కరిస్తాడు ఎటొచ్చీ కాళిదాసు ఆ విషయాలేవీ నాటకంలో చెప్పడు అందువల్లనే కాళిదాసు మహాకవి – అంతర్జాతీయ కవి అంటున్నాను

పత్రికా: ఇందాక జాతీయ కవిగా వ్యవహరించినందుకు ఆక్షేపించారు,

హక్స్‌లీ: జాతీయ కవి కాకుండా, అంతర్జాతీయ కవి కావడం అసంభవంకాదు ఆధునిక భౌతిక శాస్త్రజ్ఞులు చెప్పిన సూత్రం ప్రకారం, ఎలక్ట్రాన్, మధ్య స్థలంగుండా వెళ్ళకుండానే ఒక చోటు నుండి, మరొక చోటుకి చేరుకుంటుంది – తిన్నగా వెళ్ళవలసిన కాంతి కిరణం, 1910లో జరిగిన సూర్య

గ్రహణంనాడు, వంపు తిరిగినట్లు విశదమై ఐన్‌స్టీన్ సిద్ధాంతాన్ని ఋజువు చేసినది మీ రెరుగరా?"

ఈ ఊహా సంభాషణలో హక్స్‌లీ పోకడలన్నీ ఉన్నాయి. ఒక విషయాన్ని అనేక కోణాల నుండి చూడగలగడం_దాన్ని విజ్ఞానశాస్త్రం, తత్వంతో ముడిపెట్టడం, మానవుడికి వుపకరించే భావాన్ని వ్యక్తం చెయ్యడం, నిర్మొహమాటంగా చెప్పడం, ప్రాచీనమైనవాటినీ, పెద్దలనూ, సమకాలీనులవలె త్రాసులో వేసి తూచడం - మొదలైన హేళన, దాని వెనక నిజాన్ని తెలుసుకోవాలన్న తృష్ణ, యివన్నీను.

హక్స్‌లీ రచనల నుండి నేను తెలుసుకున్నవి ఇట్లాంటివే. ఏదన్నా కొత్త భావం రాగానే, అది మనకి ఉపకరిస్తుందా లేదా అన్నది పట్టించుకోక, దాన్ని నలువైపులా తరచి చూడాలి. ఉద్రేకానికీ, ఆవేశానికీ లొంగిపోకూడదు. ఉద్రేకం ప్రకర్ష గుంపు లక్షణం. ఉద్రేకం కలిగించిన ఆవిషయాన్ని మనస్సులో ఒక మూల పడెయ్యాలి. అది ప్రబలమైందీ, విశిష్టమైందీ ఐతే మనం కోరినప్పుడు అది బైట పడి వాడకంలో కొస్తుంది. నిరుపయోగమైందైతే నమసిపోతుంది రచనలో. వస్తువుకీ, సందర్భానికీ అనువైన విషయాల పరామర్శ కొంత జరగాలి. జరిగినప్పుడే ఆ ప్రాంతాల వెనక ఒక సమాజం, దాని వెనుక ఒక చరిత్ర ఉన్న ధ్వనుంటుంది. అక్కడక్కడ ఛలోక్తులు, జీవితం గురించిన నిర్వచనాలూ ఉండాలి ప్రవర్తనలో, శీలంలో సంస్కృతి కనబడాలి - ఉద్రేకంతో వ్రాయడంలో మట్టుకే కాదు. రచయిత అంతరంగానికీ, రచనకీ పొత్తు కుదరాలి - కుదిరితేనే రచయితలో నిజాయితీ వ్యక్తమౌతుంది.

ఈ ధోరణి గూర్చి ఒకటి, రెండు శంక లున్నాయి. లారెన్సును గురంచి హక్స్‌లీ వాడిన మాటలే, హక్స్‌లీ గురించి వాడ బుద్దేస్తుంది నాకు. హక్స్‌లీకి చాలా తెలుసు; తెలుసుకోవలసిన దానికంటె దూరం చూశాడు. మరీ ఎక్కువ తెలిసిన వ్యక్తి ఊహాలోంచి, చింతనలోంచి, కిందికి కార్యరంగంలోకి దిగిరాలేడు. ఏ పని చెయ్యాలన్నా అది మంచిదా చెడ్డదా అన్న సంశయం ఏర్పడి కార్యదూరుడవుతాడు. ఈ లక్షణాలే ఆయన నవలలో వ్యక్తులు కూడా చూపుతారు పాత్రలు ఆలోచిస్తారు. మాట్లాడతారు. కాని కార్యానికి పూనుకోరు. కథ ప్రారంభంలో ఎట్లా ఉన్నారో, చివరలో కూడా అల్లాగే ఉంటారు. ప్రవర్తన ఫలితం శీలంగా ఎట్లా పరిణితి చెందిందీ, కాలం వారిలో తెచ్చిన మార్పు - ఇవి నవలలో ఉండకపోతే, అది గొప్ప నవల కాదు. అందుచేత రచయితకి అన్నీ తెలిసిపోయి, సర్వజ్ఞుడవకూడదేమో. హక్స్‌లీ అన్నట్లు కాస్తంత అజ్ఞానం, అమాయకత్వం అవసరమేమో!

ఫోటోలో హక్స్‌లీ నచ్చడం వల్లనే అతని రచనలంటే యిష్టం ఏర్పడిం దన్న మాటలతో ఈ వ్యాసం ప్రారంభించాను. ఆర్. కె. నారాయణ్ కాలిఫోర్ని యాలో హక్స్‌లీని సందర్శించినప్పుడు, ఆయనకి అరవై అయిదో ఏడు. మనిషి చూడ్డానికి బాగున్నాడనీ, ఆయన మొహం పక్కకి తిప్పినప్పుడు, అల్లా ఎంత సేపేనా చూస్తూ కూర్చోవాలనిపించేటంత ఆకర్షణీయంగా, గంభీరంగా ఉందనీ వ్రాశాడు నారాయణ్. గాయత్రి ధ్యాన మంత్రం గురించి ఎన్నో ప్రశ్న లడిగాడట. జీవితం అనే పాఠశాలలో ఉపాధ్యాయుడి దశత పొంది కూడా విద్యార్థిగా ఉండిపోయిన ధన్యజీవి హక్స్‌లీ.

హక్స్‌లీ రచనలవల్ల ప్రభావితులైన రచయిత లెందరో ఉన్నారు. ఈ తరం యువక రచయితలలో, లారెన్స్ దర్రెల్, (**Lawrence Durrell**) హక్స్‌లీ ధోరణిలో వ్రాస్తాడంటారు. హక్స్‌లీ ప్రభావం ఎట్లాంటిదో చెప్పడం కష్టం. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఆ ప్రభావం యొక్క ప్రధాన అంగం, మానసిక స్వాతంత్ర్యం అనొచ్చు. ఇప్పుడు మనకి హక్స్‌లీ భావాలలో చాలా భాగం పాతవిగా కనబడినా, మొదట్లో వాటిని బైటపెట్టడానికి ఎంతో సాహసం కావాలి. ఆ సాహసం, ధైర్యం ఆయన కున్నాయి. తాను మనసారా నమ్మిన దాన్ని నిర్మొహమాటంగా చెప్పగలగడంలో నిజాయితీ ఉంది, నిజాయితీ గల రచయిత హక్స్‌లీ

వెనుకబడిన దేశాలు, స్వాతంత్ర్యం సంపాదించుకుని, పురోగమించే ప్రతి ఉద్యమానికి చేయూత నిచ్చిన శ్రేయోభిలాషి హక్స్‌లీ. రాజకీయ స్వాతంత్ర్యమే కాక ఆర్థిక భావ స్వాతంత్ర్యాలు కూడా ప్రతి ఒక్కరికీ లభ్యమవాలన్న ఆయన అభిలాషకి 'ఎండ్స్ అండ్ మీన్స్' (**Ends and means**) 'విజ్ఞాన శాస్త్రము, శాంతి, స్వాతంత్ర్యము' (**Science, Peace and Liberty**) అనే గ్రంథాలు నిదర్శనం

విజ్ఞానం, బుద్ధి, తర్కం, వీటికి అతీతమైన జ్ఞానం ఒక్క మానవుడికే సాధ్యం – అని ఆయనకి తెలుసు.

తుమ్మెద నుద్దేశించి ఆయన వ్రాసిన గేయంలో ఈ రహస్యం యిమిడి వుంది :

కాలం సాగిపోతుంది–
చెట్ల మ్రానుల నడుమ తొంగి చూస్తుంది చందమామ
ఈ తికమకరాత్రిని వెలుగించు మరొక వెలుగేది ?
జాడలు దిగవిడచని శూన్యం మన నిష్క్రమణ !

దైవ సమానమైన హేతు రాహిత్యం నువ్వు
ఆకుల నడుమ అక్కసు లేక పాడుకుంటావు–
జ్ఞానం కసరదు, కంట తడెట్టదుగా మరి !
నీవు నేర్పిన జ్ఞానానికి ఉప్పొంగిపోతాను నేను.

ఆత్మ వికాసం కోసం ఈ శతాబ్దిలో రచన ద్వారా కృషి చేస్తున్న ఆంగ్ల మేధావులలో టి.ఎస్. ఎలియట్, బెర్ట్రండ్ రసెల్, హక్స్లీలను ముఖ్యులుగా పరిగణిస్తాను. మొదటిద్దరికీ నోబెల్ బహుమతు లొచ్చాయి. హక్స్లీకి రాలేదన్న చింత ఉండిపోయింది. ప్రజాస్వామ్యంలో భావ స్వాతంత్ర్యం ఆవశ్యకతని వదే వదే తన పుస్తకాల ద్వారా గుర్తు చేస్తూ వచ్చిన హక్స్లీకి ఈ వ్యాసం ద్వారా కృతజ్ఞత చెప్పుకుంటున్నాను.

—:(o):—